# భారతీయ సంప్రదాయ భూమిక

## భిన్నత్వంలో ఏకత్వం

# THE FOUNDATIONS OF INDIAN TRADITION

## UNITY IN DIVERSITY



డా॥ ముదివేడు ప్రభాకరరావు

# BHARATIYA SAMPRADAYA BHUMIKA
# BHINNATVAM LO EKATVAM
(The Foundations of Indian Tradition - Unity in Diversity)

**Dr. M. PRABHAKARA RAO**, M.A., (Tel & Skt.) Ph.D., (Tel.)
Oriental Research Institute
Sri Venkateswara University, Tirupati - 517 502.

© అన్ని హక్కులు గ్రంథకర్తవి

జ్ఞానప్రసూనమాలికా ప్రచురణలు – ద్వితీయపుష్పం
ప్రథమ ముద్రణ : ప్రతులు 1000, సెప్టెంబర్ 2000
వెల రూ. 300/-

కవర్‌పేజ్ డిజైన్ : చంద్ర, యూనివర్సిటీ జిరాక్స్, ప్రకాశం రోడ్, తిరుపతి.

కవర్‌పేజ్ ప్రింటింగ్ : స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్, బాలాజీ [illegible] తిరుపతి.

ప్రతులకు :

1. శ్రీమతి ముదివేడు మీరాబాయి
1-2-120 కె, బండ్లమిట్ట లేన్
ప్రకాశం రోడ్, తిరుపతి – 517 501,
ఫోన్ : 08574 – 26614

2. విశాలాంధ్ర బుక్‌హౌస్
హైదరాబాద్, తిరుపతి, విజయవాడ, హన్మకొండ
అనంతపురం, విశాఖపట్నం, గుంటూరు, కాకినాడ.

లేజర్ టైప్‌సెట్ : శ్రీసాయినాథ్ గ్రాఫిక్స్, 10-14-586 ఫస్ట్‌ఫ్లోర్, వి.వి. మహల్ రోడ్, తిరుపతి.

ముద్రణ : ఉమాప్రింటర్స్, 403, పంటవీధి, తిరుపతి. ఫోన్ : 5580[illegible]

# ప్రరోచన
# (INVOCATION)

'' ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః
పూర్వేభ్యః పథికృద్భ్యః'' – ఋగ్వేదమ్ 10-14-15

Adoration to the Primal Rishis,
The Ancient Path - Finders

యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః।
తథాక్షరా ద్వివిధాః సోమ్యభావాః
ప్రజాయంతే తత్ర చైవాపియంతి ॥ – ముండకోపనిషత్ 2-1-1

As, from a well - blazing fire,
sparks by the thousand issue forth of similar shape
so from the imperishable. O my friend!
Beings manifold are produced
and let us go there also

# వందేమాతరమ్

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥ వందే॥

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమదల శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥ వందే॥

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖర కరవాలే
అబలాకైనో మాఎతొ బలే
బహుబలధారిణీం నమామి తారిణీం
రిపుదలవారిణీం మాతరం ॥ వందే॥

తుమి విద్యా, తుమి ధర్మ, తుమిహృది, తుమిమర్మ
త్వం హి ప్రాణాః శరీరే
బాహుతే తుమిమా శక్తి హృదయే తుమి మాభక్తి
తోమారాయి ప్రతిమా గఢి మందిరే మందిరే ॥ వందే॥

త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ
కమలాకమల దళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ
నమామి త్వాం నమామి కమలాం
అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం ॥ వందే॥

శ్యామలాం సరలాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం ॥ వందే॥

- వందే మాతరం, మంత్రద్రష్ట
బంకించంద్ర ఛటర్జీ (1838-1894)

# ఏకతామంత్రమ్

శ్లో॥ యం వైదికా మంత్రదృశః పురాణాః
ఇంద్రం యమం మాతరిశ్వాన మాహుః।
వేదాంతినో నిర్వచనీయ మేకం
యంబ్రహ్మ శబ్దేన వినిర్దిశన్తి ॥

ప్రాచీన కాలమందలి మంత్రద్రష్టలైన ఋషులు, మునులు ఆ పరమేశ్వరుని ఇంద్ర, యమ, మాతరిశ్వాన్ శబ్దములచేత సూచించారు. వేదాంతులు ఉపనిషత్తులలో మాటలతో వర్ణింపలేని భగవంతుని 'బ్రహ్మ' శబ్దము చేత సూచించారు.

శ్లో॥ శైవాయ మీశం శివఇత్యవోచన్
యం వైష్ణవా విష్ణు రితి స్తువన్తి ।
బుద్ధస్తథా ర్హన్నితి బౌద్ధ జైనాః
సత్ శ్రీఅకాలేతి చ సిక్షసంతః॥

శైవులు శివుడని, వైష్ణవులు విష్ణువని, బౌద్ధులు బుద్ధుడని, జైనులు అర్హతుడని, సిక్కులు సత్ శ్రీ అకాల అని ఆ పరమేశ్వరుని స్తుతించారు.

శ్లో॥ శాస్తేతి కేచిత్ కతిచిత్ కుమారః
స్వామీతి మాతేతి పితేతి భక్త్యా ।
యం ప్రార్థయన్తే జగదీశితారం
స ఏక ఏవ ప్రభు రద్వితీయః

ఆ జగదీశ్వరుడైన ప్రభువును కొందరు 'శాస్త' యని, కొందరు 'కుమారుడని' కొందరు 'స్వామి' యని, కొందరు 'తల్లి' యని, కొందరు 'తండ్రి' యని, పిలుస్తూ భక్తితో ప్రార్థిస్తున్నారు. ఎవరెన్ని విధాలుగా పిలిచినా ఆ పరమేశ్వరుడు ఒక్కడే! అతడు అద్వితీయుడు! అతనికి సాటి మరొక్కరులేరు.

# అంకితం

ఈ ప్రపంచం
ఎంత అయథార్థమైనదో ....
ఎంత వ్యర్థమైనదో ...
తన అత్యల్ప జీవితకాలంలోనే
నిరూపించి వెళ్లిన
నవవర్షాత్మకుడైన శిశువు!
సుమధుర సమ్మోహన ముగ్ధవపువు !!
సుందర దరహాసోజ్జ్వలన్ముఖుడు !
మందర మానసాంభోజ వికాసితుడు !!
మరపురాని మత్తనూజునికి --
ఆ అవ్యక్త శిశుమూర్తికి --
గణేశుడని గారాబుగా పిలిచే
మా గిరిధరుని
జ్ఞాపకార్థంగా --



శేషాచలంపై
అశేషభక్తజన సందోహానికి
అర్చావతార సౌలభ్యమూర్తియై ....
నయనపథ గామియై ....
ఆనందనిలయుడై ....
జగన్నాథుడై ....
అశేషకైవల్య కల్యాణ ఘంటాపథుండై ....
దేవేరులతో కూడిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారి
చరణకమలాలకు సాష్టాంగదండ ప్రణామాలు చేసి
ఒక్క విన్నపంతో శరణాగతుడైన ఈ దాసుడు
ఆయన అనుగ్రహించిన జ్ఞానఫలాన్ని
ఆయనకే అంకితం చేస్తున్నాడు.



శ్లో॥ అనాది సిద్ధేహి భవార్ణవేஉ స్మిన్
అనాద్యవిద్యా కృత దోషబద్ధాన్ ।
అనాది సిద్ధౌ భవతారకౌస్థః
హ్యనాది నిత్యైకతనూ యువానౌ॥

# కృతజ్ఞతా కుసుమాంజలి

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల శ్రీకార్యనిర్వహణాధికారులైన డా॥ ఇలపావులూరి వేంకటసుబ్బారావు, ఐ.ఎ.యస్., గారికీ, కొన్ని సాంకేతికమైన యిబ్బందుల వల్ల ముద్రణలో జాప్యం జరుగగా కాలవ్యవధిని మంజూరు చేసిన యిప్పటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ పి. కృష్ణయ్య, ఐ.ఎ.యస్., గారికీ, ఎప్పటికప్పుడు నన్ను హెచ్చరిస్తూ ముద్రణను సత్వరగా పూర్తిచేయించిన సప్తగిరి మాసపత్రికా సంపాదకులు డా॥ ఎన్.ఎస్. రామమూర్తి గారికీ, ఈ గ్రంథ గౌరవాన్ని గుర్తించి ప్రచురణ యోగ్యమైనదిగా నిర్ణయించి, ఆర్థిక సహాయాన్ని యిప్పించిన ఎక్స్‌పర్ట్ కమిటీ సభ్యులు అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టర్ డా॥ మేడసాని మోహన్ గారికీ హృదయపూర్వకమైన కృతజ్ఞతా పారిజాతాలు సమర్పించుకుంటున్నాను.

గ్రంథ ముద్రణకు దేవస్థానం వారిచ్చిన సొమ్ము పర్యాప్తం కానందువల్ల నేను వదాన్యులైన పెద్దలు కొందరిని అర్థించగా వారెంతో దయార్ద్ర హృదయంలో తమ ఉదార హస్తాన్ని నా కందించి ఈ గ్రంథం వెలుగుచూడటానికి యితోఽధికంగా ఆర్థికసాయం చేశారు. గురుదేవులు శ్రీ కందుకూరి శివానందమూర్తి గారు (భీమునిపట్నం), శ్రీ శివలెంకరాధాకృష్ణగారు (మద్రాసు), శ్రీ ఎం.వి.ఎల్.ఎన్. సీతారాం గారు( పెదముత్తివి), శ్రీ కల్లూరి రాధాకృష్ణయ్య గారు(అనంతపురం), లెఫ్టినెంట్ కల్నల్ కె.ఆర్.మూర్తి గారు (ముంబై), శ్రీమతి మరియు శ్రీ తరిగొండ రాజ్యలక్ష్మి సుబ్రహ్మణ్యం దంపతులు (తిరుపతి) - వీరందరికీ నేనెంతో ఋణపడి ఉన్నాను.

కంప్యూటర్‌పై ఇంగ్లీషు, తెలుగు భాషల్లో లేజర్ టైప్‌సెట్ చేయడంలో ఎంతో ఓపికతో, శ్రద్ధాసక్తులతో సహకరిస్తూ నేనెన్నిసార్లు మరలా మరలా మార్చమని, చేర్చమని, తీర్చమని, విసిగించినా విసుగుకోక, తప్పులు లేకుండా మాస్టర్ కాపీలను తయారుచేసి యిచ్చిన శ్రీ సాయినాథ్ గ్రాఫిక్స్ వారికి, ఎన్ని పనులున్నప్పటికీ, నవ్వుతూ నా పుస్తకం విషయమై ఆసక్తితో ముద్రణనుచురుకుగా సాగించి వీలైనంత త్వరలో గ్రంథాన్ని ముద్రించి యిచ్చిన ఉమాప్రింటర్స్ ప్రొప్రయిటర్ శ్రీ కె. తులసీరాం గారికీ వారి ముద్రణాలయ సిబ్బందికీ, ఈ పుస్తకానికి ముఖపత్రాన్ని తీర్చిదిద్దిన మిత్రుడు చంద్ర (యూనివర్సిటీ జిరాక్స్, తిరుపతి) కు, అందంగా కవర్ పేజి ముద్రించియిచ్చిన స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రెస్, (తిరుపతి) వారికి కృతజ్ఞతాకుసుమాలు సమర్పించుకుంటున్నాను.

ఎప్పుడూ ఏదో వ్రాసుకొంటూ, చదువుకొంటూ యింటిని పట్టించుకోని నేను, మరీ ఈ గ్రంథ ముద్రణ ప్రారంభించిన నాటి నుండి యింటి పట్టున ఉండక లైబ్రరీలు, ప్రెస్సు చుట్టూ తిరుగుతున్నా, నాతత్త్వం తెలిసిన వ్యక్తిగా నాతో అన్ని విధాలా సహకరించిన నా శ్రీమతి మీరాకు ఆశీఃపూర్వకమైన కృతజ్ఞతలు అర్పించుకుంటున్నాను. మా యింటికొక పెద్దదిక్కుగా ఉంటూ నన్నెప్పుడూ ఆశీర్వదించే మా అత్తమ్మ, మావయ్యలకు కృతజ్ఞతలు చెప్పడానికి మాటలు చాలవు.

**11-9-2000**
తిరుపతి

**- ముదివేడు ప్రభాకరరావు**

# విషయానుక్రమణిక

జైనసంస్కృత వాఙ్మయం - 63, దక్షిణభారత దేశం - జైనసాహిత్యప్రభావం - 64, ఔత్తరాహమైన జైనము దక్షిణభారతదేశానికి వలసవచ్చుట - 65, జైనసంఘయనము - 66, ప్రాచీన తమిళ సాహిత్యంలోని మూడు సంగములు మౌలికములా? లేక జైన సంఘములపై ఆధిపత్యంతో ఏర్పడినవా? - 67, జైన సంఘములనే తమిళ సాహిత్య సంగములుగా చెప్పికొని తమిళులు ప్రాచీనత చాటుకొన్నారు - 68, క్రీ.శ. 6,7 శతాబ్దాల్లో జైనుల వధలు - తమిళసాహిత్యసంగముల స్థాపన - 70, సంస్కృత సాహిత్యంలో క్రీ.శ. 6వ శతాబ్దిలో విలసిల్లిన ద్రవిడ సంఘం యొక్క తొలి ప్రస్తావన - 71, ప్రాచీన తమిళ సాహిత్యంలో సంఘపీఠములు - శంఖఫలకము - తెలుగుకవి ధూర్జటి ప్రస్తావన - 76, ఆంధ్రదేశంపై జైనమత ప్రభావం - 79, జైన బస్తీలు - 79, జైనమత శృంఖల నుండి విడివడిన స్వస్థానవేషభాషాభిమానం గల తొలి ఆంధ్రదేశపు రాజు - రాజ రాజనరేంద్రుడు - 81, ప్రాకృత, కన్నడ సాహిత్య ప్రభావమే నన్నయ అవతారికకు మూలం - 85, నన్నయ చంపూపద్ధతి రచన కన్నడ జైనకవుల ప్రభావమే - 88, జైనుడైన గణిత శాస్త్రవేత్త మహావీరాచార్యుని గణితసార సంగ్రహానికి అనువాదమే పావులూరి మల్లన వ్రాసిన సారసంగ్రహగణితం - 90, రాజరాజనరేంద్రుని కాలంలోనే (క్రీ.శ. 11వ శతాబ్ది) సంస్కృత గణితసారసంగ్రహం తెలుగులో అనువదింపబడింది - 91, అవతారికలు - తులనాత్మక పరిశీలన - 92, వ్యాసభారతంలోను, ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వశేషపూరణంలోను, పరోక్షంగా జైనుల అహింసాసిద్ధాంత విమర్శన - 98, జైనులు పరమత సహనాన్ని పాటించి అన్యమత సిద్ధాంతాలను కూడ అధ్యయనం చేశారు -101, జైన శ్రావకుడైన మల్లియరేచన తెలుగులో మొట్టమొదటి రచయిత - లక్షణగ్రంథకర్త - 103 జినవల్లభుని కుర్క్యాల శిలాశాసనం - 106, జైనమతస్థుడు, కన్నడ భాషలో సుప్రసిద్ధుడైన పంప మహాకవి ఆంధ్రుడు - ఈతని సమాధి నిజామాబాద్ జిల్లా బోధన్ తాలుకాలో బోధన్‌లో గుర్తింపబడింది - 112, పంపకవి చరమదశలో బోధన్‌లో నివసించాడా? - 115, క్రీ.శ. 13వ శతాబ్దంలో జైనుడైన రట్టకవి కన్నడ భాషలో రచించిన రట్టమతాన్ని క్రీ.శ. 18వ శతాబ్దంలో అయ్యలు, భాస్కరుడు తెలుగులో అనువదించారు - 117, జైనుల మతభాష - జైన మాగధి లేక ఆర్షభాష లేక అర్ధమాగధీ ప్రాకృతం - 120, సప్తవిధ ప్రాకృతాలలో అర్ధమాగధీ ఒకటి - 121, అష్టభాషలు - 124, ప్రాకృతంపై సంస్కృత భాషాప్రభావం - 125, సంస్కృతంపై ప్రాకృత భాషాప్రభావం - 126, తెలుగుపై పాళీ, ప్రాకృతాల ప్రభావం - 126, చారిత్రక దృష్ట్యా తెలుగు భాషాపరిణామ చరిత్ర పునర్లిఖింపబడాలి - చారిత్రక మహానిఘంటు నిర్మాణం జరగాలి - 127, చారిత్రక మహానిఘంటు నిర్మాణమే నేటి ఆవశ్యకత - 137, ఆంధ్రుల సామాజిక జీవితంపై జైనుల ప్రభావం - 142, పాదసూచికలు - 152-174.

## తృతీయాధ్యాయం 175 - 269

### బౌద్ధసంప్రదాయం - మత, తాత్త్విక, చారిత్రక సమన్వయం

# చతుర్థాధ్యాయం

## వివిధ సంప్రదాయాల సమన్వయం - భిన్నత్వంలో ఏకత్వం

## సర్వమతాల సారాంశం - సింహావలోకనం 374 - 430



### అనుబంధం

# పూర్వరంగం

**సమానీ వ ఆకూతి ః**
**సమానా హృదయాని వః**
**సమాన మస్తు వో మనో**
**యథా వః సుసహాసతి ॥**

– ఋగ్వేదమ్ 10-191-4

ఇది ఋగ్వేదంలో చిట్టచివరి ఋక్కు! సంజ్ఞానసూక్తం లేక సౌమనస్య సూక్తంలోని ఇది నాల్గవదైన చివరిమంత్రం. ''అగ్ని మీళే పురోహితం'' (1-1-1) అని ఆరంభింపబడిన ఋగ్వేదం తేజస్సును, ఓజస్సును, ఆయుస్సును, జ్ఞానాన్నీ, సంపదనూ ప్రసాదించే అగ్ని సూక్తంతో మొదలై, జీవులందరిలో ప్రాణస్పందనతో సమానంగా ప్రకాశించే నిత్యచైతన్యమైన అగ్నిదేవతాకమైన స్తోత్రం (10-191-4) తోనే ముగియడంలో భారతీయులు నిత్యాగ్నిహోత్రులనీ, సర్వప్రాణులలో సమానంగా వెలిగే ప్రాణతత్త్వాన్ని ఉపాసించే యాజ్ఞికులైన రహస్యవేత్తలనీ స్పష్టమౌతున్నది.

ఇంతకూ పై మంత్రానికి అర్థమేమిటి? ''నీ సంకల్పం, నీ అంతఃకరణం, నీ మనస్సు ఎల్లప్పుడూ సమానస్థాయిలో ఉండనీ! ఆ విధంగా అవి నీకు మంచినేస్తాలుగా ఉండుగాక!'' అని వేద ఋషి ఆకాంక్ష! ఒక వ్యక్తి తనలోనే ఈ మూడింటికి సమన్వయాన్ని సాధించడం మొదటి ఘట్టమైతే, తనలోను, యితరులోను ఉన్న సమానత్వాన్ని గుర్తించి గౌరవించడం రెండవ ఘట్టమౌతుంది.

ఈ మంత్రం ఒక విధంగా ఋగ్వేదానికి భరతవాక్యంలాంటిది. వేదంలో వివిధ ఋషుల విభిన్నాభిప్రాయాలను, దర్శనాలను క్రోడీకరించి, చిట్టచివరి సూక్తంలో అందరిలోను, అన్నిటిలోను, సమానత్వ దర్శనం చేయమనడంలో వైదిక ఋషుల యొక్క మహదాశయం విశ్వశ్రేయమని, వారి భావప్రపంచం సార్వకాలికం, విశ్వజనీనమని తేటతెల్లమవుతున్నది. అంటే భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించడమే సమన్వయమని, అది సమానత్వ భావన చేతనే సాధ్యమని ఋషి మనకు బోధిస్తున్నాడు.

వేదాలు, ఉపనిషత్తుల కాలంలో అంతఃకరణ ప్రాధాన్యం చెప్పబడింది. ''**సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః**'' అంటాడు కవికుల గురువు, మహాకవి కాళిదాసు! ఇతడు వాల్మీకి మహర్షికి శిష్యుడు కాబట్టే అలా అనగలిగాడు! మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం – ఈ నాల్గింటి సమాహార స్వరూపమే అంతఃకరణం! ఇవి ఉత్తరోత్తర

ఉత్కృష్ట గల్గినవి. మనస్సు మొదటి మెట్టు అయితే, చిత్తం (హృదయం) నాల్గవ మెట్టు. లోకానికి మిక్కిలి సన్నిహితంగా ఉండేది మనస్సయితే, సర్వజీవులలోని సమత్వాన్ని, సమానత్వాన్ని తత్త్వతః దర్శించేది చిత్తం! ఇలా దర్శింపగల్గిన వారినే సహృదయులంటారు. కలుషితంకానటువంటి ప్రసన్నమైన మనస్సు గలవారే సహృదయులు!

శ్లో॥ **అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ।**
**రమణీయంప్రసన్నాంబు సన్మనుష్యమనోయథా ॥**

అంటాడు రామాయణావతారికలో వాల్మీకి మహర్షి! మాలిన్యాలచే కలుషితం కానట్టి తేటనీరు 'తీర్థ' మనబడుతుంది. అది పానయోగ్యం! స్నానయోగ్యం! అందరూ సేవించుకోదగిన ఘట్టం! కొబ్బరిపాలవంటి అస్వచ్ఛమైన జలం రమణీయం! ప్రసన్నం! ఈ రెండు విశేషణాలు ఎవరికోసం, ఎందుకోసం వ్రాశాడు వాల్మీకి! మంచివాడైన వాని మనస్సు అలా నిర్మలంగా, స్వచ్ఛంగా, రమణీయంగా ఉంటుందట! వాల్మీకి మనస్సప్పుడు అటువంటి స్వచ్ఛస్ఫాటిక సదృశమైన అంతఃకరణం గల సద్గుణ గరిష్ఠుడైన శ్రీ రామచంద్రుని వంటి మహాపురుషుని గురించి ఆలోచిస్తున్నదని ఆయనకే తెలియదు! హృదయం వెన్నలాగా కరిగిపోగా వాక్కు నిశితమై, తీక్ష్ణమై మహర్షి వేటగాడిని శపించిన తర్వాత, నారదుడు, బ్రహ్మ వచ్చి చెప్పే వరకు తాను ఆభ్యంతరవృత్తి మాత్రం రసికమైన రామతత్త్వాన్ని గురించి అంతవరకు భావించానని తెలియులేదు. ''అది ఇదని'' – ఇదమిత్థంగా తెలియజేసిన వారు బ్రహ్మ, ఆయన మానసపుత్రుడు నారదుడు! వాల్మీకి, బ్రహ్మస్థానీయుడై ఆయన స్వచ్ఛమైన మానసం నుండి నారదుడు వెలికి వచ్చి సత్యమేమిటో చెబితే, తర్వాత సత్య స్వరూపుడైన బ్రహ్మయే ఆవిర్భవించి 'నీవు ఆదికవివి' ఋతస్వరూపిణియైన సరస్వతి నీ వాక్కును ఛందోరూపంగా అనుసరించినది. నీవు రామచరితను వ్రాయి'' అనే ఆదేశించడం వినబడింది. ''అంతఃకరణమే ప్రమాణంగా గలవారు భగవంతునికి నిత్యసన్నిహితులు'' అనడానికి వాల్మీకి మహర్షియేమనకు ప్రథమోదాహరణం! ఇటువంటి వారినే లోకంలో సుజనుడు, సజ్జనుడు, సత్పురుషుడు, పుణ్య పురుషుడు, అమృత హృదయుడు అని పిలుస్తారు.

వైకుంఠంలోని పరవాసుదేవమూర్తి బాలకృష్ణుడై వ్రేపల్లెలో పుట్టి, గోపబాలురందరితో కలసి అడవికి వెళ్లి, గోవులను కాస్తూ, మిట్ట మధ్యాహ్నం కాగా, యమునానదీ తీరంలో గోపబాలురతో కలిసి చల్దులారగించినాడని మనకందరికీ తెలుసు! వ్యాసభాగవతంలో రేఖామాత్రంగా తటస్థంగా చెప్పిన దానికి ప్రాణంపోసి ఈ ఘట్టాన్ని ఎంతో రమణీయంగా వర్ణించారు పోతనగారు!

**జలజాంతస్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్నరే**

**కుల చందంబున. గృష్ణునిం దిరిగిరా. గూర్చుండి వీక్షించుచున్. (10-493)**

అనే పద్యభాగంలోను, బాలకృష్ణుడు గోపాలురతో ఆడిన సయ్యాటలు, పరాచికములు పోతనగారొక సీసపద్యంలో వర్ణించారు.

**మాటిమాటికి వ్రేలుమడిచి యూరించుచు**

**నూరుగాయలు దినుచుండు నొక్క.డు (10-494)**

యిత్యాది సీసపద్యం చూడవచ్చును. తామరపువ్వులోని మధ్యభాగం – 'కర్ణిక' అనబడుతుంది. ఈ 'కర్ణిక' బాలకృష్ణుడైతే ఆ పువ్వుకు చుట్టూగల రేకులు గోపాలురని పోతన భావించారు.

**సంగడీలనడుమ. జక్కన. గూర్చుండి**

**నర్మభాషణముల నగవు నెఱపి**

**యాగభోక్త కృష్ణు.డమరులు వెఱగంద**

**శైశవంబు మెఱసి చల్ది. గుడిచె (10-496)**

యదువంశ భూషణ శతకంలో జాలూరి అప్పయ్య కవి ఇలాగే వ్రాశాడు.

**కమల దళాంతరస్ఫురిత కర్ణికవోలె.గుమార మధ్య భా**

**గమున వసించి సవ్యకరకంజములోనిడి యూరుగాయతో**

**నమరుల నోరులూరదనివార.గ. జల్ది భుజించునట్టికో**

**ర్కి మదికి నెందు నీకొదవె. గృష్ణ! హరీ! యదువంశభూషణా!**

పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు అధ్యాత్మసంకీర్తనల్లో ఈ పరమహృద్యమైన ఘట్టాన్ని వాల్మీకి భావంతోను, వేదఋషి దర్శించిన మంత్రంతోను సమానంగా ఎలా వ్రాశాడో చూడండి.

**అచ్చపురాల యమున లోపల**

**ఇచ్చగించి భుజయించితి కృష్ణ! ॥ పల్లవి॥**

**ఊరు.గాయలును నొద్దిక చద్దులు**

**నారగింపుచు నందరిలో**

**సారె బాలుల సరసాలతోడ**

**కోరి చవులు గొంటివి కృష్ణా ! ॥ అచ్చపు॥**

ఆకసంబున నా అమర ముఖ్యులు
నాకలోకపు నారదాదులును
కైకొని యజ్ఞకర్త యాతడని
జోక.గొనియాడ . జొక్కితి కృష్ణా ! ॥ అచ్చపు॥

పేయలు లేవు, పిలువు.డనుచు
'కో' యని నోరగూ.తలను
మాయల బ్రహ్మము మతము మెచ్చుచు
చేయని మాయలు సేసితి కృష్ణా! ॥ అచ్చపు ॥

– అధ్యాత్మ -IV , అనుబంధం – **46**

ఇదొక అత్యద్భుతమైన కీర్తన! ఇటువంటి సంకీర్తన తెలుగు పదకవితలో యింత వరకు వెలువడలేదంటే అతిశయోక్తి కాదు! అన్నమయ్య ఎంతటి దార్శనికుడో, ఎంతటి మహా భక్తుడో ఈ పాటవలన తెలిసివస్తున్నది.

యమునానది అసలే నలుపైనది. ఆ నది స్వచ్ఛమైన జలాన్ని సంతరించుకొని, అట్టడుగు భాగంలోగల రాళ్లు కూడ అచ్చంగా కంటికి కనబడుతున్నాయట! దీనినే అన్నమయ్య 'అచ్చపురాలు' అని ఒక్కమాటలో చెప్పాడు.

అక్కడ వాల్మీకి మాధ్యందినస్నానానికై తమసానదీతీరానికి వెళ్లాడు శిష్యుడు భరద్వాజుడితో. ఇక్కడ మిట్టమధ్యాహ్నం గోపబాలురతో కలసిచల్దులారగించడానికి యమునానదీతీరంలో కూర్చున్నాడు శ్రీకృష్ణుడు! మిట్టమధ్యాహ్నవేళ సూర్యకిరణాలు నల్లని తమసానది లోవడి రమణీయమై ప్రసన్నాంబువులతో గోచరించింది వాల్మీకికి. మిట్టమధ్యాహ్నపు సూర్యుడు విష్ణుస్వరూపుడు. ఆయన సవితృమండల మధ్యవర్తి. అటువంటి విష్ణుస్వరూపుడైన సూర్యుని కిరణాలు పడగా నల్లని యమునానదిలో అట్టడుగున గల గులకరాళ్లు కూడ అచ్చంగా కనబడసాగాయి! అంటున్నాడు అన్నమయ్య! ఈవర్ణన దేన్ని సూచిస్తున్నది? 'అకర్దమమిదం తీర్థం' – 'రమణీయం ప్రసన్నాంబుః' అన్న వాల్మీకి మహర్షి వాక్కులనే కాక, సర్వజీవులలోని సమానత్వ భావన కోసం ఆక్రోశించిన వేదఋషి సౌమనస్య సూక్తాన్ని కూడ స్ఫురింపజేస్తున్నది. సహృదయుల హృదయం అద్దం వలె నిర్మలంగా ఉంటుందని అందుచేత కావ్యార్థం చప్పున అందులో ప్రతిఫలిస్తుందన్న అభినవగుప్తుని మాటలను జ్ఞాపకానికి తేస్తున్నది. అంతే కాదు కూపవారిలో (బావినీటిలో) తన అందచందాలు శ్రీ రంగనాథునితో దీటైనవా లేదా అని చూచుకొన్న గోదాదేవి మనకిక్కడ తటిల్లతలా దూరంగా మెరసిమాయమౌతున్నది!

నది అట్టడుగులో నున్నరాళ్లు దేన్ని సూచిస్తున్నాయి? లోకంలో ఎవ్వరూ పట్టించుకోక నిరాదరింపబడి 'గొల్లని సాహిత్యవిద్య' అని తీసిపారవేయబడిన బడుగువారు, పేదవారు,

వ్రేపల్లెలోని అమాయకులైన గోపబాలురను సూచిస్తున్నాయి! వారిని తన కరస్పర్శ చేత (సూర్యకిరణాల చేత) భగవంతుడైన శ్రీకృష్ణుడు, దేవతలకు సైతంకనబడేటట్లు చేశాడు! లేకుంటే వైకుంఠం నుండి అవతరించిన స్వామి ఎక్కడ? కుగ్రామంలో గోవులను మేపే గోపకులెక్కడ? భగవంతుడు అచ్ఛమైన అంతఃకరణం కల్గిన ఆ గోపబాలురతో ఒకడుగా కలిసిమెలసి పోయి వారు కట్టి తెచ్చిన చద్దికూడును ఊరగాయలతో నంజుకొని ఎకసెక్కాలాడుతూ, ఇచ్ఛగించి మిక్కిలి యిష్టపడి తిన్నాడంటే – వేదఋషి సౌమనస్యసూక్తంలో – అందరితో కలసినడువు. అందరితో కలసిమాట్లాడు! పురాతనులైన దేవతలందరూ ఏకాభిప్రాయులై వచ్చి తమ తమ యజ్ఞభాగాలను ఎలా స్వీకరిస్తున్నారో ఆ విధంగా నీ మనస్సెప్పుడూ ఏకాభిప్రాయం కల్గివుండనీ'' (10-191-2) అని చెప్పిన భావాలతో సంవదిస్తూ వుంది. పై ఋక్కుకు సరైన సన్నివేశమిది. ఇంతకంటే గొప్ప సన్నివేశం సృష్టిలో వెదకినా దొరకదు! యజ్ఞస్వరూపుడు, యజ్ఞఫలప్రదాత శ్రీకృష్ణుడు! గోపకులే దేవతలు! చల్దిఅన్నమే వారి వారి యజ్ఞ భాగాలు! వారితో కలిసి భగవంతుడారగించడం భగవత్తత్త్వమెంత విశ్వజనీనమో తెలియజేయడానికే! అసలు భగవత్తత్త్వమే భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రతిపాదిస్తూ వుందని అన్నమయ్య ప్రబోధిస్తున్నాడు.

''యమున లోపల'' అంటే 'యమునా నది ఒడ్డున' అని అర్థం. 'గంగాయాంఘోషః' అన్నప్పుడు 'గంగానది ఒడ్డునగల గొల్లపల్లె' అన్నట్లుగా 'చెర్లోపల్లె' అన్నప్పుడు 'చెరువు గట్టున ఉండే పల్లె అన్నట్లుగా తీసుకోవాలి. 'అచ్ఛపురాలు' యమునా నదిలో కనబడుతున్నాయి. గోపాలురతో కృష్ణుడు యమున ఒడ్డున కూర్చున్నాడు చల్దులారగించడానికి. యమునానది నల్లనిది. కృష్ణుడు నల్లనివాడు, కాని, యమున యిప్పుడు స్వచ్ఛంగా మెరుస్తూవుంది. ఎందువల్ల? సూర్యకిరణ ప్రసారం వల్ల. భగవత్సాన్నిధ్యంలో గోపకుల హృదయాలలోని తమోగుణమంతా నశించి సత్త్వగుణ సంపన్నులైనారు. విశుద్ధమైన భగవంతుని హృదయంలో సర్వజీవులూ తర తమ, ఉచ్ఛనీచ భేదాలు లేకుండా ప్రతిఫలిస్తారు! అని చెప్పడమే 'యమున లోపల' అనే మాటకు పరమార్థం! (లేకుంటే ఈ విధంగా ప్రయోగింపవలసిన పని లేదు!) ఇక్కడ భిన్నత్వం లేదు ఏకత్వమే! సర్వసమానత్వమే! **అన్నమయ్య భావన వైమనస్యాన్ని పారద్రోలే సౌమనస్య సంకీర్తన!**

యమునానదీ తీరంలో జరిగిన ఈ అద్భుత సన్నివేశాన్ని ఆకాశంలో దేవతలు, స్వర్గలోకంలో నారదాదిమునులు ఆశ్చర్యంతో చూసి ఆనందించారట! అద్భుత రసాస్పద ఘట్టం ఎప్పుడు తటస్థించినా దేవతలు ఆకాశంలో ఆనందంతో చూడటమనేది వైదిక, జైన, బౌద్ధ శిల్ప చిత్ర లేఖనాదుల్లో మనం చూస్తున్నాం! దేవతలు ఆనందానికి ప్రతీకలు! 'తన సంతోషమె స్వర్గము' అనడం యిందుకే! మానవులందరూ చివరికి కోరుకొనేది ఆనందమే! మంచి మనస్సు

చేతనే ఆనందం అనుభూతమౌతున్నది. విభిన్న వ్యక్తుల మధ్య సఖ్యం కుదరాలంటే, వైరుధ్యాలు, వైవిధ్యాలు, వైమనస్యాలు సమసిపోవాలంటే కలిసిమెలిసి మాట్లాడడం వల్లనే సమత్వ ఏకత్వ, సామరస్యాలు సాధింపబడుతాయి. దేశ సమైక్యతకు ఈ దృక్పథం చాల అవసరం. కాబట్టి భిన్నత్వంలో ఏకత్వ సాధనకు మంచిమనస్సే గీటురాయి!

భాగవతంలో యజ్ఞాలు చేసే సోమయాజులకు స్వర్గం లభించలేదు గానీ, ఆకలితో వచ్చిన గోపకులకు, శ్రీకృష్ణునికి అన్నంపెట్టిన సోమిదమ్మలకు పునరావృత్తి మోక్షాన్నే ప్రసాదించాడు శ్రీకృష్ణుడు. కృష్ణుని అచ్చమైన స్నేహపూరిత హృదయంతో ప్రేమించిన గోపకులు కూడ మోక్షం చూరగొన్నారు. ఇక్కడ అనన్యచింత లేని ఏకత్వమనే భావన భక్తి భావనకు దారితీసి ప్రేమతత్త్వంలో లీనం కావడమే మోక్షంగా పరిగణించాలి. జగత్తంతా ప్రేమతత్త్వం చేతనే సన్నిహితంగా బంధింపబడి వుందని వల్లభాచార్యులు పుష్టిమతంలో వ్యాఖ్యానించారు. దీనినే రాధాకృష్ణుల మధురభక్తి అన్నారు ఆలంకారికులు. ఏకత్వ దర్శనం చేతనే యిదంతా సాధ్యమౌతున్నది. దీనికి నిష్కల్మషమైన హృదయం పునాది. అటువంటి నిర్మలాంతః కరణం ఉండాలనే ఋషులు, కవులు, తత్త్వ వేత్తలు వాగ్గేయకారులందరూ పదే పదే చెప్పారు.

ఏ మతంలోని తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేసినా మానవమనో మాలిన్యక్షాళనమే ప్రథమకర్తవ్యంగా ఉపదేశింపబడింది. బాహ్యశుద్ధితో పాటు 'అంతశ్శుద్ధి' ఉన్నప్పుడే సాధకుడు రెండవ సోపానం ఎక్కగలడు. చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా! అంటాడు వేమన! యోగీశ్వరేశ్వరుడైన శివునికి మలహానికరేశ్వరుడని పేరు. కలియుగం కాలుష్యానికి పెట్టింది పేరు. వాతావరణ కాలుష్యం, జలకాలుష్యం, ఆహారకాలుష్యం యిన్ని కాలుష్యాలతో పాటు సహృదయహృదయ కాలుష్యం కూడ చోటు చేసికొంటున్నది. ఇటు వంటి పరిస్థితుల్లో నిరంతరసాధన చేత కాలుష్యాలను అరికట్టి 'సహృదయ భూమిక' ను సాధించడం మనందరి కర్తవ్యం. అప్పుడే సంఘంలో శాంతియుత సహజీవనం (Peaceful Co-existence), పరస్పర అవగాహన (Mutual understanding) ఏర్పడి ప్రజలు ఆనందంగా జీవించగలుగుతారు.

## II

ఎవరెన్ని చెప్పినా, ఏమి చేసినా, ''కుక్కతోక వంకర'' అన్నట్లు లోకం మాత్రం యథాప్రకారంగా తన స్వార్థపూరితమైన దారిలో తానునడుస్తున్నది. నైతిక విలువలు నానాటికి దిగజారుతున్నాయి. సృష్టిలో యింతటి భిన్నత్వానికి మూలకారణమేమిటో మనం పర్యాలోచించవలసివుంది.

**''సృష్టిలోని భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శింపగల్గడం సత్త్వగుణసంపన్నులైన వారికే సాధ్యం''** అంటూ కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య గారు శ్రీమద్భగవద్గీతా రహస్య ప్రకాశం చేస్తూ 'శంఖారావం' అనే గ్రంథంలో యిలా వ్రాస్తున్నారు. ''సృష్టిలో అనంతమైన వైవిధ్యముంది. జీవరాసులలో లెక్కలేనన్ని తరగతులున్నాయి. మానవునిలో ఒక్కొక్కరు ఒక్కొక్క స్వభావం గలవారు. ఇవన్నీ సృష్టిలోని భేదాలు. కాని, ఇన్ని భేదాలుగల మానవులందరికీ ఒకే విధమైన శరీరముంది. ఒకే విధమైన మనుష్యత్వ (human nature) ముంది. అందరిలోను 'నేను' అనే ప్రజ్ఞ ఉంది. అట్లే సృష్టిలో ఒక జీవి ఇంకొక జీవిని చంపడం ఉంది. ఈగను కప్ప, కప్పను పాము, పామును నెమలి, నెమలిని వేటగాడు చంపుతున్నారు. ఇది హింస కాదు. ఒక జీవికి మరొక జీవి ఆహారం కావడం దీనిలోని సూత్రం! సృష్టిలో పరస్పరం అన్ని జీవరాసులు బ్రదకాలి. ఏ ఒక్క జాతికి చెందిన జీవి కూడ అతిగా పెరిగి మిగిలిన జీవరాశులకు యిబ్బంది కల్గింపరాదు. ఎలుకలు పెచ్చు పెరగకుండ పాములు, పిల్లులు జాగ్రత్త వహిస్తాయి. ఇట్లే , పాములు పెచ్చు పెరగకుండ ముంగిస, నెమలి, గద్ద, మనిషి జాగ్రత్త పడటం ఉంది. భూమిలో నున్న ఖనిజ లవణాలు నుండి వృక్షాలకు ఆహారం లభిస్తుంది. ఖనిజ లవణాలు, వృక్షాల నుండి కొన్ని జంతువులకు ఆహారం లభిస్తుంది. మానవులకు ఈ అన్ని చోట్ల నుండి ఆహారం లభిస్తూవుంది. దీనినే సమతౌల్యం (Maintenance of equilibrium) అంటారు. వృక్షసంపద వల్ల వాతావరణం శుభ్రపడడం, సకాలంలో వర్షాలు కురవడం సంభవిస్తాయి. దీనినే ఆధునికులు ecological balance అంటున్నారు.

ధ్రువ ప్రాంతాలలోని సముద్రంలో నీరు బ్రహ్మాండమైన మంచుకొండలుగా గడ్డ కట్టుకొన్నప్పుడు అలలు నీటిపై తేలి నీటిలో ఉన్న జీవజాలం నాశనం కాకుండ రక్షింపబడుతాయి. ఇలా సృష్టిలో ఉన్న ఏర్పాటును నిర్వహించేది ప్రకృతిలో ఉండే ప్రేమ అనే తత్త్వం. ప్రేమకు వ్యక్తరూపం సత్యం. అంటే ఇది యిలా వుండాలనే ఏర్పాటు. ఈ ఏర్పాటు చేసేది ప్రకృతి మాత కాగా, చేయించే వాడు పురుషుడైన దైవం. ఈ విధంగా అనంత వైవిధ్యం గల సృష్టిలో ఏకత్వాన్ని ( unity in diversity) దర్శింపగల్గడం సత్త్వగుణానికి సంబంధించిన జ్ఞానం.''

శ్రీ కంచి కామకోటిపీఠం పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారు Hindu Dharma, the Universal Way of Life అనే గ్రంథంలో Many paths to the one goal (దారులు వేరైనా గమ్యమొక్కటే!) అనే అధ్యాయంలో వెలువరించిన కొన్ని అభిప్రాయాలను పరిశీలిద్దాం!

'' ఆళ్వారులు విష్ణువును, నాయన్మారులు శివుణ్ణి స్తుతించారు. వేదాలు సకలదేవతలను స్తుతించాయి. ఉపనిషత్తులు ఏ దేవతల్నీ పొగడకుండా ఆత్మజ్ఞానాన్ని గురించి చెప్పాయి. తిరువళ్ళువర్ దేవుణ్ణి గురించి, ఆధ్యాత్మజ్ఞానాన్ని గురించి, వేదం చెప్పిన మార్గంలోనే వివరించినా ఆయన దృష్టి ప్రధానంగా మానవుని నైతిక విలువల మీదనే కేంద్రీకరింపబడింది. తిరుమూలర్ దైవాన్నీ, దైవ భక్తినీ ప్రక్కనబెట్టి, యోగసాధనలైన ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులవైపు దృష్టిమరల్చాడు.

ఒక మహాపురుషుని జీవితం, ఒక గొప్ప గ్రంథం, ఒక్కొక్క మహా విషయాన్ని విపులీకరించి చెబుతుంటాయి. వీటిలో దేన్ని మనం అనుసరించాలి? అనే ప్రశ్న మనలో ఉత్పన్నం కావడం సహజం. నీవు ఏ మార్గాన్ని, ఏ పద్ధతిని అనుసరించినా దాన్ని విశ్వాసంతో, నిష్ఠతో అనుసరిస్తే చాలు, మధ్యలో వదలివేయరాదు. తాను నమ్మిక సత్యాన్ని జీవితాంతం అంటి పెట్టుకొని ఉండడమనేది పరమాత్మ సన్నిధికి దారితీస్తుంది.

**ఆకాశాత్ పతితం తోయం యథా గచ్ఛతిసాగరమ్ ।**

**సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥**

నీవు ఏ దేవతను ఉపాసించినా, సకల దేవతలకు వారు వారు చేసే కైంకర్యాలన్నీ చివరికి కేశవునికే వెళ్లిచేరుతున్నాయి. ఆకాశం నుండి కురిసిన వర్షపు నీరు నదులుగా ప్రవహించి చివరికి సముద్రాన్ని చేరుకొంటున్నాయి కదా! అలాగే, మార్గాలు పైకి భిన్నంగా కనబడినప్పటికీ అవి చివరికి చేర్చే గమ్య మొక్కటే!

**దేవర్ కురళుం, తిరునాన్మఱైముడివుమ్**

**మూవర్ తమిళుం, మునిమొళియుం కోవై ॥**

**తిరువాచకముం, తిరుమూలర్ శొల్లుమ్**

**ఒరువాచకం ఎన్నుణర్ ॥**

తిరువళ్లువర్ చెప్పిన తిరుక్కురళ్, నాలుగు వేదాలలోని సారాంశమూ, తిరునావుక్కరసర్, తిరుజ్ఞానసంబందర్, సుందరమూర్తి నాయనార్ అనే ముగ్గురు శైవనాయన్మారులు చేసిన శివస్తోత్రమైన తేవారం లోను, అగస్త్యమహర్షి వాక్కులలోను, తిరుక్కోవైయార్‌లోను, మాణిక్యవాచకర్ చెప్పిన తిరు మంత్రంలోను – ఇవన్నీ కూడ ఒక్క విషయాన్నే కంఠోక్తిగా చెబుతున్నాయి.

ఇటువంటి భావాన్నే పుష్పదంతుడనే మహాశివభక్తుడు శివమహిమ్నస్తోత్రంలో –

**శ్లో॥ త్రయీ, సాంఖ్యం, యోగః, పశుపతిమతం, వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ ।**
**రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషామ్**
**నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥**

వేదాలలో యజ్ఞకర్మ ప్రధానమని చెప్పబడింది. దార్శనికుడైన కపిలమహర్షి పంచవింశతితత్త్వాత్మకమైన సాంఖ్యమతాన్ని ప్రతిపాదించారు. పతంజలి ప్రభృతులు హఠయోగ, రాజయోగ, లయాత్మకమైన యోగమతాన్ని చెప్పారు. పశు–పాశ–పతి రూపమైన పాశుపతమతం ఉన్నది. శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని ప్రతిపాదించే వైష్ణవ మతమున్నది. ఇలా లోకంలో భిన్న భిన్న మార్గాలలో ఆత్మతత్త్వాన్ని బోధించే మతాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ ఎందుకిలా ఏర్పడ్డాయి? అని ఆలోచిస్తే, 'లోకోభిన్న రుచిః' '' జిహ్వాకొకరుచి పుర్రెకొక బుద్ధి'' అనే సూక్తుల్ని బట్టి లోకంలో జనుల భిన్నమైన అభిరుచుల్ని బట్టి, వింత పోకడల్ని బట్టి, కొన్ని మతాలు సరళమైన మార్గాన పోయేవి కాగా, మరికొన్ని వక్రమైన మార్గాలలో పోయేవి. ఇలా నానామార్గాలలో పోయే విభిన్న మతాలు ఏర్పడ్డాయి. బాహ్యంగా ఎన్ని మతభేదాలున్నప్పటికీ, నదీనదాలన్నీ సముద్రాన్నే చేరేటట్లుగా ఓ పరమేశ్వరా నీ వొక్కడవే మానవులందరికీ గమ్యస్థానానివి.''

ఈ వివిధ మతాలు, శాస్త్రాలన్నీ సాధకుని అధికారి భేదాన్ని కాబట్టి, తారతమ్యాన్ని బోధించేవిగానీ, భగవంతుడు మాత్రం ఇన్ని విధాలుగా లేడు.

ఆంగ్లంలో "All the roads lead to Rome" అనే సూక్తి ఉంది. దారులన్నిటికీ గమ్యస్థానం రోమ్ మహానగరమే అని దీని అర్థం. ఈ భావాన్నే ప్రతిబింబించే ఆంగ్ల కవిత Universal Prayer పేరుతో అలెగ్జాండర్ పోప్ (Alexander Pope) వ్రాశారు.

Father of all ! in ev'ry age
In ev'ry claim adored
by saint, by savage and by sage
**Jehovah, Jove or Lord**

జెహోవా! జోవ్ లేక ప్రభువు అనే పంక్తి పరిశీలించదగింది. జెహోవా ఇజ్రాయిల్ ప్రాంతానికి చెందిన సెమిటిక్ దేవత! ఇది బైబిల్ యొక్క జన్మస్థానం. జూపిటర్ కు మరో పేరు

జోవ్! లార్డ్ (ప్రభువు) అనే మాట ఏ మతాన్ని అనుసరించే వారైనా భగవంతునికి చేసే సంబోధన! ఆత్మతత్త్వవేత్తలైన పాశ్చాత్యులు కూడ దైవమొక్కటే! ఆ దైవాన్ని నీవు నీ కిష్టమైన పేరుతో పిలుస్తున్నావు అంతే! అన్నారు.

గాంధీ మహాత్మునికి ఎంతో యిష్టమైన '' రఘుపతి రాఘవ రాజారాం! పతితపావన సీతారాం! ఈశ్వర అల్లా తేరోనామ్! సబ్‌కోసన్మతిదే భగవాన్!. అనే పాటలోను అర్థమిదే! రవీంద్రనాథ్ ఠాకూర్ వ్రాసిన 'జనగణమన' జాతీయ గీతంలో –

అహరహతవ ఆహ్వాన ప్రచారిత సునుత ఉదారవాణీ!
**హిందు, బౌద్ధ, సిఖ, జైన, పారశిక, ముసల్మాన, క్రీస్తానీ!**
పూరబ్ పశ్చిమ ఆశే – తవ సింహాసన పాసే!
ప్రేమహార హోయ గాథా ! జనగణ ఐక్యవిధాయక జయహే! భారత భాగ్యవిధాతా!
జయహే జయహే జయ జయ జయజయహే!

ఎప్పుడెవరి చేత రచింపబడిందో తెలియడం లేదు గానీ గీతాధ్యాన శ్లోకాలలో ఒక శ్లోకం నాకిక్కడ జ్ఞాపకానికి వస్తూవుంది.

**యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సో ఽయం నో విదధాతు వాంఛిత ఫలం త్రైలోక్యనాథోహరిః**

మూడు లోకాలకు ప్రభువైన హరిని శైవులు శివుడని, వేదాంతులు బ్రహ్మయని, బౌద్ధులు బుద్ధుడని, నైయాయికులు కర్తయని, జైనులు అర్హతుడని, మీమాంసకులు కర్మయని వివిధంగా పిలుస్తున్నారు.

ఏకాత్మ మానవతావాద ప్రతిపాదకులైన పండిట్ శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ గారి ప్రభావంతో పలువురు విద్యావేత్తలు ప్రభావితులయ్యారు. కర్తృత్వకాంక్ష లేని పండితులెవరో రచించిన ఏకతామంత్రం ఈ గ్రంథాదిలో ముద్రింపబడింది. ఇక్కడ తాత్పర్యం మాత్రం వివరిస్తాను.

1. ప్రాచీన కాలంలోని మంత్రద్రష్టలైన ఋషులు, మునులు, ఆ పరమేశ్వరుని ఇంద్ర, యమ, మాతరిశ్వాన శబ్దముల చేత సూచించారు. వేదాంతులు మాటలతో వర్ణింపలేని ఆతనిని 'బ్రహ్మ' శబ్దం చేత సూచించారు.

2. శైవులు శివుడని, వైష్ణవులు విష్ణువని, బౌద్ధులు బుద్ధుడని, జైనులు అర్హతుడని, సిక్కులు సత్ శ్రీ అకాల అని ఆ పరమేశ్వరుని స్తుతించారు.

3. ఆ జగదీశ్వరుడైన ప్రభువును కొందరు శాస్త (అయ్యప్ప సామి) యని కొందరు, కుమారస్వామి యని, మరి కొందరు స్వామి ('షిరిడీసాయి' - స్వామి శబ్దానికి అపభ్రంశ రూపమే 'సాయి'. స్వామి - సామి - సాయి) యని, కొందరు తల్లి (జిల్లేళ్లమూడి అమ్మ) యని, కొందరు తండ్రి (ముస్లిములు, క్రైస్తవులు) యని పిలుస్తున్నారు. ఎవరెన్ని విధాలుగా పిలిచినా ఆ పరమేశ్వరుడు ఒక్కడే! ఆయన ఏకరూపుడు!''

తాళ్లపాక అన్నమాచార్యులు తిరుమలపై వెలసిన శ్రీ వేంకటేశ్వర స్వామి గూర్చి తన సమకాలంలోని విభిన్న దృక్పథాలను ఒక సంకీర్తనలో క్రోడీకరించారు.

ఎంతమాత్రమున నెవ్వరు దలఁచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడఁబిండంతే నిప్పటియన్నట్లు ॥ పల్లవి ॥

కొలుతురు మిము **వైష్ణవులు** కూరిమితో **విష్ణుడని**
పలుకుదురు మిము **వేదాంతులు పరబ్రహ్మంబ**నుచు
తలఁతురు మిము **శైవులు** తగిన భక్తులను **శివుఁ**డనుచు
అలరి పొగడుదురు **కాపాలికులు ఆదిభైరవు** డనుచు ॥ ఎంత ॥

సరినెన్నుదురు **శాక్తేయులు శక్తి** రూపు నీవనుచు
దరిశనములు మిము నానావిధులను తలఁపుల కొలఁదుల భజింతురు
సిరుల మిమ్మునే యల్పబుద్ధిఁదలఁచిన వారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలఁచిన ఘనబుద్ధులకు ఘనుఁడవు ॥ ఎంత॥

నీ వలన ఁ గొరతే లేదు మఱి నీటి కొలది తామెరవు
అవల భాగీరధి దరిబావుల నాజలమే వూరినయట్లు
శ్రీ వేంకటపతి నీవైతే మముఁజేకొని వున్న దైవమని
యీవల నేనీ శరణనియెదను యిదియే పరతత్త్వమునాకు ॥ ఎంత॥

(అధ్యాత్మ -II- 393)

భగవంతుని గురించి ఎన్ని భిన్నాభిప్రాయాలున్నాయని చెప్పినా అన్నమయ్య వాటి కన్నిటికీ సమన్వయాన్ని ప్రతి పాదించడం యిక్కడ గమనింపదగింది. దత్తాత్రేయుని కులదైవంగా గల్గిన వారు కొందరు తిరుమల కొండకు వచ్చి దేవుని దర్శింపరు. కాని, అలా రాకూడదని

నియమమేమి లేదు. వారి పూర్వీకులెవరో తెలిసీతెలియక చేసిన కట్టడులు. దత్తాత్రేయుడ త్రిమూర్తి సమన్విత స్వరూపుడని, శ్రీ వేంకటేశ్వరుడు కేవలం విష్ణుమూర్తి మాత్రమేన వారి భావన కావచ్చు! కాని, యివన్నీ తర్కసహములు కావు. సరియైన ప్రమాణాలపై ఆధారపడినవి కావు. ఇటువంటి అనుమాన ప్రాణులకు సమాధానంగా అన్నమయ్య ఏమంటున్నాడో చూడండి.

తానే తానే యిందరి గురుఁడు
సానఁబట్టిన భోగి జ్ఞానయోగి!

అనే సంకీర్తనలో దత్తాత్రేయుడెట్లా నైష్ఠికుడైన యోగమూర్తియో, యోగభోగములు సమన్వయించిన విచిత్ర మర్మయోగియో, అదే విధంగా శ్రీ వేంకటేశుడు కూడ సాన బట్టిన భోగి, జ్ఞానయోగి, తపముగా ఫల పరిత్యాగము సేయించు కర్మయోగి, సన్నగశయడైన బ్రహ్మయోగి అని చెబుతూ చిట్టచివరి చరణంలో –

తనరఁగఁగపిలుడై, దత్తాత్రేయుఁడై
ఘనమైన మహిమ శ్రీ వేంకటరాయడై
వొనరఁగ సంసారయోగము గృపసేయు
అనిమిష గతుల సభ్యాసయోగి

– అధ్యాత్మ -IV- 355

ఈ విధంగా '**శ్రీవేంకటేశుఁడు సకల దేవతా స్వరూపుడు**' గా అన్నమయ్య సమన్వయించినాడు. కాని, రుచిలోని వైచిత్రి చేత తమ కిష్టమైన పేర్లతో పిలుస్తున్నారన్నాడు అన్నమయ్య సాధించిన సామరస్యధోరణి, సమన్వయభూమిక ఈ సంకీర్తనలో మరింత ప్రస్ఫుటమౌతుంది.

ఏమనవచ్చును గొందరి కింపౌఁ బులుసులు ఁ దీపులు
సోమరితనమున నిన్నిటఁజొరదీ నాతలపు

పదిలంబుగ సర్వాత్మక భావము దలఁచిన పిమ్మట
ముదమున నెవ్వరిఁజూచిన మొక్కక పోరాదు
**వదలక యిన్నిటను** శ్రీవల్లభుఁడున్నాడుండిన
హృదయము చంచల మిన్నిట నెనయదు నా మనసు !

ఎక్కడ జూచిన బ్రాణులకిన్నియు నాచారములే
చిక్కక యిన్నియు గైకొని చేయక పోరాదు
మక్కువ నిన్నియు శ్రీహరిమతములె కానీ, అయినా
ఒక్కటియే చాలును నాకొడబడ వితరములు

ఏ రీతులనటు జూచిన నిందరు బలుదైవములే
కూరిమినందరి నటువలెఁగొలువక పోరాదు
ధారుణి వేంకటపతి చేతలు యివియైన గాని
కోరిక నాకితడే మరి కొరకొరలన్నియును

(అధ్యాత్మ - IV -అనుబంధం - **14**)

స్వాభిప్రాయాన్ని, స్వకీయ రుచిని, యితరుల రుచిభేదాలను యింతకంటే బాగా వ్యక్తీకరించడం అనితరసాధ్యం! ఆధునిక కవుల్లో శ్రీకాటూరి వేంకటేశ్వర రావు గారు 'గుడిగంటలు' అనే ఖండ కావ్యంలో 'హరిజనులు దేవాలయంలో ప్రవేశం' ఎందుకు చేయరాదని శ్రీ వేంకటేశ్వర స్వామితో వాదిస్తూ

**జినదేవుండవొ, శక్తివో, శివుఁడవో, శ్రీమద్వికుంఠుండవో**
కనువిందై కనుపింపరావె త్రిజగత్కల్యాణరమ్యాకృతీ!

అంటారు! శ్రీ త్యాగరాజుస్వామి శ్రీరామభక్తులు. ఆయన శ్రీరాముని ఒక కీర్తనలో సంబోధిస్తూ -

ఎవరని నిర్ణయించేదిరా! నిన్నెట్లారాధించేదిరా! నరవర!
**శివుఁడవో మాధవుఁడవో కమలభవుఁడవో .........**

యిత్యాదిగా ప్రశ్నించి చరణంలో -

శివమంత్రమునకు 'మా' జీవము, మా
ధవ మంత్రమునకు 'రా' జీవము, ఈ
వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద

అంటారాయన. **'ఓం నమశ్శివాయ'** అనే శివమంత్రంలో 'మ' బీజాక్షరం! **ఓం నమోనారాయణాయ'** అనే మాధవ మంత్రంలో 'రా' బీజాక్షరం! శివకేశవమంత్రబీజాలైన మ, రా అనే రెండు బీజాక్షరాలు తిరగేస్తే 'రామ' నామం ఏర్పడింది. కాబట్టి రామతత్త్వం హరిహరాద్వైతాన్ని, అద్వైతాన్ని ప్రతిపాదిస్తూ ఉందని ఆయన భావించారు. 'ర' కార 'మ'

కారాలు పై రెండు మంత్రాలలో తొలగిస్తే అవి నిర్వీర్యాలవుతాయి. ఆ బీజాక్షరాలు 'జీవ' ము ప్రాణము అని చెబుతూ త్యాగరాజుస్వామి, ఈ శివకేశవాద్వైతం లేక హరి హరాద్వైత రహస్యం రామనామంలో ఉందని తెలిసిన ఘనులకు తాను నమస్కరిస్తానన్నాడు. తెలియక పోవడం వలన అభిప్రాయభేదాలు తలెత్తి పరస్పర వైషమ్యాలకు దారితీస్తాయని పరోక్షంగా హెచ్చరిస్తున్నాడు.

## III

అంతఃకరణం నాల్గు భాగాలుగా వింగడింపబడిందనుకున్నాము. మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము. మనస్సు సంకల్ప వికల్పాలతో కూడుకొన్నది. చేయవలసిన ఒక పని చేద్దామా వద్దా అని తర్జన భర్జన చేసేది మనస్సు. కాబట్టే, లోకానికి చాల దగ్గరితనం గలది. నిశ్చయజ్ఞానం గల్గిన అంతఃకరణవృత్తికే బుద్ధి అని పేరు. ఒక దృఢ నిశ్చయానికి వచ్చిన స్థితి పేరు బుద్ధి! ఈ రెంటిని కప్పివేస్తూ అహంకారం స్వాతిశయంతో స్వోత్కర్షతో, స్వార్థబుద్ధితో అంతశ్శత్రువులైన అరిషడ్వర్గములతో మనిషిని ఏదో మార్గంలో మళ్లించి గమ్యస్థానాన్ని చేయనీయకుండా చేస్తుంది. అరిషడ్వర్గాలను జయించడం కష్టమే కావచ్చు. కాని, అహంకారాన్ని కొంతకు కొంత తగ్గించుకుంటూ రావడం మనిషి తన వయస్సు పెరిగే కొద్దీ చేయవలసిన పని. అందుకే, వేదఋషులు ఎప్పటి కప్పుడు హెచ్చరిస్తూనే వచ్చారు. దీనికి సౌమనస్యసూక్తమే ఉదాహరణ! ఋగ్వేదకాలంనాడే ఋషులకు ఋషులకు మధ్య అభిప్రాయభేదాలు తలెత్తినాయి అని చెప్పడానికి –

**'ఏకం సత్ విప్రా బహుధావదంతి'** – ఋగ్వేదం 1-164-46
– అధర్వవేదం 9-10-28

సత్యమొక్కటే, కాని పండితులు దానిని బహువిధాలుగా చెబుతున్నారు.

**''సుపర్ణం విప్రాః కవయోవచోభిరేకం**
**సంతః బహుధా కల్పయంతి''** – ఋగ్వేదం 10-114-5

విప్రులనగా వేదపండితులు 'వేద పాఠంతు విప్రాణామ్' వేద పండితుల దృష్టిలోను, మంత్రద్రష్టలైన వేద కవుల దృష్టిలోను, సుపర్ణం ఒకే విధమైన రూపం గల్గినది కాని, లౌకికులైన పండితులు దానికి బహురూపాలను కల్పిస్తున్నారు.

ఏకం అనేకం కావడం సృష్టి లక్షణంలోనే ఉన్నది కాబట్టి, అనేకులు అనేక విధాలుగా ఏకైకమైన సత్యాన్ని గూర్చి చెప్పడంలో అభిప్రాయాలు వేర్వేరుగా కన్పడడం జరిగింది. స్వకీయాభిప్రాయ సమర్థనంలో, స్థాపనంలో వాదోపవాదాలు తలెత్తడం, వైషమ్యాలు పెరగడం, ఇవన్నీ విభిన్న మతాల అవిర్భావానికి మూల హేతువులయ్యాయి. దీనితో నూత్న మత ప్రవక్తలు

బయలుదేరారు. ఇక్కడ మత ప్రవక్తలు అహంకారులనీ, మానవ అహంకారం నుండి మతాలు పుట్టాయని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. స్వాభిమాన పురస్సరమైన అభిప్రాయమే మతం (Opinion)అని చెప్పడమే నా ఉద్దేశ్యం. అసలు వేదకాలంలో ఋషి యొక్క నిశ్చితాభిప్రాయానికే 'మత' మని పేరు. 'మత' మంటే అభిప్రాయమని అర్థం! (View point, Stand point, or opinion) అందుకే వేదమతానికి 'ఋషిమత'మని పేరు. 'మత' మనే మాటకు 'Religion' అనేది సమానార్థక పదంగా ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో ఏర్పడింది. కాని, ఇదిసరైన మాట కాదు. 'ధర్మ' మనే మాటకే 'Religion'అని పేరు. కొంత మంది 'మత ధర్మ' మని వాడుతుంటారు. ఇది కూడ సరికాదు.ఇంతకీ ఋషి అంటే ఎవరు? అని ప్రశ్నిస్తే –

**''సాక్షాత్కృత ధర్మాణః ఋషయోర్బభూవుః''**

అని యాస్కాచార్యులు నిర్వచించారు. సార్వకాలికమైన ధర్మాన్ని సాక్షాత్కరింపజేసుకొన్న వారికే ఋషులని పేరు. దీనికే 'దర్శనం' అంటారు. దర్శనమంటే –

**''విచిత్రభావ ధర్మాంశతత్త్వ ప్రఖ్యాచ దర్శనమ్''**

విచిత్రమంటే, అంతకుపూర్వం ఎవ్వరికీ తెలియని ఉదాత్త భావాలను, ధర్మాలను, వాటి అంశలను వ్యక్తం చేసే తత్త్వ ప్రఖ్య'నే 'దర్శనం' అంటారు. వివిధ ఋషుల దర్శనాలు వేర్వేరుగా ఉండడం మూలాన వేర్వేరు మతాలు (అభిప్రాయాలు) వేదవాఙ్మయంలో చోటుచేసికొన్నాయి. ఈ సందర్భంలో పెద్దల సూక్తి ఒకటి స్మరణీయం.

**శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా**
**మహామునీనాం మతయశ్చ భిన్నాః।**
**నైకో ఋషిర్యస్య వచః ప్రమాణం**
**మహాజనోయేన గతస్సపంథాః॥**

వేదాలలోనే వేర్వేరు అభిప్రాయాలున్నాయి. స్మృతి గ్రంథాలలో అనేకాభిప్రాయాలు కానవస్తున్నాయి. మహామునుల మతాలు (అభిప్రాయాలు) పెక్కు తీరులుగా ఉంటున్నాయి. ఇతడే అందరికీ ప్రమాణభూతుడనదగిన ఋషి ఒక్కడు లేడు. కనుక, మహాపురుషుల నడచిన మార్గమే మిగిలిన వాళ్లకు దారి.''

ఇన్ని మతభేదాలకు (అభిప్రాయభేదాలకు) మూలకారణమేమిటో మనం ముందే వివేచించుకున్నాం. స్థూలంగా పరమాత్మతత్త్వానికి సంబంధించిన మత భేదాలు పైకి పరస్పర

విరుద్ధంగా ఉన్నట్లు కన్పిస్తాయి! పరిణతి చెందిన బుద్ధితో, పరిపక్వమైన హృదయంతో
సమన్వయ దృష్టితో చూస్తే భిన్నత్వంలో ఏకత్వం, నానాత్వంలో ఏకరూపత, వైవిధ్యంలో
సారూప్యం తప్పక కన్పిస్తుంది. ఇది పండితులైన వారి విషయానికి వర్తించేది. కాగా, సామాన్యుల
గొడవ లేమీ తెలియవు. ఎందుకంటే వారికంటూ ఒక ప్రత్యేకాభిప్రాయం ఉండద
గనుక. అటువంటి వారి విషయంలోనే భగవద్గీత -

**యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః**
**సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ।** (3-21)

''పెద్దలు దేనినైతే ఆచరిస్తారో యితరులు దాన్నే అనుసరిస్తారు. వారు దేనినై
ప్రమాణంగా స్థాపిస్తారో దానినే లోకమంతా అంగీకరిస్తుంది.''

దీనితో లోకంలో సామాన్యులు అనుసరించే మతాచారాలు సర్వసాధారణంగా ఒక పద్ధతి
కట్టుబడి వుండగా, పండితులు వాదవివాదాల్లో ఎప్పటికీ అంతు తేలని ఒక ప్రత్యేకమత
సమస్యాత్మకంగా నిల్చిపోయింది. ఉదాహరణానికి, ఒక సామాన్యుడు రాముణ్ణీ
రామాయణాన్నీ, కృష్ణుణ్ణీ ,,బాగవతాన్ని యథాతథంగా నమ్ముతున్నాడు. పండితులు రాముడ
కృష్ణుడు చారిత్రకవ్యక్తులేనా? అసలు రామాయణ, మహాభారత యుద్ధాలు జరిగాయా? జరిగి
ఎప్పుడు జరిగాయి? ఇటువంటి పరిష్కృతం కాని సమస్యలతో వాదించుకుంటూ వుంటార
ఏకత్వం సామాన్యులెప్పుడో సాధించారు. కాని, పండితులే భిన్నాభిప్రాయాలతో భిన్న వర్గాలు
విడిపోయారు. ఏ మతంలో పుట్టిన వాడికైనా తన మతంపై గాఢమైన నమ్మకం చాల అవసర
ఆ నమ్మకమే దుఃఖం నుండి విడుదలను ప్రసాదిస్తుంది. దాన్నే మోక్షం (Salvation) అంటున్నా

## IV

ఇంతవరకు వైదిక దృష్టితో భిన్నత్వంలో ఏకత్వ సాధన ఎలా సాధ్యమౌతుందో చర్చిం
తెలుసుకున్నాము. ఇప్పుడు ధర్మజ్ఞులైన పౌరాణికులు కాలస్వరూపాన్ని ఎలా వివేచించినార
ఈ కాలానికి ఏది ఉపాదేయమని నిర్ణయించినారో తెలుసుకొందాము.

యుగాలు నాలుగు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు. మనస్సు, వాక్కు, కర్మవ
త్రికరణములు. కృతయుగంలో త్రికరణాలకు సమన్వయం ఉండేది. మనస్సుకు, మాటక
చేతకు ముప్పేటలా ముడివడిన నడవడికగలయుగం కృతయుగం. యజ్ఞము త్రికర
శుద్ధికి ప్రతీక! త్రికరణాలకు ఎక్కడ చక్కని సంపూర్ణ సమన్వయం సాధింపబడుతుందో అక్క
యజ్ఞము తప్పక సత్ఫలితాన్ని అందిస్తుంది. కృతయుగం వేదకాలానికి సంబంధించిన యుగ

వేదాలకు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక స్థాయులలో వ్యాఖ్యానం వ్రాయవచ్చునని సాయణాచార్యులు చెప్పారు. అధ్యాత్మిక స్థాయిలోనే మొట్టమొదట వేదం వ్యాఖ్యానింపబడింది. ఈ స్థాయికి సంబంధించినవే ఉపనిషత్తులు. ఇవి యజ్ఞాన్ని అధ్యాత్మిక స్థాయిలో సమన్వయించాయి. అప్పుడు బాహ్యక్రియా కలాపాలతో కూడుకొన్న యజ్ఞం ఆంతరమైనదిగా రూపొందింది. దీనినే ఉపాసన అన్నారు. వీటిలో మరల అభిప్రాయభేదాలు తలెత్తి 32 విధాలైన ఉపాసనలు ఏర్పడ్డాయి. వీటినే ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలన్నారు. ఉపాసన యొక్క పరిణామంలో నిర్గుణోపాసన నుండి సగుణోపాసన దారితీయడం జరిగింది. ఆంతరమైన నిర్గుణోపాసన బాహ్యమైన అర్చామూర్తిగా రూపొందింపబడడంతో యజ్ఞశాల నిర్మాణమే దేవాలయ నిర్మాణంగా రూపుదాల్చింది.మొత్తానికి ఉపనిషత్తుల కాలంలో ధ్యానయోగం (Meditation) మిక్కిలి ప్రాధాన్యాన్ని వహించింది. అది కుండలినీ యోగమే! ముఖ్యంగా యోగసూత్రాలను మన కందించిన మహాపురుషుడు పతంజలి. ఆయన వాక్శుద్ధికి వ్యాకరణాన్నీ, మనశ్శుద్ధికి యోగాన్నీ, కాయశుద్ధికి ఆయుర్వేదాన్ని (వైద్యశాస్త్రాన్నీ) మన కందించిన మహనీయుడు. ఈ పరిస్థితి కృతయుగానికి సంబంధించిందిగా చెబుతారు.అది త్రికరణ శుద్ధితో మానవులు జీవించిన యుగం. ధ్యానయోగం కృతయుగంలో ప్రధానమైంది.

త్రేతాయుగంలో మానవుడు త్రికరణాలలో మొదటిదైన 'మనస్సు'ను కలుషితం చేసికొన్నాడు. అంటే మనోనిగ్రహాన్ని కోల్పోయాడు. తత్ఫలితంగా వాక్కు, కర్మ ఈ రెండి మధ్యనే సమన్వయం సాధించగలిగాడు. మాటనిలకడ, చేతల్లో రూపుదాల్చడం ఈ యుగధర్మంగా చెప్పవచ్చు. దీనికి ప్రకృష్టోదాహరణం శ్రీరామావతారమే! ఒక మాట! ఒక బాణము, ఏకపత్నీవ్రతము రాముని జీవిత ధ్యేయం! **'రామోవిగ్రహవాన్ ధర్మః'** **''రామోద్విర్నాభిభాషతే'' విద్ధిమాం ఋషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్''** వంటివి వాల్మీకి రామాయణంలోని మాటలు! రూపెత్తిన ధర్మమే రాముడు, రాముడు రెండు విధాలుగా మాట్లాడడు, ''కేవలం ధర్మాన్నే అంటిపెట్టుకొన్న నేను ఋషితో సమానుణ్ణిని తెలుసుకో!'' ఈ మాటలన్నీ రాముడు జ్ఞానయోగిగా నిరూపిస్తున్నాయి. కాబట్టి, **జ్ఞానయోగం త్రేతాయుగంలో ఎక్కువ ప్రచారంలో ఉండేదిగా చెప్పవచ్చు.**

ద్వాపరయుగంలో కేవలం కర్మకే ప్రాధ్యానం. మాటనిలకడను మానవుడు కోల్పోయాడు. చెప్పేదొకటి చేసేదొకటిగా తయారైంది. మనస్సుకు, వాక్కుకు ఉండే సమన్వయాన్ని ఎప్పుడైతే పోగొట్టుకున్నాడో ధర్మం రెండు పాళ్లు లుప్తమై పోయింది. ఏ వెటువంటి కర్మచేస్తే అటువంటి ఫలితం కలిగే పరిస్థితి ఏర్పడింది. ఎంత శ్రద్ధగా, ఎంత భక్తిగా

చేస్తే అంతే ఫలితం! అందుకే ద్వాపరయుగంలో అవతరించిన కృష్ణుడు భగవద్గీతలో కర్మయోగాన్ని ప్రధానీకరించుకొని చెప్పాడు.

**''కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన।''**

నీకు నిర్దేశింపబడిన కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు! ఫలితాన్ని గురించి ఆలోచించకు.

**''యో యచ్ఛ్రద్ధః స ఏవ సః''**

ఎవడెటు వంటి శ్రద్ధ గల్గివుంటాడో ఆ శ్రద్ధేవాడవుతాడు.

**''యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ''**

నీవెంత గాఢంగా ఒక విషయాన్ని భావిస్తావో ఆమోతాదులోనే ఫలితం నీకు లభిస్తుంది. ఇవి భగవద్గీత లోని వాక్యాలు. ఇవన్నీ కర్మయోగప్రాధాన్యాన్ని చెబుతున్నాయి. (కలియుగంలో తిలక్, గాంధీ మహాత్ములు కర్మయోగాన్ని అనుష్ఠించి సత్ఫలితాలను సాధించడం మనకందరికి తెలుసు! తిలక్, శ్రీఅరవిందఘోష్ ప్రవచించిన స్వధర్మం, స్వరాజ్యం, స్వదేశి అనేవి కర్మయోగంలోని మూడు ప్రధాన సూత్రాలు.)

కలియుగంలో మానవుడు త్రికరణ శుద్ధిని కోల్పోయాడు. అధ్యాత్మిక సాధనలో మానవునికి మిగిలింది కేవలం భగవన్నామస్మరణమొక్కటే! దీనినే నామసంకీర్తనం లేక భగవన్నామసంకీర్తనమన్నారు ఆచార్యపురుషులు. భక్తియోగం సాధన సప్తకంతో ముడిబడిందని అది యోగసాధకులే అనుష్ఠించగలరని సామాన్యులకు శరణాగతి ఒక్కటే శరణ్యమన్నారు. శ్రీరామానుజులు. **భక్తియోగం, శరణాగతి అధ్యాత్మిక సాధనలో చివరి మెరుపులుగా నేడు మనకు మిగిలివున్నాయి!**

7

ఎందుకీవిధంగా నానాటికి తీసికట్టుగా సమాజం తయారైందని ప్రశ్నించవచ్చు. ''కాలము చేత మానవుని బుద్ధి వికార్యమాణమగుచున్నది'' అన్నారు కవిసమ్రాట్ విశ్వనాథ! కాలం మారే కొద్దీ మానవుని బుద్ధి కూడ మార్పుకులోనవుతూవుందన్నారు. దీని నెవరూ పరిహరించ లేరు. వీటినే యుగధర్మాలంటారు.

శ్లో॥ **కలిశ్శయానో భవతి - సంజిహానస్తు ద్వాపరః।**
**ఉత్తిష్ఠః త్రేతా భవతి - కృతం సంపద్యతేచరన్ ॥**

**- ఐతరేయ బ్రాహ్మణమ్ (7-3)**

కలియుగంలో మానవులు సోమరులై నిద్రిస్తుంటారు. ద్వాపరయుగంలో నిద్రవిడిచి

లేచి కూర్చొని వుంటారు. త్రేతాయుగంలో లేచి నిలబడుతారు. కృతయుగంలో నడిచివెళ్లి కార్యాలను సాధిస్తారు. ఈ శ్లోకాన్నే ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలిలా అనువదించారు.

అలసత వరున్న మనుజుండు కలియుగంబు
ద్వాపరం బెన్నకూర్చున్న వాడు; త్రేత
యుత్థితుఁడు; యాయి మఱి కృతయుగమటన్న
నముచిదమనోక్తి బుగ్బ్రాహ్మణమున వినమె! (3-45)

కాలక్రమేణ మానవులు సోమరిపోతులవుతున్నారని తదేక దీక్షతో, పట్టుదలతో కార్యసాధన చేయలేక పోతున్నారని అతిప్రాచీనకాలంలోనే గుర్తించడం జరిగింది. అందుకే, త్రికరణ శుద్ధి కోల్పోయి, తమ వ్యక్తిత్వం మరచిపోయి, అస్తిత్వం పోగొట్టుకొని, నిస్తేజులైన భారతీయులు మూడు వందల సంవత్సరాలు ఆంగ్లేయులకు బానిసలై మగ్గవలసి వచ్చింది. అటువంటి నిర్వీర్యమైన, నిద్రాణమైన జాతిని జాగృతం చేయడానికి వేదఋషులే బద్ధకంకణులై వున్నారు.

**వయం రాష్ట్రే జాగ్రియామ పురోహితా**

– కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయసంహితా (1-7-10-1)

''వయమస్మిన్రాష్ట్రే పురోహితా యాగానుష్ఠానాదౌ
పురోగామినో జాగ్రియామ జాగరూకా భయాస్మ'' – సాయణభాష్యమ్

**వయం రాష్ట్రే జాగృయామా పురోహితాః।**

– యజుర్వేదీయ కాఠకసంహితా (14-2)

**వయం రాష్ట్రే జాగృయామ పురోహితాః స్వాహా।**

– వాజసనేయీ మాధ్యందిన శతపథబ్రాహ్మణమ్ (5-2-1-5)

స్వదేశవాసులను జాగరూకుల్ని చేయుడానికి బద్ధకంకణులై కర్మయోగులైన మహానుభావులెందరో మన దేశంలో ప్రభవించారు. వారిలో తిలక్, గాంధీజీ, నెహ్రూ వంటి వారు స్వదేశక్షేమానికై దీక్షపూనిన పురోహితులు! ముందుచూపుతో దేశప్రజల్ని మేల్కొల్పిన కర్మ వీరులలో బంకించంద్ర ఛటర్జీ, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, శ్రీ అరవిందఘోష్, రవీంద్రనాథ్‌ఠాకుర్, నరసింహమెహతా (నర్సీమెహతా), ప్రభృతులు బానిసత్వ శృంఖలల నుండి స్వదేశ విముక్తికై నిరంతర పోరాటం సల్పిన మహనీయులు. వాళ్లు వెలిగించిన దీపం, ముఖ్యంగా బంకించంద్రుని **'వందేమాతరం'** గీతం **''అర్ధంజ్వలతిజ్యోతి రహమస్మి''** అన్న ఉపనిషద్వాక్యం వలె మనలో నిత్యమూ ఆర్ద్రతామహితమైన సౌమనస్యాన్ని, సమన్వయస్నేహ దీపాన్ని, ప్రజ్జ్వలింపజేస్తూ జాతీయతనూ, దేశీయతను మనలో ప్రతిష్ఠించుగాక!.

పూర్వరంగాన్ని ముగించడానికి ముందు ఒక్కమాట మనవి చేయాలి. ఈ గ్రంథంలో కేవలం మతచరిత్ర వ్రాయడం నా ఉద్దేశ్యం కాదు; సాహిత్యచరిత్ర వ్రాయడం అంతకంటే కాదు. భారతదేశంలోని విభిన్నమతాల సంప్రదాయాలను, ప్రపంచ దేశాలలోని ప్రముఖమతాలను సమన్వయ భూమికపై దర్శించి, అక్కడక్కడ తులనాత్మక దృష్టితో మత, సాహిత్యాంశాలు పోల్చడం, వరకే పరిమితమైంది. సమన్వయ భూమికలో సాధించిన అంశాలు ఈ నాటి సంక్షుభిత సమాజానికి ఏ మార్గాన్ని నిర్దేశిస్తున్నాయి? ఇంతవరకుమనం సాధించినదేమిటి? విశ్వజనీన దృష్టితో సమాజాన్ని ఎలా పునర్నిర్మించుకోవాలి? అనే అంశాలు 'సింహావలోకనం' లో చెప్పడానికి ప్రయత్నిస్తాను. ఇప్పుడీ నేపథ్యంతో గ్రంథం చదువవలసిందిగా సహృదయ పాఠకుల్ని అభ్యర్థిస్తున్నాను.

తిరుపతి — ముదివేడు ప్రభాకరరావు

**16-9-2000**

# ఉపోద్ఘాతం

# దేశసమైక్యత - అవగాహన

## AN UNDERSTANDING TOWARDS NATIONAL INTEGRATION

శ్రీ అరవిందులు 1905 లో తన భార్య మృణాళినీ దేవికి వ్రాసిన ఉత్తరంలో, ''ఇతరులు దేశాన్ని నిర్జీవపదార్థంగా భావించి మైదానాలు, పొలాలు, అడవులు, కొండలు, నదులు ఇదే దేశమనుకుంటారు. నేను దేశాన్ని మాతృమూర్తిగా ఆరాధించి పూజిస్తాను. ఈ పతితజాతిని జ్ఞాన శక్తితో ఉద్ధరిస్తాను''.[1] అని వ్రాశారు.

లార్డ్ కర్జన్, బెంగాలు రాష్ట్రాన్ని రెండు ముక్కలుగా చేస్తూ 1905 జూలై 20వ తేది ప్రకటించినపుడు, ఆంగ్లేయుల ''విభజించి పాలించు'' ( divide and rule) అనే సిద్ధాంతాన్ని ప్రతిఘటిస్తూ, శ్రీ అరవిందులు ప్రతి భారతీయుని హృదయంలో భవానీ మందిర నిర్మాణం జరగాలని కాంక్షిస్తూ, భవానీ మందిర కరపత్రాన్ని విడుదల చేశారు. అందులోని కొన్ని వాక్యాలివి.

" For what is a Nation ? What is our mother-country ? It is not a piece of earth, nor a figure of speach, nor a fiction of the mind. It is a mighty Sakti, composed of the Saktis of all the millions of units that make up the nation, just as a Bhavani Mahishamardani sprang into being from the Sakti of all the millions of Gods, assembled in one mass of force that welded into a unity. The Sakti we call India, Bhawani Bharati, is the living unity of the Shaktis of three hundred million people."[2]

దేశమంటే ఏమిటి? కోట్ల ప్రజల సమష్టిశక్తియే దేశం. మాతృభూమి అంటే ఒక భూభాగం కాదు, ఒక రూపకాలంకారం కాదు, అది ఒక మహత్తర శక్తి! సకల దేవతల సమాహార శక్తి భవాని మహిషాసురమర్దని యైనట్లు, సకల జనుల సంఘటిత శక్తియే 'దేశం' అనబడుతుంది, అన్నారు శ్రీ అరవిందులు.

బెంగాల్ విభజన జరిగినప్పుడే బంకిం చంద్రఛటర్జీ ''వందేమాతరం'' అనే గేయాన్ని రచించారు. అది దేశం నలుమూలలా ప్రాకి ''వందేమాతరం ఉద్యమం'' గా రూపుదాల్చి 1905నుండి 1910దాకా ఐదు సంవత్సరాలు ఒక సమైక్యశక్తిగా దేశాన్ని ప్రభావితం చేసింది. ఈ ఉద్యమం చేతనే ఎంతో ప్రభావితులైన శ్రీ గురుజాడ అప్పారావు గారు, అరవిందుల, బంకిం చంద్రుల అడుగుజాడల్లో నడుస్తూ 1910లో ''దేశమును ప్రేమించుమన్నా''[3] అనే దేశభక్తి గీతాన్ని రచిస్తూ -

సొంతలాభం కొంతమానుకు
పొరుగు వాడికి తోడుపడవోయ్।
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్॥

అని ఎలుగెత్తి చాటడమే గాక, వట్టిమాటలు కట్టిపెట్టి, గటిమేలు తలపెట్టడానికి, శక్తిమంతులైన జాతి జనుల చేతనే అది సాధ్యమని గ్రహించి, వారే దేశాన్ని ముందుకు నడిపించగలరని చెబుతూ-

ఈసురో మని మనుషులుంటే
దేశమే గతి బాగుపడునోయ్ ।
తిండిగలిగితె కండగలదోయ్
కండగలవాడేను మనిషోయ్ ॥

అంటూ, అధ్యాత్మిక శక్తి సంపాదనకు ముఖ్యంగా భౌతికశక్తి అవసరమని జ్ఞాపకం చేశారు. అటువంటి దృఢగాత్రులైన మానవులే ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులనే త్రిపుటికి సమర్థులు.

ఈ మహానుభావులకందరికీ ప్రధానప్రేరణ కల్గించినది వాల్మీకి రామాయణం లోని, '' జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ''[4] అనే మహావాక్యమైనప్పటికీ, భారత స్వాతంత్ర్యసంగ్రామ కాలంలో – జనని – వట్టి ' కన్నతల్లి' కాదు – సర్వశక్తి స్వరూపిణి యైన భవాని మహిషాసురమర్దని' కాగా, జన్మభూమి – వట్టి 'తల్లినేల' కాదు – సమగ్ర సమైక్యభారతావని – సంఘటిత జాతి చైతన్య శక్తి గా భావింపబడడం జరిగింది. అదే రామరాజ్య స్థాపనకు పునాదిగా గాంధిజీ చెప్పారు. ఇది ప్లేటో (Plato) చెప్పిన (Utopia) ఆదర్శరాజ్యమే [5] కావచ్చు, కాని, ఆదిశగా గాంధిజీ దేశాన్ని నడిపించారు. అయితే, దానిని ఆంగ్లేయులు పడగొట్టి, దేశవిభజనకే పట్టంకట్టి, సమస్యల విషవలయంలో భారతదేశాన్ని నెట్టారని చెప్పవలసి వుంది.

కాబట్టి, భారత స్వాతంత్ర్య పోరాటకాలంలో, దేశసమైక్యతాభావన సంకుచితమైన, స్వార్థపూరితమైన, ప్రాంతీయాభిమానం నుండి పుట్టుకొచ్చింది కాదని, కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకు విశాలభారతదేశం ఒక్కటేననే 'అఖండ భావన' నుండి పుట్టిందని చెప్పాలి.

దీనిచే 'సమైక్యత' అంటే, భావంలో ఏకత్వాన్ని సాధించిన ఒక జాతిజనులు, సంఘటిత శక్తిగా రూపొంది మన దేశ సమగ్రత్వ విషయమై సర్వదా జాగరూకులై ఉండడమే 'సమైక్యత' అనబడుతుంది.

''కలౌ సంఘే శక్తిః'' అన్నారు పెద్దలు. సంఘటితమైన శక్తియే ఈ యుగంలో కార్యసాధకత్వాన్ని కల్గివుంటుంది. ఒక మాటలో చెప్పాలంటే, ప్రజలలో భావసమైక్యత, శక్తిసమైక్యత రెండు సమన్వయం సాధించినప్పుడే దేశ సమగ్రత పరిరక్షింపబడుతుంది. ఇక్కడ భావం - ఇచ్ఛాశక్తికి, శక్తి - క్రియా శక్తికి ప్రాతినిధ్యం వహించగా, ఈ రెంటి మధ్యగల జ్ఞాన శక్తి (awareness or understanding) 'సదవగాహన'కు దోహదం చేస్తుంది.

సమైక్యతకు దారితీసే ఈ సదవగాహనాభావ సంపుటిని ఐదారు విధాలుగా వింగడించవచ్చు.

1) రాజకీయ సమైక్యత (Political Integration)
2) సాంఘిక సమైక్యత (Social Integration)
3) మత సమైక్యత (Religious Integration)
4) సాహిత్య సమైక్యత (Literary Integration)
5) సాంస్కృతిక సమైక్యత (Cultural Integration)
6) ఆధ్యాత్మిక సమైక్యత (Spiritual Integration)

నిబద్ధత (commitment) ఉన్న చోటనే సమగ్రత (integrity) సాధింపబడే అవకాశముంది. ఈ నిబద్ధత 'స్వధర్మ' మునందు ఉండాలని శ్రీ అరవిందులు చెప్పగా, దానినే గాంధిజీ 'స్వదేశీ' ఉద్యమంగా నడిపించి సమైక్యతను సాధించారు. వీరిద్దరికీ ప్రేరణ కల్గించినవి 'భగవద్గీత' లోని '' స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః''[6] అనే వాక్యము, ''స్వల్పమప్యస్య ధర్మస్యత్రాయతే మహతో భయాత్''[7] ''ధర్మోరక్షతి రక్షితః''[8] అనే వ్యాస మహాభారతంలోని వాక్యాలు.

అందుచేత, ఈనాడు పై ఆరువిధాలైన సమైక్యతల పట్ల ప్రజలకు సరియైన అవగాహన (Clear perspective) కల్గించినప్పుడే ' దేశ సమైక్యత' సాధింపబడుతుంది.

ఈ సదవగాహన ఎలా సాధ్యమౌతుంది ? అని ప్రశ్నించవచ్చు. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో భారతదేశాన్నే గాక, ప్రపంచ పౌరులందరినీ తన అనుష్ఠాన వేదాంత భావధారచే ప్రభావితం చేసిన స్వామి వివేకానందులు, ''భారత దేశంలో వివిధ మతాల వలెనే వివిధ భాషలు చోటుచేసికొన్నాయినీ, ఈ భిన్నత్వంలోని ఏకత్వం (Unity in diversity) దర్శిస్తే తప్ప భావసామ్యాలు తెలియరావని'' చెప్పారు.

క్రీ. శ 13వ శతాబ్దంలో ఇస్లాం మతానికి చెందిన పర్షియన్ మార్మిక కవి జలాలుద్దీన్ రూమీ, వ్రాసిన గ్రంథం మస్నవీ - ఈ - మానవీ (Masnavi - i - Manavi) లో ఒక పిట్ట కథ చెప్పి దానిలోని 'నీతి'ని యిలా వ్రాశారు.

"That men come to peace and harmony when they understood. It is the lack of understanding that is at the root of all exclusiveness or intolerance mistrust or hatred." [9]

వివిధ మతాలు, వివిధ భాషలున్న ఒక దేశంలో ప్రజల మధ్య సరైన అవగాహన ఉన్నప్పుడే సుఖశాంతులతో సహజీవనం (peaceful co-existence) సాధ్యమౌతుంది. అలా కాకుండా, మతపరమైన వేర్పాటు ధోరణి, అసహనం, అపనమ్మకం, ద్వేషం వంటి భావాలు తలెత్తడానికి ప్రజలలో సరైన అవగాహన లేక పోవడమే మూల కారణం'' అన్నారు.

"Tolerance towards other religious faiths imparts us in understanding of our own religion"[10] అన్నారు మహాత్మాగాంధీ. ''నీ మతాన్ని గురించి నీవు చక్కగా తెలుసుకోవాలంటే ఇతరుల మతాన్ని ఓపిగ్గా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు'' అన్నారు ''పరమతసహనమే దేశ సమైక్యతకు గీటురాయి అని దీని కర్థం. ఈనాడు దేశ ప్రజల మధ్య ఒక చక్కని అవగాహన కల్గించడానికి పై ఆరుమూల సూత్రాలను ప్రసార సాధనాల ద్వారా విరివిగా ప్రచారం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

## రాజకీయ సమైక్యత (Political Integration)

అస్థిరత్వం, అభద్రత, స్వార్థపరత్వం, లంచగొండితనం, దిగజారిన నైతిక విలువలు, వంటి అనేక దోషాల నుండి రాజకీయరంగం బయటపడాలంటే ప్రతి పౌరుడూ -

**1857** నాటి ప్రథమ భారత సంగ్రామ చరిత్రనూ-

**1905 – 1910** మధ్య కాలంనాటి 'వందేమాతరం' ఉద్యమాన్నీ

**1930** నాటి దండి ఉప్పు సత్యాగ్రహాన్నీ

ఇలా, భారత స్వాతంత్ర్య పోరాటంలోని వివిధ సంఘటనలు, దేశం కోసం సర్వస్వాన్నీ త్యజించి, దేశమే తాముగా, తామే దేశంగా, వీరోచితంగా, తెల్లదొరలనెదిర్చి పోరాడి, మరణించిన దేశభక్తులైన ఎందరో విప్లవవీరుల త్యాగాలు ప్రతి ఒక్కరూ రోజూ గుర్తుకు తెచ్చుకోవడం ఎంతైనా మంచిది. ఎలిమెంటరీ స్థాయి నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలోని వివిధ ఘట్టాలు పాఠ్యాంశంగా, విధిగా (Compulsory) ఉండేటట్లు చేయవలసిన బాధ్యత విద్యాశాఖను నిర్వహించే మంత్రులు గ్రహించి ప్రణాళికలో చేర్చాలి. నేటితరం యువతకు మనకు స్వాతంత్ర్యం ఎలా వచ్చిందో బొత్తిగా అవగాహన లేదనడం వాస్తవం! అమాయకులైన యువకుల్ని రాజకీయ నాయకులు తప్పుదారి పట్టిస్తున్నారు.

ఒక్కమాట ఘంటాపథంగా చెబుతున్నాను. మన దేశానికి స్వాతంత్ర్యం ఎలా వచ్చిందన్న విషయం ప్రతి పౌరుడూ చక్కగా తెలుసుకొని వుంటే, ఈ దేశ సమైక్యతకు, సమగ్రతకు ఎప్పుడూ భంగం వాటిల్లదు.

సమైక్యతా పరిరక్షణకు దేశభక్తియే పునాది. అందుకే ''వందేమాతరం''[11] అనే జాతీయ ఇతిహాస కావ్యంలో శ్రీముదిగొండ వీరభద్రమూర్తిగారు –

ఈశ భక్తికి మించిన దేశభక్తి
దేశభక్తికి దగిన యాత్మీయ శక్తి
యాత్మశక్తికి దోడుగ నాధునికత
రక్తి, యవి మొప్పునాడె భారతము ముక్తి!

అని చెప్పారు. అంటే ఏమిటి ? దైవభక్తి కంటే దేశభక్తి గొప్పది. దీనికి ఆత్మశక్తి, ఆధునికతారక్తి తోడైతేనే '' భారతస్వాతంత్ర్యం'' పరిరక్షింపబడుతుందని వారు స్పష్టీకరించారు. వీరభద్రమూర్తి గారికి జాతీయోద్యమం (National Movement) మొత్తం ఒక్క 'వందేమాతరం' అన్న భావనగా సాక్షాత్కరించింది.[12]

''వందేమాతర'' మను నొక
సందేశ ధ్వనన గీతి చాలును బంకిం
చంద్రుని యమరత్వమునకు
కేంద్రీకృత దేశ శౌర్యగీత మదొకటే!

ఈనాడు 'దేశచౌర్యం' చేసే వారికీ, చేయించే వారికిది ఒక గొప్ప కనువిప్పు! అలాగే, ''స్వరాజ్యం ...జన్మ హక్కు! దానిని నేను సాధించితీరుతాను'' అని గొంతెత్తి అరచిన బాలగంగాధర తిలక్ ...మాటలు వేదమంత్రంలా ఆనాడే కాదు, ఈనాడు కూడా మనల్ని ప్రబోధితుల్ని చేస్తూవుంది. ...వన్నీ దేశ అఖండత్వభావనకు స్ఫూర్తిని కల్గిస్తాయి.

మన దేశంలో గంగ, యమున, బ్రహ్మపుత్ర, కావేరి, తుంగభద్ర, గోదావరి, కృష్ణా ...దులెన్నో ప్రవహిస్తున్నాయి. ఇవన్నీ ఆయా రాష్ట్రాలకు చెందిన సొంత ఆస్తి కాదు. యావద్భారత ...శప్రజలకు వాటిపై సమానమైన హక్కు వుంది. ఈ నదులు ఆయా రాష్ట్రాలలోనే పుట్టి ...క్కడే నిలిచిపోవడం లేదు. దేశం పొడుగునా ప్రవహిస్తూనే వున్నాయి. దేశ ప్రజలు సమిష్టి ...ఖం కోరే ఏ రాష్ట్రమైనా ఆయా నదుల జలాలు తమ రాష్ట్ర ప్రజలకే పరిమితమైనవని చెప్పదు. ...లానికే మరో పేరు ' జీవనం' అంటే ప్రాణానికి పర్యాయపదం 'జలం'. ప్రజలందరి సుఖ

జీవనానికే సుజీవనానికి మారు పేరైన జలాలను ఏ రాష్ట్రానికా రాష్ట్రం అష్టదిగ్బంధనం చేస్తే దేశ సమైక్యత, సమగ్రత అనే మాటలకు అర్థం లేకుండా పోతుంది. కాబట్టి, ఈనాటి అస్తవ్యస్త పరిస్థితుల్లో మనమందరం సొంతలాభం కొంతమానుకొని పొరుగువాడికి తోడుపడడం లో మనకొచ్చే నష్టమేమీ లేదనుకుంటాను.

ఇప్పుడు దేశ ప్రజలందరూ కలసి యిలా ఎందుకనుకోకూడదు ? " All rivers in India are collective property of the people. If is not an exclusive property of a single State. No State can claim ownership over the river or rivers flowing in their state, and hence an important bill should be passed in the Parliament declaring that all the rivers in India belong to National Property. Keeping in view of the interest of the National rivers are to be diverted towards irrigation and drinking water facilities of all the people, for the over - all development of the Country.

ఇటువంటి కీలకమైన నిర్ణయాలు ప్రభుత్వపరంగా తీసుకొన్నప్పుడు, ప్రజలలోను సహజీవన సౌభ్రాతృత్వ భావన పెంపొందినప్పుడు దేశం సస్యశ్యామలమై '' సుజలాం సుఫలాం మలయజ శీతలాం'' అన్న 'వందేమాతరం' గేయం సార్థకమౌతుంది. మన కీనాడు కావలసింది వట్టి మాటలు, తీయని పాటలు కావు, గట్టిమేలును కల్గించే గట్టిచేతలు, నిర్మాణాత్మక కార్యక్రమాలు. ఇవి జ్ఞప్తిలో ఉంచుకొని రాజకీయ నాయకులు ప్రవర్తించవలసిన సమయం ఆసన్నమైంది.

స్వాతంత్ర్యానంతరం భారతదేశ ప్రజల భావనలో, జీవన విధానంలో, ఆలోచనాసరళిలో అనూహ్యమైన మార్పులు చోటు చేసికొన్నాయి. ఈనాడు దేశ ప్రజల సమిష్టి క్షేమాన్ని గురించి ఆలోచించే వాడెవడూ కన్పించడం లేదు. దీనికి తోడు, ఆంధ్రమాత, కన్నడమాత, తమిళమాతలను ఆరాధిస్తూ భారతమాతను మరచిపోయారు భరతపుత్రులు. ఇటువంటి వేర్పాటు ధోరణి , ప్రాంతీయాభిమానాలు బలిసిపోతాయనే జవహర్‌లాల్ నెహ్రూ మొట్టమొదట భాషా ప్రయుక్త రాష్ట్రాలననేమిరా వద్దన్నారు. కాని, విధిలేని పరిస్థతుల్లో అవన్నీ ఏర్పడడం జరిగిపోయాయి. ఇక, ఇప్పుటికైనా విద్యావంతులైన వారు పూనుకొని దేశసమైక్యతకు కృషి చేయవలసిన అవసరం గుర్తించాలి! ఆ దిశగా చేయవలసిన పనికి నడుంకట్టాలి!

## సాంఘిక సమైక్యత (Social Integration)

సంఘంలో అనమానతలున్నంతకాలం సమైక్యత సాధింపబడదు. ఈ అడ్డంకుల్ని మనమే తొలగించుకోవాలని శ్రీ వివేకానందులు చెప్పారు. వర్ణభేదాలు, ప్రాంతభేదాలు, మత బేధాలతో

కొట్టుమిట్టాడుతున్న మన దేశంలో వాటిని తొలగించి, అందరికీ సమాన అవకాశాలను కల్పించాలని మహా పురుషులు కృషి చేశారు.

" లేడు మ్లేచ్ఛుండును, లేడు నస్పృశ్యుడు
నరజాతియైన యెల్లరము నొకడె" [13]

అనే వివేకానందవాణిని ప్రజలందరూ విన్నారు. ఆచరణ పెట్టారు

" తిన తిండియు కట్టబట్టయు
జనుల కొనగలేని జాతి జాతియె" [14]

అని నిలదీసి అడిగారు కవులు! పాలకులలో మనసుకు, మాటకు, చేతకు ఏకరూపత అనగా త్రికరణ శుద్ధి లేక పోవడం వల్లనే జాతీయతకు విచ్ఛిత్తి కల్గుతుంది. సమాజంలో ఆర్థిక అసమానతలు ఐకమత్యాన్ని దెబ్బతీస్తాయి. ఈ స్థితిని తొలగించితే తప్ప జాతీయ సమైక్యతా భావం పటిష్ఠ కాదు. వేర్పాటు ధోరణిని సంఘంలో ప్రతి ఒక్కరూ ప్రతిఘటించాలి. అప్పుడందరికీ సమాన అవకాశాలు లభించి సమైక్యత సాధింపబడుతుంది.

## మత సమైక్యత (Religious Integration)

ఈనాడు మతప్రమేయం లేని లౌకికరాజ్యం మనకు ఏర్పడిందంటే, ఆనాడు తిలక్, గాంధీజీలు చేసిన అపారకృషివల్లనే అన్న సంగతి మనం మరచి పోరాదు. మతోన్మాదం జాతి సమైక్యతకు ప్రమాదకరం. విచ్ఛిన్నకరశక్తుల్ని పాలకులు అదుపులోకి తీసుకోవాలి.

తిలక్, హిందూ ముస్లింల సఖ్యతకోసం ఆనాడు ప్రారంభించిన గణేష్ఉత్సవాలు ఒక్క మహారాష్ట్రలోనే కాదు, ఈనాడు యావద్భారత దేశంలో ప్రజలు ఆనందోత్సాహాలతో జరుపుకుంటున్నారు. ఇది మత సమైక్యతకు ఎంతో దోహదం చేస్తున్నది. దీనిచే " సదవగాహన" పెంపొంది ప్రజలలో 'ఐకమత్యం' ఏర్పడుతుంది.

ఆంగ్లేయులు హిందూ ముస్లింల మతపరమైన మనోభావాలను దెబ్బ తీసే విధంగా క్రీ.శ. 1857 లో ప్రవర్తించారు. ఆవు కొవ్వు, పంది కొవ్వులతో తయారుచేసిన తూటాలను ఇవ్వడం చేత సైనికులు తిరుగుబాటు చేయడంతో ప్రథమ భారత సంగ్రామం 1987లో ప్రకటింపబడింది. ఈ తిరుగుబాటులో మొట్టమొదటిగా బలైన యోధుడు మంగళ పాండే. ఆంగ్లేయుల చర్యకు వ్యతిరేకిస్తూ ఆయన 1857 జనవరి 29వ తేది ఒక ఆంగ్ల సైనికాధికారిని

కాల్చి చంపడమే దీనికి ప్రధాన కారణం! హిందూ ముస్లిం విభేదాలను మరచి సైనికులందరు
ఢిల్లీ చేరి 'బహదూర్‌షా'ను చక్రవర్తిగా ప్రకటించారు.[15] ఈ విధంగా ఆనాడు సాధింపబడి
'మత సమైక్యత' పై బ్రిటిష్ వారు చావు దెబ్బతీశారు. ఆ కుతంత్రం నుండి దేశాన్ని రక్షించార
అప్పుడి దేశనాయకులు. కాని, బ్రిటిష్ వాడు పోతూ పోతూ దేశాన్ని రెండు ముక్కలుగా చే
వెళ్లాడు. అది ఆంగ్లేయుడి కుటిల రాజనీతి కి నిదర్శనం.

ఇట్టి పరిస్థితుల్లో మనం గురజాడ వారి దేశభక్తి గీతాన్ని స్మరింపక తప్పదు.

మతంవేరై తేను ఏమోయ్!
మనసు వొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయ్!! [16]

స్వామి వివేకానంద యిలా చెప్పారు

ఆత్మహైందవమ్ము నంగ మిస్లాముగా
దలపవలయు భారతమున కెపుడు
నిరువురందు గలుగ నిట్టినిర్ణయమిక
వారి వంటి వారు వసుధ లేరు. [17]

అని వ్రాశారు ' వందేమాతరం' కావ్యంలో ముదిగొండవారు. '' హిందూ ముస్లిం భాయీ
భాయీ!'' అనే నినాదం దీని నుండి పుట్టినదే!

చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్!![18]

అన్నారు గురజాడ! ఈనాడు భారతదేశంలో విభిన్నమతాలు, విభిన్న సంప్రదాయాలు, కల
మెలసి సహజీవనం సాగించవలసిన అవసరం ఎంతైనా ఉంది. దీని వల్ల సాంస్కృతిక, సామాజిక
ఐక్యతలు సాధింపబడడమే గాక, ఆర్థిక పురోగతి కూడ వీలవుతుంది. ఒకరి మత విశ్వాసాలను
మత భావాలను మరొకరు ఆదరించి గౌరవించడం నేర్చుకోవాలి, విమర్శించకూడదు. అప్పుడే
మత సమైక్యత సాధ్యమవుతుంది.

## సాహిత్య సమైక్యత (Literary Integration)

భారతదేశంలో ఎన్ని మతాలో, అన్ని భాషలున్నాయనడం వాస్తవం. ఒకరి భాష మరొకరికి తెలియక పోవడం వల్ల అభిప్రాయభేదాలు, లేనిపోని అనుమానాలు, సందేహాలు తలెత్తుతాయి. ఈనాడు మనం భాషాప్రయుక్త రాష్ట్రాలను ( Linguistic States) ఏర్పాటు చేసుకున్నప్పటికీ ఈ విభేదాలింకా పూర్తిగా తొలగిపోలేదు. అమరజీవి పొట్టి శ్రీరాముల ఆత్మార్పణం వల్ల ఆంధ్రదేశం అవతరించినప్పటికీ రాష్ట్రంలోని విభిన్న భాషాభాషీయుల మధ్య సఖ్యత, అవగాహన ఏర్పడడం ఎంతైనా అవసరం.

సాహిత్య నిర్మాణంలో సంప్రదాయం యొక్క స్థానం కవులందరిచే అంగీకరింపబడింది.

వెనుక చూసిన కార్యమేమోయ్
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనకవడితే వెనకెనోయ్ [19]

అన్న గురజాడ, అభ్యుదయభావాలు కలవాడు. నన్నయ్య చెప్పిన 'గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్' అన్న మాటను గురజాడ విమర్శించినట్లు తెలుస్తున్నది. గురజాడ వారి అడుగు జాడల్లో నడుస్తూ డా॥ సి. నారాయణ రెడ్డి గారు –

అంత కడవెడు పాలపై నొ
క్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతము లోపల
మంచి, అదియే సంప్రదాయం![20]

అన్ని చెప్పగా శ్రీ శ్రీ

చూచావా ఆరుద్రా! ఓ తమాషా!
సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా!!
సంప్రదాయం తాతముత్తాల నాటి ధనం! [21]

అన్నారు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు -

ఒక జాతి జాతీయతకు సంప్రదాయమ్ము
ప్రాణభూతమ్మది ప్రాణశక్తి!
భద్రమ్ముగా చూడ పై మెఱుంగులు లక్ష
సంప్రదాయమ్మును చంపలేవు
పై మెఱుంగుల యందు బ్రాణశక్తి భ్రాంతి
తనరిన జాతీయతయు నశించు
సంప్రదాయేతర చటుల ధీ సంభూత
విప్లవానిలములు వీవకుండ
ఆంధ్రముల యందు సంవ్యాప్తమైన పంచ
భూతముల గుణంబుల భద్రముగ మహాంధ్ర
గగన గుణ సంప్రదాయ రక్షా విభూతి
తనరు గావుత యోగ్యహస్త గతగమగుచు [22]

సంప్రదాయానికి నివాళులర్పించారు. [23]నవ్యసంప్రదాయ వాదిగా, నవ్యసాహిత్యాన్ని నిర్వచించారు నీరాజనం పట్టారు. అలాగే నవ్య సాహిత్య రచయితలకు చక్కని సూచనలందించారు [24]. భారతదేశంలో ఎవరి భాషా సాహిత్యాలు వారికి గొప్పవి. తక్కిన వారు దానిని తక్కువగా అంచనావేయరాదు. భావజాలానికి చెందిన ఈ అగాధం మరింత పెద్దది కాకుండా సమన్వయపరచడానికే పండిట్ జవహర్ లాల్ నెహ్రూ, భాషా ప్రయుక్త రాష్ట్రాలను విధి లేని పరిస్థితుల్లో అంగీకరించినా, వెంటనే జాతీయ స్థాయిలో విభిన్న భాషల మధ్య ఐక్యత సాధింపబడాలని యోచించి, కేంద్ర సాహిత్య అకాడెమీని స్థాపించారు. ఈ అకాడెమీ, భారతదేశంలోని వివిధ భాషా సాహిత్యాలను అనువాదాల ద్వారా, తులనాత్మక సాహిత్య పరిశోధనల ద్వారా అందరికీ అందుబాటులో తెస్తున్నది. దీనిచే దూరాలు సమసిపోయి, అపోహలు తొలగిపోయి భావవినిమయం జరిగి సాహిత్య సమైక్యత సాధింపబడుతూ ఉన్నది.

## సాంస్కృతిక సమైక్యత (Cultural Integration)

భిన్నత్వంలో ఏకత్వం కల్గిన భారత దేశంలో సాంస్కృతిక సమైక్యత సాధింపబడడం కష్టమేమీ కాదు. దేశ, కాల పరిస్థితుల ప్రభావం చేత ఒక్కొక్క దేశంలో జాతీయ సమైక్యత ఒక్కొక్క రకంగా దెబ్బతింటుంది. చారిత్రకన్నుహ దానిని కొద్దిగా మేల్కొల్పగా,

మహాపురుషులవతరించి ఆ సమన్వయాన్ని పూర్ణంగా ఆవిష్కరిస్తారు.

భారత జాతీయ సమైక్యతా నిర్మాత (Builders of the Nation) లెందరో ఉన్నారు. వారిలో వైష్ణవ ఆళ్వారులు, శైవనాయన్మారులు దక్షిణ భారతదేశంలో భక్తి ఉద్యమానికి (Bhakti Movement) నాంది పలికారు. దీన్ని యావద్భారత దేశంలో వ్యాపింప జేసి సాంస్కృతిక సమైక్యతను సాధించిన వారిలో తొట్టతొలి ఆచార్యులు శ్రీ ఆదిశంకరులు (క్రీ.శే. 8వ శతాబ్ది). వీరి తర్వాతనే శ్రీ రామానుజ, మధ్వాచార్యులు, బసవేశ్వరుడు, మీరాబాయి, చైతన్యమహాప్రభువు, కబీర్ ;నానక్, వేమన, సూరదాస్, తుకారాం, మొదలైన వారెందరో సత్పురుషులు, సంత్, సాధు పుంగవులు, కవులు, కళాకకారులు, వాగ్గేయకారులు, దేశసాంస్కృతిక ఐక్యతకు ఎంతో దోహదం చేశారు. ఈ సందర్భంలో విద్యార్థి దశలో నేను వ్రాసిన ఒక ఆంగ్లగేయంలో వాక్యాలు నా స్మృతిపథంలో వస్తూవుంది.

The team that lifts the Trophy<br>
Is not the work of one!<br>
The Nations's progress in its furn<br>
Has the work of everyone !!

'సంస్కృతి' అనేది నాగరికత యొక్క సారభూతమైన అంశం!(Culture is the essence of civilisation) సంస్కృతి జాతి యొక్క ఆత్మద్రవ్యం!

స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో స్త్రీ పురుషులు ఎంతో విద్యావంతులైనప్పటికీ మన దేశీయ సంస్కృతీ విలువల పట్ల ఒక విధమైన ఔదాసీన్యం, తూష్ణీంభావం, నిరాదరణ, జిజ్ఞాసారాహిత్యం చోటుచేసికోవడం నానాటికీ అధికమవుతూవుంది. అంత పెద్దగా విద్యావంతులు గాని సగటు భారతీయునిలో కూడ ఏదో ఒక విధంగా ధనం సంపాదించాలన్న తపన, యావ (craze) స్పష్టంగా కనబడుతున్నది. ఇక విద్యావంతులు సరేసరి! ఎన్ని విధాలుగా, ఎన్ని రకాలుగా సంపాదనకు వీలున్నదో అన్ని మార్గాలలో ధనాన్ని రాబట్టుకోవడానికి అహర్నిశలు కృషిచేస్తున్నారు. ఈ కృషిలోని భాగంగానే విద్యావంతులందరూ పాశ్చాత్యదేశాలకు వెళ్లి అక్కడే స్థిరనివాసం కల్పించుకుంటున్నారు. ధనం ఒక్కటే జీవితపరమావధికాదు. మరికొందరు ప్రబుద్ధులు నైతిక విలువలకు కూడ తిలోదకాలిచ్చి అన్యాయంగా, అక్రమంగా డబ్బు సంపాదిస్తున్నారు.

దీనికంతటికీ ప్రధానకారణాలు మితిమీరి పోయిన యాంత్రిక నాగరికత, సుఖలాలసత, మానవీయ సంబంధాలు లుప్తం కావడం. జీవన విధానంలో ఒక నిబద్ధత, నిజాయితీ లేక

పోవడం, అధ్యాత్మిక పార్శ్వాన్ని పూర్తిగా మరచిపోవడం, జీవితానుభావాలను చాలా తేలిగ్గా తీసుకోవడం (Take is easy policy) మొదలైనవి చెప్పవచ్చు.

ఆధునిక పాశ్చాత్య జీవన విధానాన్ని ఆ భాషా రచయితలే దుయ్యబట్టారు. నిశితంగా విమర్శించారు. అటువంటి జీవన విధానాన్ని మన వారు అనుసరించడం ఎంత మాత్రము మంచిది కాదు. టి.యస్. ఎలియట్, వేస్ట్ ల్యాండ్, హోలోమెన్ వంటి గ్రంథాలలోను, సిగ్మండ్ ఫ్రాయిడ్,Civilisation and its discontents [25] అనే గ్రంథంలోను ఆధునిక పాశ్చాత్య నాగరిగతను సునిశిత విమర్శకు గురిచేశారు. P.A. Sorokin అనే రచయిత Reconstrution of Humanity [26] అనే గ్రంథంలో మానవజాతి యావత్ప్రపంచంలో పునర్నిర్మింపబడవలసిన ఆవశ్యకత ఉందని గట్టిగా విశ్వసించాడు. V.S. Naipaul, India - A Wounded Civilisation [27] అనే గ్రంథంలో మన నాగరికత ఎన్నో విలువలు కోల్పోయి నిర్జీవ స్థితికి దిగజారిపోతున్నదని అంగలార్చాడు. విశ్వనాథ వారు వేయిపడగలు (1932) నవలద్వారా నిరూపించినది మన మహోన్నత సాంస్కృతిక వారసత్వమే [28]. అయితే, పాశ్చాత్య నాగరికత ప్రభావం వల్ల దేశీయమైన అనేక కళలు, విద్యలు నశించిపోయినవి, ఆర్థిక దృష్టి మనిషిలో ప్రబలిపోయిందని, నైతిక విలువలు నశించాయనీ వాపోయి చిట్టచివరికి ఒక్క గృహస్థాశ్రమమే మన దేశంలో మిగిలిందని, ఆ దాంపత్య జీవనం పవిత్రంగా ఉంటే చాలు, ఎన్ని నశించిపోయినా పరవాలేదు, దానినైనా పరిరక్షించుకోండి అని హెచ్చరించాడు. ఈనాడు ఆ గృహస్థాశ్రమ వ్యవస్థ కూడా విచ్ఛినమౌతున్న పరిస్థితుల్ని మనం చూస్తున్నాం! ఏం చేయాలో తెలియడం లేదు. భారతీయుడు ఎటువైపు పోతున్నాడో అంతుబట్టడం లేదు.

## ఆధ్యాత్మిక సమైక్యత (Spiritual Integration)

సాంస్కృతిక పునరుజ్జీవనం (Cultural Renaissance) జరిగినప్పుడే ఆధ్యాత్మిక సమైక్యత కూడ సాధింప బడుతుంది. షిర్డీసాయి, పుట్టపర్తిసాయి బాబా, శ్రీ రంగనాథానంద, చిన్మయానంద, మహర్షి మహేష్ యోగి, కల్కి భగవాన్, గణపతి సచ్చిదానంద ముని వంటి మహాపురుషులెందరో ఆధ్యాత్మిక సమైక్యత కోసం ఈ రోజు కృషిచేస్తున్నారు.

ఆధ్యాత్మిక సమైక్యత అంటే చెల్లాచెదరై పడివుండే పారమార్థక భావాలనన్నింటిని ప్రోగుచేయడం, వాటిని సమన్వయ పరచి అధునికులకు అర్థమయ్యే తీరులో వివరించడం.

స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో బాలగంగాధర్ తిలక్, 'భగవద్గీత' కు ఒక కొత్తవ్యాఖ్యానం వ్రాశారు. ఆ గ్రంథం 'భగవదీతారహస్యం'[29] – ఇది ఆనాడు ప్రజల్ని ఎంతో ఉత్తేజపరచి

మార్గదర్శకత్వం చేసింది. వేదాంతం యొక్క అంతిమలక్ష్యం మానవుణ్ణి 'నిత్యకర్మశీలి' గా మలచడమే! అతడే 'కర్మయోగి' అని చెప్పారు తిలక్. స్వామి వివేకానంద, వేదాంత మనేది పుస్తకాల్లోని మాటల్ని చిలకపలుకుల్లా వల్లించడం కాదు. ఆచరణలోకి రాని వేదాంతం వ్యర్థమన్నారు. అందుకే, ఆయన అనుష్ఠాన పూర్వకమైన వేదాంతమే నిజమైన వేదాంతమన్నారు. అంటే, మాటలు కాదు, చేతలు అవసరం, అని జాతి ఆనాడు గుర్తించి స్వామి వారి అడుగుజాడల్లో నడిచింది.

గాంధీజీ ఉద్యమంలోని సత్యాగ్రహం – ఎదుటి వ్యక్తిలోని దైవత్వాన్ని మేల్కొల్పడం. అహింస అంటే విరోధం లేని భావం నుండి, ఆత్మీయతాభావం నుండి, క్షమాగుణం నుండి పుట్టే ఒక మహాశక్తి! అంతే తప్ప, అసమర్థుడి చేతకాని తనం కాదు. రాజకీయ ఉద్యమాన్ని ఆధ్యాత్మిక మార్గంలో నడిపించిన ఘనత గాంధీజీది!

ఈ దశలోనే మానవేంద్ర నాథరాయ్ (ఎం.ఎన్.రాయ్) నవ్యమానవ వాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. మానవ జీవనవికాసంలో కేవలం భౌతికవాదం పరిపూర్ణత తేలేదని, నైతికమూల్యాల (Moral Values) ప్రాధాన్యం గుర్తించవలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పారు.

దివ్యజ్ఞాన సమాజం నుండి బయటపడిన జిడ్డు కృష్ణమూర్తి ఆధునిక భారతీయ తత్త్వవేత్త! ఆయన వ్యక్తిస్వేచ్ఛను, స్వతంత్రంగా ఎదగవలసిన అవసరాన్ని ప్రకటించిన వాడు. మహాభాగవతంలో – ఉద్ధవ శ్రీ కృష్ణసంవాదంలోని వాక్యాలు జిడ్డు కృష్ణమూర్తి గారికి ప్రేరణ కల్గించి వుంటాయని నేను భావిస్తున్నాను.

> '' తను నుద్ధరించుఁబో – తానెవివేకి
> తనకు విశేషించి – తానె గురుండు''[30]

''ఎవడికి వాడే గరువు'' అన్నది శ్రీకృష్ణుని ఆధ్యాత్మిక చరమ సందేశంగా కనబడుతుంది. ఇందులో పూర్వార్ధం – గీతలో ఉద్ధరేదాత్మానాత్మానమ్ ఆత్మానమవసాదయేత్॥ ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః॥ [31]

ఇది శ్రీ శంకరభగవత్పాదుల వారు వివేకచూడామణిలో ' స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే' [32]– అన్నట్లున్నది. 'జీవుడు తన స్వరూపాన్ని తాను చక్కగా తెలుసుకొంటే చాలు! అదే భక్తి! వెంటనే దేవుడంటే ఏమిటో తెలుస్తుంది అంటారయన! దీనినే శ్రీ రమణ మహర్షులు '' నేనెవరు!'' అనే ప్రశ్న వేసుకో '' నిన్ను నీవు చక్కగా తెలుసుకొంటే, ఆ భగవత్తత్త్వం నీకు వెంటనే అర్థమౌతుంది''.

ఆ'నేను''నీవు' కాదు - అరుణాచలంలోని శివుడే! '' దేహం? నాహం! కోఽహం
సోఽహం!''[33] అన్నది శ్రీరమణమహర్షులు ఆధ్యాత్మిక సాధనాసూత్రం.

''భారతీయ చింతనకు మరో స్పష్టమైన దర్శనాన్ని అందించిన మహాపురుషు
దీనదయాళ్ ఉపాధ్యాయ. ఈయన ఏకాత్మ మానవతావాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించార
దీనదయాళ్ దృష్టిలో జీవితం ఏకాకారమైంది. జీవితంలోని అన్ని అంశాల
అవినాభావసంబంధముంది.ఈ అంశాల్లో వైరుధ్యాలను తొలగించి సమన్వితదృష్టి
చూచినప్పుడే జీవన లక్ష్యం సిద్ధిస్తుంది. శరీరం, మనస్సు, బుద్ధి, ఆత్మ వీటికి సమన్వయ
అవసరం. అట్లాగే పరస్పర విరుద్ధంగా కనిపించే ద్వంద్వాలు సమసినప్పుడే పూర్ణదృ
ఏర్పడుతుంది. వ్యక్తి శ్రేయస్సు, ప్రేయస్సు రెండూ లభిస్తాయి. ఈ రెంటినీ స్వీకరించినప్పు
ధర్మం అధారమౌతుంది. పరిత్యజించేటప్పుడు మోక్షం లభ్యమౌతుంది. ధర్మం నుండి మోక్ష
దాకా ఉన్న నాలుగు పురుషార్థాలు ఏకాత్మకములే! అనుస్యూతి కలిగినవే! ప్రతి విలువ, ప్ర
సూత్రం ధర్మానికి లోబడి ఉండాలి ''అని ఆయన ప్రతిపాదించారు.''[34]

శ్రీ అరవిందుల సమన్వితదృక్పథం (Integral Approach) దీనదయా
ఉపాధ్యాయగారి అన్వేషణకు మూలస్థానం! సమాజ పరిణామదృష్టిలో శ్రీ అరవిందు
'స్వధర్మం'[35] ప్రధానంగా పెర్కొన్నారు. జాతీయవాదం ఆత్యంతిక శిఖరం కాదనీ, చరమలక్ష్య
మానవజాతి సమైక్యతలోనే ఉన్నదని ఆయన స్పష్టం చేశారు.

జాతీయ సమైక్యత నిలబడాలంటే సాంస్కృతిక, ఆధ్యాత్మిక ఏకతలను విచ్ఛిన్న
కాకుండా చూచుకోవడమే కావలసింది. మన సంకల్పం '' భారతీయ అఖండత్వభావన
విశుద్ధమైన ఆచరణమే ప్రజల విశ్వాసాన్ని చూరగొంటుంది. ఈనాడు మనకు కావలసిం
ఆధ్యాత్మిక సాంస్కృతిక ప్రజాస్వామ్యం! ( Spiritual and Cultural Democracy) దాని
రూపొందించుకోవాలనే మన ఏకైక లక్ష్యం కావాలి!

దేశసమైక్యతను భావించిన అథర్వవేదమంత్రంతో ఈ ఉపోద్ఘాతాన్ని ముగిస్తాను.

జనం బిభ్రతీ బహుధా వివాచసం
నానాధర్మాణాం పృథివీ యథేకసమ్।
సహస్రంధారా ద్రవిణస్య కురుహాం
ధ్రువేవధేను రనపస్ఫు రన్తీ॥[36]

ఈ నా మాతృభూమి అనేక భాషలు, అనేక ఉపాసనామార్గాలు కలిగిన ఈ జనులందరికీ సమానంగా నివాసం కల్పిస్తున్నది అని చెప్పే వేదమంత్రం మనకెప్పుడూ ప్రేరణ కల్గించుగాక!.

''ఆనోభద్రాః క్రతవో యంతు విశ్వతః''[37] ప్రపంచం నలుమూలల నుండి మహాభావాలు ఒక చోటికి వచ్చి చేరునుగాక!

## పాదసూచికలు

1. SRI AUROBINDO - Collected works, Vol. IV, writings in Bengali - letters to Smt. Mrinalini Devi, wife of Sri Aurobindo (1905 - 1907)

   - (Sri Aurobindo Birth Centenary Library)
     Sri Aurobindo Ashram, Pondicherry, 1972, pp. 317 - 326

2. SRI AUROBINDO - Collected works, Vol.I, Bande Mataram, Early Political writings - I (1890 - 1905) Bhawani Mandir

   - (Sri Aurobindo Birth Centenary Library)
     Sri Aurobindo Ashram, Pondicherry, 1972, P - 65.

3. గురజాడ అప్పారావు, ముత్యాల సరాలు, సంపా., వాసిరెడ్డి భాస్కరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. ఆరవ ముద్రణ 1972, పుటలు 60-63.

4. అపి స్వర్ణమయీ లంకా నమాం లక్ష్మణ రోచతే।
   జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥
   – వాల్మీకి రామాయణమ్

5. జి.వి. కృష్ణారావు, ప్లేటో ఆదర్శరాజ్యం (Plato's Utopia)

6. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
   స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ – భగవద్గీత, 3-35

   స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి।
   ధర్మ్యాద్ధియుద్ధాత్ శ్రేయోఽన్యత్ క్షత్రియస్యన విద్యతే॥

   అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
   తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి॥ – భగవద్గీత 2 - 31, 33 శ్లో

   ఈ మూడు శ్లోకాలకు భావాలివి : ''తనధర్మమెంత గుణహీనంగా ఉన్నప్పటికీ, ఇతరుల ధర్మం తానెంత చక్కగా పాటించినప్పటికీ, పరధర్మం కంటె స్వధర్మమే మేలు.

స్వధర్మ మాచరించడంలో మరణం సంభవించినా మేలే. పరధర్మాన్ని ఆచరించడం భయంక
కూడుకొన్నది.''

'' పార్థా! నీస్వధరాన్ని అనుసరించి అంటే క్షత్రియధర్మాన్ని అవలంబించి యుద్ధ
చేయడానికి జంకవద్దు. ఉత్తమ క్షత్రియుడికి ధర్మయుద్ధం కంటె శ్రేయస్కరమైన కార్య
మరొకటి లేదు. నీ స్వధర్మమైన ధర్మయుద్ధమనే కర్తవ్యాన్ని నీవు ఆచరించక పోతే, ధర్మహాని
కర్తవ్యతాలోపం సంభవించి పాపం వస్తుంది. నీవు అపకీర్తి పాలవుతావు''. స్వధర్మమ
మాటకు భిన్నసమన్వయాలు చేశారు. స్వధర్మమంటే తన మతము, స్వధర్మమంటే త
కర్తవ్యం స్వధర్మమంటే భగవంతుడు గీతలో చెప్పిన కర్మయోగం – ఇలా ఎన్నో ఉన్నాయి

7. నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయోన విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్యత్రాయతే మహతో భయాత్॥ – భగవద్గీత 2 –40

ధర్మమార్గంలో ఎంతవరకు కృషిచేస్తే అంతకు తగిన ఫలితం లభిస్తుంది. మధ్యల
విడిచివేసినప్పటికీ విపరీత ఫలితాలు కలుగవు. ధర్మాన్ని ఏ కొద్దిగా అనుష్ఠించినప్పటికీ
అది జీవితంలోని మహా భయం నుండి రక్షిస్తుంది.

8. ధర్మ ఏవ హతో హంతి ధర్మోరక్షతి రక్షితః।
తస్మాద్ధర్మోన హంతవ్యో మానో ధర్మో హతోఽవ ధీత్ ॥ – మనుస్మృతి (8–15)

''ధర్మాన్ని అతిక్రమిస్తే అది సర్వనాశనానికి దారితీస్తుంది.
ధర్మాన్ని పరిరక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది.
కాబట్టి ధర్మాన్ని ఎప్పుడూ అతిక్రమించకూడదు.
అలా చేస్తే, ధర్మం మనల్నే నశింపజేస్తుంది.

త్యజేస్త్వమితి మే బుద్ధిర్నతు ధర్మం పరిత్యజేః ।
రాజానం ధర్మగోప్తారం ధర్మోరక్షతి రక్షితః ॥

– వ్యాస మహాభారతము అరణ్యపర్వము (అధ్యా 31–శ్లో 7)

ద్రౌపది ధర్మరాజుతో యిలా అంటున్నది. '' రాజు తనను తాను పరిత్యజించుకోవచ్చు
కాని, ధర్మాన్ని మాత్రం పరిత్యజించకూడదు. ఎందుకంటే, రాజు ధర్మాన్ని రక్షించేవాడు.
ఎవడు ధర్మాన్ని రక్షిస్తాడో అది వానిని రక్షిస్తుంది.''

9. The Basic Unity underlying the Diversity of Indian Culture - Origins and Meanings.- Dr. Suniti Kumar Chatterjee, See : Indian Culture, Pub : A Universal Publication, Delhi 1966, pp, 39-68

10. All Men are Brothers - Mahatma Gandhi ed., G.B. Kripalani, Navjivam Book Trust, Ahmedabad.

11. ముదిగొండ వీరభద్రమూర్తి – వందేమాతరమ్ (జాతీయ కావ్యం)

12. డా॥ ముదిగొండ వీరభద్రయ్య – జాతీయ ఇతిహాస కావ్యం – వందేమాతరమ్ – వస్తు శిల్పాల విమర్శ ప్రచురణ : జాతీయ సాహిత్య పరిషత్, భాగ్యనగరం, 1996, పుటలు 16–17

13. ముదిగొండ వీరభద్రమూర్తి – వందేమాతరమ్, క్షామఖండం పద్యం – 31 పుట – 241

14. పై గ్రంథమే, వివేకానందఖండము, ప – 41, పుట 243

15. డి. నందకిశోర్, చరిత్ర పుటలలో మహోన్నత అధ్యాయం – భారత స్వాతంత్ర్య సంగ్రామం. ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆదివారం సంచిక, 14 నవంబర్ 1999, పుటలు – 1 –5.

16. గురజాడ అప్పారావు, ముత్యాలసరాలు, పుట – 63

17. ముదిగొండ వీరభద్రమూర్తి – వందేమాతరమ్, క్షామఖండం పద్యం – 180 పుట – 268

18. గురజాడ అప్పారావు, ముత్యాలసరాలు, పుట – 63

19. పై గ్రంథమే పుటలు 61–62.

20. డా॥ సి. నారాయణ రెడ్డి, ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయం – ప్రయోగాలు.

21. శ్రీ శ్రీ రచనలు, (సంపా.) చలసాని ప్రసాదరావు

22. విశ్వనాథ సత్యనారాయణ, దీవెనలు, జనవరి, 1957 చూ॥ కేదారగౌళ (ఖండకావ్య సంపుటి) –2, 1972, పుట –26

23. ''సాహిత్యమంటే ఒక జాతి యొక్క సంస్కారం. మన జాతి పూర్వం ఒక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో సృష్ట్యాది నుండి కాలనిర్ణయంలో, సంఘధర్మనీతులలో, ఆర్థిక, రాజకీయాలల్లో, సారస్వతపథాలల్లో ఒక విశిష్టమైన సంస్కారంతో కూడిన సిద్ధాంతాల మీద మన జాతి నడిచింది. ఆంగ్లేయులు మనల్ని ఆక్రమించడం చేత ఆ మహాసంస్కారం మీద అభిమానం పోయింది. పాశ్చాత్యదేశీయుల సంస్కారం మీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం,చరిత్ర నిర్మాణం, సృష్ట్యాది కాలన్నిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, వీటిని యేయే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం.''– నవ్యసాహిత్య పరిషత్ సప్తమవార్షికోత్సవ అధ్యక్షోపన్యాసం విశ్వనాథసత్యనారాయణ, భారతి, ఏప్రిల్ 1940, పుటలు 500–506, మరియు చూ॥ విశ్వనాథ అసంకలితసాహిత్యం సం. –2, వరంగల్, 1995, పుట –12

'' నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని జాతీయమై యుండవలెను. విజాతీయమైయుండరాదు. అప్పుడే వ్రాసిన వానికి ముక్తి. చదివిన వానికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను పక్షి రాత్రికి గూటికి చేరును. ఇది జాతీయత, సంప్రదాయము. – విశ్వనాథసత్యనారాయణ

నేను – నా సాహిత్య రచనలు, 'మహతి'
యువభారతి, హైదరాబాద్, 1972, పుటలు – 21

24. '' ఏది ఎట్లా ఉన్నా రచయితలందరూ ఒక విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. భావం నీ యిష్టం వచ్చినట్లు చేసుకో! ఆ భావానికి అమలు ఉన్నన్నాళ్లు అది అమలులో ఉంటుంది. భాష మాత్రం అచ్చంగా నీ తెలుగు భాష వాడు. నుడికారం ప్రయోగించడంలో తెలుగు పుస్తకంలో తెలుగుకాని పోకడలు పోవద్దు. ఇది ఒక్కటే లక్ష్యంగా పెట్టుకుంటే నవ్యసాహిత్యానికి భయం లేదు''.

– నవ్యసాహిత్య పరిషత్ అధ్యక్షోపన్యాసం,
విశ్వనాథ, చూ॥ పై వ్యాసం, పుట 15

25. a) Sigmind Freud, Civilisation and its discontents

b) C.G. Jung, The Modern Man is search of a Soul.

''గాఢమైన శీలము చచ్చిన కొలది ప్రాణము ప్రతి సంగతిలోని లోతులు వాంఛింపదు. పై పై మెఱుగులతో తృప్తి చెందును. అదియే నాగరికతయని విఱ్ఱవీగును.''

విశ్వనాథసత్యనారాయణ – వేయిపడగలు, అధ్యా.7 పుట – 132

26. Pitrim A. Sorokin, Reconstruction of Humanity, Bharatiya Vidya Bhavan, Bombay, 1962.

27. V.S. Naipaul, India - A wounded civilisation
- Vikas Publishing House Pvt. Ltd., New Delhi, 1977.

28. డా॥ కె.వి. నరసింహరాఘవన్, వేయిపడగలు – సమకాలీనత – సార్వకాలీనత,
తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1989.
(డా॥ కె.వి. నరసింహరాఘవన్, విశ్వనాథ – ఆర్థికవ్యవస్థ),
అమృతా పబ్లికేషన్స్, హనుమకొండ, 1990

29. లోకమాన్యబాలగంగాధర్ తిలక్, శ్రీమద్భగవద్గీతా రహస్యము
(కర్మయోగ శాస్త్రము) Vol.I , II, III మహారాష్ట్ర భాష నుండి తెలుగు అనువాదం
శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1997.

30. దోనూరి కోనేరునాథ కవి – ద్విపద బాలభాగవతము
అముద్రితసిద్ధాంత గ్రంథం – డా॥ బూదూరు కుసుమాంబ
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి, 1998, పుట – 596

31. శ్రీమద్భగవద్గీత – ఆత్మసంయమయోగము (6–5)
ప్రతి వ్యక్తి తనను తానే ఉద్ధరించుకోవాలి. కాని, అధోగతి పాలుకాకూడదు ఎవడికి వాడే బంధువు. తనకు తానే శత్రువు. ఇక్కడ 'ఆత్మ' శబ్దానికి రెండర్థాలు. 1. జీవుడు, 2. మనస్సు. జీవుడు తనను తాను ఉద్ధరించుకోవాలి. గురువు మార్గాన్ని చూపిస్తాడేగాని ప్రయాణ కష్టం తానే అనుభవించి గమ్యస్థానం చేరాలి. ప్రతి జీవికి తన మనస్సే బంధమోక్షాలకు కారణం. విషయోన్ముఖమైన మనస్సు బంధ (సంసార బంధ) హేతువు. కాబట్టి శత్రువు. ఈశ్వరాయత్తమైన మనస్సు మోక్షహేతువు కాబట్టి బంధువు. మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః అని గీతా వాక్యం.

32. మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥
– శ్రీ ఆదిశంకరుల వివేకచూడామణి, శ్లో 32

33. దేహం మృణ్మయవజ్జడాత్మక మహం బుద్ధిర్నతస్యాస్తతో
నాహం తత్తదపేతసుప్తి సమయే సిద్ధాత్మ సద్భావతః।
కోఽహం భావయుతః కుతోవరధియా దృష్ట్వాత్మనిష్ఠాత్మనా
సోఽహం స్ఫూర్తి తయారుణాచల శివః పూర్ణోవిభాతి స్స్వయమ్
– శ్రీరమణ మహర్షుల ఉపదేశసారమ్

34. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య, భారతపునరుజ్జీవోద్యమం
చూ॥ భావుకసీమ (సాహిత్యవ్యాస సంపుటి)
యువభారతి, హైదరాబాద్, 1993 పుటలు - 11 - 24

35. శ్రీ అరవిందులు ప్రవచించిన 'స్వధర్మము' 'స్వదేశి' 'స్వరాజ్య' మనే భావన లే బాలగంగాధర తిలక్ లో 'స్వరాజ్యమే నా జన్మ హక్కు' అనే నినాదంలోను, 'స్వధర్మం' అంటే ' కర్మయోగ మని' చెప్పి ' భగవద్గీతా రహస్య' మనే సరికొత్త భాష్యం వ్రాయడంలో కనబడుతుంది. ఇక మహాత్మా గాంధీ గారు ' స్వదేశీ ఉద్యమాన్ని' అన్ని స్థాయులలో ప్రబోధించి విదేశీ నాగరికతను, విదేశీ వస్తువులను బహిష్కరించమని ప్రబోధించి ' రామరాజ్య' మనే స్వరాజ్యాన్ని దేశానికి సంపాదించి పెట్టారు. సత్యము అహింసలే స్వధర్మ నిర్వహణలో సాధనాలుగా చేపట్టారు.

36. అధర్వవేదం, 12-1-45

37. ఋగ్వేదం 1-89-1

# ప్రథమాధ్యాయం

## భారతీయసంప్రదాయం - మత,తాత్త్విక, చారిత్రక సమన్వయం

''సమన్వయమే సంప్రదాయం. ఇది ఆంతరం గాని బాహిరం కాదు. ఎడనెడ కాలంవక్రించి, మతకలహధూళిచే అది పొనుగువడిపోగా, సంప్రదాయతత్త్వవేత్తయైన కవిఋషి 'లోకహిత నిష్ఠ'చే దానికి పులిగాపువెట్టి తళతళలాడిస్తాడు'',[1] అని శ్రీగురుపాదుల వాక్కు. అట్టి కవిబ్రహ్మలకు, కవిసమ్రాట్టులకు నమస్కారం.

'అసలు మనమతం ఉపాసనామతం. వైదికమతమని, హిందూమతమని, సనాతనమతమని తరువాత వచ్చిన పేర్లు. ఈ ఉపాసనను సాధించడం ఎలా? ఉపాసన యొక్క ప్రథమస్వరూపం యజ్ఞం,[2] అన్నారు కవిసమ్రాట్ విశ్వనాథ.

''భారతీయ సంస్కారం నిర్మించుకున్న అమూల్య వ్యవస్థలలో యజ్ఞం ఒకటి. ఇది వ్యక్తి తన్నుతాను సమాజరూపమైన, సమష్టి రూపమైన చైతన్యానికి అర్పించుకోవడానికి ఏర్పడ్డ సాంకేతిక ప్రక్రియ. దీనికి కేంద్రం అగ్ని. పంచభూతాలలో నడిమిదైన అగ్ని, పంచకోశాలలో నడిమిదైన మనోమయకోశానికి ప్రతీక! అగ్నియందు స్వాహాకారం చేసే ప్రతి అంశాన్నీ 'ఇది నాది కాదు' (న మమ) అని చెప్పుతూ అర్పించడం భౌతిక ప్రాణిక శక్తులన్నింటినీ సమష్టి మనస్సుకు అర్పించడం. విజ్ఞానమయ, ఆనందమయ లోకాలు, దైవములు. అన్నమయ, ప్రాణమయ లోకాలు మర్త్యములు. ఈ రెంటికీ అనుసంధానని్శ్రేణిక అగ్ని. అందుకే అగ్ని పురోహితుడుగా మర్త్యలోకం చేసే అర్పణాలు దేవలోకానికి అందించేవాడుగా (హవ్య వాహనుడు) ఋగ్వేదం కీర్తిస్తూవుంది''.[3]

ఉపాసనామతం యొక్క తొలిరూపం యజ్ఞం. 'యజ్ఞోహి శ్రేష్ఠతమం కర్మ' (తైత్తిరీయ సంహిత, 5-1-4) అని చెప్పబడిన వైదికమైన యజ్ఞస్వరూపాన్ని వివేచించుకొందాం!

**యజ్ఞమే సృష్టి :** ప్రజాపతి యజ్ఞస్వరూపుడు, అగ్నీ-సోములకు బ్రహ్మాండ కటాహంలోని సూర్యచంద్రులే బాహ్యప్రతీకలు.

'అయం యజ్ఞో భువనస్య నాభిః' (ఋగ్వేదము 1-164-35) ఈ మంత్రభాగంలో శరీర పరిధిలో ప్రవర్తితమవుతున్న యజ్ఞం సంకేతింపబడింది. శరీరంలో యే శక్తి ప్రవర్తితమౌతున్నదో, అది ఛందంచే స్పందితమౌతున్నది.

ఏకమూ, అనేకమూ - ఇవి ప్రజాపతికి రెండురూపాలు
ఏకము - అవ్యక్తము - అనిరుక్త ప్రజాపతి
అనేకము - వ్యక్తము - నిరుక్త ప్రజాపతి

వైదిక పరిభాషల్లో 'అనిరుక్త ప్రజాపతి' కెన్నో పేర్లున్నాయి. అందులో ఒక పేరు గర్భ ప్రజాప
'ప్రజాపతిశ్చరతి గర్భే అంతరజాయమానో బహుధా విజాయతే' (యజుర్వేదమ్, 31-19

బ్రహ్మ యొక్క బృంహణం చేత విశ్వంలో ఆయన అనుప్రవిష్టరూపమేదైతే ఉన్నద
దానిని 'విశ్వచరరూప' మని 'ప్రజాపతి' అని పిలుస్తారు. ఏకం అనేకంకావడమే సృష్టి లక్షణ
ఈ సంకల్పం తొట్టతొలుత ప్రజాపతికి కల్గింది. 'బహుస్యాం ప్రజాయేయేతి', తత్ సృష్ట్వా
తదేవానుప్రావిశత్' అని చెప్పిన బృహదారణ్యకోపనిషత్తు దీనినే విశదీకరించినది.

గూఢం లేదా గర్భితదశలో ఉన్నంతవరకు అతడు అజాయమానుడు. అన
పుట్టబడనివాడు, తెలియబడనివాడు, భార్యలేనివాడు. బిజం-వృక్షం యొక్క అజాయమా
రూపం, అనగా తెలియబడని రూపం. సంపూర్ణవృక్ష స్వరూపమును గర్భీకరించుకొన్న
బీజం. అది వృక్షరూపంలో అనేక జన్మలెత్తుతుంది. అదే ప్రజాపతిరూపం

'ఒంటరియై ప్రజాపతియు నూరక భీతివహించి తోడువాల్గంటిని సృష్టిసేసెనట
ప్రజాపతికి సృష్టియే సకలయజ్ఞం, యజ్ఞానికి పూర్వం ఏ ప్రజాపతియొక్క అవ్యక్తరూ
'తూష్ణీం' లేదా అనిరుక్తమౌతున్నదో, అది సృష్టి లేదా యజ్ఞంలో నిరుక్తమై దృశ
శ్రవ్యమౌతున్నది. అందుకే, ప్రజాపతి ర్వా ఏష యజ్ఞోభవతి. (శతపథ బ్రాహ్మ
**14-1-2-18**) తైత్తిరీయ సంహితలో, యజ్ఞం విష్ణు స్వరూపంగా కీర్తింపబడింది.

'విష్ణుర్వై యజ్ఞః (**2-1.8.3**)
'విష్ణుర్యజ్ఞః (**2-1.9.13**)
'యజ్ఞో వై విష్ణుః (**3-1.10.3**)

**వేది :** మనకందరికీ సుపరిచితమైన 'పీఠిక' అనే మాటకు యాజ్ఞికమైన తొలిరూప
'వేది' అనగా యాజ్ఞికపరిభాషయైన 'వేది' శబ్దమే, సాహిత్య లోకంలో 'పీఠిక'
పరిణమించింది. ఒక్క మాటలో చెప్పాలంటే, యాజ్ఞికపరిభాష నుండి సాహితీలోకం ఎర
(borrowed) గా తెచ్చుకొన్నపదమే 'పీఠిక'. ఇది సాహిత్యానికి స్వతస్సిద్ధమైన పదం కాదు

యజ్ఞంలో 'వేదీ' నిర్మాణం ఒక ప్రధానాంగం. యజ్ఞవేదీస్వరూపం సుస్థిరమైంది. అది మూలాధారం. ఏకైకమైన తత్త్వానికి ప్రతీక 'వేది'. అది 'యోషయొక్క మధ్యమ సంగృహీత' లక్షణాన్ని కల్గియుంటుందని శ్రౌత, శుల్బ సూత్రాలు చెబుతున్నాయి. అంటే వేదీ స్వరూపం 'ఒకయౌవనవతియైన స్త్రీ యొక్క సన్నని నడుము' వలె ఉంటుందని అర్థం.

యజ్ఞంలో 'అగ్నిచితి' ఉంటుంది. ఇది అనేక ఆకారాలు ధరిస్తుంది. సుపర్ణం, శ్యేనం, ద్రోణం, రథచక్రం, ధాన్యరాశి – యిలాంటి అనేక ఆకారాలను ధరిస్తుంది. కాబట్టి, వేది – సుస్థిరవాఙ్మయస్వరూపం-వైదికసరస్వతి, నిఖిలవాఙ్మయదేవత-కాగా, 'అగ్నిచితి' అనేకమైన ఆకారాలు ధరించే సాహిత్య ప్రక్రియల వంటిది. వేది – ఏకైకమైన 'పీఠిక' కాగా, దానికి పర్యాయక్రమంలో వివిధరూపాలతో వెలిగేది 'అగ్నిచితి'. ప్రజాపతి ఒక్కడే. జీవులు అనంతం. వేది ఒక్కటే. అగ్నిరూపాలనేకం. ప్రతి జీవుడూ ఒక విస్ఫులింగం. ఇదే వివిధ సాహితీప్రక్రియలు – వాటిలోని చైతన్యస్ఫూర్తి! అందుకే, సాహిత్యక్షేత్రంలో 'పీఠిక' కు వివిధ స్వరూపాలు, వివిధనామధేయాలు ఏర్పడ్డాయి. 'ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచుపోలిక' అని పోతనగారు చెప్పినట్లు, 'అగ్నిచితి' వివిధాకృతులను ధరించి, సృష్టిలోని జీవులను బహుముఖీనంగా, చైతన్యవంతులుగా తీర్చిదిద్దుతోంది.

> యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః ।
> తథాక్షరా ద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతే తత్ర చైవాపియంతి ॥
>
> (ముండకోపనిషత్, **2-1-1**)

బాగుగా ప్రజ్వలిస్తున్న అగ్నిలో వేలకొలది నిప్పుకణికలు బయల్వెడలి అదే అగ్నిరూపాన్నే ధరిస్తున్నట్లుగా ; అక్షరం, అనశ్వరం శాశ్వతమైన బ్రహ్మపదార్థం నుండి వెల్వడిన జీవులు అనంతకోటిరూపాలను ధరిస్తున్నారు. వారున్నచోటికి సైతం మనం వెళ్లి సందర్శించ వలసివుంటుంది.

ఏ పుట్టలో ఏ పామున్నదో! ఏ జీవుడూ తక్కువ వాడు కాదు సుమా! అని హెచ్చరిస్తోంది ఉపనిషత్తు! పై చర్చను సూత్రప్రాయంగా చెబితే –

**1.** యజ్ఞవేది – ఏకం – ఆత్మ – 'పీఠిక'.

**2.** అగ్నిచితి – అనేకం – శరీరం – 'భూమిక'

ఇక్కడ 'పీఠిక' అంటే స్థిరమైనది – ఒక రథచక్రానికి నాభి, ఇరుసు. 'భూమిక' అంటే రథచక్రనాభినుండి వెల్వడిన వివిధ నాళికలు, వివిధ రూపాలు 'ఏకం సత్ విప్రాః బహుధావదంతి'[5] అన్న వైదిక సూత్రం దీనికి సమన్వయింపవచ్చు. రామకథకంతటికీ యజ్ఞ భూమిలో లభించిన 'సీత' యే 'పీఠిక' యైనట్లు (క్షితి హలకృష్టిబుట్టియుడగెన్ క్షితియందునె సీత'[6] – ఆముక్తమాల్యద), మానవజీవితయజ్ఞానికి మాతృభూమియే వేదిక, పీఠిక! 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' – అని కదా వాల్మీకి!

**వేదీ నిర్వచనం :** ''సా వా ఇయం సర్వైవ వేదిః''

''ఈ సకల భూమియే వేది'' అని వేద నిర్వచనం.

పృథివి యంతయు నీ పాదపీఠముగను
నలవరించి యనంతాకాశమావరించి
అనిల వీచికాస్తంభన మాచరించు
నిన్ను సేవించుచుందు రగ్నివరుణులు [7]

ఇంతకూ 'వేది' శబ్దానికి వ్యుత్పత్తియేమి? 'విద్యతే లభ్యతే ఇతి వేదిః' అని చెబుతూ సాయణాచార్యులవారిలా వ్రాశారు –'యత్తద్విత్తం వేద్యమసురాణామవిందంత తదేకం వేద్యైవేదిత్వమ్' (తైత్తిరీయసంహిత – సాయణ భాష్యము) అసురులబారి పడకుండా ఇంద్రునిచే దేవతలు చేజిక్కించుకొన్న యజ్ఞము యొక్క నిధియే 'వేది'. యజ్ఞైశ్వర్యమే 'వేది' అని స్పష్టీకరించారు.

ఇయం వేదిః పరో అంతః పృథివ్యా అయం యజ్ఞో భువనస్యనాభిః ।
అయం సోమో వృష్ణో అశ్వస్యరేతో బ్రహ్మాయం వాచః పరమంవ్యోమ ॥
(ఋగ్వేదమ్, 1 - 164-35)

– ఈ యజ్ఞ వేదికయే పృథివికి అవలిహద్దు. ఈ యజ్ఞం లోకానికి కేంద్రం. ఈ సోముడు వర్షించే లక్షణం గల గుఱ్ఱం యొక్క రేతస్సు. ఈ బ్రహ్మ, వాక్కు యొక్క పరమవ్యోమం'.

వేది అనగా యజ్ఞవేదిక, లేక యజ్ఞానికి కేంద్రంలో ఉండే అరుగు. సృష్టి యజ్ఞంలో సూర్యుడే యజ్ఞవేదిక. దాని చుట్టూ సృష్టియజ్ఞం జరుగుతూవుంటుంది. దానిలోనే అగ్ని హోమస్వరూపమై యుండుతూ, కిరణాది వ్యూహాలరూపంగా దేవతలనూ, లోకాలను వెలువరిస్తూ వుంటాడు.

''నరునిలో 'ఇది' అనబడే భావమెచ్చటనున్నదో అదియే యజ్ఞవేది. అదియే ఈ హమనబడే పృథివీతత్త్వానికి పరమమైన అంతం. అనగా మిక్కిలి లోపలి భాగం. ఇది శిరస్సులో గావమయంగా ఉంటుంది. కాబట్టి, శిరస్సే ఈ దేహంలో యజ్ఞవేదిక. ఈ యజ్ఞమే సృష్టికి ాభి. బ్రహ్మమే వాక్కుకు అవ్వలిహద్దైన ఆకాశం.''

'వేదీ' శబ్దం స్త్రీలింగం. ఇది యజ్ఞశాలలో ఎత్తుగా కట్టబడే వేదిక. దర్భతో పరుపబడిన ఈ వేదికపై యజ్ఞ సంబంధమైన ఉపకరణాలు, పాత్రలు, ఇతర వస్తువులు కూడ ంచబడుతాయి. ఈ వేది, ఆహవనీయ, గార్హపత్యశాలల మధ్యభాగంలో కట్టబడుతుంది.

## వేదీ స్వరూపం - స్త్రీ ఔపమ్యం :




'అగ్నిచయన' యజ్ఞశాలలో వెనుకభాగం

'వేది' యొక్క స్వరూపం దీర్ఘచతురస్రాకారం గలిగి విశాలజఘనభాగం, విపుల క్షోజాలతో కూడిన భుజాలు గలిగిన యౌవనవతియైన స్త్రీ యొక్క సన్నని నడుముతో పోల్చబడింది. శ్రౌతసూత్రాలు 'మధ్యమ సంగృహీత' మని చెప్పగా, ఆపస్తంబ శుల్బసూత్రాలు (II-3-1) దర్శపూర్ణమాసవేదిని 'యోషా' అని చెప్పింది. 'యోషా' అంటే 'యౌవనవతియైన స్త్రీ' అని అర్థం.

**కాత్యాయన శ్రౌతసూత్రమ్** (II-6-7): అపరేణాహవనీయం వేదిం ఖనతి, త్ర్యంగులఖాతామ్। త్ర్యంగుల ఖాతమస్యాః వ్యామమాత్రీం పశ్చాత్। అపరస్యాం దిశి తిర్యక్ ప్రమాణేన చతురరత్నిమాత్రామ్ । **మధ్యమ సంగృహీతామ్ - మధ్యే సంకుచితమ్** [8].

**ఆపస్తంబీయ శ్రౌతసూత్రమ్** (II-3-1) : ప్రాంచౌవేద్యం సా బున్నయతి ప్రతీచీ శ్రోణీ పురస్తాదంహీయసీ పశ్చాత్ప్రథీయసీ **మధ్యే సంనతతరా భవతి.**[9]

**ఆపస్తంబీయం శుల్బసూత్రమ్ (II-4-15)** : యజమాన మాత్రీ ప్రాచ్యపరిమితా వా యథాసన్నాని హవీంషి సంభవే దేవం తిరశ్చీ ప్రాంచౌ వేద్యం సా ఉన్నయతి । ప్రతీచీ శ్రోణీ పురస్తాదంహీయసీ పశ్చాత్పృథీయసీ **మధ్యే సన్నత తరైవ మివ హి యోషేతి దార్శిక్యా వేదేర్విజ్ఞాయతే** [10].

**కరవిందభాష్యమ్ :** ప్రాంచావేద్యం సా ఉన్నయతి ప్రాక్త్వేన పూర్వాంతమతీతావంసౌ కుర్యాత్। ప్రతీచీ శ్రోణీతథా పృథక్త్వేన శ్రోణ్యా కుర్యాత్। అంహీయసీ – తన్వీ ప్రథీయసీ – **విస్తీర్ణా సన్నతతరా అతిశయేన తనుః ఏవ మివహియోషేతి ...** ఏత దేవ హి యోషాసాదృశ్యమస్యాః । యన్మధ్యే కృశత్వం పృథు అంసత్వం, పృథుతరశ్రోణిత్వం చ। ఏతత్ 'చతుశ్శిఖండా యువతి స్సుపేషా' ఇతి మంత్రవర్ణాచ్చ లభ్యతే।

**కపర్ది భాష్యమ్ :** ఏవ మున్నయనం శ్రోణ్యం సౌ। **ఏవం ప్రకారాహి యోషా । 'హి' శబ్దో రూపప్రసిద్ధౌ। ప్రాక్చిరా స్త్రీ, ఏవమేవత్యర్థః** విమితాయా మేవం చతురశ్ర మాపాదితాయాం పురస్తాత్ **పార్శ్వమాన్య ఉపసంహరేత్। సంకోచయేత్।** శ్రుతి సామర్థ్యాత్ – పురస్తాదంహీయసీ – ఇతి య్యేషా శ్రుతాః । తస్యాస్సామర్థ్యాత్ ఇతరథా యోషా సాదృశ్యమపిన స్యాత్ ।

ఎప్పుడైతే వైదికవాఙ్మయంలో యజ్ఞవేదిని 'స్త్రీమూర్తి యొక్క సన్నని నడుము'తో పోల్చడం జరిగిందో; అప్పుడే వైదిక సరస్వతి, ఆలంకారికసరస్వతిగా అవతరించడం జరిగింది. అంటే సంస్కృతంలో లౌకికవాఙ్మయానికి, అలంకారశాస్త్రవిర్భావానికి బీజారోపణం జరిగిందన్నమాట!

**వ్యాససృష్టి :** మహాభారతం, అరణ్యపర్వంలో రామాయణ కథ వస్తుంది. అక్కడ లోకవిమోహనీయుడు, జగన్నాథుడైన రాముని గర్భాన ధరించబోవు కౌసల్యాదేవిని, వ్యాసులవారిలా వర్ణించారు. 'వేదీ విలగ్న మధ్యేవ బిభ్రతీ రూపముత్తమమ్' **(261-19)** ద్రౌపది అయోనిజ, యజ్ఞకుండ సముద్భవ కదా! సభాపర్వంలో ఆమెనిలా వర్ణించారు వ్యాసుల వారు – '....... వేదీ మధ్యాత్సుమధ్యమామ్' **(71-39)**. ఇలా మహాభారతంలో, వేదీ శబ్దం నలభైపర్యాయాలు ప్రయోగింపబడింది.

**కాళిదాసుని సృష్టి :** ''కాళిదాసుని ప్రథమహృదయస్పందము మాళవిక. స్రష్టయై తన సృష్టిని చూచికొని పొందిన ప్రథమానందము. 'ఋతుసంహారము' లోని స్థావరప్రకృతి

శోభలో నుండి మానవీయమైన ఆత్మవిసించినట్లు, ప్రాతస్తుషారబిందువు వలె మాళవిక రంగస్థలముపై నిలిచెను. మాళవిక ఆయన ప్రథమసృష్టి. కాళిదాసుని ప్రథమ శిల్పము పరిపూర్ణభివ్యక్తమై మాళవికారూపమున రూపక వాఙ్మయ రంగము నందు నిలిచినది''[11] అని ఈనాడు కాళిదాసుపై పరమనిష్ఠతో ప్రామాణికమైన విమర్శలు వెలయించిన శివశ్రీ మల్లంపల్లి శరభయ్య గారి సహృదయ వాక్కు.

దీర్ఘాక్షం శరదిందు కాంతివదనం బాహూనతావంసయోః
సంక్షిప్తం నిబిడోన్నతస్తన మురః **పార్శ్వే ప్రమృష్టే ఇవ।**
మధ్యః పాణి మితోఽమితంచ జఘనం పాదావరాళాంగులీ
ఛందోనర్తయితు ర్యథైవమనసి శ్లిష్టః తథాస్యావపుః ॥[12]

కావ్యశిల్పానికి ప్రతినిధియైన మాళవిక నడుమును 'పార్శ్వేప్రమృష్టే ఇవ' అని చెప్పడం మహాశిల్పిమై, దార్శనికుడైన కవికులగురువుకే సాధ్యం! ఏకాండపు చెక్కవలె కాకుండా, రెండు వైపులా చెక్కినట్లున్న నడుము శిల్పమనోహరం! ఇది సరిగ్గా 'వేదీ' స్వరూపం! అంతే కాదు – కుమారసంభవ కావ్యంలో పార్వతీదేవిని యిలా వర్ణించారు కాళిదాసు –

మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వలిత్రయం చారు బభార బాలా (I-39)

**విశ్వనాథవారి దృష్టి – సృష్టి :** విశ్వనాథకు, పై చెప్పబడిన వైదికభావన చక్కగా తెలియుననడానికి రామాయణ కల్పవృక్షంలో సీతను యజ్ఞవేదిగా ఉపమించిన ఈ పద్యమే సాక్ష్యం! అరణ్యాకాండం – మారీచఖండంలో అకంపనుడనే రాక్షసుడు సీతాదేవి సౌందర్యాన్ని ప్రత్యక్షంగా చూచి యిలా వర్ణిస్తాడు –

అల సమృద్ధియన్నయట్టి శబ్దార్థంబు
సతి పయోధరములు, జఘనతలము
విమలతర శరీరవిన్యాస మౌచిత్య
మన్న శబ్దమునకు నర్థభూమి [13]

'సీత యజ్ఞవేది' అని ఈ పద్యంలో కవి ప్రతిపాదించినాడు. 'యజ్ఞవేది' అనగా 'యజ్ఞనిధి' అన్న సాయణులవాక్యం యిక్కడ స్మరించుకోవాలి. విశ్వనాథ 'వేది' అనకుండా, 'సమృద్ధి' అన్నశబ్దం వాడినాడు. 'పౌష్కల్యము' అని దీనికర్థం. 'యజ్ఞవేది' కూడా ఐశ్వర్యానికి చిహ్నం!

సమృద్ధి – అనే శబ్దానికి, సీత – పయోధరములు, జఘనతలము అర్థములట. ఔచిత్యం – అనే శబ్దానికి, సీత – విమలతర శరీరవిన్యాసము అర్థభూమి – అనగా సన్నినడుముయట. ఇది సరిగా వేదీ లక్షణమే! క్ష్మాయోషాసంతానమైన సీతాదేవి, మూలాధారస్థిత కుండలినీ శక్తి! ఈమె యజ్ఞభూమి దున్నుతుండగా లభించడమే, 'యజ్ఞవేదీ స్వరూపిణి' అని తప్పకచెబుతోంది. నాగేటిచాలుకు 'సీత' అని పేరైనట్లే, భూపుత్రియై, పూర్వయుగంలో 'వేదవతి' యై, త్రేతాయుగంలో 'సీత'గా యజ్ఞభూమిలో అవతరించడం – ఆమె 'కారణజన్మురాలు' అనే భావాన్ని ధ్రువీకరిస్తోంది.

ఏమిటా రహస్యం? అంటే, 'వేద – దేవ' శబ్దాలు పరస్పరం వ్యత్యస్తాలై; విలోమదృష్టితో సమన్వయం పొందేటట్లుగా 'దేవి – వేది' శబ్దాలు కూడా వ్యత్యాస్తాలుకావచ్చును.

అకంపనుని మాటలు బాగా తలకెక్కిన రావణుడు మారీచునితో యిలా అంటున్నాడు. 'వాని భార్యను, జనకరాజదుహితను, సీతామహాదేవి నపహరించవలెనన' (ఆరణ్య – మారీచఖండం – ప. 32). 'సీతామహాదేవి' – ఈ సంబోధన వానికి తెలియకనే వాని నోటివెంటవచ్చినది. **'మహాదేవి' – మహావేది'**

సీత 'అగ్నిచయన యజ్ఞమహావేది' అనే అర్థం స్ఫురించింది. ఆమె 'వేదవతి' అన్న సంగతి పూర్వమే రావణునికి స్పష్టంగా తెలుసుకాబట్టి, ఈ జన్మలోనూ ఆమె ప్రయత్నంవమ్ము చేయాలని పెద్ద ఎత్తుగడవేశాడు రావణుడు!

'సీతామహాదేవి నపహరించవలె' అంటే రావణుడు అసురుడు కనుక; పూర్వయుగాలలో అసురులకు'యజ్ఞనిధి' ని అపహరించడం వారి కలవాటే గనుక; ఆ అలవాటు చొప్పున యిక్కడ కూడా 'యజ్ఞవేదీ' స్వరూపిణియైన 'సీత'ను అపహరించడానికి సంకల్పించాడు. 'యజ్ఞవేది' యే 'యజ్ఞనిధి' అన్నాము, అంటే లక్ష్మి. సీత ఎవరో కాదు లక్ష్మీదేవి – యజ్ఞైశ్వర్యం!

వేది, యజ్ఞానికి ప్రాణభూతమైంది. వేది లేకుండా యజ్ఞం లేదు. శ్రీరాముని ప్రాణం సీత. సీత లేకుండా రాముడు లేడు. యజ్ఞం రాముడైతే యజ్ఞవేది సీత! విష్ణువు యజ్ఞమైతే లక్ష్మీదేవి యజ్ఞవేది! ఒకరు లేకుండా మరొకరు లేరు. శ్రీ లక్ష్మీనారాయణులకు 'అనపాయినీత్వం' విశిష్టాద్వైతం చెప్పింది. అనగా సీతారాములు విడదీయరాని జంట అద్వైతస్థితి లోని దంపతీభావప్రతీకలు! వాల్మీకి ప్రథమసర్గలోనే – (26) 'రామస్యదయిత

భార్యా నిత్యం ప్రాణసమాహితా' అన్నాడు. సరిగ్గా, అకంపనుడు కూడా రావణునితో, రామునందాతని భార్య, యాతనిది ప్రాణరహస్యము రాక్షసేశ్వరా! అతడు ప్రాణి, యామె ప్రాణంబు, ప్రాణంబు నీవపహరింపుమయ్య యసురనాథ! (ఆరణ్య – మారీచ, ప. 23–24)

ఇక్కడ ప్రాణమునపహరించుట యనగా యజ్ఞానికి ప్రాణభూతమైన యజ్ఞనిధిని అపహరించుట. యజ్ఞం నుండి విడదీయరాని 'వేది' ని (దేవిని) అపహరించుట. అనపాయినియైన 'లక్ష్మి' ని – 'సీత' ను, యజ్ఞేశుడు విష్ణురూపుడైన రాముని నుండి వేర్పరచుట! ఇది ధర్మగ్లాని!

వేది, యజ్ఞానికి ఎలా ప్రాణంతో సమానమైందో శ్రీరామునికి సీత ప్రాణంతో సమానం! 'దయితా' అన్నాడు వాల్మీకి. 'దయితా' అంటే ప్రియురాలు, 'ప్రాణ సమాహితా' అంటూనే 'నిత్యం' అనే విశేషణం వేశాడు. ఎల్లప్పుడు, సదాసర్వకాలమూ, ప్రాణంతో సమానమైనదని అర్థం. ఇది శాశ్వత సత్యం! ధర్మం! కాగా, సీతాపహరణమంటే వైదిక యజ్ఞాపహరణమే!

ఈ యజ్ఞాపహర్తను, యజ్ఞవేదీస్వరూపావగాహనా హీనుణ్ణి – రావణుణ్ణి సీతామహాదేవి (మహావేది) తానై సంహరించలేదు, సరికదా; యజ్ఞస్వరూపుడైన విష్ణువు యొక్క అవతారపురుషుడు శ్రీరామచంద్రుని చేత వధింపించినది. ఇదే రామాయణ కథ! ఇదే 'సీతాయాశ్చరితం మహత్' అంటే!

వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే ।<br>వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥

## యజ్ఞవేదియే యజ్ఞనిధి - వైదికవాఙ్మయంలో సప్తగిరుల ప్రశంస :

యజ్ఞవేదీ స్వరూపం సుస్థిరమైంది. అది ఒక నిశ్చితమైన ఆకారాన్ని కల్గివుంటుందని తెలుసుకున్నాము. మనం దేనినైతే 'యజ్ఞవేది' అంటున్నామో అదియే 'యజ్ఞనిధి'. ఈ అర్థాన్ని ప్రతిపాదించే వైదిక వాఙ్మయంలోని గాథను గూర్చి మనమిప్పుడు వివేచించుకొందాం. ఆ గాథలో తిరుమల దివ్యదేశంలో వెలసిన సప్తగిరుల ప్రశంస ఎలా వచ్చిందో తెలుసుకొందాం! సుప్రసిద్ధమైన వైష్ణవదివ్య క్షేత్రం, తిరుమల కొండపైన శ్రీవారి హుండీ 'యజ్ఞవేదీ' రూపంలో ఉండడం మన మందరం గమనిస్తూనే వున్నాం. భారతదేశంలోని ఏ ఇతర దేవాలయాల్లోను ఈ ఆకృతిగల్గిన హుండీ మనకు కనబడదు. ఈ యజ్ఞవేదీ ఆకారం అమ్మవారి శరీర విన్యాసమే! హుండీ యొక్క పై భాగమూ, క్రింది భాగమూ వెడల్పుగా, మధ్యభాగం స్త్రీ నడుము వలె

సన్నగా ఉండేటట్లు కుంచింపబడి 'రశన' (మొలనూలు) చేత కట్టబడినట్లు లావైన త్రాడు
కట్టబడి ఉండడం గమనించ వచ్చు. ఇది సరిగ్గా యజ్ఞవేదీ స్వరూపం. లక్ష్మీదేవి విష్ణువు
'అనపాయిని' అనే మాటకు సార్థకంగా 'సమృద్ధి' 'పౌష్కల్యం' గల 'అక్షయనీవి' యై
శ్రీస్వామి వారి హుండీ. దీనికే 'యజ్ఞనిధి' అని పేరు.

ఈ 'యజ్ఞనిధి' యే 'యజ్ఞవేది'. అదే తిరుమల పై గల స్వామి వారి 'అక్షయని
యైన హుండీ! అని నిరూపించడానికి వైదిక వాఙ్మయంలోని నిక్షిప్తమైన ఒక రహస్యగాథ
విన్నవిస్తాను. భారతీయ యాజ్ఞిక సంప్రదాయమే వైఖానస అగమంగా పరిణమించి
పురాణకాలం నాటికి భారతీయ దేవాలయ సంస్కృతిగా స్థిరపడింది అనడానికి
రహస్యమయగాథయే ప్రబల తార్కాణం! తిరుమల దేవాలయంలో వైదికమైన వైఖా
సంప్రదాయానుసారమే ఏడాదిపొడుగునా అన్ని ఉత్సవాలు నిత్యపూజలు జరుగుతున్నా
దీనిని శ్రీమద్రామానుజుల వారు కూడా మార్చలేదు. ఆయన పాంచరాత్రాగమాన్ని స
విష్ణు దేవాలయాలలో ప్రవేశపెట్టించినప్పటికీ తిరుమల పై మాత్రం వైఖానసాగమా
సమ్మతించాడు.

[14] కృష్ణయజుర్వేదానికి చెందిన తైత్తిరీయ సంహిత, ఆరవకాండం, రెండవప్రపాఠక
నాల్గవ అనువాకంలో యజ్ఞ విష్ణువుకు, ఇంద్రునకు జరిగిన సంభాషణ యిలా చెప్పబడింది

''యజ్ఞో దేవేభ్యో నిలాయత విష్ణురూపంకృత్వా
స పృథివీం ప్రావిశత్।
తం దేవా హస్తాన్ సంరభ్యైచ్ఛన్।
తమింద్ర ఉపర్యుపర్యత్యక్రామత్।
సోఽబ్రవీత్ ; కో మాయముపర్యుపత్యక్రమీదితి ?
అహం దుర్గే హంతేతి !
అథ కస్త్వమసీతి ?
అహం దుర్గాదాహర్తేతి!
సోఽబ్రవీద్దుర్గే వై హంతాఽవో చథా
వరాహోఽయం వామమోషః **సప్తానాం గిరీణాం**
పరస్తాద్విత్తం వేద్యమసురాణాం బిభర్తి
తం జహి యది దుర్గే హంతాఽసీతి।
సదర్భపుంజీల ముద్వృత్య **సప్తగిరీన్** భిత్వాతమహన్

సోఽబ్రవీద్దుర్గాద్వా ఆహర్తాఽవో చథా
ఏతమహరేతి। తమేభ్యో యజ్ఞ ఏవ యజ్ఞమాహరత్।''
– తైత్తిరీయసంహిత VI- 2 -4

తైత్తిరీయసంహితలో సోమక్రతువును ప్రస్తావించే సందర్భంలో యజ్ఞ వేదీ నిర్మాణమెట్లుండవలెనో చెబుతూ పై మంత్రం చెప్పబడింది. దీని కర్థమిది

''ఒకానొకప్పుడు యజ్ఞం విష్ణువు యొక్క ఆకృతిని ధరించి దేవతలను విడిచి భూలోకానికి వచ్చింది. ఇది చూచి దేవతలు చాచిన చేతులతో విష్ణువును వెంబడించసాగారు. కాని, దేవతలలో ఇంద్రుడొక్కడే యజ్ఞ విష్ణువుకు దగ్గర దగ్గరగా పోయి పట్టుకోవడానికి ప్రయత్నించసాగాడు. దీనికి యజ్ఞ విష్ణువు కోపించి, ''ఎవడురానీవు'' నామార్గానికి అడ్డుతగులుతున్నావు?'' అని ప్రశ్నించాడు.

ఇంద్రుడు – '' నేను ఎవరికీ చొరగూడజాలని దుర్గమమైన స్థలాలపై కూడ దాడి చేయగల సమర్థుడను. మరి నీ వెవరు ?''

యజ్ఞ విష్ణువు – '' నేను దుర్గమమైన స్థలాలలో ఉండే నిధిని స్వాధీనపరచుకొనే వాణ్ణి ! మరి, నీవు దుర్గమమైన ప్రదేశాలపై దాడి చేసే వాడినన్నావు కదా! అట్లయితే, ఒక వరాహం దేవతల ధనాన్ని దొంగలించి అసురుల నిమిత్తమై ఏడుకొండల వెనుక గుప్తపరచివుంది. ఏదీ! ఆదుర్గమమైన దాన్ని ఛేదించు చూద్దాం!''

ఈ మాట విన్న వెంటనే, ఇంద్రుడు ఒక దర్భను పెరికి ఏడు కొండలకు గుచ్చగా ఆ వరాహం పట్టుబడింది. అప్పుడు ఇంద్రుడు యజ్ఞ విష్ణువుతో – '' నీవు దుర్గమమైన స్థలాలలోని నిధిని స్వాధీనపరచుకొనేవాడినన్నావు గదా! అట్లయితే, నా శక్తికి కట్టువడిన ఈ వరాహాన్ని నిధితో సహా బయటికి లాగు చూద్దాం!'' అన్నాడు.

దానికి వెంటనే స్పందించి, యజ్ఞ విష్ణువు దేవతల కోసం వరాహంతో సహా నిధిని స్వాధీనపరచుకున్నాడు. ఈ విధంగా, అసురులు చేజిక్కించుకొన్న 'యజ్ఞనిధి'ని దేవతలు యజ్ఞ విష్ణువు ద్వారా తిరిగి తమ ఆధీనంలోకి తీసుకున్నారని తెలుస్తోంది. దీనిచే 'యజ్ఞనిధి' యే 'యజ్ఞవేది' అని స్పష్టమౌతున్నది.

''విద్యతే లభ్యతే ఇతి వేదిః'' అనే వ్యుత్పత్తిని సాయణాచార్యులిలా వ్యాఖ్యానించారు. ''యత్తద్విత్తం వేద్యమసురాణా మవిందంత తదేకం వేద్యైవేదిత్వమ్''. ''ఏ నిధినైతే అసురులు స్వాధీనపరచుకొన్నారో అదియే 'వేది' గా తెలుసుకోవాలి అన్నారు. అంటే, యజ్ఞము యొక్క నిధియే 'వేది' అని దీనిచే తెలుస్తోంది.

ఈ పై చెప్పబడిన వృత్తాంతమే - మైత్రాయణీయసంహిత III- 8-3, కాఠకసంహిత XXIV-2-6 ల్లోను చెప్పబడినాయి. ఇక్కడ, పై కథలో కొన్ని ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

1) ఈ కథలో చెప్పబడిన ఏడుకొండలెక్కడివి ?

2) ఈ వరాహ మెవరు ?

3) ఇది యజ్ఞవరాహంగా ఎలా గుర్తించబడింది ?

ఈ ప్రశ్నలకు సమాధానం మనకు శ్రీ సాయణాచార్యుల వారే వేదభాష్యంలో చెప్పారు.

''సోమయజ్ఞాన్ని నాల్గు రోజుల దీక్షతో చేస్తారు. (ప్రారంభోత్సవం లేక అంకురార్పణం) మూడు రోజుల పర్యంతం చేసే 'ఉపసద్' (యజ్ఞక్రియాకాండం) అనేది, ఆ తర్వాత ఒక్క రోజులో చేసే సుత్య (సోమ లతను పిండట మనే క్రియ) అనేవి ఉన్నాయి. ఈ సోమక్రతువు జరిగే ఒక్కొక్క రోజు ఒక్కొక్క దేవత అధిష్ఠిస్తారు. ఈ ఎనిమిది మంది దేవతలు యజ్ఞవిష్ణువు యొక్క అంతర్భాగాలే !

ఒకసారి అసురులు బలవంతులు కాగా, ఈ ఎనిమిది మంది దేవతలు స్వర్గాన్ని వదలి భూలోకానికి వచ్చారు. వీరిలో దీక్ష -నాల్గు రోజులు, ఉపసద్ - మూడు రోజులు మొత్తం ఏడు రోజులకు అధిష్ఠాన దేవతలైన ఏడుగురు దేవతలు అసురులకు భయపడి ఏడుకొండలైనారు. ఇక, చిట్టచివరగా మిగిలిన ఎనిమిదవ రోజు సుత్యకు అధిష్ఠానదేవత యజ్ఞనిధిని తనతో పాటు తీసుకొని, వరాహరూపాన్ని ధరించి పారిపోసాగింది. ఇంతలో, అసురులు ఆ వరాహాన్ని నిర్బంధించి ఆ యజ్ఞనిధిని తమకోసం ఏడుకొండలకు అవతల గుప్తంగా దాచి రక్షిస్తూవుండమని ఆజ్ఞాపించారు.

ఈ రహస్యం యజ్ఞస్వరూపుడైన విష్ణుమూర్తికే తప్ప మరెవ్వరికీ తెలియదు. వరాహరూపధారియైన యజ్ఞవిష్ణువే (యజ్ఞవరాహము) ఇంద్రునికి పై రహస్యం తన

సంభాషణలో చెప్పాడు. దీనిచే యజ్ఞమే విష్ణువు. విష్ణువే యజ్ఞం. అందుకే, తైత్తిరీయసంహిత – విష్ణుర్వై యజ్ఞః, విష్ణుర్యజ్ఞః, యజ్ఞో వై విష్ణుః అని విస్పష్టంగా చెప్పింది.

వేదవాఙ్మయానికి చెందిన తైత్తిరీయసంహితలో చెప్పబడిన ఈ పై వృత్తాంతాన్ని బట్టి తెలిసేదేమంటే – 'తిరుమల' అనే పేరుతో నేడు పిలువబడే సప్తగిరులూ, వేదగాథలో ప్రశంసింపబడిన సప్తదేవతలూ రూపాంతరం చెందిన సప్తగిరులూ ఒక్కటే! ప్రతి కొండ కూడా ఒక దేవతాస్వరూపం! ఈ కొండలపై విష్ణుమూర్తియైన శ్రీ వేంకటేశ్వరుని దేవాలయాన్ని నిర్మింపజేసిన మహానుభావునికి పై వైదిక గాథతో బాగా పరిచయమున్నదని స్పష్టమౌతోంది.

మైత్రాయణీయ, కాఠకసంహిత ల్లోని పై యజ్ఞవరాహ కథ అంత విస్పష్టంగా లేదు. తైత్తిరీయసంహిత దక్షిణ భారతదేశంలో బాగా ప్రచారంలో ఉండే సంహిత గనుక దీనినే పై దేవాలయ నిర్మాత స్ఫూర్తిగా గ్రహించి నిర్మింపజేశాడని చెప్పాలి ఈ కథ వల్ల తెలిసే ఏడుకొండల విషయాలు యిలా వున్నాయి.

1) వేదసంప్రదాయానుసారం ఏడుకొండలు యజ్ఞవిష్ణువు యొక్క దేవతారూపమైన ఏడు అంగాలు. వేంకటగిరి యొక్క సప్తగిరులు వేంకటేశ్వరుని రూపాలేనని పురాణసంప్రదాయం కూడా చెబుతోంది. శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామాలలో – స్వామికి '**నగ వేంకట**' అనే పేరుండటమే దీనికి సాక్ష్యం. ఏడు కొండలకు శ్రీ వేంకటేశ్వరునికి అభేదప్రతిపత్తి! స్వామియే ఏడుకొండలు! ఏడుకొండలేస్వామి! అందుకే, ఏడుకొండలవాడా !వేంకటరమణా! అని తెలుగువారు, ''ఏళుమలై ఆండవనే! వేంగడే శప్పెరుమాళే !'' అని తమిళులు ఆయనను పిలుస్తున్నారు. ఇదొక విలక్షణమైన అంశం! స్వామి నివసించే స్థానానికి, స్వామికి అభేదంగా ఉన్న దివ్యక్షేత్రంగా తిరుమల ఒక్కటే ప్రత్యేకత కల్గివుంది. ఇతర దివ్యక్షేత్రాలకు ఈ సారూప్యసాజాత్యాలు పట్టడం లేదు. అందుకే తిరుమల క్షేత్రానికింత ప్రసిద్ధి ప్రాచుర్యాలు ఏర్పడ్డాయి. దీని రహస్యం వేద వాఙ్మయంలోనే నిక్షిప్తమైవుంది.

2) ఏడుకొండల వెనుక మొట్టమొదట రహస్యంగా నిధితో వచ్చిదాగినది యజ్ఞవరాహం. ఈ యజ్ఞవరాహం వద్దగల నిధిని అనగా యజ్ఞవేదిని తిరిగి సంపాదించినవాడు యజ్ఞవిష్ణువు. వరాహపురాణంలోని వేంకటాచల మాహాత్మ్యాన్ని అనుసరించి చూస్తే అందులోను, యజ్ఞమూర్తియైన వరాహుడే మొట్టమొదటి వసుంధరతో (తన భార్య భూదేవి) సప్తగిరులకు వచ్చినట్లు చెప్పబడింది. శ్రీ వేంకటేశ్వరుడు మహర్షులు యజ్ఞం చేస్తున్న వాటికకు ఆ తర్వాతనే వచ్చి తిరుమలపై ఒక ప్రదేశంలో తానుండటానికి యజ్ఞవరాహుని వద్ద అనుమతి సంపాదించినట్లున్నది.

3) తైత్తిరీయసంహితలో 'యజ్ఞనిధి' ని 'వేది' అని పేర్కొన్నప్పటికీ ఆసంహితలోనే ''సా వా ఇయం సర్వైవ వేదిః'' ఈ సర్వభూమియే ఒక వేది'' గా చెప్పబడింది. అందుకే పురాణగాథల్లోని హిరణ్యాక్షుని కథలో ఆ రాక్షసుడు వసుంధర (వసువు = బంగారు, ధర = ధరించినది) ను రసాతలలోకం లోనికి తీసుకువెళ్లి త్రొక్కిపెట్టగా, విష్ణువు వరాహమూర్తియై రసాతలం దాకా వెళ్లి అసురుణ్ణి చంపి వసుంధరయైన భూదేవిని, తన భార్యను తిరిగి స్వస్థానంలో ప్రతిష్ఠించినట్లు పురాణగాథ! అప్పుడు, యజ్ఞవేది = యజ్ఞనిధి = వసుంధర (భూమి). ఈ వేద పురాణగాథలు రెండూ ఒకే నాణానికి గల బొమ్మ, బొరుసు లాంటివి. రెండూ సత్యమైన కథనాలే! పురాణ, ఇతిహాసాలు వేదాన్ని 'ఉపబృంహణం' (extension and elaboration of meaning) చేస్తున్నాయంటే అర్థమిదే!

4) వరాహపురాణంలోని వేంకటాచలమాహాత్యంలో ప్రథమ, ఉత్తర భాగాలలో కూడ శ్రీ మహావిష్ణువు వచ్చిన తర్వాతనే ఆయన్ను వెదుక్కుంటూ లక్ష్మీదేవి, భూదేవి (వసుంధర) ఆయనను చేరినట్లు చెప్పబడింది. తైత్తిరీయసంహితలో యజ్ఞపరంగా కథ చెప్పబడుతూ, యజ్ఞవిష్ణువు దేవతలు పోగొట్టుకొన్న నిధిని యజ్ఞవరాహం నుండి తిరిగి సంపాదించినట్లు చెప్పబడింది. అంటే, అంతవరకు 'ఐశ్వర్యం' అసురుల హస్తగతమై వున్నట్లే గదా! అది తర్వాత సంపాదింపబడింది. కాబట్టి, 'నిధి' = శ్రీ (లక్ష్మి) = వేది (భూదేవి, వసుంధర) అన్నీ సమానార్థకాలే అవుతున్నాయి.

5) ఇక్కడ ఒక ప్రధానవిషయం మనవి చేయాలి. తైత్తిరీయసంహిత లోని కథలో యజ్ఞవిష్ణువు దుర్గమమైన ప్రదేశాల లోని నిధిని సైతం స్వాధీన పరచుకొనే శక్తి సామర్థ్యాలు కలవాడుగా చెప్పడం గమనింపదగింది. 'రత్నహారీతుపార్థివః' ''రాజారత్నాపహారిణః'' అని లోకంలో రాజైన వాని విషయంలో గల సూక్తులు. ఆ విధంగా, ఈనాడు తిరుమలపై గల శ్రీస్వామివారి హుండీ యజ్ఞవేదీ స్వరూపంలో ఉంటూ ఒక ధనాకర్షణ యంత్రం వలె భారతదేశంలోనే గాక, విదేశాల్లో గల నిధుల్ని సైతం హుండీలోకి ఆకర్షించడం చూస్తే, పై వైదిక గాథ ఎంత సత్యమో, విష్ణు మాహాత్యం ఎంత నిత్యమో తేట తెల్లమౌతుంది!.

భారతీయ కాలమానం ప్రకారం ప్రస్తుతం జరుగుతున్న కల్పం పేరు 'శ్వేతవరాహకల్పము'. అందుకే, సంధ్యావందనంలోని సంకల్పంలో 'శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే'' అని నిత్యమూ స్మరిస్తున్నాము. స్వామి మత్స్యావతారమెత్తి బ్రహ్మపోగొట్టుకొన్న నాల్గు వేదాలను అంటే వేదవిజ్ఞానాన్ని పునరుద్ధరించి ఆయనకు తెచ్చియిచ్చాడు. ''ధాతాయథాపూర్వమకల్పయేత్'' అనే వాక్యానికి అప్పుడే సార్థకత చేకూరింది.

కూర్మావతారంలో అమృతం కోసమే అసురులతో సఖ్యం చేసి, అమృతం పొందిన తర్వాత సత్త్వగుణ ప్రధానులైన దేవతలు అమరులు కావడానికి వారికే పంచాడు. ఇక, వరాహావతారంలో తన కత్యంత ప్రియమైన మానవాళి నివసిస్తున్న భూమి పాతాళానికి క్రుంగదీసిన హిరణ్యాక్షుని చంపి తనపత్నియైన 'వసుంధర'ను ఉద్ధరించాడు. భూమియే వేది. అటువంటి భూమియే లేనప్పుడు 'యజ్ఞం' ఎక్కడ జరపాలి? యజ్ఞనిర్వహణకు భూమియే 'పీఠిక' – 'మూలాధారం' – ఈ భూమిపై నివసించే మానవాళి యొక్క అభ్యుదయ నిశ్శ్రేయసాలు 'యజ్ఞం' తోనే ముడిపడి వున్నాయి. అప్పుడే బ్రహ్మసృష్టికి సార్థకత ఏర్పడుతుంది. కాబట్టి, మానవులకు దేవతలకు ఏర్పడిన ధర్మగ్లాని నుండి ఉద్ధరించడమే మహావిష్ణువు యొక్క కర్తవ్యం. దీన్నే 'స్థితిపాలనం' అంటారు. అందుకే, దేవతలు, మానవులు తమ కష్టాలు తీర్చమని మహావిష్ణువునే ప్రార్థిస్తారు. 'సురలకు నరులకు చోటైన వాడు' శ్రీవేంకటేశ్వరుడని అన్నమయ్య సంకీర్తంచడంలోని అంతరార్థమిదే!

## శ్రౌత, శుల్బసూత్రాలలో యజ్ఞవేదీ నిర్మాణపు కొలతలు – తిరుమలపై వెలసిన శ్రీ వేంకటేశ్వర దేవాలయం

> ''త్రింశత్ పదాని పశ్చాత్తిరశ్చీ భవతి ।
> షట్ త్రింశత్ ప్రాచీ చతుర్వింశతిః పురస్తాత్ ॥

వైదిక శ్రౌత, శుల్బసూత్రాలలో వేది ఏ ఏ కొలతలతో నిర్మించాలో విస్పష్టంగా చెప్పబడింది. '' వెనుక భాగంలో అడ్డంగా పోయే రేఖ ముప్ఫై అడుగులుండాలి. వెనుక నుండి ముందు భాగానికి వచ్చే రేఖ ముప్ఫై ఆరు అడుగులుండాలి. ముందున్న అడ్డగీత ఇరవైనాల్గు అడుగులుండాలి.

తిరుమలపై వెలసిన శ్రీ వేంకటేశ్వర దేవాలయ స్థపతి ఎవరో తెలియదు గాని, ఆయన దేవాలయమే ఒక యజ్ఞవేదీ ఆకారంలో ఉండాలని భావించి, శిల్ప శాస్త్రసమ్మతంగా నిర్మింపజేసినట్లు తెలుస్తోంది. అతిప్రాచీనకాలంలో నిర్మింపబడిన దేవాలయం కావడం చేత ఈ మధ్యకాలంలో అనేక మరమ్మతులు, మార్పులు, చేర్పులు జరిగాయి. అందువల్ల, తొలిసారిగా నిర్మించినపుడున్న కొలతలిప్పుడు కొంత తార్మారు అయినప్పటికీ దాదాపు వైదిక గ్రంథాల నియమానికి లోబడే వున్నాయని చెప్పవచ్చు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి శాసన నివేదిక (T.T.D. Epigraphical Report) ను తయారుచేసిన కీ॥ శే॥ సాధుసుబ్రహ్మణ్య శాస్త్రి గారి (1930) గ్రంథంలో కూడా

ఇచ్చిన శ్రీ వేంకటేశ్వర దేవాలయ నిర్మాణపు నమూనాను బట్టి పరిశీలించినపుడు - ముఖ్యంగా దేవాలయ గర్భగృహం (Sanctum Sanctorum) వెడల్పు 29.5 నుండి యిప్పై అడుగులుండగా, గర్భగృహం నుండి దానికి ప్రక్కనున్న మంటపంతో కలిపి పొడవు 35 అడుగులున్నాయి. ఈ మంటపం యొక్క కొలతలు పై నమూనాలో ఖచ్చితంగా తెలుపబడకపోయినా దేవాలయ గర్భగృహం కంటే ఐదారు అడుగులు తక్కువగా ఉండవచ్చుననిపిస్తుంది. ఈ కొలతలు ఏండ్లుపూండ్లు గడచిన ఒక దేవాలయనిర్మాణంలో సహజమైన మార్పులేనని భావిస్తే, దాదాపుగా వైదిక శుల్బ, శ్రౌత సూత్రాల కొలతలతో సంవదిస్తున్నట్లే చెప్పవచ్చు.

ఇక్కడ గుర్తించవలసిన విలక్షణాంశాలు ఏమంటే :-

1) స్వామివారే ఏడుకొండలు, ఏడుకొండలస్వామి. కొండలకు స్వామికి అభేద ప్రతిపత్తి
2) దేవాలయ నిర్మాణమే వేదీస్వరూపంగా ఉంది.
3) దేవాలయమందలి గర్భగృహం ముఖ్యంగా వేదీ నిర్మాణపు కొలతలతో సరిపోతున్నది.
4) యజ్ఞవేదీ ఆకారంతో స్వామి వారి 'హుండీ' ఉంది.

ఇలా, స్వామివారికీ, ఏడుకొండలకూ, అభేదప్రతిపత్తిగా, స్వామి దేవాలయానికీ యజ్ఞవేదికి అభేదంగా నిర్మింపబడిన 'విష్ణుదేవాలయం' భారతదేశంలో మరెక్కడా లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

వేంకటేశసమంస్థానం బ్రహ్మాండే నాస్తికించన।
వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి॥ - బ్రహ్మాండ పురాణమ్ (1-24)

వేంకటేశాత్పరో దేవో నాస్త్యన్యః శరణం భువి।
వేంకటేశ సమోదేవో నాస్తి నాస్తి మహీతలే ॥ - వరాహపురాణమ్

## అగ్నిచయనం - సుపర్ణచితి

యజ్ఞవేది ఏకైకరూపాన్ని కల్గివుంటుందనీ, అగ్నిచితి మాత్రం వివిధాకృతులను ధరిస్తూవుంటుందని పూర్వ వ్యాసాలలో తెలిసికొన్నాము. ఇప్పుడు అగ్నితత్త్వాన్ని గురించి, అగ్నిచయనంలో సుపర్ణచితి స్థానమేమిటో తెలుసుకొందాం.

''అగ్నిర్భువన్నుత్తమా రోచనానామ్ (ఋగ్వేదం 3-5-20) ప్రకాశమానవములైన జ్యోతులలో అగ్ని ఉత్తమమైనది. ''అరణ్యోర్నిహితో జాతవేదా'' (ఋగ్వేదం 2-5-2) అగ్ని అరణిమంధనముచే నుత్పన్నమగుచున్నది. సృష్టియొక్క మూలతత్త్వం అగ్ని లేక అగ్రి. సృష్టి యొక్క ఉపక్రమం అగ్రితత్త్వం, లేదా గతితత్త్వంతో ప్రారంభింపబడింది. అందుకే ఋగ్వేదంయొక్క ప్రారంభం అగ్నిదేవతాకమైన మంత్ర యతో ప్రారంభింపబడింది. ఇదే దీని రహస్యం.

అగ్నిమీళేపురోహితం
యజ్ఞస్య దేవమృత్విజం
హోతారం రత్నధాతమమ్ (ఋగ్వేదం 1-1-1)

ప్రాణనక్రియయే సృష్టి. ప్రాణనమే గతి. సృష్టి యొక్క ప్రారంభంలో అభివ్యక్తమైన కారణంగా దీనిని, ''అగ్ని - యదగ్రే ఆస'' అని చెప్పబడింది. ఇదే పరోక్షభాషలో 'అగ్ని' అయింది. అందుచేత సృష్టియొక్క అగ్రిమగతితత్త్వాన్ని 'అగ్రి' అని, ఇదే పరోక్ష లేక ప్రతీక భాషలో 'అగ్ని' అయిందని చెప్పాలి.

అగ్ని - సోముల సమ్మేళనమే ఈ సృష్టి. అగ్నిలో సోముని యొక్క ఆహుతియే యజ్ఞం - సమస్త విశ్వం అగ్నీ షోమాత్మక యజ్ఞం యొక్క పరిణామమే! అగ్ని అన్నాదుడు. సోముడే అగ్నికి అన్నం. కాబట్టి, అగ్నియే సృష్టికి మూలతత్త్వం.

## సుపర్ణతత్త్వం

''ప్రజాపతిర్వై సుపర్ణో గరుత్మాన్'' అని శతపథబ్రాహ్మణము (VI-7.2-6) పర్ణమనగా రెక్క. ఇది ఛందోబద్ధమైన కదలికను సూచిస్తోంది. ఇది కాలస్వరూపమైన సంవత్సరంగా, రెక్కలు గల పక్షి మహాసుపర్ణుడుగా సంభావింపబడింది. ''అథ హ వా మేష మహాసుపర్ణ యేవ యత్సంవత్సరః'' అని శతపథ బ్రాహ్మణం (XII- 2.3.7) ఉత్తరాయణ, దక్షిణాయనములతో ఒక కాలప్రమాణం గలిగింది సంవత్సరం. రెండు అయనాలే దానికి రెక్కలు. కాలగతికి సూర్యుడే ప్రమాణం కాబట్టి సుపర్ణుడే సూర్యుడు. ఈ సూర్యుడు వేదప్రతీకార్థంలో బహువిధాలుగా పిలువబడ్డాడు. అందులో ఒక పేరు హరిహంస (Golden Bird)

'' సహస్రాహ్ణ్యం వియతావస్య పక్షే
హర్వేర్హంసస్య పతతః స్వర్గమ్'' అని అథర్వవేదమ్ (X-8.18) సుపర్ణుడు 'హరిహంస' గానే గాక 'హిరణ్యపక్షశకుని' గా కూడా భావింపబడినాడు.

యః సహస్రసవే సత్రే జజ్ఞే విశ్వసృజాం ఋషిః।
హిరణ్యపక్షః శకునిః తస్మై హంసాత్మనే నమః ॥

అని మహాభారతము లోని శాంతిపర్వం (47-30) సుపర్ణుడే ప్రాణం. ''ప్రాణో వై పతం అని జైమినీయ ఉపనిషద్బ్రాహ్మణం (III- 35-2). సుపర్ణుడే ప్రాణసూత్రం. ప్రాణ వేదప్రతీకార్థంలో అగ్నిగా, సూర్యునిగా చెప్పబడింది. ''ప్రాణోవై వృష దగ్నిస్ తమ ఏతదాహ అని శతపథబ్రాహ్మణము ( VI-7.3-11) ప్రాణతత్త్వం పక్షియొక్క రెండు రెక్క సమప్రసారంతో పోల్చబడింది. ''ప్రాణో వై సమంచన ప్రసారణమ్'' అని శతపథ బ్రాహ్మణ (VIII 1.4.10)

## అగ్నిచయనం - సుపర్ణం

అగ్నిచయనంలో ప్రధానాగ్నిచితియైన ఉత్తరవేది, పదివేల ఎనిమిదివందల ఇటుకలత సుపర్ణాకారంగా బారచాచిన రెక్కలతో నిర్మింపబడుతుంది. ఇది విశ్వానికి ప్రతీక. ఇదియే అగ్ని ఉత్తరవేది యొక్క అధిష్ఠాన దేవత. అగ్నియే ప్రజాపతి. అగ్నియే వేది. విశ్వశరీరాన్ని ప్రజాప సృజించి అందులో నివసిస్తున్నాడు. (చూడుడు : Fig అగ్నిచయన వేదికా నిర్మాణం)



అగ్నిచయన వేదికా నిర్మాణం

అగ్ని = ప్రజాపతి = ఉత్తరవేది, ఈ మూడు సమానాంశాలుగా గుర్తింపబడి వీటి సమానత్వం ప్రాణంగా అదియే సుపర్ణుడుగా సంభావింపబడినాడు. పక్షి రెక్కలు క్రిందికి పైకి

కదలడం. (ఏతిచ ప్రేతిచ) ముందుగు వెనుకకు సంకోచవ్యాకోచములు, ఆకుంచన ప్రసారణములు ప్రదర్శించడం చేతనే 'సంచాంచ ప్రచసారయ' అని యజుర్వేదం (27-45) చెప్పింది. 1) పృథివి - భౌతికతత్త్వం, నశ్వరం, శరీరం 2) స్వర్గం - అనశ్వరం, అమృతం, అభౌతికం

మొదటిది భూతము, అసురముకాగా, రెండవది ప్రాణము, దేవముగా చెప్పబడింది. ప్రాణము లేక ప్రజ్ఞ ఈ రెండింటికి అనుసంధానసేతువు కాబట్టే - ''సుపర్ణోఽసి గరుత్మాన్‌పృష్ఠే పృథివ్యాః సీద'' అని యజుర్వేదం (XVII- 72) మంచి రెక్కలు గల పక్షివి నీవు. ఈ ఎత్తైన భూమిపై అధివసించియున్నావు. ఈ మంత్రాన్నే పురశ్చరణ చేస్తూ చాచిన రెక్కలతో సుపర్ణాకారంగా నిర్మించబడిన ఉత్తర వేదిపై అగ్న్యానుసంధానం చేయాలి.

## సుపర్ణచితి తత్త్వం - శిరస్సే పీఠిక

సుపర్ణచితి తత్త్వమేమంటే, అది సకల జీవరాశులలో స్పందితమౌతున్న ప్రాణతత్త్వానికి ప్రతీక! ప్రతి మానవ శరీరం ఒక సుపర్ణచితిగా భావింపబడింది. శరీరమే ఒక వేది. అందులో అగ్ని - ప్రజాపతి - సుపర్ణులు అధివసించియున్నారు. పృథివీతత్త్వమైన శరీరం భౌతికం, నశ్వరం (శీర్యత ఇతి శరీరమ్) కావచ్చు కాని, అభౌతికమైన స్వర్గతత్త్వం ప్రకారం అది అనశ్వరం, అమృతం, ప్రాణం, దేవంగా చెప్పబడింది గదా! కాబట్టి, అది 'శరీర'మని ఎందుకు పిలువబడుతోంది అంటే, అందులో ప్రధానప్రాణతత్త్వం అధివసించియుండటమే ''శ్రి'' అనే ధాతువుకు ''ఆశ్రయించు'' అని అర్థం. 'అథ యత్ సర్వస్మిన్ ఆశ్రయంత తస్మాత్తు శరీరమ్' అని శతపథబ్రాహ్మణం (VI-1.14) శరీరం రెండు విధాలుగా చెప్పబడింది. ఊర్ధ్వ, అధోభాగాలు, శిరస్సుకు మధ్యభాగం ప్రాణానికి స్థానం. అదియే సుపర్ణం. అధోభాగమైన శరీరమే సుపర్ణచితి.

స వై సప్త పురుషోభవతి సప్త పురుషో అయమ్।
పురుషో యశ్చత్వార ఆత్మాత్రయః పక్షపుచ్ఛాని ॥

అని శతపథ బ్రాహ్మణం (VI- 1.1.4 నుండి 6 మంత్రాలు) సప్తవిభాగాత్మకమైన నిర్మాణమే ఈ సుపర్ణచితి. ఇందలి ప్రాణద్రవ్యమే 'చిత్యాగ్ని' అని పిలువబడుతోంది. ఈ ప్రాణ ప్రక్రియ

యొక్క ఔత్కృష్ట్యం దాని పైనున్న సప్తపురుషులచే పరిపాలింపబడుతోంది. వారు ఈ ప్రాణాన్ని కేంద్రీకరించి వున్నారు. అదియే ప్రజాపతి యొక్క శిరస్సు (శతపథ బ్రాహ్మణం VI- 1.7) ఈ శిరస్సుకు 'చితేనిధేయ' మని పేరు. అది అమృతమయ ప్రాణశక్తిని ధరించివుంది. అది సకల దేవతలకు నివాసస్థానం.

తదస్యైతచ్ఛిరస్ తస్మిన్నేతస్మిన్ సర్వేదేవాః శ్రితా ః-శతపథ బ్రాహ్మణము (V-1-1.7) శిరస్సే స్వర్గం. ఇది సోమ, మధు, అమృత, స్వర్గ, ద్యుః, శ్యేన, సుపర్ణ, ఇంద్ర శబ్దాలకు ప్రతీకగా చెప్పబడింది. మానవుని మస్తిష్కానికే మరోపేరు స్వర్గం. అధర్వవేదంలో కూడ యిలా చెప్పబడింది (10-2-31).

అష్టచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా ।
అస్యాం హిరణ్యయోకోశః స్వర్గో జ్యోతిషావృతః ॥

ఎనిమిది చక్రాలు, నవద్వారాలున్న ఈ శరీరమే దేవతలపురమైన అయోధ్య. ఇందులో ఒక బంగారు కోశముంది. అది జ్యోతిచేత కప్పబడిన స్వర్గం. అదే జ్యోతిర్లోకం. దేవతల నివాసస్థానం.

పృథివి, సప్తవిభాగాత్మకమైన నిర్మాణం గల సుపర్ణచితి, సోమం లేదా ప్రాణద్రవ్యం ధరించిన పాత్రవంటిది. అదే స్వర్గంలోని అమృతం. ఈ దైవికమైన అమృతమే దేవతలకు ఆహారం. అదే ప్రాణానికి, జవసత్త్వాల పరిపోషణకు ఆధారం.

''సుపర్ణం విప్రాః కవియో వచోభిరేకం
సంతం బహుధా కల్పయంతి'' - ఋగ్వేదం (X - 114-5)

''ఏకంసత్ విప్రా బహుధావదంతి'' అన్న వేదవాక్యంలాగా, 'సుపర్ణ' విషయంలో కూడ ద్రష్టలైన మహర్షులు, వేదపండితులు చెప్పేది ఏకాభిప్రాయమే అయినప్పటికీ, వివేకవంతులు దానిని బహువిధాలుగా అర్థ కల్పనం చేసి సమన్వయిస్తున్నారని ఋగ్వేదమే చెప్పింది.

వ్యాస మహాభారతంలో చెప్పబడిన గరుడోపాఖ్యానం శిరః స్థితమైన ఈ అమృతాన్ని గ్రహించి శరీరమంతటికీ ప్రాణప్రసారణం చేసే అమృతాపహరణ కథగా మలచబడింది. 'వినత' అంటే తూర్పున భూమిపైకి ఆకాశం వినతమై వంగియున్న చోటు – భూమ్యాకాశాలు కలియు స్థలం (Horizon) జ్యోతిర్మయమైన ఈ అండాకారం నుండి గరుడుడు పుట్టుటగా దీన్ని వర్ణించింది ఇతిహాస కథ [15].

గాయత్రికి అష్టాక్షరసంపత్తి గలిగిన గాథను సోమోపాఖ్యానంగా కృష్ణయజుర్వేదతైత్తిరీయ సంహిత (6-1-6) లో వర్ణింపబడింది. ఇదే గాథ తర్వాత గాయత్రి బ్రహ్మవిద్యయైనది. ఉపనిషత్తులలో చెప్పబడిన ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలలో చతుష్పాద్గాయత్రీవిద్య ఒకటి. ఇది బృహదారణ్యకోపనిషత్తు (5-14-1) లో చెప్పబడింది. [16]

## అగ్నిచయనంపై ప్రామాణిక గ్రంథాలు

అగ్నిచయనంపై పరమప్రామాణికమైన వైదిక గ్రంథం శతపథ బ్రాహ్మణం. ఇందలి పదునాలుగు కాండలలో ఐదుకాండలు ఈ చయనవిధాన వివరణకే కేటాయింపబడినవి. ఈ యజ్ఞాన్నే సంక్షిప్తంగా, 'చయనం', 'అగ్ని' అనే పేర్లతో పిలుస్తారు. ఆపస్తంబ శ్రౌతసూత్రాల ననుసరించి అగ్నిచయన మాచరించిన పురుషుని 'అగ్నిచిత్, (XVI- 10-6) అని పిలుస్తారు.

అగ్నిచయనంలో 'చితి' ని అనేక ఆకారాలతో నిర్మిస్తారు. అందులో 1) సుపర్ణచితి, 2) శ్యేనచితి, 3) ద్రోణచితి, 4) రథచక్రచితి, 5) ధాన్యరాశి చితి అనేవి ముఖ్యమైనవి.

The Rite of piling the fire alter included in the Soma sacrifice in five layers with bricks on the Uttaravedi for setting up the Ahavaniya and it is represented in the Satapatha Brahmana as a human invitation of the construction of the cosmic world of the Prajapati."[17]

1975 ఏప్రిల్ 12-16 తేదీలలో కేరళలో విశ్వవిఖ్యాత భారతీయ విజ్ఞాన పరిశోధకుడైన Prof. FRITS STALL ఆధ్వర్యవంలో అతిరాత్ర - అగ్నిచయనం జరిగింది. సాంగోపాంగంగా జరిగిన ఈ అగ్నిచయనాన్ని సమంత్రకంగా రెండు పెద్ద Disc Tape లలో రికార్డు చేయడమే గాక, యాగవిధానాన్ని అనేక ఛాయాచిత్రాలుగా తీసి, అగ్నిచయన సంబంధమైన వైదిక, చారిత్రక పృష్ఠ భూమికనంతటినీ పరిశోధింపజేసి Romila Thaper, Asko Parpola వంటి మహామేధావినీ మేధావులచే పరిశోధక వ్యాసాలు వ్రాయించి రెండు బృహత్సంపుటాలుగా ప్రచురింపజేశారు. ఆసంపుటం పేరిది.

AGNI - The Vedic Ritual of the Fire Alter - Vols I & II
Editor : Prof. Frits Staal
in collaboration with C.V. Somayajipad, M. Itti Ravi Nambudiri
Publisher : Motilal Banarasidass, Delhi, 1983

భారతదేశంలో ఈ అతిరాత్ర - అగ్నిచయన ప్రక్రియ మూడు వేల సంవత్సరాలకు పూర్వమే ఋషులచే సృజింపబడినదని, ఈ చయనం క్రీ.పూ. 600 కు ముందే సాంగోపాంగంగా ఆచరింపబడినట్లు చారిత్రకాధారాలు లభిస్తూవున్నాయని తెలుపుతూ, గ్రంథపీఠికలో Prof. Staal యిలా వ్రాశారు.

" The 1975 performance of the Atiratra Agnicayana called attention to a ritual created in India almost 3000 years ago. The ritual was performed before 600 B.C. The contributors that follow supplement the Yajurvedic data with the Atiratra recitations from Rgveda and the Agnicayana chants from the Samaveda."

## చరిత్రకు పూర్వయుగంలో అగ్నిచయనం - పురావస్తు నేపథ్యం - శాసనాధారాలు

చరిత్రకు పూర్వకాలం (Proto-historic period) లో అగ్నిచయన యజ్ఞానికి సంబంధించిన పురావస్తు అవశేషాలు ( Archaeological Survivals) భారతీయ పురావస్తు శాఖవారి త్రవ్వకాలలో లభించినట్లు ప్రొఫెసర్ రోమిలా థాపర్ "The Archaeological Background to the Agnicayana Ritual " అనే విస్తృత పరిశోధన వ్యాసంలో తెలియజేస్తున్నారు. (AGNI, Vol. II pp 3-40)

వైదిక సంస్కృతి క్రీస్తు పూర్వం వేయిసంవత్సరాల నాటికి రూపొందించుకొన్న

యజ్ఞయాగాలలో అగ్నిచయనమన్నది అప్పటికి వ్యాప్తిలో నున్న వివిధసంస్కృతుల సమ్మిశ్రణ స్వరూపానికి ప్రతీకగా చెప్పవచ్చు ఎందుకంటే, యజ్ఞక్రియా కలాపవైపుల్యం, అందలి ప్రతీకార్థాలు తరతరాలు గడిచే కొలది దేశకాల పరిస్థితుల్ని బట్టి తొలినాటి పద్ధతుల్ని కాదని, క్రొత్తపద్ధతుల్ని ప్రవేశపెట్టుకొన్నది.

ఈ సందర్భంలో ప్రొఫెసర్ రోమిలా థాపర్ మాటలనే ఉల్లేఖించడం సముచితం. "The ritual of Agnicayana would then have to be seen as symbolizing this amalgam of cultures going back to the Shamanism of Indo-European days, the sacrificial cult of Rgvedic practice, the forms of possible Harappan survivals and the accretion of more recent practices, perhaps taken from the Black and Red-ware cultures. Thus the Yajna (Sacrifical ritual) would represent the coming together of many rituals of diverse origins." (Agni, Vol. II పుట - 3)

## పురావస్తు పరిశోధన శాఖవారి తొలినాటి త్రవ్వకాలు

అశోకుని శిలాస్తంభం సమీపంలో గల లౌరియనందన్ ఘర్ అనే చోట Th. Bloch దౌర జరిపించిన త్రవ్వకాలలో ఒక దిబ్బ బయటపడింది [18]. బ్లాక్ దౌర దీనిని శ్మశానంగా భావించాడు. కాని, క్యాలండ్ దౌర (W. Caland) శ్మశానాలు సాధారణంగా వర్తులాకారంగా వుండవని వాదిస్తూ, దానికి ఉపబలకంగా ఆ దిబ్బలో దొరికిన జంతువుల పుఱ్ఱెలను, స్త్రీ బొమ్మగల ఫలకాన్ని చూపి ప్రశ్నించినాడు. క్యాలండ్ దౌర ఈ గుండ్రని మట్టిదిబ్బను అగ్నిచయనవేదిగా గుర్తించాడు. అంతే కాదు, వివిధ శ్రౌత సూత్రాలననుసరించి వేది యొక్కఆకారం (ఉత్తరవేది - చితి) శ్యేనరూపంగా, చతురస్రంగా, వర్తులాకారంగా రథచక్రాకారంగా ఉంటుందని ప్రమాణాలు చూపాడు.

అగ్నిచయన ఉత్తరవేదిని ఐదు వరుసల ఇటుకలతో కట్టి మధ్య ఇసుకను పోయాలి. క్రింది వరుసలో పురుషాకారంతో గల బంగారు ప్రతిమను ఉంచాలి. ఇది పురుషునికి లేదా ప్రజాపతికి ప్రతీక! ఈ ప్రజాపతినే ఒక్కొక్కసారి స్తనౌద్ధత్యం గల స్త్రీమూర్తి వక్షస్థలం వరకు మాత్రమే చిత్రించిన బొమ్మగా ఉంచడం ఉంది. ఇది హరప్పా, మొహంజొదారోలలో లభించిన మాతృమూర్తి (Mother Goddess) కావచ్చును. స్తనౌద్ధత్యమే దీనికి సూచకం. ఋగ్వేదం లోని అస్యవామీయ సూక్తమనబడే సుపర్ణసూక్తంలో (I-164-49)

యస్తేస్తనః శశయో యో మయో భూర్యేన విశ్వాపుష్యసి వార్యాణి ।
యో రత్నధా వసువిద్యః సుదత్రః సరస్వతి తమిహ ధాతవే కః ॥

" ఓ సరస్వతీ ! నీకున్న స్తనములు స్థిరమై దృఢత్వాన్ని కల్గిస్తున్నాయి. దాని నుండి

వేమము కోరదగిన సమస్తవరములును వర్షించి పోషించు. దాని యందు రత్నముల అలంకారములుగా ఉన్నాయి. అట్టినీ స్తనము సంపదలకు మూలమై దానగుణము కలిగియున్నవి ఇప్పుడు దానిని మా పోషణకై అనుగ్రహించుచున్నావు.'' [19]

పై త్రవ్వకాలలో దొరికిన స్త్రీ బొమ్మ మాతృదేవతారాధనను తెల్పుతోంది. ఈ కట్టడపు పొరలలో మనిషిపుర్రెగాని, జంతు సంబంధమైన మేక, గొర్రె, గుఱ్ఱము, ఎద్దు పుర్రెలను గాని ఉంచాలి. ఇవి యధార్థమైనవి కావచ్చు. లేదా బంకమట్టితో చేసినవైనా కావచ్చు. క్యాలండ్ దొర ఈ దిబ్బ మధ్యగల కొయ్యను చూచి సంశయగ్రస్తుడైనాడు. ఇది బహుశా, యూపమై ఉండవచ్చు.

ఈ సందర్భంలో, పి.వి. కాణేపండితుడు పూర్వకాలంలో ఉండే ఒక ఆనవాయితీని యిలా గుర్తుచేశాడు[20]. అదేమనగా, అగ్నిచయమమాచరించిన వారికి శ్మశానంలో యజ్ఞవేదికి ప్రతిరూపంగా (replica) ఇటుకలతో అలాంటి కట్టడమే కట్టడానికి అనుమతించేవారు. ఇది యజ్ఞ మాచరించిన దానికి గుర్తుగా ఉండాలనేది వారి అభిమతం. ఈ రకమైన అవశేష నిర్మాణం లేదా స్మారక నిర్మాణం శ్మశానానికీ, అగ్నిచయనానికీ గల దగ్గరి సంబంధాన్ని లేదా భావసాదృశ్యాన్ని స్థాపిస్తూ వుంది.

**చితి - చైత్యం :**

పై వ్యాసం చివరలో 'చితి-చైత్యం' ఈ రెండింటికి మధ్యగల దగ్గరి సంబంధం చెప్పబడింది. 'చైత్య' మనే శబ్దం 'చేతియ' అనే మాటకు సామ్యాన్నివహిస్తూ, ఇవి రెండూ 'చితి' శబ్దం నుండి నిష్పన్నమైనట్లు చెప్పవచ్చు. వ్యుత్పత్త్యర్థానుసారం చూస్తే 'చితి' శబ్దానికి ''కుప్పగా పేర్చుట''(Piling up) అని అర్థం. 'చితి' యొక్క నిర్మాణం లేదా కట్టడం ఇటుకల్ని యజమానుడు లేదా ఋత్విక్కు ముందే నిర్ణయించిన ఆకారానికి తగినట్లు పైపైన పేర్చడం వలన ఏర్పడుతోంది.

బౌద్ధమత వాఙ్మయంలో చైత్యం, చైత్యప్రాసాదమనే మాటలు తటస్థపడుతున్నాయి. వైదిక యజ్ఞచితియే అన్నిటికీ ప్రాథమిక రూపం కాగా, అది కాలక్రమేణా బౌద్ధం అభిమానించిన పాలీభాషలో 'చేతియ' గా ఆ తర్వాత సువిస్తృత నిర్మాణమైన చైత్యాన్ని 'స్తూపం' గా పిలిచేటంతవరకు ప్రభావితం చేసింది.

విష్ణుపురాణంలో (1-13-9) విష్ణువుకు 'యజ్ఞేశుడ'నే సంబోధన గమనింపదగింది. రామాయణ కాలం నాటికే విష్ణువు యొక్క వామనావతారం ప్రసిద్ధికెక్కింది. అలాగే, రామాయణ రచన జరిగే కాలానికే దేవాలయాలు కట్టడం ప్రారంభమైంది.

దేవతాయతనాన్యాశు సర్వాస్తాః ప్రత్యపూజయన్ - బాల (76-11)

'దేవాయతన' (అయోధ్య 6-11) (ఉత్తర 91-14)

'అమరావతీస్తూపం' అనే వ్యాసం వ్రాస్తూ శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మ గారు[21] చితి - చెతికి - చెతియ - చేతియ - చైత్య రూపంగా ఏర్పడిందని వ్రాశారు. మౌర్యవంశానంతర కాలపు స్తూప శాసనాలను పరిశీలిస్తే అందులో ''**చెతికియానం నికాయస మహాచెతియ**'' అనే వాక్యం కనబడుతుంది. అంటే 'చైత్యక నికాయము యొక్క మహాచైత్యమని' దీని కర్థం. మహాసాంఘికుల్లో చైత్యకవాదులున్నారు. ఈ బౌద్ధసంఘాన్ని దాక్షిణాత్య బౌద్ధులు చైత్యవాద సంఘమని, ఉత్తరాది బౌద్ధులు చైత్యశైలసంఘమని వ్యవహరించేవారు. అశోకునిచే పంపబడి ఆంధ్రదేశానికి వచ్చిన మహాదేవభిక్షువు స్థాపించిన 'చైత్యకపంథ'కు ఇది ప్రధానపీఠం కావడం చేత ఆ తర్వాతి కాలంలోని శాసనాలలో అమరావతీ మహాచైత్యమని పేర్కొనబడటం చేత, అమరావతీస్తూపం అశోకచక్రవర్తి ఆదరణతో వెలసిందని చెప్పవచ్చు.

కాబట్టి, యజ్ఞచితితో సంబంధం గల యూపమే ప్రధానప్రేరకం కాగా 'చైత్యం' నిర్మింపబడిందని చెప్పవచ్చు. ఆశ్వలాయనగృహ్యసూత్రం (1-12-1-4) లో తొట్టతొలి సారిగా 'చైత్య' మనే మాట ప్రస్తావింపబడింది. వాల్మీకి రామాయణంలో రావణాసురుడు వసంతకాలంలో విరబూసిన కల్పవృక్షంతోను, ఆభరణాలు ధరించివున్న శ్మశానంలోని చైత్యం వలె భయంకరంగా ఉన్నట్లు వర్ణింపబడినాడు

స కల్పవృక్ష ప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్ ।
**శ్మశానచైత్య ప్రతిమో భూషితో ఉపి** భయంకరః ।[22]

వానర, రాక్షసుల వర్ణనల్లో చైత్య ప్రాసాదాలు చెప్పబడినాయి.

అశోకవనికాయాంతు తస్యాం వానరపుంగవః ।
స దదర్శా విదూరస్థం **చైత్యప్రాసాద** ముచ్ఛ్రితమ్ ॥[23]

ఈ విధంగా యజ్ఞచితి, చైత్యం గౌరవసూచకాలైన సమానస్థాయి గల పదాలై హిందూ, బౌద్ధ మతాలవారికి పవిత్రస్థానాలైనాయి.

''బౌద్ధ కళారంభములు - భర్హుత్ స్తూపము'' అనే వ్యాసంలో మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు[24] యిలా వ్రాశారు. ''బుద్ధుని మహాపరినిర్వాణమైన తర్వాత (క్రీ.పూ. 487) ఆయన అస్థికలను ఎనిమిది భాగాలుగా చేసి ఆయన శిష్యులు ఎవరి వంతుకు వచ్చి అస్థికలను

వారు మహోత్సాహంతో తీసికొనిపోయి ఒక ప్రముఖమైన స్థలంలో ఒక వేదిక నిర్మించి దా
మధ్య భాగంలో ధాతువులనుంచిన పేటికను నిక్షిప్తం చేసి, దానిపై అర్ధవర్తులాకారపు మ
దిబ్బను ఏర్పాటుచేసి, దానిని ఆరాధిస్తూవచ్చారు. చితికి సంబంధించిన సమాధి దిబ్బలు కావడ
చేత ఈ స్తూపాలకు చైత్యములనే పేరు కలిగిందని శ్రీ మల్లంపల్లి వారు వ్రాశారు.

చైత్యం యొక్క విస్తృతరూపమే స్తూపం. అశోకచక్రవర్తి కాలం నాటి స్తూపాలు, పిప్రవ
అమరావతి, సారనాథ్, సాంచీలలో నేడు బయటపడ్డాయి. స్తూపమనే సంస్కృత శబ్దానికి 'దిబ్బ
అనే అర్థమిచ్చే 'థూపో' అనే పాలీ భాషాపదం నవమానార్థకం. బుద్ధుని అవశేషాలపై గ
నిర్మాణాలకు ధాతుచైత్యాలంటారు. అవశేషాలు పెట్టే స్థలానికి 'ధాతు గర్భమని పేరు. ఈ
పదం యొక్క భ్రష్టరూపమే 'దాగబ' లేక 'దాగోబ'. ఈ స్తూపాలకే శ్రీలంకలో దాగబ లే
'దాగోబ' అని, నేపాల్‌లో 'చైత్యము' అని బర్మాలో 'పెగోడా' అని వ్యవహరిస్తారు. ధాన్యకట
చైత్యానికే అమరావతీ స్తూపమనే పేరువిఖ్యాతమైంది.

## చైత్య, స్తూప నిర్మాణాలు, ఆరాధనలు, బౌద్ధమతం కంటే ప్రాచీనమైనవె

ఇక్కడ విలక్షణమైన విషయమేమంటే 'చితి' యొక్క వివిధాకారాలను చెబుతూ
శ్రౌతగ్రంథాలు, అవి రథచక్రం, సమూహ్య లేక ధాన్యరాశి ఆకారంతోను నిర్మింపబడుతాయని
చెప్పాయి. సరిగ్గా స్తూప నిర్మాణ విషయంలో కూడా రథచక్రాకారపు పునాది మీద, లేద
ధాన్యరాశి ఆకారంలో కట్టబడివుండడం మన కాశ్చర్యం కల్గిస్తుంది.

ఈ సందర్భంలో ప్రొఫెసర్ రోమిలాథాపర్ మాటల్లో చెప్పాలంటే, " The worship of Caityas and Stupas is regarded as customary even before the rise of Buddhism." (Agni, Vol. II Page -10)

కొణకమన స్తూపము అతిప్రాచీనమైంది. అది ఒకప్పుడు చైత్యం. దానిని అశోకుడు
పెంచి పెద్దచేసి స్తూపంగా నిర్మించాడు.

పి.సి. పంత్ గారు Megaliths of Jangal Mahal and Vedic Tradition (Poona, 1978)[25] అనే వ్యాసంలో యిలా వ్రాశారు. ముఖ్యాంశమేమంటే, ఋగ్వేదం లో ఎక్కడా 'చితి'
ని ఇటుకలతో కట్టే కట్టడంగా చెప్పలేదు. కాబట్టి ఈ భావన యొక్క వికాసం, తర్వాత వచ్చిన
శ్రౌత గ్రంథాలవలన ఏర్పడింది. అందుచేత, ఆర్య - అనార్య సంస్కృతుల సమ్మేళన ఫలితంగా
ఈ అగ్నిచయన 'చితి' నిర్మాణ స్వరూపం ఏర్పడిందని చెప్పవచ్చునన్నారు.

చనిపోయిన వారిని పాతిపెట్టే పద్ధతి అసురులది, ప్రాచ్యులది అని శతపథబ్రాహ్మణం చెప్పిన విషయం మెగాలిథిక్ అవశేషాలుగా లభించిన వాటితో సరిపోలుతున్నాయి. ఈ అవశేషాలు జంగల్‌మహల్ అనే పేరు గల ప్రాంతంలో (వింధ్యపర్వతపు పొలిమేరల్లో గల బర్దా, మిర్జాపూర్, వారణాశి జిల్లాలలో) లభించాయి. ఈ అవశేషాలలో తాబేటి ఎముకలు లభించడం విశేషం.

కుండల తయారీలో ఉన్నతప్రమాణంగా గుర్తింపబడిన బ్లాక్ అండ్ రెడ్‌వేర్ (Black and Redware )అనే సంజ్ఞగల్గిన కుండలు లభించాయి. ఇవి. క్రీ.పూ. మొదటి వేయి సంవత్సరాలకు పూర్వభాగానికి చెందినవి. ఈ మెగాలిథిక్ అవశేషాలు స్మారకచిహ్నాలుగాను, మరొకప్పుడు దహన సంస్కారపు చిహ్నాలుగాను పరిశీలనకు పనికివస్తాయి. ఇవి చైత్యనిర్మాణ విధానాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

ఇదే, అగ్నిచయన యజ్ఞానికీ ప్రతీకగా ఏర్పడివుండవచ్చు. ప్రజాపతి పురుషునికి ప్రతీకగా బంగారు ప్రతిమను పూడ్చి పెట్టడం – చితిని అగ్నిచితిగా పేర్చడం – దహనక్రియను సూచిస్తూ వుంది. కాబట్టి అగ్నిచయనం ఖననాన్నీ, దహనాన్నీ రెంటినీ ప్రాతినిధ్యం వహిస్తున్నదని చెప్పవచ్చును.

ఆర్.ఎస్. పంచముఖి గారు Progress of Kannada Research in Bombay Province 1941 - 46 (Dharwar 1948) Pts I - II pp 63-65 లో యిలా వ్రాస్తున్నారు. తుంగభద్రా నదీ తీరప్రాంతాలలో 'ఇత్‌గి' అనే చోట (బెల్గామ్ జిల్లా) లభించిన 'ఉఖా' పాత్ర అతిప్రాచీనమైనది. యజ్ఞోపకరణాల్లో ఇది ఒకటి. కాని, పురాతత్త్వజ్ఞులు దీనిని క్రీ.పూ.1వ శతాబ్ది నాటిదిగా చెప్పారు. ఈ నిర్ణయం శ్రౌత గంథాల రచనాకాలానికి తర్వాతిగా అవుతోంది.

అథర్వవేదంలో చెప్పబడిన నీలలోహిత (Ultra - Violet) శబ్దం బ్లాక్ అండ్ రెడ్‌వేర్ (Black and Redware )అని కొందరి మతం.అది నిజమైతే, అసురులతో అగ్నిచయనానికుండే సంబంధం పోతున్నది. 'ఉఖా – ఆసురీమాయ' అని ఒక సిద్ధాంతం. ఋగ్వేదం అసురులను ఆంగిరసులతో లంకె పెట్టింది. ఈ అంగిరసులే యజ్ఞానికి యజమానులు లేక పురోహితులు. వేదకాలంలో అంగిరసులు వైదికాగ్ని పరిశోధకులుగా ప్రసిద్ధులు.

అగ్నిచయన యజ్ఞం పరిసమాప్తమైన తర్వాత అవశేషంగా తర్వాతి కాలాలకు మిగిలేది ఇటుకలతో నిర్మింపబడడిన 'ఉత్తరవేది' యే! కాబట్టి చరిత్రకు పూర్వకాలం నాటి (Proto - historic period) ఈ యజ్ఞావశేషాలు మనకెక్కువ లభించడం లేదు. ఇప్పటికి మూడు స్థలాలలో ఈ యజ్ఞావశేషాలు మనకు లభిస్తున్నాయి.

## కౌశాంబిలో లభించిన యజ్ఞావశేషాలు

క్రీ.పూ. మొదటి వేయి సంవత్సరాల మధ్యకాలం నాటిదిగా గుర్తింపబడిన 'శ్యేనచితి' ప్రాచీన కౌశాంబీనగరపు పొలిమేరల్లోని త్రవ్వకాలలో బయటపడింది. కాని, దీన్ని 'శ్యేనచితి' గా గుర్తించడానికి పురాతత్త్వజ్ఞులు వెనుకంజ వేస్తున్నారు. నలభైతొమ్మిది అడుగుల పొడవు, ముప్పై మూడు వెడల్పుతో బారచాచిన రెక్కలతో శ్యేనాకారముగా నిర్మింపబడిన ఈ 'చితి' ఆగ్నేయది వైపుగా నిర్మింపబడియుండడం విశేషించి గమనింపదగింది. 'స్వయమాతృణా' ఆకారంగ ఇటుకలు, ఇసుక దొంతరల క్రింద లభించాయి. బంకమట్టితో చేసి ఎఱ్ఱగా కాల్చిన స్త్రీమూర్తి బొమ్మ లభించినది. ఇది క్రీ.పూ. మొదటి వేయి సంవత్సరాలకు గాని, రెండవ సహస్రాబ్దాని గాని సంబంధించినవి. ఈ అవశేషాలలో మనిషి పుఱ్ఱె తప్ప తక్కిన జంతువుల పుఱ్ఱెలు (మేక గొఱ్ఱె, ఎద్దు, గుఱ్ఱము) లభిస్తున్నాయి. ఇది క్రీ. పూ. మొదటి వేయి సంవత్సరాలకే చెందిన అవశేషమైతే యజ్ఞ క్రియాకలాపంలో ఒక గొప్ప మార్పు సంభవించిందని ఆనాటి శ్రౌతగ్రంథాల రచనా విధానాన్ని బట్టి చెప్పవచ్చు.[26]

## నాగార్జునకొండలో దొరికిన యజ్ఞావశేషాలు

నాగార్జునకొండ పలనాడు తాలుకా గుంటూరు జిల్లా లోనిది. క్రీ.శ. 2,3 శతాబ్దులలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన ఇక్ష్వాకు రాజులు అశ్వమేధము చేసినట్లుగా వారు వేయించిన శాసనాల వల్ల తెలియడం చేత పురాతత్త్వశాస్త్రజ్ఞులు లిచ్చుట త్రవ్వకాలు జరిపించారు. రెండు తటాకాల వంటి నిర్మాణంగల అవశేషాల్లో ఒకటి చతురస్రాకారంగా సోపానపరంపరతో నుండగా, రెండవది కూర్మాకారంతో నున్నది. ఇవి రెండు యజ్ఞవేదులని పురాతత్త్వజ్ఞులు చెప్పారు గాని అధునిక పరిశోధకులు వాటిని త్రోసిపుచ్చారు.

## జగత్‌గ్రామ్‌లో దొరికిన యజ్ఞావశేషాలు

అగ్నిచయన యజ్ఞావశేషంగా చెప్పదగిన ఏకైకమైన స్థలం 'జగత్‌గ్రామ్' త్రవ్వకాలలో బయటపడింది. ఇది డెహ్రాడూన్ జిల్లాలో సివాలిక్ కొండల నుండి యమునానది మైదానంలో ప్రవేశించే స్థలంలో ఉంది. ఇది ఖాల్సీ (Khalsi) కి సమీపంలో మౌర్యవంశపు చక్రవర్తి అశోకుని శిలా శాసనాలు గల స్థలానికి దగ్గరలో ఉంది. ఇక్కడ మూడు స్థలాలలో అవశేషాలు బయటపడ్డాయి.

అక్కడ రాజు అశ్వమేధములు చేసినట్లు చెప్పబడింది. ప్రతి అవశేషం లోని 'చితి' కూడ గరుడాకారంతో నిర్మింపబడింది.

ఇటుకలపై చెక్కిన శాసనాలలో ఆ రాజు పేరు శీలవర్మడని, అతడు నాలుగు అశ్వమేధములు 'జగత్‌గ్రామ్' లో నిర్వహించినాడని వ్రాయబడి ఉంది. ఒక్కొక్క అశ్వమేధానికి గుర్తుగా, ఒక్కొక్క 'సుపర్ణచితి'ని ఆ రాజు నిర్మింపజేసినాడు. అందులో ఒక శాసనభాగమిట్లున్నది.

**''సిద్ధం ఓం యుగేశ్వరస్యాశ్వమేధే యుగశైల ।**
**మహీపతే ఇష్టకా వర్షగణస్యానృపతే శీలవర్మణా ॥''**

దీనిఅర్థమిది : ''వర్షగణమునకు చెందినవాడు, యుగశైలాధిపతియై యుగేశ్వరుడైన రాజు శీలవర్మని ఆశ్వమేధయాగవేది నుండి తీసిన ఇటుక ఇది.''

మరియొక ఇటుకపై గల శాసన మీ విధంగా వుంది.

**'' నృపతేర వర్షగణస్య పొణషష్ఠస్యధీమతా ।**
**చతురర్థస్యాశ్వమేధస్య చితోఽయం శీలవర్మణా ॥**

దీని అర్థమిది : ''వర్షగణమునకు చెందిన వాడైన 'పొణ' అనుపేరు గల మూలపురుషుని నుండి ఆరవతరమునకు చెందినవాడైన రాజు శీలవర్మని నాలుగు అశ్వమేధముల 'చితి' ఇది.

వర్షగణవునెడి గోత్రవు పాణిని, అష్టాధ్యాయిలో చెప్పిన 69వ గోత్రమైన ''వృషగణవే''నని, యుగేశ్వరవునే పేరు వరాహమిహిరుని బృహత్సంహితలో చెప్పబడినపేరేనని ఆధునిక పరిశోధకులు నిర్ణయించారు. [27]

## కొన్ని సాహిత్యాధారాలు

వ్యాస మహాభారతంలో 'వేది' శబ్దం నలభైసార్లు ప్రయోగింపబడివుండగా, 'యూప' మనే శబ్దం ముప్పైమూడుసార్లు ప్రయోగింపబడివుంది. ''యూపం ఛిందంతి యజ్ఞార్థమ్'' ''యూపప్రకారాబహవః'' అని మహాభారతంలో చెప్పబడింది. యూపధ్వజ, యూపకేతన, యూపకేతు శబ్దాలు కూడ వాడబడినాయి.

యూపం కొయ్యతో చేయబడుతుంది కాని, సర్వసాధారణమైన కొయ్య దీనికి పనికిరాదు. యజ్ఞంలో బలియిచ్చే పశువును కట్టివేయడానికి వాడే విశేషమైన కొయ్యతో చేయబడిన స్తంభాన్నే 'యూపం' అంటారు.

యజ్ఞంలో పొందబోయే వివిధఫలితాలను బట్టి ఈ కొయ్యను పలాశ, ఖదిర, బిల్వ, రోహిత వృక్షాల నుండి కోసి తయారుచేస్తారని ఆపస్తంబ శ్రౌతసూత్రం (7-1-16) లో చెప్పబడింది

రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ వారు, బాలకాండ - ఇష్టిఖండం 115వ పద్యంలో యిలా చెప్పారు.

కలికిన్ వేసిన బండకొయ్యల వలెన్ గన్పట్టు వే లక్షకో
టులు గాగన్ సరయూ ఝురోత్తరపు టొడ్డుంబట్టి యూపంబులా
తొలినాళ్లన్ భవదీయ వంశమణి భూతుల్ భూపతుల్ యజ్ఞక
ర్మలు గావించిన శాసనంబులయి యోఙ్మానాథ చూడామణీ!

యజ్ఞాలు సర్వసాధారణంగా నదీతీర ప్రాంతాలలో జరిగినట్లు పురాతత్త్వవేత్తలు త్రవ్వకాలలో అధారాలు లభించాయి. యమునానదీ పరీవాహక ప్రాంతంలో శీలవర్మ నాలుగు అశ్వమేధాలు చేసినట్లు శాసనాధారాలు మనం పరిశీలించాము. ఆ విధంగా నే సరయూ నదికి అవతలి ఒడ్డులో వేలు, లక్షలు, కోట్లుగా గల యూపస్తంభములున్నట్లు కవి వర్ణించాడు. అంటే అయోధ్యను పాలించిన పూర్వపు ఇక్ష్వాకురాజులు అనేక అశ్వమేధ, అతిరాత్ర, అగ్నిచయనాలను ఆచరించిన వారని తాత్పర్యం. శ్రీరామచంద్రుడు అశ్వమేధ యాగం చేసినట్లుగా ఉత్తరరామాణయం వల్ల మనకు తెలుస్తోంది. ఆయన తండ్రి దశరథుడు, అశ్వమేధ, పుత్రకామేష్టులు చేశాడనడం మనకు తెలుసు. ఆయన పూర్వీకులైన రాజులు ఇంతకంటే ఎక్కువ యజ్ఞయాగాదులు చేసివున్నారని విశ్వనాథ వారు చెప్పడం కేవలం ఊహాగానం కాదు. కాళిదాసమహాకవి, రఘువంశం (3-69) లో యిలా చెప్పాడు.

ఇతి క్షితీశో నవతిం నవాధికాం
మహాక్రతూనాం మహనీయశాసనః ।
సమారురుక్షుర్దివ మాయుషఃక్షయే
తతాన సోపాన పరంపరామివ ॥

తన ఆజ్ఞకు ఎదురులేని ఆ దిలీపమహారాజు తన జీవిత కాలం తీరినప్పుడు స్వర్గ మధిరోహించడానికై వేసుకొన్న సోపానపరంపరయా అనేటట్లుగా తొంబది తొమ్మిది అశ్వమేధయాగాలను ఆచరించాడు.

ఒక దిలీపుడే ఇన్ని యజ్ఞాలు చేసివుంటే ఆయన పూర్వీకులు ఇంకెన్ని చేసివుండాలి?

అప్పుడా యూపస్తంభాల సంఖ్య కోట్లు కావడంతో ఆశ్చర్యం లేదు. యజ్ఞమాచరించిన చోట్ల గల యూపాలే శాసనాలని విశ్వనాథ వారు చెప్పారు. అంటే అశ్వమేధ, అగ్నిచయనాలు ఆచరించిన చోట్లలో రాజులు శాసనాలు లిఖించి నిక్షిప్తపరచడం సంప్రదాయమని కవికి తెలుసు. దీని కనుగుణంగానే 'శీలవర్మ' అనే రాజు యమునానదీ తీరంలో నాల్గు అశ్వమేధాలు చేసి, యజ్ఞాంతంలో చితి నుండి తీసిన ఇటుకలపై లిఖించిన శాసనాలు త్రవ్వకాలలో బయటపడినదని మనం పరిశీలించాం. కవి సమ్రాట్టులకు వైదిక విజ్ఞానంతో పాటు చారిత్రక పరిజ్ఞానమూ ఉందని ఈ పద్యం వల్ల బుజువౌతోంది.

వేది, చితి, యూపం – ఈ మూడు అగ్నిచయనంలోని ప్రధానాంగాలు. ఈ మూడింటి ప్రాధాన్యం తెలుసుకున్నాము. 'చితి' ని గురించిన కొన్ని సాహిత్యాధారాలను యిక్కడ పరిశీలిద్దాం! సుపర్ణచితిని చాచిన రెక్కలతో నిర్మిస్తారని కదా శతపథం చెప్పినది. రామాయణకల్పవృక్షంలో బాలకాండ – ఇష్టిఖండం – **361**వ పద్యం యిలా వుంది.

> ''తెక్కలును బుచ్ఛమును బ్రసరించి శిరము
> వాంచి నిలిచిన గరుడినా వహ్నులాఱు
> ప్రతిదిశమ్ము సహస్రహిరణ్య శకల
> ప్రోక్షితమ్ములు జ్వలియించె భూపశిఖులు ''

దశరథుడు పుత్రకామేష్టికి ముందు అశ్వమేధము చేసినాడు. అశ్వమేధాంతమునందు అగ్నిచయనము నిర్వర్తించినాడు. ఆ సందర్భమందలి పద్యమిది. తెక్కలు, తోకను చాచి శిరస్సువంచి నిలిచిన గరుడుని వలె '' సుపర్ణచితి' ఉన్నదని ఆ చితిలో 'వహ్నులాఱు' ఉన్నవని విశ్వనాథ వారు చెబుతున్నారు. కాని, 'పంచచితిక' – ఐదువహ్నులే ఉండాలని శాస్త్రప్రమాణము నిర్దేశిస్తూదన్నది.

" The ritual of Agnicayana comprising the building of five alters (Panca - Citika - Yajna) corresponding to the five elements (Panca bhutas) of the five pranas (Panca - pranas) which together make one Golden Reed (Hiranya - Vetasa)" (Rgveda 6-58-5) అని ఆచార్య వాసుదేవ శరణ్ అగ్రవాలా గారు[28] తెలుపుతున్నారు.

పంచభూతములకు, పంచప్రాణములకు ప్రతీకగా 'పంచచితిక'లను సుపర్ణచితిలో ప్రతిష్ఠించాలని అదే 'హిరణ్యవేతస' మనబడుతుందని వేదము చెబుతుండగా విశ్వనాథ వారు చెప్పిన 'ఆరువహ్ను' లెక్కడివో తెలియదు. అగ్ని సప్తజిహ్వుడు. ఉపనిషత్తుల్లో పంచాగ్ని విద్య

ప్రసిద్ధమైంది. మరి, ఈ ఆరువహ్నుల కాధారవేమెనొ! 'వహ్నులైదు' అనడాని: పొరబాటున 'వహ్నులాఱు' అనడం జరిగిందని సరిపెట్టుకోవాలి!

ఈ ఘట్టంలో వాల్మీకంలో లేని జటాయువు అనే పక్షిరాజుకు ఆహ్వానం పంపడం - అతడు రావడం – గరుడాకృతిగలసువర్ణచితి నిర్మాణాన్ని పరోక్షంగా కథాగతం చేసి పాఠకులక స్ఫురింపజేయడం కోసమే విశ్వనాథ చేసిన కల్పన. ఇది యాజ్ఞికమైన రహస్యార్థ ప్రతిపాదన కథాముఖంగా చేయడం. అమూలకమైనా బహుఅర్థవంతమైన, ఉదాత్తకల్పన.

సాహిత్య విద్యాసంప్రదాయ ప్రవర్తకులలో ఒక విలక్షణస్థానమాక్రమించిన విశ్వనాథకు యాజ్ఞికరహస్యార్థాలు చక్కగా తెలియుననడానికి స్థాలీపులాకన్యాయంగా ఆయన తొలికృతుల్లో ఒకటైన తెలుగు ఋతువుల్లో శరదృతువర్ణనలోని పద్యపాదం చూద్దాం!

ఱెక్కలు సాచి తీరికగాఁగ గాలిలోఁ
దేలిపోయెడు నంచవోలె వచ్చి

అన్నపద్యపాదం మహార్థవంతమైనది. ''ప్రాణో వై పతంగః'' – 'ప్రాణమేపక్షి', మఱి, ఇక్కడ 'హంస' అనిగదాయున్నది అనవచ్చు! నిజమే! దానికి మున్ముందు సమాధానం చెబుతాను. మొట్టమొదట ఒక పక్షిగానే పరిశీలిస్తాము. పక్షి ఱెక్కలు సాచి తీరిగ్గా గాలిలో తేలిపోతూవున్నదనడంచే – ''ప్రాణో వై సమంచన ప్రసారణమ్' అనే వేదవాక్యాన్ని వ్యాఖ్యానిస్తూవుంది.

"The nature of Prana is essentially the same as the folding and unfolding of the wings by a bird"[29]

చాచిన ఱెక్కలతో చదలపై విహరించే పక్షి యొక్క రెండు రెక్కలు ప్రాణస్పందనమునకు హేతువైన ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ప్రతీకగా వేదము చెప్పినది. బారసాచిన రెక్కలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు సమతౌల్యము (balance) ను చెప్పుచున్నది. విశ్వనాథ వారి ఈ పద్య పాదంలో వైదికరహస్యమున్నది. అదే 'అల్లసానిపెద్దన' గారి మనుచరిత్ర పద్యపాదం –''శ్రేణుల్ కట్టి నభోంతరాళమున పాఱెన్ పక్షులు'' (3-12) ఈ వాక్యంలో వైదికవాసనలు లేవు. ఇది కేవలం భౌతిక సౌందర్యదృష్టితో ప్రకృతి పరిశీలన నుండి పుట్టిన పద్యం మాత్రమే!.

వేదప్రతీకార్థంలో ప్రాణం 'అగ్ని'గా సంభావింపబడింది. అంతే కాదు, ఇది సుపర్ణచితి'ని సైతం స్ఫురింపజేస్తూవుంది. విశ్వనాథ వాడిన 'అంచ' శబ్దం ప్రాణాన్ని, హరిహంస Golden Bird) ను, హిరణ్యపక్ష శకుని (బంగారు రెక్కలు కల్గిన శకున పక్షి) ని స్ఫురింపజేస్తూవుంది. ఆ అర్థమిక్కడ అనుసంధించుకోవాలి. హంస సమవిభక్తాంగకమై ఉశ్చలమైన రెక్కలతో గాలిలో తేలిపోవుచున్నది. ఈ భావనా చిత్రం యొక్క తత్త్వాన్ని సాయణులు ఋలా చెప్పారు. ''హంతి సదాగచ్ఛతీతి హంసోవాయుః'' "Hamsa here is a name of Vayu so called bacause he is always in motion (హంతి)'' అని Peter Peterson, వ్రాశారు.[30] 'హంస'కు 'వాయువు' అనేది నామాంతరం – ఎందుకంటే, వాయువు నిత్యచలనశీలత్వం గలిగింది కనుక అని సాయణాచార్యులు ఋగ్వేదభాష్యభూమిక [31] లో వ్రాశారు.

స్థితి (static) గతి (dynamic) ఈ రెంటి యొక్క తత్త్వాన్నే వేదవిద్య బహుధా ప్రతిపాదించి వ్యాఖ్యానిస్తున్నది. వేద ప్రతిపాదితమైన ఈ హంసయే ఉపనిషత్తులు చెప్పిన వేదాంతంలో 'సోఽహం' అయింది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు 'హంస' అని పేరు. 'హంసస్సోహమ్! వేదశబ్దానికి ధాత్వర్థ, ప్రతీక, విలోమదృష్టులనబడే త్రివిధ వ్యాఖ్యానదృష్టులలో 'హంస' –'సోఽహం' కావడం విలోమదృష్టి. అంటే శబ్దాన్ని తిరగవేసి అర్థంచెప్పడం. 'హంస' మూలాధారం మొదలుకొని సహస్రారం వరకు ప్రదక్షిణలు చేస్తూ ఉంటుంది. లోపలికి శ్వాస వచ్చేటప్పుడు 'సో' అనే ధ్వనీ, బయటికి వచ్చేటప్పుడు 'హం' అనే ధ్వనీ, వినవస్తుంది. అందుకే 'సోఽహం' 'హంస' అయింది. దీనికే 'అజపాగాయత్రి' అని పేరు. ఈ గాయత్రి జపం నిమిషానికి ఒక పర్యాయం జరుగుతూవుంటుంది.

హంసశ్శుచిషద్వసురంతరిక్ష సద్ధోతా
వేదిష దతి ధిర్దురోణసత్।
నృషద్వర సదృత సద్వ్యోమ సదబ్జా
గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥

## పాదసూచికలు :

1. ఆచార్యతుమ్మపూడి కోటేశ్వరరావు – తిక్కన భారతము, అనుశాసనిక పర్వపీఠిక, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1974, పుట – vi

2. విశ్వనాథసత్యనారాయణ – కల్పవృక్షరహస్యములు, పి.యస్. అండ్ కో., గుంటూరు, 1976, పుట – 5.

3. ఆచార్యకోవెల సుప్రసన్నాచార్య – సంక్షుబ్ధ వర్తమానంలో భారతీయ సంస్కృతి, చూ॥ భావుకసీమ (సాహిత్య వ్యాస సంపుటి) యువభారతి, హైదరాబాద్, 1993, పుటలు 9–10.

4. రామాయణ కల్పవృక్షము – అరణ్యకాండ – జటాయుఖండము,5th Ed.,1970. పద్యం – 2

5. ఋగ్వేదము 1–164–46, అధర్వవేదం 9–10–28

6. శ్రీకృష్ణదేవరాయలు – అముక్తమాల్యద, 4–28

7. విశ్వనాథసత్యనారాయణ – గిరికుమారుని ప్రేమగీతాలు, గీతం – 43.

8. కాత్యాయన శ్రౌతసూత్రమ్ (II-6-7) – కర్క, యాజ్ఞికదేవభాష్యమ్, Ed.డా॥ ఎ. వీబర్, పుటలు 208 –209

9. ఆపస్తంబీయ శౌత్రసూత్రమ్ (II-3-1) – ధూర్తస్వామి భాష్యం, రామాగ్నిచిత్ విరచితవృత్తి, మైసూరు, 1944 పుట – 157.

10. ఆపస్తంబీయం శుల్బసూత్రవ్ (II-4-15)– కపర్దిస్వామి, కరవింద, సుందరరాజ, భాష్యసహితమ్, మైసూరు, 1931. పుటలు – 70–71.

11. మల్లంపల్లి శరభయ్య, మాళవికాగ్నిమిత్రము, భూమిక, రాజమండ్రి, 1970, పు iii - V

12. కాళిదాసు – మాళవికాగ్నిమిత్రము, ద్వితీయాంకము శ్లో – 25.

13. రామాయణ కల్పవృక్షము – అరణ్యకాండ – మారీచఖండం – పద్యం – 25

12. Prof. S. Sankaranarayanan - The Vedic Origins of Sri Venkateswaraswami Temple, SAPTAGIRI, T.T.D., Religious Monthly Journal, Tirupati. Vol. XI, No. 4, September 1980, PP.17-24.

15. శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు –సుపర్ణసూక్తము, వరల్డ్ టీచర్ ట్రస్ట్, విశాఖపట్టణం, 1982.

16. బ్రహ్మశ్రీ చదలువాడ జయరామశాస్త్రి – గాయత్రీ రామాయణము, నెల్లూరు, 1968.

17. Chitrabhanu Sen, A Dictionary of the Vedic Rituals, Delhi, 1978, pp 31-32.

17. Th. Bloch - Excavations at Lauriya, Annual Report of Archeological Survey of India, 1905 - 06, pp 11-15 and also see W. Caland's Paper, Amsterdam, 1912.

18. Prof. V.S. Agrawala - Vision of Long Darkness (Thousand Syllabled Speech) Varanasi, 1962

19. P.V. Kane - History of Dharma Sastra, Vol. IV, Bhandarkar Oriental Research Institute, Poona, 1960, pp 246 ff.

20. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ – అమరావతీస్తూపము – ఇతర వ్యాసములు, మద్రాసు, 1932, పుటలు 18–22.

21. వాల్మీకి రామాయణము – సుందరకాండ. 5–22–29

22. వాల్మీకి రామాయణము – సుందరకాండ. 5–56–30

23. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ – 'బౌద్ధకళారంభములు – భర్హుత్ స్తూపము', ఆంధ్రపత్రిక 'ఖర' ఉగాది సంచిక 1951 – 52 పుటలు 1–12.

24. P.C. Pant - Megaliths of Jangal Mahal and Vedic Tradition (Poona, 1978) See : Indian Archaelogy - A Review 1963 - 64 pp 40-41.

25. G.R. Sharma - Excavations at Kausambi, 1957 - 59, Allahabad, 1960, pp 87 ff.

26. T.N. Ramachandran - Asvamedha Site near Khalsi, Journal of Oriental Research, Madras 1953, and also see Indian Archaeology - A Review 1953 - 54, pp 10-11.

27. Prof. V.S. Agrawala - Sparks from the Vedic Fire, Varanasi,1962 pp 12-13.

28. Ibid., PP 52-60 (See : The Article SUPARNA)

29. Peter Peterson, Sayana's Preface to the Rgvedabhashya, 1890/1974, B.O.R.I., Poona, P - 63.

30. Baladev Upadhyaya, Vedabhashya Bhumika Sangraha. A collection of all available Sayana's Introductions to the Vedic Commentaries. Varanasi, 1934, P - 45.

# ద్వితీయాధ్యాయం

## జైనసంప్రదాయం - మత,తాత్త్విక, చారిత్రక సమన్వయం

శ్రీమత్పరమ గంభీర స్యాద్వాదామోఘ లాంఛనమ్ ।
జీయాత్ త్రైలోక్యనాథస్య శాసనం జినశాసనమ్॥

May the sacred Jaina doctrine, the doctrine of the Lord of the three worlds, be victorious, supreme, profound syadvada, the token of the unfailing success.

"Jainism and Buddhism have their roots in Hinduism, but while the latter branched off considerably from the parent stock, Jainism has kept close to it and this occupies a middle position between Hinduism and Buddhism."

- Prof. L. Mukherjee [1]

జైనమతం, బౌద్ధమతం నుండి పుట్టిందని తొలుత భావించేవారు. కాని, ఆ తర్వాత ప్రాచీన చరిత్ర పరిశోధనల ద్వారా జైనమతం గౌతమబుద్ధునికి పూర్వమే ఉన్నదని నిశ్చయింపబడింది. క్రీ.పూ. 8వ శతాబ్దికి చెందిన పార్శ్వనాథుడు జైనమత స్థాపకుడు. ఈ తీర్థంకరుడు అనేక శిరస్సులు గల పాముపడగల నీడలో ధ్యానముద్రలో ఆసీనుడైనట్లు చిత్రింపబడుతూ ఉన్నాడు. ఇతడు క్రీ.పూ 777లో నిర్వాణాన్ని పొందినట్లు చెబుతారు. పార్శ్వనాథుడు నాల్గు వ్రతాలను బోధించాడు. 1. అహింస, 2. సూనృతము (సత్యము), 3. అస్తేయము (దొంగతనం చేయకుండుట), 4. అపరిగ్రహము (భౌతికవస్తుసంపదను స్వీకరిపకుండుట).

జైనమతానికి సైద్ధాంతికంగా రూపురేఖలు దిద్దినవాడు వర్ధమాన మహావీరుడు. ఈ మతంలో 24 తీర్థంకరులున్నారు. వీరిలో మొదటి వాడు ఋషభనాథుడు లేక ఆదినాథుడు. 23వ తీర్థంకరుడు పార్శ్వనాథుడు. చిట్టచివరి తీర్థంకరుడు వర్ధమాన మహావీరుడు. అందుకే ఇతనిని 'చరమతీర్థకృత్' అని పిలుస్తారు. జినధర్మానికితడు విశేష వ్యాప్తి కల్గించాడు. పార్శ్వనాథుడు చెప్పిన నాల్గు వ్రతాలకు ఐదవదిగా సచ్ఛీలత బ్రహ్మచర్యము అంటే (నైతిక ప్రవర్తన)ను చేర్చాడు. దీనినే పంచమధర్మంగా చెబుతారు.

**మహావీరుని జీవిత విశేషాలు :** మహావీరుని జన్మస్థలం వైశాలి. ఇతడు లిచ్ఛవీ వంశంలో జన్మించాడు. త్రిశాలదేవి, సిద్ధార్థులీతని తల్లిదండ్రులు. సంప్రదాయవాదుల ప్రకారం

ఇతడు క్రీ.పూ. 599లో జన్మించి క్రీ.పూ. 547లో నిర్యాణం పొందాడు. జైనసన్యాసులైన హేమచంద్ర, మేరుతుంగ వ్రాసిన గ్రంథాలను బట్టి, ఆధునిక చరిత్ర పరిశోధకులైన Jacobi,మరియు Carpentier, Cambridge History of India, Vol. I లో క్రీ.పూ. 540లో జన్మించి క్రీ.పూ. 468లో పరమపదించాడని నిర్ణయించారు. మహావీరునికి 42వ యేట జ్ఞానోదయమైంది. ఈ స్థితి పొందిన వానిని జైనులు 'కేవలుడు' అంటారు. ఇతడు 30 సంవత్సరాల కాలం మత ప్రచారం చేసి 'జిను' డనే పేరు పొందాడు. (క్రీ. పూ. 497-467). ఈ పేరును బట్టియే ఈ మతానికి జైనమతమని పేరు వచ్చింది. ఈయన మొత్తం జీవితకాలం 72 సంవత్సరాలు. ఇతడు పాట్నా జిల్లాలోని కుగ్రామమైన 'పావా' లో పరమపదించాడు.[2]

**జైనమత ప్రధాన సిద్ధాంతాలు** : జైనులు బౌద్ధులవలె వేదాలను, వాటిలో చెప్పబడిన యజ్ఞక్రియా కాండలను తిరస్కరించారు. భౌతికమైన ప్రపంచం నుండి జీవుని విడుదలనే ప్రధానంగా ఉద్దేశించింది జైనమతం. ఈ 'విడుదల'ను వారు 'మోక్ష'మనే పేరుతో కాక 'నిర్వాణ' మనే పేరుతో పిలిచారు. జైనమతంలో 'త్రిరత్నములు' ముఖ్యమైనవి. అవి 1. సమ్యక్ దర్శనం, 2. సమ్యక్ జ్ఞానం, 3. సమ్యక్ చారిత్రం. ఇవి ఒక విధంగా భారతీయసంప్రదాయం లోని అధీతి, బోధ, ఆచరణ, ప్రచారాలకే మరో విధంగా పేర్లు పెట్టడంగా చెప్పవచ్చు.[3]

జైనులు, భారతీయ వేదాంతంలోని విరాట్పురుషుని, విశ్వాత్మ (Universal Soul) ను విశ్వసించరు. వారు పరమపురుషుడు, సృష్టికర్తయైన బ్రహ్మ ద్వారా ఈ జగత్తు సృష్టించినాడని నమ్మరు. వారి దృష్టిలో భగవంతుడంటే మానవునిలో గల మహత్తర గుణగణాలన్నీ ఏకీభవించిన మూర్తి. వారు జడపదార్థాలలో కూడ ప్రాణశక్తి ఉందని అంగీకరిస్తారు. 'అహింస' ఒక్కటే జైనమతంలోని కీలకమైన అంశం. అందుచే వీరు మాంసాహారాన్ని త్యజిస్తారు. వడబోసిన నీటినే సేవిస్తారు. కంటికి కనబడని సూక్ష్మక్రిముల్ని పరిహరించాలని ముక్కు, నోరు కనబడకుండా తెల్లని గుడ్డ అడ్డంగా కట్టుకుంటారు. కాలిక్రింద క్రిమికీటకాదులు పడిచస్తాయని నేలను ముందుగా ఊడుస్తూ కాలుపెట్టినడుస్తారు. సాయంత్రం దీపాలు పెట్టకముందే భోంచేస్తారు. దీపకాంతికి క్రిములు మరణిస్తాయని జాగ్రత్తపడుతారు. (History of Religions in India, Barth) సామాన్య మానవుల కంటె సన్యాసులైన శ్రావకులకు కట్టుబాట్లు మరీ ఎక్కువగా ఉంటాయి. జైన సన్యాసులు కఠోర దీక్షలకు ఎక్కువ ప్రాముఖ్యమిస్తారు. వీటిలో అతి కఠోరమైన దీక్షకే 'సల్లేఖన' మని పేరు. నిరాహారియై ప్రాణపరిత్యాగం చేయడమే 'సల్లేఖన' మనే మాటకు అర్థం.

**జైనమత వ్యాప్తి :** మహావీరుడు నిర్వాణం పొంది తర్వాత జైనమతం 'శ్రుతకేవలుల' వలన విస్తృత ప్రచారం పొందింది. వీరిలో ప్రముఖ వ్యక్తి భద్రబాహుడు. ఇతడు చంద్రగుప్తమౌర్యుని సమకాలీనుడు. ఇతడు తన అనుయాయులతో దక్షిణ భారతదేశానికి వలసవచ్చాడు. విశేషించి తమిళనాడును జైనమత సిద్ధాంత ప్రభావంలోకి తెచ్చాడు. ఇతడు వలస వచ్చిన కాలం క్రీ.పూ. మొదటి శతాబ్దంగా నిర్ణయింపబడింది. ఇతడిలా వలస వచ్చిన కారణంగా జైనమతం రెండుగా చీలిపోవడానికి అంకురార్పణం జరిగింది. అవి 1. దిగంబర శాఖ, 2. శ్వేతాంబర శాఖ. ఈ చీలిక క్రీ.శ. 5వ శతాబ్ది మధ్యభాగంలో 'వలభి' లో జరిగిన రెండవజైన సంఘయనం (Second Great Council of Jain Monks) తో స్థిరపడింది.

ఈ రెండు శాఖల ప్రధానభేదమేమనగా దిగంబరులు భద్రబాహుని అనుసరిస్తూ దక్షిణ భారతదేశానికి వలసవచ్చిన వారు, వస్త్రహీనులై సంచరించేవారు. అందుకే వీరు ఊరికి దూరంగా ఉండే కొండలపై స్థావరాలు కట్టుకొని లేదా కొండగుహలలో నివసించేవారు. ఉదాహరణకు, క్రీ.శ. 1,2 శతాబ్దాలలో తిరుమల కొండలపై జైన దిగంబర సన్యాసులు తొలిసారిగా స్థావరం ఏర్పాటుచేసుకొన్నట్లు, కొండపై గల ఇప్పటి స్వామి విగ్రహం ఒకప్పుడు జైన తీర్థంకరుని విగ్రహంగా కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. స్వామిభుజాలకు గల నాగాభరణం కుక్కుట సర్పానికి సూచకమని, ఇవి తీర్థంకరుల భుజాలకు ఉంటాయని వారు చెబుతున్నారు.

క్రీ.శ. 5,6 శతాబ్దాలలో తమిళనాడులో శైవమతం విజృంభించిన కాలంలో సుందరపాండ్యుని నాయకత్వంలో జైనులను కొండల మీద నుండి పారద్రోలి, సంహరించి శైవులు ఆ స్థావరాలను స్వాధీనపరచుకొన్నట్లు తెలుస్తున్నది. తత్ఫలితంగా తిరుమల పై స్వామి 'శివుడు' గా కొంతకాలం వెలసినట్లు చెప్పవచ్చు. తిరుమల దేవాలయానికి సంబంధించిన తొట్టతొలి శాసనం మనకు క్రీ.శ. 614 నుండే లభిస్తూవుంది. అది శైవుడైన, పల్లవ వంశపురాజు మొదటి మహేంద్రవర్మ (క్రీ.శ. 600-630) తన పరిపాలనా సంవత్సరం (regral year) 14వ ఏట వేయించిన రెండు శాసనాలు. తత్పూర్వం ఉన్న జైన మతాధారాలు, చిహ్నాలన్నీ శైవులచే నశింప జేయబడ్డాయి. కర్ణాటక దేశంలో వీరశైవమతం విజృంభించినప్పుడు ఈ స్వామి కొంతకాలం 'వీరభద్రుడు'గా వెలసినట్లు తెలుస్తోంది. ఈ తర్వాత తమిళనాడులో శ్రీమద్రామానుజులు, వైష్ణవమత పీఠాధిపతులుగా, ఆచార్యులుగా (క్రీ.శ. 1017 - 1137) అవతరించిన తర్వాత ఆయన సమక్షంలో తిరువేంగడముడైయాన్ శ్రీ మహావిష్ణువుగా స్థిరపడ్డాడు.'వైష్ణవ' మనే పదం తిరుమల, తిరుపతి శాసనాలలో తొలిసారిగా క్రీ.శ. 995 నాటి శాసనంలో కనబడుతుంది. అలాగే 'తిరుమలై' అనే పదాన్ని పేయాళ్వారు (క్రీ.శ. 575-600) తన పాశురంలో తొలిసారిగా ప్రయోగించడమే కాదు, కొండపై స్వామిని

హరి హరునిగా వర్ణించిన వాడీయనయే! టి.టి.డి. శాసనాలలో చూస్తే 'తిరుమలై' అనే పేరు రాజేంద్రచోళుని శాసనం (క్రీ.శ. 1013) లో మొట్టమొదటి సారిగా కనబడుతుంది. పన్నిద్దరాళ్వారులలో తొలి ఆళ్వారులు ఈ స్వామిని హరిహరునిగా వర్ణించడం వలన తిక్కన సోమయాజి ఈ స్వామినే హరిహరనాథుడుగా సంభావించినట్లు కొందరు చెబుతారు. ఔత్తరాహులైన భక్తులు'బాలాజీ' అని పిలవడంలో స్వామి 'బాలాత్రిపుర సుందరియైన శక్తి స్వరూపిణి అనీ, స్త్రీమూర్తికి పురుష వేషం ధరింపజేశారని చెబుతారు. ఏదిఏమైనప్పటికీ తాళ్లపాక అన్నమయ్య చెప్పినట్లు –

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమేనీవు
అంతరాంతరము లెంచి చూడ పిండంతే నిప్పటియన్నట్లు [4] అనే సంకీర్తన దీనికి సరైన సమాధానం. తిరుమలపై వెలసిన స్వామి సకల దేవతాస్వరూపుడని సంభావించడమే యుక్తమనిపిస్తుంది. కొందరీ స్వామియే 'కల్కి' అవతారంగా ఆవిర్భవించబోతున్నాడని చెబుతారు. అది భవిష్యద్వాణి!.

ఇప్పుడు ప్రస్తుతాంశానికి వద్దాం! ఉత్తర దేశమందే నిలచిపోయిన జైన సన్యాసులు శ్వేతాంబరులు. వీరు తెల్లని పొడుగైన వస్త్రాన్ని ధరించేవారు. వర్ధమాన మహావీరుని కాలంలోనే ఆయనకు ఆజీవికులనే తెగను స్థాపించిన గోసలుడనే వానితో భేటీ కల్గింది. ఈ ఆజీవికులు అశోకుని శాసనాలలో గయకు సమీపంలోని కొండగుహలలో నివసించే పర్వత ప్రాంతీయులుగా చెప్పబడినారు. బహుశా, జైనదిగంబర శాఖకిది ప్రేరకం కావచ్చు.

జైన మత చరిత్ర చాలా ఆసక్తికరమైంది. వీరిలో ఎందరో మహానుభావులు, మేధావులు జన్మించి సంస్కృత ప్రాకృత భాషల్లో మతగ్రంథాలు వ్రాయడమే గాక, సాహిత్యాభివృద్ధికి ఎంతో కృషి చేశారు. పరమత సహనం కోల్పోయిన మన పూర్వీకుల మతకలహాలచేత, అసూయాద్వేషాల చేత మనమా విలువైన మత, సాహిత్యసంపదను ఎంతో పోగొట్టుకొన్నాం. జైనమతం ప్రముఖంగా దక్షిణ భారత దేశపు భాషాసాహిత్యాలు సంస్కృతులను ఎక్కువగా ప్రభావితం చేసిందనడం తిరుగులేని చారిత్రక సత్యం! ఈ చారిత్రక వాస్తవాలను మనం ముమ్ముందు పుటల్లో పరిశీలించబోతున్నాం.!

**జైనమత పీఠాలు :** జినధర్మం ఆంధ్రభూమిని క్రీ.పూ. 4వ శతాబ్దం మొదలుకొని క్రీస్తు తర్వాత 12వ శతాబ్దాంతం వరకు ఇంచుమించుగా 16 శతాబ్దాలు వర్ధిల్లినట్లు చెప్పవచ్చు. 13వ శతాబ్దారంభంతో జైనం పూర్తిగా ఆంధ్రదేశంలో అంతరించిపోయింది.

జైనుల ధర్మభాష అర్ధమాగధి అని అష్టవిధప్రాకృత భాషలలో నొకటి. బౌద్ధులకు పాలీ అనబడే మాగధి ప్రాకృత మెటువంటిదో, జైనులకు అర్ధమాగధి ఆ విధంగా మాతృభాష. జైనుల ధర్మ గ్రంథాలన్నీ 'అర్ధమాగధి' లోనే రచింపబడినాయి.

శ్వేతాంబర, దిగంబరులని జైనులలో రెండు శాఖలున్నాయని తెలిసికొన్నాం. జైనులు పూజార్చలు చేసే అర్హతు [5]లనబడే తీర్థంకరులు [6] ఇరవై నాలుగు మంది ఉన్నారు. వీరిని జినులని [7] వ్యవహరిస్తారు. ప్రతి తీర్థంకరునికి ఒక్కొక్క దేవి ఉంటుంది. వారికి శాసనదేవులని పేరు. తీర్థంకరుడు పురుషుడు. శాసన దేవి శక్తిస్వరూపిణి. శాసన దేవులు బ్రాహ్మణ శైవాగమము లోని శక్తులు, మాతృకల వంటి వారు. ప్రతి తీర్థంకరునికి ఒక విలక్షణమైన చిహ్నముంటుంది. ఆ చిహ్నం తీర్థంకరుని ప్రతిమకు అడుగుభాగంలో ఉంటుంది. ఆ చిహ్నాన్ని బట్టి తీర్థంకరుని ప్రతిమకు పూయబడిన రంగును బట్టి అతణ్ణి గుర్తింపవచ్చు.

ఇక్కడ **24** తీర్థంకరుల పేర్లు, వారి చిహ్నం – శాసనదేవుల పేర్లు యివ్వడం అవసరం లేదు. కాబట్టి ప్రధానులైన ఐదారుగురు తీర్థంకరుల పేర్లు మాత్రమే ఉదాహరించి వారిలో ఎనిమిదవ తీర్థంకరునిపై దృష్టిని కేంద్రీకరిస్తున్నాను.

| **తీర్థంకరుని పేరు** | **శాసనదేవి** | **చిహ్నం** |
|---|---|---|
| **1.** ఋషభనాథుడు (లేక) ఆదినాథుడు | చక్రేశ్వరి | ఋషభం |
| **2.** సుపార్శ్వ | శాంతాదేవి | 卐 స్వస్తికం |
| **8. చంద్రప్రభా** | **భృకుటీ** | **శశి** |
| **10.** శీతలనాథ | అశోక | శ్రీవత్సలాంఛనం |
| **18.** అరనాథ | ధారిణీ | నంద్యావర్తం |
| **23.** పార్శ్వనాథ | పద్మావతీ | శేషఫణి |
| **24.** వర్ధమానవీర, మహావీర (లేక) వర్ధమాన ప్రభు | సిద్ధాయికీ | సింహం |

వీరిలో ఎనిమిదవ తీర్థంకరుని పేరు చంద్రప్రభాచార్యుడు. ప్రతి తీర్థంకరునికీ ఒక ప్రత్యేక చిహ్నముంది. ఇంతే గాక, ప్రతి తీర్థంకరునికీ ఒక యక్షుడు, ఒక యక్షిణి ఉంటారు. యక్షుని ఉపాసకుడనీ, యక్షిణిని శాసనీదేవి అని అనడం కూడా కద్దు.

**తీర్థంకరుడు - చిహ్నము - యక్షుడు (ఉపాసకుడు) - యక్షిణి (శాసనీదేవి)**
చంద్రప్రభుడు – అర్ధచంద్రము (శశి) – విజయుడు – భృకుటీ

ఈ ఎనిమిదవ తీర్థంకరుని పేరు, ఆతని చిహ్నము, శాసనదేవి పేరు – శ్రీవిద్యలోని కుండలినీ యోగ విషయంతో సమన్వయిస్తోంది.

**చక్రం - స్థానం - తత్త్వం - లోకం - శక్తి**

ఆజ్ఞాచక్రం – భ్రూమధ్యం – మనస్సు – తపోలోకం – చంద్రుడు

'భ్రుకుటి' ఆజ్ఞాచక్రస్థానమైనందున దానిని భేదించిన వాడు సహస్రారకమలమైన చంద్రమండలాన్ని (శశి) పొందుతాడు. అనగా కుండలినీ శక్తి సహస్రారకమలాన్ని ప్రవేశిస్తుంది. అతడే విజయుడు. దానితో సుధాధారలు సహస్రారం నుండి కురుస్తుంది. అదే యోగికి ఆహారం. దానినే 'చంద్రప్రభ' అన్నారు జైనులు. చంద్రప్రభ ముఖమండలంపై వెలిగే వాడు చంద్రప్రభాచార్యుడు. ఆ విధంగా కుండలినీయోగ సిద్ధి పొందిన వారి శిరస్సు పైననే 'త్రిరేఖాఛత్రం' జైనమతంలో ఉంచబడుతుంది.

దీనికి ఉపబలకంగా, నిలిచియున్న తీర్థంకరశిల్పాలన్నీ 'కాయోత్సర్గ ముద్ర' యుండడం గమనించవచ్చు. ముఖ్యంగా తీర్థంకరుడు నిలిచియున్నా, ఉపవిష్టుడై యున్నా త్రిరేఖాఛత్ర మొకటి అతని శిరస్సుపై అలంకరింపబడియుంటుంది. పాశ్చాత్య విమర్శకులందరు దీనిని 'త్రిమకుటం' (TRIPLE CROWN) అని నిర్వచించారు.

జైనులకు అష్టమంగళ చిహ్నాలు, ప్రతీహార్య చిహ్నములుంటాయి. అష్టమంగళ చిహ్నాలలో **'పీఠం'** ఒకటి. ప్రతీహార్య చిహ్నాలలో **'సింహాసనం'** ఒకటి. జైనుల దేవతా స్వరూపాలలో సరస్వతి ప్రముఖమైంది. సరస్వతిని వీరు 'శ్రుతదేవి' ప్రజ్ఞావతి అని పిలుస్తారు.[8]

అర్హతులు తామెక్కడికి పోతూఉన్నా ముందు **నెమలి పింఛాన్ని** లాంఛనంగా పట్టుకొని పోతారు. నెమలికన్ను వారి ప్రజ్ఞానేత్రమునకు చిహ్నమేమో! కుందకుందాచార్యునిగా ప్రసిద్ధిపొందిన జైనాచార్యుడు ఆంధ్రుడే. ఆయన గృధ్రపింఛుడు అంటే గ్రద్ద ఈకల పింఛాన్ని చేతపట్టుకొనేవాడు. ఒక 'గచ్ఛము' నకు పీఠాధిపతియైన ఆచార్యునికి 'సూరి' అని బిరుదవాచకముంటుంది. 'గణము' 'గచ్ఛము' రెండూ పర్యాయపదాలు. జైన సంఘంలో **84** గచ్ఛలు లేదా గణములుంటాయి.

ఆంధ్రదేశంలో జైన సంఘయనము (Jaina Conference) ఏర్పాటుచేసినవాడు ఖారవేలుడు. కళింగ దేశం పాలించిన ఖారవేలుని హతిగుంఫ శిలాశాసనం క్రీ.పూ. **2**వ శతాబ్దికి చెందింది. శాసనాలలో ఉదాహరింపబడిన **'సంఘాన్వయ'** మన్నా, వర్ధమాన మహావీరుని నిర్వాణానంతరం ఏర్పడిన **'మూలసంఘ'** మన్నా రెండూ జైన సంఘానికి పేర్లే. ఈ మూలసంఘం క్రీ.శ. **156**వ సంవత్సరంలో అనగా మహావీరుడు నిర్వాణసిద్ధి పొందిన **686** సంవత్సరాల తర్వాత స్థాపింపబడింది![9]

వర్ధమానుడు, పార్శ్వనాథుని నుండి ఆధ్యాత్మిక సంప్రదాయం గ్రహించినాడు. ఆ సంప్రదాయం మూడు విధాలు. 1) సంఘం, 2) ఆచారం, 3) శ్రుతం. వర్ధమాన మహావీరుడు (క్రీ.పూ. 599-547) 72 సంవత్సరాలు జీవించాడు. అతడు జైనసంఘాన్ని 4 విధాలుగా వర్గీకరించాడు. 1) శ్రావకులు, 2) శ్రావకి, 3) సాధారణ పురుషుడు, 4) సాధారణ స్త్రీలు. శ్రావకులను తొమ్మిది గుణాలుగా వింగడించి తన ప్రధాన శిష్యుని 'గణధరుని' గా నియమించి, ఈ తొమ్మిది గణధరుల కధిపతిగా 'ఇంద్రభూతి గౌతముడు'నే వానిని ఏర్పరచాడు. శ్రావకీలకు చందనుడు అధిపతి. మూడవ వర్గమైన సాధారణ పురుషులకు నాయకుడు శంఖశతకుడు, నాల్గవవర్గమైన సాధారణ స్త్రీలకు సులేశ, రేవతులనే వారు అధిపతులు.[10]

**భట్టారక సంప్రదాయం - జైన పీఠాలు :** 'భట్టారక' బిరుదం ఒక విధమైన జైనయతులకు సంబంధించినది. ఈ సంప్రదాయం శ్రీ ఆది శంకరాచార్యులు స్థాపించిన చతురామ్నాయ పీఠాలవంటిదే! భట్టారక సంప్రదాయం జైనమతం లోని శ్వేతాంబర, దిగంబర శాఖలు రెంటిలోను ఉన్నాయి. క్రీ.శ. 8వ శతాబ్ది నుండి ఈ పీఠాలున్నట్లు మనకు తెలుస్తున్నప్పటికీ చారిత్రకాధారాలు క్రీ.శ. 13వ శతాబ్ది నుండే లభిస్తున్నాయి.[11]

## భట్టారక పీఠములు

| క్రమ సంఖ్య | గణం లేదా సంఘం | పీఠస్థానం | పీఠాల సంఖ్య |
|---|---|---|---|
| 1. | సేన గుణం | కరంజ (అకోల జిల్లా, బీరార్) | 1 |
| 2. | బలాత్కార గణం | జైపూర్, నాగూర్, అతేర్ ఇదేర్, భన్‌పూర్, సూరత్ జెర్‌హత్, కరంజ, లతూర్ మాల్‌ఖేడ్ | 10 |
| 3. | కాష్ఠాసంఘం | హిసర్, సూరత్, గ్వాలియర్, కరంజ | 4 |
| 4. | తక్కిన పీఠాలు | కొల్హాపూర్, ముద్‌బద్రి, కర్కల్, హంబక్, శ్రమణబెలగొలా ఇత్యాది | 7 |
| | | మొత్తం పీఠాలు | 22 |

**జైనసంస్కృత వాఙ్మయం - పీఠికా శబ్దం :** భట్టాకలంకుడు (క్రీ.శ. 642) జైన నైయాయికుల్లో ప్రసిద్ధుడు. కాంచిలో హిమశీతలుని యాస్థానంలో బౌద్ధులను వాదంలో జయించినవాడు. ఇతడు కుమారిల, శ్రీ శంకరాచార్య, ప్రభాకర, మండన మిశ్రాదుల సమకాలీనుడు. కుమారిలుడు ఈతని వాదాలను నిరాకరించాడని శాంతరక్షితుని తత్త్వసంగ్రహం వలన తెలుస్తున్నది. భట్టాకలంకుడు బహుశః రాష్ట్రకూట రాజైన సాహసతుంగుని ఆస్థానంలో ఉన్నవాడు. ఇతని వైదుష్యమిలా కీర్తింపబడింది.

తారాయేన వినిర్జితా ఘటకుటీ గూఢావతారా సమం
**బౌద్ధైర్యోద్ధృత పీఠ పీడిత కుదృగ్దేవాత్త సేవాంజలిః** ।
ప్రాయశ్చిత్త మివాంఘ్రి వారిజ రజః స్నానంచయస్యా చరన్
దోషాణాం సుగత స్సకస్య విషయో దేవా కళంకః కృతీ॥

**వాదిరాజు పాండిత్యం :-** రాష్ట్రకూట సామ్రాజ్యపతనాంతరం కల్యాణి చాళుక్యులు జైనపండితులను పోషించారు. శ్రుతబిందు, కర్మప్రకృతి, శ్రీపాలత్రైవిద్యులు గ్రంథాలు వ్రాశారు. ఆహవమల్ల ఇమ్మడి బెడంగుని కాలంలో వీరనంది, చంద్రప్రభా చరితను రచించాడు. ఇమ్మడి జయసింహుని ఆస్థానంలో హేమసేన, విద్యాధనంజయుడు, వాదిరాజు, వాదీభసింహుడు, ఒడయ దేవులు ప్రఖ్యాతిగాంచారు. వీరిలో వాదిరాజు ఇలా స్తుతింపబడినాడు.

ఆరూఢ్యాంబర మిందుబింబ రచితౌత్సుక్యం సదా సద్యశః
ఛత్రం వాక్చమరీజరాజి రచయోఽభ్యర్ణం చమత్కృర్ణయోః ।
**సేవ్యః సింహసమర్చ్యపీఠవిభవః** సర్వప్రవాది ప్రజా
దత్తోచ్చైర్జయకార సార మహిమా శ్రీవాదిరాజో విదామ్॥

**శ్రీవిజయుని పాండిత్యం :-** శ్రీవిజయుడు గంగరాజు చే పూజితుడైనవాడు. ఇతని పాండిత్యమిలా వర్ణింపబడింది.

యద్విద్యాతపసః ప్రశస్తముభయం శ్రీహేమసేనేమునౌ
ప్రాగాసీత్సుచిరాభియోగబలతో నీతం పరామున్నతిమ్ ।
ప్రాయః **శ్రీవిజయేతదేత దఖిలం తత్పీఠికాయాం స్థితే**
సంక్రాంతం కథ మన్యథా నతి చిరాద్విద్యాదృగీ దృక్ సః ॥ [12]

# దక్షిణభారతదేశం - జైన సాహిత్య ప్రభావం

ఉత్తరభారతదేశంలో పుట్టిన జైనమతం లోని ఒక సంఘం కర్ణాటక దేశంలోని 'శ్రమణ బెలగోలా'కు వచ్చి, అక్కడ రెండుగా చీలి, ఒక శాఖ ఆంధ్రదేశానికి, మరియొక శాఖ తమిళనాడుకు వెళ్లినట్లు చారిత్రకులు నిర్ణయించారు. తెలుగులో కన్న తమిళంలో జైన వాఙ్మయమధికం. అసలు ప్రాచీన తమిళ సాహిత్యానికి జైనులే మూలపురుషులు. మౌలిక సాహిత్య సంఘాలు వారివే. ప్రసిద్ధ గ్రంథకర్తలు వారే. ఒక్క మాటలో చెప్పాలంటే, జైనులే తమిళప్రాచీన సాహిత్యోద్ధారకులు.

కన్నడ సాహిత్యంపై కూడ జైనమత ప్రభావం అత్యధికంగా ఉన్నది. జైన సాహిత్యంతోనే కన్నడ సాహిత్య చరిత్ర ప్రారంభమౌతున్నది. తెలుగు సాహిత్య ప్రారంభకాలంలో కన్నడ సాహిత్య ప్రభావమధికంగా ప్రసరించింది. ఆదానప్రదానాలూ విశేషంగా జరిగాయి. తమిళ జైన సాహిత్యంపై విపుల పరిశోధన చేసిన వారు ఆచార్య ఎ. చక్రవర్తి గారు. వారి గ్రంథాన్ని సుపరిష్కృతమొనర్చి, అధస్సూచికలతో, అనుబంధాలతో, సూచికలతో చక్కని పీఠికను సంతరించిన వారు డా॥ కె.వి. రమేష్ గారు. గ్రంథం పేరు Jaina Literature in Tamil.

ఎడ్వర్డ్ పి.రైస్ దొర ఆంగ్లంలో కన్నడ సాహిత్య చరిత్రను వ్రాశారు. ఇందులో మొదటి రెండు అధ్యాయాలు (క్రీ.శ. **850-1160**) జైన వాఙ్మయానికే కేటాయింపబడినవి. తెలుగుపై కన్నడ సాహిత్య ప్రభావాన్ని గూర్చిమౌలిక పరిశోధనలు చేసినవారు నిడుదవోలు వేంకటరావు గారు . తమిళసాహిత్య ప్రభావాన్ని గూర్చి పరిశోధించిన వారిలో కీ॥ శే॥ ఆచార్య తిమ్మావజ్ఝల కోదండ రామయ్య , కీ॥ శే॥ ఆచార్య చల్లా రాధాకృష్ణ శర్మ గారు ప్రముఖులు.

కాబట్టి తమిళ, కన్నడ జైనసాహిత్యాలను ప్రస్తావించకుండా తెలుగు సాహిత్య వికాస పూర్వయుగాన్ని వివరించడానికి వీలులేదు. అందువలన తమిళ, కన్నడ, ఆంధ్రదేశాలలో జైనమతం ఎలా ప్రవేశించినదో తెలుసుకొంటే ఆయా సాహిత్యవికాసాలు తెలుస్తాయి. ఆ తర్వాత పరస్పర ప్రభావాదులను పరిశీలించడం సముచితంగా ఉంటుంది. ఇది సాహిత్య నేపథ్యరేఖా చిత్రం.

"A casual perusal of Tamil literature will reveal the fact that, from the earliest times it was influenced by Jaina culture and religion. It is a well-known fact that the Jainism was a religion originated in Northern India and thus must be associated with Aryan culture. When Jainas migrated to the

South and how they came in contact with the Orignal Tamilians are problems which still remain obscure".[13] అంటున్నారు ఆచార్య చక్రవర్తి.

" The question as to when exactly Jainism enterted the Tamil Country and whether it did so through Andhra or via Karnataka are matters of mere academic interest".[14] అని వ్రాశారు డా॥ కె.వి. రమేష్.

వైదికమతంలోని హింసను ప్రతిఘటిస్తూ పుట్టిన మతాలే జైన, బౌద్ధమతాలు. ఇవి పుట్టిన చోటు నుండి కదలి ప్రచారం సాగించడానికి గల ప్రధాన కారణం అహింసాతత్త్వమే. ఔత్తరాహమైన జైనమతం దక్షిణ భారత దేశంలో అడుగుపెట్టడానికి మూలహేతువిదే అయివుంటుంది. తమిళ జైన సాహిత్యమంతా అహింసాతత్త్వ ప్రబోధకంగానే ఉండడం దీనికి ప్రోద్బలకంగా ఉన్నది.

## ఔత్తరాహమైన జైనము దక్షిణ భారత దేశానికి వలసవచ్చుట

"The migration of the Jainas to South India is generally supposed to be at the time of Bhadrabahu, the guru of Chandragupta Maurya. That at the approach of a terrible famine of twelve years in the North, Badrabahu led a whole Jaina Sangha towards the Deccan, that he was followed by his disciple Chandragupta who abdicated his trrone in favour of his son and that they came and settled for sometime in the Mysore region, that Bhadrabahu and Chandragupta lost their lives on Chandragiri at Sramana Belagola and the rest migrated to the Tamil Country are facts generally accepted by oriental scholars."[15]

జైనులు దక్షిణ దేశమునకు వలస రావడంలో నాల్గు ప్రధానకారణములు కన్పడుతున్నాయి. 1) అహింసాతత్త్వ ప్రచారం, 2) చంద్రగుప్తుని స్వప్నం, 3) ఖారవేలుని ఆహ్వానం, 4) జైనమత వ్యాపనం.

డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు Jain Vestiges in Andhra అనే గ్రంథంలో వర్ధమాన మహావీరుడే స్వయంగా జైన సంఘాన్ని రెండువేల సన్యాసులతో నిర్మించి మూలసంఘం నుండి వారిని విడదీసి పదకొండు మంది గణధరులను దానికి మార్గదర్శకులనుగా నియమించి దక్షిణ దేశానికి వెళ్లి మతప్రచారం చేయుడని ఆదేశించినట్లు చెబుతున్నారు.

ఈ ఏకాదశ గణధరులలో ఉత్కృష్టజ్ఞానం పొందిన కేవలులు ముగ్గురు మాత్రమే. తక్కిన వారు శ్రుతకేవలులు. ఈ శ్రుతకేవలులలో చివరివాడు భద్రబాహు. ఇతడు చంద్రగుప్తునికి సమకాలీనుడు, సలహాదారు. ఈ చంద్రగుప్తునికి వచ్చిన స్వప్నాన్ని గూర్చి డా॥ శ్రీపాద యిలా వ్రాస్తున్నారు. " Chandragupta dreamt a fearful dream dominated by a twelve headed snake. Bhadrabahu interpreted that dream as portending a twelve year famine in North India. The result was a migration of about 2000 Jaina monks to the South, their stay at 'Sramana belagola' on the Indragiri and Chandragiri hills. It is generally believed that Bhadrabahu was the harbinger of Jainism into the South India."[16]

రాజుకు స్వప్నంలో వచ్చిన ద్వాదశ శిరస్సులు గల సర్పం, ద్వాదశ వర్షక్షామసూచకమని హితుడైన భద్రబాహువు చెప్పి, జైన సన్యాసులతో దక్షిణ దేశానికి వలసకై ఏర్పాటు చేయడాన్ని శ్రీపాద వారు చెప్పగా, ఆచార్య చక్రవర్తి గారు మరియొక కారణాన్ని ఇలాఊహిస్తున్నారు.

"That the migration to the South must have been conducted with a hope of hearty welcome from a friendly race for thousands of monks is the only reasonable suggestion." [17]

ఖారవేల మహారాజు జైనుడు. తాను 'ఐలుడ'నని చెప్పికొన్నాడు. అతని హాతిగుంఫ శిలాశాసనం అర్హతులైన వారికి నమస్కారాలతో ప్రారంభిస్తుంది. ఖారవేలుడు తాను శ్రావకుడననియు, గృహస్థుడననియు, జీవదేహముల యొక్క నిజస్థితిని తెలుసుకొన్న వాడననియు జినులనర్చించు వాడననియు చెప్పికొన్నాడు.

ఖారవేలుడు తన రాజ్యకాలంలో( regnal year) పండ్రెండవ యేట మగధరాజ్యాన్ని జయించి రెండు శతాబ్దాల క్రింద నందరాజు ఎత్తుకొని పోయిన కళింగ జినుని ప్రతిమను కొని తెచ్చి కళింగనగరి లో రమణీయ ప్రాసాదాన్ని నిర్మించి అక్కడ కళింగ జినుని ప్రతిష్ఠించినాడు. కళింగ జినుడనగా పదియవతీర్థం కరుడైన శీతలనాథుడు. ఈతడాంధ్రదేశం వాడని ప్రతీతి. గోదావరీ తీరంలోని భద్రపురి ( భద్రాచలము) ఈతని జన్మస్థానం. ఖారవేలుని కాలము క్రీ.పూ. 2వ శతాబ్దం.

## జైన సంఘయనము (Jaina Conference)

ఖారవేలుని విజయరాజ్యవర్షం 13వ యేట ఒక గొప్పకార్యం జరిగింది. ఇది జైనమత చరిత్రలో చాల ప్రసిద్ధికెక్కింది.

మౌర్యచంద్రగుప్తుని కాలంలో పాటలీపుత్ర నగరంలో ద్వాదశవర్షక్షామం సంభవించడానికి ముందు ఆ రాజు జైనధర్మ గ్రంథాలను, సిద్ధాంతగ్రంథాలను అన్నింటిని సేకరించి ఒక చోట పెట్టాలని ఒక సంఘయనానికి (conference) ప్రఖ్యాతులైన జినులనందరినీ ఆహ్వానించాడు. కాని వారిలో అభిప్రాయభేదాలు విపరీతంగా తలెత్తడంతో జైన సంఘయనం చెల్లాచెదరై పోయింది.[18]

ఈ కథను విన్న తరువాత ఖారవేలుడు 200 యేండ్ల క్రిందట చంద్రగుప్తుడు (క్రీ.పూ. 4వ శతాబ్దిలో) నెరవేర్చజాలని మహత్కార్యాన్ని తాను నిర్వహింపబూనుకొన్నాడు. ఖారవేలుని ప్రతిజ్ఞ ఫలించింది. శ్వేతాంబర జైనయతులనూ, భరతఖండంలో అన్ని ప్రాంతాల నుండి రాకపోకలకు అద్వితీయములైన సౌకర్యాలు కల్పించి ఆహ్వానించాడు. కుమారీగిరి మీద ఒక జైన సంఘయనాన్ని సమావేశపరచాడు. ఆ సంఘయనానికి జైనుల ధర్మగ్రంథాలైన ఏకాదశాంగములలో సప్తాంగములు మాత్రమే ఉద్ధరింపబడ్డాయి.

ఖారవేలుడు చంద్రగుప్తమౌర్యునికి రెండు శతాబ్దాల తరువాతి వాడు. ఆచార్య చక్రవర్తి గారు జైనులు దక్షిణ దేశంలో కాలిడిన వృత్తాంతానికీ దీనికి లంకె పెట్టి వ్రాయడం సముచితంగా లేదని డా॥కె.వి. రమేష్ ఖండించినారు. క్రీ.పూ. 4వ శతాబ్ది లోని చంద్రగుప్తుడు తాను తలపెట్టిన సంఘయనం విఫలం కావడంతో చింతాక్రాంతుడై స్వప్నంలో పన్నెండు తలల పామును చూచి అది క్షామసూచకమని తెలిసికొని జైనమత వ్యాప్తి యొక్కటే కర్తవ్యమని భద్రబాహునిచే ప్రబోధితుడై దక్షిణ దేశానికి బయలుదేరి మార్గమధ్యంలో శ్రమణ బెలగొలాలో 'సల్లేఖనము' స్వీకరించి నిర్యాణం చెందినాడు. అతడు తలపెట్టిన మతవ్యాప్తి మాత్రం నిర్విఘ్నంగా కొనసాగింది. దక్షిణ దేశంలో భద్ర బాహు రాకకు పూర్వమే కొందరు జైనులున్నారు. వారు తమను ప్రీతిగా ఆహ్వానిస్తారని చంద్రగుప్తుని తో బాటు వచ్చిన జైనులు తలపోసినట్లు చక్రవర్తి గారు వ్రాశారు. వారే చివరకు ఈ నిర్ణయం చేసినారు. " The introduction of Jainism in the South must be somewhere prior to the 4th century B.C. This view is in confirmity with the conclusions obtained by the Tamil scholars after careful research."[19]

## ప్రాచీన తమిళ సాహిత్యంలోని మూడు సంగములు మౌలికములా? లేక జైన సంఘముల పై ఆధిపత్యంతో ఏర్పడినవా?

ప్రాచీన తమిళ సాహిత్య ప్రసక్తి వచ్చినప్పుడు సంగ సాహిత్యస్మరణం లేకుండ మనం విమర్శించలేము. తమిళం లో ఆ తర్వాత వచ్చిన వాఙ్మయం, పూర్వసాహిత్యాన్ని సంగ

సాహిత్యంగా గుర్తించింది. అది ఒక సంగం కాదు మూడు సంగములుగా వర్ధిల్లినట్లు చెప్పబడుతూ వుంది. కె.ఎన్ శివరాజపిళ్లై, Chronology of the early Tamils (1932) అనే గ్రంథంలో యిలా వ్రాశారు. " The story of the Sangam is shrouded in a good deal of mythology. In the earlier works supposed to be Sangam literature the several collections such as the 8 collections, the 10 idylls etc., there is no reference to Sangam literature. The modern oriental scholars rightly conclude that **the whole tradition is fictitious and was created by some fertile imagination.**"[20]

శివరాజపిళ్లై గారే చాల విస్తృతంగా ఈ సమస్యను చర్చిస్తూ తమిళంలో సంగ సంప్రదాయమన్నది వట్టి కట్టు కథ, పుక్కిటి పురాణమని తేల్చారు. " Reasons so many and substantial as these should lead any fair-minded scholar to reject the Sangam tradition as entirely apocryphal and not deserving of any serious historical consideration."[21] అని నిష్కర్షించారు. ఉ.వే. స్వామినాథ అయ్యర్ లాంటి విమర్శకులే యథార్థం గుర్తింపక 'సంగత్తమిళుమ్ – పిఱ్కాలత్తమిళుమ్' (సంగతమిళం – దాని తర్వాతి తమిళం) అని విభజించినారే తప్ప ఆ సంగములు మౌలికములా? అవి ఎవరి సంగములు? తత్కాలంలో వెలసిన గ్రంథాలకు కర్తలు ఎవరు? అని లోతులకు దిగి విమర్శించి చూడలేదు.

ఎం.ఎస్. రామస్వామి అయ్యంగార్ 'The so-called Sangam Age' అనే శీర్షికతో Studies in the South Indian Jainism[22] అనే గ్రంథంలో తమిళ సంగ సంప్రదాయమన్నది విచారణీయాంశమని, అది ఆవిధంగా పిలువబడినదే తప్ప, ఆకాలపు సంఘములు గాని, సాహిత్యసృష్టిగాని అంతయు జైనులదేయని తీర్మానించినారు.

## జైనసంఘములనే తమిళ సాహిత్య సంగములుగా చెప్పికొని తమిళులు ప్రాచీనత చాటుకొన్నారు

కె.ఎన్. శివరాజపిళ్లై గారు తమ గ్రంథం చివర యిలా నిర్ణయించారు. [23]" I strongly suspect whether the 8th century tradition is not after all a faint reflex of the earlier Sangam movement of the Jains. We have testimony to the fact that one Vajranandi, a Jain grammarian and scholar and the pupil of Devanandi

Pujyapada, an accomplished Jaina Sanskrit grammarian, in the Kanarese country, of the 6th c. A.D. and the aurhor of a grammatical treatise 'Jainendra', went over to Madura with the object of founding a Sangam there. Of course, that 'Sangam' could not have been anything else than a College of Jain ascetics and scholars engaged in a religious propaganda of their own. **This movement must have first brought an idea of a Sangam to the Tamil Country."**

The Tamailian Antiquary పత్రికాసంపాదకుడైన పండిట్ డి. శౌరీరాయన్, " A Note on the Sangam periods" అన్న వ్యాసంలో మూడు సంగముల కాలన్నిర్ణయం చేసిన తీరు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. లేని సంగాలను కల్పించి కాలన్నిర్ణయం చేయడం విస్మయాన్ని రేకెత్తిస్తుంది. 1) తొలిసంగము, క్రీ. పూ. 3900, 2) మలిసంగము, క్రీ. పూ. 2120, 3) కడసంగము, క్రీ.పూ. 10వ శతాబ్ది నుండి క్రీ.శ. 50 వరకు.

తమిళుల భాషాసాహిత్యాభిమానమున కిది మచ్చుతునక. శౌరీరాయన్ వ్రాసిన వ్రాత ఇంకా ఆశ్చర్యాన్ని రేకెత్తిస్తుంది. " This shows how advanced and enterprising were the Tamilian even as early as 5000 years ago, and it will not surprise any one if we say that the Pandian dynasty was the oldest of all dynasties and that the academy founded by them in the olden Madura was the first of the universities throughout the globe."[24]

ఇది భాషా దురభిమానం తప్పవేరుకాదు. ఇప్పుడు మనం శివరాజపిళ్లై గారి తీర్మానాన్ని చదివి సత్యాన్ని గ్రహించడం మేలు. ' It is more than likely that, following closely the persecution of the Jains ruthlessly carried out in the 7th c. A.D., the orthodox Hindu party must have tried to put their own house in order and resorted to the creation of Sangams with divinity too playing a part there in, for the purpose of adding to the authority and dignity of their literature. **It was the sacerdotal 'Sangam' of the early Jains that most probably supplied the orthodox party with a clue for the story of a literary sangam of their own on that model.** The very name 'Sangam', unknown to the early Tamils, proclaims its late origin and to attempt to foisting the idea it signified on the so-called sangam literature as its inspiring cause is little short of perpetrating a glaring and absurd anachronism." [25]

# క్రీ.శ. 6,7 శతాబ్దాల్లో జైనుల వధలు - తమిళ సాహిత్య సంగముల స్థాపన

1980 ప్రాంతాలలో శ్రీలంకలో తమిళుల కెట్టి ఆపద తటస్థించి వధలు జరిగినాయో క్రీ.పూ. 4వ శతాబ్దికి పూర్వమే తమిళదేశంలో ప్రవేశించిన జైనులకు, తమిళసాహిత్యాభివృద్ధిని చేసిన జైనులకు 10వ శతాబ్దాల తర్వాత, శైవమత విజృంభణంతో జైన సన్యాసులను వధించడం ప్రారంభమైంది. ఆంధ్రదేశంలోని వీరశైవులు జైనులు వ్రాసిన గ్రంథాలను కాల్చిపారవేయవచ్చని మల్లికార్జునపండితరాధ్యుడు 'శివతత్త్వసారం' అనే గ్రంథంలో అభిప్రాయపడ్డాడు. తమిళనాడులో కూడా సరిగా యిట్లే జరిగినది. జైనులను వధించే దృశ్యాలు మధుర దేవాలయంలోని గోడలపై చిత్రీకరింపబడి వున్నాయి. జైనులపై తాము సాధించిన విజయాన్ని స్మృతికి తెచ్చుకోవడం కోసం ప్రతి సంవత్సరం హిందువులు ఉత్సవాలు జరుపుకొనే వారు.

కాల్డ్వెల్, ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణ మనే గ్రంథంలో క్రీ.శ. 12వ శతాబ్దిలోని సుందరపాండ్యుడు అనే రాజు జైనుల వధను జరిపించాడని వ్రాశాడు. తెలుగుదేశంలో కాకతీయ గణపతిదేవుడు (క్రీ.శ. 13వ శతాబ్ది) జైన సంహారం చేయించాడు. వీరశైవ, వీరవైష్ణవులే దీనికి ప్రధాన ప్రేరకులు. "జైనులను గానుగలలో బెట్టి ఆడించిరని అచ్చటచ్చట శాసనములందు గానవచ్చు వృత్తాంతములు యథార్థములని విశ్వసింపవచ్చును. జైనమునులను నిలుచున్న చోట విశ్రమింపనీయక తఱిమి తఱిమి హతమార్చిరి. జైనము రూపు లేక నశించి పోయెను." అంటున్నారు భావరాజు వెంకట కృష్ణారావు గారు.[26]

తెలుగుదేశంలో కంటే తమిళనాడులోనే ముందుగా క్రీ.శ. 6వ శతాబ్దిలోనే ఈ జైన వధలు ప్రారంభమైనాయి. ఆ తర్వాత మిగిలిందేమిటి? తమిళ సాహిత్యసృష్టిలో, సాహిత్యాభివృద్ధిలో జైనుల ప్రమేయం ఏమీ లేదని సుస్పష్టంగా నిరూపించడానికి రాజాశ్రితులైన పండితులు పెద్ద పథకం వేసి, జైనమునులచే రచింపబడిన ప్రసిద్ధ తమిళ గ్రంథాలన్నీ స్థానికులైన తమిళులచే రచింపబడినవని ప్రచారంలోనికి తెచ్చి, జైన సంఘములు సాహిత్య సృష్టిని చేసిన దానిని స్ఫూర్తిగా తీసికొని రాజాస్థానములలో తమిళ సాహిత్య సంగములను స్థాపించి, దానికి అతి ప్రాచీనత్వాన్ని కట్టబెట్టడానికి శివుడు, అగస్త్యుడు ఇత్యాది దేవలోక, పురాణలోక పురుషులను కవులనుగా చేర్చి, క్రీ.పూ. 3900 నుండి ఈ సాహిత్య సంఘాలు పనిచేస్తున్నట్లు అనగా జైనమతం పుట్టడానికి పూర్వమే తమిళనాడులో సాహిత్య సంగాలు ఉన్నాయని పెద్ద ఎత్తుతో తమ అతిప్రాచీనత్వాన్ని సంస్థాపించుకొన్నారు. తమిళ సాహిత్యచరిత్రలో ఇదొక 'గర్భితనాటకం'లో 'అంతర్నాటకం' అని గట్టిగా చెప్పవచ్చు.

జైనుల వధానంతరమే అనగా క్రీ.శ. 6వ శతాబ్ది తర్వాతనే తమిళదేశంలో సాహిత్యసంగాల, పీఠాల ప్రసక్తి కనబడుతుంది. తత్పూర్వం గల సాహిత్యంలో 'సంగము' అనే మాట సాహిత్యపరంగా కనబడదు. దీనికి బలవత్తరమైన ఉదాహరణం సుందరపాండ్యుడనే కవి (క్రీ.శ. 6వ శతాబ్ది) రచించిన 'నీతిద్విషష్టికా' అనే సంస్కృత గ్రంథం.

## సంస్కృత సాహిత్యంలో క్రీ.శ. 6వ శతాబ్దిలో విలసిల్లిన ద్రవిడసంఘము యొక్క తొలిప్రస్తావన

'నీతిద్విషష్టిక' ను తొలిసారిగా పరిష్కరించి 'పీఠిక' వ్రాసిన వేటూరి ప్రభాకర శాస్త్రి గారు క్రీ.శ. 6వ శతాబ్దిలో ఈ గ్రంథం వ్రాయబడినట్లు, అందలి 'ద్రవిడసంఘ' ప్రస్తావనను యిలా వివరించారు.

''మీమాంసా గ్రంథకారుడైన ఒక సుందర పాండ్యుడు శ్రీ శంకరాచార్యుల కంటె, కుమారిలభట్టు కంటె పూర్వం ఉండేవాడని తెలుస్తూన్నది. అందుచేత ఈ సుందరపాండ్యుడు క్రీ.శ. సప్తమ శతాబ్దికి పూర్వం ఉండే వాడనే విషయం స్పష్టం అవుతున్నది.

'నీతిద్విషష్టికా' కర్త సుందరపాండ్యుడు. ఈ గ్రంథం 'నీతి'ని తెలిపేది. ఇందలి నీతి శ్లోకాలను పంచతంత్రకర్తయైన విష్ణుశర్మ (క్రీ.శ. 6వ శతాబ్ది)తన గ్రంథంలో ఎక్కించుకొన్నాడంటే సుందరపాండ్యుడు క్రీ.శ. 6వ శతాబ్ది పూర్వుడనే తేలుతుంది. దీనికి ప్రోద్బలకంగా 'నీతిద్విషష్టిక' గ్రంథం చివరి శ్లోకం –

**''ఇమాం కాంచన పీఠస్థాం సమేత్య కవయో భువి ।**
**ఆర్యాం సుందర పాండ్యస్య స్నాపయంతి వధూమివ ॥**

అనే శ్లోకం కూడా పై నిర్ణయానికి ఉపోద్బలకంగా ఉన్నది. '' భూలోకంలో, కవులందరూ కలిసి, సుందరపాండ్యుని కృతియై కాంచనపీఠం పైన నున్న ఈ ఆర్యను మధురానగరంలో సుందరపాండ్యుడనే పేరుతో వెలసిన పరమేశ్వరుని వధువైన ఆర్యను వలె అనగా మీనాక్షీదేవిని వలె, కనకాభిషేకం చేసి పూజిస్తున్నారు.'' అని ఈ శ్లోకానికి అర్థం.[27]

క్రీ.శ. 6వ శతాబ్దికి పూర్వం నుంచే ద్రవిడ దేశంలోని మధురానగరంలో 'ద్రవిడసంఘం' అనే పేరుతో ఒక విద్వత్సమితి ఉంటుండేది. అ సమితిలో సభ్యులైన విద్వాంసులు ఉత్తమ కవినీ, అతని కృతినీ, **ఆ సంఘం పూజించే ఒక బంగారు పీఠం** మీద ఉంచి కనకాభిషేకం చేస్తూండేవారు. బహుశా, సుందరపాండ్యుని కృతికి అలాంటి సత్కారం జరిగి ఉంటుంది.

దానినే కవి ఇక్కడ సూచించినాడు. అందుచేత ఇది 'ద్రవిడ సంఘం' ప్రచారంలో ఉన్నప్పుడు రచించిన కృతి అయివుంటుందని చెప్పవచ్చును.

వేటూరి వారు పై ఉపోద్ఘాతాన్ని సంస్కృతంలో కూడా వ్రాశారు. అందలి వాక్యాలివి - ''అత్రేయం సంగతి : । క్రీ.షష్ఠ శతకాదర్వాచీనే ద్రవిడ దేశే మధురాయామేవ 'ద్రవిడసంఘః' ఇతి కాచన విద్వత్సమితిః ప్రవర్తతేస్మ। అభ్యర్థితం రవిం తస్య కృతిం చ తత్రత్యాః విద్వాంసః తత్సంఘ పూజితే **కాంచనపీఠే నివేశ్య** కనకే నాభిషించంతి స్మచ । తథావిధః సంఘ సత్కారః సుందరపాండ్యస్యాస్యాః కృతేశ్చ ప్రాయః ప్రవృత్తస్యాత్ సఇహ జ్ఞాపిత ఇవ ప్రతిభాతి । తతో ఉయం కవిర్ద్రవిడ సంఘ ప్రచలన కాల వర్తీతివక్తుం శక్యమ్''.[28]

కాబట్టి ఈ సుదీర్ఘచర్చోపచర్చల వల్ల తేలిందేమంటే తమిళ సాహిత్య సంగం క్రీ.శ. 5వ శతాబ్ది అంత్యంలోనో లేక ఆరవ శతాబ్ది ప్రారంభంలోనో జైనులను తొలిసారిగా వధించడం ప్రారంభింపబడినప్పటి నుండి వారి అస్తిత్వాన్ని చరిత్రలో తుడిచిపెట్టడానికి 'మతసంఘము'లకు ప్రత్యామ్నాయంగా రాజస్థానముల్లో ఏర్పాటైన 'సాహిత్యసంఘము' లే ద్రవిడ సంగములనే పేరుతో వెలిశాయి. ఈ 'ద్రవిడ సంఘమనే' పేరు పెట్టిన వారు జైనులే. జైన మత సంఘాలకు ద్రవిడ సంఘమని పేరున్నది. తమిళులు తత్పూర్వసంస్కృతిని, చరిత్రను తమలో విలీనం చేసుకొనే ప్రయత్నంలోని భాగమిది. ఆ పేరే పెట్టుకోవడం వల్ల అదీయిదీ ఒక్కటే అన్న భావన తర్వాతి తరాలవారికి కల్గాలని వారి ఉద్దేశ్యం.

కాని, క్రీ.శ. 5,6 శతాబ్దాలకు పూర్వం నుంచీ తమిళదేశంలోని ద్రవిడ సంఘాలు జైనుల మత సంఘాలు అనే దానికి ప్రబలప్రమాణాలున్నాయి. ఈ ఘట్టంలో ఆచార్య డా॥ ఎ. చక్రవర్తి గారు తమ ఆధారాలతో ప్రవేశిస్తున్నారు.

" The only thing that I want to add to this is the existence of the Dravida Sangha, otherwise known as MULA SANGHA, about the 1st century B.C., at the Southern Pataliputra, identified with modern Tiruppappuliyur a suburb of Cuddalore. "[29]

డా॥ పి.బి. దేశాయ్ గారు కూడా యిలా వ్రాసినారు. " Pataliputra in the South Arcot district was another center of Jaina Preceptors. The Digambara Jaina work named Lokavibhaga which was rendered into Sanskrit by Simhasuri contains a reference to the effect that it was written (Possibly in Prakrit) by Muni Sarvanandi in Saka 380 or A.D. 458 at a place called **Patalika** in **Pana rastra**. This Patalika has been identified with Pataliputra, Padirippuliyur in Tirupappuliyur, a subrub of Cuddalore in South Arcot district.

**It is believed that there existed the DRAVIDA SAMGHA in this place about the 1st century B.C."** [30]

ఆంధ్రుడైన కుందకుందాచార్యుడు జైన ఆచార్యులలో ప్రముఖుడు. ఇతడు **మూలసంఘమును** స్థాపించిన వాడు. దీనికే **ద్రావిడ సంఘమని** కూడ పేరు. దేవనంది పూజ్యపాదుని శిష్యుడైన వజ్రనంది కాలక్రమేణ మరుగుపడిన ద్రావిడసంఘాన్ని పునరుద్ధరించాలని నడుంకట్టాడు. ఇది మధుర ప్రధానకేంద్రంగా క్రీ.శ. 5వ శతాబ్దిలలో పునరుద్ధరింపబడింది. దీనికి చారిత్రకాధారం కూడా లభ్యమగుచున్నది. దర్శనసారమనే గ్రంథంలో దేవసేనుడు ( క్రీ.శ. 853 )పూజ్యపాదుని శిష్యుడైన వజ్రనంది ద్రావిడ సంఘాన్ని మధురలో స్థాపించినట్లు చెప్పినాడు. (విక్రమ సంవత్ 525=468 లేక 469 AD)

> సిరి-పుజ్జపాద సీసో **దావిడసంఘస్స** కారగోదుత్తో
> ణామేణ వజ్జనందీ పాహుడ వేదీ మహాసత్తో ।
> పఞ్చసమే చౌవీసే విక్కమరాయస్స మరణ పత్తస్స
> **దక్షిణమహురాజాదో దావిడసంఘో** మహామోహో ॥ [31]

ఇది తమిళదేశంపై జైనమత ప్రభావాన్ని పట్టి యిచ్చే కీలమైన ప్రాకృత శ్లోకం. సాహిత్య చరిత్ర పరిశోధకులీ శ్లోకమును తప్పక పరిశీలించి తీరాలి. వజ్రనంది మధురలో ద్రావిడ సంఘాన్ని స్థాపించిన కాలం క్రీ.శ. 468-69 అని స్పష్టంగా చెప్పబడినది.

అప్పటికే సమంతభద్రుని ద్వారా జైనమతంవిశేంగా తమిళదేశంలో వ్యాపించి యుండటంచే తమిళులు క్రీ.శ. 5వ శతాబ్ది చివరలోనో లేక ఆరవశతాబ్ది ప్రారంభంలోనో పై సంఘాన్ని స్వాధీనం చేసుకొన్నారో లేక దానికి ప్రత్యామ్నాయంగా అదే పేరుతో సాహిత్యసంఘాన్ని స్థాపించినారో, మొత్తము మీద జైనుల వధ చేసిన తర్వాతనే ఏతత్సూచకమో అన్నట్లు మధురలో తమిళులు ద్రావిడ సంఘం నెలకొల్పారు. ఇది చారిత్రక సత్యం. 'నీతిద్విషష్టిక' దీనికి ప్రమాణం. మూలసంఘస్థాపకుడైన కుందకుందాచార్యునికే ఏలాచార్యులని పేరు. తమిళులు వేదంగా భావించే 'తిరుక్కురళ్' రచించిన వాడీయనమే. ఈతని కాలము క్రీ.శ. 1వ శతాబ్ది.

క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన సమంత భద్రుడు తమిళదేశమున జైనమత వ్యాప్తికి ముఖ్యకారకుడు. ప్రభాచంద్రుని కథాకోశము (క్రీ.శ. 11వ శతాబ్ది) లోనూ, నేమిదత్తుని

కథాకోశము (క్రీ.శ. 16వ శతాబ్ది) లోనూ ఈతడు 'కాంచిలో నివసించే దిగంబర సన్యాసి' యని వర్ణింపబడినాడు. బహుశా, యితడు దిగంబర జైనశాఖకు చెందినవాడు కావచ్చును.

వజ్రనంది దక్షిణమధురలో ద్రావిడ సంఘాన్ని నెలకొల్పిన తర్వాత ఏర్పడిన పరిస్థితిని పెరియపురాణం ఇలా వర్ణించింది. ''కర్ణాటక జైనులు మధురలో పడద్రోసుకొని ప్రవాహం వలె వచ్చి పడుచుండగా ఆ రాజ్యాన్ని పరిపాలించే రాజవంశం కూకటి వేళ్లతో పెళ్లగింపబడింది. అంతే కాదు, ఈ సంఘం అనతి కాలంలోనే పటిష్టమై తమిళదేశ మంతటా శాఖోపశాఖలుగా ఉపసంఘాలను నెలకొల్పింది.''

బహుశా ఈ ధాటికీ, వేగానికీ తట్టుకోలేకపోయి తమిళులు దక్షిణ మధుర లోని ఈ సంఘాన్ని విధ్వంసం చేసి, జైనులను వధించివుంటారు. దీని స్థాపనకు, వధకు మధ్య దాదాపు వంద సంవత్సరాల కాలపరిమితి ఉన్నది. అది జైనుల విజృంభణకాలం.

టి.వి. సదాశివపండరత్తార్, A History of Tamil Literature (250 - 600 A.D.) అనే గ్రంథంలో [32]యిలా చెప్పారు.''నరివిరుత్తమ్, ఎలివిరుత్తమ్, కిళివిరుత్తమ్ అనే మూడు గ్రంథాలలో మొదటిదాన్ని శైవ కవియోగి యైన తిరునావుక్కరసు, రెండు మూడు గ్రంథాలను అతని సమకాలీనుడైన తిరుజ్ఞాన సంబంధర్ పేర్కొనుటను బట్టి చూడగా ఈ గ్రంథాలు మూడు క్రీ.శ. 5వ శతాబ్దిలో వ్రాయబడినట్లు తోచుచున్నది. అంతే కాదు, ఈ మూడు గ్రంథాలను జైన కవులు వ్రాశారని వారు వజ్రనందిచే దక్షిణమధురలో స్థాపింపబడిన 'ద్రావిడసంఘము' లోని వారని ఆయన అభిప్రాయపడినారు.

డా॥కె.వి. రమేష్ గారు 'Introduction' లో చక్రవర్తి గ్రంథంలో చెప్పని అనేకాంశాలు ఉటంకించారు. తమిళులు దేనినైతే మూడు సంగముల కాలమని చెబుతున్నారో ఆ కాలంలోనే జైనమతం - జైనుల సాహిత్య సృష్టి రెండూ ఉత్కృష్టదశకు చేరినవి. అని చెబుతూ తొలిసంగము, మలిసంగముల తర్వాతిదైన కడసంగము (క్రీ.శ. 4 నుండి 6 శతాబ్దుల వరకు) యొక్క కాలం చరిత్రకారులు "dark period" అని చెప్పినారు. (ఎందుకంటే ఆ కాలంలోనే జైన వధలు జరిగి అవి తమిళుల చరిత్రకు మచ్చ దెచ్చునదిగా ఉండుటచేత చారిత్రకాధారాలు నశింప జేయడం చేత 'అంధకార యుగం' గా పరిగణింపబడినది) కాని ఈ కాలంలో వ్రాయబడిన 'పదినేన్ కీళ్కణక్కు' 'శిలప్పదిగారమ్' 'మణిమేగలై' వంటి గ్రంథాలు, జైనుల చేతనే రచింపబడినవి.

జైనులు, 'పుహార్' అనే పట్టణంలో కేంద్రీకృతులై యుండెడివారట! జైనులను తమిళులు 'సమణర్' (శ్రమణులు) అని, వారు నివసించు ప్రదేశాలను 'సమణప్పళ్లి' 'అమణప్పళ్లి'

(శ్రమణుల పల్లె) అని పిలిచేవారు. సామాన్యులైన జైనులను 'సావకర్' (శ్రావకులు) అని చెప్పేవారు. 'ఉలగనోణ్బిగళ్' అని కూడా పిలిచేవారని 'మదురైక్కాంచి' అనే కావ్యంలో చెప్పబడింది. ఉఱైయూర్ (తిరుచిరాపల్లి జిల్లా) లో 'శ్రీకందప్పళ్లి' అనే దేవాలయముంది. దీనికే 'నిక్కందప్పళ్లి' అని కూడా పేరు. (నిక్కంద = నిర్గ్రంథ, జైనులలో ఒక తెగ) నిక్కందక్కోట్టమ్ అని దానికి అసలుపేరు. ఉఱైయూర్ లో ఇది తొలుత జైన దేవాలయం. ఈ నిక్కందకోట్టమ్ కాలక్రమేణ కందక్కోట్టమ్ గా మారి, కోట్టశబ్దముచే జైనుల సంబంధాన్ని స్ఫురింపజేస్తున్నది, కాబట్టి 'శ్రీ కందప్పళ్లి' అనే పేరుతో సుబ్రహ్మణ్యుని కోవెలగా వెలసింది.

జైనులను మొదటి నుండీ తమిళులు తిరస్కారభావంతోనే చూస్తున్నా క్రీ.శ. 7,8 శతాబ్దాల నాటికి అగ్నిపర్వతం పగిలినట్లు శైవులు, జైనులపై విరుచుకుపడ్డారు. శైవులకు వైష్ణవులు తోడయ్యారు. మొట్టమొదట జైనులకు పల్లవ, పాండ్య, చోళుల రాజ ప్రాపకము, పోషణ ఉన్నా శైవుల ప్రమేయంచే అది లోపించినది. అప్పర్, సంబందర్, శైవనాయన్మారులిద్దరు మొదటి పల్లవ మహేంద్రవర్మని, పాండ్య నెడుమారన్‌ను శైవము లోనికి దింపినారు.

తిరుజ్ఞానసంబంధర్ చెప్పిన సలహాను పాటించి క్రొత్తగా శైవము పుచ్చుకున్న పాండ్యరాజు ఎనిమిదివేల మంది జైనులను ఊచకోత కోయించినాడు. ఈ దృశ్యాలను మనం మధురలోని మీనాక్షి ఆలయంలో గల పుష్కరిణి పై చిత్రింపబడిన వాటిని ఇప్పటికీ చూడవచ్చు.

తమిళసాహిత్యాభివృద్ధికోసం పాటుపడి తమిళులకు విజ్ఞానభిక్ష పెట్టిన జైనులు క్రీ.శ. 10వ శతాబ్దంలో తమిళదేశంలో తమ అస్తిత్వాన్ని కోల్పోయారు. జైనులు జ్ఞానతృష్ణకల వారు కావడంచే వ్యాకరణం (తొల్కాప్పియమ్), కవిత్వం, ఛందస్సు నిఘంటువులు, నీతిశాస్త్రం (కురళ్) ప్రాస్తావిక పద్యాలు అనేకం రచించారు.

వారి విజ్ఞానతృష్ణకు గుర్తు – చెంగల్పట్టు జిల్లాలోని కీరప్పాకమ్ అనే స్థలం 'యాపనీయ సంఘానికి' స్థానం. దీనికే కుమిలగణమని పేరు. పొన్నూర్ (సంస్కృతంలో హేమగ్రామ లేదా స్వర్ణపురీ) లో ఏలాచార్యుడు జ్వాలామాలినీ అనే వహ్నిదేవతారాధనకు అనువుగా దేవాలయనిర్మాణం గావించినాడు. ఈ దేవతోపాసనకు సంబంధించి ఏలాచార్యుడు చెప్పిన సూత్రాలను క్రోడీకరించి ఇంద్రనంది అనే జైనుడు 'జ్వాలామాలినీ కల్ప' మనే గ్రంథాన్ని తయారుచేశాడు.

నాయకరాజుల కాలంలో జైనులు పూర్తిగా నిరాదరింపబడినారు. జినకాంచి, శిఱ్ఱామూర్, తిరుమలై, కుంభకోణాల్లో, చెదరుమదురుగా ఉన్న జైనులు తప్ప తమిళనాడు ప్రధాన భూభాగంలో జైనులు అదృశ్యమయ్యారు.

## ప్రాచీన తమిళ సాహిత్యంలో సంఘపీఠములు - తెలుగుకవి ధూర్జటి ప్రస్తావన 'శంఖ ఫలకము'

ధూర్జటి, శ్రీకాళహస్తిమహాత్మ్యంలోని నత్కీరుని కథలో 'శంఖఫలక' మని 'శంఖపీఠి' మని నీ క్రింది పద్యాలలో పేర్కొనబడియున్నది. (ఆశ్వాసం 3-పద్యాలు 141,144)

''..... సృష్టింప దలపోసి యష్టాదశాక్షర - మాతృక వ్రాసి నిర్మలిన **శంఖ ఫలకంబు** గొని వచ్చి పాండ్య భూపతి కిచ్చి వినుమిది ద్రవిడ కవిత్వసరణి .....''

కం॥ ద్రావిడ భాషా దేవీ గ్రైవేయక మనఁ గ గీర్తిఁ గని తత్కవితా
శ్రీవిపుల **శంఖఫలకము** పైవసియింపఁ గ c దగు విభాసితమతులన్

'' ఈ కవితాభిమానము వహించితి నేటికి **శంఖపీఠి** పై నీ కవులున్నయట్లు వసియింపక దేవునితోడ నేల చార్వాక మొనర్చితిన్ .....''(3-174)

శ్రీసురవరం ప్రతాపరెడ్డి గారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'[33] లో నీ శంఖఫలకాన్ని గూర్చి ఇలా వ్రాశారు. '' కవులు కూర్చొను స్థలము శంఖపీఠియనిరి. ఇది తమిళదేశాచారము. ఇచ్చట శంఖ పీఠియననేమో! శబ్దరత్నాకరం లోను, శబ్దకల్పద్రుమం లోను లేదు.'' అని సందేహము వెలిబుచ్చగా రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారు దానికిలా సమాధానం చెప్పారు.

'' మధురాది తమిళ ప్రాంతాలలో పూర్వము సంగము (సంఘము) అను కవుల పీఠములుండెడివి. దానినే మన కవి 'శంఖము' చేసెను. 'శంఖ ఫలకము' అరవములో 'చంగప్పలహై' అను దాని పరివర్తనవు. మధుర లోని ప్రాచీన ద్రావిడ 'సంఘ' సంప్రదాయములకు చేరినది. అరవవ్రాత 'చంక' అనే యుండును గదా! తెలుగులో అది సంస్కృత వాసనతో 'శంఖ' గా మారిందేమో! ఈ మార్పు ధూర్జటి కాలానికే వచ్చిందేమో! (ధూర్జటే స్వతంత్రంగా చేసిన ప్రయోగాలో, అచ్చువేసిన వారు అవివేచనగా చేసిన రూపాలో శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో ఎన్నో యున్నవి గదా ! అందులో ఇది యొకటి.)[34]

ఆంధ్రుల సాంఘిక చరిత్ర ప్రథమ ముద్రణ లోదీని గూర్చి యింకను నిట్లు కలదు. '' కవులు కూర్చొను వేదిక మీద దేవతా విగ్రహము, శంఖము పెట్టి పూజించి నందున, వేదికపై శంఖముండినందునను 'శంఖపీఠి' యని దానికి పేరు వచ్చెనేమో!'' ఈ ఊహ సరైనది కాదు. చారిత్రకసత్యంపై ఆధారపడింది అంతకంటే కాదు.

ఆచార్యతిమ్మావజ్ఝల కోదండ రామయ్య గారు 'నత్కీరుని కథ – కొన్ని విశేషములు' అనే వ్యాసములో యిలా వ్రాస్తున్నారు.[35] "తమిళ సాహిత్య సంప్రదాయముతో బరిచయమున్నప్పుడు కాని యీ పదము యొక్క యర్థము పూర్తిగా బోధపడదు. తమిళములో దీనికి 'సంగప్పలక్కై' అని పేరు. ఇదే శ్రీకాళహస్తి మాహాత్మ్యములో 'శంఖఫలక' మనియు, 'శంఖపీఠి' యనియు బేర్కొనబడినది. తమిళ సాహిత్యము నుండి నత్కీరుని కథను బరిగ్రహించిన ధూర్జటి యందలి 'సంగప్పలక్కై' యను పదము యొక్క యర్థము, సంప్రదాయము పూర్తిగా నవగాహనకాకపోవుట చేతనో, 'సంగఫలకము' అని పేర్కొనిన తెలుగు వారికర్థము కాదనియో దానిని శంఖఫలక మని పేర్కొనినట్లు తోచుచున్నది. 'సంగ' పదమునకు బదులు అందు 'శంఖ' పద ముండుటచే శ్రీ ప్రతాపరెడ్డి గారు పై విధముగ దానిని వివరించుట కవకాశమొసగినది. ఈ శంఖఫలకము పుట్టిన క్రమము శ్రీకాళహస్తి మాహాత్మ్యము లోనే యిట్లు తెలుపబడినది.

"తొల్లియగస్త్యుడు ద్రావిడశబ్దశాస్త్రమును, నిఘంటువును, ఛందోఉలం కారములను సృష్టింపదలచి యొక ఫలకముపై నష్టాదశాక్షరములతో మాతృక వ్రాసి దానిని పాండ్యభూపతి కడకు గొనివచ్చి యాతనితో నిట్లు పలికెను." రాజా! తమిళమున సరస్వతీ దేవితో సమానముగా గవితచెప్పగల వారెందఱైనను దీనిపై గూర్చుండవచ్చును. ఒక్కడే యయిన నాతని కొక్కనికి మాత్రమే వలసినంత చోటు నిది యిచ్చును. దీనిని గ్రహించి మీరు వంశపారంపర్యముగా నర్చించుచుండుడు" – అప్పటి నుండి పాండ్యభూపతులు వంశపారంపర్యముగా దాని నర్చించుచుండిరి. (చూ॥ 3-141 సీస పద్యం)

పాండ్యరాజుల రాజధానియగు మధురలో బూర్వము తమిళ కవి సంఘములు వర్ధిల్లు చుండినట్లు ప్రతీతి. ఆ సంఘములకు జెందిన కవులనేకులు తమిళమున గొప్ప కావ్యములు రచించిరి. ఇట్టి కవీశ్వరులకు గూడలి స్థలమగుటచేతనే మధురకు 'కూడల్' అని పేరు కూడ కలిగినది. ఈ పద్యములో మధురకు నామాంతరమైన 'కూడల్' పేర్కొనబడియున్నది.

నిజదృగబ్జ ప్రపూజిత నీలకంఠ
కూడలళఘుయ వైకుంఠ కుంఠితాఘ
నిఖిల సంపత్పరంపరా నిహితకింప
చాను తాపంబు మధురాభిధానపురము – శ్రీకాళహస్తి మాహాత్మ్యము (3-131)

'**ద్రవిడ భాషాపీఠతల శంఖఫలకంబు గల కనకాబ్జపుష్కరిణీ కిరవు**' 'మధుర' యని ధూర్జటి వర్ణించినాడు. (3-131)

తమిళ వాఙ్మయమున నిట్టి సంఘములు మూడు వర్ధిల్లినట్లు చెప్పబడుచున్నది. 1 తొలి సంఘము, 2) మధ్య సంగము, 3) కడ సంఘము నని వాని పేర్లు. సమకాలిక కవు గ్రంధములలోని యోగ్యతలను జర్చించి విలువ గట్టుట యీ సంఘముల యొక్క పని. అచ్చ పొత్తామర కొలను (పొట్రామరైక్కుళమ్) లో 'సంగపలక' యుండెడిదట! ఆయా గ్రంథము యోగ్యత నెఱుంగుటకై యీ సంగకవులు వానిని 'సంగపలక' పై నుంచినపుడా గ్రంథమ నీటిలో మునుగక నిలిచినచో సత్కావ్యమనియు, మునిగినచో నసత్కావ్యమనియు నిర్ణయిం తీర్పుచెప్పు వారట! ఈ 'సంగపలక' నే ధూర్జటి 'శంఖఫలకము' అని పేర్కొనెను.

మధురలో మీనాక్షి దేవాలయమున కెదుట నున్న సరోవరమునకు 'పొట్రామరైక్కుళం అని పేరుండగా ధూర్జటి 'కనకాబ్జపుష్కరణి' 'పొత్తామర కొలను' అని వాడినాడు **పొత్తామరని**యెడు నెత్తమ్మికొలని పశ్చిమ తట నికట కూలమున నుండి (3-134)

తమిళమున పొన్ + తామరై = పొట్రామరై యని యగును. బంగారు తామర పూవుల గలది యని యర్థము. 'పొట్రామరై' అనడానికి ధూర్జటి 'పొత్తామర' అని పేర్కొనెను 'పొత్తామరనియెడి నెత్తమ్మికొలని' యని ప్రాసయతితో ప్రయోగించి యుండుటచే న మార్పురానిదిగా నున్నది. తెలుగున, పొన్ను + తామర = పొందామర యని యగును. చెన్ను + తమ్మి = చెందమ్మి వలె. అట్లు, పొందామర యని మార్చుచో ప్రాసయతికి భంగమేర్పడును. 'పొట్రామర' యని తమిళరూపమును గ్రహించినను నిదే చిక్కేర్పడును. 'పొట్రామర' న ధూర్జటి 'పొత్తామర' యని జనవ్యవహారము ననుసరించి బరిగ్రహించెననుట యొక్కడే మనకిందు శరణ్యము.''

విల్లిపుత్తురార్ భారతంలో మధురాపురీ సంగ ప్రశంస ఈ విధంగా ఉన్నది. ''మా బారతం తమిళ్‌పడైత్తుం **మదురాపురి సంగం** వైత్తుం'' తిరుక్కురళ్ వంటి ఉద్గ్రంథాన్ని ఆ నాటి మధుర సంగకవులు మొట్టమొదట ప్రామాణిక గ్రంథంగా సమ్మతించ లేదని, ప్రసిద్ధ తమిళ కవయిత్రి అవ్వైయార్, తిరుక్కురళ్ గ్రంథ ప్రాశస్త్యాన్ని తెలియజేసిన పిమ్మట మధుర సంగకవులందరూ కురళును గౌరవించారని ఒక కథ కలదు. ఇందులోని సత్యాసత్యాలు సర్వసాక్షికే ఎఱుక''.[36] అని ఆచార్య చల్లా రాధాకృష్ణ శర్మ గారు తమిళ వేదకర్త తిరువళ్లువ నాయనార్ అనే వ్యాసంలో వ్రాశారు.

తిరుక్కురళ్ గ్రంథ కర్త తిరువళ్లువర్‌కు అవ్వైయార్ సమకాలీనురాలనుట ఏ విధంగా సర్వసాక్షికే ఎఱుకయో అదే విధంగా తిరువళ్లువర్ తిరుక్కురళ్ కర్త అనడం కూడా ఆ సర్వసాక్షికే తెలియాలి. జైన మూలసంఘ స్థాపకుడు ఏలాచార్యుడనే పేరు గల కుంద కుందాచార్యుడు దీనికి కర్తయని చరిత్రకారుల నిర్ణయం.

# ఆంధ్రదేశంపై జైనమత ప్రభావం

" Jainism entered Andhra as a lamb and left Andhra as a lamb too "
- Dr. S. Gopalakrishna Murthy

బౌద్ధమతం దక్షిణాపథంలో రూపుమాయడానికి గల ప్రబలకారణాలలో జైనమత విజృంభణ మొకటి. క్రీ.శ. రెండవ శతాబ్ది నుండి జైనమతం ఆంధ్రదేశంలో బాగా విస్తరించింది. సమంత భద్రుడు, అకలంక చంద్రుడు, జినసేనుడు, విద్యానందుడు, మాణిక్యనంది, ప్రభాచంద్రుడు, గుణభద్రుడు మొదలైన విద్వాంసులు వాద ప్రతివాదాలు చేసి జైనమతాన్ని వ్యాపింపజేశారు. దక్షిణగాంగుల కాలంలోను, రాష్ట్రకూటులు, కళచురి ప్రభువుల కాలంలోను జైనం రాజమతమై కీర్తిగాంచింది. కన్నడ దేశంలో 'శ్రమణ బెళగొళ' మొదలైన గ్రామాలు జైన మత విద్యకు ప్రధాన పీఠాలైనాయి.

**జైనబస్తీలు :** ఆంధ్రదేశాన్ని పరిపాలించిన పూర్వచాళుక్య ప్రభువులు జైన, శైవ మతాలు రెండింటిని సమానంగా ఆదరించినట్లు శాసనప్రమాణాలున్నాయి.

| | |
|---|---|
| మూడవ విష్ణువర్ధనుడు | క్రీ.శ. 714 – 751 |
| అమ్మరాజ విజయాదిత్యుడు | క్రీ.శ. 945 – 970 |
| విమలాదిత్యుడు | క్రీ.శ. 1015 – 1022 |

వీరందరు జైనమతాన్ని ఆదరించి జినాలయాలకు దానాలు గావించారు. జైన మత పీఠాలు కొన్ని మాత్రమే ప్రధాన విద్యాస్థానాలుగా ఉన్నట్లు తెలుస్తున్నది. [37]

కృష్ణా జిల్లాలోని బెజవాడకే విజయవాడ, విజయవాటికా అనే పేర్లున్నాయి. క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంలో విజయవాడలో జైన మూలసంఘ శాఖ ఉండేది. ఆనాడు జైనులు విజయవాడ ను 'వేణాకతటీపురి' అని పేర్కొనేవారు. కృష్ణవేణీ నదికి 'కణ్ణబెణ్ణా' అని పేరు. ఆచార్య అర్హబలి ఆనాటి సంఘాచార్యులలో మహోన్నతుడు. అతని ఆధ్వర్యంలో ఆనాటి దక్షిణ భారతంలోని దిగంబర జైనులు వేణాకతటీపురంలో సమావేశమై జైన సిద్ధాంతాన్ని సంకలనం చేయదలచారు. సిద్ధాంత క్రోడీకరణకు ఏర్పాటు చేసే సభలను 'సంఘయనం'(Conference or council) అంటారు.[38]

ఇవిగాక, ధర్మవరము (గుంటూరు) రామతీర్థము (విశాఖపట్టణము) హనుమకొండ (ఓరుగల్లు) దానవులపాడు, సిద్ధవటం ( కడప) ఇవి ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ జైనమత పీఠాలుగా

ప్రసిద్ధికెక్కాయి. ఈనాడు మన పరిశోధనల వల్ల 18 తెలుగు జిల్లాలలోని 84 ఊళ్లలో జైన స్థావరాల (Jain Vestiges) అవశేషాలు (Survivals) కనబడుతున్నాయని డా॥ శ్రీ పాద గోపాలకృష్ణ మూర్తి గారు అంచనా వేశారు. [39]

ద్రవిడ దేశంలో చోళరాజధానియైన కావేరీపూం పట్టణంలోను, కావేరీ నదీ తీరంలోని గ్రామాల్లోను జైనమఠాలుండేవి. తమిళనాడులో పల్లవులకాలం (క్రీ.శ. 6వ శతాబ్ది)లో కొండ గుహలలో చెక్కబడిన అత్యంత సుందరమైన చిత్రాలు **సిత్తనవాసల్** అనే పేరుతో ప్రసిద్ధమైనది. '**సిత్తనవాసల్**' అంటే 'సిద్ధనివాసము' అని పేరు. అంటే ఇక్కడ జైన సిద్ధులు కొండగుహలలో నివసించేవారు కాబట్టి '**సిత్తనవాసల్**' అని తమిళులు దానిని పిలిచారు.

రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యునికి జైనమతంపై అభిమానం [40]. జైను లెక్కడ ఉన్నప్పటికీ మత ప్రచారంలో పాటు విద్యా ప్రచారం చేసేవారు కాబట్టి, ఆంధ్ర దేశంలోను విద్వత్సభలను ప్రారంభించినారు. రాజైన విమలాదిత్యుడే అలాంటి సభల్ని ఏర్పాటు గావించాడు. అప్పటికే తమిళ దేశంలోని మధుర లో సాహిత్య పీఠాలున్నాయి. రాజరాజనరేంద్రుడు తమిళనాడుతో సన్నిహితత్వం గలవాడు. కాబట్టి అక్కడ సాహిత్య పీఠాలను చూచి ఇక్కడ కూడ అభివృద్ధి పరచినాడు. ఈ విధంగా తమిళ దేశంలోని సాహిత్యపీఠాలు ఆంధ్రదేశంలోని విద్వత్సభలకు, పరిషత్తులకు స్ఫూర్తిదాయకాలైనవి.

జైనులు విద్యావ్యసనులు అనడానికి ప్రబలోదాహరణం రాయదుర్గం లో జైనులు విశ్వవిద్యాలయాన్ని స్థాపించినారని అక్కడి శిల్పాలలో వ్యాసపీఠాల ముందు కూర్చున్న గురువులు, శిష్యుల పంక్తులు పరిశీలింపగా అది మూలసంఘము, యాపనీయ సంఘాలకు చెందినవిగా ఉన్నాయని డా॥ శ్రీ పాద గోపాల కృష్ణమూర్తి గారు వ్రాస్తున్నారు.

" The Jains were great scholars of language, grammar, astrology, earth engineering, mathematics and philosophy. They taught all castes liberally and did not exclude ladies. The rocky testimony to a Jain University at RAYADURGAM is as glorious as it is unmistakable. It would have been started in the Rastrakuta times on the hill in the Jain establishment and would have carried on till sometime after the fateful battle of Rakshasatangadi in 1556 A.D. The teachers have Vyasa Pithas or book stands before them. The inscriptions below these figures mention Chandrabhuti of Mulasangha, Chandrandya, Badayya and Zimmana of Yapania Sangha. I am tempted to compare these rows with the rows we see on the SIDDHARA GUNDUof Sramana belagola."[41]

నన్నయకాలం నాటికి విద్వత్సభలు, పండిత పరిషత్తులుండగా వీటికి మూలాలనదగినవి జైన సంఘాలే కాదు, వేదకాలం నుండి కూడా మన దేశంలో పరిషత్తులుండేవి. ఉపనిషత్తులంటే ధార్మికసభలు, ఇవి స్మృతికాలంలో కూడా ఉండేవి. మనుస్మృతిలో న్యాయపరిషత్తులు, లేదా ధర్మ పరిషత్తుల ప్రస్తావన ఉంది. రామాయణ కాలంలో సాధుసమాగమము( congregation or conference of Rishis, Ascetics and Saints), రాజ పరిషత్తులు, ( Assembly at the order of the king) జనసంసత్తులు, (gathering of both scholars and laymen) గురుకులములు ఉండేవి. పల్లవ రాజుల కాలం నుండి ఘటికా స్థానములు అగ్రహారాలు, దేవాలయాలు, వైష్ణవ మఠాలు, శైవ మఠాలు ఇవన్నీ విద్యాస్థానాలే.

## జైనమత శృంఖల నుండి విడివడిన స్వస్థాన వేషభాషాభిమానం గల తొలి ఆంధ్రదేశపు రాజు-రాజ రాజ నరేంద్రుడు

రాజరాజనరేంద్రుని పట్టాభిషేక కాలం క్రీ.శ. 1022 జూలై నెల 19వ తేది. ఈ శాసన రచయిత బేతనభట్టు. ఇతడు రచించిన కోరుమిల్లి శాసనంలో (క్రీ.శ. 1022) రాజరాజ నరేంద్రుడు పట్టాభిషిక్తుడైనప్పుడు చంద్రగ్రహణ కాలంలో చీడమార్యుడనే బ్రాహ్మణునికి కోరుమిల్లి గ్రామాన్ని అగ్రహారంగా చేసి దానం చేసిన విషయం తెలుపుతున్నది. కోరుమిల్లి గ్రామం తూర్పు గోదావరి జిల్లాలోని రామచంద్రపురం తాలుకాలో ఉంది.[42]

నన్నయ చిత్రించిన రాజరాజనరేంద్రుడు వైదికమతాభిమాని. రాజరాజనరేంద్రుడు తన తండ్రి విమలాదిత్యుని వలె జైన మతాభిమాని కాకుండా, జైన మత వాసనల నుండి విడివడిన వైదిక మతాభిమాని యని నన్నయభట్టు ఆదిపర్వంలోని అవతారికలో ధ్వనింపజేశాడు.

1. విమలాదిత్యనూజుడు **విమల విచారుడు** గుమారవిద్యాధరుడు**త్తమ చాళుక్యుడు** (అవ.ప.4)
   విమలాదిత్యాగ్రతనూజ **విమలధీ రమణీయా!** (ఆది 4-274)
   విద్యావిలాస పార్థివ విద్యాధర నిఖిలరాజ విద్యానిధి (ఆది 7-289)
   రాజసూరిసభాంతర **భ్రాజితసద్గుణ ప్రభా** (1-296)
   **రమణీయగుణ శ్రీయుత** (అరణ్య 5-1)

2. ఘన దురితానుబంధకలి**కాలజదోష తుషార సంహతిం**
   **దన యుదయ ప్రభావమున దప్పగ. జోపి** ........
   ......ధర్మనిబద్ధ దయార్ద్ర బుద్ధియై (పద్యం -5)

3. సమస్తవర్ణాశ్రమ ధర్మ రక్షణ మహోమహిమన్ (పద్యం -6)
4. మనుమార్గుడు, పరమధర్మవిదుడు (పద్యాలు 7,9)
5. పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవము నందు ఆసక్తి (పద్యం -12)
   పురారాతి పదాబ్జ పూజనాసక్త మతీ (ఆది 3-227)
6. శ్రీ మచ్చళుక్య వంశ శిఖామణి మనుమార్గ రాజకంఠీరవ (ఆది 3-1)

ఈ విధంగా వైదిక మతాభిమానియై 'భారతశ్రవణాసక్తి' గల రాజ రాజ నరేంద్రుడు నన్నయను ఇలా కోరాడు. ''నాకు ననవరతంబును శ్రీ మహాభారతంబు నందుల యభిప్రాయంబు పెద్దయై యుండు : (పద్యం -12)

అస్మదీయ వంశమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన
పాండవోత్తముల చరిత్ర నాడు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్ (పద్యం -14)

జనసుత కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత **మహా భారత బద్ధ నిరూపితార్థ మేర్పడ దెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్** (పద్యం -16)

ఈ భారత కథ నన్నయ కాలం నాటికే బహు భాషల్లో, బహు విధాలుగా, బహుజనులు ఎంతగా విన్నప్పటికీ **భారత కథా పరమార్థం** తెలుసుకొంటేనే బహుయాగాల ఫలం లభిస్తుంది. కాని, కథను తమ కిష్టమైన రీతిలో మార్చి వ్రాయడం చేత రాదు అనే అర్థాన్ని రాజరాజనరేంద్రుని ద్వారా నన్నయ్య భంగ్యంతరంగా వ్యక్తీకరించాడు. ఈ సందర్భంలో కన్నడంలో పంప కవి వ్రాసిన విక్రమార్జున విజయంలో అరికేసరి నే అర్జునునిగా భావించి తన రాజునే వర్ణించియున్న సంగతి మనకు స్ఫురిస్తుంది. అలా చేయరాదు, చేయకూడదు, భారత కథను వ్యాసుడెలా చెప్పాడో ఆ అర్థాన్ని తెలుగు వారికి తెలియజేయాలని కోరాడు రాజ రాజ నరేంద్రుడు

" Vimaladitya, the Son-in-law of Rajaraja of Tanjore ruled Vengimandala for seven years from 1011 to 1017 AD. **He had Jain affliations.** After Vimdaditya his son Rajaraja (Date of coronation 19-7-1022) succeeded him. **This king was not at all favourable to Jains**. He commissioned Nannayabhatta to compose the Bharata of Vyasa in Telugu, most probably after learning about Pampa's Vikramarjuna Vijayam composed for Arikesari, the Vemulavada Chalukyan King. That book twisted Vyasa's Bharata according to the whims of a Jaina Poet, Pampa, and hence, Rajaraja wanted a true representation of the story of the Pandavas as Vyasa wrote it."[43]

అని వ్రాసిన డా॥ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు వాక్యాలు మనమిక్కడ స్మరించుకోవాలి.

అయితే, రాజ రాజ నరేంద్రుడు తమిళ దేశంలో జైనులచే స్థాపింపబడిన 'సంఘము' లను తమిళులు 'సంగసాహిత్యం' గా ఎలా తమలో విలీనం చేసుకొన్నారో తెలిసిన వాడు గనుక, సాహిత్య పరిషత్తులు, ఆంధ్రదేశంలో కూడ అవసరమని గ్రహించి, ఆ స్ఫూర్తితో రాజమహేంద్ర వరంలో 'సభ' అనే పండిత పరిషత్తును ఏర్పాటు చేశాడు. ఆ 'సభ' ను నన్నయ ఇలా ప్రశంసించాడు.

> పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజ వారిజో
> త్కర రుచిరంబులై, సకల గమ్య సుతీర్థములై మహామనో
> హర సుచరిత్ర పావన పయః పూర్ణములైన సత్సభాం
> తర సరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్ (అవతారిక -24)

'సత్సభలే చెఱువులు. పండితుల సుచరిత్రలే పావన పయస్సులు. వారి సద్గుణాలే తామరపూల సమూహాలు. పండితుల వివేకమే సౌరభాలు. ఆ సభలు అందరూ పోదగిన పుణ్యక్షేత్రాల వంటివి.''

నన్నయ పై పద్యంలో' ఒక పద్మ సరస్సు' తో పండిత సభను పోలుస్తూ ఎందుకు ప్రశంసించి నాడంటే 'తమిళనాడులో మూడవ సంగకాల సాహిత్యంలో 'పొత్రామరైక్కుళమ్' (బంగారు పద్మం గల సరస్సు) ను ధూర్జటి శ్రీకాళహస్తి మహాత్మ్యంలో 'నత్కీరుని కథ' లో ప్రశంసించిన వైనం మనం ముందే తెలుసుకొనివున్నాం. అది యిక్కడ అనుసంధించుకోవాలి.[44] ఈ 'పొత్రామరైక్కుళమ్' విషయం నన్నయ్య గారికి బాగా తెలుసు, కాబట్టే ఆంధ్రదేశంలో రాజరాజ నరేంద్రునిచే స్థాపింపబడిన 'సభను' ఆయన 'పద్మసరస్సు' తోనే పోల్చి ప్రశంసించాడు. ఈ అంశాన్ని సాహిత్య విమర్శకులింతవరకు గుర్తించినట్లు లేదు. వైదిక మతంలో 'పద్మం' సర్వజ్ఞానానికి ప్రతీక. సరస్వతీ స్థానం. బ్రహ్మపుట్టిన స్థానం. ఈ పండిత సభ నన్నయ గారి కవిత్వాన్ని 'రమణీయ' మని ప్రశంసించి వుంటుందని, కనుక ఆ మాటను యథాతథంగా నన్నయ ప్రతి ఆశ్వాసాంతంలోను నిబద్ధించాడని కవిసమ్రాట్ విశ్వనాథ వారు అభిప్రాయపడుతున్నారు. పరిశీలింపగా, నన్నయ కవిత్వంలో పండిత సభాప్రస్తావన, 'రమణీయ' శబ్ద ప్రస్తారం ఇలా కనబడుతుంది. అవతారికలోని పర్వ సంగ్రహ కథనంలో –

1. **పండిత చేతో నిర్వృతి. జేయుచు** రెండవ పర్వమునా
   **రమ్యమగు** సభాపర్వమిలన్ (పద్యం -38)

2. **సకలసూరి సభారమ్యం బగు** తృతీయ పర్వము వెలయున్ (పద్యం -40)

3. **సభారంజనమైన** సర్వ మనోజ్ఞము నాలగు పర్వము (పద్యం -42)

4. ఉద్యోగ పర్వ మిమ్మగు **సభలన్** (పద్యం - 44)

5. అత్యనుపమమై ద్రోణపర్వ మమరున్ **సభలన్** (పద్యం - 48)

6. **సభల విస్తరిల్లి** శల్యాదికములైన నాల్గు పర్వముల వినంగ జాల
నవమ పర్వమనఁగ **నవ్యార్థరమణీయ** మగుచు శల్య పర్వ మతిశయిల్లు (ప-52)

7. **వసుమతీసురవర సమ్మతమై** సౌప్తికపర్వము
ప్రతిభ వినం బొలుచు దశమ పర్వంబగుచున్ (పద్యం - 54)

8. స్త్రీ పర్వంబు పదునొకండు పర్వము నా వెలయు
**సుకవి పండిత సభలన్** (ప-56)

9. **విబుధ శ్రేణినుతంబై** యానుశాసనిక పర్వమిలన్ (ప - 60)

10. అశ్వమేధిక పర్వ మత్యంత నిబిడ వస్తువిస్తారమై **బుధవరుల సభల** (ప-62)

11. జనమే జయునకు వైశంపాయన కథితంబైన పుణ్యకథ
**యతి రమణీయంబు** గాను (ఆరణ్య 1-398)

12. వైశంపాయన కథిత కథా క్రమం **బతిరమ్యంబు గాను** (ఆరణ్య 2-356)

13. వైశంపాయన కథితం బైన **కథ రమ్యంబుగ** (ఆరణ్య 3-397)

దీనిచే నన్నయ తన కాలం నాటి 'సత్సభలను' వారి ప్రశంసాస్పోరకమైన 'రమణీయ' 'రమ్యము' అనే మాటలను 'అవతారిక' లోను, ఆశ్వాసాద్యంత పద్యాల లోను నిబంధించి నాడని స్పష్టమౌతున్నది.

దీనిని విశ్వనాథ వారిట్లు ప్రస్తావించినారు. " పరమ వివేక ..... (అవతారిక -24) ఇత్యాది పద్యము ప్రమాణముగా నానాడు తెలుగు దేశంలో కావ్యగుణ నిర్ణయము చేయు పరిషత్తులుండెడినవి తెలియచున్నది. " ఈ రమణీయ శబ్ద మెచ్చట నుండి వచ్చినది ? ఆంధ్ర దేశస్థ కావ్య పారిషదుల నుండి వచ్చి యుండవచ్చును. వారు కావ్యమును విని 'రమణీయము' గా నున్నదని యనుచుండెడి వారు కాబోలును." కావ్యము నందలి మేలిమి 'రమణీయ' శబ్ద వాచ్యమనుట ఆంధ్ర సాహిత్య వేత్తృ పరిషత్తుల యొక్క అభిప్రాయమనుటకు వేఱొక సాక్ష్యమున్నది. ఆ సాక్ష్యము జగన్నాధ పండితుల వారి సాక్ష్యము. " రమణీయార్థ ప్రతిపాదికః శబ్దః కావ్యమ్" అని ఆయన సూత్రించినాడు."[45] (పద్య విద్య - పుట - viii)

## ప్రాకృత సాహిత్య, కన్నడ సాహిత్య ప్రభావమే నన్నయ అవతారికకు మూలం

విశ్వనాథవారు నన్నయ్యగారి వెనుక గల సంస్కృత భాషా సారస్వత నేపథ్యాన్ని కాదనడానికి వీలు లేదని వ్రాస్తూ, సంస్కృత నాటకాలు గద్యపద్యోభయ మిశ్రితాలు కాబట్టి ఆ పద్ధతిని నన్నయ కావ్య రచనలో ప్రవేశపెట్టిచంపూ ప్రక్రియలో ఇతిహాసాన్ని కావ్యీకరించినాడని అభిప్రాయపడ్డారు. (పద్య విద్య - పుట xxvi)

''ఒక సాహిత్య వాదము కలదు. ఆనాడు కర్ణాట భాషయు, తెలుగు భాషయు నించుమించుగా నొక్కటియే యని, అది హొసగన్నడము. ఇది తెలుగన్నడమునని, తెలుగన్నడము తెలుగైనదనిరి. కావచ్చును, మన తెలుగులో నన్నయ్య గారి భారతము పుట్టకమున్నే కన్నడములో కావ్యములున్నవని. అంతే కాదు, కన్నడములో నున్న యొక కవి కావ్యము ననుసరించి నన్నయ వ్రాసెనని. అదియు కావచ్చును. అవియన్నియు మనకెందులకు ?'' (పద్య విద్య, పుట - XIX)

విశ్వనాథ వారు చెప్పిన కన్నడ భాషా సారస్వత ప్రభావ వాదాన్ని చెప్పిన వారు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు. వీరు **1935** లోనే 'భారతి' లో ఆంధ్రకవితా సంప్రదాయములు-కృత్యాది [46] అనే వ్యాసంలోను, **1944** 'భారతి' లో ఆంధ్ర కవుల అవతారికలు [47] అనే వ్యాసంలోను నన్నయ భారతావతరణాన్ని, అవతరణికను విపులంగా సమీక్షించారు.

''కన్నడ కవితావృక్షము క్రీ.శ. **11**వ శతాబ్దినాటికి సుమారు రెండు శతాబ్దాలు పూర్వమే చాళుక్య కులాభరణుండగు అరికేసరి కాలమున ఫలించినది. దీనిని పోషించిన వారును చాళుక్య రాజులే. ఇందును మనకు లభించినది సంస్కృత భూయిష్ఠమగు శిష్టకవితయే గాని తెలుగులో వలెనే దేశీయంబగు ప్రాచీన హల కన్నడ కవితాస్వరూపము తెలియవచ్చుట లేదు. ఇట్లాంధ్ర, కన్నడ కవితా వృక్షములు స్వతంత్రములేయైనను ఇవి పోషింపబడిన రీతిలో గల సామ్యమును బట్టి వీని ఫలములలో కూడ కొంత సామ్యమగపడుట కవకాశము గలదు. నన్నయాదుల కవితా సంప్రదాయములలో గొన్నియైనను అప్పటి కొకటి రెండు శతాబ్దములకు పూర్వమే దేశీయ కవితా ఫక్కి నొకదాని నేర్పాటుచేసి సాగించుచుండిన కన్నడ కవుల రీతి నుండి గ్రహింపబడి యుండుననుటకు సందేహము లేదు. నన్నయ, నారాయణభట్టు, నన్నె చోడాదులు కర్ణాట భాషావాఙ్మయ పరిచితి గలవారనుట నిర్వివాదము గదా!''

''సంస్కృత భాషలో కన్నడ, ఆంధ్రదేశ్యమును మేళవించి 'మణిప్రవాళ పద్ధతి' కి భిన్నమైన యొక విధమగు తత్సమ భాషను నిర్మాణము చేసి, తన్మూలమున శిష్టకవితను

సాగించుటలో నీ భాష లొక్క విధమగు సంప్రదాయమునే యవలంబించిన వని చెప్పదగును ఇట్టి భాష కన్నడాంధ్ర దేశముల రెంటను నన్నయకు రెండు మూడు వందల యేండ్లకు పూర్వవే ప్రచారములోనికి వచ్చియుండును.''

'' క్రీ.శ. 9వ శతాబ్దియందే నృపతుంగుడు ప్రాత కన్నడము రసవంతము గాక పోవుటచే పనికి రాదని చెప్పి, సంస్కృతమును, కన్నడముతో మేళవించు పద్ధతిని కవిరాజ మార్గమున వ్యక్తపరచి తానట్లు రచించినాడు. కావున, నంతకు పూర్వమే యట్టి రచన ప్రారంభింప బడినదనవలయును. తెలుగున నట్లే జరిగియుండును.'' అని చెప్పిన కోరాడవారి వాదమే సమీచీనంగా ఉంది.

ఇక, అవతారికా నిర్మాణం సంస్కృత నాటకపు పంపిణీ మీద అనగా నాందీప్రస్తావనలను దృష్టిలో పెట్టుకొని నన్నయ రచించాడని, 1956-57 ప్రాంతాలలోనే 'నన్నయ అవతారిక' అనే వ్యాసంలో[48] ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు సూచించారు.

1) వ్యాస, వాల్మీకుల భారత, రామాయణాలకు అవతారికలున్నాయి. దీనిని నన్నయ ఒజ్జబంతులుగా గ్రహించాడు.

2) నన్నయ అవతారిక సంస్కృత నాటకాలలోని నాందీ ప్రస్తావనల్ని పోలివున్నాయి. ఆరంభంలోని మంగళాచరణ శ్లోకం సరిగ్గా నాటక నాందీ శ్లోకమే !

3) భారతాంధ్రీకరణాన్ని ఒక నాటకంతో పోలిస్తే దానికి సూత్రధారుడు రాజరాజు. నన్నయ అందలి ప్రధాన పాత్ర. నారాయణభట్టు అతనికి సహాయకుడు. అవతారికలోని చివరి రెండు పద్యాలలో ప్రధాన పాత్ర సూచింపబడింది. 'నన్నయభట్టు తెనుంగునన్ మహా భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్' అనే వాక్యంలో ఈ సూచన స్పష్టంగా ప్రకటింపబడింది.

ఆంధ్రకవుల అవతారికలు [49] అనే వ్యాసంలో శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు ప్రతిపాదించిన ముఖ్యాంశాలివి

1) సంస్కృత పంచకావ్యములో అవతారికా రచనాసంప్రదాయము లేదు.

2) వాల్మీకి రామాయణావతారిక ఆ తర్వాత వ్రాసి చేర్చబడినది.

3) నన్నయ అవతారికా రచనా సంప్రదాయం కన్నడ కవుల నుండి గ్రహించినాడు.

సంస్కృత కవి సంప్రదాయం లో లేని ఇష్ట దేవతాతతిని నన్నయ స్తోత్రం చేయడం విశేషం.

'' హరిహరాజ గజాననార్క షడాస్యమాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికిన్నమస్కృతి చేసి '' (పద్యం -21)

కన్నడ భారతంలో పంపకవి, గదాయుద్ధంలో రన్న కవి, '' హరిహరమార్తాండ మనోజ సరస్వత్యంబికా వినాయకులను'' వరుసగా కృత్యాదిలో స్మరించి, వాల్మీకి వ్యాసులను స్తుతించినారు. కార్తికేయుడు చాళుక్యుల కులదైవమగుటచే షడాస్యుని, సప్తమాతృకలను నన్నయ ప్రత్యేకంగా స్మరించినాడు. చాళుక్య రాజైన అరికేసరికి కృతి యిచ్చిన పంపకవి ఏ కారణం చేతనో వారిని స్మరింప లేదు. నన్నయ చే ప్రారంభింప బడిన ఈ ఇష్ట దేవతాస్తుతిని తర్వాతి వారట్లే పాటించినారు. ఇది కన్నడ కవితా సంప్రదాయ ప్రభావమని చెప్పక తప్పదు.

'అవతారిక - ప్రాకృతాంధ్ర సాహిత్యాలు'[50] అనే వ్యాసంలో ఆచార్య రవ్వా శ్రీ హరి గారు యిలా వ్రాస్తున్నారు.

1) ప్రాచీన సంస్కృత గ్రంథాలలో అవతారికా సంప్రదాయం కానరాదు.

2) కాదంబరి, హితోపదేశం వంటి ఒకటి రెండు వచన గ్రంథాలలో శ్లోక రూపమైన అవతారిక కానవస్తుంది.

3) అవతారికా సంప్రదాయం గౌడవధ, సేతుబంధ, కావ్యాలలో కానవస్తున్నది. ఇవి మహా రాష్ట్రీప్రాకృతంలో వ్రాయబడిన కావ్యాలు.

4) అవతారికా సంప్రదాయం ప్రాకృతం నుండి కన్నడం లోకి ఆ తరువాత తెలుగు లోకి ప్రవేశించినట్లుగా చెప్పవచ్చు. అయితే తెలుగు కావ్యాలలో కనబడే షష్ఠ్యంత పద్ధతి మాత్రం ప్రాకృతంలో గానీ, కన్నడంలో గానీ కనబడదు.

5) ఆశ్వాస విభజన ప్రాకృత కావ్యమైన సేతుబంధంలో ఉంది. ఇది కన్నడంలో ప్రవేశించి తర్వాత తెలుగులో వచ్చింది.

ఈ విధంగా కోరాడవారు కన్నడ సాహిత్య ప్రభావంతో 'అవతారిక' తెలుగులో వచ్చినదనగా, విశ్వనాథ, దివాకర్ల లిద్దరూ సంస్కృత నాటక నాందీ ప్రస్తావనలు దీనికి స్ఫూర్తి నిచ్చాయన్నారు. డా॥ శ్రీ హరి గారు తెలుగు 'అవతారికా' రచనకు మూలం కన్నడ, సంస్కృతాలు కావు, ప్రాకృత గ్రంథ రచయితలంటూ, ప్రాకృతం నుండి కన్నడంలోకి, అక్కడ నుండి తెలుగులోకి 'అవతారిక' అవతరించిదని నిర్ణయించారు.

## నన్నయ చంపూపద్ధతి రచన కన్నడ జైన కవుల ప్రభావమే!

సంస్కృతంలోను ప్రాకృతంలోను ప్రాచీన కావ్యాలు శ్లోకమయమ్మైనవి కాని తెలుగులో తొలి కవిత్యం గద్య పద్య సమ్మిశ్రితంగా వెలువడింది. తెలుగులో పద్యమయ శాసనాలు వెలువడడానికి నూట యాభై సంవత్సరాలకు పూర్వమే కన్నడంలో దుర్వినీతాదుల కాదంబర్యాది గ్రంథాలు రచింపబడ్డాయి. క్రీ.శ. 650 ప్రాంతాలలోనే గద్య శ్లోకమయ శాసనాలు కన్నడంలో (Epigraphia Carnatika Vol. II, P-71) వెలువడ్డాయి.

కాబట్టి, ఆదికవి నన్నయ చంపూ పద్ధతి రచనకు ప్రేరణ కన్నడ సాహిత్యమే. 'చంపూ' శబ్దం దండి కావ్యాదర్శంలో ప్రయోగించినప్పటికీ అది సంస్కృత శబ్దం కాదు. ద్రవిడ భాషా పదం. 'సంపూ' అనే శబ్దానికి కన్నడం లోను, తుళు భాషలోను, 'కలయిక' 'మనోహరము' అని అర్థాలు. చంపూ కావ్యాలు 'గద్య పద్యోభయములు' కావడం చేత ఇలాంటి గ్రంథాలు దండి కన్న ముందు అంటే క్రీ.శ. 7వ శతాబ్దికి పూర్వం ప్రాచీన సంస్కృతం లో కనబడడం లేదు. కాబట్టి ఈ శబ్దం దాక్షిణాత్య సాహిత్యంలో రూఢికెక్కింది. దండి పండితుడు దాక్షిణాత్యుడే కాబట్టి, అతనికి చంపూ కావ్య లక్ష్యాలు అప్పటికి కన్నడంలో వెలసిన చంపువులే.

తెలుగులో క్రీ.శ. 9వ శతాబ్ది నాటి శాసనాలలోనే ఈ గద్య పద్య సమ్మిశ్రితత్వం కనబడుతుంది. కాని, కేవలం పద్యమయములైన యుద్ధమల్లుని బెజవాడ శాసనాలు లేక పోలేదు. కన్నడ, తెలుగు సాహిత్యాల్లో మాత్రమే చంపూ పద్ధతి ప్రాచుర్యాన్ని పొందింది.

దీనికి దండి చేసిన నిర్వచనం యిలా వుంది. 'గద్య పద్యమయం కావ్యం 'చంపూ' రిత్యభిధీయతే.'' అగ్నిపురాణంలో చంపువునే మిశ్రకావ్యంగా చెప్పారు. 'మిశ్రం చంపూ రితి ఖ్యాతం ప్రకీర్ణమితరస్తథా'. హేమచంద్రుడు, కావ్యానుశాసనంలో – 'గద్యపద్యమయాసాంకా సోచ్ఛ్వాసా చంపూః' అని చెప్పి సుబంధుని వాసవదత్తను పేర్కొన్నాడు. బాణుడు, భట్టార హరిశ్చంద్రుని గద్యబంధాన్ని ప్రశంసించాడు కాని, అతని 'జీవంధర చంపువు'ను ప్రస్తావించ లేదు. ఇది జైన కావ్యం. కాబట్టి, ఈ చంపూ పద్ధతిని జైన కవులే మొట్టమొదటి చేపట్టినారని చెప్పవలసి వుంది.

ఉపలబ్ధ చంపూ కావ్యాలలో త్రివిక్రమభట్టు రచించిన 'నలచంపువే' మొట్టమొదటిది. ఈ కావ్యాన్ని జైన మతాభిమాని, మాన్యఖేటాధీశ్వరుడు, రాష్ట్రకూట రాజైన ఇంద్రరాజు ప్రోద్బలంతో ఆయన ఆస్థాన పండితుడైన త్రివిక్రమ భట్టు రచించాడు. ఇంద్రరాజు క్రీ.శ. 914-916 ప్రాంతాలలో అంటే 10వ శతాబ్ది వాడు కావడం చేత త్రివిక్రమ భట్టు కూడ ఆకాలం వాడేనని నిర్ణయింపవచ్చు.

దీనికి సమీపకాలంలోనే అంటే క్రీ.శ. **941** లో పంపకవి కన్నడంలో 'విక్రమార్జున విజయము' అనే పేర వ్యాస భారత కథను, 'ఆది పురాణ' మనే పేర జైన తీర్థంకరుని కథను చంపూ కావ్యాలుగా రచించి ఉన్నాడు.

తెలుగుపై కన్నడ జైన కవుల కవితా సంప్రదాయ ప్రభావాలు, తమిళ శైవ, వైష్ణవ సాహిత్య ప్రభావాలు పనిచేసినప్పటికీ తెలుగు భాషకు, తెలుగు జాతికి నైసర్గికాలైన సంప్రదాయాలతోను, సంస్కారాల తోను మేళవించి గీతి సాహితీ కవితలలో తెలుగుకు దాక్షిణాత్యవాఙ్మయ ప్రపంచంలో ఒక శాశ్వతస్థానాన్ని గడించి పెట్టారు మన పూర్వకవులు, పండితులు.

> స్వస్థానవేష భాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః
> లోకేబహుమన్యంతే వైకృత కావ్యాని చాన్యదపహాయ ॥

అని నన్నయభట్టు, ఆంధ్రశబ్ద చింతామణిలో చెప్పిన మాట లిక్కడ స్మరింపదగినవి.

ఫలితార్థమేమంటే, ఒక భాషా సాహిత్య నిర్మాణంలో ప్రక్రియ (Form), విషయం (Content), నిరూపణం (Treatment) అనే మూడు అంశాలు కలిసి స్వరూపాన్ని సాధిస్తుందని అంగీకరిస్తే, తెలుగు సాహిత్యం చంపూ ప్రక్రియతో ప్రారంభమైంది. అది వైదిక మతస్వరూపాన్ని వివేచించే విషయసామగ్రి గలది. విషయ నిరూపణం కూడ వైదిక దర్శనాలకు అనుగుణంగానే సాగింది. అవైదిక దర్శనాలైన జైన, బౌద్ధమతాల సిద్ధాంతాలు సున్నితంగా విమర్శింపబడినాయి.

ప్రక్రియ (Form) కన్నడ, ప్రాకృత జైనసాహిత్యాల నుండి, విషయం (Content) వైదికమతపనేథ్యం నుండి, నిరూపణం (treatment) వైదిక దర్శనవిచారధార నుండి, గ్రహించి ఆది కవి నన్నయభట్టు తన సాహిత్య సృష్టిని తీర్చిదిద్దాడని సిద్ధాంత వాక్యంగా చెప్పవచ్చు.

'' మహాభారతబద్ధ నిరూపితార్థ'' మంటే ఇదే! మనుమార్గుడు, ధర్మనిబద్ధదయార్ద్ర బుద్ధి, విమలవిచారుడు, అన్నిటికీ మించి, స్వస్థానవేష భాషాభిమానంగల రాజరాజనరేంద్రుడు కోరింది కూడ ఇదే!. రాజు ఏదైతే కోరాడో, కవి దానినే సృష్టించాడు. రాజానుమతోధర్మః ''రాజాకాలస్య కారణమ్'' అనే సూక్తులిక్కడ సార్థకమయ్యాయి!.

## జైనుడైన గణితశాస్త్ర వేత్త మహావీరాచార్యుని గణితసార సంగ్రహానికి అనువాదమే పావులూరి మల్లన వ్రాసిన సారసంగ్రహ గణితం

కర్ణాటక దేశాన్ని పరిపాలించిన రాష్ట్రకూట వంశపురాజు చక్రికాభంజనుడు. జైన మతస్థుడైన ఈ రాజుకు అమోఘవర్షనృపతుంగుడనేది బిరుదనామమని చారిత్రకులు నిర్ణయించారు. ఇతడు క్రీ.శ. 814 లేక 815 నుండి క్రీ.శ 877 లేక 878 వరకు రాజ్యపాలనచేశాడు. ఆయన ఆస్థాన గణితశాస్త్రజ్ఞుడు, జైనుడైన మహావీరాచార్యుడు గణితసార సంగ్రహమనే సంస్కృత గ్రంథాన్ని క్రీ.శ. 9వ శతాబ్ది మధ్య భాగంలో రచించాడు.[50]

జైనులు గణితశాస్త్రంపై ఎక్కువ మక్కువ, శ్రద్ధ చూపేవారు. ఎందుకంటే, జైనమతానికి చెందిన నాల్గు అనుయోగాలలో గణితశాస్త్రం ఒకటి. వైదికులైన హిందువులు, 'శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధి గచ్ఛతి' శబ్ద బ్రహ్మను ఉపాసించేవారు పరబ్రహ్మలో లీనమౌతారని విశ్వసించేటట్లుగా, జైనులు కూడ గణిత శాస్త్రాధ్యయనం చేత జీవునికి సంసారబంధం నుండి 'విడుదల' కల్గుతుందని విశ్వసిస్తారు.

మహావీరాచార్యునికి పూర్వమే హైందవులలో గణిత శాస్త్రవేత్తలున్నారు. వారు ఆర్యభటుడు (క్రీ.శ. 5వ శతాబ్ది) వరాహమిహిరుడు (క్రీ.శ. 6వ శతాబ్ది) బ్రహ్మగుప్తుడు (క్రీ.శ. 7వ శతాబ్ది) భాస్కరాచార్యుడు (క్రీ.శ. 12వ శతాబ్ది). బ్రహ్మగుప్తునికీ, భాస్కరాచార్యునికీ మధ్య కాలంలో మహావీరాచార్యుడు గణితశాస్త్రవేత్త యైనా దాక్షిణాత్య జైనుడైనందున హైందవ గణిత శాస్త్రజ్ఞులెవరూ ఆయునను స్మరించ లేదు. బహుశా, మహావీరాచార్యుడు జైనుడు కావడమే దీనికి ప్రబల కారణం కావచ్చు. లేక దాక్షిణాత్యజైనుడైన మహావీరాచార్యుని ప్రశస్తి ఔత్తరాహ దేశం వరకు ప్రసరింప లేదో! ఏది ఏమైనప్పటికీ. హిందువులు జైనులను నిరాదరించారనడానికి దాక్షిణాత్య జైనుడు వ్రాసిన గణితసారసంగ్రమే చక్కని ఉదాహరణ!

మహావీరాచార్యుని సంస్కృత గణిత సారసంగ్రహాన్ని ప్రొఫెసర్. ఎం. రంగాచార్యులు గారు, చక్కగా పరిష్కరించి, ఆంగ్లానువాదంలో అర్థవివరణలు, టీకాటిప్పణులతో మద్రాసు ప్రభుత్వం వారి పక్షాన 1912లో ప్రచురింపజేశారు.[51]

## రాజరాజ నరేంద్రుని కాలంలోనే (క్రీ.శ. 11వ శతాబ్ది) సంస్కృత గణితసారసంగ్రహం తెలుగులో అనువదింపబడింది.

నిరంతర విద్యావ్యసనులైన జైనులు అనేక శాస్త్రగ్రంథ నిర్మాతలుగా భారతదేశంలో పేరు ప్రఖ్యాతులు పొందారు. హిందువులు వారి గ్రంథాలను తమ తమ భాషలలో అనువదించుకొన్నప్పటికీ, వీరు జైనులనే చిన్న చూపుతో, నామ మాత్రంగానైనా మూలగ్రంథకర్త యొక్క పేరును స్మరింపక పోవడం విచారకరం! సంస్కృత, తెలుగు గణిత సారసంగ్రహాల అవతారికల్ని పరిశీలిస్తే అనువాదకుడైన పావులూరి మల్లన [52] చేసిన మార్పులు, చేర్పులు, లోపాలు స్పష్టమౌతాయి.

1) సంస్కృత గ్రంథానికి 'గణితసారసంగ్రహమనే' పేరుండగా దానిని అదే పేరుతో అనువదింపక, సారసంగ్రహ గణిత' మనే పేరు పెట్టడం, దానికి 'పావులూరి గణిత'ము, దశవిధగణిత మనే లోక ప్రసిద్ధి రావడం చేత మూలకర్త పేరు పూర్తిగా మరుగున పడిపోయింది. ఇదేదో వేరే గ్రంథమైనట్లు కన్పింపజేయాలనే తపన కనబడుతున్నప్పటికీ తీరా, గ్రంథంలోపలి విషయాలను పరిశీలిస్తే జైనుల పరిభాషలైన ఎక్కా, మగ్గ, గచ్ఛ యిత్యాదులున్నాయి.

2) పావులూరిమల్లన తన వంశాన్నీ, తల్లిదండ్రులనూ, పోషకుడైన రాజరాజ నరేంద్రుని స్తుతిస్తూ, తాను అనువదిస్తున్న గ్రంథం స్వీయరచనమైనట్లుగా, నన్నయగారి భారతావతారికను అనుకరిస్తూ 'అవతారిక'ను శ్లోకంలో ప్రారంభించి, 9 పద్యాలు వ్రాశాడు. కాని ఎక్కడ కూడా మూలగ్రంథ కర్త మహావీరాచార్యుని స్మరించలేదు. ఉదాహరణకు – ''**కొంత కొంత గురూపదిష్ట ప్రజ్ఞావిశేషంబున, బుధులయనుగ్రహంబున, గురువుల యనుమతంబున** నాంధ్ర భాష, గద్య పద్య రూపంబుల రచియించెద'' అన్నాడే కాని 'బుధుల యనుగ్రహంబున' అనే మాట దగ్గర మహావీరాచార్యుడే ఆ బుధుడని మనమిప్పుడు గ్రహించాలి తప్ప, అనువాదకుడు, మూలకర్త పేరును చెప్పకపోవడం దురదృష్టకరం.

3) ఇంతే కాదు, మూలగ్రంథంలో అవతారిక మంగళాచరణ శ్లోకాలు రెండూ జినస్తుతులు, ప్రతి అధ్యాయ ప్రారంభంలోను జినస్తులుండగా, అవన్నీ తీసివేసి ఆయాస్థలాలలో శివస్తుతులు వ్రాయడం గమనిస్తే ఆ కాలంలో హిందువులకు జైనులపై ఎంత అనాదరణ, నిరసన, తిరస్కార భావాలుండేవో తేటతెల్లమవుతుంది.

## అవతారికలు - తులనాత్మక పరిశీలన

సంస్కృత గ్రంథంలోని అవతారికలో ఎనిమిది శ్లోకాలుండగా, తెలుగు గ్రంథంలోని అవతారిక పది పద్యాలు (మొదటి శ్లోకాన్ని కలుపుకొని) ఇంతవరకు బాగుంది.

| | సంస్కృత అవతారిక | | తెలుగు అవతారిక |
|---|---|---|---|
| 1. | జినస్తుతులు - 2 శ్లో | 1. | శివస్తుతి - 1 శ్లో |
| 2. | చక్రికాభంజనుడనే అమోఘవర్షనృపతుంగుని స్తుతి - 6 శ్లో | 2. | గణిత శాస్త్ర ప్రశంస - 2 పద్యాలు |
| | | 3. | స్వీయ వంశాభివర్ణనం - 5 ఏద్యాలు<br>1. శివభక్తి<br>2. గోత్ర సూత్రాలు<br>3. తల్లి తండ్రులు - సంతానం<br>4. రాజరాజ నరేంద్రునిచే 'నవఖండవాడ' పొందుట |
| | | 4. | గ్రంధ విషయ ప్రశస్తి 2 పద్యాలు |
| | మొత్తం శ్లోకాలు 8 | | మొత్త పద్యాలు 10 |

సంస్కృత అవతారిక లోని మంగళాచరణ శ్లోకాలు రెండు జినస్తుతులే. అవి, ఇలా ఉన్నాయి.

శ్లో॥ అలంఘ్యం త్రిజగత్సారం యస్యానంత చతుష్టయమ్।
నమస్తస్మై జినేంద్రాయ మహావీరాయతాయినే ॥

నాల్గ అనంతగుణాలచే ఈ మూడు లోకాలలో విలక్షణంగా ప్రకాశిస్తూ విశ్వాసపాత్రులైన జినులను సర్వదారక్షించే మహావీరునికి మంగళమగుగాక!

శ్లో॥ సంఖ్యాజ్ఞాన ప్రదీపేన జైనేంద్రేణ మహాత్విషా ।
ప్రకాశితం జగత్సర్వం యేన తం ప్రణమామ్యహమ్।

సంఖ్యా (శాస్త్ర) జ్ఞానమనే దీపం చేత ఈ సమస్త జగత్తును ప్రకాశింపజేసే అత్యంత వైభవోపేతుడై జినులకు అధిపతియైన మహావీరునికి నేను శిరస్సువంచి నమస్కరిస్తున్నాను.

ఈ జినస్తుతుల్ని తొలగించి వాటి స్థానంలో మల్లన శివస్తుతి చేశాడు. శ్రీశైలంలోని మల్లికార్జునుణ్ణే మల్లన అని తెలుగు వారు పిలుస్తారు. కాబట్టి మల్లికార్జునుడనే నామాంతరంగల మల్లన శివభక్తుడు.

శ్రీకంఠం సగుణం సమస్త జగతాం కర్తార మీశం గురుమ్
భూతోయానల చంద్రసూర్య పవన వ్యోమాత్మ మూర్తిం విభుమ్।
నిత్యానందమయోఽపి యోగిరిజయా సార్థం ప్రజావృద్ధయే
మాయాయోగముపైతి తం శివకరం వన్దే శివం శ్రేయసే॥ (శ్లో - 1)

కం॥ ప్రణమిల్లి శివున కీ క్రియ-నణిమాది గుణాస్పదునకు నభినవ సంఖ్యా
మణిదీప్తి సారసంగ్రహ-గణిత సముద్రంబుఁ దరువగణగితిఁ బ్రీతిన్ - 2 -

అని తాను స్వతంత్రంగా ఒక నూత్నగ్రంథ నిర్మాణం చేస్తున్నట్లుగా ప్రారంభం చేయడం కనిపిస్తుంది.

మహావీరాచార్యుడు తన గ్రంథాన్ని ఎనిమిది 'వ్యవహారాలుగా వింగడించాడు. ఒక్కొక్క అధ్యాయమైన 'వ్యవహారం' ముందు జినస్తుతులు తొమ్మిది శ్లోకాలలో చేసి వున్నాడు. మల్లన కూడ ఆయాస్థలాలలో శివస్తుతులే తప్పక చేసి ఉంటాడు. కాని, మనకిప్పుడు లభిస్తున్న ముద్రిత ప్రతులలో భిన్నగణిత మనే అధ్యాయం ముందు చేసిన శివస్తుతి ఒక్కటే లభిస్తూవుంది. అది మహావీరుని, జినస్తుతిని అనుకరించేదిగా ఉండడం గమనింపదగింది.

సర్వామరేంద్ర మకుటార్చిత పాదపీఠమ్
సర్వజ్ఞమవ్యయ మచిన్త్యమనంత రూపమ్।
భవ్యప్రజా సరసిజాకర బాలభానుమ్
భక్త్యానమామి శిరసా జినవర్ధమానమ్ ॥ - ఖాతవ్యవహారమ్ (7-1)[53]

శ్రీకాంత నిర్మల మనోర్చిత పాదపద్మం
విశ్వోద్భవ స్థితి లయాది విధానహేతుమ్ ।
తత్తద్గుణ త్రయవశాత్త్రవిభక్తమూర్తిమ్
సర్వజ్ఞమీశ్వర మహం ప్రణమామి భక్త్యా । - భిన్నగణితం (2-1)[54]

ఇక్కడ గుర్తించవలసిన ముఖ్యాంశమేమంటే, మూలగ్రంథం సంస్కృతంలో ఉంది గనుక, సంస్కృతంలోనే ప్రతికిఅధ్యాయం ముందు జినస్తుతి వ్రాశాడు మహావీరాచార్యుడు జినస్తుతుల్ని శివస్తుతులుగా మార్చాలనే నియమం పెట్టుకున్న మల్లన తెలుగు కవుల రెండు నియమాలను ఉల్లంఘించాడు. అవి -

**1)** మల్లన తాను తెలుగులో గ్రంథాన్ని వ్రాస్తూ నన్నయ అవతారికను నమూనాగా పెట్టుకొని గ్రంథాదిలో శ్లోకం వ్రాసి అవతారికనంతా తెలుగు పద్యాల్లో వ్రాశాడు. దీనికి భిన్నంగా ప్రతి అధ్యాయం ముందు వ్రాసిన శివస్తుతులన్నీ దొరక్క పోయినా, దొరికిన రెండు, మూడు స్తుతులుకూడా శ్లోకాలై ఉండడం, అవి జినస్తుతిని అనుకరించేవిగా ఉండడం చేత మూలగ్రంథకర్త ప్రభావానికిలోనయ్యాడని చెప్పక తప్పదు.

**2)** నన్నయ భారతావతారికను ప్రమాణంగా గ్రహించిన మల్లన, నన్నయ వలె ప్రతి ఆశ్వాసాదిలోను రాజరాజ నరేంద్రుని స్తుతింపక, మూలంలో జినస్తుతి ఉండడం చేత తెలుగు కవుల రచనా సంప్రదాయానికి విరుద్ధంగా తనకు పోషకుడైన రాజ రాజ నరేంద్రుని విస్మరించి, శివస్తుతినే చేయడం చూస్తే మహావీరాచార్యుని ప్రభావమెంత బలీయంగా పనిచేసిందో తెలుస్తున్నది.

మహావీరుడు మూలంలో గణిత శాస్త్ర ప్రశంసచేయక పోయినా, నన్నయ ఆదిపర్వ అవతారికలో మహాభారత గ్రంథ ప్రశంస చేశాడు, కాబట్టి మల్లన కూడ చేశాడు. ఆ తర్వాతి కందపద్యం యిలా వుంది.

కం॥ కావున, గణితముఁ దెనుగునఁ గావింపఁగ గణగితిని సుకవిమల్లుడ గా
రీవల్లభచరణ సరోజావాసిత చిత్తమధుకరాత్ముఁడ జగతిన్ (పద్యం - **4**)

నన్నయ భారతంలో ''తెనుగున **రచియింపు** మధికధీయుక్తిమెయిన్'' '' నానేర్చు విధంబున నిక్కావ్యంబు **రచియించెద** నని'' ఉన్నది. నన్నయ చేసినది అనువాదం కాదు స్వేచ్ఛాను వాదమని దీనిచే స్పష్టమైనది. కాని, మల్లన 'తెనుగునఁగావించుట' అనే మాట మాత్రం '' అనువాదం కావించుట'' అనే అర్థాన్ని పట్టి యిస్తూవుంది. మహావీరాచార్యుడు మూలగ్రంథావతారికలో స్వీయవంశాభివర్ణనం చేసికోలేదు. నన్నయ ప్రథమపురుషలో చేసిన స్వవిషయవర్ణనను ప్రక్కనబెట్టి, మల్లన స్వయంగా తనను గురించి చెప్పుకొన్న పద్యాలు ఐదు కనబడుతున్నాయి. మల్లన వంశవృక్షం యిలా వుంది.[55]




మల్లన కమ్మనాడులోగల పావులూరు గ్రామాధిపతి. అదే అతని ఇంటి పేరు. గ్రామ

నామమే ఇంటి పేరు కావడమనేది తెలుగు వారికి సహజమే. మల్లన శివభక్తుడు. ఇతనికి 'సుకవిమల్లుడ' నేది బిరుదు. ఇతనిది గార్గ్యగోత్రం. ఆపస్తంబసూత్రం. సివ్వన, గౌరమ తల్లిదండ్రులు. వీరికి నల్గురు కుమారులు కాగా వారిలో మల్లన ఒకడు. తన వంశాభివర్ణనంలోనే పోషకుడైన రాజరాజనరేంద్రునిలా ప్రశంసించాడు మల్లన

శ్రీలలనేశుఁడంధ్రనృపశేఖరుడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురి పార్శ్వమునన్ నవఖండవాడయన్
ప్రోలు విభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుడు, రాజపూజితుఁడు సివ్వన పుత్రుడు మల్లఁడున్నతిన్ (అవతారికా పద్యం – 6)

మల్లన, రాజరాజ నరేంద్రునిచే పిఠాపురం సమీపంలో గల 'నవఖండవాడ' అనే ఊరును సంపదతో పొందిన, రాజపూజితుడు. అంటే, నవఖండవాడ అగ్రహారీకుడు మల్లన. ఈ పద్యం నన్నయ్య గారి తొట్టతొలి పద్యమైన, '' రాజకులైక భూషణుడు...'' అనే తీరులో నడుస్తూ '' కృపాణధారాజల శాంతశాత్రవ పరాగుడు రాజమహేంద్రుడున్నతిన్'' అనే పద్యంలా అంతం కావడం గమనించవచ్చు.

మహావీరాచార్యుడు చక్రికాభంజనుడనే పేరు గల అమోఘవర్షనృపతుంగుని ఆరు శ్లోకాలలో అభివర్ణించాడు.

శ్లో॥ ప్రీణతః ప్రాణి సస్యౌఘో నిరీతిర్నిరవగ్రహః ।
శ్రీమతామోఘవర్షేణ యేనస్వేష్ట హితైషిణా ॥

శ్రీమంతుడైన అమోఘవర్షుడు పేరుకు తగినట్లుగా సకలజనుల అభీష్టాలను సిద్ధింపజేసేవాడు. తన కిష్టులైన జనుల హితాన్ని కోరే వాడు. అతని రాజ్యంలో సకల జీవులు క్షేమంగా ఉన్నారు. చీడపీడలు లేని సస్యసమృద్ధితో కరువు కాటకాలు లేకుండ ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతున్నారు.

శ్లో॥ పాపరూపాః పరాయస్య చిత్తవృత్తి హవిర్భుజి ।
భస్మాద్భావ మీయుస్తేఽ వన్ధ్యకోపోఽ భవత్తతః ॥

అమోఘవర్షుని చిత్తవృత్తి అగ్నితో సమానమైనది కావడం చేత పాపాలనే శత్రువులు భస్మీపటలమయ్యారు. దీనిచే అతని కోపానికి పర్యవసానం చాల తీవ్రంగా ఉంటుందని తెలుస్తోంది.

శ్లో॥ వశీకుర్వన్ జగత్సర్వం స్వయం నామవశః పరైః ।
నాభిభూతః ప్రభుస్తస్మా దపూర్వ మకరధ్వజః॥

ప్రపంచాన్ని తన వశంలోకి తెచ్చుకున్నవాడు, తానెవరికీ స్వాధీనుడుగాక స్వతంత్రంగా వ్యవహరించే వాడైన అమోఘవర్షుడే నిజమైన ప్రభువు. అతడొక అభినవ మన్మథుడు.

శ్లో॥ యో విక్రమక్రమాక్రాంత చక్రి చక్రకృతక్రియః ।
చక్రికాభంజనోనామ్నా చక్రికాభంజనోఽంజసా ॥

ఎవని చుట్టూ వలయాకారంలో నిలబడి రాజులు సేవిస్తూ ఉన్నారో, ఎవడు తన అవక్రపరాక్రమంచే అభ్యుదయాన్ని చూరగొన్నాడో, ఎవడు చక్రికాభంజనుడనే తన పేరును సార్థకపరచుకొన్నాడో అతడే అమోఘవర్షనృపతుంగ మహారాజు (ఇక్కడ చక్రిభంజనుడనే మాటకు రెండర్థాలున్నాయి. 1) ఆయన పరాక్రమానికి లొంగిపోయిన రాజులు ఆయనను వలయాకారంలో పరివేష్టించి సేవిస్తున్నారు. 2) జనన మరణాలనే సంసార చక్రాన్ని నిర్మూలించి పునర్జన్మలు లేకుండ చేసేవాడు చక్రికాభంజనుడు)

శ్లో॥ యో విద్యానద్యధిష్ఠానో మర్యాదావజ్రవేదిక ః ।
రత్నగర్భోయథాఖ్యాత చారిత్ర జలధిర్మహాన్ ॥

ఎవడు వివిధవిద్యలనే నదుల్ని తనలో విలీనం చేసుకున్నాడో, ఎవడు తనయొక్క రాచరికపు హద్దుల్ని మీరకుండా కట్టుదిట్టమైన నడవడిక కలవాడో, ఎవడు జైనమతప్రోక్తమైన మూడు రత్నాలను (సమ్యగ్దర్శన, సమ్యక్జ్ఞాన, సమ్యక్ చారిత్రములు) తనలో ఇముడ్చుకొని వున్నాడో అతడు శీలమనే మహాసముద్రానికి మారుపేరైన అమోఘవర్షనృపతుంగుడు.

శ్లో॥ విధ్వస్తైకాంత పక్షస్య స్యాద్వాద న్యాయవాదినః ।
దేవస్య నృపతుంగస్య వర్ధతాం తస్యశాసనమ్ ॥

ఏకాంతిక వాదాన్ని ఓడింపజేసి, అనేకాంత వాదమనే పేరుగల స్యాద్వాదాన్ని స్థాపింపజేసిన వాడైన మహారాజు నృపతుంగుని శాసనం సర్వదావర్ధిల్లుగాక!

మల్లన సారసంగ్రహగణితానికి 'అవతారిక' లో గ్రంథ విషయప్రాశస్త్యాన్ని గురించి ఒక సీస పద్యం వ్రాశాడు. గణిత శాస్త్రంలోని తొమ్మిది అధ్యాయాలను ఒక సముద్రంతో పోలుస్తూ

అఖిల విద్వత్సుజనఘోషమనఁగఁ బరగు
గణిత వారాశి సంఖ్యాన మణిగణంబు
లుద్ధరింపంగ నజునకు నోపనగునె? (పద్యం -9)

ఈ పద్యం నన్నయ వ్రాసిన '' అమలినతారకాసముదయంబులనెన్నను ....'' అనే పద్యంలోని, ''దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సముద్రముదఱియంగనీదను విధాత్రునకైనను నేరబోలునే!''(19ప) అనే దానితో పోలి ఉండడం గమనింపవచ్చు. కాని, ప్రారంభంలో ''అభినవ సంఖ్యామణిదీప్తి సారసంగ్రహగణిత సముద్రంబు దరువఁగణఁగితిఁబ్రీతిన్'' (అవతారిక -2వ) అన్నాడు. ఈ రెండు మాటలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయని భావించాడేమో! చిట్టచివరి పద్యంలో ఇలా వ్రాశాడు మల్లన.

కం॥ ఐనను దమతమ శక్యంబైనంత యెఱిఁగి చెప్పనగు నెవ్వరి కెం
దైనను గావున **సూత్రితమైన తదంశంబు చెప్పనగునిజబుద్ధిన్** (పద్యం -10)

ఇది నన్నయ చెప్పిన, '' నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద'' అన్న పలుకుల్ని పోలుతున్నది. ఇక్కడ '' సూత్రితమైన అంశములు'' చెప్పినదెవరు? మహావీరాచార్యుడు ఈయన పేరును మల్లన ఇక్కడైనా ప్రస్తావించి ఉండి తీరాలి. చెప్పకపోవడంలోని ఆంతర్యం విస్పష్టమే! 'నిజబుద్ధితో' - 'స్వకీయ బుద్ధి బలంతో' 'సూత్రితమైన అంశాలను వివరించాలి అన్నాడు. శాస్త్రవివరణలలో జైనుల గణిత శాస్త్ర పరిభాషలైన ప్రాకృత పదాలను పరిహరించ లేక పోయాడు మల్లన. ఎందుకంటే ఎక్క, మగ్గ, గచ్ఛ వంటి పదాలు అప్పటికే తెలుగు దేశంలో స్థిరపడ్డాయి. 'ఎక్క'మనే మాటనే మన మీ రోజు 'ఎక్కాలు' అంటున్నాం! ఇలా మూలకర్త పేరునూ, మతాన్నీ ఎంత చెప్పగూడదనుకొని ప్రయత్నించినప్పటికీ గ్రంథాతర్గత విషయం అని జైన గ్రంథమని స్పష్టపరిచింది.

## వ్యాస భారతంలోను, ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్య పర్వశేష పూరణంలోను పరోక్షంగా జైనుల అహింసా సిద్ధాంత విమర్శన

జైన మతస్థాపకుడైన 23వ తీర్థంకరుడు పార్శ్వనాథుడు (క్రీ.పూ. 8వ శతాబ్ది) నాలుగు వ్రతాలను బోధించాడు అవి. 1. అహింస, 2. సూనృతము (సత్యము), 3. అస్తేయము (దొంగతనం చేయకుండుట), 4. అపరిగ్రహము (భౌతికవస్తువుల్ని స్వీకరింపకుండుట) దీనికి 'బ్రహ్మచర్యాన్ని' చేర్చినవాడు 24వ చరమతీర్థంకరుడైన వర్ధమాన మహావీరుడు.

ఎఱ్ఱాప్రెగ్గడ కంటే నన్నయ ముందటి వాడు కాబట్టి, నన్నయ భారతం, ఆదిపర్వం, నాల్గవ ఆశ్వాసంలోని శకుంతలోపాఖ్యానంలో జైనులు అనుష్ఠించే '**సూనృతవ్రత**'మనే పదాన్ని అలాగే నన్నయ శకుంతల ముఖతః ఎలా చెప్పించాడో చూడండి.

నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె **సూనృత**
**వ్రత!** యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వదిమేలు, తత్క్రతు శతంబున కంటె సుతుండు మేలు, త
త్సుత శతంబు కంటె నొక **సూనృతవాక్యము** మేలు సూడఁగన్

కం॥ వెలయంగ నశ్వమేధంబులు వేయును నొక్క **సత్యమును** నిరుగడలం
దుల నిడి తూఁపగ **సత్యము** వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్

తే॥గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము **సత్యంబుతో** సరియుఁగావు
ఎఱుఁగుమెల్ల ధర్మంబుల కెందుఁబెద్ద
యండ్రు **సత్యంబు** ధర్మజ్ఞులైన మునులు[56] (94,95,96 పద్యాలు)

వ్యాసమహాభారతం, అరణ్యపర్వంలో 198వ అధ్యాయం నుండి 206 వ అధ్యాయం వరకు బ్రాహ్మణ వ్యాధ సంవాదమున్నది[57]. దీనినే ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వం పంచమాశ్వాసంలో కౌశికుడనే బ్రాహ్మణునికి, ధర్మవ్యాధుడనే కిరాతుడు అహింసా, సత్య, ధర్మ, శిష్టాచారాలను తెలిపే ఘట్టాన్ని 120 గద్యపద్యాలలో విస్తృతంగా వివరించినాడు[58]. వ్యాసభారతంలోని ఈ ఘట్టం జైన, బౌద్ధ మతస్థులు వ్రతంగా అనుష్ఠించే అహింసా, సత్య, ధర్మ, శిష్టాచార, జీవ, మోక్షస్వరూపాలను, వైదిక మతపరంగా ఇచ్చిన సమాధానమని గ్రహించాలి. వైదిక మతంలోని ఈ ఉత్కృష్ట గుణాలనే జైన, బౌద్ధాలు వ్రతాలుగా స్వీకరించాయి, తప్ప అవి కొత్తవేమీ కావు. అయితే వీటిలో ధర్మ సూక్ష్మం తెలిసి ప్రవర్తించడమనేది చాల కీలకమైనది.

జైనులు, బౌద్ధులు వైదిక మతంలోని యజ్ఞయాగాదులను నిరసించడమే కాక, ఆ యజ్ఞాలలో జరిగే నర, జంతుబలుల్ని పూర్తిగా తిరస్కరించారు. ఒక జీవికి మరో జీవిని చంపే హక్కు లేదన్నారు. 'స్వర్గకామోయజేత' అని చెప్పి హింస చేస్తే స్వర్గం లభించదన్నారు. చాతుర్వర్ణవ్యవస్థనూ, వర్ణాశ్రమ ధర్మాలను తృణీకరించారు. కఠిన నియమాలు పాటించకపోతే నిర్వాణం రావడం కల్ల అన్నారు. ఈ నేపథ్యంలోనే వ్యాసుడు మహా భారతంలో బ్రాహ్మణ ధర్మవ్యాధసంవాదాన్ని విస్తృతంగా వ్రాస్తూ జైన, బౌద్ధులు విమర్శించిన అంశాలకు సమాధానం చెప్పినట్లుగా తోస్తుంది. అహింసా స్వరూపాన్ని కౌశికునికి తెలియజేసే ముందు, ధర్మ స్వరూపాన్ని గూర్చి ధర్మవ్యాధుడు చెప్పిన పద్యం-

వేద విహితంబులును, శాస్త్రవిహితంబులును
శిష్టచరితంబులును నన జెప్పనొప్పి
ధర్మములు మూడు విధముల దనరుచుండు
గడగియన్నియు సద్గతి కారణములు (అరణ్య 5-49)

**" శిష్టచరితంబులు గాని మార్గంబులు గొన్ని తృణసంవృతంబులైన కూపంబులుంబోలె గపట ధర్మసంవృతంబులై యుండు వాని దవ్వులన పరిత్యజించి శిష్టాచారంబుల నడచుట ధర్మలక్షణంబనిన"** - (అరణ్య 5-43 వ)

పై వచనంలో వ్యాసుడు గాని, ఎఱ్ఱన గాని ఎవరిని విమర్శిస్తున్నారు ? జైన, బౌద్ధమతాలను కాదు కదా! అనే ప్రశ్నలు ఉత్పన్నమౌతున్నాయి. పైపైన గడ్డి పరచిన బావుల వంటి కపట ధర్మములతో కూడిన మార్గాలుకొన్నిఉన్నాయట! అవి శిష్టులు అనుసరించదగినవి కావు. పరిత్యజించదగినవని స్పష్టంగా చెప్పబడినది. వ్యాస భారతంలో -

పాపానాం విధ్యధిష్ఠానం లోభమేవ ద్విజోత్తమ
లుబ్ధాః పాపం వ్యవస్యంతి నరానాతి బహుశ్రుతాః ।
**అధర్మాధర్మ రూపేణ తృణైః కూపా ఇవావృతాః ॥**
తేషాం దమః పవిత్రాణి ప్రలాపా ధర్మ సంశ్రితాః ।
సర్వం హి విద్యతే తేషు శిష్టాచారాః సుదుర్లబాః ॥ - (అరణ్య, 198-54, 55 శ్లో)

హింసకు, అహింసకు గల భేద మెట్టిదో తెలుపుతూ, ధర్మవ్యాధుడు చేసిన ధర్మోపన్యాసం జైన, బౌద్ధ మతాలు ప్రధానంగా స్వీకరించిన అహింసా సిద్ధాంతాన్ని పేరు చెప్పక పరోక్షంగా విమర్శించడమేనని నా అభిప్రాయం.

వైదిక మతదృష్ట్యా అహింసాస్వరూపాన్ని విశదీకరించిన పద్యాలు 10 దాకా ఉన్నాయి (ఆంధ్ర మహాభారతము అరణ్య -5-52-63) వైదిక భావన ఎప్పుడూ కర్మసిద్ధాంతం పై ఆధారపెట్టబడి నిర్మింపబడింది. కాబట్టి, దానికనుగుణంగానే మొదటి పద్యంలోనే యిట్లంటాడు ధర్మవ్యాధుడు.

కం॥ మును తమ చేసిన కర్మం బునఁజూవె నశించు భూతములు, సంపెడువా
డు నిమిత్తమాత్ర మింతయెయని చెప్పగ వినమె యంచితాచారులచేన్

సృష్టిలో సకల ఫలమూల ఓషధులు, శాకములు, పశుమృగములన్నీ మనుష్యులకు ఆహారంగా బ్రహ్మ ఏర్పాటు చేశాడు. ఒక జంతువుకు మరో జంతువు ఆహారం కావడం సృష్టి లక్షణంలోనే ఉంది. యజ్ఞ యాగాదుల్లో చేసే జంతు బలులు హింస కానే కాదు. పితృ శ్రాద్ధాలలో మాంసాన్ని పెట్టడం వైదికాచారం (చూ॥ 54,55,56 పద్యాలు)

మ॥ హలికుండెంతయు నోజతో దునగ సీరాగ్రంబునం జోకి ప్రా
ణులనేకంబులు సచ్చు, హింసయదియౌనో? కాదొ? వేయేల! **మ
ర్త్యులు నేలం జరియించుచో బదములందొక్కంబంబెక్కు జం
తులు, హింసావిధి గాదనంగ వశమే!** దోషజ్ఞ! యూహింపుమా!

చ॥ సలిలము, లుర్వి, యాకసము, సర్వము జంతుమయంబు, గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును **హింస**, హింసకుం
దొలగిన దేహయాత్రయును దుర్ఘటమైనటులుండు, నింతయుం
దలపర, **హింససేయమని తారుతలంతురు గొందఱిమ్మహిన్**

అహింసావ్రతాన్ని అదే పనిగా అవలంబించిన మునులు కూడ హింసచేయటం లేదా? తరుమూలఫల శాకాదులను పెరుకుట హింస కాదా? కాబట్టియో, అహింస అంటే ఏమి ?

తే॥ గీ॥ హింస సేయనివాడు లేడిజ్జగమున
నొక్కఁడైనను ఁదమ తమయోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేగవలయు
నదియ సూవె **యహింస** నా నతిశయిల్లు

''ధర్మంబు బహుప్రకారంబైయుండు, దదీయసూక్ష్మగతి దురవబోధంబు గావున
ి ప్రమాణంబు వలనను, వృద్ధాచార నిదర్శనంబులను నెఱింగికొనునది''[59] (అరణ్య
57.....61)

అందుకే, వైదికమతాభిమానియైన రాజరాజనరేంద్రుడు ''సమస్త వర్ణాశ్రమ ధర్మ
కుడు'' ''మనుమార్గుడు'' కావడం చేత వ్యాసుడు వ్రాసిన '' మహాభారత బద్ధ
ాపితార్థమేర్పడదెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్'' (అవతారిక - 16) అని
ఎడంలో వైదికమతోద్ధరణమే ప్రధానాశయంగా స్పష్టమౌతున్నది.

సత్యము, అహింస లను గురించి వ్యాసుడు చెప్పిన రెండు మూడు శ్లోకాలిక్కడ
రింపదగినవి.

అహింసా, సత్యవచనం సర్వభూతహితం పరమ్ ।
**అహింసా పరమోధర్మః** సచ సత్యే ప్రతిష్ఠితః ॥ –వ్యాసభారతం **3–198–69**

యథాశ్రుతిరియం బ్రహ్మన్, **జీవః కిల సనాతనః ।**
శరీరమధ్రువం లోకే సర్వేషాం ప్రాణినామిహ ॥ (**3–200–23**)

న జీవ నాశోఽస్తి హి దేహభేదే
**మిథ్యైతదాహుర్మ్రియతేతి మూఢాః ।**
జీవస్తు దేహాంతరితః ప్రయాతి
దశార్ధతైవాస్య శరీర భేదః ॥ (**3–200–26**)

ఆత్మజ్ఞానం పరం జ్ఞానం–**పరం సత్యవ్రతం వ్రతమ్ ।**
సత్యస్యవచనం శ్రేయః – **సత్యం జ్ఞానం హితం భవేత్ ॥** (**3–203–41**)

భవేయు రగ్నయస్తస్య – పరిచీర్ణాస్తు నిత్యశః ।
గార్హస్థేవర్తమానస్య – **ధర్మఏష సనాతన ః ॥** (**3–204–27**)

## జైనులు పరమత సహనాన్ని పాటించి అన్యమత సిద్ధాంతాలను కూడ అధ్యయనం చేశారు

వైదిక మతాభిమానులైన వారికి జైనమతంపై అసూయాద్వేషాలు, తిరస్కారభావం
ఉండవచ్చునేమో గానీ, జైనులు సహజంగా విద్యావ్యసనులు, శాంతికాముకులు కాబట్టే

ఇతర మతాల సిద్ధాంతాలేమంటున్నాయి అనే జిజ్ఞాసతో అవలోడనం చేసి గ్రంథరచనలు కూడ చేశారనడానికి జైనుడైన హరిభద్రసూరి వ్రాసిన 'షడ్దర్శన సముచ్చయ' మనే సంస్కృత గ్రంథమే నిదర్శనం.[60]

హరిభద్రసూరి మొదటి హైందవుడని, తర్వాత జైనుడుగా మారినాడనే ఐతిహ్యముంది. ఇతడు రాజస్థాన్‌లోని చిత్తోడ్ నివాసియని, జితారి దేవాలయ పూజారి బ్రాహ్మణుడని చెబుతారు. ఇతడొక విలక్షణ జిజ్ఞాసాపరుడు కావడంతో, జినభట్టసూరిచే జైనమతం పుచ్చుకొన్నాడు. ఇతనికి 'పరమార్హతు'డనే బిరుదున్నది. ఇతని కాలాన్ని గురించి Max Mullar క్రీ.శ. 528 వాడని, Barth క్రీ.శ. 9వ శతాబ్ది వాడని, డా॥ విద్యాభూషణ్ భట్టాచార్య, Dr. Winternitz క్రీ.శ. 12వ శతాబ్దియని చెప్పారు.

ఈయన గ్రంథం షడ్దర్శన సముచ్చయంలో బౌద్ధ (8 శ్లోకాలు), న్యాయ (21 శ్లోకాలు), సాంఖ్య (11 శ్లోకాలు), జైన (15 శ్లోకాలు), వైశేషిక (9 శ్లోకాలు) జైమినీయ (10 శ్లోకాలు) చార్వాక (10 శ్లోకాలు) దర్శనాలు వివరించబడినాయి కాని, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత ప్రస్థానాలు చెప్పక పోవడం చేత ఇతడు శ్రీ శంకరుల కంటే పూర్వుడని క్రీ.శ. 6వ శతాబ్ది ఈతని కాలమని పలువురు పండితులు అంగీకరించారు.

హరిభద్రసూరి ఇతర రచనల గురించి షడ్దర్శన సముచ్చయాన్ని వ్యాఖ్యానించిన మణిభద్రుడు చెప్పాడు. '' చతుర్దశ శతప్రకరణోపకృత జినధర్మాణః''. జైన ధర్మానికి సంబంధించిన 1400 ప్రకరణ గ్రంథాలను రచించినవాడు. వాటిలో కొన్ని పేర్లు మాత్రమే తెలుస్తున్నాయి. అవి 1) అనేకాంత జయపతాక, 2) లలిత విస్తర, 3) చైత్యవందనవృత్తి, 4) దర్శన సప్తతికా, 4) మునిపతి చరిత్ర మొదలగునవి. షడ్దర్శన సముచ్చయంలో మొత్తం 87 శ్లోకాలున్నాయి. 84 శ్లోకాలు గ్రంథమైతే తక్కిన మూడు శ్లోకాలు అవతారిక.

శ్లో॥ సద్దర్శనం జినం నత్వా వీరం స్యాద్వాద దేశకమ్ ।
సర్వదర్శన వాచ్యోఽర్థః సంక్షేపేణ నిగద్యతే ॥

ఎవడు నిజమైన తత్త్వదర్శన శక్తి గలవాడో, ఎవడు తాత్త్వికలోక వీరుడై స్యాద్వాదమనే సిద్ధాంతాన్ని స్థాపించినవాడో, అటువంటి జినుడైన వర్ధమానమహావీరునికి నమస్కరిస్తూ సర్వమతదర్శనాలను సంక్షిప్తంగా చెప్పడానికి పూనుకొంటున్నాను.

శ్లో॥ దర్శనాని షడేవాత్ర మూలభేద వ్యపేక్షయా ।
దేవతా తత్త్వ భేదేన జ్ఞాతవ్యాని మనీషిభి : ॥

శ్లో॥ బౌద్ధం, నైయాయికం, సాంఖ్యం, జైనం, వైశేషికం తథా ।
జైమినీయం చ నామాని దర్శనానా మమూన్యహో ॥

ప్రాథమికమైన భేదాలను బట్టి పరిశీలిస్తే దర్శనాలు ఆరుగా చెప్పవచ్చు. వాటిని పండితులు ఆయా అధిష్ఠాన దేవతలతో పాటు, వాటి విలక్షణ సిద్ధాంతాలను, ప్రత్యేకతలను తెలియజేస్తున్నారు. బౌద్ధము, నైయాయికము, సాంఖ్యము, జైనము, వైశేషికము, జైమినీయమని ఆరు దర్శనాలు గుర్తింపవచ్చు. దీనికి అనుబంధంగా చార్వాక దర్శనాన్ని కూడ ఏడవ దర్శనంగా చేర్చబడింది.

లోకంలో సామాన్యంగా ఏమతానికి చెందినవాడు ఆ మతానికి చెందిన సిద్ధాంతాలను వివరిస్తూ గ్రంథాలను వ్రాసుకొంటాడు. కాని, దీనికి భిన్నంగా జైనులునిరంతర విద్యా వ్యాసంగం చేసే వారు కాబట్టి ఏ మత సిద్ధాంత మేమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాసతో, అసూయాద్వేషాలకు తావు లేక, అనవసర విమర్శలు లేకుండ వ్రాసిన గ్రంథమే షడ్దర్శన సముచ్చయము.

## జైన శ్రావకుడైన మల్లియ రేచన తెలుగులో మొట్టమొదటి రచయిత - లక్షణ గ్రంథకర్త

కవిజనాశ్రయ కర్తయైన మల్లియరేచన నన్నయభట్టుకు పూర్వమే క్రీ.శ. 940లో ప్రసిద్ధ కన్నడకవియైన పంపకవి తమ్ముడు, 'వాచకాభరణు' డనే బిరుదనామం కల జినవల్లభుని సహాయంతో తెలుగులో తొలి లక్షణ గ్రంథాన్ని రచించాడు. దీనిచే అప్పటికే జైన కవులు వ్రాసిన తెలుగు సాహిత్యం ఉందని అర్థం. సాహిత్య సృష్టి ఉన్నప్పుడే లక్ష్యానికి అనుగుణంగా లక్షణ గ్రంథం వెలువడే అవకాశముంది,. కాని, ఆ జైన కవుల సాహిత్య సృష్టినంతా మనం మతద్వేషం చేత పోగొట్టుకొన్నామని వేరుగా చెప్పవలసిన పని లేదు.

పై వాదనకు ఉపబలకంగా ప్రస్తుతం ముద్రితమై లభిస్తున్న కవిజనాశ్రయ లక్షణ గ్రంథంలోని రెండు అంతస్సాక్ష్యాలను, కరీంనగర్ జిల్లాలో జగిత్యాలకు పోయే రోడ్డు ప్రక్కన, కుర్క్యాల గ్రామం వద్ద బొమ్మలగుట్ట అనే కొండ మీద లభించిన కొన్ని జైన ప్రతిమలు, ఒక పెద్ద శాసనం ఆధారంగా సమన్వయించి చూపవచ్చు. కుర్క్యాల శాసన విషయం వివరించడానికి ముందు కవిజనాశ్రయాన్ని గురించిన రెండు అభిప్రాయాలను మనవిచేస్తాను.

తెలుగు లక్షణ గ్రంథాలలో 'కవిజనాశ్రయం' అత్యంత ప్రాచీనమైనదిగా అందరూ అంగీకరిస్తారు. కాని, దీని కర్త ఎవరు ? ఏ కాలంలో వ్రాయబడింది ? అనే అంశాలపై పరిశోధకుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి.

1) 1917 లో జయంతి రామయ్యపంతులు గారు కాకినాడ, ఆంధ్ర సాహిత్యపరిషత్తు ద్వారా కవిజనాశ్రయాన్ని తొలిసారిగా పరిష్కరించి ప్రచురింపజేస్తూ దీని కర్త వేములవాడ భీమకవియని నిర్ణయించారు. దీనికి వారు చూపిన ఆధారం శ్రీనాథుడు కాశీఖండం అవతారికలో, ''వచియింతు వేములవాడ భీమన భంగి నుద్దండలీల నొక్కొక్కమాటు'' అన్న పద్యపాదమే. శ్రీనాథుడు, వేములవాడ భీమన కవిజనాశ్రయకర్తయని చెప్పపోయినప్పటికీ, కాకునూరు అప్పకవి (క్రీ.శ. 17వ శతాబ్ది) అప్పకవీయం (తృతీయాశ్వాసం - పద్యం 270) లో -

వికట కవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమునఁ గలిపినారు
వానిఁగైకొనంగ వల దప్రయుక్తము లేల సెప్పు భీమడెఱిఁగి యెఱిఁగి

అనే పద్యాన్ని బట్టి కవిజనాశ్రయకర్త వేములవాడ భీమన యని, కాలము శ్రీనాథునికి కొంచెం ముందుగా అంటే క్రీ.శ. 14వ శతాబ్దాంతానికి కొంచెం పూర్వుడని తేల్చారు. ఇది అప్పకవి వాదంగా కూడ చెప్పవచ్చు.

2) ఇక రెండవ వాదం చేసిన వారు ఇద్దరు. వేటూరి ప్రభాకర శాస్త్రి గారు నన్నయకుఁ బూర్వపు ఛందస్సు (1922)అనే వ్యాసంలోను [61], నిడుదవోలు వేంకటరావు గారు 1950లో కవిజనాశ్రయాన్ని మరల పరిష్కరించి వ్రాసిన విపుల పీఠికలోను (వావిళ్ళ, మద్రాసు) తెలియజేశారు. వీరిద్దరి అభిప్రాయాల్లో మల్లయరేచనయే కవిజనాశ్రయకర్త. వీరు రేచనకాలం క్రీ.శ. 11వ శతాబ్దికి పూర్వమేనని చెప్పారు.

కాని, ఒక్కటి మాత్రం నిజం. అప్పకవి నాటికే కవిజనాశ్రయంలో ప్రక్షిప్త పద్యాలతో పాటు, వికటకవులు కొన్ని వింతలు కూడ చేర్చారు. ఒక్క తాళపత్ర ప్రతిలో లభించిన అటువంటి ఆరు కందపద్యాలను జయంతి రామయ్య గారు ప్రక్షిప్తంగా గుర్తించినారు. అందులో ఒక పద్యం మాత్రం చూపుతున్నాను.

కం॥ **వేములవాడను** వెలసిన భీమేశ్వర కరుణగల్గు **భీమసుకవి నేఁ**
**గోమటి రేచన** మీదను నీ మహి గవులెన్న **ఛందమెలమి** రచింతున్

భీమకవి, కోమటిరేచన ఇచ్చే బహుమానానికి లొంగిపోయి, అతని పేరు మీదుగా గ్రంథాన్ని వ్రాసి అమ్ముకొన్నాడనే ప్రవాదం తర్వాతివారెవరో కల్పించి, వ్రాసిన ప్రక్షిప్తాలని స్పష్టంగా చెప్పవచ్చు. అనేక తాళపత్ర ప్రతుల్లో పై ఆరు పద్యాలు లేక పోవడం చేత ఇది ప్రక్షిప్తం (Interpolation) అని తేలింది. కాబట్టి, అప్పకవి నాటికే కవిజనాశ్రయ కర్తృత్వ విషయంగా మార్పు ఏర్పడివుందని చెప్పవచ్చు.

ఈ ప్రక్షిప్తవాదాన్ని ప్రక్కకునెట్టి, అంతస్సాక్ష్యాలు (Internal evidences) ఏవైనా ఉన్నాయాయని పరిశీలిస్తే రెండు సాక్ష్యాలు లభిస్తున్నాయి.

i) **గద్య** (Colophon) : '' ఇది వాదీంద్ర చూడామణి పదసరసీరుహ మధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయంబను ఛందంబునందు సంజ్ఞాధికారము''

ఈ గ్రంథ రచయిత శ్రావకాభరణుడు అంటే జైన మతస్థుడు 'వాదీంద్రచూడామణి' అనే బిరుదు గల ఒక జైన విద్వాంసునికి శిష్యుడు, కవిజనాశ్రయ బిరుదనామధారియైన ఒక శ్రావకాభరణుడు దీని రచయితగా గద్యభాగం చేత తెలుస్తున్నది. కాబట్టి గ్రంథ కర్త జైనుడనేది స్పష్టం. జైన శ్రావకులకు ఆభరణంవంటి వాడైన 'మల్లియరేచన' ను ఆయన సమకాలంలోని కవిజనులు ఆశ్రయించేవారికి తెలుస్తోంది. అందుకే లక్షణగ్రంథానికి 'కవిజనాశ్రయ' మనే పేరు సార్థకమౌతున్నది.

ii) **అవతారిక** (Introduction) : అవతారిక ఇష్టదేవతాస్తుతితో ప్రారంభమైంది. అది 'సరస్వతీ' ప్రార్థన. ఇది జైన సంప్రదాయమే. ఇంకొక పద్యంలో తాను ఒక మిత్రుని సహాయంతో ఈ గ్రంథాన్ని రచించినట్లు చెప్పుకోవడం కనిపిస్తుంది.

కం॥ అసమాన దాన రవితనయ సమానోన్నతుఁడు **వాచకాభరణుడు** ప్రా
ణ సమాన మిత్రుఁడీ కృతికి సహాయుఁడుగా నుదాత్త కీర్తి ప్రీతిన్

ఈ పద్యంలో రేచనకు సహాయం చేసిన మిత్రుని పేరు చెప్పబడ లేదు. 'వాచకాభరణు' డని మాత్రం చెప్పబడింది. జైన మత ప్రచారకుల్ని '' వాచకు'' లంటారు. అలాంటి వాచకులకు ఆభరణం వంటి వాడైన మిత్రుడొకడు 'మల్లియరేచన' కు ఈ రచనలో తోడ్పడినట్లు తెలుస్తున్నది.

ఈ 'వాచకాభరణు' డెవరో గుర్తించడం లోనే మనకు 'కుర్క్యాల శాసనం' ఎంతో తోడ్పడి, విలువైన సమాచారాన్ని అందిస్తూ వుంది.

# జినవల్లభుని కుర్క్యాల శిలాశాసనం

**లభ్యస్థానం** (Find - Spot) ఇటీవల (1970) కరీంనగర్ జిల్లాలోని జగిత్యాలకు పోయే దారిలో, గంగాధరం అనే గ్రామానికి సమీపంలో గల, కుర్క్యాల అనే గ్రామంలో బొమ్మలగుట్ట అనే కొండమీద కొన్ని జైన విగ్రహాలు, ఒక పెద్ద శిలాశాసనం కనుగొనబడ్డాయి. ఈ శాసనం ఒక పెద్ద బండ రాతి మీద చెక్కబడివున్నది. కన్నడ భాషలో ఆది కవిగా కీర్తింపబడుతున్న పంప మహాకవి సోదరుడు జినవల్లభుడనే జైన విద్వాంసుడు ఈ జైన తీర్థాన్ని నెలకొల్పి ఈ పెద్ద శాసనాన్ని, జైన విగ్రహాలను మలిపించినట్లు తెలుస్తున్నది.

**లిపి విధానం,** ఈ శాసనంలో అక్షరాలు తెలుగు కన్నడ లిపికి చెందింది. ఇది తెలంగాణా ప్రాంతాలలో క్రీ.శ. 9, 10 శతాబ్దాలలో వాడుకలో ఉండేదిగా శాసన పరిశోధకులైన డా॥ నేలటూరి వెంకట రమణయ్య గారు నిర్ణయించారు. ఈ శాసన లిపి విధానం రెండవ అరికేసరి వేయించిన వేములవాడ శాసనంలోని లిపితో పోలివున్నదని ఆయన గుర్తించారు.

**శాసన స్వరూపం :** ఈ శాసనంలో సంస్కృతం, కన్నడం, తెలుగు మూడు భాషలు ఉపయోగింపబడ్డాయి. సాధారణంగా జైన శాసనాలన్నింటికీ మొదట వ్రాయబడే " ఓం నమః సిద్ధేభ్యః" సంస్కృతంలో వ్రాయబడింది. దీని తర్వాత కన్నడ భాషలో ఒక పెద్ద వచన భాగం, ఆ తర్వాత మూడు సంస్కృతవృత్తాలు, (రెండు శార్దూల విక్రీడితాలు, ఒక పృథ్వీవృత్తం), అటు పిమ్మట కన్నడ భాషలో ఆరు వృత్తాలు (నాలుగు చంపకమాలలు, ఒక మత్తేభవిక్రీడితం, ఒక తరలం), అటు తర్వాత తెలుగులో మూడు కందపద్యాలు, చిట్టచివరగా కన్నడంలో ఒక చిన్న వచనం వ్రాయబడివుంది.

**ప్రధానాంశం** (Purport) ఈ శాసనంలోని ప్రధానాంశం జినవల్లభుని పుణ్యకార్యాలను ఏకరువు పెట్టడమే. దీనికి నేపథ్యంగా జినవల్లభుని పూర్వీకుల వృత్తాంతాన్నీ, ఆయన విద్యాభ్యాసం, గుణగణాలు, ఔదార్యం, మత విశ్వాసాలు, చేసిన పుణ్యకార్యాలు, ఆయన పెద్దన్నయ్యయైన పంపమహాకవి ప్రసిద్ధి ప్రాచుర్యాలూ, ఘనంగా ప్రశంసింపబడినవి. ఈ విధంగా ఈ శాసనం కన్నడ మహాకవియైన పంపడు ఆయన తమ్ముడైన జినవల్లభుడు వారి పుట్టుపూర్వోత్తరాలను చెప్పే సమగ్రనివేదికగా గ్రహించవచ్చు. పంప, జినవల్లభులు ఆంధ్రులని ఈ శాసనం చేత స్పష్టమైంది.

**శాసన రచయిత :** ఈ శాసనం చివర, శాసన రచయిత పేరు పేర్కొన బడక పోయినప్పటికీ, రచనా విధానాన్ని బట్టి చూస్తే అతడొక ప్రసిద్ధ రచయితగానే చెప్పాలి.

మూడు భాషలలో ఆయన యొక్క ప్రావీణ్యం స్పష్టమౌతున్నది. విభిన్నశైలులలో అనేక కావ్యాలను వ్రాయగల సామర్థ్యం, గొప్ప పాండిత్యం, సహృదయ వివేచన గలవాడుగా శాసనంలో ప్రశంసింపబడిన జినవల్లభుడే ఈ శాసన కర్తయని మనం భావించవచ్చు. పంపమహాకవిని గూర్చి చేసిన అత్యంత సహజమైన, ఆర్ద్రమైన సంబోధనలు, వర్ణనలు జినవల్లభుడే ఈ శాసన రచయితయని ధ్రువకరిస్తోంది.

**కాలనిర్ణయం :** ఈ శాసనంలో కాలసూచన లేదు. అయినప్పటికీ లిపి విధానాన్ని బట్టి క్రీ.శ. 10వ శతాబ్ది మధ్యభాగంలో ఈ శాసనం వ్రాయబడిందని చెప్పవచ్చు. అరికేసరి మహారాజును, పంపమహాకవినీ ఆయన వ్రాసిన విక్రమార్జున విజయాన్నీ ఈ శాసనం ప్రస్తావించడమే దీని కాలనిర్ణయానికి దోహదం చేస్తూవుంది. అరికేసరి క్రీ.శ. 930 నుండి 958 వరకు కన్నడదేశాన్ని పరిపాలించాడు. పంప మహాకవి క్రీ.శ. 902లో జన్మించి,ఆదిపురాణాన్ని శక సం॥863 (క్రీ.శ. 941) లో రచించాడు. విక్రమార్జున విజయంలో ఆది పురాణ ప్రస్తావన ఉండడం చేత అది ముందే వ్రాయబడిందని తెలుస్తుంది. విక్రమార్జున విజయం వ్రాసిన తర్వాతనే ఈ శాసనం లిఖింపబడిందని చెప్పవచ్చు. పై సాధన సామగ్రి చేత ఈ శాసనం క్రీ.శ. 945 లో వ్రాయబడి వుంటుందని డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారు నిర్ణయించారు [62].

**శాసనాన్ని బట్టి పంపకవి వంశవృక్షం :** ఈ శాసనాన్ని బట్టి పంపకవి వంశవృక్ష ఇలా ఉంది.



శాసనంలోని వంశవృక్షంలో చెప్పబడిన విషయాలన్నీ యథార్థాలే. విక్రమార్జున విజయంలో పంపకవి తమ వంశవృక్షాన్ని వ్రాశాడు. అక్కడ ఆయన తన వంశానికి మూలపురుషుడు మాధవ సోమయాజి అని తెలిపాడు. కవితాగుణార్ణవుడనేబిరుదు పంపకవి రెండు కావ్యాల లోని గద్యలో చెప్పబడి ఉంది. శాసనంలో లేని ముగ్గురిని పంపకవి కావ్యంలో పేర్కొన్నాడు. వారి పేర్లివి.




శాసనంలో మూలపురుషుడైన మాధవ సోమయాజినీ, కుమారయ్యను, అభిమాన దేవరాయలను పేర్కొనకపోయినప్పటికీ డా॥నేలటూరి వారు తాళపత్ర ప్రతులను కూడా చూచి, శాసనస్థ విషయంలో సందేహపడవలసిన అంశాలేవీ లేవని నిర్ణయించారు.

**ప్రస్తుతాంశ పరిశీలన** : శాసనాన్ని బట్టి తెలుగు సాహిత్యానికి సంబంధించిన అంశాలను పరిశీలిద్దాము. వేములవాడ రాజధానిగా క్రీ.శ. **930-958** మధ్యపాలించిన రెండవ అరికేసరి మహారాజు ఆస్థానంలో తన అన్నయైన పంపకవితో పాటు, జినవల్లభుడు కూడ విద్వత్కవిగా ఆదరింపబడినవాడు. ఈసోదరులు తెలుగుదేశంలోని కమ్మనాటి (గుండ్లకమ్మతీరం) లోని గుంటూరు జిల్లా, బాపట్ల తాలుకా, వంగిపఱ్ఱు గ్రామానికి చెందినవారని, రాజాశ్రయం కోసం వేములవాడ చాళుక్యరాజుల్ని ఆశ్రయించి సబ్బిమండలానికి వెళ్లినవారని స్పష్టమౌతున్నది.

మూడు భాషల్లో వ్రాయబడిన ఈ శాసనంలో పంప, జినవల్లభుల గొప్పతనం కీర్తింపబడింది. 'కవిజనాశ్రయం' లో పేర్కొనబడిన 'వాచకాభరణు' డెవరో ఈ శాసనం చేత మనకు తెలుస్తోంది. జినవల్లభుడు గొప్ప విద్వాంసుడని, మహాదాన శీలి యని, కవిత్వతత్త్వ మెరిగిన మహామనీషి యని 'వాచకాభరణు' డనే పొగడ్తకు పాత్రుడైన వాడని చెప్పబడింది. ఆ శ్లోక మిది.

అజస్ర జిన వన్దనాగత మునీశ్వర శ్రావక ప్రజాస్తవ
రవ ప్రతిధ్వనిత శబ్ద కోలాహలైః।
అధిష్ఠిత దిగంబరో వృషభశైల ఏష స్వయం
వరాం వదతి **వాచకాభరణ** కీర్తిమాకల్పతః

జినవల్లభుడు 'వాచకాభరణు' డనే విశేషబిరుదం తో కీర్తింపబడ్డాడు. ఆ కాలపు శాసనాల్లో గాని, కన్నడ వాఙ్మయంలో గాని, 'వాచకాభరణు' డని ప్రసిద్ధి గాంచిన వేఱొక జైన విద్వాంసుడు లేడు అని డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారు చెబుతున్నారు[63]. అంతే గాక, మల్లియరేచనకు తొలిఛందో లక్షణ గ్రంథ నిర్మాణంలో తోడ్పడిన, జినవల్లభుడు కవిత్వతత్త్వ మెరిగిన వాడని ఈ కన్నడ పద్యం వలన తెలుస్తున్నది.

చదుర మయ్మెయ సత్కవిత్వద సన్ద **పంపన తమ్మ** నొ
ర్వదె పొగళ్తెయె బాబెసల్బరెయ **ల్కవిత్వద తత్వదొ**
ళ్పుదిదు నేర్పడెపేఱలుర్విగ పూర్వ మాగిరె బల్గొన
ప్పుదరి నొర్వనె **వాగ్వధూవరవల్లభం జినవల్లభం** ॥

పంపకవి తమ్ముడు కవిత్వతత్వమెరిగిన వాడు, వాగ్వధూవరవల్లభుడు, వాచకాభరణుడని కీర్తింపబడిన జినవల్లభుడు ఈయన ఒక్కడే తప్ప ఆకాలంలో తెలుగుదేశంలో మరొకరు లేరు. తెలుగుదేశంలో వేములవాడ తప్ప వేఱొక జైన విద్యాకేంద్రం ఆనాడు లేదు. ఈ వేములవాడలోనే అరికేసరి రాజాశ్రయంలో పంప, జినవల్లభ, సోమదేవసూరి అతని శిష్యులు, విద్వాంసులుండేవారు.

కవిజనాశ్రయ కర్తకు వేములవాడతో సంబంధమున్నదని భీమకవి'కర్త' అనే వారు కూడ అంగీకరించిన విషయమే. జినవల్లభుడు మహాజిన విద్వాంసుడు. అటువంటి కవిత్వతత్వ వేత్త సాయంతో మల్లియరేచన తెలుగులో తొట్టతొలి లక్షణ గ్రంథాన్ని రచించాడని మనం నిర్ణయించవచ్చు.

ఈ శాసనంలో మూడు కందపద్యాలున్నాయి. అవియే మొట్టమొదటి తెలుగు కందపద్యాలని పరిశోధకుల అభిప్రాయం. తెలుగులో నన్నయకు పూర్వం కందపద్యములున్నట్లు ఇంతవరకు తెలియదు. ఈ శాసన కాలం క్రీ.శ. 945 కాబట్టి నన్నయ కంటే సుమారు నూరు సంవత్సరాలకు ముందే తెలుగులో కందపద్య రచన జరిగినదనడానికి ఈ శాసనమే సాక్ష్యంగా నిలుస్తున్నది. ఈ మూడు కందపద్యాలవి –

కం॥ జినభవనంబు లెత్తించుట (జిన భవనము ....... అని ఉండాలి)
జినపూజల్సేము చున్కి జినమునులకు న
త్తిన యన్నదానం బీవుటం
జినవల్లభు బోలంగలరె జినధర్మపరుల్

కం॥ దినకరు సరివెల్గుదుమని
జినవల్లభు నెట్టునెత్తు జితకవిననుం
మనుజుల్గలరే ధాత్రిం (మనుజులు గల రేధాత్రిన్)
వినితిచ్చిదు ననియవృత్త విబుధ కవీంద్రుల్

కం॥ ఒక్కొక్క గుణంబు కల్గుదు
రొక్కణ్డగా కొక్కలక్కలే వెవ్వరికిం
లెక్కింపనొక్క లక్కకు
మిక్కిలి గుణపక్షపాతి గుణమణి గుణంబుల్

ఈ సందర్భంలో డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారి ఆంగ్ల వాక్యాలు స్మరణీయమైనవి. The present inscription is also important as it throws interesting light on the development of poetry in Telugu. Though literature as such in Telugu began only with Nannayabhatta in the 11th century A.D., the art of writing poetry in the language began some two centuries earlier, as shown by epigraphic evidence."

The Addanki and the Kandukuru inscriptions (844 AD) of the time of Gunaga Vijayaditya, the Dharmavaram inscription of his successor, Chalukya Bhima I and the Bezwada inscription (930 AD) of Yuddhamalla II are all in verse. The first has a **TARUVOJA**, the second and the third **SISA PADYAS** and the last **MADHYAKKARAS."**

" The Telugu verses in the present inscription(945 AD) are in the **KANDA** metre, which are the earliest of their kind in the language. It is evident from this that the art of writing poetry was known in the north-western marches of Telangana atleast a century before the composition of the Telugu Mahabharata by Nannayabhatta.[64]"

పై చర్చలకు సారాంశమేమంటే, జినవల్లభుడు తెలుగు కవిత్వం చెప్పనేర్చిన వాడు. రాష్ట్రకూటరాజుల కాలంలో క్రీ.శ. 9-10 శతాబ్దాలలో సంస్కృత జైన విద్వాంసుల సాంగత్యంలో కన్నడంలో కవిత్వం చెప్పగల పంపకవి వంటి మహాకవులు బయలుదేరారు. వారి సాహచర్యంలో తెలుగులో కూడ కవిత్వం చెప్పడానికి కొందరు ఉద్యమించారు. అటువంటి వారిలో జినవల్లభుడు సంస్కృత, కన్నడ, తెలుగు భాషల్లో అసమానంగా కవిత్వం చెప్పగలవాడని

కుర్క్యాల శాసనమే ఋజువు చేస్తున్నది. ఆంధ్ర మహాభారత రచనలో నన్నయభట్టుకు వాఙ్మయధురంధరుడు, ఇష్టుడు సహాధ్యాయుడైన నారాయణభట్టు తోడయి సహాయం చేసినట్లుగా, కవిజనాశ్రయమనే ఛందోలక్షణగ్రంథ రచనలో మల్లయరేచనకు వాచకాభరణుడుగా ప్రఖ్యాతి గాంచిన కవిత్వతత్వవిదుడైన జినవల్లభుడు తోడ్పడినాడని తెలుస్తున్నది.

మల్లియరేచన జైన శ్రావకుడైనందు చేతనే, వాచకాభరణుడైన జినవల్లభుని సహాయాన్ని అర్థించి పొందగలిగాడు. ఒక సన్నిహితత్వం, సజాతీయభావన, ఐచ్ఛికంగా ఇష్టత ఉన్నప్పుడే ఇతరుల సహకారంతో గ్రంథ రచన సాధ్యమౌతుంది. దీనిలోని సామంజస్యాన్ని పండితులు చక్కగా గుర్తించాలి! అంతే తప్ప, జైన మతాన్ని, జైన పండితుల్ని పూర్తిగా ద్వేషించే మన పూర్వీకులు జైనుడైన మల్లియరేచన పేరు మీదుగా వేములవాడ భీమన కవిజనాశ్రయం వ్రాశాడని చెప్పడం ఎంత విడ్డూరమో చెప్పవలసిన పని లేదు. అది అసాధ్యమైన అభూత కల్పన. దీనిచే ప్రక్షిప్తవాదం పరాస్తమైంది.

నన్నయకు పూర్వం ఆంధ్రదేశంలో సాహిత్యసృష్టి చేసిన కవులెందరో ఉండేవారని, క్రీ.శ. **940**లో జరిగిన లక్షణ గ్రంథ నిర్మాణం చేతనే తెలుస్తున్నది. అయితే ఆ కవులుజైన, బౌద్ధమతావలంబులు కావడం చేత వారు వ్రాసిన రచనలెన్నో మత వైషమ్యాల చేత, ముఖ్యంగా వీర శైవ, వీర వైష్ణవ విజృంభణాల వల్ల సంపూర్ణంగా నశించి పోయాయనే చెప్పాలి. గుడ్డిలో మెల్లగా మిగిలినవి మూలకర్త పేరు చెప్పక అనువదించిన పావులూరు మల్లన సారసంగ్రహగణితం, మూలకర్త పేరును మఱుగుపరుస్తూ మరొకరు దానిని వ్రాశారని చెప్పబడుతున్న కవిజనాశ్రయ ఛందోలక్షణ గ్రంథమూ మనకు దాఖలాలుగా మిగిలి ఉన్నాయి. ఈ రెండు దాఖలాలు గట్టివేనని, మన పూర్వీకుల మత విద్వేషాగ్నికి కాలిపోకుండా చారిత్రక అవశేషాలుగా సాహిత్యంలో దర్శనమిస్తున్నాయని, చెప్పవలసి ఉంది. ఈ భావంతో ఏకీభవిస్తూ డా॥ పి.వి. పరబ్రహ్మ శాస్త్రి గారు కూడ ఇలా వ్రాస్తున్నారు.

''అప్పటికి లక్ష్య గ్రంథాలుంటేనే గదా లక్షణ గ్రంథ రచనకు పూనుకొనుట అనవచ్చును. **జైన కవులు రచించిన కొన్ని తెలుగు గ్రంథము లుండి యుండును. జైన మతంలో పాటు అవి కూడ నశించి యుండును. కవిజనాశ్రయమునకు కూడ అట్టి దుర్గతియే పట్టెను.** అప్ప కవి చెప్పిన '' వికట కవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమును గలిపినారు''. అను పద్య పాదమునందలి వింతలలో **గ్రంథకర్తృత్వాన్ని కూడ మార్పు చేయటం ఒకటి కావచ్చును.** అప్ప కవి నాటికే ఆ మార్పు జరిగి యుండును.[65]''

ఎన్నో గ్రంథాలు నశించిపోగా ఒక్క కవిజనాశ్రయం మాత్రం బతికి బట్టకట్టడంలో ప్రధాన కారణం, అది ఛందోలక్షణ గ్రంథం కావడం, దాన్ని ఎలాగైనా బతికించుకోవాలని మన వారు తెలివిగా ఆనాడే జైనుల కర్తృత్వాన్ని తీసివేసి, 'వేములవాడ' తో గ్రంథానికి గల సంబంధాన్ని మాత్రం మార్చక, అదే ఇంటి పేరు గల భీమనను కర్తగా స్థాపిస్తూ ఆరుకంద పద్యాలను ప్రక్షిప్తం చేశారు గాని, గ్రంథాంతర్గతంగా దాగి వున్న రెండు మూడు సాక్ష్యాధారాలను గమనించలేక పోయారు. అక్కడే లొసుగులు బయటపడి, ఎప్పుడో కాలగర్భంలో దాగిన కుర్క్యాల శాసనం కనిపెట్టబడి, సత్యం ఇదమిత్థంగా ఋజువైంది.

ఈ వివేచనకు ముక్తాయింపుగా డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రిగారి వాక్యాలనే దురలా ఉల్లేఖిస్తున్నాను. ''వాదీభ సింహ,' 'వాదీభ పంచానన' ఇత్యాది బిరుదవులు గల జైన విద్వాంసులు ఆనాడు అరికేసరి ఆస్థానములో నున్నట్లు ఆధారాంతరవులను బట్టి తెలియుచున్నది. కాని, మల్లియరేచన గురువగు 'వాదీంద్రచూడామణి' ఎవ్వరో తెలియదు.[66]'' అని వ్రాశారు. ఈ సమస్య కూడ పరిష్కరింపబడితే కవిజనాశ్రయ కర్తృత్వ విషయకమైన సందేహాలు ఒక కొలిక్కి వచ్చినట్లే!

**జైనమతస్థుడు కన్నడ భాషలో సుప్రసిద్ధుడైన పంప మహాకవి ఆంధ్రుడు - ఈతని సమాధి నిజామాబాద్ జిల్లా, బోధన్ తాలుకా బోధన్ లో గుర్తింపబడింది[67].**

జినవల్లభుని కుర్క్యాల శాసనాన్ని బట్టి పంపమహాకవి, ఆయన సోదరుడు జినవల్లభుడు కమ్మనాడు, గుండ్ల కమ్మతీరంలోని గుంటూరు జిల్లా, బాపట్ల తాలుకా, వంగిపఱ్ఱు గ్రామానికి చెందిన వారని స్పష్టమైంది. పంపమహాకవి ఆంధ్రుడు కనుకనే ఆయన సమాధి కూడ నిజమాబాద్ జిల్లా బోధన్ తాలుకా, బోధన్‌లో గుర్తింపబడింది. ఈ సమాధిపై లిఖింపబడిన శాసనాన్ని పరిశీలిస్తే అది సంస్కృత భాషలో కన్నడ లిపిలో వ్రాయబడిన శాసనం. ఈ శాసనంలో తారీఖు పేర్కొనమడక పోయినా లిపి విధానాన్ని బట్టి ఇది క్రీ.శ. 10వ శతాబ్ది మధ్యభాగంలో ప్రచలితమైన లిపిగా నిర్ణయించబడింది. తొమ్మిది పంక్తులున్న ఈ శాసనంలో ఉపజాతికి సంబంధించిన త్రిష్టుప్ ఛందస్సు వాడబడింది. మొదటి మూడు పంక్తులు 'ఇంద్రవజ్ర' లోను చివరి పాదం 'ఉపేంద్రవజ్ర' లోను ఉంది. తొమ్మిది పంక్తులలో కన్నడ లిపిలోనున్న శాసనాన్ని నేనిక్కడ తెలుగు లిపిలో నాల్గు పంక్తులలో యిస్తున్నాను.

దేవేంద్ర సిద్ధాంతమునీశ్వరస్య
శిష్యోభవ శ్రీచ్ఛుభనంది నామా
ఆరాధ్య రత్న త్రయ మంత్యకాళే
సమాధినాసౌ సురలోకమాప ॥

దేవేంద్ర సిద్ధాంత మునీశ్వరుని శిష్యుడైన శుభనంది, జైనమత సూత్రాలైన రత్నత్రయాన్ని (సమ్యగ్దర్శన, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రములు) చక్కగా అనుష్ఠించడం చేత అతని జీవిత చరమదశలో సమాధిని పొంది దేవలోకమునకు వెళ్లినాడు.

పై శాసనస్థవిషయాన్ని పరిశీలిస్తే 'శుభనంది' అనే జైనసన్యాసి, (బోధన్‌లో) సమాధిపొందినట్లు తెలుస్తున్నది. దీనిలో పంపకవి పేరు లేకున్నప్పటికీ స్థానికులందరూ దానిని ఆయన సమాధిగానే పరిగణించి గౌరవిస్తున్నారు. పరిశోధింపగా పంపకవి వ్రాసిన ఆదిపురాణం (ఆశ్వా 16-పద్యం 35) లో ఆయనకు 'శుభు' డనే మరోపేరున్నట్లుగా చెప్పబడింది.

స విహతి కవితాగుణార్ణవాఖ్యాం
ననుభువన త్రితయేప్యనన్యరూఢాం ।
న విషయమగు తిర్యదేయ చింతా
చతురధికా జినవింశతి శ్శుభాయ ॥

శుభ లేక శుభనంది అనే పేరు గల్గిన దేవేంద్ర సిద్ధాంత మునీశ్వరుని శిష్యుడు పంపకవియే తప్ప మరొకరు కాడని దీనిచే స్పష్టమౌతున్నది. అదెలాగో పరిశీలిద్దాం !

హిందువుల వలె, జైనులు కూడ సన్యాసాశ్రమాన్ని పొందినపుడు ఒక దీక్షానామాన్ని స్వీకరిస్తారు. జైనులలో నంది, ముని, తీర్థ, ఆనంద అనేవి వారియొక్క సన్యాసాశ్రమ స్థాయిని సూచిస్తాయి. దీని చేత పంపకవి జైనుడు కనుక ఆయన తన జీవిత చరమదశలో సన్యాసాశ్రమాన్ని స్వీకరించి ''శుభనంది'' అనే దీక్షానామాన్ని పరిగ్రహించి ఉంటాడు. సన్యాసియైన తర్వాతనే మొదటి జైన తీర్థంకరుడైన ఆదినాథుని చరిత్రను వ్రాసివుంటాడు. దీనికి దృష్టాంతాలుగా ఆదిపురాణంలో ప్రతి ఆశ్వాసాంతంలోను పంపకవి బిరుదాలుగా - ''సరస్వతీ మణిహార'' ''సుకవిజన మనోమానసోత్తంస హంస'' సంసార సారోదయ అనే వాటిని 'నిర్వాణాన్ని' పొందిన ఆదినాథునికి, భరతునికి ఇంకా యితర జైనమునులకు విశేషణాలుగా వాడబడినవి. పై విశేషణాలలో చివరి రెండు పరిశీలిస్తే పంపకవి అప్పటికే ఒక సన్యాసివలె పవిత్ర జీవితాన్ని గడుపుతున్నట్లు తెలుస్తుంది. పంపకవికి ఆదినాథుడు, భరతుడు, బాహుబలి వీరి జీవితాలు ఆదర్శప్రాయాలు. పంపకవి రెండు రచనల్ని బట్టి చూస్తే ఆయన ఈ ముగ్గురు తీర్థంకరులతో తాదాత్మ్యాన్ని పొందినట్లు చెప్పవచ్చు. వీరు ముగ్గురు సమ్యక్ దర్శన, సమ్యక్ జ్ఞాన, సమ్యక్ చారిత్రమనబడే రత్నత్రయానికి ప్రతీకలై 'నిర్వాణం' పొందిన వారు. ఈ విధమైన నిర్వాణసిద్ధిని మనసులో కోరిన పంపకవి ఆదిపురాణంలో జైన సన్యాసులైన సమంతభద్రుని, పూజ్యపాదుని ఇలా స్తుతించాడు.

నయ వినయధియః సమంతభద్రాః
విదధతో వాఙ్మయదామ పూజ్యపాదాః ।
గమయతి పరమాక్షరద్వయం తే
మమ, జిన తత్పదయక్షరం జినేంద్రాః ॥ (16-36)

జైన మతసిద్ధాంతాన్ని బట్టి చూస్తే, 'పరినిష్క్రమణ కల్యాణ' మని పిలువబడే సన్యాసాశ్రమ స్వీకరణం చేయనిదే ఎవడూ 'జినుడు' కాలేడు. కాబట్టి, పంపకవి భౌతిక సుఖ భోగాలను త్యజించి, జినుడు కావడానికి, జీవితచరమదశలో సన్యాసాశ్రమ స్వీకరణం చేసినాడని చెప్పవచ్చు. 'జినుడినే' కేవలజ్ఞాని' అని కూడ పిలుస్తారు. తాను రత్నత్రయాన్ని సాధన మార్గంగా నిర్వాణానికి స్వీకరించానని పంపకవి వాచ్యంగా చెప్పకపోయినప్పటికీ, రన్నకవి తన అజితనాథ పురాణంలో పై మూడు రత్నాలను అనుష్ఠానంలో పెట్టినట్లు చెప్పాడు. అంతే కాదు, రన్నకవి అజితనాథ పురాణంలో యిలా అంటాడు.

కవిజనదోళో రత్నత్రయ
పవిత్రమెనె నెగల్ది పంపనుం పొన్నిగనుం
కవిరత్నను మీ మూవరో
కవిగళో జినసమయదీపకరో పెఱరోళరే॥

కవిజనులలో రత్నత్రయం వలె పవిత్రమైన వారు పంప, రన్న, పొన్నలనబడే ముగ్గురు కవులే. ఈ కవులు జినసమయాచారాలకు పెట్టిన దీపం వంటి వారు, అంటే, మార్గదర్శకులు అని వ్రాశాడు.

రన్నకవి వ్రాసిన అజితనాథ పురాణంలోని గద్యభాగాన్ని పరిశీలిస్తే - '' ఇదు సకలమునీంద్రవృంద వృందారక శ్రీమదజితసేన భట్టారక శ్రీ పాదపద్మ ప్రసాదాసాదిత రత్నత్రయాలంకృత శ్రీమదభినవ కవిచక్రవర్తి కవిరత్న విరచిత ..... '' ఇత్యాది వాక్యాలలో ఆయన రత్నత్రయాలంకృతుడైనట్లే, సమంతభద్రుడనే జైన సన్యాసి కూడ తాను వ్రాసిన ''ఆప్తమీమాంసా'' అనే గ్రంథంలో తనను 'రత్నత్రయాలంకృతుడు' గాని చెప్పకోవడం కన్పిస్తుంది.

దీని చేత, 'రత్నత్రయ' మనే మాట కేవలం 'కవిరత్నత్రయాని'కే పరిమితమైనది కాదు. సమంతభద్రునివలె పంప, రన్న, పొన్న కవులు ముగ్గురు జైన మత 'రత్నత్రయాన్ని' జీవితంలో అనుష్ఠించిన వారని స్పష్టమౌతున్నది.

జైనుడైన పంపకవి యొక్క గురువు పేరు 'జయనంది' (ఆదిపురాణం 1-13), అందుకే, దానికి సూచకంగా పంపకవి సన్యాసాశ్రమదీక్షానామంగా 'శుభనంది అనే పేరును స్వీకరించాడు[68]. 'శుభ'మనే నిర్వాణాన్ని అన్వేషించే సన్యాసి 'శుభనంది' అనబడుతాడు. బోధన్ ప్రాంతంలోని స్థానికులైన వారికి పరంపరాగతంగా 'శుభనంది'యే పంపకవి అని తెలుసుకాబట్టి వారు పంపకవి సమాధిగా దానిని ఆరాధిస్తూఉన్నారు.

> హేయంగళ్ ఖలకర్మ బంధనకరో క్రోధాధిగళ్ మత్తువా
> దేయంగళ్ దురితేంధనా **నకలసద్రత్నత్రయం గళో** సుఖో ।
> పాయంగళ్ గడిమెందు భవ్యజనమం కణ్మూటి కల్పిప్పువా
> ధ్యాయర్జ్యోతి సుగెమ్మ జిత్తగృహదోళ్**రత్నత్రయ జ్యోతియం॥**

ఆదిపురాణం (1-4)

## పంపకవి చరమదశలో బోధన్‌లో నివసించాడా ?

పంపకవి రచనల్ని మనం జాగ్రత్తగా పరిశీలిస్తే ఆయనకు 'బోధన్' తోను, దాని పరిసర ప్రాంతాలతోను సన్నిహిత పరిచయమున్నట్లు తెలుస్తుంది. ఆదిపురాణంలో మూడు చోట్ల విక్రమార్జున విజయంలో రెండు చోట్ల 'బోధన్' ప్రస్తావింపబడింది. దీన్ని బట్టి పంపకవి జీవిత చరమదశలో బోధన్ లో సమాధిగతుడైనాడని చెప్పవచ్చు. బోధన్, వే (లే) ములవాడ చాళుక్యుల పరిపాలనా పరిధిలోనిది కావడం చారిత్రకంగా ప్రోద్బలకమైన అంశం. జైనుల దిగంబర శాఖకు చెందినవారికి బోధన్ ఒక పవిత్ర స్థలం. ఈ పేరు వారి గ్రంథాలలో బోదన్, పోదన్, పౌదనపుర మని వ్రాయబడి ఉన్నది. ఆదినాథుని కుమారుడైన బాహుబలి యొక్క ముఖ్యపట్టణమే బోధన్. బాహుబలి ఆదినాథుని రెండవ భార్యయైన సునందా దేవి కుమారుడు. ఈ బోధన్ లోనే బాహుబలి యొక్క పెద్దన్న గారైన భరతునిచే, నిర్వాణ సిద్ధి పొందిన బాహుబలి యొక్క ఒక పెద్ద నిలువెత్తు విగ్రహం ప్రతిష్ఠింపబడింది. భరతుడు ఆదినాథుని మొదటి భార్య కుమారుడు. జైన పురాణాలను అనుసరించి మొట్ట మొదటి చక్రవర్తి.

కర్ణాటక రాష్ట్రంలోనే గొమ్మటేశ్వరుడని పిలువబడే బాహుబలి నిలువెత్తు విగ్రహాలు ఐదు కనబడుతున్నాయి.

1) క్రీ.శ. 981 లోనే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 57 అడుగుల ఎత్తు గల శ్రీ గొమ్మటేశ్వర విగ్రహం 'శ్రమణ బెళగొళ' లో స్థాపింపబడింది.

2) క్రీ.శ. 1431లో దక్షిణ కెనరా జిల్లాలోని కర్కాల వద్ద 41.5 అడుగుల ఎత్తు గల గొమ్మటేశ్వర విగ్రహం నెలకొల్పబడింది.

3) క్రీ.శ. 1604లో దక్షిణ కెనరా జిల్లాలోని వేనూరు వద్ద 35 అడుగుల ఎత్తు గల గొమ్మటేశ్వర విగ్రహం ఏర్పడింది.

4) మైసూరు జిల్లాలోని ఇల్వల మనే ఊరిలో 20 అడుగుల గొమ్మటేశ్వర విగ్రహం ఉంది.

5) మైసూరు జిల్లాలోనే కన్నంబాడి అనే చోట 18 అడుగుల గొమ్మటేశ్వరుని మూర్తి చూడవచ్చు.

బొప్పన అనే నామాంతరం గల సుజనోత్తంసుడు క్రీ.శ. 1180లో శ్రమణబెళగొళలో వ్రాసిన శాసనంలో భరతుడు 525 ధను : ప్రమాణం కల్గిన బాహుబలి విగ్రహాన్ని పౌదనపురంలో స్థాపించాడని చెప్పబడింది. తపస్సుచే కేవలజ్ఞానాన్ని సంపాదించాలనే దీక్షతో ఆయన ఎండనూ, వాననూ లెక్కచేయక తదేక ధ్యానంలో నిమగ్నుడైవుండగా ఆయన చుట్టూ లతలు అల్లుకొన్నాయి. కుక్కుటసర్పాలనే విషసర్పాలు చుట్టుకోవడం చేత ఆయనకు కుక్కుటేశ్వరుడనే పేరు వచ్చింది.

శ్రమణబెళగొళ లోని బాహుబలి యొక్క గొమ్మటేశ్వర విగ్రహాన్ని చాముండరాయలు ప్రతిష్ఠాపించినప్పటి నుండి అది 'దక్షిణ దేశ బాహుబలి' గా పేరెన్నికగన్నది. చాముండరాయల గురువైన నేమి చంద్రసిద్ధాంత చక్రవర్తి వ్రాసిన 'గొమ్మటసార' మనే గ్రంథంలో, శ్రమణబెళగొళ లోని. గొమ్మటేశ్వరుడు "**దక్కిణ కుక్కుడ జిన**" దక్షిణదేశపు కుక్కుట జినుడుగా అభివర్ణింపబడ్డాడు.

శ్రమణ బెళగొళలోని మరియొక శాసనంలో 'శ్రమణబెళగొళ' 'అభినవ పౌదన పురంగా'' పిలువబడింది. జినసేనుని పూర్వపురాణంలో కూడ పౌదనపురం బాహుబలి ముఖ్యపట్టణంగా పేర్కొనబడింది. శ్రమణబెళగొళలో గొమ్మటేశ్వరుని విగ్రహం ప్రతిష్ఠించి న ప్పుడు పౌదనపురంలోని విగ్రహం చుట్టూ దట్టమైన అడవి విస్తరించి ఉండేదని ప్రజలు దాన్ని సమీపించ లేక పోయే వారని, అలా కాలక్రమంలో ఆ విగ్రహం శిథిలమై పోయిందని కేవలజ్ఞానులైన వారికే ఆ విగ్రహం అక్కడ కనబడుతుందని బొప్పన శ్రమణ బెళగొళ శాసనంలో లిఖించిఉన్నాడు. కాని, బోధన్‌లో బాహుబలి విగ్రహం ఒకప్పుడున్నమాట వాస్తవం. దీనిచేతనే ఆ పవిత్ర స్థలంలో పంపకవి, 'శుభనంది'గా సమాధి అయ్యాడు.సామాన్యంగా జైనసన్యాసులు బాహుబలి విగ్రహం దగ్గరే సమాధికావడం ఆచారం. దీనికి ఆధారాలు ఎన్నో లభిస్తున్నాయి. పూర్వాశ్రమంలో పంపకవియే సన్యాసాశ్రమంలో శుభనందిగా గుర్తించవలసివుంది. ఆయనకు జైనంలో ప్రథమ గురువు జయనందియైనప్పటికీ సన్యాసదీక్ష చెప్పించిన గురువు దేవేంద్ర సిద్ధాంత మునీశ్వరులు బోధన్ వాస్తవ్యుడు. ప్రథమ గురువు 'నంది' అనే సన్యాసాశ్రమసంప్రదాయానికి చెందిన వాడు కాబట్టే 'శుభనంది' అనే దీక్షనామం స్వీకరించాడు. కాబట్టి పంపకవి 'శుభనంది' ఒక్కరే ! భిన్న వ్యక్తులు కారు.

**క్రీ.శ. 13వ శతాబ్దంలో జైనుడైన రట్టకవి కన్నడ భాషలో రచించిన రట్టమతాన్ని, క్రీ.శ. 18వ శతాబ్దిలో అయ్యలు, భాస్కరుడు తెలుగులో అనువదించారు.**

కన్నడ సాహిత్యంలో జైనుడైన రట్టకవి ప్రసిద్ధుడు. ఇతడు కాడమరస వంశీకుడు. కాడమరసు క్రీ.శ. 13వ శతాబ్దంలో కర్ణాటకాన్ని పాలించిన నరసింహుని మహాసైన్యాధిపతి. ఇతడీ గ్రంథాన్ని నిర్మించడంలో వివిధ మతాలను పరిశీలించినట్లు చెప్పుకొన్నాడు. ఆ మతములేవంటే గార్గ్య, **ధనకీర్తి**, హరిభట్టు, శ్రీపతి, వరాహమిహిరుడు, **నారాయణభట్టు** మొదలైన వారి అభిప్రాయాలే గాక 'మేఘమాలిక' అనే గ్రంథాన్ని చదివినట్లు చెప్పాడు.

ఈ గ్రంథంలోని ప్రధాన విషయమేమంటే వ్యవసాయం చేసే రైతులకు ఉపయోగకరంగా ముందుగానే వాతావరణంలోని మార్పులను బట్టి వర్షాసూచనలు తెలియజేసే పద్ధతులు కొన్ని ప్రకృతి పరిశీలన చేత ఎలా కనుగొనవచ్చునో తెలుపడం. పైన పేర్కొనబడిన వారిలో ధనకీర్తి జైన రచయిత. నారాయణభట్టు నన్నయ సహాధ్యాయి, సమకాలీనుడగునా? పరిశీలనార్హము.

**కృతికర్తలు** :- రట్టమతమనే కన్నడ గ్రంథాన్ని తెలుగులో ఐదు ఆశ్వాసాల పద్యకావ్యంగా అయ్యలు, భాస్కరుడు అనే కవులిద్దరు కలిసి అనువదించారు. వీరు ఒంటిమిట్ట రఘువీర శతకాన్ని రచించిన అయ్యల రాజు త్రిపురాంతకుని (తిప్పన) వంశము లోని వారు. దీనిలోని గద్యభాగమిట్లున్నది.

**గద్య** (colophon) :- ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీర కృపాలబ్ధ సారసారస్వతధుర్యాయ్యల రాజువంశ సంభవాయ్యలాఖ్య భాస్కరాఖ్య కవిద్వయ ప్రణీతంబైన రట్టమత మహాకావ్యంబు నందు పంచమాశ్వాసము.

**కాలనిర్ణయం** :- దీని తాళపత్రప్రతులు మూడు, కాగితపు ప్రతులు మూడు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ఉన్నాయి[69] కాని, వీటిలో అవతారికా భాగంతో సమగ్రంగా ఉండేది D 2364 సంఖ్యగల తాళపత్ర ప్రతి ఒక్కటే! ''ఈ ప్రతి గ్రంథాంతంలో తామొక పద్యం చూచినట్లు, అందులో '' శాలివాహన శక సమలిల వేయు నార్నూట తొంబది రెండురూఢిగాగ'' అనే సీస పద్యం ఆధారంతో ఈ గ్రంథం క్రీ.శ. 1769 లో వ్రాయబడిందని ఆంధ్రకవుల చరిత్ర (Vol. III P-93) లో శ్రీ కందుకూరి వీరేశలింగం వ్రాశారు. కాని, ఈ పద్యం తాళపత్ర ప్రతుల్లో కనబడడం లేదు.'' అని The Descriptive Catalogue of

Telugu Manuscripts G.O. M.L. Madras, Vol X, 1949, పుట – ii లో తత్సూచికా వివరణ సంపాదకులు వ్రాశారు. రావుబహదూర్ ఆర్. నరసింహాచార్ గారు Lives of Kannada Poets (Vol. I, P - 324) అనే గ్రంథంలో The Biographical Sketches of Deccan Poets అనే గ్రంథం ఆధారంగా అయ్యలు భాస్కరుల కాలాన్ని క్రీ.శ. 15 శతాబ్దిగా ఎటువంటి చారిత్రకాధారమూ చూపకనే నిర్ణయించారు.

కాని, మద్రాసులోని వావిళ్ల ప్రెస్సువారు 1951 లో ప్రథమంగా, 1964లో ద్వితీయంగా, ఆంధ్రతాత్పర్యసహితంగా రెట్టమతశాస్త్రమనే పేరుతో తాళపత్రగ్రంథాన్ని పండితులచే పరిష్కరింపజేసి, నిడుదవోలు వేంకటరావుగారిచే పీఠికను వ్రాయించారు. 'పీఠిక'లో నిడుదవోలు వారి అభిప్రాయమిలావుంది.

''క్రీ.శ. 9వ శతాబ్దిని కన్నడ భాషలో రట్టికవియను జైనకవి ఈ గ్రంథమును చంపూ కావ్య పద్ధతిలో రచించెను. దానినే తెనుగున య్యైదాశ్వాసముల పద్యకావ్యముగా అయ్యలరాజు అయ్యలు, భాస్కరుడనే నిరువురు జంట కవులు రచియించిరి, దీని గ్రంథాంతమున నున్న సీస పద్యమును బట్టి శాలివాహన శకవత్సరములు 1692 అనగా క్రీ.శ. 1770 వికృతి సంవత్సరమున ఈ గ్రంథము తెనిగింపబడినది.'' (రెట్టమత శాస్త్రము, 5-73)

''కవి ఇంటి పేరు అయ్యలరాజువారు. ఆర్వేల నియోగి బ్రహ్మణులు. కౌండిన్య గోత్రులు. కర్ణాట సామ్రాజ్యాధీశ్వరుడగు విజయనగర ప్రౌఢదేవరాయలచే ''రాయకవి'' బిరుదము గాంచిన అయ్యల రాజు ఈ వంశమునకు మూలపురుషుడు. ఆయన వంశవృక్షమిది.

రాయకవి అయ్యల రాజు క్రీ.శ. 1470

**త్రిపురాంతకుడు (తిప్పయ) క్రీ.శ. 1500**
ఒంటిమిట్ట రఘువీర శతక రచయిత
↓
**అక్కయ**
↓
**రామభద్రకవి క్రీ.శ. 1550**
రామాభ్యుదయ ప్రబంధకర్త
↓
**కొండయ్య**
↓
**పిన్నక్కయ్య లేక తిమ్మయ**
**అయ్యలయ్య, క్రీ.శ. 1770**

**పర్వతన్న**
↓
**అయ్యలయ్య**
↓
**నాగన్న**
↓
**భాస్కర కవి**

ఈ కడపటి యిరువురును రెట్టమత శాస్త్ర గ్రంథకర్తలు'' అని చారిత్రకాధారాలతో న్నిర్ణయించారు. గ్రంథరచనా కాలాన్ని సూచించే సీసపద్యం వావిళ్ల వారి ముద్రిత ప్రతి **(1964)** లో ఉంది. దీనిచే కందుకూరి వీరేశలింగం గారి కాలన్నిర్ణయమే సరియైనదని చెప్పవలసివుంది.

**కృతి భర్త** : '' వేంకట రామకృష్ణ కవులచే అభినవకామందకమనే నీతి శాస్త్రాన్ని కృతిగొన్నవాడు, అహోబలక్షేత్ర ధర్మ నిర్వాహకుడు, ఆరవీటి వంశీకుడు, కొండ్రాజు తిమ్మరాజు పౌత్రుడు, పెద్దతిమ్మరాజు అయిన వెంకట రాజు దీని కృతిభర్త.'' అని G.O.M.L., Madras వారి వివరణ సూచికలో చెప్పబడింది. కృతిపతి ఆరవీటి వంశీకుడనటం మాత్రం యథార్థం. దీనిని ప్రస్తావంచకుండా నిడుదవోలు వారు పీఠికలో కృతిపతి వంశాన్ని గూర్చి యిలా వ్రాశారు. ''కృతిపతియగు వేంకటరాజు సూర్య వంశీయుడగుటచే కాశ్యపగోత్రుండగు తెలుగు చోళరాజు.



''పెద్ద తిమ్మ రాజు కొడుకులలో మూడవ వాడును, చినతిమ్మరాజునకగ్రజుడునగు వేంకటరాజు 'జగతాపి' బిరుదాంకుడు. ఈతడే జక్కరాజు వేంకటరాజ విరచితమగు ఆంధ్ర కామందకము నకు కృతిభర్త. అతనికి వరుసకు మనమడగు వేంకటరాజు రెట్ట మతమునకు కృతిపతి. ఈ వంశము తామరతంపరగా వర్ధిల్లినట్లు కన్పట్టుచున్నది.'' అని వ్రాశారు నిడుదవోలు వారు రెట్ట మత శాస్త్ర కృతిపతి ఆరవీటి వంశము వారే ! చారిత్రకంగా ఆరవీటి వంశం మూడవ శ్రీరంగ రాయల (క్రీ.శ. 1676)తో అంతమైపోయినప్పటికీ, నేటికీ ఆరవీటి వంశం వారు అనె గొందెలో ఉన్నారు. పండితులు, కవులు వ్రాసిన గ్రంథాలకు ఆర్థిక సహాయం అందిస్తూనే ఉన్నారు.

## జైనుల మతభాష - జైనమాగధి లేక ఆర్ష భాష లేక అర్ధమాగధీ ప్రాకృతం

**ప్రాకృత భాషా ప్రాచీనత :** - ప్రాకృతం ఒకప్పుడు భారతదేశంలో ప్రజలు మాట్లాడుకొనే భాష! ప్రాకృతభేదమైన అర్ధమాగధిలో భగవాన్ మహావీరుడు, ప్రాకృతానికి మరోరూపమైన 'పాలీ' లో బుద్ధ భగవానుడు తమ తమ మత సిద్ధాంతాలను, ఉపదేశాలను ప్రవచించారు. సంస్కృత సాహిత్యంపై ప్రవరసేన, హాల మహాకవులు సృష్టించిన ప్రాకృత భాషా ప్రభావం అమితంగా వుంది. ఇది ఒకప్పటి వ్యవహారభాష అనడానికి వివిధ ప్రాంతీయభేదాలతో కూడుకొన్న ప్రాకృత భేదాలే స్పష్టంచేస్తున్నాయి. ఉదాహరణానికి, ప్రాథమిక ప్రాకృతం, ఆర్ష లేక అర్ధమాగధీ ప్రాకృతం, పాలీ ప్రాకృతం, పైశాచీ ప్రాకృతం, శౌరసేన ప్రాకృతం, మహారాష్ట్రీ ప్రాకృతం, అపభ్రంశ ప్రాకృతం, హిందీ ప్రాకృతం, బంగలా ప్రాకృతం మొదలైనవి.

పై వాదాన్ని 'పాయియ సద్దమహణ్ణవో' (ప్రాకృత శబ్ద మహార్ణవః) పీఠికలో[70] (1963) ఆచార్య వాసుదేవ శరణ్ అగ్రవాలా, డా॥ హెచ్.డి.టి. సేఠ్, మరియు An Illustrated Ardha - Magadhi Dictionary[71] 'పీఠిక' లో Dr. A.C. Woolner (1988) మహాశయులు అభిప్రాయపడగా, 'ప్రాకృత భాషోత్పత్తి' అనే గ్రంథంలో (1921) శ్రీ వేదేపల్లి వేంకటరమణాచార్యులు ఇలా అభిప్రాయపడుతున్నారు.[72]

''పాలీ, గాథా భాషలఁబరీక్షింపగా వానిలో పదము లధికముగా శుద్ధ సంస్కృత పదములుగా నున్నట్లు, శేషించిన పదజాలము స్వరనాశనియమముల (laws of phonetic decay) ననుసరించి మార్పునొందినవి. అశోకుని శాసనములలో కొన్నిటి యందు శుద్ధపాలీ భాషయు, మఱి కొన్నిటియందు, కొంచెము మార్పుచెందిన భాషయు గానవచ్చుచున్నది. **మాతృభాషయగు సంస్కృతము నుండి పుట్టినను పాలీ గాథా భాషలకంటె, అధికతర విపర్యయము నొందిన మఱి కొన్ని భాషలు కలవు. వీనికే ప్రాకృతము లని పేరు.''**

''జైన పండితుడగు ఆచార్య హేమచంద్రుడు 'ప్రకృతే రాగతం ప్రాకృతమ్' - ప్రకృతి యగు సంస్కృతము నుండి యీ భాష పుట్టినది కావున 'బ్రాకృత మనబడునని 'ప్రాకృత శబ్దము' నకు వ్యుత్పత్తిని జెప్పియున్నాడు. మొట్టమొదట సంస్కృతము నుండి యుత్పన్నము లయిన మహారాష్ట్రీ, శౌరసేనీ, మాగధీ మొదలగు నానావిధ భాషలకు బ్రాకృత మనునది సాధారణనామము''

''ఆధునిక శబ్ద శాస్త్రవేత్తలు(Philologists) ఈ భాషలన్నియు ంరిన్నగా సంస్కృతము నుండి సంజాతము లైనవోలేక తద్వికృతులైన మఱికొన్ని భాషల నుండి పుట్టినవోయనునీ విషయమును తృప్తికరముగా నిర్ణయింపజాలకున్నారు. **పాలీ భాషను ద్వారముగా జేసికొని యీ భాషలన్నియు బుట్టినవని కొందరు, ఇవియన్నియు సంస్కృతము నుండియే పుట్టినవని చెప్పుట న్యాయ్యమని మఱికొందరు వివదించుచున్నారు.''**

ఈ రెండు అభిప్రాయాలలో శ్రీ మేడేపల్లి వారు రెండవవాదాన్నే సమర్థిస్తూ యిలా వ్రాశారు. ''ఆర్యులందరు తమ నివాసస్థానమగు బ్రహ్మావర్తము నుండి చలింపక స్థిరముగా నచట నివసించి యున్నంత కాలము వారి భాష కెవ్విధమైన విప్లుతియు సంభవింపలేదు. వారు భరతఖండములోని యితర భాగములకు బోవుట యెపుడు ప్రారంభించిరో యప్పటి నుండి వారు వెళ్లియున్న ప్రదేశముల శీతోష్ణస్థితి, యితర హేతువులు మొదలగువానివలన వారి భాష వికటింపసాగెను. ఇట్లు పరస్పర సూక్ష్మభేదములతో గూడినవియు బ్రాకృత మని సాధారణనామము గలవియునగు నవాంతరభాషలు కొన్ని పుట్టినవి.

**సప్తవిధప్రాకృతాలలో అర్థమాగధి ఒకటి :**

''ఆర్యులు స్వస్థానమును విడచి పరదేశాటనముల హెచ్చించిన కొలది నీభాషల సంఖ్య హెచ్చుయ్యెను. ఇందుకు నిదర్శనముగా బ్రాకృత వ్యాకరణములను వ్రాసిన వారిలో బ్రాచీనతముడగు **వరరుచి** తను రచించిన '**ప్రాకృతప్రకాశిక**' లో **మహారాష్ట్రీ, పైశాచీ, శౌరసేనీ, మాగధీ** అను నీనాల్గు భాషలకే లక్షణము చెప్పియున్నాడు. అర్వాచీన గ్రంథకర్తలు **త్రివిక్రముడు మార్కండేయుడు** మొదలగు వారు. భరతుని నాట్యశాస్త్రంలో (17-48)

**మాగధ్యవంతికా ప్రాచ్యాశౌరసేన్యర్థమాగధీ ।**
**బాహ్లికా దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితా : ॥**

అర్వాచీనులు వీటిలో ఆరు భాషలకే లక్షణము వ్రాసిరి. దీనిని బట్టి చూడగాం గాల

క్రమమున నీ భాషల సంఖ్య హెచ్చినట్లు కానవచ్చు చున్నది.'' భరతుని నాట్య శాస్త్రంలో (17-48) అర్ధమాగధి సప్త ప్రాకృతాలలో ఒకటిగా చెప్పబడింది. 1) మాగధి, 2) అవంతికా, 3) ప్రాచ్యా, 4) శౌరసేనీ, 5) అర్ధమాగధీ, 6) బాహ్లికా, 7) దాక్షిణాత్యా అని ఏడు భాషలు చెప్పబడ్డాయి.

డా॥ ఎ.సి. ఊల్నర్, An Introduction to Prakrit అనే గ్రంథంలో అర్ధమాగధిని యిలా నిర్వచించాడు. " Ardha Magadhi has some of the peculiarities of Magadhi but not all. This is the explanation of the name Half-Magadhi ie, Ardha Magadhi.[73]

సంస్కృత నాటకాలలో అర్ధమాగధిని సేవకులు, పరిచారకులు, వర్తకులు, శ్రేష్ఠులు మాట్లాడుకొనే భాషగా ప్రయోగించాలని నియమమున్నప్పటికీ విశాఖదత్తుని ముద్రారాక్షస నాటకంలో 'జీవసిద్ధి' అనే భిక్షువు, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయ నాటకంలో 'క్షపణకు' డనే భిక్షువు, మాగధిలోనే మాట్లాడి ఉన్నారు.

**ఆర్షబాష**:- ప్రాచీన జైన సూత్ర గ్రంథాలలోని భాష అర్ధమాగధి. భగవాన్ మహావీరుడు తన ధర్మోపదేశాలను అర్ధమాగధీ ప్రాకృతంలో ప్రసాదించాడు. ఈ ఉపదేశానుసారమే ఆయన సమకాలీనులైన గణధరుడు, శ్రీసుధర్మస్వామి అర్ధమాగధిలోనే 'ఆచారాంగము' మొదలైన సూత్ర గ్రంథరచన చేశారు.

'అర్ధమాగధి'కే 'ఆర్షభాష' యని మరొక పేరు. ఈ పేరు ఏర్పడిన తీరులో కూడ రెండు అభిప్రాయాలున్నాయి. 1)అర్ధమాగధి, మహారాష్ట్రి కంటే వేరైనది. నాటక రచనల్లో వాడే అర్ధమాగధి, జైన సూత్రగ్రంథాలలోని అర్ధమాగధి కంటే భిన్నమైంది. అందుచేత, ఈ రెండింటి కన్న అర్ధమాగధి ప్రాకృతం ప్రాచీనం. కాబట్టి, దీనికి 'ఆర్షభాష' అనే పేరు ఏర్పడింది.

2) మహావీరుడు అర్ధమాగధిలో బోధనలు చేయడం వల్ల, ఇదే ప్రాథమిక భాష లేక మూల భాషయని దీని నుండే తక్కిన ప్రాకృతాదిభేదాలు పుట్టాయని జైనసూత్ర గ్రంథాలు చెబుతున్నాయి. ఈ భాషకు వ్యాకరణం వ్రాసిన శాస్త్రవేత్తలు ఆర్షము అంటే - 'ఋషిప్రోక్తమైన భాష' యని చెప్పారు.

''స్వమత గ్రంథ నిష్ణాతుడును, గొప్ప ప్రాకృతకవియునగు హేమచంద్రుడు ప్రాకృత భాషలలో ప్రధాన తమమగు మహారాష్ట్రీభాషను తన ప్రాకృత వ్యాకరణమందు విపులముగ బ్రతిపాదించెను. ఇది తన మత భాషగావున దీనియందు దనకున్న గౌరవమును బ్రకాశింప

జేయుటకు, బ్రాహ్మణులు సంస్కృత భాషకు బేరిడినట్లు –

''**ఆర్షం ఋషీణా మిదమార్షమ్. ఆర్షేప్రాకృతం బహులం భవతి, తదపి యథాస్థానం దర్శయిష్యామః ఆర్షేహి సర్వే విధయో వికల్ప్యంతే** ''

జైన మత గ్రంథాలు వ్రాయబడియున్న అర్ధమాగధికి, పాలీకి, మహారాష్ట్రీ భాషకు గల భేదమల్పమని హేమచంద్రుడు తన వ్యాకరణంలో నిరూపించాడు.

**జైనమాగధి :** బౌద్ధులకు 'పాలీ' మత భాషయైనట్లు, జైనులకు ప్రాకృతం మత భాష. జైన మతగ్రంథాలన్నీ ప్రాకృత భాషాభేదమైన 'అర్ధమాగధి' లో వ్రాయబడిన కారణంగా 'మాగధి కి జైనమాగధి' అనే పేరు స్థిరపడింది. ప్రాకృత భాష 'పాలీ'కి తరువాతది. శేషించిన ప్రాకృత భాషలన్నింటికి మొదటిదిగా జైనులు భావించడం చేత 'జైనమాగధి' అని పిలువబడింది.

**భాషా స్వరూపం :** '' ఆదిమ నివాసుల భాషాపదములు విదేశభాషాపదములు గాలక్రమమున నీ భాషలో ప్రవేశించినవి. ఇటీవలి కాలమందీ ప్రాకృత భాషలు ''**తద్భవస్తత్సమోదేశీత్యనేకః ప్రాకృత క్రమః**'' అని దండి, కావ్యాదర్శంలో చెప్పినట్లు తద్భవ, తత్సమ,దేశియని మూడు తరగతులయ్యెను. తద్భవమనగా సంస్కృతము నుండి యవ్యవహితముగా బుట్టిన భాష. తత్సమమనగా సాంస్కృతిక స్వరూపము సర్వము కల శబ్దములు. దేశియనగా దేశమందు వాడుక చేయబడు భాష. దీని కాదిమనివాసుల భాషయే మూలము.''

ప్రాకృత భాషలన్నింటిలో ఏది శ్రేష్ఠమనే విషయంలో కూడ రెండు అభిప్రాయాలు కనబడుతున్నాయి. దండి కావ్యాదర్శంలో –

**మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః ।**
**సాగరస్సూక్తి రత్నానాం సేతు బంధాదియన్మయమ్ ॥**

ప్రాకృత భాషలన్నిటికంటే మహారాష్ట్రీప్రాకృతం శ్రేష్ఠమైనదని, ఈ భాషలో కాశ్మీరాన్ని పాలించిన ప్రవరసేనుడనే రాజు వ్రాసిన 'సేతుబంధ' మనే ప్రాకృతకావ్యం రత్నంవంటిదని చెప్పాడు.

కాని, వ్యాకరణవేత్తలైన హేమచంద్రుడు, వరరుచి, మహారాష్ట్రిని గొప్పగా పరిగణించలేదు. వీరిద్దరు 'శౌరసేన' భాష సంస్కృతం నుండి పుట్టినదని, మాగధీ, పైశాచీ భాషలకు శౌరసేని ప్రకృతి యని చెప్పారు. శౌర సేని సంపూర్ణంగా పెరిగిన భాషయనీ, అది మిక్కిలి ప్రాచీనమైనదనీ, ఇది నాగరికుల చేత, విద్యావంతుల చేత వ్యవహరింపబడేదనీ వ్రాశారు.

ప్రాకృత వ్యాకరణ, సాహిత్య గ్రంథాలు కొన్ని :-

వరరుచి ప్రాకృత ప్రకాశిక, మార్కండేయుని ప్రాకృత సర్వస్వము, వసంతరాజకృత ప్రాకృత సంజీవని, హేమచంద్రుని ప్రాకృత వ్యాకరణం, త్రివిక్రముని ప్రాకృత సూత్రవృత్తి, చంద్రుని షడ్భాషాచంద్రిక పేర్కొనదగినవి. వీటిలో హేమచంద్రుని వ్యాకరణం మిక్కిలి విపులమైంది. ఇతడు క్రీ.శ. 13వ శతాబ్దంలో ఎంతో ప్రసిద్ధికెక్కిన **జైనపండితుడు**. ఇతడు ఏడు అధ్యాయాలలో సంస్కృత శబ్దాను శాసనాన్నీ, ఎనిమిదవ అధ్యాయంలో ప్రాకృత వ్యాకరణాన్ని వ్రాశాడు. ఇతడే **'దేశినామమాల'** అనే నిఘంటువును నిర్మించాడు. 'కావ్యానుశాసన' మనే అలంకార శాస్త్రగ్రంథాన్ని వ్రాసిన **ఆచార్య హేమచంద్రసూరి** ఇతడే ! శాకల్య, భరత, కోహళ, భామహులు కూడా ప్రాకృత వ్యాకరణాలు వ్రాశారని మార్కండేయుడు చెప్పాడు కాని అవి లభించడం లేదు.

ప్రాకృత కావ్యాలలో ప్రవరసేన మహారాజు వ్రాసిన 'రావణవహో' అనే నామాంతరం గల సేతుబంధ కావ్యం మహరాష్ట్రీ ప్రాకృతంలో వ్రాయబడింది. శాతవాహనుడనే నామాంతరం గల శాలివాహనుడు సంకలనం చేసిన (క్రీ.శ. 1వ శతాబ్ది) ప్రాకృత గాథా సప్తశతి, ఏడువందల ప్రాకృత శ్లోకాలు గలది. క్రీ.శ. 8వ శతాబ్దిలో కన్యాకుబ్జాన్ని పాలించిన యశోవర్మ ఆస్థానకవి వాక్పతిరాజు' గౌడవహో' అనే ప్రాకృత కావ్యం వ్రాశాడు. ఇది రెండు వేల ప్రాకృత శ్లోకాలు గలది.

**అష్టభాషలు :-** ''తెలుగు కవులు ప్రాకృత భాషలలో పాండిత్యం సంపాదించిన తర్వాత అష్టభాషలనేవి ప్రచారంలోకి వచ్చాయి. నన్నయ, తిక్కనల కాలంనాటికి ఉభయ భాషలనే పేరే ఉన్నది గానీ, 'అష్టభాష'లనే వ్యవహారం లేదు. క్రీ.శ. 14వ శతాబ్దం ప్రారంభం నుండి అష్ట భాషలనే పేరు ప్రసిద్ధిలోకి వచ్చిందని'' శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు వ్రాశారు[74] కాని, నన్నయభట్టు వ్రాసిన నందపూడి శాసనం (నవంబరు 28, క్రీ.శ. 1063)లో కవిరాజశేఖరుడు, కవీభవజ్రాంకుశుడు, సరస్వతీ కర్ణావతంసుడు, అష్టాదశావధారణ చక్రవర్తి అనే బిరుదులు గల నారాయణభట్టుకు 'నందమపూండి' అగ్రహారాన్ని సర్వకరపరిహారంగా సమర్పిస్తూ యిలా ప్రశంసింపబడివున్నాడు.

**''యః సంస్కృత, కర్ణాట, ప్రాకృత, పైశాచికాంధ్ర**
**భాషాసు కవిరాజశేఖర ఇతిప్రథితః సుకవిత్వ విభవేన ''**[75]

దీని చేత, నారాయణభట్టు ఐదు భాషలలో మంచి కవిత్వం చెప్పగల నేర్పుగలవాడని

కవిరాజశేఖరుడని తెలుస్తోంది. ఉభయ భాషలంటే, సంస్కృతం, తెలుగు. వీటికి ప్రాకృత భాషాభేదాలైన ఆరింటిని చేర్చడం చేత అష్టభాషలైనదని లాక్షణికుల అభిప్రాయం.

క్రీ.శ. 1663 లోని అప్పకవి చెప్పిన అష్టభాషలివి. 1) సంస్కృతం, 2) ప్రాకృతం, 3) శౌరసేని, 4) మాగధి, 5) పైశాచిక, 6) చూళిక, 7) అపభ్రంశము, 8) ఆంధ్రభాష. భాస్కర రామాయణ కర్తలలో నొకడైన మల్లికార్జున భట్టు తనను 'శ్రీమదష్టభాషాకవిమిత్ర' అని చెప్పికొన్నాడు. వెన్నెలకంటి అన్నయ, షోడశ కుమార చరిత్రములో, ''అష్టభాషల మధురాశు విస్తర చిత్రకవితలు'' (6-13) ను పేర్కొన్నాడు. క్రీ.శ. 1537 లో తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు, చినతిరుమలాచార్యుడు, 'అష్టభాషాదండకము' రచించాడు. అందులోని భాషలివి. 1) సంస్కృతం, 2) ప్రాకృతం, 3) శౌరసేనీ, 4) మాగధీ, 5) పైశాచీ, (అపభ్రంశం) 6) ప్రాచీ, 7) అవంతీ, 8) సార్వదేశీ (నాగర). అప్పకవి చెప్పిన దానికీ, దీనికీ భేదముంది. చూళిక, అపభ్రంశం, ఆంధ్రం అప్పకవిగా చెప్పగా, ప్రాచీ, అవంతీ, సార్వదేశీ (నాగర) భాషలను చినతిరుమలయ్య చెప్పాడు. చిన తిరుమలయ్య సమకాలీనుడైన పద్య, ద్విపద బాలభాగవతకర్త దోనూరి కోనేరునాథుడు అష్టభాషాకవిమిత్రుడు.

''అప్పకవి కంటే 130 యేండ్ల పూర్వుడు చినతిరుమలయ్య. తాళ్లపాకవారి కృతులతో పరిచయమున్న అప్పకవి ప్రాకృత భాషా విషయంలో యిట్టి భేదాలను వివరించడంలో గల కారణం దురూహ్యముగా నున్నది.'' అని నిడుదవోలు వారు ఆశ్చర్యం వ్యక్తం చేశారు.

ప్రాకృత భాషా తొలివ్యాకర్త వరరుచి చెప్పిన ప్రాకృత భేదాలు నాలుగే, మహారాష్ట్రీ, పైశాచీ, శౌరసేనీ, మాగధీ. దీనికి హేమచంద్రుడు క్రీ.శ. 13వ శతాబ్దంలో చూళికా పైశాచీ, అపభ్రంశ మనే మరో రెండు భాషలు చేర్చాడు. త్రివిక్రముడనే ప్రాకృత వ్యాకర్త ఈ ఆరు భాషలనే వ్యాకరించాడు. ఇక, సప్తవిధ ప్రాకృతాలను పేర్కొన్న గ్రంథం భరతుని నాట్య శాస్త్రం. సప్తవిధ ప్రాకృతాలకు సంస్కృతం చేరిస్తే అష్టభాషలు కావడాన్ని అప్పకవి అంగీకరించక, ఆంధ్రభాషాభిమానంతో ప్రాకృత వ్యాకర్తలు చెప్పిన షడ్విధ ప్రాకృతాలకు తెలుగు, సంస్కృతాలు చేర్చి అష్టభాషలను చెప్పాడని మనం సరిపెట్టుకోవాలి. చినతిరుమలయ్య చెప్పిన అష్టభాషలు ఆయనకాలం నాటికి అంగీకరింపబడిన భాషలేమో! ఇవి నాట్యశాస్త్రంలోని పట్టికతో దాదాపు సంవదిస్తూవుంది. ''తెలుగు వారికి సన్నిహితమైనదీ, వారు పరిశ్రమ చేసినదీ, మహారాష్ట్ర దేశీయ ప్రాకృతమేయని నిశ్చయముగా చెప్పవచ్చును'' అని నిడుదవోలు వారి నిష్కర్ష.

**ప్రాకృతంపై సంస్కృత భాషా ప్రభావం**:- జైన, బౌద్ధులు సంస్కృత భాషను పరిత్యజించి ఆనాటి వ్యవహారిక భాషలైన అర్ధమాగధీ, పాళీలలో తమ ధర్మోపదేశాలను లిపిబద్ధం చేశారు.

కాని, సంస్కృత భాషా ప్రభావం నుండి ఈ భాషలు తప్పించుకోలేక పోయాయి. అనేక తత్సమ శబ్దాలను స్వీకరించడమే దీనికి ఉదాహరణం.

సంస్కృత భాషా ప్రభావంతో బౌద్ధులు ఒక మిశ్ర భాషను ఉత్పత్తి చేశారు. మహాయాన బౌద్ధులు 'మహావైపుల్య' మనే సూత్రగ్రంథాలలో (దీనిలోనే లలితవిస్తరం, సద్ధర్మపుండరీకం, చంద్రప్రదీప సూత్రం ఇత్యాది గ్రంథాలున్నాయి) వాడబడిన భాషలో అధిక భాగం సంస్కృత పదాలే. పాశ్చాత్య విద్వాంసులీ భాషను 'గాథా' అని పిలిచారు. కాని, ఇదిసరైన పేరు కాదు. ఎందుకంటే, ఈ రకమైన 'మణిప్రవాళభాష' పద్యాలలోనే గాక, గద్యాలలో కూడ వాడబడింది. అందుకే, దీన్ని 'మిశ్రభాష' అనడం సముచితం.

**సంస్కృతంపై ప్రాకృత భాషా ప్రభావం** : -వైదిక కాలంలో ప్రచలితమైన ప్రాకృతం నుండే వైదిక సంస్కృతం ఉత్పన్నమైంది. అది సాహిత్య, వ్యాకరణాల ద్వారా క్రమంగా సంస్కరింపబడి, క్రమబద్ధమై లౌకిక సంస్కృతంగా పరిణతి చెందింది. అనేక ప్రాకృత శబ్దాలు, సంస్కృత భాషలో విలీనమైయ్యాయి. అవి దేశ్య శబ్దాలు. కాబట్టి, ప్రాకృతమే సంస్కృత భాషకు మూలం. సంస్కృత భాష సాహిత్యపరంగా పరిపుష్టం కావడానికి ప్రాకృత భాషా సాహిత్యాలే మూలాధారాలై ఎంతో దోహదం చేశాయి.

ప్రథమదశలో ఏ భాషయైనా అర్థప్రకాశానికి ప్రయత్నిస్తుంది. భాష సర్వదా పరివర్తన శీలమైంది. కనుక, కాలక్రమేణ భాషలో క్లిష్టత ఏర్పడుతుంది. సంస్కృత భాష, పాలీ, ప్రాకృతాల కన్నా క్లిష్టంగా, జటిలంగా కనబడడానికి కారణం ఇదే. ఉచ్చారణలోను, లిపివిధానం లోను క్లిష్టత ఏర్పడడం వల్ల సంస్కృతం కఠినమైన భాషగా తయారైంది. దీనికి తోడు వ్యాకరణ నియమాలు దాని అభివృద్ధికి దోహదం చేయలేదు.

**తెలుగుపై పాళీ, ప్రాకృతాల ప్రభావం** : - తెలుగు దేశంలో ప్రాకృత భాషలు దాదాపు 800 సంవత్సరాలు అంటే క్రీ.పూ. 4వ శతాబ్ది మొదలుకొని క్రీ.శ. 4వ శతాబ్ది వరకు వర్ధిల్లినవి. బౌద్ధుల మత భాషయైన 'పాలీ' ఒక విధమైన ప్రాకృతమే! ఇది దేశ భాషపై విస్తృత ప్రభావాన్ని చూపిందనడం తిరుగులేని చారిత్రక సత్యం!

దండి కావ్యాదర్శంలో ప్రాకృత భాషలను గురించి వ్రాస్తూ "**తద్భవస్తత్సమో దేశీత్యనేకః ప్రాకృతసమః**" అని చెప్పినట్లుగా, తెలుగు భాషలో దేశీయులచే వాడబడుచుండిన ఒక భాషయున్నదని, దీనికి ఆదిమవాసుల భాషయే మూలమని చెప్పాలి. ప్రాచీనయుగంలో తెలుగుదేశంలో మాతృభాషగ ఒక ఆర్యేతర భాష ఉండినట్లు సాతవాహన ప్రభువులలో ఒకడైన

వాసిష్ఠీపుత్ర పులుమావి యొక్క నాణెం వలన తెలుస్తోంది. దేశభాషపై అప్పటికే ప్రాకృత భాష తన పలుకుబడిని వ్యాపింపజేసినదనడానికి పైన పేర్కొనబడిన నాణెముపై నున్న 'దేశి' వ్రాతలోని 'అరహణ' ఒక నిదర్శనం.

ఈ విధంగా ప్రాకృతాల ప్రభావానికి లోనైన దేశభాషను బౌద్ధులు తమ మతప్రచారానికి వినియోగిస్తూ, దాన్ని 'అంధక' భాషయని వ్యవహరించారు. తెలుగుదేశాన్ని 'అంధక' మనే పేరుతో బౌద్ధులు పిలుస్తుండడం చేత అంధకుల భాష 'అంధకభాష' యైనది.[76] క్రీ.శ. 4వ శతాబ్దిలోని బుద్ధఘోషుడు 'పపంచసూదని' అనే వ్యాఖ్యా గ్రంథంలో ''పాలీ భాషలో ఉన్న పిటక గ్రంథాలను తనకు పూర్వులైన వారు కొందరు అంధక, తమిళ భాషలలోనికి అనువదించారని, అందులో మౌలిక గ్రంథాల లోని విషయాలు చక్కగా అనువదింపబడలేదని'' అభిప్రాయపడ్డాడు. ఈ అంధక భాషలోని సాహిత్యం మతధర్మ ప్రచారానికి మాత్రమే ఉద్దిష్టమై ఉంటుంది. అందువలననే ఆ కాలపు రాజులలో చాలమంది బహుళ ప్రచారంలోని ప్రాకృత భాషలలోనే తమ శాసనాలను వ్రాయించారు. క్రీ.శ. రెండవ శతాబ్ది తర్వాతనే చెదురుమదురుగా సంస్కృత భాషను శాసనాల్లో వాడడం ప్రారంభమైంది.

## చారిత్రక దృష్ట్యా తెలుగుభాషా పరిణామ చరిత్ర పునర్లిఖింపబడాలి - చారిత్రక మహా నిఘంటు నిర్మాణం జరగాలి.

''తన గత చరిత్రను మరచిన జాతి, స్మృతిని కోల్పోయిన మానవునివంటిదని'' ఒక పండితసూక్తి! అటువంటి జాతికి వర్తమానంలో ముందడుగు వేయడానికి స్ఫూర్తి లభింపదు. భవితవ్యానికి బాట అసలే కన్పడదు.

ఇక్కడ చరిత్ర అంటే, కాల గమనంలో ఒక జాతి నడిచేటప్పుడు ఎదుర్కొన వివిధ సంఘటనల్నీ వాటిని అది పరిష్కరించుకొని పరిణమించిన తీరుతెన్నుల్నీ వివరించే కథనం. అటువంటి కథనం ఆ జాతికి సంబంధించిన సాంఘిక, ఆర్థిక, కళా, భాషా, సాహిత్యాదులన్నిటికీ సంబంధించినది. అందువల్ల, భాషాచరిత్ర కూడ ఆ కథనంతో ముడివడి ఉంటుందే కాని వేరుగా ఉండదు. ఇది మరువరాని సత్యం !

జైనులు అర్ధమాగధిని 'ఆర్షభాష' అన్నట్లుగ, హిందువులు సంస్కృతాన్ని 'దేవభాష' అన్నారు. మధ్యయుగంలోని పండితులు 'తల్లి సమస్తభాషలకు దైవత భాషయ' అని తెలుగును సంస్కృతంలో ముడిపెట్టారు. ఈ వాదంలో శాస్త్రీయ దృష్టి కొరవడిందని భావించి కొందరు ఆధునిక యుగంలో ద్రావిడ భాషావాదాన్ని లేవదీశారు. దీని ప్రవక్త రాబర్ట్ కాల్డ్వెల్ (1814-91)

అనే క్రైస్తవ మతప్రచారకుడు. క్రీస్తు పూర్వం నాలుగువేల యేండ్ల క్రిందట మూలద్రావిడం (Proto - Dravidian) ఒకటి ఉండేదని, దాని నుండి తెలుగు మొదలైన భాషలు పరిణమించాయని వారి వాదం.[77] ఆ మూలద్రావిడం రూపొందిన తీరేది? దాని చారిత్రక ప్రతిపత్తి (historical stand point) ని ఋజువు చేసే ఆధారాలేవి? అనే ప్రశ్నలకు ఆ వాదంతో మునిగితేలే ఆచార్యులు సమాధానమివ్వడం లేదు. వారు కోరేదంతా మనమందరం ద్రావిడ భాషావాదాన్ని నమ్మి అనుసరించాలనేదే. ఇటువంటి వాదానికి శాస్త్రీయ ప్రతిపత్తి ఉండదని వేరే చెప్పవలసిన పనిలేదు.

ఇక, శాస్త్రీయదృష్టి ఎలాంటిది? అని ప్రశ్నింపవచ్చు. మనకింత వరకు లభించిన చారిత్రక సామగ్రిని ఆధారంగా గ్రహించి, మనము తెలుసుకోవలసిన విషయాలను హేతువాదమూలంగా బయటికి తీసుకురావడమే శాస్త్రీయదృష్టి. దీనికి భాషయొక్క చారిత్రక పరిణామాన్ని మొట్టమొదట అర్థం చేసుకోవాలి.

తెలుగు దేశపు చరిత్ర మనకు ప్రస్తుతం క్రీ.పూ. 6వ శతాబ్ది నుండి స్థూలరీతిలో తెలుస్తూవుంది. 'సుత్తనిపాత' మొదలైన గ్రంథాల వలన, నందుల కాలపు నాణెములు తెలుగుదేశంలో అక్కడక్కడ లభించడం వలన, ఈ దేశానికి ఔత్తరాహ సంస్కృతితో క్రీ.పూ 6వ శతాబ్దిలోనే గాఢ పరిచయమున్నట్లు జైన, బౌద్ధ మతములు దక్షిణ భారతదేశానికి వలస వచ్చిన కారణంగా, పాళీ, ప్రాకృత భాషలు మన దేశీయమైన భాషపై చూపిన ప్రభావం చేత తెలుస్తున్నది. ఆ వేయియేండ్లలో వివిధ ప్రాకృత భాషలు తెలుగునాడులో వర్ధిల్లాయి. రాజ శాసనాలు ప్రాకృతంలోనే వెలువడ్డాయి. సాహిత్యం, ధార్మిక గ్రంథాలు లిఖింపబడ్డాయి. బౌద్ధ, జైన మత ధర్మ ప్రచారాలు జరిగాయి.

ప్రాకృత భాష తెలుగుదేశంలో కాలుపెట్టేటప్పటికి ఒక 'దేశిభాష' యిక్కడ వ్యవహారంలో ఉండేదని వ్యాకర్తలు అంగీకరిస్తున్నారు. ఈ 'దేశి'పై ప్రాకృత భాషలు గాఢ ప్రభావాన్ని చూపాయి. 'అంధక' మనే ఒక సమ్మిశ్ర భాష క్రీ.శ. 1వ శతాబ్దంలో రూపుదాల్చింది. అటువంటి 'అంధక' భాషలోనే బౌద్ధ త్రిపిటకాలు అనువదింపబడినాయని క్రీ.శ. 4వ శతాబ్దంలోని బుద్ధఘోషుడు వ్రాశాడు.

ఇదిలా ఉండగా, క్రీ.శ. 6వ శతాబ్ది అంతంలోను క్రీ.శ. 7వ శతాబ్ది ప్రారంభంలోను చెలరేగిన ఒక మత విప్లవం వలన ఆంధ్రదేశంలో బౌద్ధం నామావశిష్టమైంది. శైవం చాలా వరకు బౌద్ధం యొక్క స్థానాన్ని ఆక్రమించి రాజాదరణకు నోచుకొనింది. అక్కడక్కడ జైనం పలుకుబడిని ఆర్జించింది. బౌద్ధ మతంతో పాటు ఆ మత ప్రచారానికి నిర్మింపబడిన అంధక సాహిత్యం కూడ అంతరించిపోయింది. బౌద్ధమతం ఆంధ్రదేశంలో రూపుమాయడంతో,

అంధక భాషా సారస్వతం అదృశ్యమై పోయినా, ఆనాడు దేశీయులలో వేళ్లు తన్నుకొన్న భాషా పదజాలమే తెలుగు భాషా పరిణామానికి ప్రాతిపదికయ్యింది.

ఈ విధంగా ప్రాకృత భాషల పునాదిపై తెలుగు భాషా సౌధం రూపుదాల్చినదని పూర్వపండితులు గుర్తించారు. అందువల్లనే ప్రాకృత భాషల పతనానికి మధ్య యుగంలో (Medieval Period) తెలుగు పండితులు మిక్కిలి శ్రద్ధ వహించారు. అష్ట భాషా పాండిత్యాన్ని ఒక విశిష్ట పాండితీలక్షణంగా తెలుగుకవులు గుర్తించడం ఇందువల్లనే జరిగింది. నన్నయ, తిక్కనల కాలం కంటే శ్రీనాథుని తర్వాత వచ్చిన కవిపండితులకు చారిత్రకమైన భాషా పరిణామ స్పృహ ఎక్కువగా ఉందని దీనిచే చెప్పవచ్చు. ఈ అష్ట భాషల వివరాలను అప్పకవి నమోదు చేసిన విధానాన్ని మనం పూర్వపు పుటల్లో పరిశీలించాము. అప్పకవి చెప్పిన అష్ట భాషలలో సంస్కృత, తెలుగు తీసేస్తే తక్కినవన్నీ ప్రాకృత భాషలే. చారిత్రక దృష్ట్యా చూచినప్పుడు సంస్కృతంతో ఆంధ్రదేశానికి సాన్నిహిత్యం క్రీ.శ. **3**వ శతాబ్ది మధ్యభాగం నుండి మాత్రమే కనబడుతుంది.

నన్నయ మొదలైన తెలుగు కవులకు సంస్కృతంపై ఆదరణ ప్రబలినది. తత్ఫలితంగా పూర్వ సాహిత్యంలోని కొన్ని పదాలు వారి కవిత్వాలలో ఉచితస్థానాన్ని పొందలేక పోయాయి. అయినప్పటికీ ప్రజల సామాన్య భాషలో నిలిచిపోయిన కవ్వడి, వడముడి, వంటి మాటలను నన్నయాదులు స్వీకరింపక తప్పలేదు. కొన్ని పదజాలాలు రాజుల శాసనాలలో తలదాచుకొన్నాయి. మరికొన్ని వాడుక నుండిచ్యుతమై అంతరించిపోయాయి. అలా పరివర్తన చెందడంలోనే 'అంధక భాష' 'ఆంధ్ర' భాష అయింది.

ఆంధ్రము – తెలుగు అనే పదాలు ఎప్పుడు సమానార్థకంగామారాయనేది యిక్కడి చర్చా సమస్య కాదు. క్రీ.శ. **11**వ శతాబ్ది నాటికే ఈ రెండూ సమానార్థకాలైనాయని చెప్పవచ్చు. తెలుగుపై ప్రాకృత భాషల ప్రభావం కలదని క్రీ.శ. **14**వ శతాబ్దంలో కేతన ఆంధ్రభాషా భూషణంలో చెప్పి నప్పటి నుండి ఆంధ్రకవులు ఆ విషయమై శ్రద్ధ చూపడం ప్రారంభించారు. కాని, భాషలోని పదాలను వింగడించి, వాని వ్యుత్పత్తులను నిర్ణయించడానికి సరియైన కృషి ఆ కాలంలో జరుగలేదు.

ఆధునిక యుగంలో సూర్యరాయాంధ్ర నిఘంటువు సంకలన కర్తలు ఈ కృషిని ప్రారంభించారు. కాని, అది దోషభూయిష్ఠంగా తయారైంది. వారి కాలానికే ద్రావిడ భాషావాదం (Theory of Dravidian Linguistics) పండిత లోకంలో ప్రచారంలోకి రావడం మూలాన వ్యుత్పత్తి తెలియని పదాలకంతా ద్రావిడ భాషాజన్యమని వ్రాసి వారు తృప్తిపడ్డారు. కొన్ని చోట్ల పప్పులో కాలువేశారు. మరికొన్ని చోట్ల కప్పదాటు వేసి బయటపడ్డారు.''

''అందువలన తెలుగుభాషా పరిణామ రీతిని అర్థము చేసికొనవలెన్న ప్రాకృతములు ఆ భాషకు సంప్రాపింపజేసిన పదజాలమును తొలుత గుర్తించవలెను. తెలుగులోని నామవాచకములు, సర్వనామములు, క్రియలు, సముచ్చయములు, విభక్తి ప్రత్యయములు - వీనియన్నింట ప్రాకృత భాషా సామగ్రి ఎంత కలదో ముందుగ నిగ్గుతేల్చవలెను. ఆ ప్రకియ వలన 'దేశి' యన నెట్టిదియో మనకు తేలగలదు. అపుడు ఆ 'దేశి' రూపొందుటకు కారణభూతములైన వివిధ చారిత్రక ప్రాక్తన సంస్కృతులను మనము పరిశీలించవలెను. ఇదియ తెలుగు భాషా చరిత్రను రూపొందించుటలో అవలంబింపదగు శాస్త్రీయ పద్ధతి.''

పై మూడు పుటలలో వ్రాయబడిన విషయమంతా, తెలుగుగోష్ఠి, (హైదరాబాదు) తరపున, మేడేపల్లి వేంకటరమణా చార్యుల వారి ప్రాకృతభాషోత్పత్తి (1st Ed. 1921, 2nd Ed. 1991) ని పునర్ముద్రిస్తూ ' పునర్ముద్రణ యెందులకు?' అనే పేరుతో కీ॥శే॥ చీమకుర్తి శేషగిరిరావు గారు వ్రాసిన 'పీఠిక' నుండి, అలాగే, తెలుగు గోష్ఠి చర్చాసంహిత - 2, తెలుగులో పాళీపదాలు (1990)అనే గ్రంథానికి 'వస్తుపరిచయము' అనే శీర్షికతో వారే వ్రాసిన 'పీఠిక' నుండి గ్రహింపబడినది. చీమకుర్తి వాద సారాంశం తెలియడం కోసం ఇంతగా ఉల్లేఖింపవలసివచ్చింది.

చీమకుర్తి వారి వాదంలో కొంత సామంజస్యం లేక పోలేదు. కాని, వారు తమ రచనావేగంలో దృక్పథ ప్రతిపాదనలో ఒక ప్రముఖమైన పండితుడు, మద్రాసు విశ్వవిద్యాలయం వారిచే 1929 లోనే 'డాక్టరు' డిగ్రీ స్వీకరించిన డా॥ చిలుకూరి నారాయణరావు గారిని పూర్తిగా విస్మరించారు. వారి గ్రంథం 1937 - 38 లో రెండు సంపుటాలుగా దాదాపు 3000 పై చిలుకు పుటలలో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి చేత ఆంధ్రభాషా చరిత్రము ( A History of Telugu Language) అనే పేరుతో ప్రచురింపబడింది. ఆ గ్రంథాలు రెండూ ఇంత వరకు పునర్ముద్రణకు నోచుకోలేదు. ఎందుకు నోచుకోలేదో కారణాలు చెప్పవలసిన అవసరం లేదు గానీ, భాషా చరిత్రలో ఒక వాదాన్ని ప్రతిపాదించే 'అత్యుత్తమ ఆకరగ్రంథం'గా భాషా శాస్త్రజ్ఞులచే గుర్తింపు పొందింది కాబట్టి భాషా పరిశోధకులకు అందుబాటులో ఉండేలా చిలుకూరి వారి గ్రంథాలు రెండు ఆంధ్ర విశ్వవిద్యాలయం వారే పునర్ముద్రించాలని మనవి చేస్తున్నాను.

సందర్భం వచ్చింది కాబట్టి, డా॥ చిలుకూరి వారి వాదసారాంశాన్ని, ఆయన వాదాన్ని సమకాలీన పండితులైన శ్రీ కోరాడరామకృష్ణయ్య గారు ఎలా సశాస్త్రీయంగా ఖండించారో కూడా తెలుపడం నా బాధ్యత. వీరి రెండు వాదాలను సమగ్రంగా పరిశీలించి 'తెలుగు భాషా సాహిత్య పరిశోధనలు - పుట్టుపూర్వోత్తరాలు' అనే చక్కని వ్యాసం వ్రాసిన డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద గారి వాక్యాలనే యిక్కడ పొందు పరుస్తాను. [78]

''డా॥ చిలుకూరి నారాయణ రావు గారి ఆంధ్రభాషా చరిత్రము ఒక అత్యుత్తమ ఆకర గ్రంథం. తర్వాత వచ్చిన ఆంధ్రభాషా వికాసం (1945) తెలుగు భాషా చరిత్ర (1975) లకు ఈ గ్రంథం మూలరూపం. ఆనాటికీ, ఈ నాటికీ పరమప్రామాణిక పాఠ్య గ్రంథంగా ఉన్న 'ఆంధ్రభాషా వికాసం' లో కొన్ని వందల సందర్భాల్లో చిలుకూరి వారి గ్రంథం ప్రామాణికంగా ఉదాహృతమైంది. ఉద్ధృతమూ అయింది. ఆంధ్రుల చరిత్ర మీద ఎంతో విస్తారవాఙ్మయం ఉద్ధరింపబడిన మొదటి గ్రంథం ఇదే.''

ఈ గ్రంథంలోని ఆయన ప్రతిపాదనల్లో ముఖ్యమైనది ఇది '' క్రీ.పూ. 3వ శతాబ్ది నుండి క్రీ.శ. 5వ శతాబ్ది వరకును భారతదేశమందంతటను, బ్రాకృత భాషలు ప్రచారమందుండినట్లు మనకు తెలియును. నాట నుండి 6,7వ శాతాబ్దముల వఱకు దక్షిణ హిందూదేశమందును, 12వ శతాబ్దము వఱకు తక్కిన భారత వర్షము నందును, ప్రచారమునందుండిన భాషల స్వరూప మెట్లుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. అట్టి సందర్భమున ద్రావిడ భాషల మూలమున బ్రాకృత భాషలును నేటి యార్యభాషలును గలిగినవని యూహించుట సమంజసముగాదని తోచుచున్నది. కావున, ఆ అభిప్రాయమునకు దగిన యాధారములు నిరూపింపబడునంతవరకును బూర్వలాక్షణికులతో నేకీభవించి ద్రావిడ భాషలు కూడ బ్రాకృత భాషలే యనియు, దక్కిన ప్రాకృత భాషలెట్లు గలిగినవో ద్రావిడ భాషలు నట్లే గలిగినవనియుఁ, బ్రాకృత భాషలపై ద్రావిడీ ప్రాకృతమునకెంతటి ప్రోద్బలము కల్గెనో, ద్రావిడ భాషలపైఁగూడఁ దక్కిన ప్రాకృత భాషల వలన అంతటి ప్రోద్బలము కలిగెననియు బ్రాచీనార్య భాషల నుండి తక్కిన ప్రాకృతముల వలె ద్రావిడ భాషలును వికాసము నొందినవనియు దలంచుచు నా దృష్టితో బరిశోధనముల సాగించిన ద్రావిడ భాషాతత్త్వము తేలగలదని చెప్పుట సాహసము కానేరదు.''

కాల్డ్వెల్ ద్రావిడ భాషల్ని ప్రత్యేక కుటుంబంగా స్థాపించడానికి తీసుకున్న ప్రమాణాల్ని తప్పని నిరూపించే ప్రయత్నం కూడా ఆయన చేశారు. (చూ. 66-75) ఈ అంశాలు అంత సమంజసంగా లేవని చాల మంది తర్వాత గుర్తించారు. ఈ ప్రయత్నంపైని విమర్శకు కోట సుందర రామశర్మ వ్రాసిన ఆంధ్రప్రాకృతముల జన్య జనక సంబంధ మీమాంస'' (ఆంధ్రవిజ్ఞానసర్వస్వం, 1959, సం. 3 పు. 36-42) అనే వ్యాసం చూడవచ్చు.''

''కాని, గుర్తింపుకి రాకుండా మరుగున పడిపోయిన కొన్ని ఆసక్తికరమైన అంశాలున్నాయి.'' అంటూ ఆరేడు అంశాలు వ్రాశారు, డా॥ బ్రహ్మానంద. ఇక్కడ ప్రాకృత వాదానికి చెందిన ఒక్క అంశాన్నే నేను గ్రహిస్తున్నాను.

''తెలుగు భాష తక్కిన ద్రావిడ భాషలకంటే స్వతంత్రమగు స్థానము నాక్రమించుచున్నదని గ్రియర్సన్ పండితుని యభిప్రాయము. తెలుగునకు గల ఈ ప్రత్యేకతకు కారణమేమి? ప్రాచీన ప్రాకృత భాషలకిది తక్కిన ద్రావిడ భాషలకంటె నెక్కువ దగ్గఱగా నుండుటయే అని ఈ గ్రంథమును (చిలుకూరి వారి గ్రంథం) చదువుచున్నపుడు గోచరింపగలదు.'' (పుట -75)

'తెలుగు ప్రాకృతాల దగ్గఱితనం' అనే ఈ అంశం మీద తరువాతి సంవత్సరాల్లో పెద్దగా పరిశోధన సాగినట్టు కనిపించడం లేదు గాని, తెలుగు అటు మధ్యద్రావిడమూ, ఇటు దక్షిణ ద్రావిడమూ రెంటికీ నడుమ ఉందని గుర్తిస్తున్న ఈ రోజుల్లో (భద్రిరాజు కృష్ణమూర్తి, తెలుగు భాషా చరిత్ర, **1975**, పుట - **16**) గ్రియర్సన్ ప్రతిపాదించిన 'తెలుగుసముదాయం' అనే అంశాన్ని ప్రాకృతప్రభావ దృష్ట్యా సమీక్షించడం యుక్తంగానూ, అవశ్యంగా కూడా కనిపిస్తోంది, అంటున్నారు డా॥ బ్రహ్మానంద.

చిలుకూరి వారి పై వాదానికి ప్రోద్బలకంగా **1928** నుండి **1940** ప్రాంతాల దాకా తెనుగు - ప్రాకృతాల సంబంధం పై ఎన్నో వ్యాసాలు, తెలుగులోను, ఆంగ్లంలోను వ్రాసిన విజయనగరం పండితుడు శ్రీపరవస్తు వేంకటరామానుజ స్వామి గారు. ఈయన తర్వాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థకు డైరెక్టర్‌గా కూడ పనిచేశారు. (ప్రాకృత భాషోత్పత్తి అనే (**1921**) గ్రంథం వ్రాసిన మేడేపల్లి వారు కూడ విజయనగరం పండితుడే.) డా॥ బ్రహ్మానంద వీరిద్దరిని గుర్తించే ఉన్నాడు (పుట -**44**) పరవస్తు వారు, విశాఖపట్టణం నుండి **1928** ఆగస్టులో వెలువడిన కవితాసమితి వార్షిక సంచికలో 'తెనుగు - ప్రాకృతము' అనే వ్యాసం (పుటలు **74-81**) వ్రాశారు. అందులో వారు వెలిబుచ్చిన అభిప్రాయం యిలా వుంది. ''సంస్కృత ప్రాకృత భాషలు ఇండో - యూరపియను భాషా కుటుంబములో చేరినవనియు తెలుగు - కన్నడ - అరవము ద్రావిడ భాషా కుటుంబములో చేరినవనియు, ఈ రెండు కుటుంబములకును ఏ విధమైన సంబంధమును లేదనియు, భాషా శాస్త్రజ్ఞులు తగు నిదర్శనములతో స్థిరపరచియున్నారు. ద్రావిడ భాషలలో సంస్కృత, ప్రాకృత పదములు విశేషముగానున్నను అవి కృత్రిమ పదములుగాని, ద్రావిడ భాషలకు స్వాభావిక పదములు కావనియు, తత్సమ, తద్భవ, దేశ్యములలో మూడవ జాతి పదములే ద్రావిడ భాషలకు స్వతః సిద్ధములగు పదములనియు వారి యభిప్రాయము. వీనిలో కొన్ని పదములు ప్రాకృత భాషలలో కనబడుచున్నది. అట్టి పదములకు ద్రావిడ భాషల నుండి ప్రాకృత భాషలు గ్రహించినవని చెప్పవలసి యున్నది. సామాన్యముగా సంబంధ వాచకములు, అవయవవాచకములు, జీవనయాత్రయందు తఱచుగా నుపయోగించు పదార్థ నామములు, గ్రామ్య, పక్షి, మృగ వాచకములు మొదలగు పదములొక భాష నుండి మఱియొక భాషలోనికి ప్రవేశింపదని భాషా

శాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాని, పరిశీలింపగా కొన్ని పదములు తెలుగు మొదలగు ద్రావిడ భాషల నుండి ప్రాకృతములో ప్రవేశించిన పదములు చాలా వరకు నిట్టివిగనే యున్నవి. దీనికి కారణమును పండితులు విచారింతురు గాక!'' అని వ్రాస్తూ, తెలుగు ప్రాకృతల పదపట్టిక యిచ్చారు.

శ్రీ చీమకుర్తి శేషగిరి రావు గారు 'తెలుగుగోష్ఠి' తరపున ప్రకటించిన, శాసనాలలోని పదాల అర్థనిర్ణయం గల 'తెలుగు మఱుగులు' (1986/1992) అనే గ్రంథమూ, 'తెలుగులో పాళీ పదాలు' (1990) అనే గ్రంథం కూడ పరవస్తు వారు చేసిన కృషికి, దోహదం చేస్తూ మరో రెండు పదపట్టికలు సమకూర్చి పెట్టినారని చెప్పవచ్చు.

డా॥ చిలుకూరి వారి గ్రంథంలో డా॥ బ్రహ్మానంద గుర్తించిన కీలకమైన అంశాలు నేనిక్కడ క్రోడీకరిస్తున్నాను. 1) తెలుగు ప్రాకృతాల దగ్గరితనం లో – గ్రియర్‌సన్ ప్రతిపాదించిన 'తెలుగు సముదాయం' అనే అంశాన్ని ప్రాకృత ప్రభావ దృష్ట్యా సమీక్షించడం యుక్తంగాను, అవశ్యంగా కూడ కనిపిస్తోంది.

2) ఏమైనా, ద్రావిడ – సంస్కృత భాషల నడుమ కనిపించే ప్రాథమిక పదజాల సమానత మాత్రం ఇంకా పరిశీలనీయాంశమే.

3) తెలుగులోని పైశాచీ ప్రాకృత లక్షణాల్ని గురించి చర్చిస్తూ (చిలుకూరి వారి గ్రంథం, పుటలు 547-574) చిలుకూరి చూపిన ఉపపత్తులు పునః పరిశీలనయోగ్యాలు.

4) తెలుగులో చేరిన ప్రాకృత పదజాలాన్ని గురించి ఆయన (చిలుకూరి) ఇచ్చిన ఉదాహరణలూ ఆలోచించదగ్గవిగానే ఉన్నాయి.

5) తెలుగులోకి వచ్చిన హిందూస్తానీ పదాల అర్థవిపరిణామాల్ని కూడ ఆయన చర్చించాడు.

6) కొన్ని తెలుగు రూపాలకు ఆయన ఇచ్చిన వివరణ మాత్రమే సాంస్కృతిక నేపథ్య దృష్ట్యా సమంజసంగా ఉంది.

7) జంట పదాల్ని గురించి రాసిన వాళ్లలో మొదటి వాడూ ఈయనే.

''చిలుకూరి వారి వాదాన్ని సమకాలికంగా శాస్త్రీయంగా ఖండించిన ప్రయత్నం కోరాడ రామకృష్ణయ్య (1891-1961) గారిది. వీరు ఆంగ్లములో వ్రాసిన ద్రావిడాలూ - ప్రాకృతాలూ, తెలుగు భాషా వికాసం, తెలుగు పైశాచీ భాషల సంబంధం, పేర్కొనదగినవి. తెలుగులో వ్రాసిన ఆంధ్ర భాషా వాఙ్మయం - ప్రాకృత సంపర్కం (1941) వంటివి పరిశీలింపదగ్గవి.

వీరి వాద సారాంశాన్ని డా॥ బ్రహ్మానంద గారి మాటల్లోనే విందాం.

**1) పైశాచీ ప్రాకృత వాద నిరాసం :**

''చిలుకూరి నారాయణరావు గారు ప్రతిపాదిస్తున్న పైశాచీ ప్రాకృత వాదం అశాస్త్రీయం. ఎందుకంటే, పైశాచిలో ప్రత్యేకంగా, రావు గారు గుర్తించిన లక్షణాలన్నిటినీ ద్రావిడ భాషా సహజ ధర్మాలుగా, ద్రావిడ భాషా ప్రభావంతో ప్రాకృతంలో ఏర్పడ్డవిగా నిరూపించవచ్చు కాబట్టి, క్రీ.శ. 7వ శతాబ్దికి ముందు తెలుగు మొదలైన భాషల్లో శాసనాలు లేక పోవచ్చు కాని, అంత వరకు ఉన్న సంస్కృత, ప్రాకృత శాసనాలోనే ఈ భాషల ఉనికి ప్రతిపాదింపబడుతోంది. తొల్కాప్పియంలో చెప్పబడ్డ తమిళ లక్షణాలతో పోల్చి చూస్తే, తెలుగుకి సంస్కృతంతో కన్నా తమిళంతోనే సంబంధం అధికమని నిరూపించవచ్చు. అంతే కాకుండా, ఆర్యులపై ద్రావిడుల ప్రభావమే అధికమనీ తేలుతుంది. అలా చూసినపుడు, పైశాచీ వాదం, ద్రావిడ భాషల ఆర్య భాషాజన్యత్వ సిద్ధాంతం సహజంగా నేల కొరుగుతోంది.''(Is Telugu Language a form of Paisachi ? - Synopsis, pp. 647-648)

**ద్రావిడ భాషలు - ప్రాకృతాలు :**

''ప్రాకృత వ్యాకర్తలకే పైశాచీ ప్రాకృతావిర్భావం మీద సరైన అవగాహన ఉన్నట్టు కనిపించదు. వాల్మీకి ఆ భాషను గురించి చాలా స్వల్పంగా చెప్పాడు. వరరుచి, శౌరసేన కన్నా అది ఎలా భిన్నమో చాలా కొద్దిగా వివరించాడు - స్టైన్‌కొనో, గ్రియర్ సన్ మొదలైన వాళ్లు పైశాచి 'పాళీ' ప్రభేదమంటున్నారు. హేమచంద్రుడు మూడు రకాల పైశాచీ ప్రభేదాలున్నాయన్నాడు కాని, అవి ఎక్కడ మాట్లాడుతారో చెప్ప లేదు.''(The Dravidian Languages and Prakrits, pp.2-14)

**చారిత్రక వ్యాకరణం -శాసన పరిశోధన**

" In order to arrive at a full and authentic study of the evolution of the Dravidian speech in India, there must be, as a basic preliminary, **a series of detailed descriptive studies of all the Dravidian languages and dialects** - or atleast of the more important among them, important

linguistically. Then after that there should be another series of historical grammars of these languages, the diachronistic treatment going parallelly with the sychronistic."అని ఆచార్య సునీతికుమార ఛటర్జీగారు (1969) డా॥ కోరాడ మహాదేవ శాస్త్రి గారి Historical Grammar of Telugu with special reference to Old Telugu C 200 BC to 1000 AD అనే గ్రంథానికి లో Foreword వ్రాశారు.[79]

దీనిని బట్టి, వర్ణనాత్మక వ్యాకరణాలు, మొదట, ఆ తరువాత చారిత్రక వ్యాకరణాలు రావలసియుండగా, తెలుగు భాషకు సంబంధించినంత వరకు మహాకవుల గ్రంథాలన్నీ సుష్ఠుగా పరిష్కరింపబడి, వ్యాఖ్యానాలతో లభ్యం కాకపోవడం మూలాన, చారిత్రక వ్యాకరణాలతోనే భాషాపరిశోధనలు ప్రారంభమయ్యిందని చెప్పవచ్చు.

తెలుగుకు సంబంధించిన చారిత్రక వ్యాకరణాలన్నీ శాసన పరిశోధనతో ముడివడి ఉండటం గమనింపవచ్చు.[80] డా॥ చిలుకూరి నారాయణరావు (1890-1951) గారు 1929 లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి 'డాక్టర్' డిగ్రీ పొందిన పరిశోధనాంశం పేరు '' పదకొండవ శతాబ్ది తెలుగు భాష'' వీరు పర్యవేక్షకులతో నిమిత్తం లేకుండా గ్రంథం వ్రాసి డిగ్రీ గ్రహించినట్లు తెలుస్తోంది. దీనినే 'ఆంధ్రభాషా చరిత్రము' అనే పేరుతో రెండు సంపుటాలుగా 1937, 1938 సంవత్సరాలలో వాల్తేరు లోని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారిచే (ప్రచురణ సంఖ్య - 18) అచ్చువేయబడింది.

డా॥ తంగిరాల నారాయణ శాస్త్రి గారు 'ప్రాచీనాంధ్ర శాసనాలు' అనే అంశం మీద ఆచార్య జి.జె. సోమయాజి పర్యవేక్షణలో 1956 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ స్వీకరించారు. ఈ గ్రంథం అముద్రితం.

డా॥ దివాకర్ల వేంకటావధాని గారు 'ప్రాఙ్నన్నయ యుగము - నన్నయ భారతము' అనే అంశం మీద ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారి పర్యవేక్షణలో 1957 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పొందారు. ఇది రెండు సంపుటాలుగా 1960-61 ప్రాంతాలలో అచ్చయింది. ప్రాఙ్నన్నయ యుగము - ఆంధ్ర వాఙ్మయారంభదశ, నన్నయ భారతము అని వీటి పేర్లు.

పైన పేర్కొన్న మూడు సిద్ధాంత గ్రంథాలు తెలుగులో వ్రాయబడగా, ఆ తర్వాత వచ్చిన ఆరు చారిత్రక వ్యాకరణాలు ఆంగ్లంలో వ్రాయబడివుండడం గమనింపదగింది. Historical Grammar of Telugu with special reference to old Telugu C.200 B.C. to 1000 A.D. అనే అంశం మీద డా॥ కోరాడ మహాదేవ శాస్త్రి గారు కలకత్తా విశ్వవిద్యాలయం

నుండి **1961** లో D.Litt., డిగ్రీ స్వీకరించారు. వీరి పర్యవేక్షకులు డా॥ సునీతి కుమార్ ఛటర్జీ గారు. **440** పుటలు గల ఈ గ్రంథాన్ని తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు **1969** లో అచ్చు వేశారు. ఈ గ్రంథానికి ఆచార్య సునీతి కుమార్ ఛటర్జీ Foreword వ్రాయగా, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ సంస్కృతాచార్యులు T. Burrow చక్కని ఉపోద్ఘాతం వ్రాశారు. ఆచార్య సుకుమార్ సేన్ అభిప్రాయం వ్రాశారు. తమ గ్రంథానికి వ్రాసిన Preface లో డా॥ కోరాడ వారు "The first systematic study of Pre-literary Telugu was made by late Korada Ramakrishnaiya in a series of papers published in the Journal of the Sri Venkateswara Oriental Research Institute, Tirupati (Vol. XII - XV, 1952-54). The present thesis is in the nature of a carry - forward of the same study taking into account all the source material since available. The scope is also more ambitious in trying to picture the development of the language in its later phases."

ఈ గ్రంథంలోని మూడు అధ్యాయాలు ముఖ్యంగా, భాషా శాస్త్రజ్ఞులకే కాక సాహిత్య పరిశోధకులకు, చరిత్ర పరిశోధకులకు సైతం పరిశీలింపదగినవిగా ఉన్నవి.

1) Telugu language during the Age of the Prakrit and Sanskrit inscriptions 2nd Century B.C. to 6th Century AD (Pages 23-36)

2) Telugu vocables in the Sanskrit inscriptions during 6th to 10th Century A.D. (Pages 402 - 411)

3) A rapid survey of Telugu and other South Indian Literature (Pages 423-440)

డా॥ బూదరాజు రాధాకృష్ణ గారు A Historical Grammar of inscriptional Telugu from 6th Century AD to 11th Century AD అనే అంశం మీద ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో **1965** లో ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ గ్రహించారు. ఈ గ్రంథాన్నే వీరు హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ద్వారా ప్రచురింపజేశారు.

డా॥ ఎం. కందప్పచెట్టి గారు A Historical Grammar of inscriptional Telugu from 12th c AD to 14th c AD అనే అంశం మీద ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య కోరాడ మహదేవ శాస్త్రి గార్ల పర్యవేక్షణలో **1968** లో తిరుపతి, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పొందారు. **545** పుటలు గల ఈ సిద్ధాంత గ్రంథం యింకా అముద్రితంగానే ఉంది.

డా॥ కె.కె. రంగనాథా చార్యులు గారు A Historical Grammar of inscriptional Telugu from 14th Century AD to 19th Century AD అనే అంశం మీద ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో 1978 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ స్వీకరించారు. ఈ గ్రంథం ముద్రితమైంది.

డా॥ శివలంక శ్రీరామచంద్రమూర్తి గారు A study of Place Names in Telugu inscriptions అనే శీర్షికపై ఆచార్య యస్.వి. జోగారావు గారి పర్యవేక్షణలో 1976 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ పొందారు. ఈ గ్రంథం ముద్రితం.

డా॥ పైడిపాటి జయరామరెడ్డి గారు, A study of Personal Names in the Telugu inscriptions from 675 AD to 1300 AD అనే అంశం మీద, పర్యవేక్షకుడు లేకుండా 1990 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ పొందారు. ఈ గ్రంథం అముద్రితం.

ఇలా, తెలుగు శాసనభాషా చారిత్రక వ్యాకరణ పరిశోధనలో ఒక క్రమాభివృద్ధి కనబడుతుంది. ఇది రాబోయే చారిత్రక నిఘంటు నిర్మాణానికి ఎంతో దోహదం చేస్తుందనడంలో ఏమాత్రం సందేహం లేదు.

దీని తర్వాత పేర్కొనదగినవి వర్ణనాత్మక వ్యాకరణాలు, శాసనాల సామాజిక, సాంఘిక, సాంస్కృతిక అధ్యయనాలు, పదప్రయోగకోశాలు, మాండలిక భాషా పరిశోధనలు, ఆదానప్రదానాలు, గ్రామనామాలు, ఇండ్లపేర్లు, వ్యక్తులపేర్లు ఇవన్నీ భిన్న భిన్న కాలాలలోని మత ప్రభావాలను, చారిత్రక సంఘటల నేపథ్యాలను, సంస్కృతులను తవ్వి వెలికి తీసి ఒక సమగ్ర చారిత్రక మహానిఘంటు నిర్మాణానికి కావలసిన సామగ్రిని సమకూరుస్తూ ఉన్నాయి.

## చారిత్రక మహానిఘంటు నిర్మాణమే నేటి అవశ్యకత

''ఆంధ్ర శాసన సారస్వతంలో ఉర్దూ, మరాఠీ పదాలు'' అనే అంశం మీద 1967 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ పొందిన డా॥ లకంసాని చక్రధర రావు గారు 1957 నుండి 1976 వరకు ఏక దీక్షగా కృషిచేసి లక్ష పదాలకు పైగా ఉన్న 'తెలుగు వ్యుత్పత్తి కోశాన్ని' ఎనిమిది సంపుటాలలో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే ప్రచురింప జేశారు. ఇందులో పదాల అర్థాలు కాలానుగుణంగా( Chronological order) యివ్వబడ్డాయి. కాబట్టి, చారిత్రక కోశలక్షణాలిందులో ఉన్నాయి. ద్రావిడ భాషలలో వ్యుత్పత్తి కోశ నిర్మాణానికి

T. Burrow, M.B. Emeneau లు కలిసి నిర్మించిన A Dravidian Etymological Dictionary 1961, 1984 లలో ప్రచురింపబడి భాషా శాస్త్ర పరిశోధనల్లో ఎంతో దోహదం చేసింది.[81]

ఇదిలా ఉండగా, నేడు, తెలుగు భాషకు ఒక చారిత్రక మహానిఘంటువు నిర్మించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని చెబుతూ, అయితే దీనికి కావలసిన సాధన సామగ్రి మన వద్ద సంపూర్ణంగా లేదని డా॥ బూదరాజు రాధాకృష్ణగారు 'మహానిఘంటువు నిర్మాణ పద్ధతులు – సమస్యలు' అనే వ్యాసంలో సమగ్రంగా చర్చించారు.[82] వివిధ నిఘంటువుల్ని వారు నిర్వచిస్తూ చారిత్రక నిఘంటువు (Historical Dictionary) ను గురించి వారీ విధంగా వ్రాశారు. ''చారిత్రక నిఘంటువుల్లో ప్రాచీనతమ కాలం నుండి ఆధునాతన కాలందాకా ఒక పదానికి ఏయే అర్థ చ్ఛాయా-భేదాలున్నాయో కాలక్రమానుసారంగా ప్రయోగలక్షితంగా నిరూపిస్తారు. భాషా చరిత్ర విద్యార్థికి ఈ రకం కోశాలు ఎంతో ఉపయోగకరం.'' ''కేవలం ఆయా ఆరోపిత పదాల (entry words) వ్యుత్పత్తుల మీదనే దృష్టి ఉంచి, ఇతర విషయాలు పట్టించుకోని తెలుగు వ్యుత్పత్తి కోశం వంటి నిఘంటువులూ ఉన్నాయి.'' అంటూ – ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీ'' వంటి మహా నిఘంటువును ఏనాటికైనా తెలుగు భాషకు నిర్మించాలంటే ప్రాథమికాధారాలు సిద్ధంగా లేవనే చెప్పాలి'' అని చెబుతూ కొన్ని లోపాలకు ఏకరువు పెట్టారు.

1) అయిదారు మహాకావ్యాలకు తప్ప తెలుగులో పదప్రయోగ సూచికలు లేవు. వచ్చిన వాటిలో తత్సమ రూపాల ప్రయోగ విశేషాలు లేవు.

2) ఆధునిక సాహిత్యంలోని ఏ మహాకావ్యానికి పదప్రయోగ సూచికలు లేవు.

3) వర్ణనాత్మక వ్యాకరణాల స్థితి కూడ 'అభావ ప్రత్యామ్నాయ' కల్పనధోరణిలో నడుస్తున్నది.

4) శాస్త్రీయంగా మాండలిక వృత్తిపదకోశాలు కొన్ని వృత్తులకు మాత్రమే వచ్చాయి. వీటిలో కొన్ని ఆరోపాలు ప్రమాణీకృతంగా లేవు.

5) అనేకానేక సాంప్రదాయిక, అధునాతన శాస్త్రాలకు తెలుగులో శాస్త్ర నిఘంటువులు లేవు.

6) అనంత సాహిత్యంలోని శబ్దార్థ జాలానికి ప్రయోగ పట్టికలతోడి ఆకరాలు లేవు.

7) అనేకానేక గ్రంథాలకు శాస్త్రీయంగా సిద్ధం చేసిన ప్రామాణిక పాఠాలు లేవు

8) ఆధునికాంధ్ర భాషకు సువిస్తృతమైన వర్ణనాత్మక వ్యాకరణం రాలేదు.

9) తెలుగు అకాడెమీ ప్రచురిస్తున్న మాండలిక వ్యాకరణాలు అసంపూర్ణంగా ఉన్నాయి. అన్ని మండలాలకు సిద్ధం కాలేదు.

10) ప్రాచీన పద్య నిఘంటువుల్లో ఉన్న పదాల సంఖ్య మూడు వేలకు మించదు.

11) సూర్యరాయాంధ్ర నిఘంటువు వంటి పెద్ద నిఘంటువుల్లో పర్యాయపద, వ్యతిరేక పద సూచన గాని, సమీప పదాల అర్థచ్ఛాయాభేదాలు గాని, ప్రయోగ వైచిత్రి నిరూపణ గాని, స్పష్టమైన వ్యుత్పత్తి నిరూపణలుగాని లేవు.

12) మొత్తం మీద 80,000 పదాలకు పైన ఆరోప సంఖ్య గల నిఘంటువులు తెలుగులో లేవు. పై చెప్పిన వన్నీ సమగ్రంగా లేకుండా చారిత్రక నిఘంటు నిర్మాణం జరిగేవని కాదు.

ఇప్పుడున్న చిన్న చితకా నిఘంటువులన్నీ ఏకత్రపరచి ఒక మహానిఘంటువు నిర్మించవచ్చనే ఆచార్య చేకూరి రామారావు 'చేరాతల్ని' ఆయన నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చుతూ ''ప్రపంచ భాషా చరిత్రలో, నిఘంటు నిర్మాణ చరిత్రలో, ఇలా పదాలున్న నిఘంటువులను గుదిగుచ్చి ఒక పెద్ద నిఘంటువు నిర్మించిన దాఖలాలు లేవు. వారు చెప్ప లేదు. ఒక్కో నిఘంటు నిర్మాణ పద్ధతి ఒక్కో రకంగా ఉన్నప్పుడు భిన్న మార్గాల సమన్వయం ద్వారా మరో మహానిఘంటు నిర్మాణం సాధ్యం కాదనే సంగతి నిర్మాణానుభవం గల వాళ్లు చెప్తారు. పరిష్కరణతో నిమిత్తం లేకుండా ఆయా కోశాలతో మరో పెద్ద కోశం నిర్మిస్తే ఆయా ఆధార గ్రంథాల్లోని తప్పులూ, లోపాలూ యథాతథంగా పెద్ద నిఘంటుకు సంక్రమిస్తాయి.'' అని వ్రాస్తూ, మహా నిఘంటువు నిర్మాణ పద్ధతుల్ని ముచ్చటించి చివరగా, ''తెలుగులో ఇప్పటికి రాని మహా నిఘంటువులో ఒక ప్రత్యయారోపం ఎలా ఉండాలో'' మచ్చుకు ఉదాహరించారు. ఆ ఆరోపంలో ఉండవలసిన వివరాలన్నీ లేక పోయినా అది ఎంత విపులంగా ఉంటుందో తెలుస్తుంది. దీని పరిమితిని బట్టి రెండు లక్షల ఆరోపాలున్న మహా నిఘంటు పరిమాణాన్ని, విస్తృతినీ, ఊహించవచ్చు. తెలుగు భాషకొక మహా నిఘంటువు ప్రస్తుత పరిస్థితుల్లో, సమీప భవిష్యత్తులో వెలుస్తుందన్న నమ్మకం లేదని' తేల్చి చెప్పారు.

మన పరిశోధకులెంత సేపటికీ కథలుగాథలు తవ్వి కాలక్షేపం చేస్తున్నారే తప్ప, నిర్మాణాత్మకంగా, తదేక దీక్షతో భాషా సాహిత్య పరిశోధన చేసే వాళ్లకు ఈనాడు వేళ్ల మీద లెక్క పెట్టవలసి వుంది. కనీసం అటువంటి వాళ్లచేతనైనా సి.పి. బ్రౌన్ ఏనాడో తయారుచేయించిన పదమూడు పద ప్రయోగ సూచికలూ, జూలూరి అప్పయ్య వంటి వారి చేత వ్రాయించిన వ్యాఖ్యానాలూ, పరిష్కరింపజేసి తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రకటించాలి. డా॥ రాధా కృష్ణ గారు సూచించిన లోపాలన్నింటినీ మనం మరో యాభై యేండ్లలో పూర్తిచేయగలిగితే **2050**నాటికైనా తెలుగు భాషకు ఒక సమగ్ర చారిత్రక మహా నిఘంటు నిర్మాణానికి కావలసిన సాధన సామగ్రి సమకూర్చిన వాళ్లమవుతాం.!

ఈనాడు పూనాలోని దక్కన్ కాలేజి పోస్టు గ్రాడ్యుయేట్ అండ్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ వారు నిర్మిస్తున్న "An Encyclopaedic Dictionary of Sanskrit on Historical Principles అనే బృహత్తర నిఘంటువు వలె, తెలుగు భాషకు కూడ భాషా చారిత్రక పరిణామదృష్ట్యా నిఘంటు నిర్మాణం జరగవలసివుందని సవినయంగా మనవి చేస్తున్నాను. పై సంస్కృత నిఘంటు పీఠికలో, సాధారణ సంపాదకులైన A.M. Ghatage యిలా వ్రాశారు. " As the historical grammar deals with the structure of a language from an evolutive aspect, so should be a historical dictionary deals with the vocabulary or lexicon of a language from a similar point of view .... All the historical aspects of this material then should form the raw matereial of a dictionary. The historical dictionary then takes for its study the formal and semantic aspects of the lexical material of the language from an evolutive point of view" (Vol. I, 1976)[83]

సంస్కృత భాషకు మూడువేల సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర ఉన్నది. మరి మన తెలుగు భాషా చరిత్ర నిర్మాణానికి మనం కనీసం క్రీ.పూ. **4**వ శతాబ్దం నుండి యిప్పటి వరకు అంటే **2400** సంవత్సరాల చరిత్రను పరిశీలించి నిఘంటు నిర్మాణానికి పూనుకోవలసివుంది. దీనికి పాళీ, ప్రాకృత గ్రంథాల పరిశీలనం, ఆ భాషల్లో వెలువడిన శాసనాలు, నాణెములు, సంస్కృత, తెలుగు శాసనాలు, ముద్రిత అముద్రిత తెలుగు సాహిత్యం, కైఫీయత్తులు, వీటన్నింటినీ చారిత్రకంగా విశ్లేషించుకొని పదజాలాన్ని క్రోడీకరించి చారిత్రక పరిణామదృష్ట్యా అర్థ నిర్ణయం చేసుకొన్న తర్వాతనే ఆకరాలను నమోదుచేయవలసి వుంటుంది.

శాసనాలకు వేరుగా, సాహిత్య భాషకు వేరుగాకాక , ఇవి రెండూ విడదీయరాని లంకె గలవి కాబట్టి చారిత్రక నిఘంటు నిర్మాణం లో శాసన భాషాస్వరూప పరిజ్ఞానం, పాళీ, ప్రాకృత భాషా పరిణామ ప్రభావాలు, వ్యాకరణం క్షుణ్ణంగా తెలిసిన పండితుల చేతనే ఈ కార్యం సాధ్యమవుతుంది.

ఈ దిశలో ఒక దిక్సూచిగా ఈ ప్రయత్నానికి శ్రీకారం చుట్టిన వారు కీ॥శే॥ చీమకుర్తి శేషగిరిరావు గారు. వీరు హైదరాబాదులో 'తెలుగుగోష్ఠి' అనే పండితుల గోష్ఠి మండలినొక దానిని నెలకొల్పి (**1984**) వందకు పైగా సమావేశాలు ఏర్పాటు చేసి తెలుగులో పాళీపదాలు (**1990**) తెలుగుమఱుగులు (**1992**) అనే రెండు గ్రంథాలను వెలువరించారు.

'తెలుగులో పాళీ పదాలు' అనే గ్రంథంలో ఆయన వ్రాసిన వాక్యాలు మనకు ప్రేరణను స్ఫూర్తిని కల్గిస్తాయని విశ్వసిస్తున్నాను. ''ఆంధ్ర భాషా చరిత్రలు ఈనాడు ఎన్నియో వెలువడినవి. అవియన్నియు ద్రావిడ భాషావాదమును పట్టుకొని వ్రేలాడినవే గాని, దేశభాషపై ప్రాకృతముల ప్రభావము మూలమున వచ్చిన మార్పులను గమనించినవే కావు. దాదాపు **800**యేండ్లు దేశమున విపులవ్యాప్తితో మన దేశభాషకు సాహిత్య స్వరూపమును సంతరించిన ప్రాకృతముల ప్రసక్తి ఆ గ్రంథములలో తగినట్లుగ కన్పట్టదు.''

''**యథార్థమున భాషా పరిణామమును గుర్తించుటకు పదముల వ్యుత్పత్తి రీతుల పరిశీలనను చారిత్రక దృష్టితో జరుపవలెను.** ఆ విధముగా ఆ పరిణామమును అర్థము చేసికొనినపుడే ఒక భాషా చరిత్రను విశిష్టరీతిలో రచించవలనుపడును. **దేశచరిత్రతో సంబంధము లేకుండ భాషా చరిత్రను రచింపబూనుట నేల విడిచి సాముచేయుటకు వంటిదే.** కాల్డ్వెల్ మొదలుగ ఇప్పటి వరకు జరిగిన తెలుగు భాషాచరిత్ర కృషి ఈ కోవకు చెందినదే. ఈ విషయమును గ్రహించిన 'తెలుగు గోష్ఠి' తెలుగు భాషపై ప్రాకృతముల ప్రభావమును గుర్తించుటకై కృషి జరుగుట అత్యావశ్యకమని భావించినది. (పుటలు **3-4**)

ఈ భావనకు అనుగుణంగానే ప్రాథమికంగా పరిశీలించి తెలుగులో **239** పాళీపదాలను గుర్తించడం జరిగింది. అలాగే 'తెలుగుమఱుగులు' లో శాసనాలలోని **36** పదాలకు వ్యుత్పత్తులు ప్రాకృత, పాళీ భాషల దృష్ట్యా పరిశీలింపబడినవి.

కీ॥శే॥ చీమకుర్తి శేషగిరిరావు గారి చారిత్రక జిజ్ఞాసకు, ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. 1992 ఆగస్టు 1వ తేది ఆయన తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని ప్రాచ్యపరిశోధన సంస్థ గ్రంథాలయానికి వచ్చారు. అప్పుడాయన వయస్సు దాదాపు 80 ఏండ్లు ఉంటాయి. ఆయన ఆ వయస్సులో ఏ పనిమీద వచ్చారంటే, చిత్తూరు జిల్లా, సత్యవేడు తాలుకాలో తిరుపతి - మద్రాసు రహదారిలో ఊత్తుకోటకు అర కిలోమీటరు దూరంలో సురుటుపల్లి అనే గ్రామముంది. అక్కడ 'నీలకంతేశ్వర స్వామి' అనే పేరుతో శివుని విగ్రహం పండుకొన్న భంగిమలో ఉంటుంది. శివుని లింగాకృతిలో అర్చిస్తారు కాని, మానవాకృతిలో అందులోను 'శయన విగ్రహంగా' అర్చించడం ఈ దేవాలయంలో తప్ప భారతదేశంలో మరెక్కడా లేదు. శ్రీ శేషగిరి రావు ఇక్కడి యూనివర్శిటీ చరిత్రపరిశోధకులు దీన్ని గురించి ఏమంటున్నారో తెలుసుకొని అక్కడకి స్వయంగా వెళ్లి పరిశీలించాలని వచ్చారు. ఇక్కడి వారు అనూచానంగా అందరూ చెప్పేటట్లే అది 'శయన శివుని' విగ్రహం అని చెప్పారు. మరునాడు ఆయన ఆ దేవాలయ సందర్శించి మరలా మా సంస్థకు వచ్చి అది అతి ప్రాచీనమైన 'బుద్ధ పరినిర్వాణ విగ్రహం' అని, బుద్ధుడే శయన మూర్తిగా ఉంటాడని, శైవులు బౌద్ధులను ఆంధ్ర దేశం నుండి తరిమివేసి బుద్ధపరినిర్వాణ విగ్రహాన్ని శయన శివుడని చెప్పి ఆరాధిస్తున్నారు. చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తి తాలుకాలోని గుడిమల్లంలో గల 'శివలింగం' (క్రీ.పూ 1వ శతాబ్ది) ఎంత ప్రాచీనమైందో, సురుటుపల్లి లోని బుద్ధ పరినిర్వాణ విగ్రహం కూడా (క్రీ.పూ 3వ శతాబ్ది) ప్రాచీనమైందని చెప్పారు. వారి చారిత్రక స్పృహ కిది ఒక చిన్న తార్కాణం మాత్రమే !

## ఆంధ్రుల సామాజిక జీవితంపై జైనుల ప్రభావం

**నామకరణం** :- కర్ణాటక రాష్ట్రంలోను, కర్ణాటకకు సమీపంలోని మదనపల్లి, హిందూపురం, అనంతపురం వరకు కూడ స్త్రీ, పురుషుల నామధేయాలు కొన్ని పరిశీలిస్తే, గుండూరావు, గుండప్ప, గుండమ్మ, గుండయ్య అనే పేర్లు కనబడుతాయి. ఈ పేర్లెలా ఏర్పడ్డాయి? ఏమిటి దీని కర్థం ? అని విచారించగా అతిప్రాచీనమైన కాలం నుండి కూడా కర్ణాటకలో జైనుల స్థావరమైన శ్రమణబెళగొళ లోని 'సిద్ధరగుండు' యొక్క మహిమను, మాహాత్మ్యాన్ని ప్రజలు ఆరాధించడమే వల్లనే ఇటువంటి నామకరణాలకు మూలకారణమని స్ఫురించింది. తెలుగుదేశంలో మునీశ్వరులను పూజించే వారి కుటుంబాలలో పుట్టిన పిల్లలకు

మునయ్య, మునిరత్నం, మునిరాజరత్నం, మునీశ్వరయ్య, మునిరత్నమ్మ అని పేర్లు పెట్టే ఆచారముంది కదా! అలాగే, జైన సిద్ధులు సల్లేఖనంతో నిర్వాణం పొందిన 'సిద్ధరగుండు' యొక్క పవిత్రత, దివ్యత్వం శిశువుకు రక్షగా ఉండాలని కోరుకొని తల్లితండ్రులు పై విధంగా నామకరణం చేశారని చెప్పవచ్చు. ఇది కర్ణాటక, ఆంధ్రదేశాలపై జైనమత ప్రభావంగా చెప్పవచ్చు. జానపదుల నమ్మకాలెటువంటివో ఒక ఉదాహరణకు చెబుతాను.

కర్ణాటక రాష్ట్రంలోని బ్రహ్మగిరి లో అశోకుని శాసన శిలపై అర్థంకాని భాష ఉండడం చేత, ఆ గ్రామప్రజలు దానిని 'అక్షరగుండు' అని పిలిచేవారట! ఈ 'అక్షరగుండు'కు అద్భుతమైన మహత్తు ఉందని, ఆ శిలను కడిగి ఆ శిలాజలాన్ని సేవిస్తే ఏ ఔషధాల వల్లా నయంకాని కఠిన వ్యాధులు కూడ నయమౌతాయని గ్రామస్తులు విశ్వసించేవారట![84]

మరొక ఆసక్తికరమైన అంశమేమంటే, కర్ణాటక లోను, ఆంధ్రదేశంలో అనంతపురం వరకు గల కుటుంబాలలో బిడ్డ పుట్టినప్పుడు నామకరణోత్సవంలో మొదట ఒక గుండ్రాయిని తల్లికి యిచ్చి 'గుండప్ప' అని పిలిచిన తర్వాత నవజాత శిశువుకు నచ్చిన పేరు పెట్టి తల్లికి యివ్వడమనే ఆచారం ఒకటి కనబడుతూఉంది. దీని అంతర్థామేమిటని ఆలోచిస్తే, ఆ పుట్టిన బిడ్డ ఒక రాయిలాగా స్థిరంగా ఎక్కువ కాలం ఈ భూమిపై జీవించాలనేదే ఆంతర్యం.

దీని వెనుక మరోభావం కూడ స్ఫురిస్తూఉంది. ఆ గుండ్రాయి అతి ప్రాచీనమైన 'జైన సిద్ధర గుండు'కు ప్రతీక కాదు కదా! కావచ్చుననిపిస్తుంది. ఎందుకంటే, 'సిద్ధరగుండు' కు ప్రతీకగా ఈ సంప్రదాయం ఇంటింటా ఏర్పడి ఉండవచ్చు. ఇలాంటివి మత ప్రభావం నుండి పుట్టే ఆచారవ్యవహారాలు! ఇక, వైదిక సంప్రదాయంలోని వివాహంలో, ఆచారాలను గమనిస్తే, 'అశ్మారోపణ'-మనే క్రియ ఉంది. దీనికే తెలుగులో 'సన్నికల్లు తొక్కడం' అంటారు. వధువు తన కుడికాలిని సన్నికల్లుపై నుంచగా వరుడు ఆమె కాలి బొటనవేలికి ప్రక్కనున్న వేలికి వెండి మెట్టెలు తొడుగుతాడు. అలాగే ఎడమ కాలిన సన్నికల్లుమీద పెట్టగా అదే విధంగా మెట్టెలు తొడుగుతాడు. ఈ సందర్భంలో వైదికమతమైన మంత్రాలున్నాయి.

ఓం ఆరోహేమమశ్మానమశ్మేవ త్వం స్థిరాభవ ।
అభితిష్ఠ పృతన్యతోఽవబాధస్వ పృతనాయతః ॥ అని శాంఖాయన గృహ్యాసూత్రం - 8

ఓ సుకుమారీ! ఈ శిలపై నీ సుతిమెత్తని పాదాలు మోపు! ఈ శిలలాగా నీ ఉనికి స్థిరం! అని వరుడు వధువుతో చెప్పే మంత్రముంది. ఇది 'అశ్మారోపణక్రియ' లోని అంతరార్థం! పాదాలు శిలపై ఉంచడం స్థిరత్వానికి ప్రతీకగా భావించడం![85]

''ఋగ్వేదంలో గ్రావసూక్తముంది. సోమ లతను నూరే రాళ్ళ గురించి చేసిన స్తుతి గ్రావ సూక్తం. సర్పజాతికి సంబంధించిన జరత్కర్ణుడు ఈ సూక్త ద్రష్ట! ఈ సూక్తంలో ఎనిమిది మంత్రాలున్నాయి. ఉషఃకాలంలో ఋషి రాళ్లను గురించి స్తోత్రం చేస్తున్నాడు. ఆ రాళ్లు తనకు ఐశ్వర్యాన్ని, జ్ఞానాన్ని ఇవ్వాలని అతని ఆకాంక్ష!.

1) ఉషః కాలంలో మీకు నమస్కరిస్తున్నాడు. మీరు ఇంద్రుని మరుత్తులను, రోదసిని, భూమిని బహిర్గతం చేయండి. భూమ్యాకాశాలు రెండు ఏకమై ఈ యజ్ఞమందిరంలో మాకు సాయంకావాలి. 2) శిలలారా! మీరు స్తోత్రం చేసే వారికి సోమరసాన్ని అందించండి. ఆధ్యాత్మిక ఐశ్వర్యం కోసం మాకు గుఱ్ఱాలనివ్వండి. 3) ఓ శిలలారా! క్రూరులైన రాక్షసుల్ని పారద్రోలండి. అశుభాన్ని తొలగించండి. కుమారులను, ఐశ్వర్యాన్ని ప్రసాదించండి 4) వేగంగా తిరిగే ఈ రాళ్ల నుండి సోమరసం స్రవిస్తున్నది. ఆ సోమరసాన్ని అగ్నిలో వేల్చడానికి ఋత్విక్కులు అతురత పడుతున్నారు.

ఇలా ఈ మంత్రాల్లో శిల నుండి సోమరసం స్రవించడమనే ప్రతీకార్థం మనం గ్రహిస్తే శిల, భౌతిక జీవితం. దాని నుండి స్రవిస్తున్న సోమరసం ఆత్మానందం. కాని, భౌతిక జీవితం ద్వారానే ఆధ్యాత్మికానందం పొందాలి తప్ప మరొక మార్గం లేదు. భౌతికమైన వస్తువు ఆత్మ చైతన్య స్వరూపం కనుక వస్తువును ఆత్మపదార్థంగా అరాధించడమే తిరగలి విసరటం. ఇది వేద పరిభాష. సర్వమతాల్లోను ఈ రాళ్ల కథ ఉన్నది.'' అని శ్రీ లీలా సమాధి (షిరిడీ సాయిబాబాతత్త్వం) అనే గ్రంథ ప్రారంభంలోనే 'శ్రీవామపాదానంద' (ఆచార్యతుమ్మపూడి కోటీశ్వరరావు) వ్రాశారు.[86]

ఈ రాళ్ల కథ కాశ్మీరశివాద్వైత సిద్ధాంత ప్రవర్తకుడైన వసుగుప్తుని కథలోను, పరమహంస యోగానంద జీవితానుభవాల్లోను, జపాన్‌లో 'జైన' బౌద్ధారామాల్లోని శిలావనాలు, షిరిడీ బాబా విసరిన తిరుగలి కథ – అంతగ్రావసూక్తమే! నన్నారు శ్రీవామపాదానంద.

ఇవన్నీ గమనిస్తే, వైదికమైన భావనలోనే సజీవ నిర్జీవ, చేతనాచేతనమనే భేదం లేకుండా చైతన్య శక్తి సర్వత్ర వ్యాపించి వున్నదనే రహస్యం యిక్కడ ప్రస్ఫుటమౌతున్నది. జైనులు కూడ ఈ వైదిక భావాన్నే యథాతథంగా గ్రహించారని చెప్పాలి. ఇదే భిన్నత్వంలోని ఏకత్వం. వైదిక భావనకు సన్నిహితమైనదే జైనమతం కూడ.

వాల్మీకి రామాయణంలో అహల్య ఒక 'విచిత్ర శిలాతపస్విని'. చైతన్యం గర్భీకరించుకొని లోకంచే ఒక అనాదృతమైన, (అనాదరింపబడిన) అజ్ఞాత జీవితం గడిపింది. బాహ్యదృష్టికి నిశ్చైతన్య పదార్థంలా పడివున్న 'సుప్తశిల' (నిద్రిస్తున్న శిల) గా చిత్రీకరింపబడడం లోని అంతరార్థం పై వైదికమైన భావనయే! భాగవతంలో ఇంద్రుడు అశ్మవృష్టి (రాళ్లవాన) కురిపిస్తే శ్రీ కృష్ణుడు దానికంటే పెద్ద అశ్మమైన గోవర్ధన గిరిని గొడుగుగా ఎత్తిపట్టాడు. కూర్మావతారంలో వీపుపై మందరగిరిని మోసిన స్వామికి గోవర్ధన గిరి ఒక లెక్కా! ధారయామ్యహమోజసా! అని కదా గీత! సముద్రపుటొడ్డున శ్రీరాముడొక శిలపై కూర్చున్నా, షిరిడి సాయి ఎడమపాదాన్ని నేలపై మోపి కుడికాలిని పైకి ముడిచి ఒక శిలపై కూర్చున్నా వారికదే ఒక సింహాసనం! బ్రహ్మవిద్యా వ్యాఖ్యాన సింహాసనం! ఒక కొయ్యకూ, రాతికీ నీ దృష్టిలో తేడా ఏముందయ్యా! నీ పాదధూళిలో ఒక మనిషిని, నిజమైన మనిషిగా చేసే మహత్త్వం ఏదో ఉంది. నన్ను నీ పాదాలను కడగనీ! ఆ జలాలను నెత్తి మీద చల్లుకొనే భాగ్యం కలుగజేయి! అంటాడు గుహుడు అధ్యాత్మ రామాయణంలో రాముడితో.

ఇది విశ్వజనీనమైన భగవద్భావన కాబట్టే, హిందూ, జైన, బౌద్ధమతాలలో తన భావనకు అందివచ్చిన దేవతామూర్తినో, తీర్థంకరుణ్ణో, బుద్ధ భగవానునో శిలపై మలచి ఆరాధించడం కనబడుతుంది. ఇక్కడ శిల ఒక రాయి కాదు. ఒక భావనకు ప్రతీక!

**అక్షరాభ్యాసం** :- ''జైనులే తెలుగు వాళ్లకి అక్షరాభ్యాసం చేసిన గురువులు. అందుకే 'సిద్ధం నమః' అనే నమస్కారాన్ని నేటికీ విడచిపెట్టక మనం విద్యారంభం చేస్తున్నాం.'' అంటున్నారు ఆరుద్ర . ఈ విద్యారంభాన్ని గూర్చి 'ఓనమాలు' అనే వ్యాసంలో శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి గారిలా వ్రాస్తున్నారు.[87] ''ఓం నమః శివాయ సిద్ధంనమః అని అక్షరాభ్యాస కాలమున పిల్లవానిచే ప్రథమమున పలికించెదరు. అకార – ఉకార – మకార సంయోగరూపమగు 'ఓమ్' అనునది సృష్టిస్థితి లయకారణమగు పరమాత్మను దెలుపునని ఉపనిషత్తు చెప్పుచున్నది. కాబట్టి ఓంకారము పరమాత్మ సూచకము. 'శివాయ నమః' శివుని కొఱకు నమస్కారము. అనగా శివునికి నమస్కారము 'సిద్ధం నమః' సిద్ధుని గుఱించి నమస్కారము. అనగా సిద్ధునికి నమస్కారము. వీనిలో మొదటి దగు శివనమస్కారము శైవ సంప్రదాయమున వచ్చినది. రెండవదగు సిద్ధనమస్కారము జైన సంప్రదాయమున వచ్చినది. సిద్ధుడు జైనమతమున పంచ పరమేష్ఠులలో నొకడు. జైన గ్రంథముల యాద్యంతములందు 'సిద్ధం నమః' అనునది వ్రాయబడు చుండును. జైనమతమున దీనికి 'సిద్ధమాతృక' అని పేరు.

తతో భగవతో వక్త్రా న్నిస్సృతా మక్షరావలీమ్।
'సిద్ధంనమ' ఇతి వ్యక్త మంగలాం సిద్ధ మాతృకామ్ ॥

అని ఆదిపురాణము (8-59)న గలదు. 'ఓం సిద్ధం నమః' 'ఓం నమో సిద్ధం' 'నమః సిద్ధం' అని జైన గ్రంథముల యందు గలదు. శివాయనమః అనునట్లే 'సిద్ధాయనమః' అని యనదగును గాని జైన సంప్రదాయము ననుసరించి 'సిద్ధం నమః' అనునదే గ్రహింపబడినది. ఈ వాక్యద్వయ సమ్మేళనము అకాలమందు ఆంధ్రదేశమందున్న శైవ జైన మతముల సమరసతను సమ ప్రధానతను చాటుచున్నది. కొందరు తమిళ దేశమున తద్భాషోచ్చారణానుకూలముగా 'హరిః నమోత్తు చిందం' అని యుపదేశింతురు. 'చిందం' అనునది 'సిద్ధం' అనుదాని అపభ్రంశరూపము. ఇది వైష్ణవ జైనమతముల సమప్రాధాన్యమును తెలుపును.''

''మనకి లెక్కలు నేర్పిందీ జైనులే. ఎక్కాలు అనే మాట ఆసంగతినే జ్ఞాపకం చేస్తుంది. ప్రాకృతంలో ఎక్కాలను 'మగ్గలు' అంటారు. అందులో ప్రతిదీ 'ఎక్కస' అని మొదలవుతుంది. 'ఎక్కస వర్గో ఎక్కా, బియ్యస వర్గోచారి'. మగ్గలు మరుగుపడినా ఎక్కాలు మనకు దక్కాయి.''[88]

మహావీరాచార్యుడు 'గణితసారసంగ్రహము'నే పేరుతో సంస్కృతంలో వ్రాసిన గ్రంథాన్ని స్వతంత్రపీఠికతో చేర్చి మూలమును స్వేచ్ఛానువాద మొనరించాడు మల్లన. ఈ గణిత గ్రంథంలోనే పరికర్మగణితములో 'ఎక్కసవర్గో ఎక్క' బియ్యసవర్గోచారి' అనే మగ్గ (ఎక్కం) వస్తుంది. ఒకటి వర్గువు ఒకటి, రెండు వర్గువు నాలుగు అనిదీని కర్థం. ఇలాగే వర్గుమూలము, ఘనము, ఘనమూలములకు 'మగ్గాలు'న్నాయి. వేటూరి ప్రభాకరశాస్త్రి గారిచే పరిష్కరింపబడిన పావులూరి మల్లన సారసంగ్రహగణితములో వీటి ప్రాకృత మూలములు చూడవచ్చును. జైన మతంలో సంఘాన్ని 'గచ్ఛ అంటారు. ఈ లెక్కలలో గచ్ఛ, ఇష్ట గచ్ఛ, శేషగచ్ఛ అను పరిభాషలు వాడటం చూస్తే దీని రచయిత జైనుడన్నది స్పష్టపడుతుంది. గచ్ఛానయన సూత్రము, శేష గచ్ఛాధ్యాయన సూత్రము దీనికి ఉదాహరణాలు.

బౌద్ధమతానికి ఆచార్య నాగార్జునుణ్ణి యిచ్చిన ఆంధ్రదేశం, జైనానికి కుందకుందాచార్యులను ఇచ్చింది. నాగార్జునునిమాధ్యమిక వాదం బౌద్ధానికి ఎంత విలువైనదో కుందకుందాచార్యుల అనేకాంతవాదం అంతబలమైంది.

కుందకుందాచార్యుడు అచ్చంగా ఆంధ్రుడు. అనంతపురం జిల్లాలో గుంతకల్లుకు నాల్గుమైళ్ల దూరాన కొనకొండ్ల అనే గ్రామం ఉంది. క్రీస్తుపూర్వం మొదటి శతాబ్దంలో ఆ ఊరిలో ఎల్లయ్య, లేక ఏలయ్య అనే ప్రతిభావంతుడే జైనం స్వీకరించి పద్మనంది అని పేరు పెట్టుకొన్నాడు. ఇతనికే వక్రగ్రీవుడు, గృధ్రపింఛుడు, ఏలాచార్యుడు అని పేర్లు. కొనకొండ్లకు ఒకప్పుడు కొండ కుంద అని పేరుండేది. అందుకే ఏలాచార్యుడు 'కొండ కుందాచార్యుడు' అయ్యాడు. ఆ పేరు సంస్కృతీకరణం పొంది కుందకుందాచార్యునిగా మారింది. ఇతడనేక జైనమత గ్రంథాలు వ్రాశాడు. అందులో 'దాసభక్తి మూలాచారం' జైనులకు పరమప్రామాణిక గ్రంథం. కుందకుందాచార్యులు దిగంబర జైనులకు గురుపీఠం.

**మంగళం భగవాన్ వీరో మంగళం గౌతమోగణిన్ ।**
**మంగళం కుంద కుందార్యో జినధర్మోఽస్తు మంగళం ॥**

హరిసేనుడు 'బృహత్కథాకోశం' అనే గ్రంథంలో చెప్పిన కొన్ని కథలు ఆంధ్ర దేశానికీ జైనమతానికీ గల సంబంధాలు చెబుతాయి. నయసేనుడు 'ధర్మామృతం' అనే కావ్యంలో తెలుగుదేశానికీ జైనులకూ గల మరికొన్ని కథలు చెప్పాడు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు 'భారతి' లో జైనుల మతకథలు, 'వ్యాససంగ్రహం'లో ''ప్రాకృత గ్రంథకర్తలూ- వారి ప్రజాసేవానూ'' అనే రచనల్లో ఎన్నో అమూల్య విషయాలు లభ్యమౌతాయి.

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు 'ధర్మామృతము' లోని కథనూ, ఆంధ్రులకు అంధకులను పేరు ఎట్లేర్పడినదనే విషయాన్ని 'ఇక్ష్వాకులు - కొత్త పరిశోధనము' అను వ్యాసంలో వెల్లడించారు. 'ధర్మామృతము' లో చెప్పబడిన కథ యిది.[89]

''ఇక్ష్వాకు వంశపు రాజుల పరంపరంలో ధనదుడని యొక రాజుండెను. అతడు ప్రతిపాలపురము రాజధానిగా వేంగీదేశ మెల్లనేలుచుండెను. ఆ దేశముననే సంఘశ్రీ యని యొక బౌద్ధుడుండెను. అతని పుత్రి కమలశ్రీ యను పేరుగలది మిక్కిలి సౌందర్యవతి. ధనదుడామెను ప్రేమించి వివాహమాడెను. కమలశ్రీ నెట్టకేలకాతడు జైనమతమునకు ద్రిప్పుకొనెను. తన మామయగు సంఘశ్రీ ని గూడ నాతడు జైన మతమునకు ద్రిప్పుకొన యత్నించెను. సంఘశ్రీ యంగీకరింపడయ్యెను. ఒకనాడు జినదీక్షితులై సిద్ధిని పొందిన చారణ ఋషు లంతరిక్షమున బోవుచుండగా ధనదుడు వారిని సంఘశ్రీ కి చూపి జైనమతమున నమ్మిక పుట్టించెను. సంఘశ్రీ యానమ్మకమున జైనమతమున చేరెను.

ఒకనాడా సంఘశ్రీకి బౌద్ధమత గురువగు బుద్ధశ్రీ యరుదెంచి బోధించి మరల నాతని బౌద్ధమతమునకు ద్రిప్పెను. ధనదరాజు మరల నాతని జైన మతమునకు ద్రిప్పుకో జూచెను గాని లాభము లేదయ్యెను. ధనదరాజొకనాడు నిండు సభలో మామ నిట్లడిగెను. ''నీవానాడు చారణఋషు లంతరిక్షమున బోవుచుండుటను జూచితివి గదా! మరల జైనమతము విడిచితి వేల ? సంఘశ్రీ పై కోపించి అక్కడి పురదేవతలు వచ్చి వాని రెండు కన్నులను బెటికి వేసిరి. ఇట్లు సంఘశ్రీ యవమానితుడై, దుఃఖితుడై కొన్నాళ్లకు చనిపోయెను. అతడు నరకమందెను. వాని వంశము వారేడుతరముల దాక పుట్టుగ్రుడ్డి వాండ్రయిరి. బహుకుటుంబము గల యా సంఘశ్రీ వంశము వారేడుతరముల దాకనట్లు గ్రుడ్డివారగుటచే నాదేశమునకు అంధకదేశమని పేరయ్యెను. ధనదమహారాజు కొన్నాళ్ళు రాజ్యమేలి తన పుత్రుడగు ఇంద్రగుప్తునికి పట్టము గట్టి తపోవనమున కరిగెను.''

ఇది ధర్మామృత కర్త నయసేనాచార్యుడు చెప్పిన కథ [90]. ఇందలి తత్త్వమును వేటూరి వారే యిలా విమర్శించారు. ''జైన కావ్యము గాన ధర్మామృతమున ధనదుని వృత్తాంతమున కాధిక్యమును, ప్రాముఖ్యమును గల్పింపబడినవి. సంఘశ్రీ వంశము వారిని బట్టియే వేంగీదేశమునకు 'అంధక' దేశమని పేరేర్పడిన దనుటచే నావంశము వారెంతేని ప్రాముఖ్యమందిన వారయి యుండవలెను కదా! జైనుడగు ధనదుని కంటె బౌద్ధుడగు సంఘశ్రీకే వేంగీదేశమున బ్రాముఖ్య మీకథను బట్టి కాననగును. సంఘశ్రీ పరంపర వారే యీ స్తూపముల గట్టించిన వారు గాదగుదురు. తెలుగుదేశమున జినాలయములును గలవు. ధనద వంశము వారు వానిని గట్టించి యుందురు.''

''అంధ పదము బహువచనమున దేశి భాషలో 'అంధర్' 'అంధరు' అని యుండి (కర్ణాటాంధ్ర భాషాభేదమూనాటి కేర్పడ లేదు) దాని మీద ఆంధ్రపదము పుట్టియుండవచ్చును.'ఆంధ్ర' పదము నిన్న నేడు పుట్టినది. ప్రాచీనకాలమున 'అంధ్ర'పదమేకాని 'ఆంధ్ర' పదము లేనే లేదు. పండ్రెండవ తీర్థంకరుడును, మహావీరుని కంటె పూర్వుడును నగు వాసుపూజ్యుని కాలమునకు కొంచెము తర్వాత (క్రీ.పూ. 5వ శతాబ్ది) జరిగినదిగా నుండుటచే నీ కథావృత్తాంతమును బట్టి దేశమునకు పేరు వచ్చుటయు సంగతము కావచ్చును. దేశము పేరు దేశము నేలిన రాజులకును తర్వాత నేర్పడి యుండవచ్చును. ఐతరేయ బ్రాహ్మణ గాథకు నీ కథకు సమన్వయము గలదేమో కనుగొనవలెను. ఆంధ్రులు, బౌద్ధులు నయిన సంఘశ్రీ వంశము వారి మీద కోపముచే ధర్మామృత కథాకారులీ ''అంధత''ను వారికి గల్పించి దానిని బట్టి తత్పూర్వమున నుండియు నున్న దేశనామమునకు వ్యుత్పత్తిని బొందించి యుండవచ్చును.''[91]

ప్రతిపాలపురమే భట్టిప్రోలు. ధనదమహారాజు కథా కల్పితుడు కాడు. వెలనాటి చోడులకు రాజధాని యైన ధనదుపురము (నేడు చందవోలు) అతని పేరవెలసినది. ధనదుపురము త్రిలోచన పల్లవునిచే చోడరాజుల కొసగబడినట్లు శాసనాధారములున్నాయి. దివిసీమను ధనదుడే మానవ నివాసయోగ్యమొనర్చినాడు. గణపేశ్వరపు శాసనములో '' **ద్వీపం పురైతద్ధనదేన సృష్టమ్** '' అని కలదు. ధనదుడే ధనదపురాధిపతి. క్రీ.పూ. 3వ శతాబ్ది నాటిదైన భట్టిప్రోలు స్తూపము అట్టడుగున శాసనములలో '**కుబేరకు**'డని రాజుపేరు గలదు. ధనద, కుబేరక పదముల యర్థముల సంగతి యాలోచింపదగినది.[92]

'' తెలుగుదేశపు వైశ్యులకు 'కోమట్లు' అను పేరు కలదు. వారు కుబేర, ధనద వంశ్యులని వ్యవహారము గలదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు 'కోమటి' పదము 'గోమటీశ్వరు'డను జైన దేవత పేర నేర్పడినదని, భట్టిప్రోలి స్తూపపు కుబేరకునకు వీరికి సంబంధము గలదని రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక[93] లో వ్రాసినట్లు జ్ఞాపకము. ఈ విషయమును ప్రబల పటుపగల సాధనములను వేరొకతూరి వెల్లడింతును.'' అన్నారు శాస్త్రి గారు.

ఈ సందర్భంలో డా॥ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి గారు"The Jain Vestiges in Andhra" అనే గ్రంథంలో కోమటి - గోమట శబ్దవికారమా ? అని చర్చించిన విషయం ఉటంకిస్తాను.' It is noteworthy that ninty percent of the gifts to Jain places and tombstones setup were from the Chetty community. In the Telugu country the merchant community in called the **KOMATI**, but they are not Jains. The affinity of this sound to **GOMATA** led to some speculation as to whether they were devotees of Gomata. The association of the community with a termination **SETTY** with Kanyakaparameswari dispels the doubt, if they would be Jain. The Arya Vysyas are not Jain."[94]

పిఠాపురములోని కుక్కుటేశ్వరుడు ఒకప్పటి జైన గోమఠ విగ్రహమేనని డా॥ శ్రీపాద వారు చెబుతున్నారు.[95] " In Pithapur we hear of a Kukkuteswara, and Gomata was named Kukkuteswara because of the Kukkuta sarpas that surrounded him. Pithapur Kukkuteswara could very well have been a Gomata originally."

కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వర శతకం వ్రాశారు. 'వాసుదేవు విడిచి వసుదేవునెంతురా ?' అన్నాడు వేమన. వాసుదేవుడనగా శ్రీకృష్ణుడు. ఈయనను గురించి

చెప్పినది మహాభారత, భాగవతాలు. వసుదేవుడు కృష్ణుని తండ్రి. జైన కవియైన ధర్మసేన గణిమహత్తరుడు 'వసుదేవ హిండి' అనే కావ్యం వ్రాశాడు. అందులో వసుదేవుని గొప్పతనం వర్ణింపబడింది. వేమనకాలం నాటికి ఇంకా జైన మతం ఆంధ్రదేశంలో ఉందనటానికి పై పద్య పాదమే తార్కాణ. ఈ విషయం గుర్తించి చెప్పిన వారు 'ఆరుద్ర'. కన్నడ శాసనాలలో జైనులకు భవ్యులనే పేరు కనపడుతుంది. పాల్కురికి సోమన తన రచనల్లో జైనుల్ని ఎప్పుడూ 'భవి' అనే పేర్కొంటాడు.

''కాకతీయులు తొలి నుంచీ జైనులే. వాళ్లవంశ పురుషుడు మాధవ వర్మ యక్షేశ్వరీ దేవి దయవల్ల సైన్యసంపదను పొందాడని మేడరాజు గోవిందపురం శాసనంలో ఉంది. ఈ యక్షేశ్వరి ఎవరైనా కాకతీయులు తొలినుంచీ దిగంబర జైనాభిమానులని తెలుస్తుంది. దిగంబర జైనులే శాసన దేవతలలో షోడశ విద్యాదేవులను చిత్రిస్తారు. హేమచంద్రుడు షోడశ విద్యాదేవుల పేర్లు చెప్పాడు. ఈ షోడశ దేవులే తర్వాత తంత్రవిద్యలో ప్రవేశించారు. కాకతీయులు పూజించిన యక్షేశ్వరి ఆదిలో చక్రేశ్వరి కావచ్చు. పద్మాక్షిగా ప్రచారం పొందింది. కాకతీయ గణపతి దేవుడు జైన సంహారం చేయించాడు. ఇది వీరశైవ బోధనల వల్ల కాదు. వైదిక మతావలంబియైన తిక్కన గారి వాదపటిమవల్ల.''[96]

తమిళ భాషలో ఎన్నో జైన కావ్యాలు ఉండగా తెలుగులో ఏమీదక్కలేదంటే ఆనాటి ఆంధ్రుల మత దురహంకారమే అందుకు కారణం. మల్లికార్జున పండితారాధ్యుడు ఇతర మతాల పుస్తకాలను తగులబెట్టమని ఆదేశించాడు.

కం॥ ధ్రువముగ సర్వప్రాణుల నవశ్యమునుఁ జేయకుండునది హింసమదిన్
**శివనిందకు లగు పాపుల నవిచారిత వృత్తి జంపనగు నీశానా!** –275

కం॥ **శివనిందా విషయంబగు నవమానము సెప్పనట్టియప్పుస్తకముల్**
**అవిచారంబున గాల్పగ నవు జెప్పెడి వాని జంపనగు నీశానా!** –276

కం॥ **శివనిందారతు. జంపిన-జవమతితత్కారణమున. జచ్చిన,**
నీరెండు విధంబుల నీకారుణ్యవశంబున ముక్తిఁబొందునరుఁ డీశానా ![97] –277

తెలుగు కవులను కన్నడ భాషకు దత్తపుత్రులుగా నిచ్చిన ఘనత ఆంధ్రజైనానికే దక్కింది. కన్నడ రత్నత్రయంలోని పంప, పొన్న కవులు తెలుగులో కూడ జినేంద్రపురాణం, ఆదిపురాణం రచించినట్టు రెండు మూడు పద్యాలను తన సంకలన గ్రంథంలో ఒక అజ్ఞాత సంధాత చేర్చాడు. పంపకవి సోదరుడు జినవల్లభుడు తెలుగుకవియే. అతని గంగాధర శాసనంలో కందపద్యాలున్నాయి. ఇవే ఇప్పటికి తెలుగు భాషలో కనబడే ఆదిమకందాలు.

'చాపచిరిగినా చదరంత' అని ఎంత విధ్వంసం జరిగినా తెలుగు జీవితం పైన, తెలుగు సాహిత్యం పైన జైన ప్రభావం తగుమాత్రం మిగిలివుంది.

1) తెలుగువారి మొదటి ఛందో గ్రంథం జైనరచనే. అది మల్లియరేచన వ్రాసిన కవిజనాశ్రయం. నన్నయగారి భారతం కన్న కవిజనాశ్రయమే తెలుగు భాషలో ఆది గ్రంథమౌతుంది.

2) ఆంధ్ర సాహిత్యం అనువాద సాహిత్యంగా ప్రారంభం కావడం చేత సమకాలిక సమాజం అందులో అట్టే ప్రతిఫలించ లేదు, కాని మూలఘటిక కేతన, మంచనలాంటి వాళ్ళు జీవించిన కాలంలో తెలుగుదేశంలో జైనం ఉధృతంగానే ఉంది. అందుకే దశకుమార చరిత్రలో, కేయూర బాహుచరిత్రలో ఆ యిద్దరూ జైన పల్లెలనూ, జైన జీవితాన్నీ పేర్కొన్నారు.

3) ఆంధ్ర ప్రాచీన శతకాలలో నేటికీ సజీవమైన సుమతీ శతకం జైనరచనే.[98]

4) తెలుగులో రచింపబడిన ఏకైక జైన కావ్యం శ్రమణ బెళగొళ లో ఉంది. కాని అది ముద్రణ భాగ్యానికి నోచుకోలేదు. అన్నారు ఆరుద్రగారు. కాని ఆ గ్రంథం పేరేమిటో చెప్పలేదు. ఈ సందర్భంలో డా॥ శ్రీపాదగోపాల కృష్ణమూర్తి గారి మాటల్ని స్మరించడం సముచితం.

" The Jains made a glorious contribution to Philosophy, Grammar, Architecture, Sculpture, Literature and Painting in South India. In Telugu however we do not have many books written by Jains surviving the ravages of religious antagonism. Barring a few verses from Padmakavi's Jinendra Puranam the only book generally mentioned is in Sramana Belagola, not yet printed. The only big work **Jainendra Kalyana bhyudayam** (Dr. Raghavan tells us) lies unpublished now in Sramana belagola and only a few verses are known from Padmakavi's Jinendrapuranam."[99]

తెలుగువారి ఆచార వ్యవహారాలపై జైనుల ప్రభావం చాలా వుంది. ఉదాహరణకు 'నిత్యకల్యాణం పచ్చతోరణం'[100] అనే సామెత తీసుకొంటే ఇది జైన సంపర్కం వల్లనే పుట్టిందని చెప్పవచ్చు. జైన తీర్థంకరులకు కల్యాణోత్సవాలు జరుపుతారు. కల్యాణమంటే పెళ్లికాదు. జన్మ మొదలు కైవల్యందాకా ఉన్న అంచెలను స్మరించే జయంతులు. జైన బసదులలో నిత్యకళ్యాణాలు జరగడం బట్టి ఈ సామెత పుట్టింది.

మరొక ఉదాహరణం - తెలుగువాళ్లు వర్జ్యం చూడనిదే ఏ పనిచేయరు. ఈ విశ్వాసం యాపనీయ జైనులు ఆంధ్రులకు విడిచి పెట్టారు. లేపాక్షి చిత్రకళకు జైన చిత్రకళ ప్రోద్బలమని చరిత్రకారుల ఊహ (డా॥ శ్రీపాద వారు లేపాక్షి కళామండపము, Art of Lepakshi అని ఆంధ్ర ఆంగ్ల భాషల్లో గ్రంథాలు వ్రాశారు.)

స్త్రీల రామాయణపు పాటల్లో విడ్డూరాలవలె కనబడే ఘట్టాలు చాల వరకు రామాయణం నుండి సంక్రమించినవే. రంగనాథ, భాస్కర రామాయణాలలో కనబడే అవాల్మీకాలకు, జైనరామాయణానికీ సంబంధం ఉంది. 'మహాతలవర' అనే తెలుగు శబ్దం జైన సూత్ర గ్రంథాలలో కనబడుతుంది. ఆచార్య హేమచంద్రుని దేశినామమాలలో తెలుగుమాటలనేకం ఉన్నాయి.

ఆంధ్రజైనం గురించి పరిశోధించిన వారిలో డా॥ బుఱ్ఱా శేషగిరిరావు ఆద్యులు. వేటూరి ప్రభాకర శాస్త్రి, చిలుకూరి వీరభద్రరావు నేలటూరి వేంకటరమణయ్య, నిడుదవోలు వేంకటరావు, భావరాజు వేంకట కృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ ఎంతో కృషి చేశారు. డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు చాలా శ్రమించి ఎన్నేళ్ల పరిశోధన ఫలితంగానో యావదాంధ్ర దేశంలో ఉన్న జైన స్థావరాలను గురించి విపుల గ్రంథం వ్రాశారు. బి.ఎస్.ఎల్. హనుమంతరావు గారు తమ Religion in Andhra అనే గ్రంథంలో జైనమతం గురించి విస్తరించి వ్రాశారు. ఇటీవలి కాలంలో ఆమంచర్ల గోపాలరావు, ఆరుద్ర, ఘంటా జవహర్‌లాల్ గార్లు జైనంపై కృషి చేశారు, చేస్తున్నారు.

## పాదసూచికలు

1. L. Mukherjee, History of India, Vol. I, (Hindu period) 24th Ed., Mondal Brothers & Company Ltd., Calcutta, 1955, p-43

2. C.S. Srinivasachari and M.S. Ramaswamy Aiyangar, A History of India Part - I, (Hindu India), S. Varadachari & Co., Madras, 1952, pp 49-51.

3. జైన మత ప్రధాన సిద్ధాంతాలలో 'స్యాద్వాద' మొకటి. మహావీరుని గురించి,

   'శ్రీమత్పరమ గంభీర స్యాద్వాదామోఘలాంఛనమ్ ।
   
   జీయాత్ త్రైలోక్యనాథస్య శాసనం జినశాసనమ్ ॥ అని చెప్పబడింది.

   స్యాద్వాదమంటే ఏమిటి ? ''స్యాద్వికల్పోవాదః స్యాద్వాదః'' "The syadvada is a process of reasoning adopted by the Jainas in relation to the question of the reality or otherwise of the totality of the perceptible objects found in the phenomenal universe. This word is translatable as the "MAY-BE ARGUMENT : For instance, if we say, "Ghato'sti", it is to be noted that

Ghata is existent here in a particular place; but it is non-existent in another place. Hence, the affirmation that 'ghata is' is not absolutely but only relatively true with regard to a particular place. It is therefore, more correct to say 'ghatah Syadasti' - 'may-be that ghata is'.

Syadvada Argument involves seven steps as follows.

a) may be real (స్యాదస్తి)

b) may not be real (స్యాన్నాస్తి)

c) may and may not be real (స్యాదస్తి, స్యాన్నాస్తి)

d) may be indescribable (స్యాద్వక్తవ్య)

e) may be real and indescribable (స్యాదవక్తవ్య)

f) may be unreal and indescrible (స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాద్వక్తవ్య)

g) may be real and unreal and indescribable

(స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాద్వక్తవ్య, స్యాదవక్తవ్య)

The position represented by this argumennt is not, therefore, one of a single conclusion. This analysis is called "Saptabhangi", the analysis in seven steps. Thus, according to Jaina - darsana, reality does not exclude contradictory features. This amounts to the saying that reality is indeterminate in nature (అనేకాంత వాద). ఐకాంత వాదానికి ఎదురుతిర్గినదే అనేకాంత వాదము. దీనినే 'స్యాద్వాద మనే పేరు ప్రసిద్ధికెక్కినది.

విధ్వస్తైకాంత పక్షస్య స్యాద్వాద న్యాయవాదినః ।
దేవస్య నృపతుంగస్య వర్ధతాం తస్యశాసనమ్ ॥

అని జైనులలో గొప్ప గణిత శాస్త్రవేత్తయైన మహావీరాచార్యుని గణితసారసంగ్రహం, అవతారిక 8వ శ్లోకం

4. తాళ్లపాక అన్నమాచార్యులు, అధ్యాత్మసంకీర్తనలు, సంపుటి-2, పరిష్కర్త - గౌరిపెద్ది రామసుబ్బశర్మ, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1981, సంకీర్తన - 393, పుట - 265.

5. నిర్వాణం పొందిన జైన, బౌద్ధమునుల్ని, 'అర్హతు' అని పిలుస్తారు.

6. ''సంసారాబ్ధే పారస్యతరణే తీర్థమిష్యతే'' అని విజయసేన కృత ఆదిపురాణం. సంసార సాగరాన్ని తరించిన వానిని తీర్థుడని పిలుస్తారు. అలాంటి వారు తీర్థంకరులు. విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో శ్రీరాముడు 'తీర్థంకరుడు' గా వర్ణింపబడినాడు.

7. జినులనగా పుణ్యాపాపకర్మచయం నుండి విముక్తులైన జీవులు. అంటే జనన మరణ దుఃఖాల నుండి కర్మబంధాల నుండి విముక్తులైన పుణ్య జీవులు జినులు.

8. ఆమంచర్ల గోపాలరావు, శిల్పకళకు నవజీవన మిచ్చిన జైనమతం, ఆంధ్రపత్రిక వికారి ఉగాది సంచిక, **1959 - 60**, పుటలు **138-142**.

9. భావరాజు వెంకటకృష్ణారావు, ఆంధ్రదేశమున జైనమత వ్యాప్తి, భారతి, జూన్, **1943**, పుటలు **558-574**.

10. K.C. Jain, Lord Mahavira and his times, Motilal Banarasidass, Delhi, 1974, pp 59-61. Also see : J.C. Sikdar, Origin and development of Jaina Sangha, SAMBODHI, Ahmedabad, Vol. 13, Nos 1-4, 1984-85,pp, 111-119.

11. V.P. Johrapurkar, Bhattaraka Sampradaya, (A History of the Bhattaraka pithas especially in Western India, Gujarat and Madha Pradesh) Jivaraja Jaina Granthamala, Sholapur, 1958

12. ఎస్. శ్రీకంఠశాస్త్రి, జైన సంస్కృత వాఙ్మయము, భారతి, మార్చి **1933**, పుటలు **373-382**.

13. A. Chakravarti, Jaina Literature in Tamil, Introduction, Footnotes, Appendix and Index by Dr. K.V. Ramesh, Bharatiya Jnanapith publication, New Delhi, 1974, p -1.

14. Ibid, Intro. pVI

15. S. Gopalakrishna Murthy, Jain Vestiges in Andhra, Govt. of Andhra Pradesh, Hyderabad, 1963, p - 10.

16. Ibid pp 11 - 12

17. Chakravarthi, 11.11

18. Supra fn. No.9, Also see : D.C. Sircar, Select Inscriptions, Vol.I, University of Calcutta, 1969.
B.B. Kar, Emperor Kharavela : His Personality Vision and Achievement, pp 8-11.
N.K. Sahu, Kharavela's Hathigumpha inscription (1st C.B.C.) pp 16-20 - ORISSA REVIEW, (Kharavela Mahotsava Special Number) Vol. LV No,5, Dec. 1998.

19. Chakarvarti, p - 13

20. Ibid., pp 14-15

21. Ibid pp - 15

2. M.S. Ramaswami Aiyangar, Studies in the South Indian Jainism, Part I, Sri Satguru publications, Delhi, 1922/1982.

3. Chakravarti, pp - 15-16.

4. D. Sourirayan, A Note on the Sangam Age, The Tamilian Antiquary, Vol. II No.1, New Delhi 1913/1986, pp 13-16.

5. Chakravarti, p - 16.

6. Supra fn No.9

7. వేటూరి ప్రభాకరశాస్త్రి,(ed.) నీతి ద్విషష్టికా, సుందరపాండ్య విరచితమ్, ఆంగ్ల పీఠిక – మానవల్లి రామకృష్ణ కవి. సంస్కృత పీఠిక – వేటూరి ప్రభాకరశాస్త్రి, వేటూరి పీఠికకు తెలుగు అనువాదం – పుల్లెల శ్రీరామచంద్రుడు, హైదరాబాద్. 1st Ed., 1928, 2nd Ed., 1986.

8. Ibid., వేటూరి వారి పీఠికలు Vol.I,1985 పుట i - vii,

9. A. Chakravarti, P-16 (Ibid., Fn. No.13)

0. P.B. Desai, Jainism in South India, 1957, pp 48-49.

1. Journal of Bombay Branch of Asiatic Society (JBBAS) Vol. XVII, No. xlvi, p-74, also see P.T. Srinivasa Aiyangar, History of Tamils, 1929, p-247.

2. T.V. Sadasiva Pandarattar, A History of Tamil Literature (260-600 AD), 1957, pp 26-27.

3. సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, హైదరాబాదు, 1980

4. Ibid, రాళ్లపల్లి పీఠిక, చూ॥ రాళ్లపల్లి పీఠికలు, బెంగళూరు, 1978,పుట – 297.

5. తిమ్మావజ్ఝల కోదండరామయ్య, నత్కీరుని కథ – కొన్ని విశేషములు, భారతి, నవంబరు, 1960, pp 18-25.

6. చల్లా రాధాకృష్ణశర్మ, తమిళవేదకర్త – తిరువళ్లువ నాయనార్, భారతి, మార్చి, 1954 pp 282-285

7. మల్లంపల్లి సోమశేఖర శర్మ, మన ప్రాచీన విద్యాసంస్థలు, చూ॥ అమరావతీ స్తూపము – ఇతర వ్యాసములు మద్రాసు, 1932, పుటలు 57–59.

8. ఆరుద్ర, ఆంధ్రులపై జైనమత ప్రభావం – జైన మతానికి ఆంధ్రుల సేవ, ఆంధ్రపత్రిక సిద్ధార్థి సంవత్సరాది సంచిక, 1979–80, పుటలు 7–12.

39. S. Gopalakrishnamurthy, Jain Vestiges in Andhra, Hyderabad, 1963, Appendix - ii.

40. "Vimaladitya's religious guru was TRIKALAYOGI SIDDHANTA DEVAR. The special title Trikalayogi (one who knew the past, present and future.) is noteworthy. This guru belonged to the **desigana**, the South Indian group and was a **Digambara**. He visited the Durgakonda Jain establishmennt at Ramatirtham and left an inscription there. Till his advent to the Northern Andhra Country, standing (naked) Jinas do not appear to have been carved there. The incised sketch of a Jaina monk in the Kayotsarga pose by the side of his inscription on Durgakonda was the beginning and thereafter some naked Jina figures were carved in the round. In that very same establishment there are to be seen today three figures of standing one Jines unfortunately broken." (ibid page - 48)

41. ibid., page -87

42. నిడుదవోలు వేంకటరావు, నన్నయయుగమునాటి ఆంధ్రవాఙ్మయము (క్రీ.శ. 1000-1100) ఆంధ్రపత్రిక వికృతి సంవత్సరాది సంచిక, 1950 -51, పుటలు 128-142.

43. See : Foot Note No. 39 pp 47-48.

44. See : Foot Note No. 35

45. విశ్వనాథసత్యనారాయణ, పద్యవిద్య - నన్నయ ఆదిపర్వ పీఠిక, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్, 1970, పుట - viii

46. కోరాడ రామకృష్ణయ్య, ఆంధ్రకవితాసంప్రదాయములు - కృత్యాది, భారతి, ఫిబ్రవరి, 1935, పుటలు 223-229.

47. కోరాడ రామకృష్ణయ్య, ఆంధ్రకవుల అవతారికలు, భారతి, డిసెంబరు, 1944, పుటలు 527-535.

48. దివాకర్ల వేంకటావధాని, నన్నయ అవతారిక, ఆంధ్రపత్రిక దుర్ముఖి సంవత్సరాది సంచిక, 1956-57, పుటలు, 55-60.

49. See : Foot Note No. 46

50. రవ్వా శ్రీహరి, అవతారిక - ప్రాకృతాంధ్రసాహిత్యాలు, అభినందన, ఆచార్య తూమాటి దోణప్ప షష్టిపూర్తి సంచిక, 1987, పుటలు 177-185.

50 (a) J.F. Fleet, Ed., Nilgund Inscription of the time of Amoghavarsha I, 866 A.D. - Epigraphia India, Vol VI, 1899 - 1900, pp 98 - 108.

51. M. Rangacharya, ed., Ganitasarasangraha of Mahaviracharya, Sanskrit text with English translation and Notes, published by Government of Madras, Madras, 1912

52. వేటూరి ప్రభాకర శాస్త్రి, (సంపా.) సారసంగ్రహ గణితము, పావులూరి మల్లన (మల్లికార్జున) ప్రణీతము, పరికర్మ, భిన్న (కలాసవర్ణ) గణితములు 1,2 అధ్యాయాలు, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ సీరీస్ సంఖ్య - 38, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1952.

తిమ్మావజ్ఝల కోదండరామయ్య, (సంపా.) సారసంగ్ర గణితము పావులూరి మల్లన, ప్రకీర్ణకగణితము, 3వ అధ్యాయం, భారతి, జూలై పుటలు 77-81, సెప్టెంబరు పుటలు 261-268, 1953.

తిమ్మావజ్ఝల కోదండరామయ్య, (సంపా.)సారసంగ్రహ గణితము పావులూరి మల్లన, త్రైరాశికము, 4వ అధ్యాయం, భారతి, మార్చి పుటలు 60-64, ఏప్రిల్ పుటలు - 81-82, 1961: మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం (G.O.ML., Madras) లో పావులూరి మల్లన వ్రాసిన సారసంగ్రహ గణితం యొక్క తాళపత్ర ప్రతులు పదమూడు (సంఖ్యలు డి 2283 నుండి డి 2295) కాగితపు ప్రతి ఒక్కటి (సంఖ్య డి 2282) మొత్తం 14 వ్రాతప్రతులు లభిస్తున్నాయి. (చూ॥ Descriptive catalogue of Telugu Mannscripts, Vol X Ganita and Jyotisha, GOML, Madras, 1949) ఇందులో డి 2282 సంఖ్య గల ప్రతి నుండి డి 2287, మరియు డి 2289 ప్రతి వరకు మొత్తం 7 ప్రతుల్లో గద్యభాగం (Colophon) ఉండగా వేటూరి ప్రభాకరశాస్త్రి గారి ముద్రిత గ్రంథంలో 'గద్య' భాగం లేకపోవడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. అది శ్రీ శాస్త్రి గారి మరణానంతరం అచ్చు కావడం చేత ముద్రణ కార్యం వహించిన వారి పొరబాటైయుండవచ్చు. GOML సూచికలు తయారుచేసింది, శ్రీ శాస్త్రి గారే ననడం జగత్ప్రసిద్ధం.

పై 14 వ్రాతప్రతుల్లో డి 2295, డి 2296 సంఖ్యలు గల ప్రతులు మల్లన రచనలు కావని తిమ్మావజ్ఝల వారు తేల్చారు. డి 2287 అనే సంఖ్యగల ప్రతి మల్లన గ్రంథాన్ని ఉద్ధరించడానికి తోడ్పడే సమగ్రప్రతి. దీనిలోనే దాక్షారామ భీమేశ్వర స్వామి ప్రసక్తి ఉంది. మల్లన శైవ భక్తి కిది తార్కాణం.

ఇంతకీ మల్లన తాళపత్ర ప్రతుల్లోని గద్యభాగం (Colophon) ఇలా వుంది.

" ఇది **శ్రీవీరాచార్యకృత** పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహగణిత శాస్త్రంబు నందు సంజ్ఞాధికారము."

" ఇది **శంకర పదకమల మధుకరాయమాణ పావులూరి మల్లికార్జున భట్ట** ప్రణీతంబైన సారసంగ్రహ గణిత ప్రకారంబు నందు గుణకార, భాగహార, వర్గ, వర్గమూల, ఘన, ఘనమూల, సంకలిత, వ్యుత్కలితంబన జెప్పనొప్పు నెనిమిది పరికర్మంబుల యందు సకలాధికారంబులకు సమయంబులై ప్రవర్తిల్లు ప్రథమ గుణకార సూత్రం బెట్టిదనిన."

"ఇది **శ్రీ వీరాచార్యకృతౌ** పావులూరి మల్లనార్య ప్రణీతంబైన సారసంగ్రహగణిత శాస్త్రంబునందు ప్రథమ పరికర్మ గణితంబు నందు ప్రథమ గుణకారం సమాప్తము."

తిరుపతి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్యపరిశోధన సంస్థ గ్రంథాలయంలోని **6760** అనే సంఖ్య గల తాళపత్ర ప్రతిచివర గద్య (Colphon)యిలా వుంది. " ఇది **వీరాచార్యవిరచితౌ** పావులూరి మల్లికార్జున ప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు గుణకారం సమాప్తం."

తాళపత్ర ప్రతుల్లోని గద్య భాగాల్లో 'వీరాచార్యుని' ప్రసక్తి కనబడుతుండగా శ్రీ శాస్త్రిగారి గ్రంథానికి (1952) ఆంగ్లంలో వ్రాసిన పి. వి. రామానుజస్వామి గారు, **" The contents of the different chapters of Sarasangrahaganitamu closely follow those of Mahavira Charya's Ganitasarasangraham.** Some of the chapters in the Telugu work have no parallel in the Sanskrit Prototype. This much we can say with confidence that Mallana atleast got his inspiration from the Sanskrit author, although **Mallana no where refers to the earlier Sanskrit work.**" (page - iii) అని వ్రాయడం పరిశీలింపదగింది. మల్లన తన రచనలో కొంత స్వేచ్ఛ పాటించిన మాట నిజమే. దానినే, శ్రీ శాస్త్రి గారి గ్రంథానికి వ్రాసిన శ్రీ ఎ. నరసింహరావు గారు " Instead of giving the weights and measures prevailing in the **Magadhadesa** as given in the original, he (Mallana) gave the weights and measures that are in use in **Andhradesa** in his time." (1957) అని వ్రాయడం గమనింపదగింది.

53. పావులూరి మల్లన వ్రాసిన సారసంగ్రహగణితం తాళపత్ర ప్రతుల్లోను, తిమ్మావజ్ఝల వారు పరిష్కరించి ప్రచురించిన ప్రకీర్ణక గణితం (3వ అధ్యాయం) ప్రారంభంలోను, త్రైరాశిక గణితం (4వ అధ్యాయం) లోను శివస్తుతులైన సంస్కృతశ్లోకాలే లభిస్తున్నాయి.

శ్లో॥ యస్మాత్త్వముద్భవతి విశ్వమధావ (భాతి)
యత్రస్థితించ లయమేతి పునశ్చయత్ర ।

తం సర్వహేతు నిఖిలామర వేదవేద్యం
బ్రహ్మాస్వ (రూపి) ణ మహం ప్రణమామి భక్త్యా ॥

ఇది మల్లన వ్రాసిన శివస్తుతి. మహావీరాచార్యుని గ్రంథంలో ప్రకీర్ణ వ్యవహారం లో రెండు శ్లోకాలు జిన స్తుతులని వేరుగా చెప్పవలసిన పనిలేదు. దీనిని తిమ్మావజ్ఝల వారు కూడ పాదసూచికలో గుర్తించి యున్నారు.

54. నాల్గవ అధ్యాయమైన త్రైరాశిక ప్రకరణంలో మల్లన శివస్తుతి యిట్లున్నది.

శ్లో॥ త్రైలోక్య మధ్యగత వస్తు సమస్త మేత
త్తృషాద్యధాకరతలా మలకం విభాతి ।
యేన్యా ప్రమేయ పతికుర్య సుదా – ర్తి (?)
తం శాశ్వతం శివమహం ప్రణమామి భక్త్యా ॥

మూలకారుడు జైన మతస్థుడు కావడం చేత అక్కడ అధ్యాయ ప్రారంభలోని జినస్తుతి ఇలా వుంది.

శ్లో॥ **త్రిలోక** బన్ధవే తస్మై కేవల జ్ఞాన భానవే ।
నమః శ్రీవర్ధమానాయ నిర్ధూతాఖిల కర్మణే ॥

త్రైరాశిక గణిత ప్రారంభం కావడం చేత రచయిత లిద్దరు తమ ఇష్టదేవతాస్తుతి లో త్రిలోక, త్రైలోక్య అని త్రిసంఖ్య ప్రస్తావించడం యిక్కడ గమనింపదగింది.

55. వేటూరి ప్రభాకర శాస్త్రి గారిచే నిర్మించబడిన, మద్రాసు పాచ్య లిఖిత గ్రంథాలయం లోని వర్ణనాత్మక సూచికలో (Descriptive catalogue of Telugu Manunscripts Vol. X, 1949 పుటలు **2573–2574**) మల్లన వంశవృక్ష మిట్లున్నది




దీనికి వివరణ వ్రాస్తూ ''ఇందు సివ్వన పుత్రుడగు మొదటి మల్లన యాంధ్ర నృపశేఖరుడైన రాజరాజ భూపాలకునిచే పీఠికాపురము దగ్గఱ 'నవఖండవాడ' ను అగ్రహారముగా బడసినవాడు. సివ్వనకు, గౌరమకు గుమారుడైన రెండవ మల్లన ప్రస్తుత గ్రంథమునకు కర్త.'' పై వివరణ సూచికకు Introduction వ్రాస్తూ టి. చంద్రశేఖరన్ "Pavaluru Mallana

lived about fifty year after Nannaya, the author of Telugu Mahabharata in the 11th Century A.D., It was Mallana I, the son of Sivanna, who obtained a grant of the village Navakhandavada near Pithikapuram (Pithapuram) from the Telugu King Rajarajanarendra. Malana - II son of Sivanna and Gaurma is the author of this work." నేను కూడ మల్లనను నన్నయకు తర్వాతి వాడుగనే నిర్ణయించడం చేతనే నన్నయ అవతారికను మల్లన ఎంత బాగా అనుసరించినాడో పోలుస్తూ వ్రాయడం జరిగింది.

56. శ్లో॥ వరం కూప శతాద్వాపీ – వరం వాపీ శతత్క్రతుః ।
వరం శతక్రతాత్పుత్రః – సత్యం పుత్రా శతాద్వరమ్ ॥

శ్లో॥ అశ్వమేధసహస్రంచ – సత్యం తులయాధృతమ్ ।
అశ్వమేధ సహస్రాద్ధి – సత్యమేవ విశిష్యతే ॥

శ్లో॥ సర్వవేదాధి గమనం – సర్వతీర్థావగాహనమ్ ।
సత్యం చ వదతో రాజన్ – సమం వాస్యాన్న వా సమమ్ ॥

- Mahabharata, Adiparva ed., V.S. Sukthankar, BORI, Poona, 1973, Vol -I, Adh. 69 - slokas 20-23, pp 313 - 314.

57. Mahabharata, Aranya Parva Vol. II, ed., V.S. Sukthankar, BORI, Poona, 1942.

58. ఆంధ్ర మహాభారతము – పరిష్కృతముద్రణము – ఆదిపర్వం – శకుంతల ధర్మబోధ, ఆశ్వా 4–79–98 పద్యాలు, అరణ్యపర్వం – కౌశిక ధర్మవ్యాధ సంవాదం – ఆశ్వా 5–7–146 పద్యాలు.

59. ''తత్ర కిం ప్రతి భాతి తే'' అనే ప్రశ్నార్థక మకుటంతో సంస్కృత భారతంలో ప్రతి పక్షియైన జైనుణ్ణి నిలదీసి ప్రశ్నిస్తున్నాడు, భంగ్యంతరంగా బ్రాహ్మణ ధర్మవ్యాధ సంవాదంలో వ్యాసమహర్షి.

శ్లో॥ కృషిం సాధ్వితి మన్యంతే తత్ర హింసా పరాస్మృతా ।
కర్షంతోలాంగలైః పుంసో **ఘ్నంతి భూమిశయాన్బహూన్ ॥**

శ్లో॥ ధాన్యబీజాని యాన్యాహు వ్రీహ్యాదీని ద్విజోత్తమ ।
సర్వాన్యేతాని జీవాని **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ అధ్యాక్రమ్య పశూంశ్చాపి ఘ్నంతి వైభక్షయంతి చ ।
వృక్షానథౌషధీ శ్చైవ ఛిందంతి పురుషాద్విజ ॥

శ్లో॥ జీవా హి బహవో బ్రహ్మన్వృక్షేషు చ ఫలేషు చ ।
ఉదకే బహవశ్చాపి **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ సర్వం వ్యాప్తమిదం బ్రహ్మన్ప్రాణిభిః ప్రాణిజీవనైః ।
మత్స్యాగ్రసంతే మత్స్యాంశ్చ **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ సత్త్వైః సత్త్వాని జీవంతి బహుధా ద్విజసత్తమ ।
ప్రాణినోఽన్యోన్య భక్షాశ్చ **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ చంక్రమ్యమాణా జీవాంశ్చ ధరణీ సంశ్రితాన్బహూన్ ।
పద్భ్యాం ఘ్నంతి నరా విప్ర **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ ఉపవిష్టాః శయనశ్చ ఘ్నంతి జీవాననేకశః ।
జ్ఞాన విజ్ఞానవంతశ్చ **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ జీవైర్గ్రస్తమిదం సర్వమాకాశం పృథివీతథా ।
అవిజ్ఞానాచ్చ హింసంతి **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ అహింసేతి యదుక్తం హి పురుషైర్విస్మితైః పురా ।
కేన హింసంతి జీవన్వై లోకేఽస్మిన్ద్విజ సత్తమ ॥

శ్లో॥ బహుసంచిన్త్య ఇహవై నాస్తి కశ్చిదహింసకః ।
అహింసాయాం తు నిరతాయుతయో ద్విజసత్తమ ॥

శ్లో॥ కుర్వన్త్యేవ హి హింసాతే యత్నాదల్పతరాభవేత్ ।
బహులోకే విపర్యస్తం దృశ్యతే ద్విజసత్తమ।
ధర్మయుక్తమధర్మం చ **తత్రకిం ప్రతిభాతి తే ?**

శ్లో॥ వక్తుం బహువిధం శక్యం ధర్మాధర్మేషు కర్మసు ।
స్వకర్మనిరతో యో హి స యశః ప్రాప్నుయాన్మహత్ ॥

- Mahabharata, Aranyaparvam, Vol. II, Adhyaya 199, Slokas 19-34 BORI, Poona, 1942.

60. i) Shad - darsana - Samuccaya of Haribhadrasuri ( A Compendium of Six Philosophies) English translation and Notes. Prof. K. Satchidananda Murthy, Eastern Book Linkers, Delhi, 1957/1986

ii) Haribhadrasuri's Shad - darsana - Samnccaya Edited with English translation and critical notes by M. Sivakumaraswami, Prasaranga, Bangalore University, Bangalore, 1977.

61. వేటూరి ప్రభాకర శాస్త్రి, నన్నయకు c బూర్వము ఛందస్సు, శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, (సంపా.) భావరాజు వేంకట కృష్ణారావు, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధక మండలి, రాజమహేంద్రవరము, 1922 పుటలు 29-33

''ద్రావిడ భాషలో **'యాప్పిరంగలమ్'** అను చందో గ్రంథము పదునొకొండవ శతాబ్దిది గలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్ర ఛందస్సుల ప్రస్తావమున్నది. **'వాంఛియార్ శెయిద వడఘు చందవుం''** అని యందున్నది. అనగా **'వాంఛియ రచించిన తెలుగు ఛందమును''** జూచి తానా గ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలో గలదు, ద్రావిడ నిఘంటు కార్యాలయమున విద్వాంసులుగా నున్న శ్రీమూ. రాఘవయ్యం గారు దీనిని గుర్తించిరి. శ్రీ రంగస్వామి సరస్వతి గారి వలన నిది విని శ్రీ రాఘవయ్యం గారిని గలసికొని సరిగా విచారించితిని. **'వాంచియ'** యను నాంధ్రచ్ఛందః ప్రణేత మనకు తెలియరాకున్నాడు. ప్రాచీన ప్రతుల లిపిరీతిని బరిశీలించి వారు **'వాంచియార్'** అను పదము **'రేచియార్'** గా నుండదగుననిరి. కొన్ని సంస్కృత శబ్దములు గూడ నందిట్లే వికృతిని బొరసియున్నవి. **'రేచియార్'** అని యగునేని యాగ్రంథము రేచియ (రేచన) రచియించిన కవిజనాశ్రయ మగును. **ఆద్రావిడ గ్రంథకర్త జైనుడు. ఈ రేచియయును జైనుడే.** ఇది యొక పొందిక యగును. ఇట్లగునేని కవిజనాశ్రయము పదునొకొండవ శతాబ్దికి దర్వాతిది కాకపోవును. కవిజనాశ్రయము కాకున్నచో మఱియేదో **వాంచియ** రచించిన ఛందోగ్రంథ మొకటి యా కాలమున నుండెనని యాద్రావిడఛందో గ్రంథము చెప్పుచున్నది. **ఆ ద్రావిడ గ్రంథ రచనాకాలము నన్నయకు .బూర్వమో పరమో స్పష్టముగా నాకు తెలియరాలేదు. అతడు నన్నయ కంటెబ్రాచీనుడగునేమో!''** (పుటలు 30–31)

ఇక్కడ నా పరిశోధనలో తటస్థపడిన అంశాలను మనవి చేస్తాను. 1) తమిళ ఛందో గ్రంథం పేరు 'యాప్పరుంగలమ్' అని తాళపత్ర, ముద్రితప్రతుల్లో వ్రాయబడివుంది. అంతే తప్ప, వేటూరివారన్నట్లు 'యాప్పిరంగలమ్' కాదు. 2) 'యాప్పరుంగలమ్' గ్రంథ కర్త పేరును వేటూరి వారు చెప్ప లేదు. ఈ తమిళ ఛందోలక్షణ గ్రంథ కర్త పేరు అమృతసాగరర్, అమృత సాగరనార్, అమృతసాగర మునివర్, అముద సాగరనార్, అమిదసాగరర్, అని ముద్రిత గ్రంథాలలో కన్పడుతున్నాయి. ఈ గ్రంథం తొలిసారిగా క్రీ.శ. 1862 లో ముద్రితమైనట్లు తెలుస్తోంది. కాని, ప్రతులు లభించడం లేదు. నాకు Longmans, Green & Co.,167, మౌంట్ రోడ్ మద్రాసు వారు క్రీ.శ. 1916 లో రావుబహదూర్ ఎస్. భావానందం పిళ్లై. సంపాదకత్వంలో వెలువడిన రెండు సంపుటాలు ( Vol I 1916, Vol. II 1929) లభించాయి. దీని తర్వాత 1938 నుండి 1960 లోపల ఏడెనిమిది సార్లు 'యాప్పరుంగలమ్' వివిధ పరిష్కర్తలచే, ముద్రాపకులచే ప్రచురింపబడింది. 1960 లో మద్రాసు ప్రభుత్వం ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ సీరీస్ సంఖ్య – 66 గా, విద్వాన్ ఎం.వి. వేణుగోపాల పిళ్లై అమృతసాగరనార్ రచించిన 'యాప్పరుంగలమ్' చక్కగా ప్రాచీన వ్యాఖ్యానంతో సహా పరిష్కరించి, వివిధ సూచికలతో ప్రచురింపజేసినారు. వ్యాఖ్యాత పేరు చెప్పలేదు. గ్రంథాలకు, గ్రంథకర్తలకు, పండితుల పేర్లకు, స్థలనామాలకు సూచికలు తయారు చేశారు గాని వాటికి పుటల సంఖ్యలు యివ్వక పోవడం వల్ల ప్రయోజనం లేక పోయింది. ఈ ముద్రణలో **వాంఛియార్** పేరు వ్యాఖ్య (ఉరై) లో వస్తున్నట్లు సూచికలో నమోదు కాబడింది కాని పుట సంఖ్య యివ్వ లేదు.

3) 'యాప్పరుంగలమ్' వ్రాసిన గ్రంథకర్త తన పేరు స్పష్టంగా 'అమృతసాగర మునివర్' అని చెప్పుకోలేదు. కాని, దీనిపై 'వృత్తి' వ్రాసి గుణసాగరుడు, ఉపోద్ఘాతంలో - "**కడర్ పెరయరున్దవత్తోనే**" "**ఉత్కృష్టమైన తపస్సు చేత సముద్రమే పేరుగా గలవాడు**" అని గ్రంథకర్త పేరును సూచించినాడు. ఇతని అసలు పేరు 'అమృతసాగరనార్' అని తొలిసారిగా లోకానికి తెలిపినవాడు 'వీరశోళీయమ్' అనే తమిళ వ్యాకరణ గ్రంథానికి వ్యాఖ్య వ్రాసిన పెరుందేవనార్. వీరశోళీయమనే వ్యాకరణకర్త పేరు బుద్ధమిత్రుడు. ఇతడు బౌద్ధ మతస్థుడు. ఇతడు క్రీ.శ. 1064 - 1113 మధ్య కాలంలో తమిళనాడును పరిపాలించిన వీరచోళ లేక మొదటి కుళోత్తుంగ చోళుని రాజ్యంలో **పన్పట్రియూర్** అనే పట్టణానికి అధిపతిగా ఉండినవాడు. ఇతడు బౌద్ధమతావలంబియైనప్పటికీ రాజ సేవాసక్తుడు కాబట్టే తన గ్రంథానికి రాజు పేరు మీదుగా 'వీరశోళీయమ్' అనే పేరు పెట్టినాడు. వీరశోళీయమ్ పై వ్యాఖ్య వ్రాసిన 'పేరుందేవనార్' బుద్ధమిత్రుని శిష్యుడు. బుద్ధమిత్రుడు 'యాప్పరుంగలమ్' గ్రంథాన్ని ప్రస్తావించగా, దాని గ్రంథకర్త 'అమృతసాగరనార్' అని వీరశోళీయ వ్యాఖ్యాత పేరుందేవనార్ చెప్పినాడు.

4) దీనిని బట్టి, 'యాప్పరుంగలమ్' క్రీ.శ. 11వ శతాబ్దికి పూర్వగ్రంథమేనని స్పష్టమౌతున్నది. వేటూరి వారు "ఆ ద్రావిడ గ్రంథ రచనాకాలను నన్నయ పూర్వమో పరమో నాకు స్పష్టముగా తెలియడం లేదు." అని వ్రాసినారు. ఇప్పుడు నేను దీని కాలనిర్ణయం చేయడానికి ప్రయత్నిస్తాను. 'యాప్పరుంగలమ్' పై 'వృత్తి' ని వ్రాసిన గుణసాగరుడు తాను పల్లవమల్లుని రాజ్యకాలంలో ఉన్నట్లు చెప్పికొన్నాడు. ఈ రాజు పూర్తి పేరు రెండవ నందివర్మన్ పల్లవమల్లుడు. ఇతడు క్రీ.శ. 730-804 మధ్య కాలంలో 65 సంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు. కాబట్టి, 'యాప్పరుంగలమ్' పై వృత్తికారుడైన గుణసాగరుడు క్రీ.శ. 8వ శతాబ్ది పూర్వార్ధంలో ఉన్నట్లు స్పష్టమైంది. ఇతడే తన వృత్తి (ఉరై) లో "**వాంఛియార్ శెయ్ద వడుగచ్ఛందవుమ్**" అని పేర్కొన్నవాడు. **'రేచియార్'** అనడానికి పొరబాటుగా వ్రాయసకాడు **'వాంచియార్'** వ్రాసివుండవచ్చు. **'వడుగచ్ఛంద'** మనగా 'తెలుగు ఛందోగ్రంథ' మని పేరు. కాబట్టి గుణసాగరుడు తన సమకాలీనుడు, జైన మతస్థుడైన 'మల్లియరేచన' వ్రాసిన కవజనాశ్రయాన్ని పై వాక్యంలో సూచిస్తూఉన్నాడన్నది, వేటూరి వారి అభిప్రాయమే కాదు, నా అభిప్రాయం కూడ. కవిజనాశ్రయం నన్నయకు పూర్వ గ్రంథమే!.

5) "ఆ ద్రావిడ గ్రంథకర్త జైనుడు. ఈ రేచియయును జైనుడే. ఇది యొక 'పొందిక' యగును." అన్నారు వేటూరి వారు. నిజమే. 'అమృతసాగరర్' అనే పేరు తమిళ కవులు సామాన్యంగా పెట్టుకోరు. ఇతడు 'జైనముని' కావడం చేత 'అమృతసాగరమునివర్' అని పిలువబడ్డాడు. ఇలాగే, 'యాప్పరుంగలమ్' పై వృత్తి వ్రాసిన 'గుణసాగరుడు' కూడ జైనుడే. ఇతడు అమృతసాగరుని పుత్రుడో శిష్యుడో అయివుంటాడు. అందుకే, ఆంధ్రదేశంలో జినవల్లభుడనే వాచకాభరణుని సహాయంతో తెలుగులో తొలి ఛందో లక్షణ గ్రంథాన్ని వ్రాసిన జైనుడైన మల్లిరేచన గ్రంథాన్ని జైనుడైన గుణసాగరుడు **వాంచియార్ (రేచియార్) శెయ్ద వడుగచ్ఛందవుం**" అని పేర్కొనడం జరిగిందని నా నిశ్చితాభిప్రాయం.

6) జైనులు, బౌద్ధులు శాస్త్రకారులు, లక్షణ గ్రంథకర్తలు అనడం ఒక్క తెలుగుభాషకే కాదు తమిళ భాషలోను ఈ మాట చెల్లుబడి అవుతున్నది. దీని చేత, నన్నయకు పూర్వమే క్రీ.శ. 8వ శతాబ్ది పూర్వార్థంలోనే తెలుగులో ఛందోలక్షణ గ్రంథం వెలువడిందని, అది జైనుడైన మల్లియరేచన వ్రాసిన 'కవిజనాశ్రయ' మని నిర్ణయింపబడుతున్నది.

7) 'యాప్పరుంగలమ్' ఛందో గ్రంథంలో 96 సూత్రలున్నాయి. ఇవి. ఒకపాదం నుండి ఇరవై యొక్క పాదాలు వరకున్నవి. సూత్రగ్రంథాన్ని మాత్రమే ముద్రిస్తే ఆరు లేక ఏడు పుటలలో వస్తాయి. దీనిపై 'కారిక' లు కూడా వ్రాయబడ్డాయి. సూత్రములు, కారికలు రెండూ వ్రాసినవాడు అమృతసాగరుడే. వృత్తికారుడు, గుణసాగరుడు. ఈ వృత్తి ముద్రణలో సుమారు 600 పుటలు విస్తరించియుండడం చేత ఈ ఛందో గ్రంథానికెంతో ప్రశస్తి, ప్రాచుర్యాలు ఏర్పడ్డాయి. వీరిద్దరూ జైన రచయితలు కావడం విశేషించి గుర్తింపదగింది.

8) 'యాప్పరుంగలమ్' జైన గ్రంథం. అమృతసాగరమునివరుడు జైనమతంలోని 'యాపనీయసంఘాని' కి చెందిన వాడుగా ఉంటాడు. ఎందుకంటే, తమిళనాడులోని, చెంగల్పట్టు జిల్లా లోగల 'కీరప్పాక్కమ్' అనే ఊరు జైనుల యాపనీయసంఘానికి స్థానం. దీనికే 'కుమిలగుణ' మని కూడ పేరు అని ఆచార్య చక్రవర్తి గారు వ్రాశారు. 'యాప్పరుంగలమ్' అనే పదంలో 'యాప్పు' = చెయ్యుళ్ అనగా కవిత్వము (Poetry) అరుంగలమ్ = అలంకారం అనగా ఆభరణము (Ornament). కవిత్వానికి ఛందస్సు మూలం కనుక 'ఛందో ఉలంకారము' 'కవితాలంకారము' 'కవిత్వాభరణము' అని దీనికి అర్థాలు. తెలుగులో జైనుడైన మల్లియరేచన 'కవిజనాశ్రయము' అని పేరు పెట్టినట్లు అమృతసాగరుడు 'కవితాలంకారము' లేక ఛందోఉలంకారమనే అర్థం గల 'యాప్పరుంగలమ్' అనే నామకరణం చేశాడు.

9) తమిళులు అత్యంత గౌరవంతో తమ స్వంత ఆస్తిగా చెప్పుకొనే 'తొల్కాప్పియమ్' అనే వ్యాకరణ గ్రంథం రచించినది కూడ జైనుడే " Tolkappiyar in considered to be a Jaina". అని డా॥ కోరాడ మహదేవ శాస్త్రి గారు Historical Grammar of Telugu (పుట 430) లో వ్రాశారు. అందుకే దీని రచయిత ఎవరో వారు చెప్పరు. నిగ్గదీసి అడిగితే 'తొల్కాప్పియనార్' అంటారు. అది రచయిత పేరు కాదు. 'తొల్కాప్పియమ్ వ్రాసిన వాడు' అని దీని కర్థం. ఈ సందర్భంలో ఏ మాట కామాటే చెప్పుకోవారి. మన పూర్వీకులైన తెలుగువారి వలె మూర్ఖంగా జైన, బౌద్ధులు వ్రాసిన గ్రంథాలను, తమిళులు కాల్చివేయక, గ్రంథ కర్తలపేర్లను మఱుగుపరచి, తమిళ భాషా సాహిత్య ప్రాచీనతను చాటుకొన్నారు. తమిళులు జైన వధలు చేసినప్పటికీ, గ్రంథాలను నిర్మూలనం చేయలేదు. తెలుగు వారీ రెండు పనులు చేసి చరిత్ర హీనులయ్యారు.

తమిళులెంత తెలివితేటలతో తమ ప్రాచీనత్వాన్ని చాటుకొన్నారో 'యాప్పరుంగలమ్' పరిష్కరించి ప్రకటించిన ఎస్. భావానందం పిళ్ళై గారి మాటల్లో విందాం." The oldest and the most valuable treatise that gave a scientific treatment to the study of Versification

in Tamil genius which is called **Tolkappiyam.** There is ample evidence to show that **the composition of this great work took place much anterior to the eventful period of the great Mahabharata war and the submergence of the continent Lemuria**. At that ancient period the Tamils were a highly cultured, civilised and independent nation and were free from the influence of the Aryans and their language also was in its pristine purity and had a rich and extensive literature of its own an is manifest from the commentaries of Adiyarkkunallur and others being written at that antique age, Tolkappiyam devotes its chapter on versification to the study of those metres which are the exclusive property of the Tamils."

In the medieval period in the history of Tamil land was one of great religious activitiy a period in which the **Saiva** and **Vaishnava** religion on the one side and the **Jainism** and the almost dying **Buddhism** on the other were struggling for supermacy and sometimes for mere existence - a period in which, as a result of the mingling of the **Aryans** with the **Tamils**, the colloquial as well as the literary language of the latter underwent a marked change. Into the old Tamil metre of Kali, Agavals certain modifications were introduced so as to make them a little more free and flexible to include with in them the religious ideas and chant the new formed hymns in the conventions of the devout people. **The taste for geuine Tamil Poetry fell of on account of this religious upheaval and the old Tamil metres that emboided so many priceless poetic ideas, fell into disuse. The more the tendencies of the time inclined the people towards religions the more artificial the poetry became** (Editorial preface, Pages v - viii) (1916).

**10)** ఈ సందర్భంలో రాజరాజనరేంద్రుని పట్టాభిషేక స్మారకమహోత్సవానికి **1922**లో రాజమహేంద్రవరంలో అధ్యక్షస్థానం వహించిన డా॥ కట్టమంచి రామలింగారెడ్డి గారి వాక్యాలు స్మరణీయములు.'' ఇక, బౌద్ధులు, జైనులు వ్రాసిన దేశ భాషా గ్రంథము లేమాయెను ? ఆ మతములు దక్షిణదిక్కునకు వ్యాపించునప్పటికి వానిని పాలీభాష పావన భాషగా నేర్పడినందున బహుశః తెనుగున నెక్కువగా వ్రాయరైరేమో! **వ్రాసిన కొన్నింటిని ఆ మతస్థుల రూపుమాపినట్లే, మన వర్ణ ధర్మతక్షకులు ధ్వంసము చేసియుందురు. వేరు కారణములు మృగ్యము.''**

''అట్లయిన రాజరాజు కాలములో తెనుగున భారతము వంటి ప్రమాణగ్రంథము అనగా హిందూమత ప్రకారము ప్రమాణమైనయది రచింపబడుట యెట్లు సంభవించెను ? బౌద్ధులు, జైనులు మొదలగు వేదనిరాకరణ వాదులు తమ తమ మతములలో జనులను జేర్చికొనవలయునను ఉద్దేశ్యముతో మాతృ భాషలలో గ్రంథములు వ్రాసి వానికి వ్యాప్తిని, ప్రసిద్ధిని వడసి యుందురు. బౌద్ధుల గ్రంథము లనేకములు 'మాగధి' (Sic) యను ప్రాకృత భాషలో వ్రాయబడియుండుట దీనికొక దృష్టాంతము,

ఆంధ్రులలో అనేకులు బౌద్ధ, జైన మతములను గ్రహించిన వారై, బ్రాహ్మణ మతమును విసర్జించి యుండుట సుప్రసిద్ధము. అన్యమతముల నవలంబించినవారో, వానియందు, అభిమానము దాల్చిన వారోయైన, ఈ జనుల మరల హిందూమతములోc జేరువారినిగ, జేయువలయునన్నను, ఉండు హిందువులు తమ వర్ణమును వదలిపోకుండునట్లు ఉంచవలయునన్నను దేశభాషా మూలక ప్రచురణములు ఆనివార్యములయ్యెను. ఇదియు ఆంధ్రవాఙ్మయ సృష్టికి మూలకారణమని నాయూహా!'' (రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, రాజమహేంద్రవరం 1922, పుట - 201)

62. డా॥ నేలటూరి వేంకటరమణయ్య, The Kurkiyala Inscription of Jinavallabha, Epigraphia Andhrica, Vol. II (Epigraphical Series No.5) Government of Andhra Pradesh, Hyderabad, 1974, pp 21-30 with full length plate of the inscription. డా॥ పి.వి. పరబ్రహ్మ శాస్త్రి, జినవల్లభుని కుర్క్యాల శాసనము, తెలుగు శాసనాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1975, పుట - 78.

63. డా॥ పి.వి. పరబ్రహ్మ శాస్త్రి, మల్లియరేచన - మొదటి తెలుగు రచయిత, తెలుగుమఱుగులు, తెలుగుగోష్ఠి, హైదరాబాద్, ద్వితీయముద్రణ 1992, పుటలు 87-92.

64. డా॥ నేలటూరి వేంకటరమణయ్య, Epigraphia Andhrica, Vo. II p - 28

65. డా॥ పి.వి. పరబ్రహ్మ శాస్త్రి, తెలుగు మఱుగులు, పుట - 91.

66. ''మల్లియరేచన గురువగు **'వాదీంద్రచూడామణి'** ఎవ్వరో తెలియదు'' అని డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారు '' తెలుగు మఱుగులు'' గ్రంథంలోని మల్లియరేచన - మొదటి తెలుగు రచయిత అనే వ్యాసంలో వ్రాశారు. ఆయన వ్రాసిన వ్యాసంలోనే దానికి సమాధానమున్నది ఆయన వాక్యాలివి.'' జినవల్లభుడు తెలుగు కవిత్వం కూడ చెప్పనేర్చినవాడు. రాష్ట్రకూట రాజుల కాలంలో క్రీ.శ. 9-10 శతాబ్దంలో సంస్కృత జైన విద్వాంసుల సాంగత్యమున కన్నడమున కవిత్వము చెప్పగల పంపకవి వంటి మహాకవులు బయలుదేరిరి. వారి సాంగత్యమున తెలుగులో కూడ కవిత్వము చెప్పకొందరుద్యమించిరి'' అని వారే వ్రాసివున్నారు (తెలుగు మఱుగులు) (పుట 91). ప్రస్తుత గ్రంథకర్త, రాష్ట్రకూట రాజుల కాలంలోని సంస్కృత జైన విద్వాంసులెవరెవరో పరిశీలించగా, రాష్ట్రకూట రాజుల్లో చక్రికాభంజనుడనే అమోఘవర్షనృపతుంగుని ఆస్థానంలో క్రీ.శ. 815 - 878 మధ్యకాలంలో గణిత శాస్త్రవేత్తగా నుండిన మహావీరాచార్యుల గణితసారసంగ్రహమనే గ్రంథంలో 'వాదీంద్రముని పుంగవుడు' ప్రశంసింపబడివుండడం గమనించాడు. తృతీయ ప్రకరణమైన ప్రకీర్ణకవ్యవహారం ప్రారంభ శ్లోకాల్లో రెండవ శ్లోకమిలా వుంది.

శ్లో॥ విధ్వస్త దుర్నయధ్వాంత ః సిద్ధః స్యాద్వాదశాసనః ।
విద్యానందో జినో జీయాత్ **వాదీంద్రో మునిపుంగవ** ః ॥

చీకటి వంటి కుహనావాదములను ధ్వంసము చేసి స్యాద్వాదమును సంస్థాపించుటలో సిద్ధులైన విద్యానంద జినుడు, **వాదీంద్రమునిపుంగవుడు** వర్ధిల్లుదురు గాక!''.

ఈ శ్లోకంలో మహావీరాచార్యుడు ప్రశంసించిన 'వాదీంద్ర మునిపుంగవుడే' మల్లియరేచన తన గురువుగ చెప్పిన వాదీంద్రచూడామణి' అని నా అభిప్రాయము. 'వాదీంద్రు' డనేది అసలు పేరు. 'మునిపుంగవుడు,' 'చూడామణి' రెండు **విశేషణాలు.** రెండు సమానార్థకాలే! కాబట్టి, మహావీరాచార్యుని సమకాలంలో ఉండిన 'వాదీంద్రముని పుంగవుడే' 'వాదీంద్రచూడామణి' ఇతడే మల్లియరేచన గురువని నా నిశ్చితాభిప్రాయం. ఇతని కాలం కూడ మల్లియరేచన కాలంతో సంవదిస్తూవుంది. అది క్రీ.శ. **815 – 878.** అమోఘవర్షనృపతుంగుని రాజ్యపరిపాలనకాలం.

67. Sitaram Jagirdar, Pampa's Samadhi, Epigraphia Andhrica, Vol. II (Epigraphical Series No.5) Government of Andhra Pradesh, Hyderabad, 1974, pp 31-35 with one plate.

68. పంపకవి గురువు యొక్క పేరు జయనంది. ఇతడు 'నంది' గణానికి చెందినవాడు కాబట్టే, ఆయన శిష్యుడైన పంపకవి కూడ 'శుభ నంది' అనే దీక్షానామాన్ని స్వీకరించాడు. దీనికి ఉదాహరణం చెప్పాలంటే, విజయవాడకు సమీపంలోని ముసినికొండ లోని నడుంబివసతి' కి అధిపతి కలిభద్రాచార్యుడు. ఈతని గురించి డా॥ శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారు యిలా వ్రాస్తున్నారు. "This Pontiff had another name Devanandi, which indicates that he was orginally a member of the 'Deva' gana, but from his service to the acharyas of the '**Nandi Gana**' he became to be a Devanandi and was enjoined upon to conduct regular worship" (Jain vestiges in Andhra, pp 20-21)

69. Descriptive Catalogue of Telugu Mannscripts G.O.M.L., Madras, Vol. X, 1949.

70. పాయియ సద్ద మహణ్ణవో (ప్రాకృత శబ్ద మహార్ణవః) ,Prakrit Hindi Dictionary - Pandit Hargovind Das T. Sheth, General Editors Prof. V.S. Agrawala, Pt. D.B. Malvania, Prakrit Text Society, Varanasi, 2nd Ed., 1963.

71(a) An Illustrated Andhra - Magadhi Dictionary - Jainamuni Ratnachandraji (5 Volumes) Introduction - A.C. Woolner, Amar Publication, Varanasi, 1988.

(b) Prakrit Proper Names (2 Volumes), Dr. Mohanlal Mehta and Dr. K. Rishabh Chandra, L.D. Institute of Indology, Ahmedabad, 1970, 1972.

72. మేడేపల్లి వేంకటరమణాచార్యులు, ప్రాకృత భాషోత్పత్తి, ఆంధ్ర సాహిత్యపరిషత్తు, కాకినాడ, 1921, పునర్ముద్రణ, తెలుగుగోష్ఠి, హైదరాబాద్, 1991, పుటలు 52-55.

73. A.C. Woolner, An Introduction to Prakrit. Bharatiya Vidya Prakasham, Varanasi, 1st Ed. 1917, Reprint 1972, pp. 60 - 61.

74. నిడుదవోలు వేంకటరావు, అష్టభాషలు, భారతి, జూలై 1966, పుటలు 51-58.

75 (a) F. Kielhorn, Nandamapundi grant of Rajaraja I., ated in his Thirty - second year A.D. 1053, Epigraphia Indica, Vo. VII, No. 43, 1897 - 98, pp. 300-309.

(b) జయంతి రామయ్య పంతులు, చాళుక్యరాజరాజు నందంపూడి శాసనము, ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక, Vol. I, No.1, 1913 పుటలు 45-62.

76. చీమకుర్తి శేషగిరిరావు, తెలుగు మెఱుగులు, తెలుగుగోష్ఠి, హైదరాబాద్, ద్వితీయముద్రణ, 1992, పుటలు 1-2.

77. Robert Caldwell, A comparative Grammar of the Dravidian or South Indian family of languages, 1st Ed., 1854, 2nd Ed., 1875, 3rd Edition revised and edited by Rev. J.L. Wyatt, and T. Ramakrishna Pillai, University of Madras, 1956, Reprinted in 1961 and 1976. వ్యాకరణ, నిఘంటువుల్ని తెలుగు భాషకు తయారుచేసిన వాడు సి.పి. బ్రౌన్, ఇతనినే "My Restless Pandit" గా అభివర్ణించిన సమకాలీనుడు రాబర్ట్ కాల్డ్‌వెల్, కన్నడ భాషకు కిట్టెల్ వ్రాసిన వ్యాకరణ నిఘంటువుల్నీ, మలయాళ భాషకు గుండర్ట్ నిర్మించిన వ్యాకరణ నిఘంటువుల్నీ, తమిళ భాషను తానే స్వయంగా పరిశీలించి మిగిలిన ద్రావిడ భాషలతో పరిశోధించి వ్రాసిన గ్రంథమే ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణం.

78. హెచ్.ఎస్. బ్రహ్మానంద, తెలుగుభాషా సాహిత్యపరిశోధనలు – పుట్టుపూర్వోత్తరాలు (ప్రాథమికదశ), తెలుగులో పరిశోధన, రజతోత్సవ సంచిక, సమీక్షావ్యాససంకలనం, సంపాదకులు : దేవులపల్లి రామానుజరావు ప్రభృతులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1983, పుటలు 33-50.

79. Korada Mahadeva Sastri, Historical Grammar of Telugu with special reference to Old Telugu C. 200 B.C. - 1000 A.D., Sri Venkateswara University, Tirupati, 1969.

80. వెలుదండ నిత్యానందరావు, విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన, స్వీయప్రచురణ, హైదరాబాద్, 1st Ed. 1987, 2nd Ed., 1998, పుటలు 172-174 మరియు చూడుడు: శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయన శాఖ రజతోత్సవ సంచిక, 1959 - 1985, తిరుపతి, పుటలు - 19-38.

81. లకంసాని చక్రధర రావు, కోశవిజ్ఞానం – నిఘంటువులు, 'విభవ', ఆచార్య జి.యస్. రెడ్డి అభినందన సంచిక, షష్ట్యబ్ది సన్మాన సంఘం – తిరుపతి, 1988, పుటలు 1–4.

82. బూదరాజు రాధాకృష్ణ – మహానిఘంటువు నిర్మాణ పద్ధతులు – సమస్యలు, ''విభవ'' పుటలు 5–13.

83. A.M. Ghatage and others, An Encyclopaedic Dictionary of Sanṣkrit on Historical principles, Deccan College Post - Graduate and Research Institute, Poona, Vol.I, 1976.

84. Corpus Inscriptionum Indicarum, Vol. I, Anchaeological Survey of India, Delhi, 1969. P. xxviii.

85. R.C. Prasad, (Tr.) The Vivaha - The Hindu Marriage Samskaras, Pandit Bhaiyaram Sarma, Motilal Banarasidass, Delhi, 1995, pp. 125 - 126.

86. తుమ్మపూడి కోటీశ్వరరావు, శ్రీలీలాసమాధి, (షిరిడీ సాయిబాబాతత్త్వం), స్వీయప్రచురణ, 1990, పుటలు 18–21.

87. శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి, ఓనమాలు., ఆంధ్రపత్రిక 'ధాత' సంవత్సరాది సంచిక, 1936, పుటలు 55–56.

88(a). ఆరుద్ర, ఆంధ్రుల జైనమత ప్రభావం – జైనమతానికి ఆంధ్రుల సేవ, ఆంధ్ర పత్రిక సిద్ధార్థి సంవత్సరాది సంచిక, 1979 – 80, పుటలు 7–12.

(b) భావరాజు వేంకట కృష్ణారావు, ఆంధ్రదేశమున జైనమత వ్యాప్తి, భారతి, జూన్ 1943 పుటలు 558–574, పావులూరి మల్లన గణితంలో గచ్ఛ శేషగచ్ఛ శబ్దాలు జైనమత పరిభాషల నుండి గణిత శాస్త్రానికి ఎక్కాయి. ఉదాహరణకు రెండవ అమ్మరాజు యిచ్చిన దాన శాసనాల్లో మిక్కిలి చిత్రమైంది కలుచుంబఱ్ఱు తామ్రశాసనం (Epigraphia Indica Vol. 7, Page 77ff) అందలి శాసనవాక్యమిది."**అడ్డకలి గచ్ఛనామా మలహోరి గణప్రతీత విఖ్యాతయశాః**'' జైనములో ఇదివరకెక్కడను కానరాని గచ్ఛము, గణము అనే పేర్లు ఈ శాసనంలో కావవస్తున్నాయి. అర్హనంద్యాచార్యుడు ''**వలహారి గణ**' మనియు, '**అడ్డకలిగచ్ఛ**'' యనియు పేర్లు గల జైన సంఘమునకు పీఠస్థుడు. ఈతని గురువు అయ్యపోతిమునీంద్రుడు.''

89. వేటూరి ప్రభాకరశాస్త్రి, ఇక్ష్వాకులు – క్రొత్తపరిశోధనము భారతి, ప్రభవ, 1927 మరియు చూ॥ ప్రభాకర స్మారిక Vol. II , హైదరాబాద్, 1989, పుటలు 624–633

90. నేలటూరి వేంకటరమణయ్య, ధర్మామృతకర్త నయసేనాచార్యుడు చెప్పిన కథ, ప్రభాకరస్మారిక, Vol. II, హైదారాబాద్, 1989, పుటలు 634 – 641.

91. చీమకుర్తి శేషగిరిరావు, తెలుగు మఱుగులు, తెలుగుగోష్ఠి, హైదరాబాద్, ద్వితీయముద్రణ 1992, పుటలు 1-2.

''**అంధక** - తెలుగు భాషకును, తెలుగుదేశమునకున్ను పేరుగ ప్రాచీనకాలమున వాడుకయుండిన నామవిశేషము. 'అంధక' పదము బౌద్ధసాహిత్యమున విరివిగ కననగుచున్నది. 'సుత్తనిపాతము' లోని 'పరాయన' వర్గమున 'వత్థుగాథ' లో ఉదాహృతులగు అస్సక, అళ (ముళ)కులు అంధకరాజులని ప్రాచీన వ్యాఖ్యలో వ్రాయబడినది. అస్సక, అళకములు నేటి తెలంగాణమునందలి 'బోధన్' ప్రాంతమున నుండెడి జనపదములని చారిత్రకుల అభిప్రాయం. 'అంధక' రట్ఠము గోదావరీ తీరములను ఆశ్రయించి యుండెనని, అంధకరట్ఠపు బౌద్ధులు చైత్యారాధకులనియు, అందు పూర్వశైలీయ, అపరశైలీయాది సంప్రదాయములు ఉండెడివనియు బౌద్ధ గ్రంథముల వలన తెలియుచున్నది. ఇవి ధాన్యకటక ప్రాంతము (నేటి అమరావతి) న ఉండెడువని యువాన్‌చ్వాంగ్ మొదలగు యాత్రికుల వ్రాతల వలన స్పష్టం. **ఐతరేయ బ్రాహ్మణమున పేర్కొనబడిన 'అంధ్ర' జాతియే ఈ 'అంధక' జాతిగ వ్యవహృతమయ్యెనని పండితులు అంగీకరించిరి. ఇటుల 'అంధ్ర' పదమే ప్రాకృతమున 'అంధక' గ మార్పొందినది. 'అంధక రట్ఠ' మునే 'అంధాపథ'** మని వ్యవహరించుటయు పరిపాటియైనటుల కొన్ని శాసనముల వలన సుస్పష్టము (చూ॥ మైదవోలు శాసనము, E.I. Vol. II, పుట - 86) ఈ విధముగ గోదావరీ, కృష్ణాతటములను ఆశ్రయించిన తెలుగు దేశము ప్రాచీన కాలమున **'అంధక'**, **'అంధ'** నామములతో వ్యవహృతమయ్యెననుట సోపపత్తికము.''

తెలుగుదేశమున వ్యాప్తియుందుండిన దేశ భాషయు **'అంధక'** అనియే వ్యవహృతమయ్యెనని బౌద్ధగ్రంథములే ఋజువు చేయుచున్నవి. క్రీ.శ. 400 ప్రాంతపు వాడుగ నిర్దిష్టముగ తెలియవచ్చుచున్న బుద్ధఘోషుడు **'మజ్ఝిమనికాయము'** పై **'పపంచసూదని'** అనే వ్యాఖ్యను రచిస్తూ, తనకు పూర్వులగు కొందరు ఆచార్యులు దమిళ, అంధకాది దేశభాషల లోనికి బౌద్ధపిటకములను అనువదించియుండిరనెను. అందువలన క్రీ.వ. 4వ శతాబ్ది నాటికే 'అంధకము' ఒక సాహిత్య భాషగ రాణించెననుట స్పష్టము. ఈ విషయాన్నే చర్చించిన పాళీభాషాపండితుడు నలినాక్షదత్ ఆంధ్రభాషయొక్క ప్రాచీన రూపమే 'అంధకము' అగుననెను. (History and culture of Indian People, Bharatiya Vidya Bhavan, Vol. III, page 396) ప్రాచీనపు ఆ తెలుగుభాష యందలి సాహిత్యము వైదికేతరములగు బౌద్ధ జైనములను - ఆ నాటి చారిత్రక పరిస్థితులను బట్టి - ఆశ్రయించియుండును. ఆ మతములకు తెలుగుదేశమున ఆదరణ నశించుటతో, ఆ సాహిత్యము సైతము అంతరించినది.''

ప్రస్తుత గ్రంథకర్త 'అంధక' మనే పేరుకు మరో ఉపపత్తిని కూడ చూపుతున్నాడు. ఐతరేయబ్రాహ్మణ కాలంలోనే 'ఆంధ్రు' లున్నారనేది స్పష్టం. పురాణకాలం దగ్గరికి వచ్చేటప్పటికి చారిత్రక సంప్రదాయాన్ని (Historical Traditions) అనుసరించి ప్రాచీన కాలం నుండి పరీక్షిస్తు

వరకు గల రాజవంశాలను గురించి A.D. Pusalkar (Vedic Age, History and Culture of Indian People, Bharatiaya Vidya Bhavan, Bombay 4th Ed., 1971, Pages 271 - 322) వివరంగా వ్రాశారు. ఇందులో కృష్ణమహాయుగము క్రీ.పూ. **1950 – 1400** వరకున్నదని నిర్ణయించారు. శ్రీకృష్ణుడు యదువంశంలో జన్మించాడు. యయాతికి శుక్రాచార్యుని కుమార్తె దేవయాని యందు పుట్టిన 'యదువు' అనే వాని వలన ఈ వంశానికి యదువంశమని పేరు వచ్చింది. ఈ వంశంలో **అంధక, వృష్ణి, భోజులనే** ముగ్గురు అన్నదమ్ములున్నారు. అంధక వంశంలో పుట్టిన వాడే ఉగ్రసేనుడు. ఆయనకుమారుడే కంసుడు. ఈతని చెల్లెలు దేవకి. ఇక రెండవ వాడైన 'వృష్ణి' అనే రాజుకు దేవమీఢుడు, అతనికి శూరుడు, ఈ శూరునికే వసుదేవుడు జన్మించాడు.ఈయనే కంసుని చెల్లెలు దేవకిని వివాహమాడాడు. వీరికి పుట్టిన ఎనిమిదవ కుమారుడే శ్రీకృష్ణుడు. ఇక మూడవ వాడైన భోజుని కుమార్తె కుంతి. ఈమె పాండురాజుపత్ని. పంచపాండవుల తల్లి, 'అంధక' వంశంలో పుట్టిన కంసునికి నమ్మినబంట్లు చాణూరముష్టికులు, వీరు 'ఆంధ్రు' లని మహాభాగవత పురాణం చెబుతున్నది. ఈ మల్లయుద్ధవీరులు 'ఆంధక' దేశానికి సంబంధించిన వారు. అంధక వంశీయుడైన కంసునికి అంధక దేశీయులైన చాణూరముష్టికులు ఆశ్రయించడంలో ఆశ్చర్యం లేదు. శ్రీకృష్ణునికి 'చాణూరమర్దను' డనే బిరుదున్నది. పై అంశం ఇంకా లోతుగా పరిశీలింపవలసివుంది.

92. George Buhler (ed.) The Bhattiprolu Crystal Relic casket Buddhist Inscription of Kuberaka of 2nd Century B.C., Epigraphia Indica, Vol. II, 1885, pp 323-329 with plates.

93. చిలుకూరి వీరభద్రరావు, విష్ణువర్ధనుడు – వాసవీకన్య, రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, (సంపా.) భావరాజు వేంకటకృష్ణారావు, రాజమహేంద్రవరము, **1922**, పుటలు **143 – 152.**

94. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, The Jain Vestiges in Andhra, Hyderabad, 1963, p-88.

95. Ibid., P - 41 (footnote)

96. ఆరుద్ర , See footnote No. 88

97. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు, మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారము, పరిష్కృతముద్రణ, ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక ,Vol. X, 1923 పుటలు **68, 70.**

ఒక వైష్ణవుఁడొక మీమాంసకుఁడొక **బౌద్ధుండు** నొక్క **జైనుడు**ద్రిపురాం
తకు భక్తునట్ల నిజసాక్షిక దృష్టాంతప్రసిద్ధిఁగీర్తనఁగనిరే । – **242** ప.

కం॥ శివ! నీతదర్థమొండెను, శివభక్తార్థంబుయొండె శివవిద్యాచా
ర్యమొ విషయమొండెను. **జీవమ్ము విసర్జించిన నరుండు** ముక్తుఁడురుద్రా! – **278** ప.

కం॥ సంహృతశివ! నీ భక్తికి సంహోమతి వక్రులైననప్పుడ తేశీ
ఘుంహస్త్వా యనుటను సంహోరించుటయ పథము జనకులనైనన్ - 279.

కం॥ పావనమైన శివక్షేత్రావాసము నందునొండె ననశనవిథిమై
జీవత్యాగము చేసిన భూవినుతుడు మోక్షపదవి.బొందు మహేశా! - 280

98. మానవల్లి రామకృష్ణకవి, నీతిశాస్త్రముక్తావళి, మానవల్లి కవి రచనలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్ 1972 పుటలు, 77-82, బద్దెన (భద్రభూపాలుడు) వ్రాసిన నీతిశాస్త్రముక్తావళిని మానవల్లి గారు 'విస్మృతకవులు' అనే శీర్షిక క్రింద 1910 లో ప్రకటిస్తూ, బద్దెన కాలం క్రీ.శ. 1070 ప్రాంతమని నిర్ణయించారు. ఇతడు జైనుడని చారిత్రకులు చెబుతున్నారు. అప్పుడు బద్దెన రచించిన 'సుమతి శతకం' జైన రచనగా, తెలుగులో వెలసిన మొట్టమొదటి శతకంగా చెప్పాలి.

99. శ్రీపాదగోపాలకృష్ణమూర్తి, The Jain Vestiges in Andhra, Hyderabad, 1963, Author's preface - iii.

100. " This worship consisted in celebrating the several **kalyana** Ceremonies - the **Garbha, janma, diksha,** attainment of **Nirvana** - and **abhisheka** or ablution ceremonies for the **Arhats** installed in the temple, as also the daily pooja with flowers and water. Music was to be played and the **Arhats** fanned with fly whisk. This kind of worship required generally two images, one installed in the temple in the Sanctum Sanctorum and another in the courtyard before the temple, for the **abhisheka** functions. The **Tirthankaras** were, taken out in their days for the **abhishaka** ceremony by the Gods and this could not be simulated with the **Dhruvabera** or immovable sanctum image within the **Garbhagriha**. Hence, a figure showing the **Tirthankara** in the **Padmasana** posture was installed outside the temple on a **Panavatta** a stone seat and used for **abhisheka**. We learn from the Western Chalukyan records that **Jinendrotsava** was performed on **Kartika Paurnima** days (full moon days of October - November) and the eight days succeeding with rich **abhhisheka** Cermonies."అని శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారు (పేజి - 21) వ్రాశారు. జైన మతంలో 24 మంది తీర్థంకరులు, 63 మంది త్రిషష్టిశలాకా పురుషులున్నారు. వీరు మొత్తం 87 మంది. వీరి కొక్కరికి నాల్గు భిన్నదశలలో (గర్భ, జన్మ, దీక్ష, నిర్వాణ) కల్యాణోత్సవాలు జరుపుతుంటారు. అంటే (87 x 4 =348)సంవత్సరంలో 348 రోజులు కల్యాణోత్సవాలే. తీర్థంకరులు, శలాకాపురుషుల పుట్టుక లోక కల్యాణార్థమే కాబట్టి జన్మమొదలు నిర్వాణపర్యంతము జీవితమంతా కల్యాణంగానే జైనులు భావిస్తారు. సంవత్సరానికి 364 రోజులు కదా! దీని నుండి 348 తీసివేయుగా మిగిలిన 16 రోజుల్లో

తమ సమకాలికంగా సిద్ధిపొందిన అర్హతులకు కల్యాణోత్సవాలు జరుపుతారు. ఈ విధంగా సంవత్సరం పొడుగునా ఏదో ఒక తీర్థంకరునికో, శలాకాపురుషునికో, అర్హతునికో కల్యాణోత్సవం జరుగుతూనే ఉండడం మూలాన ''నిత్యకల్యాణం పచ్చతోరణం'' అనే సామెత జైన బసదుల నుండి పుట్టింది. ఈ సామెతను పుట్టించిన వారు జైనులు కారు, హిందువులే! మానవ కల్యాణాన్ని కోరుకొనే వానికి రోజూ పండుగే! అని దీని అర్థం. దీనినే వీరశైవులు కూడ గ్రహించినట్లున్నది. కర్ణాటక రాష్ట్రంలో కల్యాణీచాళుక్యులున్నారు. 'కల్యాణమనే' పట్టణమున్నది. ధూర్జటి శ్రీకాళహస్తిమహాత్మ్యం లో – ''తదేవలగ్నమున నా కల్యాణమింపారు నిర్మలనీ కృపాకటాక్షమది'' అనే వాక్యంలో బాహ్యమైన కల్యాణం కంటే అంతరమైన అధ్యాత్మిక కల్యాణమే శ్రేష్ఠమని చెప్పాడు.

''జీవాత్మ పరమాత్మ లో లీనంకావడమే నిజమైన కల్యాణం'' అని నిర్వచిస్తూ, కల్యాణ పట్టణానికి పోతున్న అక్కమహాదేవి 'కల్యాణ' శబ్దాన్ని ఇలా సమన్వయించింది.

**కల్యాణ** మనునదెవ్వరికి పోవశమగును? పోరాదు అసాధ్యమయ్యా!

ఆశ, ఆమిషములుడుగనిదే **కల్యాణము** వైపు అడుగిడరాదు.

అంతరంగబహిరంగములు శుద్ధమైన వానికే గాని **కల్యాణము**నకు పోరాదు.

నేను నీవను భేదము హరించిన వానికే గాని **కల్యాణము** లోతు తెలియదు.

చెన్నమల్లికార్జునుని వలచి ఉభయలజ్జల వదలితి గాన **కల్యాణము**ను జూచినమోనమో! యనుచుంటిని.'' అని మాహేశ్వర స్థలములో 177వ వచనం.

అక్కమహాదేవి దృష్టిలో కల్యాణమంటే స్త్రీ, పురుషుల వివాహం కాదు. జీవాత్మ పరమాత్మలో లీనం కావడమే అసలైన కల్యాణానికి అర్థం. అదే నిర్వాణం! అదేకైలాసం!! దీనిని అంతరంగంలోనే కాక బాహ్యంగా కూడ సాధించి 'శివోఽహం' అనే మాటను అనుభవంలోకి తెచ్చుకోవడమే అచ్చమైన కల్యాణం. తన లోపల శివుడు. వెలుపల శివుడు. జగమంతా శివమయం. కల్యాణమే కైలాసము అంటూ–

**కల్యాణము** కైలాసమును మాట నిజమాయె!
లోపల **కల్యాణము** వెలుపల **కల్యాణము**
దీని అంతు నెవరయా యెఱింగినది?
మీ సత్యశరణుల రాక పోకలు తెలుపుకున్నవయ్యా! అని ప్రసాదిస్థలంలోని 217 వ వచనం.

జైన మతానికీ, వీరశైవానికీ ఎన్నో పోలికలున్నాయి. జైనంలో త్రిషష్టి శలాకాపురుషులున్నట్లే వీరశైవంలో అరువత్తుమూవురు నాయన్మారులున్నారు. జైన సన్యాసులు సల్లేఖనం (నిరాహారియై ప్రాణత్యాగం చేయడం) ద్వారా నిర్వాణం పొందేటట్లు వీర శైవులు అనశనవ్రతం (నిరాహారవ్రతం) (చూ॥ శివతత్త్వసారం పద్యం 280 అనశనవిధిమై

జీవత్యాగము చేసిన భూవినుతుడు మోక్షపదవిబొందు మహేశా!) చే మోక్షం కల్గుతుందనే నమ్మకముంది. పైగా 'కనుమారి' అనే 'భృగుపతనం' వీరశైవుల్లో ఉంది. అంటే శ్రీశైలం కొండ చరియలెక్కి శివరాత్రి పర్వదినాల్లో దుమికి ప్రాణపరి త్యాగం చేస్తే కైలాసప్రాప్తి కల్గుతుందని భక్తులు విశ్వాసం. జైనమతంలోని గృహస్థుడు తన ఇంటికి భిక్షకైవచ్చిన జైన సన్యాసి భుజించగ మిగిలిన ఉచ్ఛిష్టాన్ని భుజిస్తే భౌతిక భోగభాగ్యాలే కాక, నిర్వాణం కూడ కల్గుతుందని విశ్వాసం. వీరశైవంలో జంగమార్చనలు మరింత తీవ్రస్థాయిలో ఉండడం చూడవచ్చు (చూ॥ సిరియాలుని కథ) దీనినే వీర మాహేశ్వరవ్రతం అంటారు.

వీరవైష్ణవంలో కూడ పన్నిద్దరు ఆళ్వారులు, ఆర్గురు ఆచార్యపురుషులు సింహాసనస్థులైన ఆచార్యులు 74 మంది వెరసి 92 మంది తిరునక్షత్రాలను 'జయంతి' గా జరుపుకుంటారు. అతిథి ఉచ్ఛిష్టాన్ని భుజించడాన్ని 'భాగవతశేషం' గా ప్రసాదంగా పరిగణిస్తారు (చూ॥ శ్రీమద్రామానుజులు తిరుక్కచ్చినంచ్చి అనే పంచముడితో కలిసి భోజనం చేసి, ఆయన తినగా మిగిలిన అన్నాన్ని (విఘసం) భాగవతశేషమైన ప్రసాదంగా స్వీకరించాడు) దీనిని ఆయన భార్య ప్రతిఘటించగా ఆమెను పరిత్యజించి సన్యాసం పుచ్చుకున్నాడు. జైనల్ని, వీరశైవుల్ని మించిపోవాలని శ్రీమద్రామానుజుల శిష్యపరంపర అనంతంగా తయారైంది.

శ్లో॥ ఏకాన్తిభిర్ద్వాదశ భిస్సహస్రైః పీఠైశ్చతుస్సప్తతిభి స్సమేతః।
అన్యైరనన్తైరపి విష్ణుభక్తై శ్రీరంగ ఆస్తే యతిసార్వ భౌమః ॥

ఏకాంతులు పన్నెండువేలు, సింహాసనస్థులైన ఆచార్యులు డెబ్బైనాలుగు మంది, ఏడువందలమంది జియ్యంగార్లు, చాత్తిన చాత్తాద శ్రీవైష్ణవులు, స్త్రీలు, తిరునామధారులు అసంఖ్యేయులు.

ఇలా తులనాత్మక పరిశీలన వల్ల జైన మతానికి, వీరశైవ, వీరవైష్ణవాలకు ఎన్నో పోలికలు, ప్రభావాలు కన్పడుతాయి. వీరశైవం లోని అరువత్తుమూవురు నాయన్మారుల పరిగణన మాత్రం జైనంలోని త్రిషష్టి శలాకాపురుషుల ప్రభావంతో ఏర్పడిందని నా దృఢవిశ్వాసం!

తిరుమల కొండపై స్వామికి రోజూ ఎన్నో కల్యాణోత్సవాలు జరుగుతున్నాయంటే అర్థమేమి? జీవాత్మ పరమాత్మలో లీనం కావడమనే సాంకేతికార్థానికి ప్రతీకగా 'కల్యాణం' జరుగుతున్నదని అర్థం. అదే 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అనే సామెతకు నిజమైన అర్థం!

# తృతీయాధ్యాయం
# బౌద్ధ సంప్రదాయం - మత, తాత్త్విక, చారిత్రక సమన్వయం

దుర్దర్శ మతిగంభీర మజం సామ్యం విశారదమ్ ।
బుద్ధ్వాపద మనానాత్వం నమస్కుర్మో యథాబలమ్॥

- మాండూక్యోపనిషత్
గౌడపాదకారిక, 6-100

చూచుటకు వీలుకానిది, గంభీరము, శాశ్వతము, నిర్మలమైనది, నానాత్వము లేనిదైన నిర్వాణపదమును యథాశక్తి తెలిసికొని నమస్కరిస్తున్నాను.[1]

క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దం భారతదేశ చరిత్రలో అత్యంత ప్రముఖమైనది. అది గొప్ప మేధాశక్తి వికసించిన కాలం. ఈ కాలంలో జైన, బౌద్ధాలనే రెండు ప్రసిద్ధ మత సంస్థలు ఉద్భవించాయి. లిపి విధానం భారతీయుల్లో విస్తృత ప్రచారం పొందింది. సముద్రవ్యాపారం ఎంతో అభివృద్ధి సాధించింది. ఇండో ఆర్యన్ల భౌగోళిక దృక్పథం మారి, అనార్యులు హిందూమతంలో విలీనులై జన జీవనప్రవంతిలో కలిసి పోయారు. బౌద్ధమతం బాగా ప్రసిద్ధి లోకి వచ్చాక, వర్ణవ్యవస్థలోని నాల్గవ వర్ణమైన శూద్రుల పరిస్థితులు కొంతవరకు బాగు పడ్డాయనే చెప్పాలి. దక్కను పీఠభూమిని, ఉత్తర భారత దేశాన్ని, వేర్పరుస్తూ దట్టంగా పెరిగిన 'దండకారణ్యమ'నే అడవిలో శ్రీరామచంద్రుడు ప్రయాణించి నివసించడం చేత అంత వరకు పెద్ద అడ్డంకిగా భయగ్రస్తమైన అరణ్యం నరికివేయడం మూలాన దక్షిణ ఉత్తర భారతదేశాల మధ్య పరస్పరం రాక పోకలు, ప్రయాణసౌకర్యాలు, ఆదాన ప్రదానాలు ఎక్కువయ్యాయి. వారణాసిలోని అగస్త్యమహర్షి శివుని ఆజ్ఞతో వింధ్యపర్వతాన్ని దాటి దక్షిణ భారత దేశంలోని తమిళనాడుకు క్రీ.పూ. 6వ శతాబ్దికి పూర్వమే వచ్చారు. పౌత్తరాహుడైన శ్రీరాముడు వనవాసంలో దండకారణ్యాన్ని దాటి దక్షిణదేశం ప్రవేశించి లంక వరకు వెళ్లి రావణసంహారం చేసి ఆ తర్వాత అయోధ్యకు చేరి వుండటమే ప్రజాబాహుళ్యానికి ప్రధాన ప్రేరకం. రాముడు అడవుల గుండా దక్షిణాదికి వస్తే, రాముని కంటే ముందు వింధ్య పర్వతాన్ని దాటి దండకారణ్యంలో నివసిస్తున్నాడు అగస్త్యుడు. ఇలా రామాయణ కాలం తర్వాతనే రాకపోకలు, వ్యాపారం అభివృద్ధి కావడంతో పట్టణాలు, నగరాలు పెరిగి పెద్ద సామ్రాజ్యస్థాపనకు దారితీశాయి.

**గౌతమబుద్ధుని జీవిత విశేషాలు :** కపిలవస్తు నగరాన్ని పరిపాలించే శాక్యవంశానికి చెందిన క్షత్రియ కుటుంబంలో మాయాదేవి శుద్ధోధనులకు ఒక పుత్రుడు లుంబినీ వనంలో జన్మించాడు. ఆ బాలుడు శాక్యవంశంలో జన్మించడం చేత శాక్యసింహుడని, గౌతమగోత్రంలో పుట్టడం చేత గౌతముడని, సకలార్థాలను సిద్ధింప జేసేవాడుగా సిద్ధార్థుడని నామకరణాలు చేశారు. సంప్రదాయజ్ఞుల ప్రకారం ఇతడు క్రీస్తు పూర్వం 623లో జన్మించి క్రీ.పూ. 543 వరకు జీవించాడు. కాని, ఆధునిక పరిశోధనల ప్రకారం గౌతముడు క్రీ.పూ. 567లో జన్మించి 487 వరకు జీవించాడు. వర్ధమాన మహావీరునికి చరమదశలో ఈతడు సమకాలికుడు.

బాల్యదశ నుండి ఏకాంతంగా, ఏదో ఆలోచిస్తూ తదేక నిష్ఠతో జీవితం గడిపి యౌవన దశలో వివాహితుడైనాడు. ఇతని భార్య పేరు యశోధర. వీరికొక కుమారుడు కలిగాడు. పేరు రాహులుడు. భౌతిక జీవనంలోని భోగభాగ్యాలు, విలాసాలు గౌతముని యే మాత్రం తృప్తిపరచలేక పోయాయి. మానవజీవితంలోని దుఃఖానికి శాశ్వత పరిష్కారం తెలిసికోవాలని ఆయన భార్యాబిడ్డలను వదలి అడవులను ప్రవేశించాడు. దీనినే 'మహాభినిష్క్రమణ' (The Great Renunciation) మంటారు. ఇతడు మొదట గయకు వెళ్లి అక్కడ కొంతకాలం వేదాంత విద్యనభ్యసించాడు. కాని, అది తృప్తిపరచక పోవడంతో అడవులలో కఠిన తపశ్చర్యకు పూనుకొన్నాడు. కాని, త్వరలోనే అతడు కేవలనిరాహారమైన తపస్సు వల్ల ముక్తి లభించదని తెలుసుకున్నాడు. శరీరధారణకు చాలినంత స్వల్పాహారం తీసుకొంటూ ఒక రావిచెట్టు క్రింద తపస్సు చేయసాగాడు. ఒక నాడు హఠాత్తుగా అతనికి జ్ఞానోదయ (enlightenment) మైంది. అప్పుడతని వయస్సు ముప్పైఐదు. అప్పటి నుండి ఆయనకు 'బుద్ధుడ'నే పేరు ఏర్పడింది. రావి చెట్టుకు బోధి వృక్షమని పేరు వచ్చింది. జ్ఞానోదయమైన వారినే బుద్ధుడ (enlightened soul) ని పిలుస్తారు. అత్యుత్తమ ఆధ్యాత్మికజ్ఞానం (సంబోధి) సంపాదించిన గౌతమబుద్ధుడు, శాక్యవంశంలో పుట్టిన వాడు కావడం చేత 'శాక్యముని' యని పేరు ఏర్పడింది. అప్పటి నుండి 45 సంవత్సరాలు ఆయన అవిశ్రాంతంగా బౌద్ధమత ప్రచారం చేశాడు. జ్ఞానోదయమైన బుద్ధుని పేరు మీదుగా వచ్చిందే బౌద్ధమతం. ఈయన మత ప్రచారం చేసిన కాలం క్రీ.పూ 532 నుండి క్రీ.పూ. 487 వరకు అని చరిత్రకారులు వ్రాశారు. జ్ఞానోదయమైన వెంటనే బుద్ధుడు వారణాశికి దగ్గరలో గల సారనాథ్ చేరాడు. అక్కడ మృగదావం అనే ఉద్యానవనం లో ధర్మచక్ర ప్రవర్తన చేశాడు. దీనినే పాళీ భాషలో 'ధమ్మ చక్క పవత్తనము' అంటారు. అప్పుడతనికి ఐదుగురు శిష్యులు ఏర్పడ్డారు. ఇదియే తర్వాతి కాలంలో బౌద్ధ సంఘానికి దారి తీసింది. బుద్ధుడు మగధ మొదలైన పెద్ద పెద్ద నగరాలలో విస్తృత ప్రచారం చేసి తన ఎనభైయవయేట నేపాల్ లోని కుశినగరంలో నిర్వాణం చెందాడు. దీనినే 'మహాపరినిర్వాణ' మంటారు. ఇతని నిర్వాణ కాలం శ్రీలంక సంప్రదాయాను సారం క్రీ.పూ. 544 కాగా, Prof. Geiger **483 B.C.** అని చెప్పారు. క్యాంటోనీస్ సంప్రదాయానుసారం బుద్ధుడు క్రీ.పూ. 486లో నిర్వాణం చెందాడు.[2]

**బౌద్ధమత ప్రధాన సిద్ధాంతాలు:** వారణాశి వద్ద గల సారనాథ్‌లో ప్రప్రథమ ధర్మచక్ర ప్రవర్తన జరిగినప్పుడు (క్రీ.పూ. 532) బుద్ధుడు నాల్గు ఆర్యసత్యములు ప్రవచించాడు. 1) దుఃఖం, 2) దుఃఖోత్పత్తి, 3) దుఃఖ నివారణం, 4) దుఃఖనివారణోపాయం. ఈ దుఃఖాన్ని అతిక్రమించడానికి సముదయ, నిరోధ, ప్రతిపధ, వినిగమనములు తెలుసుకోవాలి. ఇది విశ్వ జనీనమైన జీవుని దుఃఖానికి, వేదనకు బుద్ధుడు అన్వేషించి తెలుసుకున్న ఆధ్యాత్మికోపాయం.

| | |
|---|---|
| 1) దుఃఖం | ఈ ప్రపంచం దుఃఖమయం |
| 2) దుఃఖసముదయం | దుఃఖానికిగల మూలకారణం. జాతి (పుట్టుక) జరా (ముసలితనం) మరణం - ఇవి మూలకారణాలు |
| 3) దుఃఖనిరోధం | దుఃఖనాశనం. దుఃఖోత్పాదకములైన వానిని నశింపజేయడం. |
| 4) దుఃఖ నిరోధగామినీ పటిపదా | దుఃఖనాశనోపాయం, దుఃఖదాయకాలైన వాటిని మూలముట్టుగా నశింపజేయడానికి బుద్ధోదిష్టమైన ఆర్య అష్టాంగ మార్గమే శరణ్యం. ఆ దారిలో నడచిన వారు అన్ని దుఃఖాలు నశించి నిర్వాణపదం చేరుకుంటారు. |
| 5) దుఃఖవినిగమనము | దుఃఖమీమాంసకు పరిష్కారంగా బౌద్ధులు కనిపెట్టిన దుఃఖం యొక్క ఎడతెగని లంకె (Chain of Causation) నే ప్రతీత్యసముత్పాద వాద మంటారు. |

రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానము లనే పంచవిధస్కంధాల సమాహార స్వరూపుడే జీవుడు. ఈ జీవునికి తృష్ణ (కోరిక) చేత దుఃఖం కలుగుతున్నది. ఈ తృష్ణా స్వరూపాన్ని 'ధమ్మపదం' లోని 24 అధ్యాయమైన 'తణ్హావగ్గం' లో 21వ గాథలో తణ్హక్ఖయోసబ్బదుక్ఖం జినాతి (తృష్ణాక్షయః సర్వదుఃఖం జయతి) తృష్ణానాశమే సర్వదుఃఖాలను నిర్జిస్తుంది. అని చెప్పబడింది. దుఃఖాన్ని జయించడానికి 'తృష్ణ'ను త్యజించమన్నాడు. దానికి మార్గమేమిటో 'ధమ్మపదం' లోని బుద్ధవగ్గం (14-13) (పాళీభాష)లో యిలా చెప్పాడు.

దుక్ఖం దుక్ఖసముప్పాదం దుకస్స చ అతిక్కమం ।
అరియం చట్ఠఙ్గకం మగ్గం దుక్ఖూపసమగామినం ॥

సంస్కృతచ్ఛాయ -

దుఃఖం దుఃఖ సముత్పాదం దుఃఖస్య సమతిక్రమమ్ ।

ఆర్యంచాష్టాంగకం మార్గం దుఃఖోపశమగామినమ్ ॥[3]

1) సమ్మాదిట్టి (సమ్యగ్దృష్టి - Right Views)
2) సమ్మాసంకప్పో (సమ్యస్సంకల్పము - Right aspirations)
3) సమ్మావాచా (సమ్యగ్వచనము - Right speech)
4) సమ్మాకమ్మంతో (సమ్యక్కర్మము - Right action)
5) సమ్మాజీవో (సమ్యగాజీవము - Right living)
6) సమ్మావాయామో (సమ్యగ్వ్యాయామము - Right exertion)
7) సమ్మాసతి (సమ్యక్స్మృతి - Right recollection)
(శారీరక మానసిక కర్మల గూర్చి జాగరూకత)
8) సమ్మాసమాధి (సమ్యక్ సమాధి - Right meditation)
(ధ్యానము - మానసిక ఏకాగ్రత)

ఇవి అష్టాంగములు, ఈ అష్టాంగ మార్గానికే 'మధ్యేమార్గ' మని మరొక పేరు. దీనినే పాళీలో 'మజ్ఝిమా పటిపదా' అంటారు. అత్యంత విషయ సుఖాసక్తి, శరీరనాశకమైన అత్యంత కఠోర తపస్సు - ఈ రెండు అత్యంతాలను (two extremes) విడిచి మధ్యమార్గమున (intermediate path) సంచరించుట. అతిసంశయం, అతి విశ్వాసం కూడ విడువదగినవే.

ఈ అష్టాంగాలు ప్రజ్ఞా, శీల, సమాధులుగా వింగడింపబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రజ్ఞ | - | సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పాలు<br>ప్రజ్ఞ (జ్ఞానం)కు సంబంధించిన శిక్షణ |
| 2) | శీలం | - | సమ్యగ్వచనం, సమ్యక్కర్మం, సమ్యగాజీవం<br>శీలా (నైతిక జీవనం)నికి చెందిన శిక్షణ |
| 3) | సమాధి | - | సమ్యగ్వ్యాయామం, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి<br>చిత్తానికి సంబంధించిన శిక్షణ. |

ఈ అష్టాంగమార్గాలచే జీవితమార్గం విశుద్ధమౌతున్నది. దీనినే 'విశుద్ధిమగ్గం' అన్నారు బౌద్ధులు. ధమ్మ పదంలోనే విశుద్ధి మార్గానికి మూలభావాలు చెప్పబడ్డాయి.

సబ్బే సంఖారా అనిచ్చా ( Impermanence)

సబ్బే సంఖారా దుక్ఖా ( Unsatisfactioriness)

సబ్బే ధమ్మా అనత్తా ( Everything is subjected to change)

(ధమ్మపదం - మగ్గవగ్గం 20-5,6,7 గాథలు) దుఃఖ బహుళమైన సంసారంలో సంస్కారాలన్నీ అనిత్యాలు. దుఃఖ స్వరూపాలు, మార్పు అనివార్యం. కాబట్టి వైరాగ్య మొక్కటే శరణ్యం. ఇదెలా సాధింపబడుతుందో ధమ్మ పదం లోని బుద్ధవగ్గం (14-12) లో యిలా చెప్పాడు.

యోచ బుద్ధఞ్చధమ్మఞ్చ సఙ్ఘఞ్చ సరణంగతో ।

చత్తారి అరియసచ్చాని సమ్మప్పఞ్ఞసప్పతి ॥

సంస్కృతచ్ఛాయ :

యోహి బుద్ధంచ ధర్మంచ సంఘంచ శరణం గతః

స సమ్యక్ ప్రజ్ఞా పశ్యత్యార్యసత్య చతుష్టయమ్ ॥

బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణు పొందినవాడు సమ్యక్ ప్రజ్ఞగలవాడై నాల్గు ఆర్యసత్యాలను దర్శింపగలడు.

**రత్నత్రయం :** బుద్ధం సరణం గచ్ఛామి

ధమ్మం సరణం గచ్ఛామి

సంఘం సరణం గచ్ఛామి

'నేను జ్ఞానాన్ని జ్ఞానవంతుల్ని శరణుజొచ్చెదను'

నేను విశ్వజనీనమైన ధర్మాన్ని శరణు పొందుచున్నాను

నేను సహచర మానవుల దుఃఖనివృత్తికై వారి సేవ చేసెదను. ఈ ప్రతిజ్ఞా వాక్యాలు కూడు, త్రిపిటకాలలో రెండవదైన సుత్తపటకంలో ఐదవ భాగమైన ఖుద్దక నికాయంలోని ఖుద్దక పాఠంలో గల ప్రారంభ వాక్యాలు.

**ప్రతీత్యసముత్పాధవాదము :** దుఃఖవినిగమునమునకు బౌద్ధులెంతో కృషిచేసి ప్రతీత్యసముత్పాదవాదమనే పరిష్కార మార్గాన్ని కనిపెట్టారు. దుఃఖం యొక్క ఎడతెగని లంకె (Chain of causation) ఈ వాదంలో ప్రతిపాదింపబడింది. దేహాన్ని దుఃఖారామంగా గుర్తించిన బుద్ధుడు, దుఃఖాన్ని మూడు విధాలుగా వింగడించాడు.

1) దుఃఖ - దుఃఖతా ( Pain) 2) తాప దుఃఖతా ( desire), 3) సంసార దుఃఖతా (attachment) సంఖిత్తేన పంచొపాదానఖ్ఖందాపి దుక్ఖా'' మేను దాల్చిన ప్రతి జీవిలోను ఈ ఐదు ఉపాదానస్కంధాలు కూడ దుఃఖమయాలుగా గుర్తింపబడ్డాయి.

దుఃఖం సంసారిణ : స్కంధాస్తే పంచ ప్రకీర్తితాః ।
విజ్ఞానం వేదనా సంజ్ఞా సంస్కారో రూపమేవచ॥[4]

అని హరిభద్రసూరి షడ్దర్శన సముచ్చయంలో (శ్లో. 5) చెప్పాడు. అవి విజ్ఞాన, వేదనా, సంజ్ఞా, సంస్కార, రూపములనే ఐదు దుఃఖస్కంధాలు.

దుఃఖానికి గల కారణ సముదయాన్ని పన్నెండు అంశాలుగా దీనిలో గుర్తించారు. కేవలస్యైవం ఏతస్య దుఃఖస్కంధస్య సంభవమ్ అని నాగార్జునుని మాధ్యమిక కారిక (26-9)

యథాక్షేపం క్రమాద్వృద్ధః సంతానః క్లేశకర్మభిః ।
పరలోకం పునర్యాతీత్యనాది భవ చక్రకమ్
యః ప్రతీత్యసముత్పాదో ద్వాదశాంగ త్రికాండకమ్॥

అని ఆచార్య నాగార్జునుడు 'ప్రతీత్యసముత్పాద హృదయ' మనే గ్రంథంలో అంటాడు.

పంచవిధ దుఃఖస్కంధాల సమాహారస్వరూపుడైన జీవుడు కార్యకారణరూపమైన భవచక్రం (సంసారచక్రం)లో తగుల్కొంటున్నాడు. దీనినే బుద్ధుడు ప్రతీత్యసముత్పాద మని చెప్పాడు.

1) అవిద్య → 2) సంస్కారము → 3) విజ్ఞానము → 4) నామరూపములు(name and form) → 5) షడాయతనములు (పంచేంద్రియములు, మనస్సు)→ 6) స్పర్శ (contact)→ 7) వేదన (sensation)→ 8) తృష్ణ (desire) 9) ఉపాదానము (సూక్ష్మపంచస్కంధాలు) → 10) భవము (existence or personality) → 11) జాతి (పునర్భవము-desire for re birth) → 12) జరామరణములు.

వీటినే ద్వాదశాంగ సూత్రమని కూడ అంటారు. ఈ పన్నెండు కారణ ధర్మాలలోనివి లంకెలు (links). వీటికే 'నిదానము' లని కూడ పేరు. ఇవి ఒకదానికి మరొకటి కారణం కావడం గమనింపదగింది.

పూర్వ జన్మలోని **'అవిద్య'** వలన శుభాశుభకర్మల్ని చేసి, వాటి వల్ల కొన్ని **సంస్కారాలను** మానవుడు పొందుతున్నాడు. ఈ సంస్కారాలే పునర్జన్మ కారణమైన విజ్ఞానాన్ని కల్గిస్తుంది. ప్రస్తుతం నడుస్తున్న జన్మ ఈ విజ్ఞానంతో మాతృగర్భం నుండి ప్రారంభమౌతుంది. విజ్ఞానమంటే పునర్జన్మ కారణమైన మనోవృత్తి రూపమని అర్థం. దీనినే ప్రతిసంధి విజ్ఞానమని కూడా అంటారు. ఈ విజ్ఞానరూపమైన మానస వృత్తి **నామం** (వేదన, సంజ్ఞా సంస్కారాలను, పంచేంద్రియ విజ్ఞానాన్ని) కల్గిస్తుంది. 'నం' అంటే వంగడమని అర్థం. మనస్సును విషయార్థమై వంచేది నామమని బౌద్ధుల భావన. దీని వల్ల విషయానుభవానికి సాధనమైన **రూపం** కల్గుతుంది. అంటే మాంసరక్తాస్థిమయమైన శరీరం కల్గుతుంది.

మాతృగర్భం నుండి ఈ నామరూపమయమైన శరీరం వెలువడి **షడాయతనాలను** (పంచేంద్రియాలు, మనస్సు) వికాసమొనరించుకొంటుంది. ఈ ఆరు ఇంద్రియాలు మరల బాహ్యస్పర్శను పొంది సుఖదుఃఖాత్మకమైన **వేదన** (feelings) ను పొందుతుంది. వేదన, **తృష్ణను** (desire) కల్గిస్తుంది. ఈ తృష్ణ వలన వ్యక్తి విషయ సుఖానందాన్ని అన్వేషిస్తూ వానిని అనుభవింపగోరుతాడు.

తృష్ణ మూడు విధాలు, కామతృష్ణ, భవతృష్ణ (పునర్జన్మకాంక్ష), విభవతృష్ణ (స్వర్గకాంక్ష). దీనివల్ల ప్రస్తుతం నడుస్తున్న జీవితాంతంలో కామ, రూ ప, (భూలోకం) అరూప (స్వర్గలోకం) లోకాల్లో మరల జన్మించాలనే కోరిక కల్గుతుంది. ధమ్మ పదంలోని తణ్హావగ్గం తొలిగాథ (24-1) యిట్లున్నది.

మనుజస్స పమత్తచారినో తణ్హా వడ్ఢతి మాలువావియ।
సోప్లవతి హురాహురం, ఫలమిచ్ఛం వ వనమ్హి వానరో॥

సంస్కృతచ్ఛాయ :

మనుజస్య ప్రమత్తచారిణః తృష్ణా వర్ధతే మాలువేవ।
స ప్లవతేఽహరహః ఫలమిచ్ఛన్ ఇవ వనే వానరః ॥

అజాగరూకుడైన వానిని తృష్ణ అనేది 'మాలువా' తీగలాగా అల్లుకుంటుంది. అడవిలోని అన్ని చెట్ల పండ్లనూ రుచి చూడాలనే కాంక్షతో కోతి ఒక చెట్టు కొమ్మ నుండి మరో చెట్టు కొమ్మకు దూకేటట్లుగా తృష్ణకు లోనైన జీవుడు ఒక జన్మ నుండి మరొక జన్మానికి గంతులు వేస్తూపోతుంటాడు.

ఇదే **ఉపాదానాన్ని** (strong attachment) (సూక్ష్మపంచస్కంధములు) కల్గిస్తుంది. దీని వల్ల భవం కల్గుతుంది. అందుచేత **జాతి** (పునర్జన్మ) (desire for rebirth) కల్గుతుంది. దాని వల్ల **జరామరణాలు** కల్గుతాయి.

దీనిచే మరల **అవిద్య** ఏర్పడి భవచక్రం (సంసారచక్రం) నిర్విరామంగా పరిభ్రమిస్తూనే ఉంటుంది. ఇలా ఈ ద్వాదశ సూత్రాలు గల ప్రతీత్యసముత్పాదం జీవుని సంసార చక్రభ్రమణానికి గల కార్యకారణ సంబంధాన్ని చక్కగా వివేచించి చెప్పింది.

దుఃఖం స్వయంకృతమా? పరకృతమా? అనే వివేచన కంటే ప్రతీత్యజం (dependent origination) అనడం సముచితమని 'అవిద్య' – 'కల్పన' దీనికి హేతువులని మాధ్యమిక కారికలోని దుఃఖ పరీక్ష (శ్లో. 12) లో ఆచార్య నాగార్జునుడన్నాడు. 'ప్రజ్ఞ' చే 'అవిద్య'ను, 'వేదన' ను నశింపజేసి ఆధ్యాత్మిక శాంతిని సాధింపవచ్చునన్నాడు. మాధ్యమికవాదుల అభిప్రాయంలో ముక్తిని, విడుదలను అనుభవం లోనికి తీసుకురావడానికి 'శూన్యత' అంటే ఏమిటో యథార్థంగా తెలుసుకోవాలి.

**''ముక్తిస్తు శూన్యతాదృష్టే స్త దర్థాశేష భావనా**
**ఇదమేవ ఆచార్యపాదై ర్యుక్తమ్''**

అని ప్రజ్ఞాకరమతి, బోధిచర్యావతారపంచిక లో చెప్పాడు. ''సున్నోలోకో ఇతి ఉచ్చతి'' అని చెప్పడానికి పూర్వం, బుద్ధుడు అవిద్యామోహాదులు మానవుని దుఃఖానికి మూలకారణాలని గుర్తించి, చివరికంతా 'శూన్య'మని తేల్చివేశాడు.

'ఆత్మ' ఉన్నదా లేదా ? అని బుద్ధుని ప్రధాన శిష్యుడు ఆనందుడడిగినప్పుడు ఆయన 'మౌనం' వహించాడట! బహుశా, ఉపనిషత్తుల్లో వాష్కలి అడిగిన యిదే ప్రశ్నకు బాహ్వుడు ఉపశాంతోఽయం ఆత్మా (Silence is the Atman) అని చెప్పిన సమాధానమే బుద్ధుని మౌనానికి ప్రేరకమై ఉంటుందని, ఆనిర్వచనీయమైన ఆత్మకు 'మౌనమే' సమాధానంగా బుద్ధుడు భావించాడని నాకు అనిపిస్తుంది. ''గురోఽస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ''

**పంచశీలములు** : (Five principal commandments) ఖానుమత (స్థాణుమతి) గ్రామవాసికి, బింబసారనృపతికి పురోహితుడైన కూటదంతుడనే బ్రాహ్మణునికి, సామాన్యగృహస్థులకు జనసామాన్యానికంతటికీ పంచశీలములను బుద్ధుడిలా బోధించాడు.

) పాణాతిపాతము (ప్రాణిహింస చేయకుండుట)
) అదిన్నాదానము (దొంగతనము చేయకుండుట)
) కామేసుమిచ్చాచారము (వ్యభిచారము చేయకుండుట)
) ముసావాదము ( అసత్యభాషణము చేయకుండుట)
) సురామేరయమజ్జ పమాదట్ఠానము (మత్తునిచ్చే మద్యపానము చేయకుండుట)

ఈ ఐదు పాపాలు ఆచరించకుండ ఉండటవే పంచశీలములు (శిక్షాపదములు) నబడుతాయి. ఈ శిక్షాపదాలనే పంచశీలాలను ఉల్లంఘించే వారు తమ శ్రేయోమూలాలను ావే ఛేదించుకొని, ఆత్మవినాశానికి కావలసిన బీజాలను ఈ లోకంలోనే సిద్ధపరచు ంటున్నారు.

**బుద్ధుని చరమసందేశం : కడపటి విందు :** భోగనగరంలోని ఆనందచైత్యంలో ుద్ధుడు బిక్షువర్గాన్ని ఉద్దేశించి ''శీలం, సమాధి (ధ్యానం) ప్ర జ్ఞ, నిర్వాణం - ఇవి రమసత్యాలు. శీల ప్రవర్తనచే భౌతిక జీవితం పరిపూర్ణత పొందితే సమాధి (ధ్యానం) ందురుతుంది. అది మహాఫలదాయకం. ధ్యానం యొక్క పరిపూర్ణ స్థితిలో ప్రజ్ఞ ాక్షాత్కరిస్తుంది. ప్రజ్ఞలో నిమగ్నమైన వాని చిత్తం కామం నుండి, భవం నుండి, అవిద్య నుండి ముక్తం కాగలదు'' అని ఉపదేశించి, భోగనగరం నుండి పావా గ్రామానికి వెళ్లాడు. అక్కడ పాసకుడైన చుందుని మామిడితోటలో భిక్షు సంఘంతో విడిదిచేశాడు. చుందుడు పావా ామంలో కమ్మరివాడు. అతడు బుద్ధుని శిష్యసమేతంగా విందుకు ఆహ్వానించాడు. మధురాన్న క్ష్యాలతో పాటు '' సూకరమద్దవ'' మనే పదార్థాన్ని కూడ అతడు సిద్ధపరచాడు.

పాశ్చాత్యపండితులు 'సూకరమద్దవ' మనే శబ్దానికి అడవి పంది మాంసం (Boar's esh) అని అనువదించారు. దీనిని అనుసరించే కాబోలు డా॥ దామోదర ధర్మానంద కోశాంబీ ాడ 'పందిమాంసం' లోని ముల్లు ఒకటి బుద్ధుని గొంతుకలోదిగి ఆయన చనిపోయినట్లు ాశారు. కాని, చైనా గ్రంథాలననుసరించి 'సూకరమద్దవ' మనగా నొక రకమైన పుట్టగొడుగుల ంటకం ( A kind of mushroom dish often served as monk's meat) అని లుస్తున్నది. 'సూకర' మనే పదంతో ప్రారంభమయ్యే ఓషధులున్నాయి. సూకరఖండము, ాకరిష్టము ఇత్యాదులున్నాయని డా॥ రత్నాకరంబాలరాజు గారు వ్రాశారు.[5] ఈ సూకరమద్దవ' ను భిక్షువులకు వడ్డింపవద్దని, వారు దానిని జీర్ణించుకొనలేరని తాను మాత్రమే ఆహారాన్ని కొద్దిగా స్వీకరించాడు బుద్ధుడు. దానితో ఆయన అతిసార రోగగ్రస్తుడయ్యాడు. డుపులో బాధ కొంత తగ్గాక, ఆనందునితో కుశినగరానికి పోవాలని చెప్పాడు. వారలా యలుదేరారు.

దారిలో హిరణ్యావతీ నదికి అవలితీరం లోని కుశినగర ఉపవర్తనమైన మల్లుల సాలవనంలో జంట సాలవృక్షాల మధ్య అంగవస్త్రాన్ని నాలుగు పొరలుగా ఆనందుడు పరుచగా, తన చేతినే తలగడగా పెట్టుకొని బుద్ధుడు పవ్వళించినాడు. ఆనందుని పిలిచియిట్లన్నాడు.

''అన్నిటికంటె రెండు గొప్ప విందులు నా జీవితంలో లభించాయి. సుజాత ఆతిథ్యం వలన నాకు సంబోధి (జ్ఞానోదయం) కల్గింది. చుందుని ఆతిధ్యం వలన నాకు పరినిర్వాణం (జన్మరాహిత్యమోక్షం) కలుగుతున్నది. ఈ రెండు విందులును నాకు సమానంగా ప్రీతి పాత్రములే. ఈ విషయం స్వయంగా వెళ్లి చుందునితో చెప్పి అతని ఓదార్పు'' మన్నాడు.

**నాల్గు పుణ్యక్షేత్రాలు :** జన్మభూమి యైన కపిలవస్తును, బోధ భూమియైన గయను, ధర్మచక్రప్రవర్తన భూమియైన సారనాథ్, పరినిర్వాణ భూమియైన కుశినగరాన్ని పుణ్యక్షేత్రాలుగా భావించాలని, ఆ విశ్వాసంతో యాత్రలో మరణించిన వారు తుషిత స్వర్గధామ అలంకరిస్తారని, చంపా, రాజగృహ, శ్రావస్తీ, సాకేత, కౌశాంబీ, వారణాశి నగరాలలో చనిపోవడంకంటే, గొప్ప పూర్వవైభవం గల కుశి నగరంలో పరినిర్వాణం చెందడమే తనకెంతో యిష్టమని చెప్పాడు.

**మహాపరినిర్వాణం :**

సమస్తవస్తుదాహేఽపి యథాత్వం నేతరోన్నప।
సర్వత్యాగత ఏవాజ్ఞ తథా నిర్వాణముచ్యతే ॥

సర్వత్యా గో హి శూన్యాత్మా ఆశ్రయః సర్వసంవిదామ్
అనన్తానా ముదారాణాం ఖమివేదం దివాకసామ్ ॥

యోగవాసిష్ఠమ్ – నిర్వాణప్రకరణం I–93–54–55

తన సమస్త వస్తుజాతాన్ని వదలివేసినను లేక దహించివేసినా తాను శేషించియుండేటట్లు, సర్వత్యాగంచే శేషించిన ఆత్మయే నిర్వాణమనబడుతుంది. ఆ శూన్యాత్మయే (చిత్స్వరూపమే), సూర్యచంద్ర నక్షత్రాది తేజములకు శూన్యమైన ఆకాశమే ఆశ్రయమైనట్లు సమస్తజ్ఞానాలకు ఆశ్రయం.

బుద్ధుడు మహాపరినిర్వాణమందిన రోజు వైశాఖపూర్ణిమ. బుద్ధగయా శిలాశాసనాన్ని బట్టి క్రీ.పూ. **544** లేక **543** బుద్ధుని మహాపరినిర్వాణం జరిగింది. కాని చరిత్రకారులు క్రీ.పూ **483** అని చెబుతున్నారు.

బుద్ధుడు పరినిర్వాణం చెందిన ఏడవ రోజు దహనం కుశినగరంలో ముక్తబంధనమనే మల్లుల చైత్యంలో జరిగినది. అస్థి సేకరణం చేసి మల్లులు తమ సంస్థాగారానికి తీసుకొని వెళ్లారు. అక్కడ అస్థికలు ఏడు రోజులు అర్చింపబడినవి.

**ధాతు విభజనం :** బుద్ధుని పరినిర్వాణమైన తర్వాత ఎనిమిది మంది భాగస్వాములు బుద్ధ ధాతువులలో తమ వంతు కోరిన వారు :

1) మగధ దేశాన్ని పాలించే అజాత శత్రువు తాను బుద్ధుని వలె శాక్యవంశజుడు కాబట్టి తనకు భాగమిమ్మని కోరాడు.

2) వైశాలీనగర లిచ్ఛవీక్షత్రియులు

3) కపిలవస్తు శాక్యులు

4) అల్లకప్పబూలులు

5) రామగాయకోలియులు

6) పావామల్లులు

7) వేఠదీప బ్రాహ్మణులు

వీరిలో 8) కుశినగర మల్లులు – పై ఏడుగురి అభ్యర్థనను త్రోసి పుచ్చారు. చితావశేషములపై తమకే సంపూర్ణాధికారం ఉందని చెప్పారు. ఈ పరిస్థితిలో బ్రాహ్మణులు తప్ప తక్కిన ఏడుగురు క్షత్రియులు యుద్ధానికి సన్నద్ధులయ్యారు. ఆ సమయంలో ద్రోణుడనే బ్రాహ్మణుడు బుద్ధుని అస్థికల కోసం రక్తపాతం, హింస జరుగరాదని అందరికీ నచ్చజెప్పి బుద్ధ ధాతువుల్ని ఏనిమిది మందికి సమానంగా పంచియిచ్చి తాను పంచడానికి ఉపయోగించిన కొలపాత్రను మాత్రం తీసుకొన్నాడు. తాను దానిని పెట్టి చైత్యనిర్మాణం చేస్తానన్నాడు. అందరూ వెళ్లిన తర్వాత పిప్పలివనంలో మోరియ (మయూర) క్షత్రియులు తమకు వంతుకావాలని వచ్చారు. కాని, వారు చివరికి చితాభస్మాన్నే తీసుకొనిపోయారు. ఈ విధంగా పై పదిమంది పది స్థలాలలో బుద్ధ ధాతువులపై స్తూపనిర్మాణాలు చేశారు.

నేపాలు దేశపు సరిహద్దుకు సమీపంలో ఉండే పిప్రావా (Piprahwa) లో క్రీ.శ. 1893లో పురాతత్త్వ శాఖ వారి త్రవ్వకాలలో బయటపడ్డ స్తూపములో నిక్షేపించిన రాతిపాత్రలో బుద్ధుని అవశేషాలున్నాయి. గుండ్రముగానున్న దాని మూతపైన అశోకుని కాలం నాటి బ్రాహ్మీలిపిలో పాళీభాషలో యిలా వ్రాయబడివుంది.

**సుకితి భతినం, సభగినికానం సపుతదలానం ఇయం।**

**సలిలనిధానే బుధస భగవతే సకియానం ॥**

''ఇది శాక్యులు, వారి సోదరీమణులు, పుత్రులు, భార్యలు అందరూ కలసి బుద్ధుని అవశేషవులపై నిర్మించిన స్తూపవు. ''అంటే సామూహికంగా నిర్మింపజేసిన స్తూపమన్నమాట! ఈ పిప్రావా (Piprahwa) స్థానంలోనే పూర్వం కపిలవస్తుపురం ఉండేదని పురాతత్త్వ వేత్తల నిర్ణయం.[6]

## ప్రథమసంగీతి (First Great Buddhist Council):

క్రీ.పూ 7వ శతాబ్దాంతంతో బౌద్ధయుగం సమాప్తమైంది. బౌద్ధమత చరిత్రను క్రీ.పూ. 7-6 శతాబ్దాలలోని సాంఘిక పరిస్థితుల్నీ, పాళీ సారస్వతాన్ని గురించి కూడ తెలుసుకోవడం అవసరం. బౌద్ధమత చరిత్ర మహావంశ, ద్వీపవంశాలనే సింహళగ్రంథాలలో సమగ్రంగా చెప్పబడింది.

బుద్ధుని మహాపరినిర్వాణానంతరం మహాకశ్యపుని అధ్యక్షతన ప్రథమ సంగీతి క్రీ.పూ. 1793 లో రాజగృహం దగ్గర గల సప్తపర్ణిగుహలో జరిగింది. ఈ గుహ వైహారపర్వతం లోనిది. ఈ సభను ఏర్పాటు చేసిన వాడు మగధదేశాధిపతి, శాక్యవంశీయుడైన అజాత శత్రువు. ఈ ప్రథమ బౌద్ధ పరిషత్తుకు సభాధ్యక్షుడైన మహాకశ్యపుడు బుద్ధుని ఉపదేశాలు మౌఖికంగా ఉండి పోవడం న్యాయం కాదు. అవి లిపిబద్ధం చేసి గ్రంథరూపంగా క్రోడీకరింపబడాలని ప్రతిపాదించాడు.

ఈ సూచనను గ్రహించి ఉపాలి అనే శిష్యుడు జాతిలో మంగలి వాడైనా వినయగ్రంథానికి చెందిన బుద్ధుని ఉపదేశాలను తన ధారణా శక్తిచే పఠించి గ్రంథ రూపాన్ని కల్పించాడు. వినయ పిటకంలో ఆయనే చెప్పిన మరో గ్రంథం 'ఉపాలి పృచ్ఛ' నేడు అలభ్యంగా ఉంది. ఆనందుడు ధర్మసూక్తాలను క్రోడీకరిస్తే, అనురుద్ధుడు అభిధమ్మానికి గ్రంథరూపం కల్పించాడు. ఈ విధంగా సుత్త, గెయ్య, వాయకరణ, గాథ, ఉదాన, ఇతివుత్తక, జాతక, అద్భుత, వెదల్ల అనే తొమ్మిది అంశాలలో రచనలు క్రోడీకరింపబడ్డాయని ద్వీపవంశం తెలుపుతోంది.

ఈ ప్రథమ పరిషత్తు చేత నిర్ణయింపబడిన మతం థేరవాదం. ఈ పరిషత్తు జరిగాక ప్రతి పదిహేనురోజులకు ఒక చోట చేరి బౌద్ధ సూక్తాలను వల్లించేవారు. ఈ సమావేశాలకు ప్రతి మోక్షసమావేశాలని, ఉపోషథ లేక భిక్కుల పాక్షిక సమావేశాలని పేరు. వర్షాకాలంలో భిక్షువుల నివాసానికి 'వస్సవాస' అని పేరు. భిక్షువులు తమ అపరాధాలను అంగీకరించే సమావేశానికి 'పవరణ' మని పేరు.

థేరవాదాన్నే హీనయానమంటారు. హీనయాన, మహాయానాలను గురించి రాబోయే పుటల్లో చర్చిస్తాను. కాబట్టి యిక్కడ ప్రస్తావించడం లేదు. ఈ ప్రథమ సంగీతి జరిగాక నూరేండ్లు నిరాఘటంగా బుద్ధుని ఉపదేశాలు ప్రచారం పొందాయి.

## ద్వితీయ సంగీతి (Second Great Buddhist Council):

ప్రథమ సంగీతి జరిగాక నూరేళ్ల కాలంలో రాజకీయంగా, మతపరంగా ఎన్నో మార్పులు చోటుచేసికొన్నాయి. ఈ మార్పుల దృష్ట్యా రెండవ బౌద్ధ పరిషత్తు ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఇది క్రీ.పూ. 1690 లో వైశాలీ నగరంలో జరిగింది. ఈ పరిషత్తును ఏర్పాటు చేసిన వాడు

కాకవర్ణి లేక కాలా శోకుడనే రాజు. ఈ సమావేశంలో బౌద్ధులు రెండు శాఖలుగా చీలిపోయారు. మొదటి శాఖ వైశాలీ, పాటలీపుత్రాలకు చెందిన వారు. రెండవ శాఖ వారు కౌశాంబీ, అవంతి,పాథేయ ప్రాంతాలకు చెందిన వారు. బౌద్ధ మత ధర్మానుష్ఠానంలో పది విధాలైన సడలింపులు,ఈ సమావేశంలో అంగీకరింపబడ్డాయని వినయపిటకంలో చెప్పబడింది. అవి

1) బౌద్ధభిక్షువులు అవసరానికి ఉప్పు నిలువచేసికోవచ్చు.
2) భోజనం సకాలంలో కాక అకాలంలో కూడ చేయవచ్చు.
3) బౌద్ధ విహారాలు లేని చోట వినయసూత్రాలను కొంచెం సడలించి అనుసరించాలి.
4) విహారాలకు చెందిన ఉపోసత మందిరాలలో మాత్రమే కాకుండా ఆ ప్రాంతంలోని ఇతర స్థలాలలో కూడా దీక్ష (initiation)ఇవ్వడం, దోషాలను పెద్దల ముందు అంగీకరింపజేయడం చేయవచ్చు.
5) ఏదైనా పనిచేయడానికి ముందే బౌద్ధసంఘం యొక్క అంగీకారం అవసరమైనా, ఆ పని చేసిన తర్వాత కూడా ఆ అంగీకారాన్ని పొందవచ్చు.
6) పూర్వుల ఆదర్శాలను గ్రహించడమే ఏ కార్యానికైనా సరైన ప్రమాణం. (దీనిచే వ్యక్తులు ఆదర్శమూర్తులై వినయ సూత్రాలు నిరాదరింపబడ్డాయి.)
7) భోజనానంతరం నీళ్ళు, పాలువంటివి మాత్రమే గాక ఇతర పానీయాలను కూడ సేవించవచ్చు.
8) మత్తును కల్గించని నీరావంటి వాటిని కూడా సేవించవచ్చు.
9) ఆసనాలపైన అంచులు లేని వస్త్రాన్ని వేసుకోవచ్చు.
10) భిక్షువులు బంగారాన్నీ, వెండినీ స్వీకరించవచ్చు.

ఏడు వందల మంది భిక్షువులున్న ఈ సమావేశంలో అధిక సంఖ్యాకులు పై అంశాలను కోరడం చేత అల్ప సంఖ్యాకులు వీరి నుండి విడివడ్డారు. ఈ ద్వితీయపరిషత్తుకే మహాసంగీతి అనే పేరు ఏర్పడింది.

ఈ విధంగా బుద్ధుడు పరినిర్వాణమైన 150 సంవత్సరాలలోనే ఆయన శిష్యులు రెండు శాఖలుగా చీలిపోయారు. తొలినాటి ఆచార వ్యవహారాలను తు.చ. తప్పకుండా పాటించాలనే వారు థేరవాదులు, లేదా హీనయానులు కాగా, కొత్తగా విడివడ్డవారు మహాసాంఘికులనబడ్డారు. మహాసాంఘికులే ఆచరియవాదులని పిలువబడ్డారు. కాలక్రమంలో థేరవాదం పన్నెండు శాఖలుగా ఆచరియవాదం ఏడు శాఖలుగా చీలిపోయాయి. ఆచరియవాదంలోని భిన్నశాఖలే కలసి మహాయానంగా పరిణమించాయి.

రాను రాను నిర్మలమైన బౌద్ధ ధర్మంలో చాలా మంది ఆచారాలు, కర్మకాండలు, మంత్రతంత్రాలూ ప్రవేశపెట్టారు. ఇటువంటి కర్మకాండతో కూడిన బౌద్ధమతం టిబెట్, చైనా, జపాన్, మంగోలియా ప్రాంతాలలో వ్యాపించి అనేక మూఢవిశ్వాసాలకు ఆలయమైంది. దీనినే తాంత్రిక బౌద్ధం లేదా ఉత్తర బౌద్ధ మంటారు. దీన్ని గురించి విడిగా పరిశీలిస్తాను.

దక్షిణ బౌద్ధం సింహళం, బర్మా, గయా మొదలైన ప్రాంతాలలో వ్యాపించి వుంది. ఇదే బుద్ధుని ఉపదేశాలను శ్రద్ధగా అనుష్ఠిస్తున్నదని చెప్పవచ్చు. దీనిలో మూఢ విశ్వాసాలు, కర్మలు, మంత్రతంత్రాలు లేవు.[7]

## తృతీయ సంగీతి (Third Great Buddhist Council) :

దక్షిణబౌద్ధం, ఉత్తర బౌద్ధం, అనేవి నామమాత్రాలే. సింహళంలో పాళీ వాఙ్మయమంతా లభించింది కాబట్టి దానికి దక్షిణ బౌద్ధమని పేరు వచ్చింది. అశోకుని కాలంలో (క్రీ.పూ. **1474**) అతని కుమారుడైన మహేంద్రుడు సింహళానికి పాళీ సారస్వతాన్ని తీసుకు వచ్చాడు. సింహళంలోని బౌద్ధ వ్యాప్తిని గురించి మహావంశ, ద్వీపవంశాలు, నేపాళీ కావ్యాలు అభివర్ణిస్తున్నాయి. ఈ గ్రంథాలలో అశోకుడు బౌద్ధ ధర్మంలోని భేదాలను రూపు మాపడం కోసం ప్రయత్నించిన తీరు చెప్పబడింది. భేదభావంతో బౌద్ధ భిక్షువులు ప్రతి నెలా రెండు సార్లు జరిగే ప్రతిమోక్షసమావేశాలకు హాజరు కావడం ఏడు సంవత్సరాల కాలం మానివేశారట! అశోకుడు ఈ సమావేశాలను జరుపడానికి ప్రయత్నించి తన మంత్రిని నియోగించాడట! ఆ మంత్రి రాజాజ్ఞను అమలు పెట్టడంలో తిరుగుబాటు చేసిన భిక్షువుల శిరచ్ఛేదం చేశాడట! ఈ అమానుష కృత్యానికి అశోకుడు దుఃఖించి, పరసరారణ్యంలో ఉన్న మొగ్గలి పుత్త తిస్స అనే బౌద్ధ యోగిని పిలిపించి అతని అధ్యక్షతలో మూడవ బౌద్ధ పరిషత్తును జరిపించాడు. క్రీ.పూ. **1457**లో ఈ తృతీయ సంగీతి జరిగినది. అంటే అశోకుడు మౌర్యసింహాసనం అధిష్ఠించిన **17** సంవత్సరాలకు (17th regnal year, coronation 1474 B.C.)

ఈ మూడవ పరిషత్తు జరిగాక, అశోకుడు భేదవాదులకు తెల్లని వస్త్రాలిచ్చి, విహారాల నుండి బహిష్కరించాడు. అశోక ధర్మాన్ని వివరించే సందర్భంలో ఆ ధర్మం శుద్ధమైన గౌతముని ఉపదేశమేనని సిద్ధాంతం చేయబడింది. తిష్యముని 'కథావత్థు' (కథావస్తువు) అనే గ్రంథాన్ని రచించి బౌద్ధ ధర్మాన్ని పునరుద్ధరించాడు. అశోకుని కాలంలోనే వేర్వేరు ప్రాంతాలకు బౌద్ధధర్మ ప్రచారం కోసం భిక్షువులు పంపబడ్డారు. అశోకుని కుమారుడు మహేంద్రుడు సింహళ ద్వీపానికి (Srilanka) పోయి అక్కడే తన శేష జీవితాన్ని గడిపి పాళీభాషలోని త్రిపిటకాలనన్నింటినీ సింహళ భాషలోనికి అనువదింపజేశాడు.

# సింహళదేశంలో బౌద్ధమత వ్యాప్తి - దక్షిణ బౌద్ధం

దేవానాం ప్రియతిష్యుడు అశోకుని సమకాలికుడు. ఇతడు సింహళద్వీపానికి రాజు. ఈ రాజు 40 సంవత్సరాలు పాలించి, మహేంద్రభిక్షువు (అశోకుని కుమారుడు) కంటే ముందే మరణించాడు. తిష్యరాజు మరణానంతరం తమిళులు సింహళాన్ని ఆక్రమించుకొని 50 సంవత్సరాలు రాజ్యాధికారం సాగించారు. కడపటి దష్టగామని (క్రీ.పూ. 101-77) అనే పేరు గలవాడు తిష్యరాజు సోదరుని వంశస్థుడు తమిళుల్ని జయించి రాజ్యపాలన చేశాడు.

ఇతడు బౌద్ధ ధర్మానికి చాలా సేవ చేశాడు. అనురాధపురంలో మిరిస్వాతి (మరీచవతి) మహాథూప (మహాస్తూప) అనే ధగోబా (సింహళ భాషలో స్తూపానికి పేరు) లను నిర్మించాడు. మిరిస్వాతి స్తూపం ఎత్తు 150 అడుగులు. మహాస్తూపం ఎత్తు 200 అడుగులు. ఇతడు సహస్రస్తంభాలతో కూడిన లోహప్రాసాదమనే గొప్ప విహారాన్ని కూడా నిర్మించాడు. దీనిపైభాగం లోహనిర్మితం కనుక దీనికీ పేరు వచ్చింది. దష్టగామని మరణించిన ముప్పై ఏండ్ల తర్వాత తమిళులు మళ్లీ సింహాసనాన్ని ఆక్రమించుకున్నారు. కాని దష్టగామని సోదరుని పుత్రుడు వత్తగామని (వత్సగామని క్రీ.పూ. 43) వారిని మళ్లీ తరిమి వేశాడు. ఇతడు గొప్ప బుద్ధారాధకుడై అభయగిరి విహారాన్ని నిర్మించాడు. ఇతని కాలంలోనే పవిత్ర త్రిపిటక గ్రంథాలు మొట్టమొదటి సారిగా లిఖింపబడి అక్షరరూపాన్ని ధరించాయి. మహావంశం ఈ ముఖ్య సంఘటనను గురించి చెబుతూ ద్వీప వంశంలోని శ్లోకాన్ని ఉదాహరించింది. సింహళీయ సంప్రదాయ వాదుల లెక్క ప్రకారం బుద్ధుని పరినిర్వాణం జరిగిన 30 యేండ్లకే మౌఖికమైన త్రిపిటకాలు లిఖితరూపాన్ని ధరించాయి.

## ఉత్తర బౌద్ధం - బౌద్ధ దేవతలు :

బుద్ధుని నిర్వాణానంతరం నూటయాభై సంవత్సరాలలోనే అతని సద్ధర్మం అనేక శాఖలుగా చీలిపోయింది. వానిలో ప్రత్యేక శాఖలు ఉత్తర, దక్షిణ, బౌద్ధ శాఖలు. దక్షిణ బౌద్ధ గ్రంథాలన్నీ పాళీ భాషలో ఉన్నాయి. ఇది పాళీ సారస్వతంగా చెప్పవచ్చు. వీరిది హీనయానమార్గం. ఉత్తర బౌద్ధానికి చెందిన బౌద్ధ గ్రంథాలన్నీ సంస్కృతంలో రచింపబడ్డాయి. వీరిది మహాయాన మార్గం. ఉత్తర బౌద్ధం హిందూపురాణాలనన్నిటినీ కొద్దో గొప్పో భేదంతో అంగీకరించింది.

బుద్ధుడు తాత్త్వికమూ, పవిత్రమూ, సరళమూ అయిన తన ధర్మాన్ని సంఘ భిక్షువుల కోసం బోధించాడు. నిర్వాణ లక్షితమైన అతని అతీత ధర్మం భిక్షువులకు మాత్రమే

ఉద్దేశింపబడింది. అంటే ధర్మం కోసమే జీవించే వారికీ, జన్మరాహిత్యం పొందదలచిన వారికీ నిర్వాణకాములకు మాత్రమే ఈ అతీత ధర్మం ఉద్దేశింపబడింది. దక్షిణ బౌద్ధ సంప్రదాయానికి చెందిన వారందరూ ఇటువంటి వారే.

ఇతరులకూ జనసామాన్యానికీ, గృహస్థులకూ, లౌకికులకూ బుద్ధుడు ఏ ప్రత్యేక మతాన్ని బోధింపలేదు. అన్ని మతాలకు మూలమైన నీతిని మాత్రమే ఉపదేశించాడు. దేవుడు లేడు. ఆరాధన, కర్మకాండలు లేవు. అన్ని చెప్పినంత మాత్రం చేత బౌద్ధుడు నిరీశ్వరవాది అని అర్థం కాదు. నిర్వాణ సిద్ధికి - దైవవిచారం అనవసరమని అతని భావమై ఉండవచ్చు. జనసామాన్యానికి ఒక జన్మలోనే నిర్వాణం పొందడం అసాధ్యం. వారు కర్మజీవులు. కర్మననుసరించి వారికి జన్మపరంపరలు తప్పవు. వారికి దేవతలూ, కర్మకాండలూ అవసరమే. వారికి గృహస్థధర్మాలూ, సాంఘిక ధర్మాలూ అవసరమే. అందుకే, ఉత్తర బౌద్ధానికి చెందిన వారు జనసామాన్యాని కుపయోగపడే ధర్మాన్నీ, కర్మకాండనూ బోధించారు.

## బౌద్ధులస్వర్గాతీత లోకాలు (Buddhist Cosmos)

విశ్వానికి కేంద్రస్థానంలో మేరు పర్వతం ఉన్నది. దాని అగ్ర భాగంలో ఎనిమిది ముఖ్య శిఖరాలపైన పశు, భూత, మానవ లోకాలకు పైన స్వర్గ లోకంలో, భూతాల నుండి (దుష్ట శక్తుల నుండి) ప్రపంచాన్ని రక్షించే నలుగురు దిక్పాలక దేవతలున్నారు. ఈ స్వర్గధామంలోని తూర్పు భాగం గంధర్వరాజైన ధృతరాష్ట్రుడు పరిపాలిస్తూ ఉంటాడు. పశ్చిమ దిశను కబంధుల రాజైన యురుదాభుడు, దక్షిణ దిశను నాగుల రాజైన విరూపాక్షుడు, ఉత్తర దిశను యక్షరాజు కుబేరుడు పరిపాలిస్తున్నారు. ఈ స్వర్గం స్వర్గాలన్నిటికీ చాలా క్రిందిది. ఈ స్వర్గ లోకానికి పైన గల మేరు శిఖరం మీద ఇంద్రుని స్వర్గలోక మున్నది. ఇంద్రునితో పాటు ఏకాదశ రుద్రులూ, అష్టవసువులూ, ద్వాదశాదిత్యులు ఉంటారు. ఇది రెండవ స్వర్గం. దీనిపైన మూడవ స్వర్గం ఉన్నది. దీనిలో యముడు అతని పరివారమూ ఉంటారు. దీనిపైన నాల్గవ తుషిత స్వర్గం. దీనిలో బోధిసత్త్వులుంటారు. దీనిపైన గల ఐదవ స్వర్గం 'నిర్మవిరతి దేవళి'కి ఆవాసం. ఆరవ స్వర్గంలో మారుడు, అతని పరివారం ఉంటారు. ఈ స్వర్గాలకు పైన మరి మూడు స్వర్గాలున్నాయి. ఈ మూడు స్వర్గాలూ నాలుగు ధ్యానాలలోనూ సిద్ధులైనవారు నివసించేవి. వీటికి అధ్యక్షుడు మహాబ్రహ్మ లేక బ్రహ్మసంపాతి. ఈ ధ్యాన స్వర్గాలకు పైన గల నాల్గవ ధ్యానస్వర్గంలో అర్హతులుంటారు. దానిపైన ఐదవ స్వర్గంలో బుద్ధులు నివసిస్తారు. దీనిని బట్టి బుద్ధుడు ఇంద్రుని కంటె, మారుని కంటె, మహాబ్రహ్మ కంటె అధికుడని అర్థం.

**బౌద్ధత్రిమూర్తులు** : బుద్ధుడు రత్నత్రయాన్ని గురించి స్పష్టంగా ఏమీ చెప్పలేదు. కాని, అతని నిర్వాణానంతరం అతని శిష్యులు బుద్ధునీ, ధర్మానీ, సంఘాన్నీ మూడు రత్నాలుగా

ఆరాధించారు. హిందూ దేవతలైన బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు ప్రతిరూపాలే బౌద్ధదేవతలైన మంజుశ్రీ, పద్మపాణి (అవలోకితేశ్వర), వజ్రపాణులలో కనబడుతాయి. ఒక్కొక్క ధ్యాన స్వర్గానికి అధ్యక్షుడుగా ఒక్కొక్క ధ్యానీ బుద్ధుడుంటాడు. ఇతనితో పాటు బోధిసత్త్వులూ, మానవ బుద్ధులూ ఉంటారు.

| క్రమసంఖ్య | ధ్యానీ బుద్ధులు | బోధిసత్త్వులు | మానవబుద్ధులు |
|---|---|---|---|
| 1. | విరోచనుడు | సమంతభద్రుడు | క్రకు చంద్రుడు |
| 2. | అక్షోభ్యుడు | వజ్రపాణి | కనకముని |
| 3. | రత్నసంభవుడు | రత్నపాణి | కశ్యపుడు |
| 4. | అమితాభుడు | పద్మపాణి (అవలోకితేశ్వర) | గౌతముడు |
| 5. | అమోఘసిద్ధుడు | విశ్వపాణి | మైత్రేయుడు (రాబోవు బుద్ధుడు) (Future Buddha) |

ఈ బుద్ధులూ, బోధిసత్త్వులూ మాత్రమే కాక, ఇంకా చాలా మంది దేవతలు ఉత్తర బౌద్ధంలో వెలిశారు. ఉత్తర బౌద్ధదేశాలలో ఈ దేవతలకు దేవాలయాలూ, చైత్యాలూ నిర్మింపబడ్డాయి. దీనిలో నుండి తాంత్రిక బౌద్ధం కూడా వచింది. తాంత్రిక దేవతలు విహారాలలో, ఆరామాలలో అనేక శిరోబాహు నేత్రాలతో ప్రతిష్ఠింపబడ్డారు. హిందువుల పరబ్రహ్మ వలె ఆదిబుద్ధుడు సర్వాతీతుడు. అతడు వాదాల కతీతుడైనా బౌద్ధ జన సామాన్యం అతనిని విశ్వసించి ఆరాధించింది.

### బౌద్ధమతంలోని వివిధ శాఖలు - వివిధ వాదాలు :

బుద్ధుని నిర్వాణానంతరం క్రీ.పూ. 1690 లో వైశాలీ నగరంలో జరిగిన రెండవ బౌద్ధపండిత పరిషత్తు (Second Buddihst Council)ను గురించి మనం ముందే తెలిసికున్నాం.

ఈ సభ అత్యంత ప్రముఖమైంది. ఈ సభలోనే తూర్పు దేశంలోని వైశాలీ, పాటలీపుత్రాల వారికి, పశ్చిమంలోని కౌశాంబీ, అవంతీ దేశాలకు ఒక సంఘర్షణ ఏర్పడింది. కౌశంబీ వాసుల యొక్క ఆగ్రహాన్ని సరకు చేయకుండ వినయపిటకం లోని పది సూత్రాలను (వీటిని ముందే చెప్పడం జరిగింది) వైశాలీయుల అవలంబించడమే ఈ సంఘర్షణకు కారణమైంది. ఈ రెండు పక్షాల వారి భేదాలను నిర్మూలించడానికి ఒక్కొక్కవైపు నుండి నలుగురి చొప్పున తీసికొనబడిన సభ్యులతో ఒక సంఘ మేర్పడి చర్చలు జరిగాయి. కాని, దాని వల్ల ప్రయోజనం లేక పోయింది. ''వజ్జిపుత్తకులు''గా ప్రసిద్ధినొందిన వైశాలీయులు ఈ సభలోనినిర్ణయాలను అనుసరించక ''మహాసంఘీతి'' అనే మరొక సభను ఏర్పాటు చేసి తమ పదిసూత్రాలను ప్రామాణికంగా నిరూపించుకున్నారు.

ఈ విధంగా పెద్దవారమని పించుకొన్నకౌశాంబీయులు స్థవిరులని, వీరిచే వెలివేయబడ్డవారు మహాసాంఘికులని రెండు తెగలు ఏర్పడ్డారు. స్థవిరవాదులలో సర్వాస్తివాదులని, సమ్మితీయులని మరి రెండు తెగలేర్పడి ఈ తెగలకు ఉపశాఖలు చాలా ఏర్పడ్డాయి. వసుమిత్ర, వినీతదేవ, భావ్యులనే ప్రాచీన చరిత్రకారులు **18** బౌద్ధ శాఖలను పేర్కొన్నారు. వీటిలో పై చెప్పబడిన **స్థవిరవాదులు, సర్వాస్తివాదులు, మహాసాంఘికులు, సమ్మితీయులు** అనే వారు ప్రధానశ్రేణిలోని వారు.

మహా సాంఘికులు, మహాకాశ్యపుని తమ మూల పురుషునిగా భావిస్తారు. వీరి కేంద్రస్థానం వైశాలీ నగరం. ఆ తర్వాత ఆంధ్రదేశంలోని అమరావతి, నాగార్జునకొండలకు వ్యాపించింది. వీరి వద్ద ఐదునికాయములుగా విభజింపబడిన సుత్తపిటకాలు, ఇప్పుడు చైనా భాషలోనికి చేయబడిన అనువాదరూపంగానే లభ్యమయ్యే వినయపిటకాలును ఉండేవి. ఈ మహాసాంఘికులలో **'పూర్వశైల, ఉత్తరశైర, అపరశైల, చైత్యక'** మనే పేర్లుగల నాలుగు శాఖలు బయలుదేరాయని అమరావతి, నాగార్జున కొండలలోని శిలాశాసనాల వలన తెలుస్తూవుంది.

వైశాలి లోని భిక్షువులు **పూర్వ భిక్షువులమని,** కౌశాంబి లోని వారు **పశ్చిమ భిక్షువులమని** చాటుకొన్నారు. వైశాలి లోని వారు **మహాసాంఘికులుగా,** కౌశాంబీ లోని వారు **ఆచార్యవాదులు లేక స్థివిరవాదులుగా** ప్రసిద్ధులైనారు.

అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించడం బౌద్ధమతచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన ఘట్టం. ఇది కళింగ దేశాన్ని జయించిన తర్వాత ఆయనలో వచ్చిన మార్పు. తాను సింహాసనమధిష్ఠించిన (క్రీ.పూ **1474**) **17** సంవత్సరాల తర్వాత అంటే క్రీ.పూ **1457**లో తృతీయ బౌద్ధపండిత పరిషత్తు ( The Third Great Buddhist Council) కు సంబంధించి ఒక 'దంతకథ' ప్రచారంలో ఉంది. అశోకుడు బౌద్ధభిక్షువుల మహాసభనొకదానిని ఏర్పాటు చేయించమని కోరగా, అతని ఉద్యోగులలో ఒకడు చక్రవర్తి యొక్క యిష్టానికి వ్యతిరేకంగా ఉండే కొందరు భిక్షువులకు నాయకుడయ్యాడు. తాను తలపెట్టిన కార్యానికి ఆటంకం కల్గడంతో అశోకుడు విచారించి, ''మొగ్గలిపుత్తతిస్స' అనే మహానుభావుని సహాయం అర్థించాడు. ఆ వ్యక్తి ఎదిరించిన భిక్షువుల నందరినీ విభజ్యవాదుల (థేరవాదుల) సంఘం నుండి తొలగించాడు. ఇలా తొలగింపబడిన భిక్షువులందరూ ప్రత్యేకంగా ఒక సభను ఏర్పరచుకొని ''కథావత్థు'' అనే గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథం థేరవాదుల 'అభిధమ్మ పిటకం' లోని ఐదవ భాగంగా పరిగణింపబడింది.

ఈ కాలంలో ఇతర దేశాలకు చెందిన రాజులు కూడ బౌద్ధమతాన్ని ఆదరించినట్లు తెలుస్తోంది. ''మిళిందపన్హా'' లో మిళిందరాజు (Menander) నాగసేనుడనే బౌద్ధభిక్షువుకు వేసిన ప్రశ్నల వలన, మరికొన్ని సాక్ష్యాల వలన గ్రీకు రాజులు బౌద్ధమతాన్ని ఆదరించినారని తెలుస్తున్నది. కుషాను వంశస్థుడైన కనిష్కుడు బౌద్ధమతావలంబియైన మహారాజు. ఇతడు బౌద్ధమతంలో ఏర్పడిన వివిధ శాఖోపశాఖల పరిస్థితిని చక్కబరచటానికై కౌశాంబిలో పార్శ్వుని

సహాయంతో వసుమిత్రుని అధ్యక్షతలో ఒక మహాసభ ఏర్పాటు గావించాడు. ఇది చతుర్థ బౌద్ధపండిత మహాపరిషత్తు ( The Fouth Great Council of Buddhist Monks) దీనిలో జరిగిన చర్చలు, వ్యాఖ్యాన రూపంలో 'విభాష' శాస్త్రమనే పేరుతో గ్రంథస్థాలయ్యాయి. టిబెట్టు చరిత్రకారుడైన తారానాథుని వలన, పరమార్థ గ్రంథం నుండి కూడ ఈ సభ సర్వాస్తి వాదుల సభయని తెలుస్తోంది. అశోకుని కాలం నాటి మూడవ మహాసభ థేరవాదులది కాగా కనిష్కుని కాలంనాటి చతుర్థమహాసభ సర్వాస్తి వాదులది. బౌద్ధ మతంలోని ప్రధాన శాఖలైన హీనయాన మహాయానాలకంటె ముందే, థేరవాద, మహాసాంఘిక, సర్వాస్తి వాద, సమ్మితీయములనే నాల్గు ప్రధాన శాఖలు బౌద్ధమతంలో ఉండేదని దీన్ని బట్టి తెలుస్తున్నది. నాగార్జునాచార్యుడు బౌద్ధమతంలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన మాధ్యమికవాదాన్ని స్థాపించాడు. ఈ క్రింది పట్టిక వలన బౌద్ధమతంలో వివిధ శాఖలు ఏ విధంగా ఎప్పుడెప్పుడు ఏర్పడ్డాయో తెలుసుకోవచ్చు.

## బౌద్ధమతంలోని వివిధ శాఖలు - వాదాలు



# హీనయాన - మహాయానములు

బౌద్ధమతంలో అతిప్రాచీన దశలోనే హీనయాన, మహాయాన శాఖలేర్పడ్డాయి. ఈ రెంటి యొక్క భేదాలను ఒక తులనాత్మక పట్టికగా చూపడానికి ప్రయత్నిస్తాను.

| క్రమ సంఖ్య | హీనయానం | మహాయానం |
|---|---|---|
| 1. | హీనయాన మంటే చిన్నవాహన మని అర్థం | మహాయానమంటే పెద్దవాహన మని అర్థం |
| 2. | థేరవాదులే హీనయాన బౌద్ధులు వీరిది పశ్చిమ దేశ సంప్రదాయం | మహాసాంఘికులే మహాయాన బౌద్ధులు వీరిది పూర్వదేశీయ సంప్రదాయం |
| 3. | లక్ష్యసిద్ధిలో హీనయానం నీచమైన సంకుచిత స్థానం ఆక్రమిస్తుందనీ | మహాయానం విశాలమైన ఉన్నత స్థానం అలంకరిస్తుందని క్రీ.శ. 480 లోని 'అసంగు' డనే ఆచార్యుడు మహాయాన సూత్రాలంకారంలో చెప్పాడు. |
| 4. | మానవుడు తన నిర్వాణానికై తాను ప్రయత్నం చేయాలి | అర్హతులు మానవులందరి నిర్వాణానికై ప్రయత్నిస్తారు. |
| 5. | హీనయానభిక్షువు జ్ఞానసిద్ధిచే జీవితలక్ష్యాన్ని సాధిస్తాడు. | మహాయాన బోధిసత్త్వులు అజ్ఞానుల నుద్ధరించడానికై మరల మరల జన్మించ డానికి సిద్ధపడుతారు. |
| 6. | వస్తువులన్నియు అశాశ్వతములు ఏ వస్తువూ స్థిరంగా ఉండదు. | ప్రపంచములో వస్తువులన్నీ శూన్యములు అనవసరములు. శూన్యతను, సంపూర్ణ వాసనా నాశనాన్ని జీవిత లక్ష్యాలుగా గ్రహించారు. |
| 7. | ప్రాచీన బౌద్ధమతంలో జనసామాన్యానికి చేసిన ధర్మోపదేశాలకు, జిజ్ఞాసువులకు చేసిన ఉపదేశాలకు ఎలాంటి భేదము, విచక్షణ కల్పించబడ లేదు. | మహాయానంలో ఈ విచక్షణ కనబడుతుంది |

| 8. | హీనయానశాఖలైన వైభాషిక, సౌత్రాంతికముల ననుసరించి ప్రపంచంలోని వస్తువులన్నీ దేశకాలాల ననుసరించి ఉన్నాయన్నీ విశ్వం స్వశక్తిచే నిలిచివున్నదనీ నమ్ముతారు. | మహాయానంలోని యోగచార, మాధ్యమిక వాదుల్లో, యోగాచారవాదులు, మానసిక భావన సృష్టికి కారకమని, అదే మూల సూత్రమని నమ్ముతారు. మాధ్యమిక వాదులు అంతామిథ్యయని, నాశాత్మకమని వాదిస్తారు. కాబట్టి వీరిని '**సర్వవైనాశిక వాదు**' లని పిలుస్తారు. |
|---|---|---|
| 9. | హీనయానంలో సర్వసంగపరిత్యాగం గావించి భిక్షువుగా చేరి వినయ, సుత్త, అభిధమ్మలనే త్రిపిటకాలను అధ్యయనం చేసి పరిజ్ఞాతయ్యై అర్హతుని పదం పొందిన వానికే నిర్వాణోపలబ్ధి కల్గుతుంది. అందుకే, హీనయానానికి '**అర్హతయాన**' మని పేరు. | మహాయానంలో సర్వసంగపరిత్యాగం చేయనవసరం లేదు. దీనిలో బోధిసత్త్వులు అసంఖ్యాకులు . వీరు భార్యాసహితులు. సంపత్సమేతులు. వీరి చుట్టూ అపూర్వ మైన గాథలనేకం అల్లుకొని మహాయానా నికి గొప్ప పురాణవాఙ్మయం ప్రసాదించింది ఇలా, బోధిసత్త్వులకు ప్రాధాన్యం గలిగిన మహాయానానికి '**బోధిసత్త్వయాన**' మనే పేరు ఏర్పడింది. |
| 10. | హీనయానంలో బుద్ధుడు, ధర్మము, సంఘంతో పాటుగా, ధర్మానికే అత్యధిక ప్రాధాన్యం | మహాయానంలో బుద్ధుడు, ధర్మము సంఘంతో పాటు, బుద్ధునికే అత్యధిక ప్రాధాన్యం. |

**బౌద్ధమతంలో వెలసిన నాల్గుతాత్త్విక శాఖలు :**

బౌద్ధమతంలో వైభాషిక, సౌత్రాంతిక, యోగాచార, మాధ్యమిక వాదాలనే నాల్గుతత్త్వ శాఖలు ఏర్పడ్డాయి. బుద్ధుడు సామాన్య ప్రజలకు ఉపయోగపడే మార్గాన్నే అన్వేషించాడు. ఆయన స్వయంగా తత్త్వశాస్త్రంలోని గహనములైన విషయాలను తార్కికంగా ఆలోచించి, వివేకంతో అర్థం చేసికొన్నాడు. బుద్ధుడెప్పుడూ ఒక ఉపదేశాన్ని చేసి దాన్ని గుడ్డిగా అనుసరించాలని ప్రజలతో చెప్పలేదు. తన ఉపదేశాలను విని, మనస్సులో తర్కించుకొని, దాని కనుగుణంగా తాము ప్రవర్తించాలని చెప్పాడు. అయితే, ఆయన బుద్ధుడే వేదాంతంలోని కొన్ని మౌలిక సూత్రాలపై ఒక నిర్దిష్టాభిప్రాయాన్ని పొంద లేక పోయాడు. ఉదహరణానికి ఆత్మానాత్మ సిద్ధాంతం, ప్రపంచం యొక్క శాశ్వతత్వం మొదలైనవి.

ఈ సూత్రాలలోని లోపాలను పరీక్షించాలనే జిజ్ఞాస బుద్ధుని జీవిత కాలంలో ఆయన వ్యక్తిత్వప్రభావానికి కట్టుబడిన ఏ శిష్యునికీ కలుగలేదు. ప్రజలందరూ ఆయన అమృతమయోపదేశాలను మంత్ర ముగ్ధులై విన్నారు. బుద్ధుని తర్వాత ఆతని వ్యక్తిత్వాకర్షక శక్తికి లోబడని ఆయన పరోక్ష శిష్యులు ఆయన ఉపదేశాలను మాత్రమే గ్రహించి పరీక్షించి చిన్న చిన్న సందేహాలను వెలిబుచ్చారు. ఈ సందేహాస్పదాలైన స్థానాలను చాలా మంది ఆచార్యులు వివిధ రీతుల్లో తమ బుద్ధికి తోచినట్లు వివరించి, వ్యాఖ్యానించి నాల్గైదు శాఖలు తలయెత్తడానికి కారకులయ్యారు.

వైశాలిలో జరిగిన రెండవ బౌద్ధ మహాసభలోనే బౌద్ధులు థేరవాదులుగా, మహాసాంఘికులుగా విడిపోయారని, థేరవాదులే హీనయానులుగా, మహాసాంఘికులే మహాయానులయ్యారని చెప్పికొన్నాం. హీనయాన శాఖలో వైభాషిక, సౌత్రాంతికములనే తత్త్వ శాఖలు తలెత్తగా, మహాయాన శాఖలో యోగాచార, మాధ్యమికతత్త్వ శాఖలు ఏర్పడ్డాయి. వీటిలో ఒక్కొక్కదాన్ని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం. హిందూమతాచార్యులు కూడా ఈ నాల్గు శాఖల్నే పరిగణించి ఖండించారు. ఉపశాఖల్ని లక్ష్యపెట్టలేదు.

**వైభాషికవాదం :** కనిష్కుడు కాశ్మీర దేశంలో ఏర్పరచిన నాల్గవ బౌద్ధ మహా సభలో అభిధర్మసూత్రాలపై వ్రాసిన విభాష (వ్యాఖ్యానం) ఒకటి వెలువడింది. ఈ విభాషను ఒప్పుకొనిన వారు వైభాషికులని పిలువబడ్డారు. సంస్కృతంలో వ్రాయబడిన ఈ విభాష యిప్పుడు లభించడం లేదు. కాని, దానికి చైనీయ భాషలో వ్రాయబడిన రెండు అనువాదాలు మాత్రం లభ్యమౌతున్నాయి. ఈ వైభాషిక శాఖ బుద్ధుని అనంతరం మూడు శతాబ్దాల తర్వాత (క్రీ.పూ. 2వ శతాబ్ది) ఏర్పడింది. ఇది క్రీ.శ. 2వ శతాబ్ది నాటికి ఒక సంపూర్ణ రూపాన్ని ధరించింది. ఇది హీనయాన శాఖ.

అభిధమ్మవ్యాఖ్యానమైన 'విభాష' పై నమ్మకం గల వారు వైభాషికులన్నాము. వీరు సర్వాస్తివాదులలో ఒక తెగ. ఈ వాదంలో కాత్యాయనీ పుత్రుడు వ్రాసిన జ్ఞానప్రస్థానమనే గ్రంథం. దానికి 'విభాష' అనే వ్యాఖ్యానం ప్రమాణ గ్రంథాలుగా స్వీకరింపబడ్డాయి. వైభాషికులు అభిధమ్మాన్నే ప్రమాణంగా గ్రహించి ఇతర సూత్రాలను 'విరుద్ధా భాసాలు' గా 'అర్థరహితాలు' గా త్రోసి పుచ్చారు.

వైభాషికులు సర్వాస్తివాదుల్లో ఒక తెగ కాబట్టి, వారి మతం అర్థం చేసికోవటానికి సర్వాస్తివాదమంటే ఏమిటో తెలుసుకోవాలి. వసుబంధువనే ప్రసిద్ధ బౌద్ధపండితుడు భూత భవిష్యద్వర్తమానము లన్నింటిలో వస్తువుల యొక్క అస్తిత్వాన్ని గుర్తించడమే సర్వాస్తివాదమని

చెబుతూ వాటికి నాల్గు కారణాలు కూడ చెప్పాడు.

1. బుద్ధుడు త్రికాలముల కస్తిత్వ ముందని చెప్పడమే ఒక గొప్ప ప్రమాణం.

2. భూత, భవిష్యత్కాలాలు లేనిదే మనస్సులో ఆలోచన కల్గదు.

3. భూత భవిష్యత్తులు వర్తమానానికి ఆలంబనాలు. అవి లేకుంటే ఎలాంటి జ్ఞానం కూడ మనస్సులో నిలువదు.

4. భూత, భవిష్యత్తులే లేక పోతే బౌద్ధమతంలో ప్రధానమైన కర్మసిద్ధాంతం చెల్లదు. కాబట్టి భూతకాలం లోని కర్మ వర్తమాన జన్మాన్ని ప్రభావితం చేస్తుందని ఒప్పుకొన్నప్పుడు ఈ త్రికాలాలను ఒప్పుకోవలసి వస్తుంది.

ఈ వాదం ప్రకారం త్రికాలాల అస్తిత్వం అంగీకరిస్తే, బౌద్ధమత మూలసూత్రమైన వస్తుక్షణికత్వం, అశాశ్వతత్వాన్ని నిరూ పించే ధర్మాన్ని వ్యతిరేకింపవలసి వస్తుంది. బౌద్ధమతం విశ్వమే క్షణికమని, ఏదీ శాశ్వతం కాదని చెబుతుంది. ఇది వైభాషిక వాదానికి పెద్ద ఆటంకమైంది. ఈ ప్రశ్నకు సమాధానాన్ని నల్గురు ఆచార్యులు నాల్గు విధాలుగా చెప్పారు.

1. ఆచార్య భదంత ధర్మత్రాత, 'మార్పు' అనేది స్వరూపం లో వస్తుంది కాని వస్తువులో కాదని చెబుతూ, బంగారమే వివిధ ఆభరణాలుగా రూపధారణం చేస్తున్నది కదా! అన్నాడు.

2. ఆచార్యభదంతఘోషుడు కార్యంలో మార్పు వస్తు లక్షణం లోనే గాని వస్తువులో కాదని చెబుతూ ఒక కాలానికి చెందిన వస్తువు ఇతర రకాల గుణాలను కలిగియుండక పోయినా వస్తు లక్షణాన్ని కోల్పోదు కదా! అన్నాడు.

3. ఆచార్యభదంత వసుమిత్రుడు 'మార్పు' అనేది వివిధావస్థల లోనే కలుగుతుంది కాని వస్తువుకు కలగదని చెబుతూ ఒక మట్టి ముద్దను ఒకటి, రెండు సంఖ్యలపై నొక్కితే ఆ సంఖ్యలే ముద్రింపబడుతాయి. ఇది అవస్థాగతమైన మార్పు తప్ప అసలు మట్టిముద్దలో మార్పురాలేదన్నాడు.

4. ఆచార్యబుద్ధదేవుడు మార్పులు వివిధ వస్తుసంబంధాల వలన కలుగుతాయని, ఒక వస్తువును దానికి ఇతర వస్తువులతో గల సంబంధం చేతనే వివరింపదగిందని చెబుతూ, ఒక స్త్రీ, ఒకనికి భార్యగా, మరియొకడికి తల్లిగా, వేరొకనికి కూతురుగా వివిధ సంబంధాలచే ఉంటున్నది.

ఇక్కడ మార్పు అనేది పేర్లచేత వ్యవహార దశలో ఏర్పడిందే తప్ప వ్యక్తి ఒక్కటే! 'సంబంధం చేత వివిధ నామాలు సర్వ వస్తు జాలానికి సహజాలు' అన్నాడు.

వైభాషికులు భూతాంతర్గతమైన శాశ్వతసత్యాన్ని గుర్తించే యధార్ధవాదులు. వీరి మతం ప్రకారం బుద్ధుడు మానవమాత్రుడే. 'నిబ్బానం' (నిర్వాణం) తర్వాత అతడు తనలోని 'నేను' అనే అహంకారాన్ని కోల్పోయాడు. అతనిలోని దివ్యజ్ఞానమే అతనికి దివ్యత్యం సిద్ధింప జేసింది.

**సౌత్రాంతిక వాదం :** ఇది హీనయానంలోని రెండవ తాత్త్విక శాఖ. బుద్ధుడు జీవించి యున్నప్పుడు కొందరాయన వద్దకు పోయి "ఈ సూత్రముల కంతమెచ్చట నున్న"దని అడిగారట! వారితో బుద్ధుడు "సూత్రములపై జిజ్ఞానగల్గిన మీరు సౌత్రాంతికులవుతారు" అని చెప్పారట! బుద్ధుని తర్వాత నాల్గు శతాబ్దాలకు సౌత్రాంతిక శాఖ ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. వీరు సూత్ర పిటకాన్ని ప్రమాణాంగా గ్రహిస్తారు. ఇంకొక తెగ వారు ఇతర శాఖల ప్రమాణాన్ని కూడ గ్రహిస్తారు. నాగార్జునాచార్యుని సమకాలీనుడైన 'కుమారలాటుడు' ఈ వాదాన్ని స్థాపించినవాడు. వసుబంధుని అభిధర్మకోశానికి వ్యాఖ్య వ్రాసిన గొప్ప బౌద్ధ తార్కికుడైన ధర్మోత్తరుడు ఈ శాఖకే చెందినవాడు.

సౌత్రాంతికులు సర్వాస్తివాదులు. అభిధర్మం యొక్క ప్రామాణ్యాన్ని నిరాకరిస్తారు. బుద్ధుడు స్వయంగా అభిధర్మం ఉపదేశించలేదని వీరి వాదం. వైభాషికుల వలెనే వీరు కూడ విశ్వము యొక్క అస్తిత్వాన్ని అంగీకరిస్తారు. వీరికి వైభాషికులకు గల ప్రధాన భేదమేమంటే, వైభాషికులు ప్రపంచమంతా ప్రత్యక్ష జ్ఞానం అనుమాన ప్రమాణం చేత స్థిరపరుస్తారు. విజ్ఞానవాదం లోని విజ్ఞానాన్ని కూడ వీరంగీకరిస్తారు. వీరు అలంబనం వల్ల కలిగే విజ్ఞానాన్నే కాక, విజ్ఞానమనేది స్వతంత్రంగా కూడ కల్గుతుందని నమ్ముతారు.

బహిఃప్రపంచం యొక్క అస్తిత్వాన్ని సౌత్రాంతికులంగీకరించి, వస్తుజ్ఞానం ఆలంబనం, సమానాంతరం, సహకారి అనే పదిరూపాలపై ఆధారపడి ఉంటుందని వీరి వాదం. ఈ వాదం ప్రకారం నీలమైన ఆలంబనం నుండి జ్ఞానమనే గుర్తు, నీలమైన ఆకారంతోనే వెలువడుతుంది. సమానాంతరం నుండి పూర్వజ్ఞానానికి పునరుజ్జీవనం కలుగుతుంది. 'న్యాయబిందువు' అనే గ్రంథంలో ధర్మకీర్తి, పేర్లకు వస్తువులకు గల పరస్పర సంబంధం మనస్సుచే చేయబడిందని, ఇంద్రియాలు కేవలం ఆలంబన వస్తువుల్ని మాత్రమే నిరూపిస్తాయని చెప్పాడు. ఇలాంటి స్వచ్ఛమైన జ్ఞానం వస్తువు యొక్క స్వలక్షణాన్నే నిరూపిస్తున్నది. ఇలా, సౌత్రాంతికులు మనస్సులోని కర్తృపరమైన భావనకు ఇంద్రియాలచే ప్రత్యక్షం చేసికొనదగిన ఆలంబన వస్తువు

లేకున్నా అస్తిత్వం కల్గివుంటుందనే చెబుతారు. విజ్ఞానమనేది స్వచ్ఛరూపంతో ఉంటుంది. ఆలంబనం లేకున్నా జ్ఞానం తనంతటనే స్వతంత్రంగా ఉంటుంది. కాబట్టి, మానవునికి 'ఆత్మ' – 'జ్ఞానము' ఉంటుంది. ఈ వాదం యథార్థవాదానికి సరిపోలుతున్నది.

సౌత్రాంతికులలో ఒక మానవుని యొక్క లేక వస్తువు యొక్క 'సంతతి అనువాదం' (క్రమంగా జరగడం) అతి ప్రధానమైంది. నాగసేనుడనే బౌద్ధభిక్షువుకు గ్రీకురాజైన మిళిందునికి (Menander) జరిగిన సంభాషణా గ్రంథం 'మిళింద పన్హా' లో ఈ అంశం వివరింపబడివుంది.

'అభిధర్మకోశం' యొక్క వ్యాఖ్యాతయైన వసుబంధుడు, మహాసౌత్రాంతికుడైన యశోమిత్రుడు భగవంతుని అస్తిత్వాన్ని గూర్చి యిలా చర్చించారు. ''జీవులు, ఈశ్వరునిచేగాని, పురుషునిచే గాని, ప్రధానముచేగాని (ప్రకృతి – పదార్థము) సృజింపబడలేదు. భగవంతుడే విశ్వసృష్టికి మూలకారకుడైనప్పుడు ఆ భగవంతుడు వాసుదేవుడు గాని, మహాదేవుడు గాని విశ్వమంతా ఒకే సారి అతనిచే పురుషుడుగా పదార్థతత్త్వమైన ప్రకృతిగా, పరిపూర్ణతచే సృజింపబడింది. కారణముండి కార్యం లేక పోవడం ప్రపంచ ధర్మం కాదుకదా! మనం మన అనుభవంలో జీవులు క్రమంగా పుట్టడం చూస్తున్నాం. కాని, ఒకే సారి పుట్టడం లేదు కదా! కొన్ని జీవులు జరాయుజాలై, కొన్ని ఉద్భిజ్జములై, మరికొన్ని అండజములై ఉన్నాయి. అందువల్ల కొన్ని క్రమరూపకాలైన కారణాల వరుసచే విశ్వసృష్టి జరుగుతోంది. కాని, భగవంతుడొక్కడే దీనికి కారణమని చెప్పడానికి వీలు లేదు. కాని ఇలాంటి సృష్టి కూడ భగవల్లీలయే! అని చెబుతూ, ఈ 'జీవులిప్పుడు పుట్టాలి' అని భగవంతుడనుకొనినప్పుడే ఆ జీవుల సృష్టి జరుగుతుందని వాదింపబడింది. ఈ విధంగా జీవుల యొక్క సృష్టిక్రమం వివరింపబడి భగవంతుడే దీనికి కారణమని కూడ నిరూపింపబడింది.

ఈ వాదానికి మేమిలా ఉత్తర పక్షం ఇస్తున్నాము. భగవల్లీలచే జరిగే చాలాపనుల్ని ఒప్పుకోవడం చాలా కారణాలు ఒప్పుకోవడమే అవుతుంది. కాబట్టి భగవంతుడొక్కడు మాత్రమే విశ్వసృష్టికి ఏకైక కారణమనే వాదాన్ని ఖండిస్తున్నాము. వివిధాలైన ఈ కార్యాలకు కర్తయైన భగవంతుడు ఒక అవిభాజ్యసత్యమై చాలా కారణాలను సృష్టిస్తుంది. కాబట్టి ఈ పృథక్త్వం పొందిన కారణాలన్నీ ఒకే సారి సృజింపబడినవై ఉండాలి. శాక్యపుత్రులు ''ప్రపంచం అనాది'' అని చెబుతారు. ఇవి సౌత్రాంతికుల వాదంలోని ప్రధానాంశాలు.

**యోగాచారవాదం : ఆచార్యఅసంగుడు, వసుబంధుడు**

యోగాచార వాదం యొక్క స్థాపకుడైన ఆచార్య అసంగుడు క్రీ.శ. మూడవ శతాబ్దంలోని వాడు. 'ఆర్యసింగు' డనే పేరే అసంగుడుగా మారినది. ఇతని చిట్టచివరి తమ్ముడైన వసుబంధుడు

కూడా విజ్ఞానవాదాన్ని ప్రతిపాదించే యోగాచార శాఖకు మూలపురుషుల్లో ఒకడు. సౌత్రాంతికులు ప్రపంచం యొక్క ఆస్తిత్వాన్ని అనుమానంచే నిరూపించవచ్చుగాని, ప్రత్యక్షంగా తెలిసికోలేమని చెబుతారు. ఈ విజ్ఞానవాదులు ప్రపంచం యొక్క అస్తిత్వాన్నే పూర్తిగా నిరాకరిస్తారు. వీరు బుద్ధునికి జ్ఞానోదయం యోగాచరణ చేతనే కల్గిందని, ఈ యోగమే ఆచరణయోగ్యమని నిశ్వసిస్తారు. ఇందలి తాత్త్విక భావనల్ని విజ్ఞాన వాదం చేత వివరిద్దాం!

విజ్ఞానమొక్కటే సత్యమని భావిస్తారు విజ్ఞానవాదులు. ''సర్వమ్ బుద్ధిమయం జగత్'' అనేది వీరి దీక్షావాక్యం! ఆత్మ నిరాకరణ, వస్తునిరాకరణలే యోగాచారుల మతసారాంశం. వీరిని ''పుద్గల నైరాత్మ్య''లని, ''ధర్మనైరాత్మ్య''లని పిలుస్తారు. ఈ శాఖలో వస్తుతత్త్వం పరికల్పిత, పరతంత్ర, పరినిష్పన్న దృక్పథాలలో చూస్తారు. వీనినే లక్షణాలనీ, స్వభావాలనీ అంటారు. పరికల్పిత మంటే కల్పించబడినదని, పరతంత్రమంటే ఇతరులపై ఆధారపడిందని, పరినిష్పన్నమంటే సంపూర్ణత్వం నొందినదని అర్థాలు. ఈ సత్యాన్ని వివరించడానికి గారడీవాడు కల్పించిన 'ఏనుగు' ను ఉదాహరణంగా తీసుకోవచ్చు. ఈ ఏనుగు కేవలం కల్పితమే. గారడీవాడు తలచుకొనినప్పుడు ఇది మాయమౌతుంది. కాని, ఆ ఏనుగు మన ఎదుట కన్పించడానికొక కారణాన్నీ, కొంత వాతావరణాన్నీ గారడీవాడు కల్పిస్తున్నాడు. ఆ పరిస్థితి మారితే ఏనుగు ఉండదు. కాబట్టి దాని స్థితి పరతంత్రం. నిజంగా అక్కడ ఏనుగు లేదు. ఏనుగుగా మనం చూచేది మిథ్యయే! కాబట్టి దాని స్వభావం విజ్ఞానవాద రహస్యవస్తు నిర్వచనం పూర్తిచేస్తూ ఉంది.

ఈ వాదం ప్రకారం విజ్ఞానానికి ఆలంబనంగా ఏ వస్తువూ నిలువనప్పుడు మనస్సులోని జ్ఞానం ప్రారంభమౌతుంది. ఈ స్థితి యోగాచరణంచే సమాధి, సమతలచే జ్ఞానం చేకలుగుతుంది. దీనినే 'విజ్ఞానమాత్రత' అంటారు. దీన్నే లోకోత్తర జ్ఞానం, ఆశ్రయప్రవృత్తి అనికూడా అంటారు. యోగం ద్వారా జ్ఞానసాధన చేస్తూ తనను తాను తెలిసికోవడం అనే ఈ విజ్ఞానమాత్రతయే, తర్వాతి కాలాల్లో వేదాంతం లోని బ్రహ్మసాధన మార్గానికి ప్రాతిపదికమైంది. అంటే షడ్దర్శనాలలోని యోగదర్శనం ఈ యోగాచరణను పోలివున్నదని కొందరు అభిప్రాయపడుతున్నారు. కాని, యోగప్రస్థానాచార్యుడైన పతంజలి క్రీ.పూ. 28వ సంవత్సరంలో జీవించివున్నవాడు. బౌద్ధం లోని యోగచార శాఖను స్థాపించిన అసంగ, వసుబంధులిద్దరు క్రీ.శ. 3వ శతాబ్దంలోని వారు. పతంజలి యోగదర్శన ప్రభావమే వీరి పై పనిచేసిందని చెప్పవచ్చు. ఎందుకంటే, పతంజలి యోగశాస్త్రంలోని ఈశ్వరుడు సృష్టిస్థితిలయకారకుడుకాడు. అతడు అఖండ జ్ఞానస్వరూపుడై గురువులకు కూడ గురువైన వాడు మాత్రమే. ఇతరుల్లో బీజమాత్రంగా ఉండే సర్వజ్ఞత్వం ఈశ్వరునిలో అనంతంగా ఉంటుంది. క్లేశము, కర్మము, కర్మఫలము, కామము అనే వాని చేత బాధితుతు కానివాడే ఈశ్వరుడు. యోగశాస్త్రాన్ని అనుసరించి ఇదే

ఈశ్వరుని భావం. బహుశా, యోగాచారవాదులైన అసంగ, వసుబంధులు దీనిచే ప్రభావితులై వుంటారు. దీన్ని గురించి తర్వాతి పుటల్లో 'ధర్మమేఘాసమాధి' విషయంలో వివరిస్తాను. ఆగమ శాస్త్రంలో గౌడపాదులు బ్రహ్మ ఒక వైపున కైవల్యస్థితి యందుండి ఏ వస్తువుతోను సంబంధం లేకుండి, మరొకవైపు ఆత్మ, ఆత్మయందే స్థితమై ఆత్మజ్ఞానమే బ్రహ్మజ్ఞానమని తెలిసికోవడాన్ని వివరించిన క్రమం విజ్ఞానవాదుల 'విజ్ఞప్తిమాత్రత' ను పోలివుంది. దీనిచేత యోగాచార మతప్రభావం గౌడపాదులపై ఉందని చెప్పవచ్చు.

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు ఈ వాదాన్ని గూర్చి చక్కని సమీక్ష చేశారు. వారి అభిప్రాయంలో ''యోగాచారవాదం సత్యాన్ని గ్రహించినడానికి భావన (తర్కం), ఆలోచనల యొక్క ప్రాధ్యాన్నాన్ని తెలియజేసి 'తర్కశాస్త్రాని'కి గొప్ప సేవ చేసింది. కాని, బుద్ధికి అందని అనుభవాన్ని గాని, సత్యాన్ని గాని, ఒప్పుకోక ఈ వాదం తమ బలహీనతను ప్రకటించింది. 'ఆలయ విజ్ఞానం' అనే పదం స్పష్టమైన అర్థం యివ్వడం లేదు. వస్తుమాత్రమై చివరకు మిగిలే స్వచ్ఛవస్తుతత్త్వాన్ని కొన్ని సార్లు ఈ పదం బోధిస్తూవుంది. దీనినే తథాత (తథత) అని కూడ అంటారు. ఒక్కొక్కసారి ఈ 'పరిభాష' మనస్సుచే భావింపబడే వస్తువుల్లో ఒకటిగా భావింపబడుతూ తక్కిన వస్తుతత్త్వాలను కూడ ఈ మనోభావన క్రింద సమకూర్చుతున్నది. ఈ 'ఆలయవిజ్ఞానమే' ఒక్కొక్కసారి జగద్వ్యాప్తమైన మనస్సు యొక్క రూపాన్ని ధరించి అభావార్థ సూత్రాన్ని కలిగి వుంటున్నది. ఒక్కొక్కసారి మానవునిలోని విజ్ఞాన ప్రవాహంగా ఇది భావింపబడింది. ఇటువంటి ప్రధాన 'పరిభాష'ను అస్పష్టంగా నాల్గువిధాలుగా వివరణ చేయబడి వుండడం చేత ఈ యోగాచార వాదం చాలా విమర్శకు గురైంది.''[8]

## మాధ్యమిక వాదం - ఆచార్యనాగార్జునుడు

మహాయాన శాఖలో విజ్ఞానవాదం, శూన్యవాదం లేదా మాధ్యమికవాదం అనే రెండు భేదాలు ఏర్పడ్డాయి. వీటిలో విజ్ఞానవాదాన్ని ఆశ్రయించిన యోగాచార వాదాన్ని మనం తెలుసుకున్నాం. ఇప్పుడు, మాధ్యమిక లేక శూన్యవాదాన్ని గురించి వివరించుకొందాం. మాధ్యమిక (శూన్య), విజ్ఞానవాదాల మధ్యగల భేదం సిద్ధాంతంలో కాకుండా, వివరణక్రమంలోనే ఉంది. శూన్యవాదులు వస్తువులు అనిర్వచనీయములంటారు. విజ్ఞానవాదులీ అనిర్వచనీయతను అంగీకరిస్తూ, విజ్ఞానాన్ని అనాదియైన మిథ్యాత్మకమైన వాసనా వాదంచే వివరిస్తారు. మిథ్యాత్మక వాసనావాదమంటే మనస్సులోని బలీయమైన కోరికలు.

ఆంధ్రదేశంలో నాగార్జున కొండ వద్ద నివసించిన ఆచార్య నాగార్జునుడే గొప్ప విద్యాపీఠాన్ని నెలకొల్పినాడు. ఇతడు వస్తువుల శూన్యతను ప్రతిపాదిస్తూ శూన్యవాదాన్ని స్థాపించాడు. దీనినే మాధ్యమిక వాదమని కూడ పిలుస్తారు. ఈ వాదానికీయనే మూలపురుషుడు.

నాగార్జునికి పూర్వమే మహాయాన బౌద్ధ గ్రంథాలలో ఈ శూన్యత యొక్క చర్చ వస్తుంది. ఈ వాదం ప్రకారం జీవితస్థితి యొక్క అంతంలో పరిపూర్ణంగా అభావం ఏర్పడుతుందని, అప్పుడు ఖండాలు విడివడి పోతాయని, ఈ సత్యం తెలిసికోవడం కంటే వేరే లక్ష్యమేది లేదని చెప్పబడింది.

'చతుశ్శతిక' అనే గ్రంథం వ్రాసిన ఆర్యదేవుడు నాగార్జునుని శిష్యుడు. ఆర్యదేవుని శిష్యుడు కుమారజీవుడు. నాగార్జునుని ఉత్తమకృతి (Magnum Opus) యైన ''మూలమాధ్యమికకారిక' కు విశిష్టమైన వ్యాఖ్యానం వ్రాసి ఈ వాదాన్ని విస్తరింపజేసినవాడు చంద్రకీర్తి. ఇతడు క్రీ.శ. ఆరవ శతాబ్దంలోని వాడు. ఈతని తర్వాత బుద్ధఫలితుడు, మొదలైన వారంతా గొప్పతాత్త్వికులు. శక్తివంతములైన రచనలు చేశారు. చంద్రకీర్తి తర్వాత శూన్యవాదాన్ని వివరించే గొప్పతాత్త్వికుడు బయలుదేరలేదు. పూర్వమీమాంసను స్థాపించిన కుమారిల భట్టు కాలం వరకు ఈ శూన్యవాదం మన భారతదేశమందంతా ప్రబలియుండేది. పూర్వమీమాంసావాదం ఈ శూన్యవాదాన్ని ఖండించింది. అప్పటి వరకు ఈ శూన్యవాదం యొక్క ప్రభావం తగ్గిపోయి ఒక తాత్త్విక శాఖగా కూడ ఇది నిలువ లేక పోయింది.

ఆంధ్రుల అభిమాన ప్రాతుడైన ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. 3వ శతాబ్దం లోని వాడని చరిత్రకారులు ఊహ. కాని, క్రీ.శ. 400 సంవత్సరంలో చైనా భాషనుడి 'నాగార్జుని జీవితచరిత్ర' ను అనువదించిన కుమారజీవుడు, నాగార్జునుడు క్రీ.శ. 2వ శతాబ్దిలో నివసించెనని చెప్పాడు. యువాన్‌త్సాంగ్ (Yuvan Chuwang) అనే చైనా యాత్రికుడు నాగార్జునుడు దక్షిణ కోసలదేశంలో బుద్ధుని అనంతరం నాల్గు వందల సంవత్సరాల తర్వాత నివసించాడని వ్రాశాడు. కాని, కుమారజీవుని గ్రంథంవలననే మనకు నాగార్జునుని కాలం విస్పష్టంగా తెలుస్తోంది.

కనిష్కుని తర్వాతనే ఈ నాల్గు బౌద్ధమతతాత్త్విక శాఖలు ఒక నిర్దిష్ట రూపాన్ని పొందాయి. అంటే క్రీ.పూ. 2వ శతాబ్దంలో వివిధముఖాలుగా అభివృద్ధి పొందిన ఈ తాత్త్విక శాఖలు క్రీ.శ. 2వ శతాబ్దం నాటికి ఒక సంపూర్ణరూపాన్ని ధరించి, క్రీ.శ. 6వ శతాబ్దం నాటికి శూన్యవాదం (మాధ్యమికవాదం)తో పరాకాష్ఠకు చేరుకొన్నది. ఇది కుమారిలభట్టు రంగ ప్రవేశానికి దారితీసింది.

మాధ్యమికవాదమంటే ఏమిటి ? బుద్ధుడు మధ్యమార్గాన్ని బోధించాడు. దీన్నే మాధ్యమికవాదులు స్వీకరించారు. ఈ వాదం యొక్క ప్రధాన లక్ష్యమేమంటే, అన్నింటినీ నమ్మడం, అన్నింటినీ నిరాకరించడం అనే రెండు విపరీత మార్గాలను వదలివేసి, మధ్యేమార్గాన్ని అనుసరించడమే మాధ్యమికం. (Paving an intermediate path in between the two extremes)

ఆచార్య నాగార్జునుడు భారతీయతాత్త్వికులలో అగ్రస్థానమలంకరించిన మహామేధావి. స్వార్థచింతన లేకుండ సమర్థవంతమైన జిజ్ఞాసతో, వస్తువివేచన చేయడంలో గల సమీచీనత్వం, సమగ్రత్వం కోసం సర్వంకషంగా చేసిన కృషి ఈయన వాదంలో ప్రస్ఫుటమవౌతుంది. యోగాచారవాదం సత్యాన్ని గూర్చి ఒక విధమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే దానినే నాగార్జునుడు పెంపొందించి సర్వాంగ పరిపూర్ణంగా శూన్యవాదాన్ని ప్రతిపాదించాడు. ఈ వాదం ఉపనిషత్తుల లోని అద్వైత వాదానికి భిన్నంగా ఉంది. నాగార్జునుని వాదం బౌద్ధధర్మమనే ముసుగు కప్పుకొని వున్నప్పటికీ, అతడు, ఉపనిషత్తుల నుండియే తాను ప్రతిపాదించిన ధర్మానికి మూలం గ్రహించాడని చెప్పవచ్చు. కాని, శూన్యవాదులు 'ప్రజ్ఞాపారమితం' నుండి మూలభావాలు గ్రహించామని చెప్పినప్పటికీ, నాగార్జునుని ఈ సమన్వయానికి ఫలంగా అపూర్వము, అద్భుతమైన ఒక కొత్త వాదంగా శూన్యవాదం ప్రతిష్ఠితమైంది.

మహాయానంలోని ఉపదేశాలను సామాన్యంగా శూన్యవాదమనే పేరుతో పిలుస్తారు. ఈ వాదం ప్రజ్ఞాపారమిత సూత్రాలలో కనబడుతుంది. ఈ సూత్రాల్లో సరైన చర్చగాని, వాదప్రతివాదం గాని జరుగ లేదు. ఈ గ్రంథాల్లోని శూన్యవాద సూత్రాలు బుద్ధుడో లేక బోధిసత్త్వులో ఉపదేశించడం చేత అవి ప్రమాణాలైనట్లు మాత్రమే చెప్పబడింది. కొన్ని చోట్ల బుద్ధుని ఉపదేశాలను బోధిసత్త్వులు విస్తరింపజేసినట్లు తెలుస్తోంది. ఇలా శూన్యవాదాన్ని ప్రజలపై రుద్దడం కేవలం మత సంబంధమైన ఉన్మాదమే అవుతుంది. కాబట్టి, మహాయాన బౌద్ధాచార్యులు ఈ వాదాన్ని సమగ్రంగా చర్చించి తర్వాతి కాలాల్లో ప్రజల్ని మెప్పించారు. వీరు పరమాత్మను, మానవుడందుకోవలసిన పరమలక్ష్యాన్నే కాక, విశ్వజనీన సూత్రాన్ని (Universal Principle) కూడా భావించడం జరిగింది. ఇలాంటి అభిప్రాయమే క్రీ.శ. మొదటి శతాబ్దిలోని అశ్వఘోషుని గ్రంథాలలోని 'తథత'లో గోచరమవౌతున్నది. అశ్వఘోషుని ప్రధానతాత్త్విక గ్రంథం 'జ్ఞానోదయం' (శ్రద్ధ యొక్క ఉదయం) అనే గ్రంథం చైనా భాషలోనికి చేయబడిన అనువాదం ద్వారా మాత్రమే మనకు లభిస్తూవుంది. నాగార్జునుని సిద్ధాంతం సర్వతోముఖంగా వృద్ధి చేయబడి, దీనిలో 'శూన్యత' అనే 'యథార్థ శూన్యత' కాక, సంబంధ సహిత ధర్మ'మే శూన్యత గా చెప్పబడింది. ''ఏ వస్తువూ కూడా, తదితర వస్తు ప్రపంచంలో సంబంధించియే పరిగణింపబడాలి. దేనికది స్వతంత్రంగా, ఏ వస్తువుకూ, ఏ కార్యానికీ, అస్తిత్వం లేదు అనేదే శూన్యవాదం.''

## శూన్యవాద సిద్ధాంత సారాంశం - ఒక విశ్లేషణ :

శూన్యవాద సిద్ధాంత సారాంశాన్ని మనం ఐదు ఘట్టాలుగా వింగడించుకొని పరిశీలిద్దాం.

## 1. ప్రథమ ఘట్టం - శూన్యవాద పరిచయం :

1) సర్వం దుఃఖమ్ 2) సర్వమనిత్యమ్ 3) సర్వమనంతమ్ 4) సర్వం శూన్యమ్. ఈ నాల్గు ప్రధాన సూత్రాలు బౌద్ధమతంలో ప్రముఖమైనవి. ఇందులో చివరిదైన వస్తు శూన్యత్వానికి అంటే అర్థరహితత్వాన్ని శూన్యవాదంలో చర్చిస్తూ దీన్ని నిరూపించడానికి హీనయానులైన థేరవాదులు, మహాయానులైన మాధ్యమికులు సమానంగా కృషిచేశారు.

**థేరవాదుల శూన్యతావాదం :** థేరవాదులు ప్రపంచంలో ఆత్మశూన్యతవల్లను, ఆత్మసంబంధమైన వస్తు శూన్యత వల్లను శూన్యవాదం స్థాపించబడుతున్నదని చెప్పారు.

**''యస్మాత్ చ శూన్యం ఆత్మనావా, ఆత్మనియేవ వా,**
**తస్మాత్ శూన్యోలోక ఇత్యుచ్యతే''**

దీనికి ప్రాకృత పాఠం :

**''యస్మాచ్చ సున్నం అత్తేన వా అత్తనయేన వా**
**తస్మాత్ సున్నో లోకోతి ఉచ్చతి''**

ప్రపంచములో ఏదీ కూడా ఆత్మీయం కాని, శాశ్వతం కాని కాదు కాబట్టి వస్తు శూన్యమైనది ప్రపంచమని అర్థం.

**మాధ్యమికుల శూన్యతావాదం :**

మాధ్యమికులు వస్తు శూన్యతనే గాక, బుద్ధుడనే స్థితి కూడ శూన్యమేనని, నిర్వాణం కూడ శూన్యమేనని వాదిస్తారు. **''నామ మాత్రం ఇదం యదుత బుద్ధ ఇతి''** శరీరం యొక్క వాస్తవిక సాధనాలు కూడ శూన్యతతో కలిసే వుంటాయి. శూన్యత అనేది బాహ్యరూపం కాదు. రూపమే శూన్యత. శూన్యతయే రూపం. 'శతసాహస్రికాప్రజ్ఞాపారమితం' అనే గ్రంథంలో -

**''న శూన్యతయా రూపం శూన్యం**
**నాన్యత్ర రూపాత్ శూన్యతా, శూన్యతైవరూపమ్''**

''రూపం, శూన్యత వల్ల శూన్యతను పొందడం లేదు. రూపం వల్ల గూడ శూన్యత అనేది కలగడం లేదు. శూన్యతయే రూపాత్మకమైంది. శూన్యతయే రూపంగల వస్తువులకు మారు పేరు.'' ఈ వాదాన్ని యోగాచారులు, మాధ్యమికులు కూడా అంగీకరించారు. బహుశా, ధర్మం యొక్క చివరిదశలోని నిరాకారతనే ఈ శూన్యత వివరిస్తున్నదేమో!

ఈ పదం వస్తుధర్మాల యొక్క నిజమైన స్వభావాన్ని వర్ణిస్తూవుంది. ధర్మంతో ఐక్యాన్ని పొందనిది. ధర్మం నుండీ వేరైనది కాని, ధర్మతయే ఈ శూన్యత. ధర్మం కంటే శూన్యత భిన్నమైనదైతే, ధర్మాలే శూన్యలవుతాయి. ఒక వేళ శూన్యత, ధర్మం కంటే అభిన్నమైతే ధర్మాలు శాశ్వతాలవుతాయి. ఈ అభిప్రాయమే దీఘనికాయం (1-188) లో యిలా చెప్పబడింది.

**''అవ్యక్తం మాయా తం జీవం, తం శరీరం,**
**అన్నం జీవం, అన్నం శరీరం, హోతి తథాగతోఽ**
**పరం మరణ, నహోతి తథాగతపరః మరణమ్''**

**౨. ద్వితీయఘట్టం : శూన్యవాదం - ప్రతీత్యసముత్పాదం**

శూన్యత అంటే సంపూర్ణనాస్తిక, అసత్త్వ వాదం కాదు. ప్రపంచమందలి వస్తువుల్లో అంతర్లీనమైన సూత్రం కాబట్టి, దీనితో ఎలాంటి వస్తువుల సంబంధం కాని, ఉపయోగం కాని ఉండబోదు. కొన్ని కారణాల వల్ల, నిబంధనలవల్ల మనం గుర్తించే వస్తువులు మన ఎదురుగా అప్పుడప్పుడు ప్రత్యక్షాలవుతూ, అదృశ్యాలవుతూ ఉంటాయని నాగార్జునుడు తన కార్యకారణ సిద్ధాంతాన్ని నిరూపిస్తూ చెప్పాడు. ఈ విషయాన్ని గ్రహించిన వెంటనే సత్యస్వరూపం మానవునికి ప్రత్యక్షమౌతుంది. ప్రతీత్యసముత్పాదనం శూన్యతతో అభిన్నమైందని నాగార్జునుడు చెప్పాడు. **''యః ప్రతీత్య సముత్పాదః శూన్యతాం తాం ప్రచక్షతే''** ''పరతంత్రమైన ప్రభావం (పుట్టుక) గల ప్రతి వస్తువు కూడ శూన్యతను కల్గివుంటుంది.'' పరమార్థతత్త్వాన్ని విచారిస్తే ఒక కారణం వల్ల, కొన్ని నిబంధనాల వల్ల అస్తిత్వమున్నట్లు కనిపించే వస్తువు నిజంగా అలీకమైనదే. ఈ అలీక సిద్ధాంతం ప్రతీతసముత్పాదం ద్వారా ప్రతిపాదింపబడింది. ఈ సిద్ధాంతమే 'అనవతప్త హ్రదాపసంక్రమణ సూత్రము' లో స్పష్టంగా యిలా వివరించబడింది.

**''యః ప్రత్యయైః జాయతే సహ్యాజాతో**
**న తస్య ఉత్పాదః స్వభావతో ఽస్తి**
**యః ప్రత్యయాధీనః స శూన్యోఉక్తో''**

ఒక కారణం చేతగాని, పరిస్థితి చేతగాని ప్రత్యయాల నుండి పుట్టినదంతా పుట్టినిదే (అజాతమే) అవుతున్నది. దానికి ఉత్పాదం నిజంగా లేదు. అదే శూన్యమనబడుతుంది.

లంకావతార సూత్రంలో - ''**స్వభావానుత్పత్తిం సంధాయమహామతే సర్వధర్మాః శూన్యాః**'' అనే వాక్యం వస్తువుల అజాతత్వాన్ని (పుట్టుకలేమిని) స్ఫురింపజేస్తున్నది. ఈ విధంగా విచారిస్తే ఈ శూన్యవాదం మాధ్యమికవాదమౌతున్నది. (మధ్యయందుండి అనుసరణీయమైన మార్గం మాధ్యమిక మార్గం Via - media way) పుట్టుకయే లేని వస్తువు ఆస్తిత్వాన్ని, నాస్తిత్వాన్ని లేకుండ వుంటుంది. కాబట్టి అది ఈ రెండు విపరీత మార్గాల నుండి తొలగి వుంటుంది. 'మాధ్యమిక కారిక'లో నాగార్జునుడు శూన్యతను, ''అస్తిత్వం కలదీ, లేనిదీ, ఈ రెంటి యొక్క కలయిక, లేక ఇవి రెండు కానిదియుకాదు'' అని చెప్పాడు.

''ఉక్తప్రకార చతుష్టయోత్తీర్ణ పంచమ ప్రకార ఇతి'' అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ Prof. Stcherbatsky.యిలా వ్రాశారు. శూన్యత పైన పేర్కొనబడిన నాల్గు పద్ధతులకు చెందకుండా, అనిర్వచనీయమై ఐదవ పద్ధతికి చెందింది. ఇదే మన జీవితసారం. అద్వితీయం భావాద్వైత సిద్ధాంతంలో మోక్షసమయంలో కలిగే అవిద్యానివృత్తి యిటువంటి స్థితియే![9]

''శూన్యతాస్థితిని పొందిన తర్వాత, యిక పొందదగింది కాని, పోగొట్టుకొనేది గాని ఏమి వుండదు. అప్పుడింక సుఖదుఃఖాల యొక్క ప్రసక్తే రాదు'' అని ప్రజ్ఞాపారమితం లోని బోధిచర్యావతారాధ్యాయంలో శాంతి దేవుడు చెబుతాడు. మాధ్యమిక కారికల్ని బట్టి ఎటువంటి పరమాత్మనిరూపణం కూడ ''ఇది ఉంది'' అనే పద్ధతిలో చేయలేము. ''ఎక్కడో అస్పష్టంగా ఒక శాశ్వతతత్త్వం ఉంది'' అనే సిద్ధాంతం కూడ ఖండింపబడింది. శూన్యతను వర్ణించడానికి ఉపయోగించబడిన విశేషణాలన్నీ వ్యతిరేకార్థాన్నే బోధించేవిగా ఉన్నాయి.

## లంకావతార సూత్రం - సప్తవిధ శూన్యతలు

'శూన్యత' అనే పదం యొక్క స్వభావమే పరికల్పితమైందని లంకావతార సూత్రంలో చెప్పబడింది.

> ''**శూన్యతా పరికల్పిత స్వభావపదమేతత్**''
> ''**పరికల్పిత స్వభావాభినివేశేన శూన్యతానుత్పాదా**
> **భావాపద్యయ నిస్స్వభావవాదినో భవంతి**''[10]

మానవులు పరికల్పితంపై గల అభినివేశంతో శూన్యతను గూర్చి, అజాతత్వాన్ని గూర్చి, అద్వైతత్వాన్ని గూర్చి, నిస్స్వభావాన్ని గూర్చి వాదిస్తారు అని చెబుతూ, ఏడు విధాలైన శూన్యతలిలా పరిగణించబడ్డాయి.

. లక్షణశూన్యత – ఒక్కొక్కమానవునిలో ప్రత్యేక లక్షణాల శూన్యత
. భావస్వభావ శూన్యత – భావనా వ్యాపారంలో శూన్యత
. అప్రచరిత శూన్యత – ఏ పనీలేక పోవడంలోని శూన్యత
. ప్రచరిత శూన్యత – కార్యాకలాపములలోని శూన్యత
. సర్వధర్మనిరఖిలప్య శూన్యత – వస్తు ధర్మాలను వివరించలేము కాబట్టి ఆధర్మాలు శూన్యాలు
. పరమార్థంయద్ జ్ఞానమహాశూన్యత – పరమార్థతత్త్వం జ్ఞానం చేతనే గ్రహింపబడుతుందనే ఉన్నతార్థంలోని శూన్యత
. ఇతరేతర శూన్యత – ఒకటి మరొకదాన్ని శూన్యంగా భావించడం.

ఈ సప్తవిధ శూన్యతల్ని గూర్చిన సమగ్రవివరణం లంకావతార సూత్రంలో లభిస్తుంది. వస్తువులు పుట్టుక లేనివని కాదు గాని, స్వయంభువులు మాత్రం కావు. సమాధి స్థితిలో చూచినప్పుడు వాని పరమార్థం గోచరిస్తుంది. వస్తువులన్నీ అజాతములనడంలో అర్థమిదే.

'స్వభావం లేదు' అంటే లోతుగా విచారించి చూస్తే 'అజాతమై ఉండటం' అని అర్థం. స్వయంభువులైనప్పుడే వస్తువులు స్వభావాన్ని అంటే స్థితిని కల్గివుంటాయి. 'వస్తువులన్నింటికీ స్వభావం లేదు. అంటే ఎప్పుడు కూడ ఒక స్థితి నుండి మరొక స్థితికి మారడం అనే క్రమాన్ని ఎప్పుడూ తొలగించజాలరనీ, యిలా మారుతూ వస్తువు స్వభావాన్ని కోల్పోతుందని అర్థం. ఈ విధంగా **బుద్ధుని శూన్యత, శాశ్వతత్వ వినాశత్వాల నుండి విడివడి, రెండింటి మధ్య ఉన్నది.**( in between the two extremes)

శూన్యత అనే పదాన్ని కొందరు సర్వనాశన రూపమైందిగాను, మరి కొందరు ఎల్లప్పుడు శాశ్వతంగా ఉండేది గాను భావిస్తారు. ఇవి రెండూ అపార్థం! నాగార్జునుడు, పరమాత్మ స్వరూపం ఉందని అంగీకరించి ఉపనిషత్కాలం లోని ఋషులలాగా, తానుకూడ ఆ పరమాత్మ స్వరూపం సామాన్యమైన అనుభవానికి అతీతమైందని చెప్పాడు.

### ౩. తృతీయఘట్టం : శూన్యవాద సిద్ధాంత వాక్యం - శూన్యత అనేది భావస్ఫోరకమే కాని అభావసిద్ధాంతం కాదు.

కంటితో చూడడానికి వీలు లేనిది. మనస్సు యొక్క భావనకు అతీతమైనది అయిన పరమాత్మ స్వరూప పరిసరాలలో మానవమాత్రుడు ప్రవేశించలేడు. అన్ని వస్తువుల యొక్క జ్ఞానం ఒకే సారి పూర్తిగా కలిగే స్థానాన్నే బుద్ధుడు ''**పరమార్థసత్యమని** వివరించి, ఈ స్థితి మాటల్లో వర్ణించడానికి వీలుకానిదని చెప్పాడు.

''**యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ**'' అనే తైత్తిరీయోపనిషద్వాక్యం మనకిక్కడ స్ఫురణకు వస్తుంది. ఇటువంటి స్థితిని కేవలం స్ఫురింపజేసేదే శూన్యత, **'పరమార్థసత్య'**మనేది ఒకటున్నది. అది లేక పోతే ప్రపంచమే తారుమారవుతుంది. **శూన్యత అనేది భావస్ఫోరకమే కాని అభావ సిద్ధాంతం కాదు.** నాగార్జునుని గ్రంథాలకు వ్యాఖ్యానం చేస్తూ 'కుమార జీవుడు' యిలా వ్రాశాడు. ''శూన్యతయే మూల సూత్రం. అది లేనిదే ప్రపంచంలో ప్రతి ఒక్కపనీ దుస్సాధ్యం. శూన్యతయే అన్నిటికీ మూలకందం. అన్ని ధర్మాలకు శూన్యతయే ఏకైక శరణ్యం. శూన్యత ఎలాంటి కారణమూ లేని సత్యానికి మారు పేరు. అది భావాతీతమైంది. అమేయమైంది. పుట్టుక లేనిది. దీనినెవ్వరూ సృజించలేరు.''

నాగార్జునుని సమకాలంలోనే శూన్యతను అభావంగా, నాస్తితగా భావించడంతో ఈ పదాన్ని కొందరు సరిగా అర్థం చేసుకోలేదనే చెప్పవచ్చు. నాగార్జునుడే వారి అపోహలను తొలగిస్తూ యిలా వ్యాఖ్యానించాడు. ''ప్రతి ఒక్కటీ శూన్యమై పుట్టుక, నాశనం లేనిదైతే బుద్ధుని నాల్గు ఆర్యసత్యాలు నిరర్థకాలవుతాయి. అట్లే, ఈ సత్యాలను ఆధారంగా చేసికొని, బుద్ధుడు మంచి జీవితం గడపడానికి చేసిన ఉపదేశాలు, మంచి చెడు పనులకు ఫలం, బౌద్ధసంఘంలోని ఐకమత్యం అన్నీ నిరర్థకాలవుతాయి. చివరకు బుద్ధుడే లేదనవలసివస్తుంది. నాగార్జునుడు సంవృతి సత్యం (కాలక్రమాగతమైంది), పరమార్థసత్యం (నిజమైనది) ఈ రెండు సత్యాలను గ్రహించాడు. శ్రీ శంకరులు పారమార్థిక సత్తా, ప్రాతిభాసిక లేక వ్యావహారిక సత్తా అనే రెండు సత్యాలు చెప్పారు. వీటిలో సంవృతిసత్యం ప్రాతిభాసిక సత్యమైతే, పరమార్థ సత్యం, పారమార్థిక సత్యమౌతున్నది. నాగార్జునుడు సంవృతి - పరమార్థసత్యాలలోని భేదాన్ని వివేచన చేయజాలనివాడు బుద్ధుని ఉపదేశాల్లోని లోతును కూడ గ్రహించలేడని చెప్పాడు. ఈ శూన్యతయే దేశకాలాలననుసరించి కారణాలనిబంధనలకు కట్టుబడి మన ఎదుట వస్తువులుగా గోచరమయ్యే ప్రతీత్య సముత్పాదం. ఈ స్థితిలో అన్ని విధాలైన ఇతర అస్తిత్వాలకు అంతమనేది ఉన్నది.

కొన్ని ఉపదేశాల యొక్క ఉద్దేశం ప్రపంచపు మానసిక పరంపర వాసనల యొక్క నాశమే. ఇలాంటి భావనాసృష్టి మనస్సు నుండి వస్తువుల యొక్క శూన్యతను గుర్తించిననాడే తొలగిపోయి 'జ్ఞానోదయం' కలుగుతుంది. గొడ్రాలికి పుట్టబోయే బిడ్డ అందచందాలను గురించి ఎవ్వడూ విచారించనట్లే, అర్హతుడు కూడ స్కంధధాత్వాది సమస్యల్ని పట్టించుకోడు. శూన్యతాభావం ఒక శాంతస్వభావాన్ని ప్రసాదించి, అన్ని విధాలైన ప్రపంచాల నుండి అతీతంగా ఉన్న ఒక స్థితిని కల్గిస్తుంది. శూన్యతను గ్రహించడం లేదా పొందమంటే యిదే. అందుకే శూన్యత యిలా నిర్వచింపబడింది.

''అపరప్రత్యయం సన్తం ప్రపంచై రప్రపంచితమ్
నిర్వికల్ప మనర్థం స్యాదేతత్తత్త్వస్య లక్షణమ్''

శూన్యతాస్థితి మనిషి తనకు తానే పొందాలి. ఒకరు మరియొకరి బోధించటం వల్ల రాదు. ఈ శూన్యత ఇంద్రియనిగ్రహం వల్ల ఏర్పడిన శాంతస్వభావంచే వర్ణింపబడుతుంది. ఇది వర్ణనాతీతం (undescribable) . భావతీతం (un-imaginable) అనిర్వచనీయం (undefinable) ఇలా శూన్యతకు చాలా అర్థాలు లేవు. కాబట్టి, **శూన్యత అంటే భావనలన్నీ నశించిన అభావస్థితి గాని, శూన్యస్థితిగాని, నాశస్థితి గాని కానే కాదు. ఆచార్య నాగార్జునుడు శుక్తి స్థితరజతం వలె ఒక విధమైన అస్తిత్వం గల వస్తువునే శూన్యమని నిర్వచింపవచ్చునని చెప్పి అభావతను పూర్తిగా ఖండించాడు.**

## 4. చతుర్థ ఘట్టం - శూన్యవాద - అద్వైతాల సామ్యవైషమ్యాలు

మాధ్యమిక శూన్యతకు, అద్వైతుల బ్రహ్మకు గల భేదాన్ని యిలా చెప్పవచ్చు. శూన్యత అనే సత్తు (అస్తిత్వం) యొక్క సారం ఎటువంటి నిలుకడ లేని అస్తిత్వం. అద్వైత బ్రహ్మ సచ్చిదానందాత్మకం. శ్రీశంకరుడు, ఉదయనుడు, వాచస్పతి, శ్రీ హర్షుడు మొదలైన వేదాంతులందరూ శూన్యవాదం కర్తృకర్మాత్మకమైనట్టిదీ, చిదాత్మకమైనట్టిదీ, అచిదాత్మకమైనట్టిదీ అయిన అన్ని విధాల అస్తిత్వాన్ని నిరాకరించేదని చెప్పారు. శ్రీహర్షుని 'అనిర్వచనీయవాదం' లో ప్రపంచం ఎలాంటి తార్కికసిద్ధాంతం చేత వివరించడానికి వీలుకాని ఒక విచిత్రమైన రూపం కలిగి ఉందని చెబుతాడు. ఈ ప్రపంచ స్వరూపాన్ని ఔనని కాని, కాదని కాని వర్ణించలేము. ఒక వేళ ప్రపంచం కేవలం నిరాకారమై ఎట్టి స్థితీ లేనిదైతే మన మనస్సు ద్వారా దానిని ఏ విధంగా కూడ భావించలేవు. అది మన అనుభవానికి అందేది కాదు కాబట్టే లోకంలో ''కుందేటికొమ్ము'' లేక ''గొడ్రాలికి పుట్టిన బిడ్డ'' అనేవి మన విజ్ఞానంచే ఒక రూపం ఏర్పరచుకొని చూడటానికి వీలుకానివి కావడం చేత ఇవి నిరర్ధక వాక్యాలు. అట్లే, ప్రపంచం కూడ ఎలాంటి రూపం లేనిది అన్నప్పుడు మన అనుభవబాహ్యమౌతుంది. కాని, మన అనుభవం దానికి వ్యతిరేకంగా ఉండడం వల్ల పై పక్షం ఖండింపబడింది. అది పూర్తిగా సత్యమని కూడ చెప్పలేం - ఎందుకంటే, ప్రపంచలోని అస్తిత్వం ''ముత్యపుచిప్పలోని రజతం'' వంటిదని మనం అనుభవం వల్ల తెలిసికొంటున్నాం. ముత్యపు చిప్పలోని రజతం అలీకమైనప్పటికీ అక్కడ వెండి లేకున్నా వెండి ఉందనే భావన - ఆ భావన భ్రాంతి యైనా అది మనకు కలుగుతూవుంది. ఇలాంటి భావన కూడ 'గొడ్రాలి బిడ్డ' అన్నప్పుడు మనకు కలుగదు. ఈ విధంగా ప్రపంచం యొక్క మిథ్యాస్వరూపం వివరింపబడుతూవుంది. 'మిథ్యాత్వ' మనే పదం ఇటువంటి

జ్ఞానాన్ని వర్ణించడానికి కనిపెట్టబడిన పదం.

శ్రీహర్షుడు బౌద్ధమతంలోని శూన్యవాదానికీ అద్వైత వాదానికీ గల భేదాన్ని యిలా వివరించాడు. బౌద్ధ శూన్యవాది, విజ్ఞానంతో పాటు అన్ని విధాల అస్తిత్వాన్ని అర్థరహితంగా భావిస్తాడు. వేదాంతులు విజ్ఞానాన్ని పరమార్థంగా భావించి ఈ విజ్ఞానాన్ని నిరాకరించడం తామన్న మాటనే ఖండించడం అని భావిస్తారు.

అనంద పూర్ణుడు, బౌద్ధుల విజ్ఞానం, ఒక వస్తువుతో (ఆలంబనం) సంబంధం గలదిగాను, ఈ ఆలంబన విజ్ఞానం, అవిభాజ్యం (విడదీయరానిది) అనీ, తెలియరానిదనీ చెప్పాడు. బౌద్ధమతానుసారంగా విజ్ఞానమూ, (తెలివి) దీని యొక్క ఆలంబనమూ అభిన్నాలు. విజ్ఞానం యొక్క ఆలంబనం అలీకమైనప్పుడు విజ్ఞానం కూడ అలీకమే అవుతుంది.

వేదాంతుల మతానుసారంగా ఈ విజ్ఞాన, ఆలంబనాల పరస్పర సంబంధం ప్రత్యక్షాభిన్నత్వం గాక, మిథ్యాభిన్నత్వమౌతుంది. దీనినే వర్ణనాతీతమైందని కూడ అంటారు. వీని సంబంధం అలీకమైంది కాబట్టి అభిన్నత్వ నిరూపణం కూడ అలీకమేనని విద్యారణ్యస్వామి చెబుతూ, విజ్ఞానాన్ని మాత్రం సమర్థించారు. ఆయన అభిప్రాయంలో దేని అస్తిత్వాన్నైనా నిరాకరించవచ్చు గాని, విజ్ఞానాస్తిత్వం మాత్రం నిరాకరించరానిది. ''నీవు నీ విజ్ఞానం యొక్క సహాయంతో విజ్ఞానాన్ని సమర్థంగా ఖండించగలవు'' అని చెప్పాడు. కాబట్టి, చివరికి విజ్ఞానం నిరాకరించరానిదని తేల్చాడు.

**పరమాత్మ స్వరూపం సచ్చిదానందాత్మకమైంది. అది స్వప్రకాశకమైంది. ఇతర సాక్ష్యాలు దానికి అనవసరం. అది కేవలం చిదాత్మకం. దానికి అస్తిత్వం (సత్తు) లేక పోతే ,మరలా శూన్యమౌతుంది. కాబట్టి, పరమసత్యమైంది పరమాత్మస్వరూపం. ఈ విజ్ఞానం (చిత్), అస్తిత్వం (సత్) రెండూ ఒకే సారి కలిసివున్న చోటనే కనబడుతాయి.**

మిథ్యాజ్ఞానాన్ని కలిగించే 'సంవృత' సిద్ధాంతాన్ని వివరించడంతో బుద్ధుడు అద్వైత సిద్ధాంతానికి అతి సమీపంలోకి వచ్చాడని చెప్పవచ్చు. ఆచార్య నాగార్జునుడు కూడ సంవృత, పరమార్థాలనే రెండు సత్యాలను గుర్తించాడు. అద్వైత వేదాంతం, ప్రపంచం యొక్క అస్తిత్వాన్ని (వస్తుత్వం) అడుగడుగునా గుర్తిస్తుంది.

### 5. ఐదవఘట్టం : శూన్యవాదం - ఇతర దర్శనాలపై ప్రభావాలు :

ఆచార్య సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి అభిప్రాయంలో మాధ్యమికులు నిరూపించిన శూన్యవాదం యొక్క ప్రభావం ఇతర దర్శనాల పురోగమనానికి ఎంతో దోహదం చేసిందని

వ్రాస్తూ "అద్వైత వేదాంతం, మాధ్యమిక వాదంచే ఎక్కువగా ప్రభావితమైందని చెప్పడానికి వీల్లేదు. కాని, గౌడపాద కారికల్లోని 'అలాతశాంతి' ప్రకరణం మాధ్యమిక వాద సూత్రాలచే నిండివుంది. అద్వైతుల యొక్క వ్యవహారం లేక అనుభవం (ప్రాతిభాసిక సత్యం), పరమార్థం లేక సత్యం (పారమార్థిక సత్యం) ఇవి రెండూ మాధ్యమికుల సంవృతి సత్యం, పరమార్థ సత్యాలతో సరిపోలుతున్నాయి. జగద్గురు శ్రీ ఆదిశంకరుల నిర్గుణ పరబ్రహ్మతత్త్వానికి, ఆచార్య నాగార్జునుని శూన్యతాతత్త్వానికి చాలా పోలికలున్నాయి. 'అవిద్య' యొక్క ఒత్తిడి వలన వస్తు ప్రపంచ సృష్టి జరుగుతుందని ఈ రెండు వాదాలూ అంగీకరిస్తున్నాయి. వివిధ సంబంధాలతో, శాఖోపశాఖలతో, పుంఖాను పుంఖంగా సృజింపబడిన ఊహా నాటకమే ఈ జగత్తని రెండు మతాలూ అంగీకరిస్తున్నాయి. శ్రీహర్షుని వాదాన్ని చూస్తే అతడు దాదాపు మాధ్యమిక వాదాన్నే విస్తరింపజేశాడని స్పష్టమౌతుంది. మనం స్వభావ నిరోధకాలైన పద్ధతులతో పనిచేసే క్రమం - కార్యకారణ సంబంధం వంటిది, పదార్థగుణ సంబంధం వంటిది. వస్తువులున్నట్లు సమగ్రంగా సంపూర్ణంగా వివరించడానికి వీలుకానందున వాని అస్తిత్వాన్ని నిరాకరిద్దాము. శ్రీహర్షుని ఖండన ఖండ కాద్య' మనే సిద్ధాంతానుసారం వస్తువులు అనిర్వచనీయములు. మాధ్యమిక వాదానుసారం అవి నిస్స్వభావాలు (సారహీనాలు). ఈ రెండు మతాలిట్లా సమానములే అవుతున్నాయి. అనిర్వచనీయములన్నా, నిస్స్వభావములన్నా రెండూ ఒక్కటే! నాగార్జునుడు పరమార్థాన్ని అంగీకరించి దాని యొక్క సత్త్వాన్ని గూర్చి ఎక్కువగా విచారించలేదు. కంటికి కనబడని వస్తువుపై బౌద్ధులకు గల సామాన్యప్రవృత్తియే దీనికి కారణం. **అనుభవాన్ని ఒక వస్తుతత్త్వంగా నిరూపిస్తూ వ్యతిరేకతర్కంతో ఆచార్యనాగార్జునుడు అద్వైత వేదాంతానికి మూలాన్ని ఏర్పరచాడు.** అద్వైతాన్ని, మాధ్యమిక వాదాన్ని స్థాపించిన ఈ యిద్దరు ఆచార్య పురుషులు పరస్పర విరుద్ధాలైన రెండు విభిన్న మతాలను ప్రతిపాదించినట్లు తెలియడంతో మనకు ఆశ్చర్యమూ, ఆవేదనా కల్గుతున్నాయి కదా!"[11]

## త్రిపిటకములు :

'పిటక' మనే శబ్దానికి బౌద్ధుడైన అమరసింహుడు అమరకోశంలో - (II- 217) "పిటక : పేటకః పేటామంజూషా" అనే పర్యాయ పదాలిచ్చాడు. 'పిటక' శబ్దానికి పేటక, పేట, మంజూష (పెట్టె) అనేవి నామాంతరాలు. జ్ఞానం, ధర్మం ఈ పేటికలలో భద్రం చేయబడి పారంపర్యంగా అందజేయబడిందని దీని కర్థం. ఇలా భద్రం చేయబడిన పిటకాలు మూడు అవి - 1) వినయపిటకం 2) సుత్తపిటకం 3) అభిధమ్మపిటకం. ఈ త్రిపిటకాలెప్పుడు గ్రంథస్థమయ్యాయి ? అనే విషయమై మూడు భిన్నాభిప్రాయాలున్నాయి. ఇవి పాళీ భాషలోనే సింహళ ద్వీపపాలకుడైన వట్టగామని అభయుని కాలం (క్రీ.పూ. 88-76)లో ప్రప్రథమంగా గ్రంథస్థం చేయబడిందని 'మహావంశం' (క్రీ.శ. 5వ శతాబ్ది) వలన తెలుస్తోంది.

2) ''జ్ఞానులైన భిక్షువులు పాళీ త్రిపిటకాలు, వాని అట్ఠకథలు (వ్యాఖ్యానాలు) గురుపరంపరాప్రభావంతో మౌఖిక సారస్వతంగానే తమ శిష్యప్రశిష్యులకు అందించే వారు. ధారణాసంపన్నులైన అలాంటి భిక్షువుల సంఖ్య అంతరించి పోతుండగా అలేఖ్యంగా - శ్రుతిరూపంగా - ఉన్న గౌతమ బుద్ధుని ధర్మబోధలు నశింపక శాశ్వతంగా ఉండాలని సంకల్పించి భిక్షువులందరు సమావేశమై పాళీత్రిపిటకాలకు అట్ఠకథను లేఖ్య మొనరించి వానికి అక్షరత్వమాపాదించినారు. లేఖన సంప్రదాయమప్పటికే విస్తృత ప్రచారంలో ఉన్నప్పటికీ బౌద్ధుల కది తెలిసినప్పటికీ మౌఖికంగానే త్రిపిటకాలను రక్షిస్తూ వచ్చారు.'' అని డా॥ రత్నాకరం బాలరాజుగారు 'ధమ్మపదం' (అనుబంధం -I పుటలు 271 - 272) (1994)లో వ్రాశారు. పిటకత్రయాన్ని అశోకుని పుత్రుడైన మహిందుడు, పుత్రిక సంఘమిత్ర సింహళానికి (Srilanka) తీసుకుపోయారు. సింహళీ భాషలో మహిందుడు రచించిన 'అట్ఠకథ' అనే వ్యాఖ్యానాన్ని (క్రీ.పూ. 241) భదన్త బుద్ధఘోషుడు పాళీ భాషలోనికి అనువదించినట్లు 'మహావంశం' వల్ల తెలుస్తోంది. (అనువాద కాలం క్రీ.శ. 5వ శతాబ్ది)

**సింహళట్ఠకథా సుద్ధా మహిందేన మతీమతా**
**సంగీతిత్తయం అరూళ్హం సమ్మాసంబుద్ధదేసితం ।**
**సారిపుత్తాదిగీతం చ కథామగ్గం సమక్షియ**
**కతా సీహలభాసాయా సీహలేసు పవత్తతి ॥**[12]

మహామతియైన మహిందుడు, సంగీతిత్రయంలో( Three great Buddhist Councils) నిరూఢంగా పరిష్కరింపబడి, సమ్యక్సంబుద్ధునిచే నుపదిష్టమైన, సారిపుత్తాదులచే గానం చేయబడినదైన పిటకత్రయానికి బుద్ధప్రవచన కథామార్గాన్ని (Discourses of the Buddha) చక్కగా విచారించి సింహళ భాషలో శుద్ధమైన అట్ఠకథను (భాష్యాన్ని) రచించాడు.

3) క్రీ.శ. 7వ శతాబ్దంలో భారతదేశానికి వచ్చిన బౌద్ధ చైనా యాత్రికుడు యువన్‌ఛ్వాంగ్ (Yuanchwang) అభిప్రాయం ప్రకారం మహాకశ్యపుని ఆదేశాన్ని పురస్కరించుకొని త్రిపిటకాలు ప్రథమసంగీతి (First Buddhist Council)జరిగిన వెంటనే (క్రీ.పూ. 543) గ్రంథస్థమొనరింపబడిందని వ్రాశాడు. ఇదే సరైన అభిప్రాయంగా గ్రహించవచ్చు. మూడవ సంగీతిని నడిపిన అశోకుని కాలంలో ఈ గ్రంథాలు సింహళానికి పోయి అక్కడ వ్యాఖ్యానాలు క్రీ.పూ. 241 లో వ్రాయబడ్డాయి.

| త్రిపిటకాలు | | |
|---|---|---|
| **వినయపిటకం** | **సుత్తపిటకం** | **అభిధమ్మ పిటకం** |
| a) **పారాజిక పాళి**<br>b) **పాచిత్తయపాళి**<br>i) సుత్తవిభంగం<br>ii) పాతిమొక్ఖసుత్తం<br>c) **మహావగ్గపాళి**<br>d) **చుల్లవగ్గపాళి**<br>i) మహావగ్గం ఖందకం<br>ii) చుల్లవగ్గం<br>e) **పరివారపాళి**<br>బుద్ధుడు సారనాథ్‌లోని ఇసిపతనంలో చేసిన ధమ్మచక్కప వత్తన సుత్తం దీనిలో చెప్పబడింది | a) **దీఘనికాయం** (34)సూక్తాలు<br>i) మహాపరినిబ్బానసుత్తం<br>ii) బ్రహ్మజాలసుత్తం<br>iii) మహానిదానసుత్తం<br>iv) సామఞ్ఞఫలసుత్తం<br>v) సిగాలోవాదసుత్తం (గృహస్థధర్మసూక్తం)<br>b) **మజ్ఝిమనికాయం** (152 సూక్తాలు)<br>i) అరియపరియేసనసుత్తం గౌతముని మహాభినిష్క్రమణ సత్యాన్వేషణ, తపశ్చర్యలు వివరించే సూక్తం<br>c) **సంయుక్తనికాయం** (56 సూక్తాలు)<br>i) ధమ్మచక్కపవత్తన సుత్తం దీనిలోను చెప్పబడింది<br>ii) యక్ష ప్రశ్నలకు బుద్ధుని సమాధానాలు<br>d) **అంగుత్తరనికాయం** (11నిపాతాలు - 2308 సుత్తములు)<br>e) **ఖుద్దకనికాయం**<br>i) ఖుద్దకపాతం<br>ii) ధమ్మపదం<br>iii) ఉదానం<br>iv) ఇతివుత్తకం<br>v) సుత్తనిపాతం<br>vi) విమానవత్తు<br>vii) పేతవత్తు<br>viii) థేరగాథలు<br>ix) థేరీగాథలు<br>x) జాతక కథలు<br>xi) నిద్దేశము<br>xii) పటిసంభిదామగ్గం<br>xiii) అవదానం<br>xiv బుద్ధవంశం<br>xv) చరియాపిటకం | a) ధమ్మసంగిణి<br>b) విభంగము<br>c) కథావత్థు<br>d) పుగ్గలపఞ్ఞత్తి<br>e) ధాతుకథ<br>f) యమకము<br>g) పట్ఠాన పకరణం |

ప్రస్థానత్రయమైన బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీతకు శ్రీ అదిశంకరుల వారు భాష్యం క్రీ.శ. 8వ శతాబ్దంలో రచించినట్లుగా, భదన్త బుద్ధఘోషుడు ఈ త్రిపిటకాలకు భాష్యం రచించి బుద్ధ దర్శనాన్ని నిర్ణయించి క్రమబద్ధమొర్చినాడు. భదన్తబుద్ధఘోషుని కాలం క్రీ.శ. 5వ శతాబ్ది (క్రీ.శ. 420)

ఈ సందర్భంలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల అభిప్రాయమిట్లున్నది." In the Tripitaka itself no mention is made of the Third Council under Asoka at Pataliputra about 247 B.C. There are references to the First Council at Rajagruha (477 B.C.) and the Second Council of Vaisali (377 B.C.) Evidently the Buddhist canon as it has come down to us was closed after the second and before the Third Council." - The Dharmapada, Introduction (P-2)

త్రిపిటకాలలో గ్రంథస్థం చేయుబడక పోయినా అశోకుని కాలంలో తృతీయ బౌద్ధపరిషత్తు, కనిష్కుని కాలంలో చతుర్థ బౌద్ధపరిషత్తు జరిగినట్లు చారిత్రకులు అంగీకరిస్తున్నారు.

## త్రిపిటకాలు - 'అంధక' భాషానువాదం

'అంధక' మనే పేరు తెలుగు భాషకు, తెలుగుదేశానికి బౌద్ధసాహిత్యంలో ఎక్కువగా వాడబడి యున్నది. సుత్తనిపాతం లోని 'పరాయనవగ్గం' లో 'వత్థుగాథ' లో ఉదాహృతులైన అస్సక, అళ (ముళ)కులు అంధక రాజులని ఒక ప్రాచీన వ్యాఖ్యలో చెప్పబడింది. అస్సక, అళకములు నేటి తెలంగాణాలోని 'బోధన్' ప్రాంతంలో ఉండే జనపదాలని చారిత్రకుల అభిప్రాయం.

'అంధక రట్ఠము' గోదావరీ తీరాలను ఆశ్రయించి యుండే భూభాగమని బౌద్ధగ్రంథాలు పేర్కొంటున్నాయి. అంధక రట్ఠపు బౌద్ధులు చైత్యారాధకులని, వీరిలో పూర్వశైలీయ అపరశైలీయాది సంప్రదాయాలుండేవని బౌద్ధ గ్రంథాల వల్ల తెలుస్తోంది. ఈ రెండు సంప్రదాయాలు కృష్ణా నదీతటాన్ని ఆశ్రయించి ధాన్యకటక ప్రాంతంలో ఉండేదని యువాన్‌చ్వాంగ్ వంటి చైనా యాత్రికుల వలన తెలుస్తోంది.

ఐతరేయ బ్రహ్మణంలో పేర్కొనబడిన 'అంధ్ర' జాతియే ఈ 'అంధక' జాతిగ వ్యవహృతమయ్యిందని వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి పండితులందరూ అంగీకరించారు. 'అంధ్ర' పదమే ప్రాకృతంలో 'అంధక' గా మారినది. 'అంధకరట్ఠ' మునే 'అంధాపథ' మని వ్యహరించేవారని మైదవోలు శాసనం ( E.I. Vol. VI Page - 86) వలన తెలుస్తోంది. దీని వల్ల గోదావరీ కృష్ణానదీ తీరాలను ఆశ్రయించిన తెలుగుదేశం బౌద్ధయుగంలో 'అంధక' 'అంధ' నామధేయాలతో వ్యవహరింపబడిందని స్పష్టమౌతున్నది.

'అంధ్ర' అనే పదం మొదట జాతివాచకం, తరువాత వారు నివసించే దేశవాచకం, ఆ తరువాత ఆజాతి మాట్లాడే భాషకు పేరయింది, అని వేటూరి ప్రభాకరశాస్త్రి[13]గారన్నట్లు, బౌద్ధయుగంలో 'అంధ్ర' పదమే అంధక జాతి - అంధక దేశం - అంధక భాష అనే పేర్లతో ప్రచారంలో ఉండేవని బౌద్ధ గ్రంథాలే ఋజువు చేస్తున్నాయి. క్రీ.శ. 420 ప్రాంతంలో ఉన్న బుద్ధఘోషుడు, బౌద్ధ మత గ్రంథాలకు మహాభాష్యకారుడు. శ్రీ ఆదిశంకరులు ప్రస్థానత్రయానికి భాష్యం వ్రాసినట్లే, శ్రీసాయణాచార్యులు వైదిక గ్రంథాలకు 18 భాష్యాలు అంతరించినట్లే, బుద్ధఘోషుడు వీరిద్దరికీ ఆదర్శప్రాయుడై బౌద్ధ త్రిపిటకాల్లోని వివిధ గ్రంథాలకు 24 భాష్యాలు రచించాడు.

బుద్ధఘోషుడు 'మజ్ఝిమనికాయంపై' 'పపంచసూదని' అనే భాష్యం (అట్ఠకథా) రచిస్తూ **''తనకు పూర్వులైన కొందరు ఆచార్యులు దమిళ, అంధకాది దేశభాషలలోనికి బౌద్ధ పిటకాలను అనువదించి యున్నారని అవి మూలమైన పాళీ గ్రంథాలకు చక్కని అనువాదం కాదని** అభిప్రాయపడ్డాడు. దీన్ని బట్టి క్రీ.శ. 4వ శతాబ్దినాటికే 'అంధకం' ఒక సాహిత్యభాషగా యుండినదని చెప్పవచ్చు. ఈ విషయాన్నే చర్చిస్తూ పాళీ భాషా పండితుడు ఆచార్యనలినాక్షదత్ తెలుగు భాష యొక్క ప్రాచీన రూపమే 'అంధక' మని చెప్పాడు. (History and culture of Indian People Vol. III P - 396) బహుశా, ఈ అనువాద గ్రంథాలనే 'అంధక అట్ఠకథా' అని పిలిచెడివారేమో! ఈ పేరు బౌద్ధ గ్రంథాలలో కనబడుతుంది. 'అట్ఠకథా అంటే అర్థకథ అర్థాన్ని వివరించే కథ; భాష్యం, వ్యాఖ్యానమని అర్థం. **అంధకభాషలో వ్రాయబడిన అనూదిత వ్యాఖ్యానాన్నే 'అంధక అట్ఠకథా' అని పిలిచెడివారని నేను భావిస్తున్నాను.**

ఈ అనువాదం అంత ప్రశస్తంగా మూలవిధేయంగా లేదని బుద్ధఘోషుడు చెప్పినట్లే ఆ గ్రంథాలు కూడా ఆంధ్రదేశంలో బౌద్ధ మతం నశించడంతో నశించిపోయాయి. ఇలా క్రీ.పూ. 4 శతాబ్దం మొదలుకొని క్రీ.శ. 6వ శతాబ్దం వరకు అంటే వేయి సంవత్సరాలు ఆంధ్రదేశంలో బౌద్ధమతం విజృంభించి ప్రచారం పొంది ప్రశస్తి ప్రాభవాలకు రాజాదరణకు నోచుకోగా అంధక భాషలో వ్రాయబడిన ఆ త్రిపిటకానువాద గ్రంథాలు నశించి ఇప్పటికి 2400 సంవత్సరాలు గడచిపోయాయి. బుద్ధుడు భారతదేశంలో జన్మించి యిప్పటికి అంటే 2000 సంవత్సరం నాటికి 2544 సంవత్సరాలు గడిచాయి. (1956నాటికే 2500 సంవత్సరాలు పూర్తయ్యాయి)

2400 సంవత్సరాలు గడిచినా, యింత సుదీర్ఘ కాలంలో తెలుగుభాష ఎంతగా అభివృద్ధి సాధించినా, బౌద్ధ త్రిపిటక గ్రంథాలు తెలుగులో ఇంతవరకు అనువదింపబడక పోవడం అత్యంత శోచనీయమైన విషయం. ఈ అపఖ్యాతి, పోగొట్టడానికా అన్నట్లు నూత్న సహస్రాబ్ది (2000)లో హిందూ, బౌద్ధ మత సాహిత్యంతో చక్కని పాండిత్యం, పరిశోధన, అభినివేశం

గల అనంతపురం వాస్తవ్యులు, బౌద్ధయుగం (రెండు సంపుటాలు 1960), ధమ్మపదం (1994) బుద్ధ దర్శనం (1995) వంటి బృహద్గ్రంథాలను రచించిన డా॥ రత్నాకరం బాలరాజు గారు త్రిపిటకాలను తెలుగులో అనువదిస్తున్నారని చెప్పడానికి ఎంతో సంతోషిస్తున్నాను.

## మిక్కిలి ప్రసిద్ధులైన ముగ్గురు బౌద్ధాచార్యులు

బౌద్ధమతంలో మిక్కిలి ప్రసిద్ధులైన ఆచార్య పురుషులు ముగ్గురున్నారు. వారు,

1) అశ్వఘోషుడు (క్రీ.పూ. 1వ శతాబ్ది)
2) నాగార్జునుడు (క్రీ.శ. 1–2 శతాబ్దాలు)
3) బుద్ధఘోషుడు (క్రీ.శ. 420 )

**అశ్వఘోషుడు :** అశ్వఘోషుని కాలాన్ని గురించి పరిశోధకులలో భిన్నాభిప్రాయాలున్నాయి. క్రీస్తుపూర్వము వాడని కొందరు, క్రీస్తు శకంలో వాడని కొందరు చెబుతారు. దీనికి ప్రధానకారణం కాళిదాసు కాలం యింతవరకు పరిశోధకులు యిదమిత్థమని తేల్చక పోవడమే! క్రీ.పూ. 1వ శతాబ్ది మొదలుకొని క్రీ.శ. 11వ శతాబ్దం దాకా కాళిదాసు కాలాన్ని గూర్చి వివిధ పండితులు చేసిన నిర్ణయాలు కనబడుతున్నాయి.

1. క్రీ.పూ. 56 (ఒకటవ శతాబ్ది) –F. KIELHORN పండితుడు మాండసర్ శాసనాన్ని బట్టి ఈకాల నిర్ణయం చేశారు. ఇది ఉజ్జయినిని పరిపాలించిన విక్రమాదిత్యుని కాలం. ఇతని ఆస్థానంలో నవరత్నాలుండే వారు.

> ధన్వంతరి, క్షపణ కామరసింహ శంకు
> బేతాళభట్ట ఘటకర్పర **కాళిదాసాః** ।
> ఖ్యాతో వరాహమిహిరోన్నపతే స్సభాయాం
> రత్నానివై వరరుచి ర్నవవిక్రమస్య ॥

బౌద్ధుడైన అమరసింహుడే అమరకోశమనే సంస్కృత నిఘంటు కర్త. ఈతని శిష్యుడైన అమరసూరి తన 'కావ్యకల్పలత' అనే గ్రంథంలో 'ఉజ్జయిన్యాం విక్రమార్క ముంజభోజ నరేశ్వరః' అని చెప్పియున్నాడు. కాబట్టి, కాళిదాసు క్రీ.పూ. 56వ సంవత్సరంలో జీవించిన వాడని ప్రొఫెసర్ కీల్‌హోర్న్ నిర్ణయించారు. ఈ వాదాన్నే చాలా మంది పండితులు అంగీకరించారు. ఇదిలా వుండగా, అశ్వఘోషుడు కాళిదాసుకు పూర్వుడా? తర్వాతి వాడా? అనే విషయంలో పండితులకు భిన్నాప్రాయాలున్నాయి. అశ్వఘోషుడు పుట్టుకతో బ్రాహ్మణుడు. యౌవనంలో విద్యావంతుడై బౌద్ధమతాన్ని స్వీకరించాడు. దీని కాన్నాటి వర్ణవ్యవస్థ, దేశకాల పరిస్థితులే ప్రబలంగా ఆయనపై పనిచేసి వుంటుందని చెప్పవచ్చు.

''బౌద్ధకవులలో మాత్రమే కాక, సంస్కృతమున సుప్రసిద్ధ మహాకవులలో నొకడగు అశ్వఘోష మహాకవి బుద్ధచరితము, సౌందరనందము అను రెండు కావ్యములకు కర్త. ఇతని కాలం క్రీ.శ. మొదటి శతాబ్దము (క్రీ.శ. 79) కావచ్చునని పండితుల అభిప్రాయం. కాళిదాస మహాకవి క్రీ.పూ. ప్రథమ శతాబ్దికి చెందిన వాడనునది నిజమైనచో అశ్వఘోషుడు మహాకవికి తరువాతి వాడు కాగలడు.'' అని బౌద్ధమతంపై అనేక ప్రామాణిక గ్రంథాలు రచించిన డా॥ రత్నాకరము బాలరాజు గారు వ్రాస్తున్నారు. (ధమ్మపదం (1994) అనుబంధం -II బౌద్ధసంస్కృత సాహిత్యము పుట - 287)

కాని, సంస్కృత కావ్యనాటకాలంకార సాహిత్యంపై సాధికారికమైన కృషిచేసిన గొప్పపండితులు డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి గారు 1951లో అశ్వఘోషుని సౌందరనంద కావ్యాన్ని సంగ్రహవచన కావ్యంగా రచించి ప్రచురించారు.[14] ఈ గ్రంథం చివరలో పరిశోధనాత్మక వ్యాసం అశ్వఘోష - కాళిదాసుల కవిత్వంపై వ్రాశారు. అందులో వారు అశ్వఘోషుడు కాళిదాసు కంటే పూర్వకవి అని నిర్ధారిస్తూ అశ్వఘోషుని ప్రభావం కాళిదాసుపై ఎంతవరకున్నదో పరిశీలించారు. వీరి నిర్ణయమే సముచితమైందని నేను భావిస్తున్నాను.

దీని చేత కాళిదాసు క్రీ.పూ. 56 నాటి వాడైతే అశ్వఘోషుడు కాళిదాసు కంటే కనీసం 50 యేండ్ల పూర్వీకుడని చెప్పవచ్చు. అశ్వఘోషుని వృద్ధాప్యదశలో కాళిదాసు కవిత్వం వ్రాయడం ప్రారంభించి వుంటాడు. అశ్వఘోషుడు బ్రాహ్మణుడై బౌద్ధాన్ని స్వీకరించడం చేత బౌద్ధమతం మీది తిరస్కారభావంతో కాళిదాసాదికవు లెవ్వరూ తమ పూర్వకవిస్తుతిలో అశ్వఘోషుని స్మరింపలేదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

వ్యాసమహాభారతంలో ఆరణ్యపర్వంలో కౌశికుడనే బ్రాహ్మణునికి, ధర్మవ్యాధునికి జరిగిన సంభాషణ లోకొంతభాగం ప్రక్షిప్తమని (Interpolation) అని నా అభిప్రాయం. దీనిలో జైన బౌద్ధమతాల లోని సిద్ధాంతాలకు సమాధానంగా ఈ సంవాద ఉపాఖ్యానాన్ని పతివ్రతా మాహాత్మ్య స్థాపకంగా వ్యాసుడు రచించిన కథలో చొప్పించి పెంచి వ్రాసినట్లు స్పష్టంగా నిరూపించవచ్చు. కౌశికుడడిగిన విచిత్రమైన ప్రశ్నలే దీన్ని బాగా పట్టియిస్తున్నాయి. (See మహాభారత Critical Edition అరణ్యపర్వం Vol. II అధ్యాయాలు 196-206 (8వ అధ్యాయాలు)సంపా. V.S. Sukathankar, Bhandarkar Oriental Research Institute. Poona 1942).

జైన సంప్రదాయమనే రెండవ అధ్యాయంలో ఈ విషయాన్ని విపులంగా చర్చించాను. కాబట్టి యిక్కడ చర్విత చర్వణం చేయడం లేదు కాని, ఈ ఉపాఖ్యానం లోకొన్నిభాగాలు ప్రక్షిప్తం ( Interpolation) అనడానికి ఒక ఉదాహరణం మాత్రమే చూపిస్తాను.

శ్లో॥ **హలభిన్న విశీర్ణశష్పదుర్భ్యాం హత సూక్ష్మక్రిమికీట జంతు కీర్ణమ్ :**
**సమవేక్ష్యం రసాం తథావిధాం తాం స్వజనస్యేవ వధే భృశం శుశోచ ।**[15]
- బుద్ధచరిత -V 5

ఆషాఢమాసంలో కర్షకులు భూమిని దున్నినపుడు హతమైన సూక్ష్మక్రిమి కీటాదులను చూచి, తమ వారు హతులైనట్లు భావించి గౌతముడు శోకించాడు అని అశ్వఘోషుడు, చిన్నతనంలోనే గౌతముని జీవకారుణ్యాన్ని విశ్వజనీనమైన కరుణామయ చిత్తవృత్తిని వర్ణించగా, దీనికి సరియైన సమాధానమా అన్నట్లు ప్రక్షిప్తకారుడు, మహాభారత ధర్మవ్యాధ సంవాదంలో ''తత్రకిం ప్రతిభాతితే!'' అనే శతకమకుటంలాగా సంధించిన ప్రశ్న పరంపర కనబడుతుంది. అందులో ఒక శ్లోకం అశ్వఘోషుని పై శ్లోకానికి వేసిన సూటి ప్రశ్న -

శ్లో॥ **కృషిం సాధ్వితి మన్యంతే తత్ర హింసాపరాస్మృతా।**
**కర్షంతో లాంగలైః పుంసో ఘ్నంతి భూమిశయాన్బహూన్**
**జీవానన్యాంశ్చ బహుశస్తత్ర కిం ప్రతిభాతితే?**
**చంక్రమ్యమాణా జీవాంశ్చ ధరణీ సంశ్రితాన్బహూన్ ।**
**పద్భ్యాం ఘ్నంతి నరావిప్ర తత్ర కిం ప్రతిభాతితే ॥** - III -198-శ్లో.19,25.

దీనిని ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వం (5-57)లో యిలా అనువదించారు.

మ॥ **హలికుండెంతయు నోజతో దునగ సీరాగ్రంబునం జోఁకి ప్రా**
**ణులనేకంబులు సచ్చు, హింసయదియానో? కాదో! వేయేల? మ**
**ర్త్యులు నేలం జరియించుచో బదములం ద్రొక్కంబడుం బెక్కుజం**
**తులు హింసావిధిగాదనంగ వశమే! దోషజ్ఞ! యూహింపుమా !**

బుద్ధుడు కాబోతున్న గౌతముని హృదయంలో అహింసా వాద సిద్ధాంతానికి ఆయనలో అంకురించిన 'జీవకారుణ్యము' ఎటువంటిదో చెప్పడానికి సూచనగా అశ్వఘోషుడు బుద్ధచరితలో పైశ్లోకం వ్రాయగా. అసలు 'అహింస' అంటే ఏమిటి ? అనే ప్రశ్నను లేవదీసి దానికి సమాధానం చెప్పడానికి అశ్వఘోషుని తర్వాతి పండితులు చేసిన ప్రయత్న ఫలితంగానే మహా భారతంలో అనేక ప్రక్షిప్తాలు చోటుచేసి కొన్నాయని నా అభిప్రాయం. దీన్ని మనం Historical necessity raised by Religious ideas గా గుర్తింపవచ్చు.( ఈ అహింసా వాద విమర్శకు చూ॥ ఈ గ్రంథమే పుటలు 98-101) వ్యాసుడు పతివ్రతా మాహాత్మ్యం చెప్పడమే పరమావధిగా ఉపాఖ్యానం వ్రాయగా, అశ్వఘోషుని తర్వాతి హైందవ పండితులు దాన్ని పొడిగించి జీవుని పుట్టుక మొదలుకొని మోక్షం వరకు వ్రాశారని చెప్పవచ్చు.

# అశ్వఘోషుని రచనలు

అశ్వఘోషుని సౌందరనంద కావ్యాన్ని తొట్టతొలిగా కనిపెట్టి మనకందించిన డా॥ హరప్రసాద శాస్త్రి గారు, చైనీయ పరిశోధకుడు సుజుకి చెప్పిన ఎనిమిది గ్రంథాలను, నంజియో అనే పరిశోధకుడు చెప్పిన ఏడు గ్రంథాలతో పాటు వజ్రసూచి అనే గ్రంథం కూడ అశ్వఘోషుని రచనగా చెబుతారు. కాని అశ్వఘోషుని రచనలుగా ఆరు మాత్రమే ప్రామాణికంగ పరిశోధకులచే అంగీకరింపబడినవి. [16]

అవి –
1) బుద్ధ చరితము
2) సౌందర నందము
3) శ్రద్ధోత్పాద శాస్త్రము
4) వజ్రసూచి
5) శారిపుత్ర ప్రకరణము
6) సూత్రాలంకారము

సౌందరనందము, శారిపుత్రప్రకరణాలలో, టిబెట్టు భాషలో అనువదింపబడిన బుద్ధ చరితంలోని 28వ సర్గం గద్యభాగం లో, వసుబంధు జీవిత చరిత్రలో అశ్వఘోషుడు సువర్ణాక్షీపుత్రుడుగా చెప్పబడినాడు.

**''ఆర్యసువర్ణాక్షీ పుత్రస్య సాకేతస్య భిక్షోర్చార్య భదంత అశ్వఘోషస్య...''**

**''ఆర్యసువర్ణాక్షీపుత్రస్య ఆర్య అశ్వఘోషస్య ....''**

ఈ గద్యభాగాల పరిశీలన చేత అశ్వఘోషుడు సువర్ణాక్షీపుత్రుడని, సాకేతపుర వాసుడని భిక్షువులచే అర్చింపబడే ఆర్యభదంతుడని తెలుస్తున్నది. ఇతనికి అశ్వఘోషుడనే పేరెలా వచ్చిందో ఎవరూ యిదమిత్థంగా చెప్ప లేక పోతున్నారు. ఇది అసలు పేరు మాత్రం కాదు.

చైనీయుల బౌద్ధ గ్రంథాలను బట్టి అశ్వఘోషుడు పుట్టుకతో బ్రాహ్మణుడు. ఇతనిని పార్శ్వుడనే బౌద్ధ భిక్షువు ప్రభావితంచేసి బౌద్ధునిగా మార్చాడు. కాని, టిబెట్టు సంప్రదాయ గ్రంథాలను బట్టి పార్శ్వుని శిష్యుడైన పూర్ణుడు లేక పూర్ణాశుడు లేక పుణ్యయశుడనే భిక్షువు, సర్వాస్తివాద శాఖకు చెందినవాడు, అశ్వఘోషునికి బౌద్ధమతమిప్పించినట్లు చెప్పబడింది.

అశ్వఘోషుడు గొప్ప సంగీత శాస్త్రనిపుణుడైనట్లు కూడ కొన్ని గ్రంథాల వల్ల తెలుస్తున్నది. ఇతడు గుఱ్ఱాలను తన వేణుగానంచే సమ్మోహితం చేయడంచేత అశ్వఘోషుడని పేరు వచ్చినట్లు చెబుతారు. ఇతడు క్రీ.శ. 1వ శతాబ్దంలో గాంధార దేశాన్ని పరిపాలించిన కనిష్కుని బౌద్ధునిగా మార్చగా ఆ రాజు అశ్వఘోషుని గురువుగా, స్నేహితునిగా స్వీకరించాడు. అశ్వఘోషుడు బౌద్ధమతంలోని మహాయాన శాఖకు (ఉత్తర బౌద్ధము) చెందిన వాడు.

ఆది కవి వాల్మీకి మహర్షి రాముని జీవిత గాథను రామాయణంగా రచించి కుశలవుల చేత పాడించి ప్రచారం చేసినట్లు, వ్యాసమహర్షి శ్రీ కృష్ణుని మహత్త్వాన్ని మహాభారతం ద్వారా ప్రజలకు తెలిపినట్లు, అశ్వఘోషుడు బుద్ధుని జీవిత గాథను, సందేశాన్ని మహాకావ్యంగా మలిచాడు. ఈ కావ్యం తొలుత 17 సర్గలే లభించింది. సంస్కృతంలో వ్రాయబడిన మూలగ్రంథం భారతదేశంలో యింతవరకే లభించగా మొత్తం గ్రంథం 28 సర్గల కావ్యం చైనీయ భాషలో లభిస్తున్నది. క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన ఇత్సింగ్ ( I - Tsing) అనే చైనా బౌద్ధయాత్రికుడిలా వ్రాస్తున్నాడు.

''బుద్ధచరితము తథాగతుని ప్రధాన సిద్ధాంతం, జీవిత ధ్యేయాన్ని వివరించే మహాకావ్యం. రాజాంతఃపురంలోని బుద్ధుని బాల్య దశ నుండి సాలవృక్షాల నీడలో మహాపరినిర్వాణం వరకు 28 సర్గలలో మూడు వేల శ్లోకాలలో వ్రాయబడిన మహా కావ్యమిది. ఈ మహాకావ్యం భారత దేశంలో విస్తృత పఠన పఠనాల్లో ఉండడమే కాదు, దీన్ని దక్షిణ సముద్రతీరంలోని ఐదు భాషలైన మలయా, సుమత్రా, జావా మొదలైన ద్వీపాలలో పాడబడుతున్నది. అశ్వఘోషుడు తన కవితానైపుణ్యమంతా ఈ కావ్యరచనలో ప్రదర్శించాడు అది పఠితల హృదయాలను ఆకట్టుకొంటున్నది. ఈ కావ్య పఠనంచే పుణ్యమే కాక ఉదాత్తమైన బౌద్ధమత సిద్ధాంతం సంక్షిప్తంగా అందించిన గ్రంథమిది'' అని వ్రాశాడు.

**బుద్ధ చరితంలోని ప్రధాన లక్షణాలు :**

1) బుద్ధుని పట్ల భక్తి శ్రద్ధలు – బుద్ధుని దేవతామూర్తిమత్త్వ స్థాపన.

2) అతి లోకము, అమానుషమైన అంశాలను కథలో ప్రవేశపెట్టి నిరూపించడం.

3) వైదిక బ్రాహ్మణ మతం యొక్క కర్మకాండలను నిరాకరించడం.

4) బుద్ధుడు మారుడనే మన్మథుని జయించడం.

5) మహాయాన బౌద్ధమతం యొక్క క్రమ పరిణామ వికాసాలు.

రామాయణకాలీన మహా పురుషులలో అగస్త్యుడు (IV-73) అహల్య (IV-72) అజుడు (VIII-79) అనరణ్యుడు( II-15) ఋష్యశృంగుడు (IV-19)రావుడు (I-35, IX 9,25)దశరథుడు (VIII -81) విశ్వామిత్రుడు (IV-20) వశిష్ఠుడు (IV-77) భరద్వాజుడు(IV-74) గౌతముడు (అహల్యభర్త)(IV-72) మొదలగు వారు.

మహాభారతకాలీన మహాపురుషులలో అంగిరస్ (IX-10)అసితుడు(VIII-84) అశ్వినులు (VII-7)అసురులు(IX-32) ఔర్వుడు (I-10)బలి (IX-20)భృగువు (IX-2,25)భీష్ముడు (XI-18, IX-25)గంగా (IX-25) కురువంశీయులు (X-31) పాండు(IV-79) మాద్రి(IV-79) నహుష(II-11, XI - 14) శంతనుడు (XIII-12)వ్యాసుడు (IV-16) యయాతి (IV-78) మొదలగు వారు.

శ్రీకృష్ణుని పేరు పేర్కొనక పోయినప్పటికీ మహాభారత పాత్రలను స్థలాలను చాల వరకు అశ్వఘోషుడు పేర్కొన్నాడు.

రామకథలోని కొన్ని సన్నివేశాలతో బుద్ధుని కథకు సాదృశ్యాలున్నాయి. అలాంటి చోట్ల అశ్వఘోషుడు అయాసందర్భాల కనుగుణంగా దాని పోలికలు తెచ్చి తన ఉపమాలంకార ప్రయోగానికి మరింత వన్నె తెచ్చాడు.

సిద్ధార్థుడు అర్ధరాత్రి అంతఃపురం విడిచి వెళ్లిపోగా మరునాడు ఉదయాన్నే ఈ వార్త తెలిసిన శుద్ధోధనుని అశ్వఘోషుడిలా వర్ణించాడు.

॥శ్లో॥ ఇతి తనయ వియోగజాతదుఃఖం
క్షితి సదృశం సహజం విహాయధైర్యమ్।
**దశరథ ఇవ రామశోక వశ్యో**
బహువిలలాప నృపో విసంజ్ఞ కల్పః॥ (VIII - 81)

దీనిచే రామకథ బుద్ధుని కంటే ముందే జరిగినదని స్పష్టమౌతున్నది.

భీష్మేణ గాంగోదర సంభవేన
**రామేణ** రామేణచ భార్గవేణ।
శ్రుత్వాకృతం కర్మపితుః ప్రియార్థం
పితుస్త్వమప్యర్హసి కర్తు మిష్టమ్ (IX - 25)

యానం విహాయోపమయౌ తతస్తం
పురోహితో మంత్రధరేణ సార్ధమ్
యథా వనస్థం సహవామదేవో
**రామం** దిదృక్షుర్మని రౌర్వశేయః॥ (IX - 9)

తపోవనస్థోఽపి వృతః ప్రజాభి
ర్జగామ రాజా పురమంబరీషః।
తథామహీం విప్రకృతామనార్యై
స్తపోవనాదేత్య రరక్ష **రామః** ॥ (IX - 59)

గృహ ప్రవేశం ప్రతియచ్ఛమే భవాన్
ఉవాచ **రామ** ప్రభృతీన్ నిదర్శనమ్।
నతే ప్రమాణం నహి ధర్మనిశ్చయే
ష్వలం ప్రమాణాయ పరిక్షతవ్రతాః ॥ (IX -67)

అశ్వఘోషుడు బుద్ధచరితను దేశీయమైన ఇతిహాస పురాణాల నుండి గ్రహించిన ప్రమాణాలతో నిర్మించడంలో బుద్ధుడు, విష్ణుమూర్తి అవతారాలైన రామ, కృష్ణావతారాలతో సమాన స్థాయిగల వాడని మహాకావ్య సృష్టిచే సంస్థాపితం చేశాడు.

**సౌందరనందం :** సిద్ధార్థుని పినతండ్రి కుమారుడు నందుడు. అతని భార్య పేరు సుందరి. అశ్వఘోషుడు వీరిద్దరి కథను కావ్యీకరిస్తూ సౌందరనందమనే నామకరణం చేశాడు. సౌందర్యము, ఆనందము రెండూ కలిసిన చోటు సమగ్రత్వాన్ని సంతరించుకొంటుందని కవి చేసిన నామకరణంలోని ఔచిత్యం. అటువంటి సమగ్రత్వం అధ్యాత్మిక భూమికను అందుకొన్నప్పుడే సాధ్యమని మహాకవి తీర్పు. అందుకే ఈ కథలో బుద్ధుని మహానుభావత్వము, సమగ్రగవమూర్తిమత్త్వం ప్రతిఫలించాయి. శ్రీమద్రామానుజుల జీవితంలో తటస్థపడిన ఉఱంగావిల్లిదాసర్ (ధనుర్దాను) వంటి కథయే యిది.

సౌందరనంద కథ పాలీధమ్మపదంలోని సుత్తనిపాతం (మహావగ్గంలోని మూడవ భాగం)లో చెప్పబడింది. ఈ కథను గ్రహించి ఐదారు చిన్నమార్పులతో అశ్వఘోషుడు దీన్ని సంస్కృతంలో కావ్యీకరించాడు. ఈ కావ్యకథాకథనంలోను అశ్వఘోషుడు దేశీయమైన చారిత్రక, పౌరాణిక, గాథలలోని వివిధ మహావ్యక్తులతో పోలికలు నిరూపిస్తూ యితివృత్తాన్ని పరిపుష్టం చేశాడు.

అశ్వఘోషుడు నిర్వాణకాంక్షుల్ని రెండు విధాలుగా తన రెండు కావ్యాలలో వర్గీకరించి చూపాడు. మొదటి కోవకు చెందిన వారు తమంతట తామే, తమలోపల నిక్షిప్తమైన హేతువును పట్టుకొని అన్వేషించి నిర్వాణాన్ని సాధిస్తారు. దీనికి బుద్ధ చరితంలో బుద్ధుడే పరమోదాహరణం. రెండవ కోవకు చెందిన వారు తాము ఏ మార్గంలో నడవాలో తెలియక పోయినా ఏకాగ్రత, దీక్ష కల్గివుండడం చేత, సరైన మార్గదర్శకుడు లభించినప్పుడు, అధ్యాత్మిక భూమికలో ప్రవేశించిన వెంటనే ఎదిగి నిర్వాణాన్ని సాధిస్తారు. దీనికి సౌందరనందం కావ్యంలోని సుందరీనందులే ఉదాహరణం.

## వర్ణవ్యవస్థపై తిరుగుబాటు చేసిన తొట్టతొలి సామాజిక దార్శనికుడు మహాకవి అశ్వఘోషుడు[17]

జైనులు, బౌద్ధులు ప్రధానంగా ప్రతిపాదించిన అహింసావాదానికి వైదిక, లౌకిక సాహిత్యాలలో ముఖ్యంగా రామాయణ, మహాభారతాలలో ప్రక్షిప్తరూపంగా సమాధానం చెప్పడానికి హైందవ పండితులు ప్రయత్నించిన దాఖలాలు కనబడుతున్నాయి కాని, వేదకాలం నుండి వేళ్లుతన్నుకొన్న వర్ణవ్యవస్థను తీవ్రంగా నిరసిస్తూ జన్మతః బ్రాహ్మణుడై, మహాపండితుడై కవియై చివరకి బౌద్ధమతం స్వీకరించిన అశ్వఘోషుడు, బ్రాహ్మణుడంటే ఎవరు? బ్రాహ్మణత్వమంటే ఏమిటి? అనే ప్రశ్నలను 37 సూత్రాలుగా నిబంధించి సంధించిన 'వజ్రసూచి' (The Diamond Needle) కి యింతవరకు మన హిందూ సమాజంలో సరియై సమాధానం రాలేదనే చెప్పాలి. బ్రాహ్మణజాతి పతనమే సంఘంలో నిమ్నోన్నతాలను, ఒడుదుడుకులను సృష్టిస్తూ వుందని, బ్రాహ్మణులు భ్రష్టులు కావడమే దీనికి మూలకారణమని అశ్వఘోషుడు రెండు వేల సంవత్సరాల క్రితమే నిష్కర్షగా చెప్పాడు. అలాంటి, వజ్రసూచీ వైశిత్యాన్నీ, అశ్వఘోషుని కలానికీ, గళానికీ ఉన్న వాడిన, వేడినీ పరిశీలిద్దాము.

**వజ్రసూచి** : అశ్వఘోషుడు తన సమకాలీన సమాజంలోని వర్ణవ్యవస్థపై ధ్వజమెత్తాడు. వర్ణ వ్యవస్థను ఎందుకు ఖండించరాదో కారణాలను ఏకరువు పెడుతూ అతడు హైందవ మత గ్రంథాల నుండి విస్తృతంగా లోపాలను ఉదాహరించాడు.

ధర్మశాస్త్ర గ్రంథాలలో మతపరమైన క్రియాకలాపాలలో బ్రాహ్మణుల ఆధిక్యత, శూద్రులను అస్పృశ్యులుగా చూడడం, పన్నుల నుండి బ్రాహ్మణులకు మినహాయింపు, తప్పు చేసినా బ్రాహ్మణుల్ని చంపకూడదనే నియమం, ఉరిశిక్షకు బదులు వారికి దేశబహిష్కరణ, బ్రాహ్మణ కుటుంబాలలో శుభకార్యం జరిగినప్పుడు వస్తు సామగ్రి లేక పోతే, శూద్రుల

కుటుంబాల నుండి యధేచ్ఛగా తీసుకోవచ్చుననే నియమం, వేదపండితులకు మాత్రమే భూరి దక్షిణలు, అగ్రహారాలు రాజులు యివ్వాలనే నియమం, పరిపాలనా యంత్రాంగంలోను బ్రాహ్మణులకు అత్యున్నత స్థానం కల్పించడం, శిక్షాస్మృతిలో బ్రాహ్మణులను అత్యల్పశిక్షతో వదలిపెట్టడం - యివన్నీ అశ్వఘోషుని కాలంలో అమలులో ఉన్న సాంఘిక పరిస్థితులు.

సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ధర్మశాస్త్రాలు బ్రాహ్మణులకే పెద్దపీట వేయడం, తక్కిన వర్ణాల వారిని చిన్నచూపు చూడడం, అట్టడుగున ఉన్న శూద్రజాతిని త్రొక్కివేయడం అన్యాయమని గొంతెత్తి అరచి సామాజికన్యాయం కోసం పోరాడినవాడు అశ్వఘోషుడు ఇతడు **'వజ్రసూచి'** అనే గ్రంథంలో తన భావాలను క్రోడీకరించాడు.

గౌతమ ధర్మసూత్రాలలో కూడ 'బ్రాహ్మణ' శబ్దం ధార్మిక, నైతిక విలువ దృష్ట్యా నిర్వచింపబడలేదు. ఒక 'వర్ణ' మనే అనే అర్థంలోనే వాడబడింది. బౌద్ధమతానికి పూర్వమే ఉన్న బృహదారణ్యక ఉపనిషత్తు (1-4) లోను, మనుస్మృతి (X-3) లోను ''బ్రాహ్మణులు ధర్మం కోసం పుట్టారు గాని, ఐశ్వర్యాన్నీ, విలాసాలను అనుభవించడానికి కాదు'' అని స్పష్టంగా చెప్పబడింది.

బుద్ధుడు ప్రజలకు తెలియజేసిన సత్యమిది. ''ధర్మబద్ధమైన జీవితాన్ని గడిపేవాడే నిజమైన బ్రాహ్మణుడు. అతడు అర్హతునితో సమానమైన వాడని చెప్పాడు. 'ధమ్మపదం' లోని చిట్టచివరి అధ్యాయం పేరు బ్రాహ్మణవర్గం (బ్రాహ్మణవగ్గం). ''తమహంబ్రూమి బ్రాహ్మణమ్'' అనే మకుటంతో **41** గాథలు యిందులో చెప్పబడ్డాయి.

**యస్సగతిం నజానన్తి దేవాగన్ధబ్బ మానుసా।**
**ఖీణాసవం అరహన్తం, తమహం బ్రూమి బ్రాహ్మణమ్॥**

సంస్కృతచ్ఛాయ :

**యస్యగతిం నజానన్తి దేవా గంధర్వమానుషాః।**
**క్షీణాస్రవ మర్హన్తం, తమహం బ్రవీమి బ్రాహ్మణమ్॥ (26-38)**

దేవగంధర్వ మానవులెవని మార్గం తెలిసికొనలేరో, ఎవడు ఆస్రవ విముక్తుడో (రాగాదిరహితుడో) అర్హతుడో వానిని నేను బ్రాహ్మణుడని పిలుస్తాను.

ఆసవ (ఆస్రవ)ములు నాలుగు

1. కామాసవం = స్త్రీ సంబంధమైన సుఖము (Pleasure)

2. భావాసవం = భౌతిక జీవన దృష్టి, వస్తు సంచయాభిలాష (Materialistic view)

3. దిట్ఠాసవం = కొంచెంగా ఉన్నధనాన్ని రెండింతలు మూడింతలు చేయాలనే తృష్ణ (Speculative Interest)

4. అవిజ్జాసవం = 'అవిద్య' అనే అజ్ఞానం (Ignorance)

ఈ నాల్గింటిని విడిచిపెట్టి ధర్మబద్ధమైన జీవితాన్ని గడిపే వాడే బ్రాహ్మణుడు, అని బుద్ధుడు 'అర్హతుని'తో పోల్చగా, హైందవులు భూమీసురులు, భూసురులు అని భూమిపై నడయాడే దేవతలతో పోల్చారు. బ్రాహ్మణ శబ్దం గౌరవవాచకంగాను, శ్రావక, శ్రమణ, అర్హత పదాలకు సమానార్థకంగాను బౌద్ధవాఙ్మయంలో వాడబడింది.

**అలఙ్కతో చేఽపి సమం చరెయ్య**
**సన్తోదన్తో నియతో బ్రహ్మచారీ।**
**సబ్బేసు భూతేసు నిధాయదణ్డం**
**సోబ్రాహ్మణో సోసమణో సభిక్ఖు॥** – ధమ్మపదం – దండవర్గం – **14**

కొత్తవస్త్రాలతో అలంకృతుడైనా, ఎవడు సమచిత్తుడు, శాంతుడు, దాంతుడు నియమతత్పరుడు, బ్రహ్మచారియై సర్వప్రాణులయందు దండత్యాగియై ఉంటాడో అతడే బ్రాహ్మణుడు, శ్రమణుడు, భిక్షువు.

ఈ విధంగా బ్రాహ్మణునికి విజ్ఞానము, శీలము రెండు ప్రధాన గుణాలుగా బుద్ధుడు ప్రవచించాడు. వర్ణవ్యవస్థలో అత్యున్నత స్థానంలో ఉన్న బ్రాహ్మణుడెలా ఉండాలో చెప్పి, తక్కిన వర్ణాలలోని వారినందరినీ బౌద్ధమతం వైపు ప్రభావితం చేశాడు. ఈ విధంగా సాంఘిక పునర్నిర్మాణం ( Social Reconstruction) చేసి వర్ణ వ్యవస్థను పూర్తిగా మార్చివేయాలనేదే బుద్ధుని అభిమతం. ఆయన ఆశయాలు ఫలించి, బ్రాహ్మణులనేకులు సమకాలీన సమాజంలోని లోపాలను ఎత్తి చూపి, బౌద్ధమతం స్వీకరించారు. వారిలో బౌద్ధమతోద్ధరణ చేసిన అశ్వఘోషుడు, బుద్ధఘోషుడు ప్రముఖులైన వ్యక్తులు.

బుద్ధునికీ, అశ్వఘోషునికీ మధ్య కొన్ని వందల సంవత్సరాల వారడివున్నా, సమాజంలో వర్ణవ్యవస్థ మరింత వికటించిందే తప్ప మార్పేమీ కనబడలేదు. బ్రాహ్మణుల ఆధిక్యత మరింత బలిసి, వారి యజ్ఞయాగాదులు, భూరిదక్షిణలు, అగ్రహారాలు యథాప్రకారంగా కొనసాగుతూనే ఉన్నాయి. బడుగు కులాల వారు మరింత అట్టడుగుకు చేరిపోయారు. ఇది క్రీ.శ. 1వ శతాబ్దపు పరిస్థితి. ఇది బౌద్ధమత వ్యాప్తికి మిక్కిలి ఆటంకంగా పరిణమించింది.

అశ్వఘోషుడు వజ్రసూచిలో బుద్ధుని అడుగుజాడల్లోనే నడిచి శీలానికి అత్యధిక ప్రాముఖ్యమిచ్చి వర్ణవ్యవస్థను తృణీకరించాడు. అంతే కాక, హైందవ ధర్మశాస్త్రగ్రంథాల ద్వారానే బ్రాహ్మణులంటే ఎవరో తెలియజేసి, శాస్త్రమర్యాదనతిక్రమించని సద్బ్రాహ్మణుడే అర్హతుని వంటి వాడని తెలియజేశాడు. అశ్వఘోషుని సమకాలీనుడు, కనిష్కుని ఆస్థాన పండితుడైన రెండవ వసుమిత్రుడు కూడ సాంఖ్యవైశేషిక మతాలను ఖండించాడు.

అశ్వఘోషుని వజ్రసూచి 37 శ్లోకాల చిన్న గ్రంథం. ఇది క్రీ.శ. 1829లో W.H. Hodgson ఆంగ్లానువాదంతో అచ్చువేశాడు. క్రీ.శ. 1839లో సంస్కృత గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించాడు. క్రీ.శ. 1959లో A. Weber జర్మన్ దేశంలోని బెర్లిన్ అకాడెమీ జర్నల్‌లో దీన్ని ప్రచురించాడు. భారత దేశంలో తొలిసారిగా కలకత్తాలోని విశ్వభారతి Annals Vol. - II 1949 లో ప్రచురింపబడింది. ఆ తర్వాత సీనో - ఇండియన్ స్టడీస్, సంచిక - 2లో, సినో - ఇండియన్ కల్చరల్ సొసైటీ, శాంతినికేతన్ తరపున 1950లో ప్రచురింపబడింది. 1960లో సుజిత్ కుమార్ ముఖోపాధ్యాయ, శాంతినికేతన్ నుండి The Vajrasuci of Asvaghosa : A Study of the Sanskrit Text and Chinese version అనే శీర్షికతో పరిష్కృత ద్వితీయ ముద్రణ వెలువరించారు. 1995లో ప్రొ॥ లల్లాంజి గోపాల్ వజ్రసూచిపై విశేష పరిశోధన చేసి గ్రంథం ప్రచురించారు.

ఇప్పటికి సుజిత్ కుమార్ ముఖోపాధ్యాయ 1960లో పరిష్కరించి ప్రకటించిన 'వజ్రసూచి' ప్రామాణిక పరిశోధన గ్రంథంగా, అది అశ్వఘోషకవి కర్తృకమని నిర్ణయింపబడింది. ప్రాచ్య పాశ్చాత్య వ్రాతప్రతులన్నీ దీన్నే సమర్థిస్తున్నాయి.

అశ్వఘోషుని వజ్రసూచికి దీఘనికాయంలోని 12వది, చిట్టచివరిదైన తేవిగ్గ సూత్తానికి చాలా పోలికలున్నాయి. ఇది బుద్ధునికి, బౌద్ధమతం స్వీకరించిన ఇద్దరు బ్రాహ్మణులకు మధ్య జరిగిన సంభాషణ. అంతే గాక, వజ్రసూచికి ధమ్మపదంలోని బ్రాహ్మణ వగ్గానికి చాలా పోలికలున్నాయి. ఈ తులనాత్మక పరిశీలనల జోలికి పోకుండ 'వజ్రసూచి'లో చెప్పబడిన ప్రధానాంశాన్ని మాత్రం పరిశీలిస్తాను.

ఎవడు నిజమైన బ్రాహ్మణుడో 'వజ్రసూచి' యిలా నిర్దేశిస్తున్నది.

**జాతిరపి బ్రాహ్మణో న భవతి।** (6)

**శరీరమపి బ్రాహ్మణో న భవతి ॥** (12)

దీనికి ప్రమాణ వాక్యంగా అశ్వఘోషుడు వైశంపాయనుని వాక్యాన్ని యిలా ఉదాహరించాడు.

**న కులేన నజాత్యా నక్రియాభిర్బ్రాహ్మణో భవేత్।**

కులము చేతగాని, జాతిచేత గాని, క్రియచేతగాని బ్రాహ్మణుడు కాలేడు. మరిదీనిచేతనంటే -

**కుందేందు ధవలం హి బ్రాహ్మణత్వం నామ**

**సర్వం పాపస్యాపాకరణమితి (13)**

తెల్లతామర వలె శుద్ధము స్వచ్ఛమైన బ్రాహ్మణత్వ మెటువంటిదంటే అది సర్వపాపాలను దూరంగా తొలగేటట్లు చేసేది. ఆ పాపము లేవి? అంటే -

**రాగద్వేష నివృత్తిశ్చ ఏతద్ బ్రాహ్మణ లక్షణమ్ । (47)**

రాగ, ద్వేషాలు లేకుండుటయే బ్రాహ్మణ లక్షణం

**మైధునం హిసదా త్యక్తం బ్రాహ్మణ లక్షణమ్ (37)**

స్త్రీ సుఖాలను పూర్తిగా పరిత్యజించిన వాడే బ్రాహ్మణుడు

**అహింసా, నిర్మమత్వం, చ మసత్కృత్యస్యవర్జనమ్ (47)**

ప్రాణిహింస చేయకుండుట, స్వార్థత్యాగము, చెడుపనులు చేయకుండుట బ్రాహ్మణ లక్షణము.

**యదా న కురుతే పాపం సర్వభూతేషు దారుణమ్।**

**కాయేన మనసా వాచా బ్రహ్మ సంపద్యతే తదా ॥ (51)**

**యదా సర్వం పరద్రవ్యం పథివా యదివా గృహే ।**

**అదత్తం నైవ గృహ్ణాతి ద్వితీయం బ్రహ్మలక్షణమ్ ॥ (34)**

సర్వప్రాణికోటియందు దారుణమైన పాపాలకు ఒడిగట్టకుండుట, త్రికరణశుద్ధిగా నుండుట బ్రాహ్మణలక్షణము దారిలో నడుస్తున్నప్పుడు గాని, ఇంటిలో కనబడిన గాని, పరద్రవ్యాన్ని ముట్టుకోకుండుట, ఎవరైనా యిచ్చినప్పుడే దాన్ని గ్రహించడం బ్రాహ్మణలక్షణం.

**క్షమా, దయా, దమోదానం సత్యం శౌచం స్మృతి ఘృణా।**

**విద్యా విజ్ఞానమస్తి వయమేతద్ బ్రాహ్మణలక్షణమ్ ॥ (47)**

క్షమించేగుణం, దయ, ఇంద్రియనిగ్రహం, దానగుణం, సత్యం, శుచిగా ఉండటం, జ్ఞాపకశక్తి, కోపము లేకుండుట, విద్య విజ్ఞానములు బ్రాహ్మణలక్షణాలు.

**శీలం ప్రధానం న కులం ప్రధానం**

**కులేన కిం శీల వివర్జితేన ।**

**బహవో నరా నీచకుల ప్రసూతాః**

**స్వర్గం గతాః శీలముపేత్య ధీర ః ॥**

శీలము ప్రధానమైనది. కులం ప్రధానం కాదు. శీలం లేని కులంతో పనిఏముంది ? ఎందరో మనుషులు నీచకులంలో పుట్టినప్పటికీ శీలవంతులై స్వర్గాన్ని అలంకరించారు!

**శూద్రోఽపి శీల సంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్ (42)**

**శీల శౌచమయం బ్రహ్మ (28)**

పుట్టుకతో శూద్రుడైనా శీలసంపన్నుడు, గుణవంతుడైతే బ్రాహ్మణుడనబడుతాడు. బ్రాహ్మణ్యమంటే శీలము, శౌచములే, ఈ విధంగా బ్రాహ్మణునిపై అత్యధిక భారం మోపబడింది. అంటే సమాజానికి బ్రాహ్మణుడు శీల, విజ్ఞాన విషయాలల్లో ఆదర్శ ప్రాయుడుగా ఉండాలనేది అశ్వఘోషుని అభిమతం.

**వజ్రసూచికోపనిషత్ :** అశ్వఘోషుని వంటి మహామేధావి, మహాకవి, సంఘసంస్కర్తా, బౌద్ధమతాచార్యులలో ప్రముఖుడూ, ఎప్పుడైతే 'వజ్రసూచి'ని సమాజ పునర్నిర్మాణాస్త్రంగా ప్రయోగించాడో హైందవ పండితులూ, వైదికమతోద్ధరణ దీక్షాదక్షులైన వారు ఆలోచనలో పడ్డారు. వారు వెంటనే 'బ్రాహ్మణ' శబ్దాన్ని పునర్నిర్వచించడం (Redefine) అవశ్యకర్తవ్యంగా భావించారు. దాని యొక్క ఫలితంగానే వజ్రసూచికోపనిషత్ అనే ఏడు ప్రశ్నల సమాధాన రూపమైన చిన్న గ్రంథం వెలువడింది. దీనిలోని ప్రారంభశ్లోకం ప్రశ్న పరంపర యిలా వుంది.[18]

**ఓం వజ్రసూచీం ప్రవక్ష్యామి శాస్త్రమజ్ఞాన భేదనమ్।**

**దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషామ్ ॥**

అజ్ఞానాన్ని ఛేదించే సామర్థ్యంగల 'వజ్రసూచి' అనే శాస్త్రాన్ని చెబుతున్నాను. ఇది జ్ఞానహీనులైన వారి పట్ల దూషణముకాగా జ్ఞానచక్షువులైన వారికి భూషణం వంటిది.

వచనం ॥ **బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రా ఇది చత్వారో వర్ణాస్తేషా**
**వర్ణానాం బ్రహ్మణఏవ ప్రధాన ఇతి వేదవచనాను రూపం స్మృతిభిరప్యుక్తమ్ ।**

ప్రశ్నలు ॥ **తత్ర చోద్యమస్తి కోవా బ్రాహ్మణోనామ?**
**కిం జీవః? కిందేహః? కిం జాతిః ?**
**కిం జ్ఞానమ్ ? కిం కర్మ ? కిం ధార్మిక? ఇతి ॥**

బ్రాహ్మణుడంటే ఎవరో చివరగా సమాధానమిస్తూ, తక్కిన ప్రశ్నలకు సమాధాన మీయబడింది.

1. 'జీవుడు బ్రాహ్మణుడందామా' అంటే సృష్టిలో కర్మవశం చేత అనేక దేహాలలో ప్రవేశించి కర్మఫలాన్ని అనుభవించే జీవుడు ఏక రూపుడు. కాబట్టి జీవునికొక పేరు లేదు. వాడు బ్రాహ్మణుడు కాడు.

2. అయితే, దేహము బ్రాహ్మణుడందామా? అంటే పాంచభౌతికతత్త్వంతో కూడి శరీరధారులైన మనుష్యులు. వాడు చండాలుడైనాసరే, జరా మరణములకు లోనవుతున్నారు. ధర్మాన్ని, అధర్మాన్ని పాటిస్తున్నారు. దేహ నిర్మాణంలో ఏక రూపత్వమే, సామ్యమే కనబడుతూవుంది. బ్రాహ్మణులు శ్వేతవర్ణులని, క్షత్రియులు రక్తవర్ణులని, వైశ్యులు పీతవర్ణులని, శూద్రులు కృష్ణవర్ణులనే నియమమెక్కడా లేదు. తమ తమ తల్లిదండ్రులు చనిపోయాక వారి శరీరాలకు వారి పుత్రులు దహించడం చేత బ్రాహ్మహత్యాది దోషాలు సంక్రమిస్తున్నాయి. కాబట్టి, దేహము బ్రాహ్మణుడు కాదు.

3. పోనీ, జాతి చేత బ్రాహ్మణుడందామా? అంటే – జాతి అనగా పుట్టుక. మానవజాతి కంటే వేరైన జంతువుల జాతిలో పుట్టిన వారు మహర్షులైన ప్రమాణాలు మనకున్నాయి. జింకకు పుట్టిన వాడు ఋష్యశృంగుడు. దర్భతో పుట్టిన వాడు కౌశికుడు. జంబుకానికి పుట్టినవాడు జాంబూకుడు. పుట్టలో పుట్టిన వాడు వాల్మీకి. కన్యకు పుట్టిన వాడు కృష్ణద్వైపాయనుడు. కుందేటి వీపుపై పుట్టిన వాడు గౌతముడు. ఊర్వశికి పుట్టినవాడు వసిష్ఠుడు. కలశంతో పుట్టిన వాడు అగస్త్యుడు. ఈ విధంగా జాతితో (పుట్టుకతో) నిమిత్తం లేకుండా జ్ఞానదాతలైన ఋషులెందరో జన్మించారు. కాబట్టి, 'పుట్టుక' చేత బ్రాహ్మణత్వాన్ని నిర్ధారించడానికి వీలులేదు.

4. జ్ఞానమే బ్రాహ్మణ్యమని చెబుదామా? అంటే క్షత్రియులలో కూడా పరమార్థాన్ని దర్శించిన అభిజ్ఞులెందరో ఉన్నారు. కాబట్టి, జ్ఞానం కేవలం బ్రాహ్మణుల సొత్తుకాదు.

5) పోనీ, కర్మ చేత బ్రాహ్మణులను గుర్తిద్దామా? అంటే – సర్వప్రాణికోటి ప్రారబ్ధ, సంచిత, ఆగామి కర్మలలోని పోలికలను దర్శించడం చేత మరల కర్మలచే ప్రేరితులై కర్మబంధాలలో తగుల్కొంటున్నారు. దీనికెవ్వరూ అపవాదులు లేరు. కాబట్టి, కర్మలచేత బ్రాహ్మణుని విడిగా గుర్తించడానికి వీలు లేదు.

6) ధార్మికత్వము చేత బ్రాహ్మణులను గుర్తిద్దామా? అంటే – ధార్మికత్వమంటే దాన గుణం కలిగియుండటం. ఈ దాన క్రియ క్షత్రియులు తదితరులైన వారిలో ఉన్నది. వారిలో బంగారును దానమిచ్చే వారు చాలా మంది ఉన్నారు. కాబట్టి బ్రాహ్మణులు వదాన్యత చేత గుర్తించబడరు.

7. మరి అట్లయితే బ్రాహ్మణుడంటే ఎవరు? అనే ప్రశ్న మిగిలిపోయింది. దానికి సమాధానం చెబుతున్నాడు.

''త్వర్హి కోవా బ్రాహ్మణో నామ? యః కశ్చిదాత్మాన మద్వితీయం, జాతిగుణ క్రియాహీనం, షడూర్మి షడ్భావేత్యాది సర్వదోషరహితం, సత్యజ్ఞానానంత స్వరూపం, స్వయం నిర్వికల్పమశేష కల్పాధారమశేష భూతాంతర్యామిత్వేన వర్తమాన మంతర్బహిశ్చాకాశవదనుస్యూత మఖండానంద స్వభావమప్రమేయ మనుభవైక వేద్యమపరోక్షతయా భాసమానం, కరతలామలకవత్సాక్షాదపరోక్షీకృత్య కృతార్థతయా, కామరాగాది దోషరహితః శమదమాది సంపన్నో భావమాత్సర్య తృష్ణాశామోహాది రహితో, దంభాహంకరాదిభి రసంస్పృష్టచేతావర్తతే। ఏవముక్త లక్షణోయః స ఏవబ్రాహ్మణ ఇతి శ్రుతి స్మృతి పురాణేతిహాసానామభిప్రాయః। అన్యథాహి బ్రాహ్మణత్వ సిద్ధిర్నాస్త్యేవ।''

ఈ సుదీర్ఘమైన నిర్వచనాన్ని పరిశీలిస్తే, యిది భగవంతుని పట్లనే సార్థకమయ్యే లక్షణాలుగా ఉన్నాయే తప్ప లోకంలో మానవమాత్రుడికి యిన్ని సద్గుణాలు ఏకత్రీకరించి వుండడం సంభవమా? అని ప్రశ్న! అటువంటి వాడొక్కడే మనకు కనబడుతున్నాడు అతడు మనుచరిత్రలోని ప్రవరుడు.

**బ్రాహ్మణ డింద్రియవశగతి జిహ్మ చరణైక నిపుణ చిత్తజనిశితా**
**జిహ్మగముల పాలైచెడు బ్రహ్మానందాది రాజ్యపదవీచ్యుతుండై (2-60)**

బ్రహ్మభావనిష్ఠుడైన వాడు బ్రాహ్మణుడు. అతడు కోర్కెలకు దాసోఽహమనినప్పుడు కాముని బాణములచే కొట్టబడి, పతితుడై, అనశ్వరమైన, శాశ్వతమైన బ్రహ్మానందాది రాజ్య పదవి నుండి భ్రష్టుడై చెడిపోతున్నాడని మహాకవి ప్రవరుని ముఖతః చెప్పించినాడు. ఇటువంటి వారు సృష్టిలో నూటికి కోటికి ఒక్కరే వుంటారు. అటువంటి వారు అర్హతులని బుద్ధుడు చెబితే అభ్యంతరమేమీ లేదు. అంటే 'అర్హతు' డనిపించుకోవడం అంత కష్టమని అర్థం. అందుచేతనే మన భారతీయ సంప్రదాయంలో ఒక శ్లోకం యిలా వుంది.

**జన్మనా జాయతే శూద్రః। కర్మణా జాయతే ద్విజః ॥**
**వేదాధ్యాయీచ విప్రస్స్యాత్। బ్రహ్మజ్ఞానీ చ బ్రాహ్మణః ॥**

బ్రహ్మజ్ఞానసంపన్నుడే బ్రాహ్మణుడని అతడు అర్హతుని వంటి వాడని బుద్ధుని అభిప్రాయం. భగవద్గీత కూడ దీనినే ప్రతిపాదిస్తున్నది.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**[19]

వేయిమంది మనుష్యుల్లో ఒక వ్యక్తి సిద్ధికోసం ప్రయత్నిస్తాడు. అటువంటి సిద్ధులలో ఏ ఒక్కడికో మాత్రమే భగవత్తత్త్వం అవగత మౌతున్నది. అటువంటి వాడే బ్రహ్మజ్ఞాని। సరిగ్గా అలాంటి వాడే అర్హతుడు! అని బుద్ధుడు చెప్పాడు.

## త్రిపిటక మహాభాష్యకారుడు బుద్ధఘోషుడు

ప్రస్థానత్రయమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలకు భాష్యాన్ని రచించిన జగద్గురు శ్రీ ఆదిశంకరుల (క్రీ.శ. 778-820) వలె, వేదాలకు, వైదిక వాఙ్మయానికి 18 భాష్యాలు రచించిన సాయణాచార్యుల (క్రీ.శ. 1315 - 1387) వలె, బౌద్ధుల మత గ్రంథాలైన త్రిపిటకాలకు భాష్యాన్ని రచించిన ఆచార్యుడు బుద్ధఘోషుడు (క్రీ.శ. 420). సాయణుల భాష్యం లేక పోతే ఈనాడు వేదార్థం ఎలా తెలిసేది కాదో, బుద్ధఘోషుని భాష్యం లేక పోతే త్రిపిటకాలు పేటికాంతర్గత రత్నాలుగానే ఉండిపోయేవి. సాయణుడు తన భాష్యరచనలో ఎన్నో పురాణకథలు, పురాగాథలు, సంప్రదాయాలు, చరిత్రలు ఉదాహరించి వేదార్థప్రకాశానికి ప్రయత్నించినట్లే, బుద్ధఘోషుడు ఒక విధంగా సాయణుడికీ విషయంలో మార్గదర్శకుడయ్యాడమోననిపిస్తుంది. ఈ పై చెప్పబడిన భాష్యరచనా పద్ధతిని తొలిసారిగా త్రిపిటకార్థవివేచనలో ప్రవేశపెట్టిన వాడు బుద్ధఘోషుడే!.

### బుద్ధఘోషుని జీవితచరిత్రకు ఆధార గ్రంథాలు

వాల్మీకి, కాళిదాసాదులైన మహాకవులు ఏ విధంగా తమను గురించి తాము ఏమీ చెప్పుకోలేదో, అదే విధంగా బుద్ధఘోషుడు కూడ తన భాష్యోపోద్ఘాతాలలోగాని గద్యభాగాలలోని తనకు గురించి ఏమీ చెప్పుకోకపోవడం ఆనాటి వ్యక్తుల యొక్క నిర్లిప్తత, కర్తవ్యపరాయణత, సార్వకాలిక సందేశప్రియత, స్వోత్కర్షారాహిత్యత తేట తెల్లమవుతుంది.

బుద్ధఘోసుప్పత్తి[20] (బుద్ధఘోషోత్పత్తి)ని గురించి 1) గంధవంశం 2) శాసనవంశం 3) సద్ధర్మసంగ్రహం 4) మహావంశం అనే నాలుగు గ్రంథాలలో విభిన్నమైన కథలు చెప్పబడ్డాయి. ఈ కథల్లో కొన్ని నాగసేనుని కథతోను, మొగ్గలి పుత్రతిష్యుని కథతోను పోలినవిగా కనబడుతున్నాయి. వివేచించి చూడగా మహావంశంలో చెప్పబడిన కథ సత్యానికి కొంత దగ్గరగా ఉన్నట్లు తోస్తుంది.

మహావంశంలో బుద్ధఘోషుని చరిత్రను చెప్పే భాగాన్ని ధర్మకీర్తి అనే సింహళదేశీయ శ్రమణుడు రచించాడు. ఇతడు క్రీ.శ. 13వ శతాబ్దంలోని వాడు. అంటే బుద్ధ ఘోషుని జీవితకాలానికి 800 సంవత్సరాల తర్వాత వ్రాయబడిన ఈ కథలోని సత్యాసత్యాలను ఈ నాడు మనం నిర్ణయించలేము. మహావంశంలోని ఈ కథా కథనం యిలా వుంది.

''క్రీ.శ. 5వ శతాబ్దంలో సింహళద్వీపాన్ని మహానాముడనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఈతని కాలంలోనే బుద్ధఘోషుడు సింహళద్వీపానికి వచ్చి త్రిపిటకాలకు భాష్యరచన చేశాడు,

అంటూ ఆయన పుట్టుపూర్వోత్తరాలిలా చెప్పబడ్డాయి. మగధ దేశంలోని మహాబోధి వృక్ష పరిసర ప్రాంతాలలో బుద్ధఘోషుడు జన్మించాడు. పుట్టుకతో అతని నామధేయం బుద్ధఘోషుడు కాదు. ఇతడు బౌద్ధమతాన్ని స్వీకరించిన తర్వాత శ్రమణులందరూ, ఇతడు బుద్ధ భగవానుని వలె గంభీరఘోషను (కంఠస్వరం) గల్గి వుండడం చేత బుద్ధఘోషుడని పిలిచారు. దీనిచేత బుద్ధఘోషునికి తల్లితండ్రులు పెట్టిన అసలు పేరేమిటో తెలియదు. ఇతడు పుట్టుకతో బ్రాహ్మణుడు. మూడు వేదాలలో పారంగతుడై జంబూ ద్వీపంలో మహావాది అయ్యాడు. ఒకనాడీతడు పాతంజలయోగ సూత్రాలను కంఠపాఠంగా వల్లిస్తున్నాడు. అప్పుడు రేవతుడనే మహాథేరుడు అతని ప్రజ్ఞకు అశ్చర్యపడి ఇతనిని బౌద్ధమతానికి మారిస్తే లోకానికెంతో మేలు జరుగుతుందని భావించి, ఆ యువకునితో విజ్ఞాన విషయక చర్చచేసి, దోష నిరూపణ చేస్తాడు. థేరుడు తన వాదానికి ప్రమాణంగా పిటకత్రయంలోని అభిధమ్మ భాగాన్ని చెప్పాడు. యువకుడు ఇదెవరి మతమని ప్రశ్నించాడు. ఇది బుద్ధ భగవానుని మతమన్నాడు థేరుడు. దాన్ని తనకనుగ్రహించవలసిందిగా కోరాడు, ఆ బ్రాహ్మణ యువకుడు. నీవు పరివ్రాజకుడవైతే నీకీ విద్యనుపదేశిస్తానన్నాడు థేరుడు. అలా నిర్వాణమార్గాన్ని కోరి బౌద్ధ మతావలంబియయ్యాడు, వేదవేత్తయైన బ్రాహ్మణ యువకుడు.

ఇతడు మొట్టమొదట 'జ్ఞానోదయ' మనే ప్రకరణ గ్రంథాన్ని వ్రాశాడు. దానితో లోకంలో రెండవ బుద్ధునిలాగా తేజస్సుతో ప్రకాశించాడు. ఆ తర్వాత అభిధమ్మ పిటకానికి వ్యాఖ్యానమైన 'ధర్మసంగిని'పై అర్థశాలిని అనే వ్యాఖ్య వ్రాశాడు. ఇలా త్రిపిటకాలకు కూడ తనకు వ్యాఖ్య వ్రాయాలని వుందని బుద్ధఘోషుడు చెప్పగా థేరుడు యిలా చెప్పాడు.

''భారతదేశంలో త్రిపిటకాలకు మూల గ్రంథం మాత్రమే లభిస్తూవుంది. అర్థకథలు నశించాయి. ఆచార్య వాదాలు విభిన్నంగా ఉన్నాయి. అవి అర్థం చేసుకోవడం అసాధ్యం. అయితే, సింహళ ద్వీపంలో అర్థకథ శుద్ధంగా, సంపూర్ణంగా లభ్యమౌతూవుంది. అది అశోకుని కుమారుడు మహేంద్రుని చేత రచింపబడ్డాయి. కాని, అది సింహళభాషలో వ్రాయబడ్డాయి. నీవక్కడికి వెళ్లి సింహళ భాషాధ్యయనం చేసి దాన్ని మళ్లీ పాళీభాషలోనికి అనువదించి భాష్యం రచిస్తే, లోకోపకారక మౌతుందన్నాడు''.[21]

ఈ విధంగా బుద్ధఘోషుడు సింహళాన్ని మహానాముడు క్రీ.శ. 5వ శతాబ్దంలో పరిపాలిస్తున్న కాలంలో అడుగుపెట్టాడు. అక్కడ అనురాధపురం లోని మహావిహారంలో బసచేశాడు. వారికి తన ఆగమనకాంక్ష తెలిపాడు. అక్కడ సంఘపాలథేరుడు, భిక్షువులు అతని ధారణాసామర్థ్యాన్ని పరీక్షించారు. ఈ పరీక్షలో అతడు వారిచ్చిన రెండు గాథలకు విశుద్ధి మార్గమనే భాష్యసంగ్రహాన్ని రచించాడు. ఆ గ్రంథాన్ని వారు రెండుసార్లు అదృశ్యం చేసి చెప్పమని

ంగా తన అపూర్వధారణా శక్తితో వారిని ఆశ్చర్యచకితుల్ని చేశాడు. ''ఇతడు మైత్రేయ బుద్ధుడే ture Buddha) సందేహము లేదు.'' అని వారందరూ ముక్తకంఠంతో ప్రశంసించి అర్థకథతో ంటకాలను బహూకరించారు.

ఇలా బుద్ధ ఘోషుడు అనూరాధపురంలోని గంధకార విహారంలో నివసిస్తూ హేంద్రభిక్షువుచేత సింహళభాషలో రచితములైన భాష్యాలన్నీ తిరిగి పాళీ భాషలోనికి గ్రంగా అనువదించాడు. ఈ పెద్ద పని పూర్తయ్యాక అతడు తిరిగి భారతదేశానికి వచ్చాడు.

**బుద్ధఘోషుని భాష్యరచనలు :-**

| సంఖ్య | గ్రంథం పేరు | భాష్యం పేరు |
|---|---|---|
| 1. | **వినయపిటకం** | సమంతపాసాదిక |
| 2. | పాతిమొక్ఖసుత్తం | కంఖా వితరిణి |
| 3. | **సుత్తపిటకం** | |
| | దీఘనికాయం | సుమంగళ విలాసిని |
| 4. | మజ్ఝిమనికాయం | పపంచసూదని |
| 5. | సంయుక్తనికాయం | సారార్థప్రకాశిని |
| 6. | అంగుత్తరనికాయం | మనోరథపూరణి |
| 7. | ఖుద్దుకనికాయం | ఖుద్దుకనికాయార్థ కథలు |
| 8. | ఖుద్దుక పాఠం<br>సుత్తనిపాతం | పరమార్థజోతిక |
| 9. | ధమ్మపదం | ధమ్మపదార్థ కథ |
| 10. | ఉదాన, విమానవత్తు,<br>పేతవత్తు, థేరథేరీగాథలు | పరమార్థ దీపని |
| 11. | ఇతివుత్తకం | అభిధమ్మార్థ దీపని |
| 12. | జాతక గ్రంథం | జాతకార్థ కథ |
| 13. | నిద్దేశం | సద్ధమ్మప్ప జోతిక |
| 14. | పటిసంభిదామగ్గం | సద్ధమ్మప్పకాశిని |
| 15. | అపదాన (అవదాన) | విశుద్ధజ్ఞానవిలాసిని |
| 16. | బుద్ధవంశం | మధురార్థవిలాసిని |
| 17. | చరియపిటకం | చరియపిటకార్థ కథ |

| క్రమసంఖ్య | గ్రంథం పేరు | భాష్యం పేరు |
|---|---|---|
| 18. | **అభిధమ్మ పిటకం** | |
| | ధమ్మసంగిణి | అత్థశాలిని |
| 19. | విభంగము | సమ్మోహవినోదిని |
| 20. | కథావత్థు | కథావత్థు అత్థకథ |
| 21. | పుగ్గల పఞ్ఞత్తి | పుగ్గల పఞ్ఞత్తి పకరణాత్థ కథ |
| 22. | ధాతు కథ | దాతుకథా పకరణాత్థ కథ |
| 23. | యమకం | యమక పకరణాత్థ కథ |
| 24. | పట్ఠానపకరణం | పట్ఠానపకరణాత్థ కథ |

ఈ గ్రంథాలేగాక బుద్ధఘోషుడు ''పిటకత్తయ లక్షణ గ్రంథం'' అనే గ్రంథాన్ని పాళీభాషలోనే రచించాడు. సంస్కృత భాషలో 'పద్యచూడామణి' అనే గ్రంథం కూడా వ్రాశాడు. ఇది పదిసర్గల మహాకావ్యం. ఇందులో 641 శ్లోకాలున్నాయి. అష్టాదశవర్ణనల్లోని సముద్ర, మధుపాన, రతోత్సవ, మంత్ర, దూత, వర్ణనలు లేవు. తక్కినవి ఉన్నాయి. కావ్యం శాంతరసప్రధానమైంది. గౌతమ బుద్ధుని జీవిత ఘట్టాలన్నీ యిందులో వర్ణింపబడ్డాయి. బుద్ధత్వప్రాప్తివరకే ఘట్టాలున్నాయి. బుద్ధుని ఉత్తర జీవిత కథాంశాలు లేవు. అనేక విశేష వృత్తాలు ఈ కావ్యంలో కవి ప్రయోగించాడు.

ఆధునిక భారతదేశంలో బుద్ధ ఘోషుని తర్వాత రాహుల సాంకృత్యాయనులకు ''త్రిపిటకాచార్య'' అనే బిరుదున్నది. దేశ విదేశాల్లోని త్రిపిటక వాఙ్మయాన్ని పునరుద్ధరించిన వాడీయన. ఈయన తర్వాత డా॥ రఘువీర, బౌద్ధ వాఙ్మయోద్ధారకుడు.[22] ఈయన కుమారుడు డా॥ లోకేష్ చంద్ర, బౌద్ధ వాఙ్మయంపై విశేష పరిశ్రమ చేశారు, చేస్తున్నారు.[23] అమెరికాలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వరల్డ్ రిలిజియన్స్ వారు The Buddhist Text Information అనే పత్రిక ద్వారా ఇంత వరకు అలభ్యమై వివిధ దేశాలలో దాగివున్న బౌద్ధ గ్రంథాలను విశ్వవ్యాప్తంగా పరిచయం చేస్తున్నారు.[24] ఆంధ్రప్రదేశ్‌లోని సికిందరాబాద్‌లో ఆనంద బుద్ధ విహార ట్రస్ట్ వారు బౌద్ధ ధర్మానికి, సంస్కృతికి అంకితమైన ధర్మ సంస్థగా యిప్పటికి నాల్గైదు ఉత్తమ గ్రంథాలు వెలువరించారు.[25]

**ఆచార్యనాగార్జునుడు :** మాధ్యమిక వాదాన్ని గురించి చెబుతూ నాగార్జునుని గురించి మనం కొంత తెలుసుకొన్నాము. ఇక్కడ ప్రధానంగా నాగార్జునుని రచనలేవి? అందులో గౌతమీపుత్ర శాతకర్ణికి నాగార్జునుడు వ్రాసిన రెండు లేఖలు – సుహృల్లేఖ, రత్నావళి ఈ రెంటిని గురించి విశేషంగా తెలుసుకొందాం.

భారతదేశ చరిత్రలో మనకు ముగ్గురు నాగార్జునులు తటస్థపడుతున్నారు. వీరు ముగ్గురూ ఆంధ్రదేశీయులు కావడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.[26]

1. మాధ్యమిక శాస్త్రాన్ని వ్రాసిన ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. 1-2 శతాబ్దలలో జీవించాడు. ఇతడే శాతవాహన యువరాజైన గౌతమీపుత్రశాతకర్ణి (క్రీ.శ. 107-128) కి సుహృల్లేఖ, 'రత్నావళి' అనే పేర్లతో రెండు లేఖలను వ్రాసిన ఆచార్యుడు.

2. జయప్రభ శిష్యురాలైన చంద్రప్రభ వ్రాయించిన జగ్గయ్య పేట శాసనంలో భదంతనాగార్జునుని పేరు కన్పిస్తుంది. చంద్రప్రభ తాను భదంత నాగార్జునుని శిష్యురాలనని చెప్పుకుంది. ఈ శాసనం క్రీ.శ. 450-550 మధ్యకాలానికి చెందినది. రసవాదంలో, వైద్యంలో నిష్ణాతుడై సువర్ణతంత్ర, రసరత్నాకర గ్రంథాలను రచించినది భదంత నాగార్జునుడేనని చెప్పవచ్చు.

3. క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన ప్రఖ్యాత బౌద్ధుడు, సరాహునికి శిష్యుడైన మరో సిద్ధ నాగార్జునుడు కూడా ఉన్నాడు. ఈయన ప్రముఖ తాంత్రికుడుగా 84 మంది సిద్ధులలో ఒకడుగా ప్రసిద్ధి చెందాడు.

క్రీ.శ. 4-5 శతాబ్దాలకు చెందిన కుమారజీవుడే నాగార్జునుని జీవితాన్ని గురించిన సమాచారాన్ని అందించిన వాళ్లలో ప్రప్రథముడని చెప్పవచ్చు. కుమార జీవుడు తాంత్రిక విద్యల్లోను, రసవాదంలోను నాగార్జునుని ప్రావీణ్యం గురించి ప్రస్తావించ లేదు. రసవాది నాగార్జునుడు, సిద్ధనాగార్జునుడకు సంబంధించిన ఎన్నో విషయాలను మాధ్యమికతత్త్వవేత్తయైన ఆచార్య నాగార్జునునికి ఆపాదించడం ద్వారా టిబెట్, చైనా సంప్రదాయాలు ఆయన జీవితానికి చెందిన స్పష్టమైన సమాచారాన్ని అందుబాటులో లేకుండా చేశాయి.

ఇదిలా ఉండగా ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి గారు ఆంగ్లంలో 'నాగార్జున' అనే గ్రంథాన్ని 1971లో నేషనల్ బుక్‌ట్రస్ట్, న్యూఢిల్లీల వారి ద్వారా ప్రచురిస్తూ, ఆచార్య నాగార్జునుడు, భదంత నాగార్జునుడు, యిద్దరు ఒకరేనని నాల్గు కారణాలు చూపారు. వీరి దృష్టిలో సిద్ధనాగార్జునుడు కూడ ఆచార్యనాగార్జునుడేనని తెలుస్తున్నది (చూ॥ పుటలు 21-37)

కాని, ఈ వాదాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన ఆచార్య బి.యస్.ఎల్. హనుమంతరావు గారు తమ Religion in Andhra అనే గ్రంథం (1973)లో Appendices IV, పుటలు 326-327లలో Bhadanta Nagarjuna of the Jaggayyapeta Inscription అనే శీర్షిక క్రింద ఆచార్యమూర్తి గారి వాదన వారి తన దృష్టితో నిలువదని త్రోసిపుచ్చారు. వారి వాక్యాలివి.

"we may therefore conclude the Bhadanta Nagarjuna of the Jaggayyapeta Inscription cannot be identified with Acharya Nagarjuna. The record clearly establishes the historicity of Siddha Nagarjuna". (Page - 327)

దీని తర్వాత యిటీవల సికింద్రాబాద్‌లో వెలసిన ఆనందబుద్ధ విహార ట్రస్ట్ వారిచే ప్రచురింపబడిన ఆచార్యనాగార్జున సుహృల్లేఖ (1997) పీఠికలో ఆంధ్రదేశంలో ముగ్గురు నాగార్జునులున్నారన్న విషయం విస్పష్టంగా చెప్పబడింది. (పుటలు - 8-9) ఇదే సరైన నిర్ణయమని నేను భావిస్తున్నాను.

**ఆచార్యనాగార్జునుని గ్రంథాలు** : ఆచార్య నాగార్జునుడు బహుగ్రంథకర్త 1) మాధ్యమిక కారిక 2) శూన్యతాసప్తతి 3) విగ్రహవ్యావర్తిని 4) వైదుల్య ప్రకరణం 5) వ్యవహారసిద్ధి 6) యుక్తిశాతకం 7) సుహృల్లేఖ 8) రత్నావళి 9) ప్రజ్ఞాపారమితా వ్యాఖ్య 10) సూత్రసముచ్చయం 11) ప్రతీత్యసముత్పాదహృదయకారిక 12) బోధిచిత్తవివరణ 13) దశభూమివిభావ శాస్త్రం 14) ద్వాదశముఖ శాస్త్రం 15) ఏకశ్లోకశాస్త్రం మొదలగునవి ఈయన రచించిన గ్రంథాలు.

**సుహృల్లేఖ** : ఆంధ్ర శాతవాహన రాజవంశానికి చెందిన గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 107-128) నుద్దేశించి సంక్షిప్తంగా, సమగ్రంగా బౌద్ధమత బోధనల సారాంశాన్ని 'సుహృల్లేఖ' అనే పేరుతో 123 ''ఆర్యా'' శ్లోకాలలో వ్రాశాడు ఆచార్య నాగార్జునుడు. ఈ లేఖ బౌద్ధమతంలోని శీల, సమాధి, ప్రజ్ఞలను చక్కగా వివరించింది. క్రీ.శ. 7వ శతాబ్దిలో భారతదేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు ఇత్సింగ్ ప్రాచీన భారతదేశంలో ఈ గ్రంథానికి విశేష ప్రజాదరణ ఉన్నట్లు తెలిపాడు. టిబెట్టులో ఈనాడు కూడా దీన్ని ప్రాథమిక బౌద్ధ ధర్మ గ్రంథంగా పఠిస్తున్నారు. 'సుహృల్లేఖ' మూడు సార్లు చైనా భాషలో అనువదింపబడింది. క్రీ.శ. 5వ శతాబ్దిలో గుణవర్మ, సంఘవర్మలు అనువదింపగా, క్రీ.శ. 7వ శతాబ్దిలో ఇత్సింగ్ దీనిని చైనా భాషలో అనువదించాడు. సర్వజ్ఞదేవుడు దీన్ని టిబెట్ భాషలోకి అనువదించాడు. 'సుహృల్లేఖ' కు టిబెట్ భాషలో నాల్గు వ్యాఖ్యానాలు వెలిశాయి. అందులో రెండు వ్యాఖ్యానాలు బాగా ప్రసిద్ధి పొందాయి. విచిత్ర మేమంటే 'సుహృల్లేఖ' సంస్కృత మూలం మనకింత వరకు లభించలేదు.

టిబెట్ భాష నుండి ఆంగ్ల భాషలోనికి అనువదింపబడిన గ్రంథంలో రెండు టిబెటన్ వ్యాఖ్యానాల ననుసరించి వ్యాఖ్యలు, వివరణలు సంతరింపబడిన గ్రంథం Nagarjuna's letter to King Goutamiputra అనే పేరుతో 1978లో మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీవారు ప్రచురించారు. 'సుహృల్లేఖ' టిబెట్ భాష నుండి ఆంగ్లీకరించిన అనువాదకులు ముగ్గురు Venerable Lozang Jamspal, Venerable Ngawang Samten Chophel, and Peter Della Samtina అనువారు.

ఈ గ్రంథాన్ని ఆధారంగా చేసికొని, సికింద్రాబాదులోని ఆనంద బుద్ధ విహార ట్రస్ట్
రు 'సుహృల్లేఖ'కు తెలుగు అనువాదాన్ని శ్రీగజ్జెల మల్లా రెడ్డి గారి చేత చేయించారు. ఈ
ంథం 1997లో వెలువడింది. ఈ తొట్టతొలి ముద్రణ సమగ్రంగా, గంభీరంగా వెలువడిందని
ప్పవచ్చు. గజ్జెల మల్లా రెడ్డి గారి అనువాదం నుండి రెండు మూడు ఉదాహరణలు
ూపుతున్నాను. లోకంలో మానవులు నాల్గు విధాలుగా ఉన్నారని, చెబుతూ

**చిరువెలుగు నుంచి నెఱివెల్గు చేరువారు**
**తమసు విడి అంధ తమసుకు తరలువారు**
**ఇరులకై కాంతిలో నుంచి తెరలు వారు**
**కాంతికై చీకటిని వీడి కదలువారు**
**ధరణిపై నాల్గుతెరగుల నరులు కలరు**
**అందులో కెల్ల తొలితెగ అగును మిన్న !**

ఈ నాల్గు విధాలకు 'మామిడిపండు'తో పోలికను సాధిస్తూ చెప్పిన ఈ పద్యం
ూడండి.

**పండకుండియు చక్కగా పండినట్లు**
**ఉండి మురిపించు మామిడిపండు ఒకటి!**
**పండియును పండనట్లుగా ఉండు నొకటి**
**పండకుండ అదే రీతి ఉండు నొకటి**
**పండి పండిన తీరుగా ఉండు నొకటి**
**మనుజులకు సైత మీసామ్యమమరుతుంది** (పుటలు 22-23)

ఇందులో చిట్ట చివరిదైన పండి పండిన తీరుగా ఉన్న వ్యక్తియే లోకానికి
యస్సుచేకూర్చేవాడు. తక్కిన ముగ్గురిలో మొదటివాడు లోకాన్ని మోసం చేసేవాడు.
తారణశీలి! వాడిని నమ్మరాదు. పైపై వినయాలు నటిస్తూ, లోపల సముద్రమంత
హంకారాన్ని కల్గివుంటాడు. వాడు రాజకీయంగా, సాంఘికంగా, గొప్ప పలుకుబడి, పరపతి
ల్గివుంటాడు. లోకం వాడి చుట్టూ తిరుగుతుంది. రెండు, మూడు రకాల మనుషులు లోకానికి
మాదాన్ని తెచ్చిపెట్టరు. కాని, మొదటివారి సంఖ్యే లోకంలో హెచ్చుగా ఉండడం మనం
ూస్తుంటాం! వారు ధనాన్ని, కీర్తిని యితోధికంగా సంపాదించుకోవచ్చునేమోగాని,
హస్యార్థగర్భితమైన సద్విషయాలు పేటికాంతర్గత రత్నాలు వలె భద్రంగానే ఉంటాయి. అవి
ఉదాత్త భావుక విమర్శకునికో అందివచ్చి లోకంలో ప్రకాశిస్తాయి. ''భద్రైషాం
క్ష్మీర్నిహితాధివాచి'' అని కదా ఋగ్వేదం!

'ప్రజ్ఞ'కూ ధ్యానానికీ గల అవినాభావ సంబంధం ఎలాంటిదో ఈ పద్యంలో చక్కగా చెప్పబడింది.

**ప్రజ్ఞలేకున్న ధ్యాన సంప్రాప్తినాస్తి**
**ధ్యాన మెరుగని ప్రజ్ఞకు దారి లేదు**
**పుణ్యము ఫలించి వీటిని పొందెనేని**
**భవ మహాంబోధి ఎంత ? గోష్పాదమంత!** (పద్యం - 110)

ఆచార్య నాగార్జునుడు గౌతమీపుత్ర శాతకర్ణికి పంపిన మరో లేఖ 'రత్నావళి'. ఇది గృహస్థులు, ముఖ్యంగా పాలకులు అనుసరించవలసిన సైద్ధాంతిక ఆచరణాత్మక సూత్రాలను వివరిస్తూ పుణ్య, జ్ఞాన సంభారాలను, సముపార్జించవలసిందిగా ఉద్బోధిస్తుంది. 'రత్నావళి' కి కూడ సంస్కృతమూలం నాకు లభించలేదు. అయితే, దీని ఆంగ్లానువాదాన్ని ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి గారి 'నాగార్జున' అనే ఆంగ్ల గ్రంథం అనుబంధం (పుటలు 87-103)లో చూడవచ్చు. ఈ అనువాదం కొన్ని ఎన్నుకొన్న శ్లోకాల అనువాదం మాత్రమే! ఒకటి రెండు ఉదాహరణాలు చూద్దాం!

''ధర్మం చక్కగా అనుష్ఠింపబడినట్లయితే, అది ఆనందాన్ని, అభ్యుదయాన్ని కల్గించడమే కాదు క్రమ క్రమంగా మోక్షాన్ని కూడ ప్రసాదిస్తుంది. శ్రద్ధ, ప్రజ్ఞలే ధర్మం యొక్క సారం (శ్లో 1) ''గృహస్థుడైన వానికి ధర్మమనేది విశేషించి, దానము, నైతికత, ఓర్పు, సహనం, సత్యం, వీటిపై ఆధారపడివుంటుంది. వీటన్నిటి సారమే దయ. ఎందుకంటే లోకం దుఃఖభాజనమైంది. ఈ దుఃఖము సార్వకాలికము, విశ్వజనీనమైంది. దుఃఖితుల పట్ల దయచూపడం గృహస్థుని కనీస ధర్మం. దీనినే 'కృపాగర్భః' అని ఆచార్యనాగార్జునులు చెప్పారు. గృహస్థుడు కృపాగర్భమతియైతే అంతకంటే కావలసింది లేదు. ఆ గృహము, సమాజము స్వర్గసీమలేనని అని అంతరార్థం!.

ఈ విధంగా 'సుహృల్లేఖ' లో బుద్ధుని బోధనలు ''బుద్ధం శరణం గచ్ఛామి'' అనే వాక్యానికి ప్రమాణంగా నిరూపింపబడగా, రత్నావళిలో ''ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి'' అనే మరో రెండు వాక్యాలు సమగ్రంగా నిరూపింపబడినవని చెప్పవచ్చు. గృహస్థుడైనవాడు లేక రాజు, ధర్మాన్ని ఎలా అనుష్ఠించాలో, సంఘం పట్ల వారి వారి కున్న కర్తవ్యమేమిటో విపులంగా చర్చించి నిరూపింపబడింది. ఈ విధంగా ప్రతిజ్ఞా వాక్యాలు మూడింటి సారాంశాన్ని ఈ రెండు లేఖల ద్వారా దేశాన్ని ఏలే రాజుకు తెలిపి నాగార్జునాచార్యుల వారు సార్వకాలిక సందేశాన్ని మన కందించారు.

# బౌద్ధమతం - 'భూమికా' శబ్దార్థం

గౌతమ బుద్ధుని నిర్వాణానంతరం బౌద్ధమతం హీనయాన, మహాయానాలనే రెండు శాఖలుగా చీలిపోయింది. మార్పు పొందిన బౌద్ధానికి మహాయానమని, ఆదిమ బౌద్ధానికి హీనయానమని పేర్లు వచ్చాయి. హీనయానంలో సర్వసంగ పరిత్యాగం చేసి భిక్షువుగా చేరి, వినయ, సుత్త అభిధమ్మలనే త్రిపిటకాలను అధ్యయనం చేసి, పరిజ్ఞాతయై అర్హతుని పదం పొందిన వాడికే నిర్వాణోపలబ్ధి కలుగుతుంది. అందుకే, హీనయానానికి 'అర్హతయాన' మని పేరు. మహాయానంలో సర్వసంగ పరిత్యాగం గావించవలసిన అవసరం లేదు. బోధిసత్త్వులకు ప్రాధాన్యం గల్గిన మహాయానానికి బోధిసత్త్వయానమని పేరు.

బౌద్ధదర్శనాన్ని (Buddhist Philosophy) అనుసరించి ధర్మకాయ, సంభోగకాయ, నిర్మాణకాయాలనే బుద్ధకాయత్రయ సిద్ధాంతమేర్పడింది. హీనయానంలో ధర్మానికి ప్రాముఖ్యం. మహాయానంలో బుద్ధునికి ప్రాముఖ్యం. బుద్ధుడు, ధర్మము, సంఘము రెంటిలోను సమానం.

మహాయానంలో బోధిసత్త్వులు లెక్కకు మిక్కిలిగా వెలిశారు. బోధిసత్త్వులు భార్యాసహితులు. సంపత్సమేతులు. వీరి చుట్టూ అపూర్వమైన ఎన్నో గాథలల్లుకొని మహాయానానికి గొప్ప పురాణ వాఙ్మయాన్ని ( mythology) ప్రసాదించింది. ఇలాంటి బోధిసత్త్వుల్లో ఒకరు, బౌద్ధమతంలో విద్యాసంస్కృతులకు అధిదైవమైన ''మంజుశ్రీ''ని మహాయానంలోని 'గండవ్యూహ సూత్ర'' మనే గ్రంథం పేర్కొనింది. మహాయానంలో నవధర్మాలనే పేరుతో తొమ్మిది గ్రంథాలున్నాయి. **1.** గండవ్యూహ సూత్రం, **2.** అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితా సూత్రం, **3.** దశభూమికా సూత్రం, **4.** సమాధి రాజ సూత్రం, **5.** లంకావతార సూత్రం, **6.** సద్ధర్మపుండరీకం, **7.** తథాగత గుహ్యకం, **8.** లలిత విస్తరం, **9.** సువర్ణ ప్రభాసం.[27]

'భూమిక' అనేది జ్ఞానపరిణతిలో సాధించిన ఒకానొక స్థితిని సూచిస్తుంది. దీనినే state of consciousness అంటారు. ఇందులో అనేక స్థాయి భేదాలున్నాయి. ఒక్కొక్క దానికి ఒక్కొక్క పేరుంటుంది. వీటిని stages of consciousness అంటారు. ఈ విధమైన భావన మహాయాన బౌద్ధంలో అభివృద్ధి పొందింది. మహాయానం బోధిసత్త్వ ప్రాధాన్యం గల్గిందని ముందే చెప్పాను కదా! ఆ బోధిసత్త్వులు జ్ఞానపరంగా సాధించే ఉన్నతోన్నతస్థాయుల్ని 'భూమిక' లంటారు. ఉదాహరణకు 'ప్రజ్ఞాపారమిత' అనే దొక భూమిక.

శ్లో॥ **యథా బోధిసత్త్వః ప్రజ్ఞాపారమితా యాం చరన్ ।**
**యథాతత్త్వం ధర్మాణా మాత్మతాం పశ్యతి ॥** [28]

బోధిసత్త్వుడు ప్రజ్ఞాపారమిత భూమికలో చరిస్తూ వుండేవాడు. కాబట్టి, ధర్మస్వరూపాన్ని గుర్తింపగలడు.

శ్లో॥ **దక్షిణాపథ దేహళ్యాం భిక్షుః శ్రీమాన్ మహాయశాః**
**నాగాహ్వాయ స్సనామ్నాతు సదసత్పక్షదారకః ।**
**ప్రకాశ్యలోకే మద్యానం మహాయాన మనుత్తరమ్**
**ఆసాద్యభూమిం ముదితాం యాస్యతేసౌ సుఖావతీమ్॥** [29]

దక్షిణాపథదేహళిలో నాగార్జునుడనే భిక్షువు వెలయగలడు. అతడు మహాయానమనే పేరుతో బుద్ధుని మార్గాన్ని నెలకొల్పి 'సుఖావతీ భూమిక'ను పొందగలడు.

'భూమిక' అనే పరిభాషకే 'వ్యూహ' మనే పదాన్ని కూడా బౌద్ధులు వాడుతారు. ఉదాహరణానికి 'సుఖావతీ వ్యూహమే 'సుఖావతీ భూమిక! ఇవి సమానార్థకాలు 'భూమి' శబ్దం ఒక జ్ఞానలోకానికి కూడా సూచకం! దానినే 'సువిశుద్ధ ప్రభాభూమి' అని మహాయానం పేర్కొన్నది. 'ద్వాదశ సహస్ర మహామేఘ'మనే గ్రంథంలో యిలా చెప్పబడింది. **''లిచ్ఛవీ కుమారోఽయం సర్వసత్త్వానాం దర్శనే నందక ఇత్యానందః । నిర్వాణాచ్చతుశ్శతేషు వర్షేషు వ్యతీతేషు నాగాహ్వయో భిక్షుర్భూత్వా మద్దేశానాం విస్తరేణ ప్రకాశ్య ఆనుపూర్వేణ సువిశుద్ధ ప్రభాభూమి నామక లోకధాతౌతథాగతః అర్హన్ సమ్యక్ సంబద్ధః జ్ఞానాకర ప్రభాభిధో భవిష్యతి।''**

''లిచ్ఛవి కుమారుడు సర్వసత్త్వాలకు దర్శనమాత్రం చేత ఆనందజనకుడు కావడం చేత ఆనందుడని పిలువబడినాడు. ఇతడు నిర్వాణం చెందిన 400 యేండ్లకు నాగార్జునుడనే భిక్షువుగా పుట్టి, నా ఉపదేశాన్ని విస్తరంగా ప్రకాశింప జేసి 'సువిశుద్ధ ప్రభాభూమి' అనే లోకంలో సమ్యక్ సంబుద్ధుడై జ్ఞానాకర ప్రభుడనే పేరుతో వెలయుగలడు''

బౌద్ధమతంలో జ్ఞానాన్నే 'ప్రజ్ఞ' అంటారు. 'ప్రజ్ఞ' ఐదు ఇంద్రియాలలో ఒకటి. 'ప్రజ్ఞాపారమిత' అనేది ఆరు లేక దశ విధపారమితులలో ఒకటి. ప్రజ్ఞకు బౌద్ధ దర్శనంలో చాల గొప్పస్థానముంది. ప్రజ్ఞను పాలీ భాషలో 'పఞ్ఞా' అంటారు. టిబెట్టు భాషలో 'షే-రబ్' అంటారు. సంస్కృతంలో 'ప్రజ్ఞ' జ్ఞాన మంటారు. పాలీ భాషలో'పఞ్ఞా చక్ఖు:' అని చెబితే సంస్కృతంలో 'ప్రజ్ఞాచక్షుః' అనబడుతుంది. ప్రజ్ఞ యొక్క ఈ ఉత్కృష్ట స్థితి 'బోధి' కి మిక్కిలి సమీపంలో ఉంటుంది. అందుకే –

సీలం సమాధి పఞ్ఞాచ విముక్తి చ అనుత్తరా'' అని చెప్పబడింది. బౌద్ధ దర్శనం యొక్క
సమలక్ష్యమే ప్రజ్ఞ. 'ప్రజ్ఞాకరమతి' ప్రజ్ఞ నిలా నిర్వచించాడు.

**''ప్రజ్ఞా యథావస్థిత ప్రతీత్య సముత్పన్నస్తు తత్త్వ ప్రవిచయ లక్షణా''**

ప్రతీత్యసముత్పన్నమైన ప్రజ్ఞ మానవజీవితతత్త్వాన్ని విశ్లేషించి తెలిసికొనగల సామర్థ్యం
ది. దీనినే 'వజ్రచ్ఛేదికా ప్రజ్ఞా పారమితా సూత్ర' మనే గ్రంథ సంపాదకులైన డా॥ లాలమణి
షి గారు యిలా వివరించారు[30]. ప్రవిచయ వెనుదర్శ ప్రజ్ఞేంద్రియం, ఆరవపారమిత,
బోధిసాధనం. తత్త్వాన్ని సమగ్రంగా తెలిసికొనే జ్ఞానవిశేషమే ప్రజ్ఞ అని వ్రాశారు.

## ప్రజ్ఞాపారమిత

జ్ఞానానికి పరాకాష్ఠ, ఉత్కృష్ట స్థితి ప్రజ్ఞాపారమిత. ఇది దుఃఖశమనాన్ని కల్గిస్తుంది.
జ్ఞాపారమితా శబ్దం పాలీలోని బౌద్ధ వాఙ్మయంలో చాల అరుదుగా కన్పిస్తుంది. సారిపుత్తథేర
థలో ఒక చోట -

**పఞ్ఞా పారమిత్తం పత్తో మహాబుద్ధి మహామతి।**
**అజడో జడసమానో సదాచరతి నిబ్బుతో॥** [31]

ప్రజ్ఞా పారమితా స్థితిని పొందిన గొప్పబుద్ధిశాలి, గొప్పమేధావి చైతన్యవంతుడైనప్పటికీ
తనుడిలాగా సదాశాంతచిత్తుడై తత్త్వవిచారణ చేస్తాడు. 'సద్ధర్మపుండరీకం'లో కూడా
పుత్రుని 'పారమీప్రాప్తో'' అని వర్ణింపబడింది. ఇంతకూ 'పారమితా' శబ్దానికి అర్థమేమి?
నం యొక్క పరిపూర్ణత, అత్యుత్కృష్ట స్థితి ( integrity of knowledge or wisdom)
జ్ఞాపారమిత అంటే Perfection of wisdom, culminating point of wisdom.
జ్ఞయొక్క పరిపూర్ణతయే ప్రజ్ఞాపారమిత.

పారమ్ + ఇతా = పారమితా
పారమ్ - అవతలితీరం, అవతలిగట్టు
ఇతా - పోవుట, వచ్చుట.

'అవతలిగట్టుకు వచ్చి చేరుట' అని అర్థం. టిబెట్టు భాషలో 'ఫా-రోల్తు-ఫియన-పా'
రమితా') అనే శబ్దం యొక్క అర్థమిదే.

ఆచార్యదిఙ్నాగుడు, ప్రజ్ఞాపారమితా దర్శనం యొక్క చరమోత్కర్షాన్ని యిలా చెప్పాడు.

**ప్రజ్ఞాపారమితా జ్ఞానమద్వయం సా తథాగతః।**
**సాధ్యతాదర్థ్యయోగేన తాచ్ఛబ్దం గ్రంథమార్గయోః ॥**

దిజ్నాగుడు 'జ్ఞానమద్వయం' అని ఎప్పుడైతే అన్నాడో అప్పుడది 'అద్వైత' మౌతున్నది. సిద్ధకంబలాచార్యుడు (కంబలపాదుడు) 'నవశ్లోకీ'[32] అనే తన ఆర్యాష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితాపిండార్థములోని ప్రారంభ శ్లోకాలలో ప్రజ్ఞాపారమిత యొక్క అద్వైతదర్శనాన్నే ప్రతిపాదించాడు.

**ప్రజ్ఞాపారమితాం బోధా శుభరత్నాకరే స్వయం**
**సర్వాపారమితా స్త్రత్ర తాదాత్మ్యేన వ్యవస్థితాః ।**
**నిష్ప్రపంచా నిరాభాసా నిర్వికల్పా నిరాలయా**
**నిస్స్వభావా పరా సూక్ష్మాబిందు నాద వివర్జితా ॥**

'నవశ్లోకి' లో యిట్లు చెప్పబడింది –

**ప్రజ్ఞాపారమితా మాతా సర్వబుద్ధోదయా పరా ।**
**త్రయానుపలబ్ధి రూపా సర్వజ్ఞ జ్ఞానగోచరా॥**[33]

ప్రజ్ఞ – శ్రుతమయీ, చింతామయీ, భావనామయీ అని త్రివిధములు. ఆచార్యనాగార్జునుడు, ధర్మసంగ్రహమనే గ్రంథంలో దశపారమితులను వివరించాడు.[34]

| | | | |
|---|---|---|---|
| 1) | దాన పారమిత | 6) | ప్రజ్ఞాపారమిత |
| 2) | శీలపారమిత | 7) | ఉపాయకౌశల్యపారమిత |
| 3) | క్షాంతిపారమిత | 8) | ప్రణిధిపారమిత |
| 4) | వీర్యపారమిత | 9) | బలపారమిత |
| 5) | ధ్యానపారమిత | 10) | జ్ఞానపారమిత |

దశభూమికా సూత్రంలో ప్రతి యొక్క భూమికతో పాటు ఒక్కొక్క పారమిత యొక్క సంబంధం స్థాపింపబడింది[35]. ఈ దశవిధభూమిలకు – మహాయాన భూమికలివి.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రముదితా భూమిక | 6) | అధిముక్తీ భూమిక |
| 2) | విమలా భూమిక | 7) | దూరంగమా భూమిక |
| 3) | ప్రభాకరీ భూమిక | 8) | అచలా భూమిక |
| 4) | అర్చిష్మతీ భూమిక | 9) | సాధుమతీ భూమిక |
| 5) | సుదుర్జయా భూమిక | 10) | ధర్మమేఘా భూమిక |

'దశభూమికా సూత్రం' మహాయానం లోని 'నవధర్మము' లనబడే గ్రంథాలలో ఒకటి
బట్టి ఇవి మహాయాన భూమికలు. 'మహావస్తువు' లో బోధిసత్త్వుని దశవిధ భూమికలు
ప్పబడినవి. భిక్షుథెల్వటే రాహులా – 'A Critical study of the Mahavastu' అనే
ంథంలో, భూమి, భూమికలను యిలా నిర్వచించారు. " The word **bhumi** has different
neanings such as earth, ground, territory, place and stage. As a technical
erm in Buddhist Sanskrit texts, it signifies as state in the Bodhisattva's
areer"[37]

'మహావస్తువు' లో బోధిసత్త్వుని జీవనచర్య విస్తారంగా వర్ణింపబడింది. భూమికల
శేషచర్య ఉన్నది. కాని, పారమితుల యొక్క క్రమబద్ధమైన ఉల్లేఖము లేదు. 'బోధిసత్త్వభూమి'
నే గ్రంథముంది. అందులో 'దశబోధిసత్త్వభూమయః' అను పేరుతో దశవిధభూమికలు
ల్లేఖింపబడినవి. కాని, ఈ గ్రంథం హీనయానానికి చెందినది.

'మహావస్తువు' లోని 'దశవిధ భూమిక' లీ క్రింది విధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| ) | దురారోహా భూమిక | 6) | రూపవతీ భూమిక |
| ) | బద్ధమానా భూమిక | 7) | దుర్జయ భూమిక |
| ) | పుష్పమండితా భూమిక | 8) | జన్మనిదేశ భూమిక |
| ) | రుచిరా భూమిక | 9) | యౌవరాజ్య భూమిక |
| ) | చిత్తవిస్తారా భూమిక | 10) | అభిషేక భూమిక |

భిక్షుథెల్వటే రాహులా, 'మహావస్తువు' లోని ఈ భూమికల గురించి ఈ విధంగా
లిపారు. " Even the names of ten stages as given in the **Mahavastu** are
nostly different from the given in the **Dasa Bhumika** sutra which is generally
egarded as the standard work on the subject." " It is only when the idea of
ne **bhumis** was finally systematised that a perfection (**paramita**) was
ttached to each **bhumi**."[37]

కాని, మహావస్తువులో బోధిసత్త్వుని దశవిధ భూమికలకు దశవిధ పారమితులు
ప్పబడలేదు.

## హీనయాన భూమికలు

'శతసాహస్రికా' అనే గ్రంథంలో హీనయానములోని దశవిధ భూమికలు చెప్పబడినవి. కాని, ఇవి పాళీ గ్రంథాలలో కనబడవు.

1) శుక్లవిపశ్యనా లేక విదర్శనా భూమి
2) గోత్రభూమి
3) అష్టమక భూమి
4) దర్శన భూమి
5) తను భూమి
6) వీతరాగ భూమి
7) క్రియావీ భూమి
8) ప్రత్యేక బుద్ధభూమి
9) బోధిసత్త్వ భూమి
10) బుద్ధ భూమి

హీనయానులు, అర్హతపదవి నొందుటకు నాల్గు దశలను విధించారు. అవి 1) సోతాపత్తి 2) సకదాగామి 3) అనాగామి 4) అరహత్త. వీటికి నామాంతరాలు కూడా ఉన్నాయి. అవి 1) పుథుజ్జన లేక గోత్రభూ 2) అధిశీల 3) అధిచిత్త 4) అధిపన్నా.

హీనయానంలోని బోధిసత్త్వభూమి అనే గ్రంథంలో ద్వాదశ భూమికలు చెప్పబడినాయి.

1) గోత్ర విహారము
2) అధిముక్తిచర్యా విహారము
3) ప్రముదితా విహారము
4) అధిశీల విహారము
5) అధిచిత్త విహారము
6), 7), 8) అధిప్రజ్ఞా విహారము
9) సాభిసంస్కార, సాభోగ నిర్నిమిత్త విహారము
10) అనాభోగ, నిర్నిమిత్త విహారము
11) ప్రతిసంవిద్ విహారము
12) పరమ విహారము

ఈ ద్వాదశ విహార భూములలో మొదటి రెండు ప్రాథమిక సాధనకు చెందినవి తీసివేయగా మిగిలినవి దశవిధ విహార భూమికలు.

## మహాయాన, హీనయాన భూమికల తులనాత్మక పరిశీలన

| క్రమ సంఖ్య | మహాయాన భూమికలు | హీనయానభూమికలు |
|---|---|---|
| 1. | ప్రముదితా భూమిక | – |
| 2. | విమలా భూమిక | అధిశీల విహార భూమి |

| క్రమ సంఖ్య | మహాయాన భూమికలు | హినయానభూమికలు |
|---|---|---|
| 3. | ప్రభాకరీ భూమిక | అధిచిత్త విహార భూమి |
| 4. | అర్చిష్మతీ భూమిక | బోధిపక్ష్యప్రతి సంయుక్తాధి ప్రజ్ఞా విహార భూమి |
| 5. | సుదుర్జయా భూమిక | సత్యప్రతి సంయుక్తాధి ప్రజ్ఞావిహార భూమి |
| 6. | అభిముఖీ భూమిక | - |
| 7. | దూరంగమా భూమిక | సాభిసంస్కార - సాభోగ - నిర్నిమిత్త విహార భూమి |
| 8. | అచలా భూమిక | అనాభోగనిర్నిమిత్త విహార భూమి |
| 9. | సాధుమతీ భూమిక | ప్రతిసంవిద్ విహార భూమి |
| **10.** | **ధర్మమేఘా భూమిక** | **పరమ విహార భూమి** |

బోధిసత్త్వులు 'బోధి' అనెడి దశావిశేషమును చేరడానికి చేసే ప్రయత్నాన్నే 'చర్య' లేక 'చారికా' అంటారు. ఈ దశవిధ భూమికలలో ప్రజ్ఞాభివృద్ధి ననుసరించి పై దశ విధములను నాల్గు చర్యలుగా వింగడించారు.

1) ప్రకృతి చర్య - మొదటి భూమిలోని మొదటి సగం
2) ప్రణిధాన చర్య - మొదటి భూమిలోని రెండవ సగం
3) అనులోమ చర్య - రెండవ భూమి నుండి ఏడవ భూమి వరకు
4) అనివర్త చర్య - ఎనిమిదవ భూమి నుండి పదియవ భూమి వరకు

### బోధిసత్త్వుని దశవిధ భూమికలు - దశవిధ పారమితులు

| వరుస సంఖ్య | 'మహావస్తువు' లోని దశవిధ భూమికలు | 'దశభూమికాసూత్రము లోని దశవిధ భూమికలు | 'ధర్మసంగ్రహము' లోని దశవిధ పారమితులు |
|---|---|---|---|
| 1. | దురారోహ భూమిక | ప్రముదితా భూమిక | దాన పారమితా |
| 2. | బర్ధమానా భూమిక | విమలా భూమిక | శీల పారమితా |
| 3. | పుష్పమండితా భూమిక | ప్రభాకరీ భూమిక | క్షాంతి పారమితా |
| 4. | రుచిరా భూమిక | అర్చిష్మతీ భూమిక | వీర్యపారమితా |

| వరుస సంఖ్య | 'మహావస్తువు' లోని దశవిధ భూమికలు | 'దశభూమికాసూత్రము లోని దశవిధ భూమికలు | 'ధర్మసంగ్రహము' లోని దశవిధ పారమితులు |
|---|---|---|---|
| 5. | చిత్తవిస్తారా భూమిక | సుదుర్జయా భూమిక | ధ్యాన పారమితా |
| 6. | రూపవతీ భూమిక | అధిముక్తీ భూమిక | ప్రజ్ఞా పారమితా |
| 7. | దుర్జయా భూమిక | దూరంగమా భూమిక | ఉపాయకౌశల్య పారమితా |
| 8. | జన్మనిదేశ భూమిక | అచలా భూమిక | ప్రణిధి పారమితా |
| 9. | యౌవరాజ్య భూమిక | సాధుమతీ భూమిక | బలపారమితా |
| 10. | అభిషేక భూమిక | ధర్మమేఘా భూమిక | జ్ఞాన పారమితా |

గమనిక : హీనయానములోని, మహాయానములోని దశవిధ భూమికలలో గల అవాంతర స్థాయీ భేదనిరూపణ మిచ్చట చేయబడ లేదు. అట్టి సమగ్ర విశ్లేషణాత్మక పట్టిక కోసం నలినాక్షదత్ వ్రాసిన 'మహాయాన బౌద్ధము' అను ఆంగ్ల గ్రంథము చూడవచ్చును.

## బౌద్ధ దర్శనం లోని ధర్మ మేఘా భూమిక పాతంజల యోగదర్శనంలోని ధర్మమేఘ సమాధి కంటె ప్రాచీనమైనది కాదు

బౌద్ధదర్శనంలోని బోధిసత్త్వుని దశవిధ భూమికల్లో పదియవది ధర్మమేఘమనే భూమిక. మహాయాన బౌద్ధంలో దీనిని ' ధర్మమేఘ'మని చెప్పగా హీనయాన బౌద్ధంలో 'పరమవిహార' మని చెప్పబడింది.

బోధిసత్త్వుని యొక్క ఉత్కృష్ట భూమిక ధర్మ మేఘము. ఈ భూమికలో బోధిసత్త్వుడు జ్ఞానపారమితా దశకు చేరుకొంటాడు. అది బుద్ధ భూమి. ఈ బుద్ధ దశకు చేరుకొన్న తరుణంలో అతడు ఇతర బుద్ధుల చేత అభిషేకింపబడుతాడు. ధర్మకాయమనే అత్యున్నత స్థితికి చేరుకొన్న తర్వాత బోధిసత్త్వునికి వేరే ఇతర దశలు లేవు. అతడు తథాగతుడని పిలువబడుతాడు. లంకావతార సూత్రము ఈ దశమ భూమిని 'తథాగత భూమి' అని పిలిచింది.

ధర్మమేఘమనే సమాధి ప్రసక్తి పాతంజల యోగదర్శనం లోని కైవల్యపాదంలో చెప్పబడింది.[38]

**''ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతే :**
**ధర్మమేఘః సమాధిః ''** (పాదం - **4** సూత్రం - **29**)

ప్రసంఖ్యాన జ్ఞాన దశలో ఫలేచ్ఛారహితమైన జీవికి సమస్త విషయ వివేక ప్రసిద్ధి వల్ల ధర్మమేఘమనే సమాధి సిద్ధిస్తున్నది.

దీనికి వ్యాసదేవ భాష్యమిట్లున్నది -

''యధాయం బ్రాహ్మణః ప్రసంఖ్యానేఽప్యకుసీదస్తతోఽపి
న కించిత్ప్రార్థయతే తత్రాపి విరక్తస్య సర్వదా వివేకఖ్యాతి
రేవ భవతీతి సంస్కారబీజక్షయాన్నాస్య ప్రత్యయాంతరా
ణ్యుత్పాద్యంతే తదాఽస్య **ధర్మమేఘోనామ సమాధిర్భవతి।**

ప్రసంఖ్యాన జ్ఞాన దశలో ఫలాపేక్ష లేని బ్రహ్మజ్ఞానికి కించిత్తు కూడా కోరిక ఉండదు. ...మస్తమందు వివేక జ్ఞానం ఉంటుంది. సంస్కార బీజక్షయం వల్ల ఇతర విషయ జ్ఞానం ఉండదు. ...ప్పుడతనికి 'ధర్మమేఘ' మనే సమాధి స్థితి కలుగుతుంది.

'ప్రజ్ఞా శబ్దం పాతంజల యోగదర్శనంలో ఐదుసార్లు ప్రయోగింపబడింది. ఇందులో ...ముఖ్యంగా ''ఋతంభరా తత్ర ప్రజ్ఞా'' అన్న సూత్రం (1-48) లోని 'ఋతంభరా' వంటి ...బ్దం బౌద్ధదర్శనంలో ఎక్కడా తటస్థపడదు. మరి, ధర్మ మేఘమనే మాట వారికెక్కడిది? ...ది యోగ సూత్రాల నుండి ఎరవుగా గ్రహించిన పారిభాషిక శబ్దమేనని నా నిశ్చయం!

ఈ రెండు పరిభాషల విస్పష్ట వివరణ మనకు యోగసూత్రాల లోనే ప్రప్రథమంగా ...భిస్తున్నందు వలన మహాయాన బౌద్ధులు తమ దర్శనాన్ని పటిష్ఠం చేసుకొనడానికి 'ధర్మమేఘ' ...మాధిని ఉత్కృష్ట భూమికగా హిందూయోగ పరిభాష నుండి గ్రహించారని చెప్పడం నా ...ప్రధానోద్దేశ్యం!.

పతంజలి ఒక్కడేనని, కాదు యిద్దరని ముగ్గురనే వాదం ఉంది. ఆ వాదంతో మనకు ...ని లేదు. యోగ దర్శనం నుండి బౌద్ధులే పారిభాషిక పదాన్ని గ్రహించారు. దీనికి ఉపబలకంగా ...ప వాదాన్ని సమర్థిస్తూ -' An introduction to the Yoga Sutra' అనే గ్రంథంలో డా॥ ...రాంశంకర్ భట్టాచార్య గారు, పాతంజల యోగ సూత్రాలు మహాభారతకాలం తర్వాత, బుద్ధుని ...ననానికి పూర్వమే రచింపబడిందని ప్రతిపాదిస్తూ యిలా వ్రాశారు.

" Some are of the opinion that the **Samadhi** known as **Dharmamegha** Yogasutra 4-29) is Buddhistic (i.e. Buddha or the Buddhists invented this samadhi for the first time) as it is mentioned in the **Dasabhumika Sutra**. It s true that this sutra speaks of ten **bhumis** and places the **Dharmamegha Bhumi** on the last place. But there is no sign to hold that the yogic Dharma megha is identical with (or even internally similar to) the **Buddhistic Dharma megha**, the similarity of terms proves nothing.

While the Yogasutra says that the **Dharmamegha Samadhi** arises when one gets fully established in **Vivekakhyati** i.e., *sattvapurushanyata pratyaya* (discernment of the seperateness between **purusha** and **prakriti**) the Buddhist philosophy is silent on the **purusha** principle. This shows the illogicality of the view that the **Dharmamegha Samadhi** of Yogasutra is based on the **Dharmamegha bhumi** of the Buddhists. It is also to be noticed that Patanjali used the word **Dharmamegha** as **Samjna sabda** (other wise he could have framed the sutra as - సర్వధా వివేకఖ్యాతే ధర్మమేఘకృత్ సమాధిః (జాయతే) This being a **Samjna** the view of the modern scholars about borrowing from Buddhist Philosophy becomes groundless.[39]"

'' స జయతి పతంజలి ముని ర్యేన శ్రేయోఽర్థి సార్థ సస్యానామ్ ।
విహితో హర్షస్త్రాప త్రి త్రయహృతా **ధర్మమేఘన** ॥''[40]

## బౌద్ధ వాఙ్మయం - పేటక శబ్దార్థం

బౌద్ధుల పాలీ వాఙ్మయంలో 'పేటకోపదేశ' మనే గ్రంథమున్నది. దీని కర్త మహాకాత్యాయనుడు. ఇతడు బుద్ధుని ప్రముఖ శిష్యులలో ఒకడు. వ్యాకరణ వార్తికకారుడు వేఱు. ఇతడు వేఱు. పేటకోపదేశమంటే త్రిపిటకముల అధ్యయనానికి కుపయోగపడే సమాలోచన గ్రంథం. సాయణాచార్యుల వేద భాష్యభూమిక లెటువంటివో అదే విధముగా ఇవి త్రిపిటకాధ్యయనానికి పీఠిక.

పాలీ భాషలోని పేటకోపదేశమును పరిష్కరించిన డా॥ అరవింద బారువా గారు తమ ఆంగ్ల పీఠికలో యిలా వ్రాశారు. "An Introduction to the study of Pitaka and this he means **Sutta - Pitaka**. But **Pitaka** is not solely occupied with **Sutta - Pitaka** has the same meaning as **Pitaka**, hence "**upadesa**" may mean information about the **Pitakas** or it may mean if **petaka** can be recognised in the **Petaki** of the **Bharhut inscriptions**, instructions on one studying or versed in the **Pitakas**. A commentary could explain this but unfortunately none has been found."[41]

పిటకములలో నిష్ణాతుని 'పేటకి' అంటారు. బర్హుత్ శాసనంలోని ఈ మాటను ప్రామాణికంగా గ్రహిస్తే పేటకోపదేశ' రచనాకాలం క్రీ.పూ. 2వ శతాబ్దిగాని లేదా మొదటి శతాబ్ది గాని అవుతుంది.

# ఆంధ్రదేశంలో బౌద్ధమత వ్యాప్తి

''ఆంధ్రభూమిని తొలుత వ్యాపించినది జైనము.
దానిని త్రోసిరాజని వెలిగినది బౌద్ధము'' – భావరాజు వెంకటకృష్ణారావు[42]

ఆంధ్రదేశం జైనమతానికి అనంతపురం జిల్లా, కొనకొండ్ల వాస్తవ్యుడైన ొందకుందాచార్యుని ప్రసాదించినట్లే, బౌద్ధమతానికి గుంటూరు వాసవ్యుడైన గార్జునాచార్యులను ప్రసాదించింది. వీరిద్దరూ ఆయా మతస్థాపకులైన మహావీరుడు, బుద్ధుని ర్వాత అంతటి వారుగా యావద్భారత దేశంలోనే కాదు, ఖండ ఖండాంతరాలలో కీర్తి ప్రతిష్ఠలు పించారు. కుందకుందాచార్యులు జైన మతంలో 'స్యాద్వాదము' లేక అనేకాంత వాద ప్రవక్త గా, ఆచార్యనాగార్జునుడు బౌద్ధమతంలో మాధ్యమిక వాద ప్రవక్త. ఈ రెండు వాదాలను ురించి సంగ్రహంగా తెలుసుకొన్నాం.

ఇప్పుడు ఆంధ్రదేశంలో బౌద్ధమతం వ్యాపించిన తీరు తెన్నులను పరిశీలిద్దాం. ఉత్తర ారతదేశంలో పుట్టిన బౌద్ధమతం, దక్షిణ భారతదేశానికి వ్యాపించి ప్రజాదరణ పొందింది. ంధ్ర దేశంలో బౌద్ధమతం బహుముఖంగా విలసిల్లినట్లు త్రవ్వకాల్లో వెలుగుచూచిన అనేక ౌద్ధస్థావరాలు ఋజువు చేస్తున్నాయి. భారతదేశ ఉత్తర ప్రాంతం నుంచి ఆర్థిక, రాజకీయ ంగాల్లో అభివృద్ధి చెందిన కళింగ తీరానికి, అటు తర్వాత ఉత్తరాంధ్రకు క్రీస్తు పూర్వం 6–5 తాబ్దాల లోనే విస్తరించిందనటానికి పురావస్తు, చారిత్రక ఆధారాలు లభించాయి. ఉత్తరాంధ్రలో ొండలపైన నిర్మించిన విహారాలలో మొదట థేర వాదం, తరువాత మహాయాన, వజ్రయాన ాఖల అధ్వర్యవంలో ధమ్మప్రచారం జరిగింది.

ఆంధ్రదేశ బౌద్ధమత చరిత్ర తెలుసుకోవటానికి స్తూపాలు, చైత్యాలు, శిలామంటపాలు, శిలా, లోహ ప్రతిమలు, ఆయా ప్రదేశాల్లో దొరికిన శాసనాలు ఎంతగానో ఉపకరిస్తాయి. ాజులు, సామంతులు, గహపతులు, వ్యాపారస్తులు, ఉపాసక, ఉపాసికల పోషణలో ంఘారామాలు వృద్ధి చెంది మత ప్రాపకానికి దోహదం చేశాయనేది నిర్వివాదాంశం! ంధ్రదేశంలో బౌద్ధమతాన్ని గురించి ప్రస్తావించేటప్పుడు రెండు విషయాలను పరిగణనలోకి సుకోవాలి. బుద్ధుడు ఆంధ్రదేశంలో పర్యటించి ధమ్మాన్ని ప్రవచించాడా? అన్నది ఒక ప్రశ్నైతే, ుద్ధుని మహాపరినిర్వాణం తరువాత ఆయన అస్థికలు ఆంధ్రదేశానికి తీసుకొని రాబడినదా? నేది రెండవ ప్రశ్న. ఇందులో మొదటి ప్రశ్నకు చారిత్రకాధారాలు లేవు. ఇక, రెండో విషయం ురించి బౌద్ధ వాఙ్మయంలోను, విదేశీ యాత్రికుల రచనల్లోను పరోక్ష ప్రస్తావన గావించబడినది.

బౌద్ధ వాఙ్మయం ప్రకారం, బుద్ధుని మహాపరినిర్వాణం తరువాత ద్రోణుడనే బ్రాహ్మణుడు బుద్ధుని ధాతు అవశేషాలను పంచేటప్పుడు, తాను కూడా కొన్నింటిని గ్రహించి వాటిపై స్తూపనిర్మాణం చేశాడని చెప్పబడింది. (చూ॥ ఇదే గ్రంథం - పుటలు 185 ) అయితే స్తూపనిర్మాణం ఏ ప్రాంతంలో చేయబడిందో ఇతమిత్థంగా పేర్కొనబడలేదు. ఇటీవల విశాఖపట్టణం బావికొండ స్తూపంలో బయల్పడిన ధాతు అవశేషాలు వాటి కెదురుగా బుద్ధపాదాలను ప్రతిష్ఠించి ఉంచటం మొదలైన విషయాలను పరిశీలిస్తే, అవి తప్పకుండా తథాగతుని అవశేషాలేనని ఋజువౌతుంది. ఈ అవశేషాలు ద్రోణుడు గ్రహించినవి కావచ్చు.

అదే విధంగా బుద్ధుని దంతధాతువు బ్రహ్మదత్తునికి చేరగా, దానిని అతడు కళింగ రాజధానియైన దంతపురంలో నిక్షిప్తం చేసి స్తూపనిర్మాణం గావించాడని దళదవంశంలో పేర్కొనబడింది. ఇటీవల జరిపిన పురావస్తు పరిశోధనల్లో కళింగ దేశంలో ఆముదాల వలసకు దగ్గరగా నున్న దంతావక్త్రుని కోటగా ఈ దంతపురాన్ని గుర్తించటం జరిగింది. బుద్ధుని మహాపరినిర్వాణం తర్వాత (క్రీ.పూ. 486) వెంటనే ధాతు అవశేషాలు ఆంధ్రదేశానికి చేరి, బౌద్ధ మతం వేళ్లూను కొనటానికి దోహదం చేశాయని "ఆంధ్రదేశంలో బుద్ధధాతు పేటికలు" అనే గ్రంథంలో డా॥ బండారు సుబ్రహ్మణ్యం గారు వ్రాస్తున్నారు. (1997)[44]

ఆంధ్రదేశంలో బౌద్ధమత అవశేషాలుపై 1927 లోనే తొలిసారిగా కృషి జరిపిన వారు డా॥ కె.ఆర్. సుబ్రమణియన్ గారు.[45] వీరు Buddhist Remains in South India and Early Andhra History 225 AD to 610 AD అనే గ్రంథంలో యిలా వ్రాశారు. " Andhradesa was saturated with Buddhism till long after the last **Satavahana** (225 A.D.) and the beginnings of Andhra culture are coeval with the beginnings of Buddhism in the land. As Hiuen - Tsang testifies, the religion of the Buddha was not an insignificant factor to be ignored even after the close of 610 A.D."

"No connected account of the Buddhist remains of Andhradesa has hither to been written and threfore Part I of my book will be found supplying a gap in her history. A clear study of the location, character, and value of the monuments and the deductions concerning ancient life and manners from the marbles of **Amaravati** may be found to possess an original character and special value. The data about **Nagarjuna**, his life, works and age scattered in many works have been brought together and he is given a setting in **Nagarjuna Konda** which is identified with Fahian's Polo Yu and Hiuen - Tsang's *Polo molo kili.*

"Part II of the book deals with the history of the various dynasties of Kings that ruled over Andhradesa between 225 and 610 A.D. The available materials for the study of this epoch are meagre and it is difficult to correlate them ... ally and Chronologically." (Preface - XIII)

ప్రాచీనాంధ్రదేశాన్ని మొట్టమొదట పాలించిన స్వతంత్ర రాజవంశీయులు **శాతవాహనులు**. వీరి రాజ్యం క్రీ.శ. 225లో నశింపగా ఆంధ్రదేశం రెండు, మూడు రాజ వంశాలచే పరిపాలించబడింది. వీరిలో నెల్లూరు, గుంటూరు, కడప జిల్లాలను పరిపాలించిన వారు **పల్లవులు** (225 - 610). వీరు పశ్చిమ దిశలో గల కదంబుల తోను, దక్షిణ దిశలోగల చోళుల తోను పోరాడవలసివచ్చింది. క్రీ.శ. 225 తర్వాత కృష్ణాజిల్లాను కొంత కాలం పరిపాలించిన రాజులు **బృహత్ఫలాయనులు**. వీరి మడమలు త్రొక్కుకుంటూ **ఇక్ష్వాకులు** ఆంధ్రదేశంలో చాల భాగం హస్తగతం చేసికొన్నారు. వీరి వెంటనే **కదంబులు**, **వాకాటకులు** తూర్పున హైదరాబాద్ వరకు తమ రాజ్య సరిహద్దుల్ని ఏర్పరచుకున్నారు.

క్రీ.శ. 4వ శతాబ్ది మధ్యభాగంలో సముద్రగుప్తుని దండయాత్ర ఆంధ్రదేశాన్ని విశేషించి కళింగ రాజ్యాన్ని ధ్వంసం చేసి దక్షత గల పాలకుడు లేకుండా చేసింది. క్రీ.శ. 3వ శతాబ్దంలో కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఇక్ష్వాకులు రాజ్యపాలనను త్రోసిరాజని **సాలంకాయనులు** క్రీ.శ. 450 వరకు పాలించారు. వీరి తర్వాత వాకాటకుల సామంతులైన **విష్ణుకుండినులు** కృష్ణా నదికి దక్షిణ దిశలోని కొంత భాగాన్ని కొంతకాలం పాలించారు. ఈ వాకాటక, విష్ణుకుండినుల రాజ్యపాలన గోదావరీ నదిని దాటి కళింగ రాజులను కైవశం చేసికొని విజయనగరం వరకు వ్యాపించింది. ఈ పరిస్థితుల్లో కళింగ దేశానికి చెందిన **గాంగులు** విష్ణుకుండినుల ఉరవడికి అడ్డు పడి గోదావరికి ఉత్తర దిశలో వారికి ప్రక్కన బల్లెమై నిలిచారు. క్రీ.శ. 7వ శతాబ్ది ప్రారంభంలో కర్ణాట దేశంలో **చాళుక్యులు** తలెత్తినారు. చాళుక్యుల శౌర్యప్రతాపాలు దక్కన్ భూభాగం పైప్రసరించి చాలా ప్రాచీన రాజవంశాలను నామరూపం లేకుండా నశింపజేశాయి. చాళుక్య వంశంలోని ఒక శాఖ ఆంధ్రదేశంలో స్థిరపడి క్రీ.శ. 7వ శతాబ్ది తొలిపాదం నుండి నాల్గు శతాబ్దాలు (11వ శతాబ్దం వరకు) నిరాఘాటంగా పరిపాలించి చివరికి **చోళుల రాజ వంశంలో** కలిసిపోయింది. ఈ చాళుక్య వంశంలో క్రీ.శ. 1022 జూలై 19వ తేది రాజమహేంద్రవరంలో పట్టాభిషక్తుడైన వాడే రాజ రాజ నరేంద్రుడు. ఈతని కాలం నుండి వైదిక మతోద్ధరణ జరగడం ప్రారంభించింది. ఇది ప్రాచీననాంధ్ర దేశసంక్షిప్త చరిత్ర.

1927 నాటికి డా॥ కె.ఆర్. సుబ్రమణియన్ గారు ఆంధ్రదేశంలో గుర్తించిన బౌద్ధ అవశేషాలీవిధంగా ఉన్నాయి.

1. సాలిహుండం (కళింగపట్నం నుండి 6 మైళ్ల దూరంలో గంజాం జిల్లా)
2. చిన్నగంజాం (గుంటూరు జిల్లా)
3. గూటి (అనంతపురం జిల్లా)
4. భట్టిప్రోలు (గుంటూరు జిల్లా)
5. రామతీర్థం (విజయనగరానికి 8 మైళ్ల దూరంలో)
6. సంఘారామం (అనకాపల్లి దగ్గర)
7. కొడవలి (పిఠాపురం నుండి 9మైళ్లు)
8. అరుగొలను (తాడేపల్లి గూడెం తాలుకా, పశ్చిమ గోదావరి జిల్లా)
9. గుంటపల్లె (కామవరపు కోట నుండి 6 మైళ్లు పశ్చిమ గోదావరి జిల్లా)
10. జగ్గయ్య పేట (నందిగామ తాలుక, కృష్ణాజిల్లా)
11. రామిరెడ్డి పల్లె (గుమ్మిడి దుఱ్ఱు) (మధిర నుండి 6 మైళ్లు)
12. అల్లూరు (ఎఱ్ఱుపాలెం నుండి 5 మైళ్లు)
13. బెజవాడ (కృష్ణా జిల్లా)
14. గుడివాడ (కృష్ణా జిల్లా)
15. ఘంటశాల (మచిలీపట్నం నుండి 13 మైళ్లు)
16. నాగార్జున కొండ (పుల్లారెడ్డి గూడెం నుండి ఒక మైలు మాచెర్ల నుండి 15 మైళ్లు కృష్ణానదీ తీరం)
17. చేజెర్ల (నరసరావు పేట తాలుకా, గుంటూరు జిల్లా)
18. గరికపాడు (వినుకొండ తాలుకా, గుంటూరు జిల్లా)
19. గోలి ( రెంట చింతల నుండి మూడు మైళ్లు గురజాల తాలుకా, గుంటూరు జిల్లా)
20. అమరావతి (గుంటూరు నుండి 18 మైళ్లు)
21. పెద్దమద్దూరు (అమరావతి నుండి 4 మైళ్లు)
22. పెద్దగంజాం (చిన్న గంజాం దగ్గర, గుంటూరు జిల్లా)
23. కనుపర్తి (పెద్దగంజాం నుండ ఆరుమైళ్లు)

ఈ విధంగా దాదాపు ఇరవైమూడు బౌద్ధుల స్థావరాలను గుర్తించిన డా॥ సుబ్రమణియన్ గారు " There are still unexcavated mounds awaiting the magic touch of the archaeologist which on being, opened in due course may add to the historical materials" (పుట - 12) అని వ్రాశారు.

"బౌద్ధ క్షేత్రాలు ఎక్కువగా తీరాంధ్రదేశంలోను, తెలంగాణా పీఠభూమిలోను, ఉండగా రాయలసీమలో కేవలం కడపజిల్లా లోని నందలూరు, పుష్పగిరి లోను, అనంతపురం జిల్లాలోని పాసన కోట అనే చోట్ల మాత్రమే గుర్తించటం జరిగింది. రాయలసీమ ప్రాంతమంతా కొండలతో నిండి ఉండటం, నదులు ఎక్కువగా లేక పోవటం, అన్ని రకాలుగా అభివృద్ధి పథంలో ఉన్న పొరుగు ప్రాంతాలతో సరైన సంబంధ బాంధవ్యాలు లేనందు వల్ల, ఆంధ్రదేశ పశ్చిమ దిశవైపు సరిహద్దులకు ఆవలివైపున జైనమత ప్రభావం కలిసి వుండడం వల్లను, బహుశ బౌద్ధ క్షేత్రాలు విస్తరించ లేదని చెప్పవచ్చు'' అంటున్నారు బండారు సుబ్రహ్మణ్యం గారు. వీరు 1997లో 'ఆంధ్రదేశంలో బౌద్ధధాతు పేటికలు' అనే గ్రంథం ప్రచురించే నాటికి అదనంగా మరో 29 స్థలాలలో ఆంధ్రదేశంలో బౌద్ధ స్థలాలు గుర్తించటం జరిగింది. వాటి పేర్లివి. 1) సరిపల్లి 2) కళింగపట్నం 3) మంగమారిపేట 4) కొల్లూరు 5) లింగరాజుపాళెం 6) ఆదుఱ్ఱు 7) అశ్వరావు పేట 8) నేలకొండపల్లి 9) తిరుమలగిరి 10) ధూళికట్ట 11) పుష్పగిరి 12) కొండాపూర్ 13) గాజులబండ 14) ఫణిగిరి 15) ఏలేశ్వరం 16) మంచికల్లు 17) రెంటాల 18) చందవరం 19) దూపాడు 20) ఉప్పుగుండూరు 21) నందలూరు 22) బుద్ధాం 23) వడ్డమాను కోట 24) వడ్డమాను 25) కోటిలింగాల 26) గోపాలపట్నం 27) పావురాళ్ల కొండ 28) ధారాపాలెం 29) దంతపురం.

ఇలా మొత్తం యిప్పటికి 52 స్థలాలలో ఆంధ్రదేశంలో బౌద్ధమత అవశేషాలున్నట్లు పురాతతత్త్వ వేత్తలు గుర్తించారు.

## హిందూ దేవాలయం - బౌద్ధుల చైత్యం, స్తూపం, చారిత్రక, తాత్త్వికనేపథ్యాలు

వేదపూర్వ కాలంలోని సింధులోయ నాగరికత ( Indus Valley Civilisation) క్రీ.పూ. 3000-2000 మధ్యకాలంలో విలసిల్లింది. సింధులోయలోని ప్రజల మత విశ్వాసాలకు గుర్తుగా మూడు అవశేషాలు లభిస్తున్నాయి.

1. మాతృదేవత ( The Mother Goddess)
2. పురుషలింగారాధన ( The Phallus worship)
3. పద్మాసన స్థితుడైన యోగి ( The Yoga posture of a male God)

మాతృదేవతారాధన ఆ తర్వాతి కాలంలో ఏర్పడిన శక్త్యారాధన రెండూ ఒకటే కాకపోవచ్చు. కాని, ఈ రెండూ ఒకటే మూలభావన స్రోతస్విని నుండి పుట్టినదని చెప్పవచ్చు. ఈ సర్వసృష్టికి ప్రతీకగా స్త్రీ శక్తిని ఆరాధించడం దీని మూలభావం కావచ్చు.

శివుణ్ణి లింగాకృతిగా ఆరాధించడం హిందూమతంలో కాలక్రమేణ ఏర్పడిన పరిణామం. కాని, వేదాలలో పురుషలింగారాధన ఖండింపబడింది. ఇది వేదమతం కంటె ప్రాచీనమైన ఆరాధన అనడానికిదే సాక్ష్యం. చిత్తూరు జిల్లా, శ్రీకాళహస్తి తాలుకా, గుడిమల్లం అనే గ్రామంలో పురుషలింగంపై అటు యిటు కాళ్లు బారచాచి నిలబడిన ఒక ఆటవికుని వంటి పురుషుని విగ్రహం ఆరాధింపబడుతూ వుంది. ఈ విధంగా పురుషాకృతితో కూడిన లింగారాధన అపురూపమైంది. అతిప్రాచీనమైంది. ఇది క్రీ.పూ. 2వ శతాబ్దికి చెందిన విగ్రహమని డా॥ ఆనందకుమారస్వామి నిర్ణయించారు. " I endorse Mr. T. Gopinatha Rao's view that it should be dated in the 1st or 2nd century B.C. The fact is that the **lingam** rises directly from the earth without any definite representation of **Yoni** is an additional evidence for the early date."[46]

డా॥ ఇంగువ కార్తికేయశర్మ గారు కూడ తమ సిద్ధాంత గ్రంథంలో, "Gudimallam Linga as the earliest known Hindu sculpture and one of the most perfect pieces of its class and of a great value in connection with the history and nature of the Linga Worship."[47] అని వ్రాశారు.

పద్మాసనస్థితుడైన యోగమూర్తిని శివునిగా పరిశోధకులు గుర్తించారు. ఇది 'పశుపతి బొమ్మ యని ఆచార్య బుద్ధప్రకాశ్ గారు Rgveda and the Indus Valley Civilisationn (Hoshiarpur, 1966) అనే గ్రంథంలో స్పష్టీకరించారు. ఆ బొమ్మ 'పశుపతి' యైన శివుని దైనా, కాకపోయినా, యోగాసనంలో కూర్చొని యుండటం వలన, దీనిని బట్టి ఏదో యొక రూపంలో యోగానుష్ఠానం క్రీ.పూ. మూడువేల సంవత్సరాల క్రితమే భారతదేశంలో వుండినట్లు నిశ్చయింపవచ్చు.

భారతదేశ మతచరిత్ర యొక్క ప్రాచీనత్వం సింధూలోయలోని త్రవ్వకాల వలన బయటపడిన శిథిలావశేషాల చేత క్రీ.పూ. రెండువేల సంవత్సరాల కంటె యింకా వెనక్కు నెట్టబడింది. మొహంజొదారో లో ''మరణించినవారి మట్టి దిబ్బలు (mounds of the dead) గా పేరుపడిన ఈ ప్రదేశంలో ఒకప్పుడు మహోన్నత నాగరికత వర్ధిల్లింది. ఇది సింధూనదీ ప్రధాన పరీవాహక ప్రాంత భూమికి, సింధూరాష్ట్రంలోని లర్ఖణా జిల్లాలో గల పశ్చిమదిశవైపున 'నారా' పంటకాలువలకు మధ్యగల సన్నని భూభాగం. ఇక్కడ విలసిల్లిన పట్టణం

ఏదు వేల సంవత్సరాల క్రితం కట్టబడింది. ఏడుమార్లు విదేశీ దండయాత్రల వల్ల నాశనమైనా వెన్వెంటనే పునర్నిర్మింపబడిన పట్టణమిది. భారత దేశంలో యిప్పటికిని మిగిలివున్న కొన్ని కొండజాతుల వారి ఆచార్యవ్యవహారాలను పరిశీలిస్తే క్రీ.పూ. మూడువేల యేండ్ల నాటిదిగా గుర్తింపవచ్చు. శివశక్తుల్ని ఒకటిగా కలిపి ఆరాధించే లక్షణం ఈనాడు వ్యాప్తిలో వున్నప్పటికీ, ఆ భావ వికాసానికీ, శివునీ, శక్తినీ విడివిడిగా ఆరాధించే లక్షణానికీ, ఈ రెంటికీ కూడ ప్రాథమిక ప్రాచీన రూపాలు (ancient primitive forms) మొహంజొదారో నాగరికతలో తటస్థపడుతాయి.

క్రీ.పూ. మూడు వేల సంవత్సరాల క్రితమే సృష్టింపబడిన అతిరాత్ర అగ్నిచయనానికి, పురాతత్త్వ వేతల త్రవ్వకాలలో తటస్థపడిన క్రీ. పూ. 600 నాటి శీలవర్మూడు నిర్వహించిన అగ్నిచయనానికి చెందిన శాసనాలను రెండింటిని గురించి ఇదే గ్రంథంలో పుటలు 48-49 చూడవచ్చు.

## కఠోపనిషత్కాలంలో అగ్నిచయనం

ఉపనిషత్తులు అష్టోత్తర శతంగా గుర్తింపబడినాయి. ఈ నూటయెనిమిది ఉపనిషత్తుల్లో

| | | |
|---|---|---|
| ఋగ్వేద సంబంధమైనవి | - | 10 |
| శుక్లయజుర్వేదీయములు | - | 19 |
| కృష్ణయజుర్వేదీయములు | - | 32 |
| సామవేద సంబంధమైనవి | - | 16 |
| అధర్వణీయములు | - | 31 |
| | - | 108 |

ఈ సంఖ్యా విభాగం ముక్తికోపనిషత్తులో చెప్పబడింది. బృహదారణ్యక, కేన, ప్రశ్న, ఛాందోగ్యాది దశోపనిషత్తులలో కఠోపనిషత్తు మూడవది. కృష్ణయజుర్వేదీయ చరకశాఖాంతర్గతమైన కఠశాఖాబ్రాహ్మణానికి చెందింది కావడం చేత దీనికి కాఠకోపనిషత్తు, కఠోపనిషత్తు అనే పేర్లు కలిగాయి. కఠోపనిషత్తులో రెండు అధ్యాయాలున్నాయి. ప్రతి అధ్యాయంలో మూడు విభాగాలున్నాయి. ఒక్కొక్క విభాగానికి 'వల్లి' అని పేరు. ఇలా రెండు అధ్యాయాలలో ఆరువల్లులున్నాయి. మొదటి అధ్యాయంలో (29+25+17) = 71 మంత్రాలు, రెండవ అధ్యాయంలో (15+15+18) = 48 మంత్రాలున్నాయి. ఈ 119 మంత్రాలతో కూడిన కఠోపనిషత్తులో పితృభక్తి, కర్మజిజ్ఞాస, బ్రహ్మజిజ్ఞాస గల నచికేతుని చరిత్ర వివరింపబడింది.

తండ్రియైన వాజశ్రవసుని మాటను పాటించి నచికేతుడు యమలోకానికి వెళ్లాడు. యముని రాక కోసం నిరీక్షిస్తూ మూడు రోజులు నిరాహారంగా ఉండిపోయాడు. నాల్గవ రోజు యముడు వచ్చి నొచ్చుకొని మూడు వరాలు కోరుకోమన్నాడు.

స్వర్గే లోకే న భయం కించ నాస్తి । న తత్ర త్వం నజరయా బిభేతి ।
ఉభే తీర్త్వా శనాయా పిపాసే । శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

స త్వమగ్నిగ్ం స్వర్గమధ్యేషిమృత్యో ప్రబ్రూహితగ్ం శ్రద్ధధానాయ మహ్యమ్ ।
స్వర్గలోకా అమృతత్వాం భజంత । ఏతద్ద్వితీయేన వృణే వరేణ ॥

ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్ ।
అనంత లోకాప్తి మథో ప్రతిష్ఠాం విద్ధి త్వమే తన్ని హితం గుహాయామ్ ॥

లోకాదిమగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథావా ।
స చాపి తత్ప్రత్యవదద్యథోక్త మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః ॥

తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య దదామి భూయః।
తవైవ నామ్నా భవితాయమగ్నిః సృంకాం చ మామనేకరూపాం గృహాణ ॥

త్రిణాచికేత స్త్రిభిరేత్య సంధిం త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ ।
బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా నిచాయ్యేమాగ్ం శాంతిమత్యంతమేతి ॥

త్రిణాచికేతస్త్రయమేత ద్విదిత్వా యఏవం విద్వాగ్ం శ్చినుతే నాచికేతమ్ ।
స మృత్యుపాశాన్పురతః ప్రణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

ఏష తే ఉగ్నిర్నచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ ।
ఏతమగ్నిం తవైవప్రవక్ష్యంతి జనాసస్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥
(I - 1 - 12 - 19)

ఏ అగ్నిచయనాన్ని చేసిన వారు జరామరణ రహితులై దేవత్వాన్ని పొందుతూవున్నారో, అలాంటి అగ్నిచయనాన్ని తనకు ఉపదేశింపుమని రెండవ వరాన్ని కోరుకొన్నాడు. అప్పుడు యముడు అగ్నిచయనాన్ని గూర్చిన విజ్ఞానాన్ని, ఇటుకలను ఏయే సంఖ్యలో పేర్చాలో మొదలైన విధానాన్నంతా నచికేతునికి చెప్పాడు. గ్రహణధారణపటువైన నచికేతుడది విన్న వెంటనే మరల యమునికి ఒప్పచెప్పాడు. అతని ఏకాసంథా గ్రహణానికి యముడు సంతోషించి ఈ అగ్నిచయనం నీ పేరనే వెలయగలదని, నీవీ సృంకను అంటే రత్నమాలను లేదా అనేక ఫలహేతు భూతమైన విజ్ఞానాన్ని గ్రహింపుమని పలికాడు.

కఠ నాచికేతాగ్ని చయనాన్ని మూడు పర్యాయాలు చేసిన వారు లేదా బాగుగా నాచికేతాగ్నిచయన జ్ఞానం తెలిసికొని ఆ మంత్రాధ్యయనాన్ని చేసిన వారు, రాగద్వేషాదిపాశాలను త్రెంచుకొని, స్వర్గలోకంలో ఆనందాన్ని పొందుతారు. అని నాచికేతాగ్ని చయన ఫలితాన్ని కూడ తెలిపి మూడవ వరాన్ని కూడ కోరుకోమని యముడు పలికాడు.

మనుష్యుడు మరణించిన తర్వాత ఆత్మ అనేది దేహేంద్రియాలకు భిన్నంగా ఉన్నదని కొందరు, లేదని కొందరు అంటున్నారు. కాబట్టి, ఆత్మకు సంబంధించిన జ్ఞానాన్ని ఉపదేశింపుడని మూడవ వరాన్ని కోరాడు నచికేతుడు. యముడెన్ని ప్రలోభాలు పెట్టిన అతడు లొంగలేదు. చివరకు, విధిలేక బ్రహ్మజ్ఞానాన్ని బోధించాడు.

## చితి - చెతికి - చెతియ - చైత్య

బౌద్ధ వాఙ్మయంలో చైత్యం - చైత్యప్రాసాదం - స్తూపం - వంటి మాటలు విరివిగా కన్పడుతాయి. వైదిక 'యజ్ఞచితి' యే ప్రాథమిక రూపంకాగా అది కాలక్రమేణ బౌద్ధమతంలోని చెతికి - చెతియ - చైత్యంగా చివరికి 'స్తూపంగా' పరిణామాన్ని పొందిందని చెప్పవచ్చు.

'చితి' శబ్దానికి కుప్పగా (piling up) పేర్చటం అని అర్థం. వైదిక యజ్ఞం చితి యొక్క నిర్మాణం లేదా కట్టడం 'స్వయమాతృణ్ణా' అని పిలువబడే ఇటుకలను ఒక విధమైన ఆకారంలో పైపైన పేర్చడం వలన ఏర్పడుతూవుంది. అగ్నిచయనంలో 'చితి'ని అనేక ఆకారాలతో నిర్మిస్తారు. 1) సుపర్ణచితి 2) శ్యేనచితి 3) ద్రోణచితి 4) రథచక్ర చితి 5) ధాన్యరాశి చితి వంటివి కొన్ని.

పురాతతత్త్వ శాస్త్రజ్ఞుల త్రవ్వకాలలో బయలుపడిన బౌద్ధుల చైత్యాలను అంటే బౌద్ధ ధాతుపేటికలను నిక్షిప్తపరచిన చైత్యనిర్మాణాలను పరిశీలిస్తే అవి ప్రముఖంగామూడు ఆకారాలతో నిర్మింపబడినట్లు తెలుస్తోంది.

1. వృత్తాకార చైత్యం, 2. రథ చక్రాకార చైత్యం, 3. గజపృష్ఠాకార చైత్యం.

బౌద్ధుల వృత్తాకార చైత్యం - వైదికమైన రథచక్ర చితి యొక్క స్ఫూర్తితో నిర్మింపబడిందనే చెప్పాలి. బుద్ధుని ధర్మచక్రప్రవర్తనానికి కూడా ఇదే స్ఫూర్తి కావచ్చు. ఇదే తర్వాతి కాలంలో అశోకుని ధర్మచక్రం. వృత్తాకార చైత్యానికి 'బావికొండ' లో బయల్పడిన చైత్యం, చక్రాకార స్తూపానికి నాగార్జున కొండ'లో బయల్పడిన స్తూపం, గజపృష్ఠాకార చైత్యానికి బావికొండ లోని బయటపడ్డ మరో చైత్యం ఉదాహరణాలుగా చెప్పవచ్చు. అసలు చైత్య, స్తూపాల యొక్క ప్రధాన నిర్మాణం - పై కట్టడం యొక్క ఆకారాన్ని అర్ధసమ వృత్తం ( half semi - circle) గా

నిర్మించాలని ఎలా భావించారని ప్రశ్నించవచ్చు. బుద్ధుని నిర్వాణానంతరం అర్హతులు జలంపై తేలే 'నీటిబుడగ' ఆకారాన్ని చూచి, అది అర్ధసమ వృత్తంలో పైకి ఉబ్బెత్తుగా ఉండటం వలన ఆ విధంగా చైత్యం యొక్క పై భాగం నిర్మింపబడాలని సమూనా తయారుచేసినట్లు చెబుతారు. కాని, యిది భూమి అట్టడుగున రథ చక్ర చితిని, పైభాగంలో ధాన్యరాశి చితిని మేళవించి, ఉపరిభాగాన్ని సరిదిద్ది మూడు ఊర్ధ్వరేఖలుగా నిర్మించడం కనబడుతుంది.

ఇక్కడ గమనించ వలసిన ముఖ్యాంశమేమంటే వైదిక యజ్ఞచితిలో 'గజపృష్ఠాకార' చితి రూపం లేదు. దీనిని బౌద్ధులు చైత్యనిర్మాణానికి ఏ స్ఫూర్తితో గ్రహించారో పరిశీలించగా భారతీయ దేవాలయ నిర్మాణాలలో ద్రావిడ, నాగర, వేసర అనే మూడు పద్ధతున్నాయి. అందులో ద్రావిడ పద్ధతికి చెందిన గజపృష్ఠాకార రథాలు మహాబలిపురంలోని సహదేవరథం, గణేశరథం, భీమరథం, ఐహోళెలోని దుర్గా దేవాలయం, చేజెర్ల లోని కపోతేశ్వరాలయం, భువనేశ్వరం (ఒరిస్సా) లోని వైతాళ దేవాలయం గా చెప్పవచ్చు[48]. వీటి ప్రభావంతో గజపృష్ఠాకార చైత్యాలు బౌద్ధమతంలో వెలిశాయా? అనే ప్రశ్నకు సమాధానంగా Indian Architecture (Hindu and Buddhist) అనే గ్రంథంలో Percy Brown యిలా అభిప్రాయపడుతున్నారు.

" Architecturally these rathas at **Mahabalipuram** can be put under two categories the **Caitya type** and and the **Vihara type**. The Vihara type of rathas are square in plan and are surmounted by a pyramidal tower. **They show the transformation from a Buddhist hostel to a Hindu Shrine**. In shape and appearance these **Vihara rathas** seem to have been evolved out of a building composed of cells arranged around a square courtyard, the inner court afterwards covered in with a flat root on pillars."

" The **Caitya type** of rathas are longitudinal and barrel - vaulted i.e., they have a roof of the so-called elephant - back type **(gajaprsthakara).** The Durga temple at Aihole, the Kapoteswara temple at Chezarla, and Vaital devul at Bhuvaneswar (Orissa) are some other Brahmimical temples, belonging to the Caitya type. The three -storyed **Sahadeva ratha** is a temple with a porch having the **Caitya type** of roof. Whereas **Dharmaraja ratha** evidently the distinctive elements of a typical Dravida Vimana are present in this **Vihara type** rathas."[49]

ఈ అంశాన్ని యింకా పరిశీలించవలసివుంది. కాళిదాసు (క్రీ.పూ. 56) వ్రాసిన మేఘ సందేశంలోని పూర్వమేఘంలో 24వ శ్లోకం యిలా వుంది.

పాండుచ్ఛాయో పవనవృతయః కేతకై స్సూచి భిన్నైః
రీడారంభైర్గృహ బలి భుజా మాకుల గ్రామ చైత్యాః ।
త్వయ్యాసన్నే పరిణత ఫల శ్యామ జంబూ వనాన్తాః
సంపత్స్యంతే కతిపయ దిన స్థాయి హంసాదశార్ణాః ॥

ఈ శ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ మల్లినాథ సూరి –

**'చిత్యాయా ఇమాని చైత్యాని'**

అని 'చైత్య' శబ్దానికి వ్యుత్పత్తిని చెబుతూ –

**''చైత్య మాయతనే బుద్ధబింబే చోద్దేశ పాదపే''**

అని రుద్ర నిఘంటువును ఉట్టంకించారు.[50]

చైత్యమంటే 1) ఆయతనము 2) బుద్ధబింబము 3) ఉద్దేశపాదపము. 'ఆయతన' మనే మాట వాల్మీకి రామాయణంలో వస్తుంది.

దేవతాయతనాన్యాశు సర్వాస్తాః ప్రత్యపూజయన్ (బాల : 76-11)
దేవాయతన (అయోధ్య 6-11) (ఉత్తర 91-14)

బుద్ధుని స్మారక బింబాన్ని అంటే బుద్ధ విగ్రహాన్ని ఉంచే స్థలం – చైత్యం. ఉద్దేశపాదపమంటే పల్లెటూళ్లలో రచ్చబండ దగ్గర గల చెట్టు, రచ్చపట్టు వద్ద గల వృక్షం – దీనినే 'గ్రామచైత్య' మన్నాడు కాళిదాసు. పదిమంది ఒక చోట చేరడమనేదిక్కడ ముఖ్యాంశం. చైత్యం, దేవతాయతనాలలో జరిగేదిదే కదా! దీనిచేత కాళిదాసు కాలంలోను, ఆయనకంటే పూర్వుడైన వాల్మీకి కాలంలోను చైత్యము, దేవాలయము రెండూ సమానార్థకాలుగా వాడబడుతుండేవని తెలుస్తున్నది. అంతే కాదు, రావణుని ''శ్మశాన చైత్య ప్రతిమో'' (సుందర 5-22-29) అనే మాట యజ్ఞం ఊరికి బయట నివేశన స్థలాలలో చేసేవారని ఆ 'చితి' గల విలక్షణత్వం చెప్పబడింది. అలాగే చైత్య ప్రాసాదమ్' (సుందర 5-50-30) అనే మాట ఉద్యానవనాలలో విహార స్థలాలలో గల ఎత్తయిన స్మారక భవనాలని (Memorial Building) చెప్పవచ్చు. చైత్యం లేదా స్తూపం అర్ధసమవృత్తాకారంగా ఉండడంలో ఒక తాత్త్విక సత్యం సమన్వయమౌతూవుంది.



భూమిపై అర్ధసమవృత్తంగా నిర్మింపబడిన కట్టడం 'నీటి బుడగ' వలె కాలగర్భంలో కలిసిపోయినా భూగర్భంలో అదే ఆకృతితో అంటే అర్ధసమవృత్తంగా లేక వృత్తాకారంగా లేక రథచక్రాకారంగా నిర్మాణం ఉండడమే కాక, రాతితో మలచిన బుద్ధధాతు పేటికలు ( Buddhist relic Caskets) స్తూపాకృతిని పోలి వుండడంలో, నాగార్జునాచార్యుడు చెప్పిన తాత్త్వికసత్యం దృగ్గోచరమౌతున్నది. 'సంవృతి సత్యం' భూమిపైగల కట్టడం కాగా, ''పరమార్థసత్యం'' భూగర్భంలోని 'ధాతునిక్షిప్తపేటిక' వంటిదనే సత్యాన్ని ఈ చైత్యనిర్మాణం స్ఫురింపజేస్తున్నదా! అనిపిస్తున్నది. భూగర్భంలోని ధాతుపేటిక, రాతికరండకమ్మైనా, వెండిభరిణియ్యైనా దాని స్వరూపం మాత్రం చైత్యం యొక్క అర్ధసమవృత్తాన్నే విధిగా పాటింపబడియుండడం. బుద్ధధాతు పేటికకు, చైత్యానికి గల అవినాభావసంబంధాన్ని, సమైక్యత్వభావనను ప్రస్ఫుటంచేస్తున్నాయి. ఆంధ్రదేశంలో గోలి, అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటశాల, నాగార్జునకొండలోని స్తూపాలు విలక్షణమైనవి. అమరావతీ స్తూపం, సాంచీలోని స్తూపాన్ని పోలివుండడం దాని ప్రాచీనత్వానికి ప్రతీక!.

మౌర్యవంశం తర్వాతి కాలంలోని స్తూప శాసనాలను పరిశీలిస్తే అందులో, **''చెతికి యానం నికాయస మహాచెతియ''** అనే వాక్యం కనబడుతుంది. అంటే **''చైత్యక నికాయం యొక్క మహాచైత్య''**మని అర్థం. మహాసాంఘికుల్లో చైత్యకవాదులొకరు. ఈ బౌద్ధసంఘాన్ని దాక్షిణాత్య బౌద్ధులు చైత్యవాదసంఘమని, ఉత్తరాది బౌద్ధులు చైత్యశైల సంఘమని వ్యవహరించేవారు. అశోకునిచే పంపబడి, ఆంధ్రదేశానికి వచ్చిన మహాదేవ భిక్షువు స్థాపించిన ''చైత్యకపంథ''కు ఇది ప్రధాన పీఠం కావడం చేత అటుతర్వాతి కాలపు శాసనాల్లో అమరావతి మహాచైత్యమని పేర్కొనబడడం చేత, ఇది అశోకుని అదరణతో వెలసిందని చెప్పవచ్చునని మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అభిప్రాయం.

శతపథ బ్రాహ్మణంలో ఐదుకాండలు అగ్నిచయనాన్ని వివరిస్తున్నాయి. కఠోపనిషత్తు (I-1-12 నుండి 19 మంత్రాలు) అగ్నిచయనాన్ని ప్రస్తావిస్తున్నది. ఆశ్వలాయనగృహ్యసూత్రం (1-12-1-4) లో తొట్టతొలిసారిగా 'చైత్యం' ప్రస్తావింపబడింది.వాల్మీకి రామాయణంలో శ్మశాన చైత్యమ్, చైత్యప్రాసాదమ్ (5-22-29) (5-50-30) అనే మాటలు కనబడుతున్నాయి. దీనితో పాటు దేవాయతనం, దేవతాయతనం అనే మాటలు లభ్యమౌతున్నాయి. క్రీ.పూ. 600కు పూర్వమే డెహ్రాడూన్ జిల్లాలోని జగత్ గ్రామ్‌లో శీలవర్మడనే రాజు నిర్వహించిన నాలుగు అశ్వమేధ యాగాల సువర్ణచితి లభించిందని పురాతత్త్వవేత్తలు ఇటుకలపై లిఖింపబడిన శాసన పాఠాలను ప్రచురించారు. కాబట్టి అగ్నిచయనానికి పురాతత్త్వాధారం (Archaeological evidence) లభించింది. ఈ పై కారణాల దృష్ట్యా చైత్య, దేవతాయతన నిర్మాణాలు వైదికులైన హిందువులకు సుపరిచితమైన వ్యవహారమేనని ఆ నిర్మాణాల స్వరూపాలు కొన్నిటిని అనుకరిస్తూ, రథచక్రాన్ని,

ధర్మచక్రంగా సంభావిస్తూ (కాలచక్రమనేది ప్రాచీనవైదిక భావన) బౌద్ధులు, బుద్ధుని మహాపరినిర్వాణమైన తర్వాత (క్రీ.పూ. 487) ఆయన అస్థికల్ని ఎనిమిది భాగాలుగా చేసి, ద్రోణుడనే బ్రాహ్మణుడు తన వంతుకు వచ్చిన దానిని ఆంధ్రదేశం లోని విశాఖపట్టణం, బావికొండ దగ్గర స్తూపనిర్మాణం చేశాడని పురాతత్త్వవేత్తలు భావిస్తున్నారు. దీని చేత స్తూపనిర్మాణం వైదిక యజ్ఞ చితి ఆకారంల్లో ఒకదాన్ని పోలుతూ నిర్మింపజేసి దాని మధ్య భాగంలో ధాతువులుంచిన పేటికను నిక్షిప్తంచేసి, దానిపై అర్ధవర్తులాకారపు (Half-semi Circle) మట్టిదిబ్బలు ఏర్పాటు చేసి దాన్ని ఆరాధిస్తూ వచ్చారు. 'చితి' కి సంబంధించిన సమాధి దిబ్బలు కావడంచేత ఈ స్తూపాలకు చైత్యాలనే పేరు ఏర్పడింది.

## చైత్యం యొక్క విస్తృతరూపమే స్తూపం

స్తూపం చైత్యానికి విస్తృత రూపం (an elaborated or extended form) దీనిలో ప్రతీకాత్మకమైన పొదిగింపులు, పొసగింపులు ఉంటాయి. అశోకుని కాలంలో బుద్ధుని అస్థికల్ని వేదికమీద అండంలో పెట్టడానికి బదులుగా దాని ముందుభాగంలో చతురస్రమైన మందిరాన్ని నిర్మించి దానిలో ధాతుపేటికనుంచి ఆ మందిరం చుట్టూ చిన్న శిలాప్రాకారం కట్టేవారు. ధాతుపేటికను ఉంచే ఈ మందిరానికి **హర్మిక** అని పేరు. హర్మికపైన రాజలాంఛనంగా శిలామయ ఛత్రాన్ని వెలయించడం బౌద్ధుల ఆచారం. **వేదిక** (drum) దాని పైన **అండం** (dome) దానిపైన హర్మిక, దానిపైన **ఛత్రం** (Umbrella) ఈ యన్నిటితో కూడిన దానికే స్తూపమని పేరు. స్తూపం చుట్టూ శిలామయ **ప్రాకారం** (railing) నిర్మించేవారు. ఈ ప్రాకారం మన యిప్పటి యిటుక గోడలవలె పూర్తిగా లోపలి స్థలం వెలుపలికి కానరాకుండ కమ్మివేసి వుండదు. ఈ ప్రాకారం నిలువు రాతి స్తంభాలతోను (Pillars) వీటిలోనికి బిగించిన అడ్డురాతి కమ్ముల (Cross - bars) తోను, నిలువురాతి స్తంభాల మీద చదరవలె ఏర్పడేటట్లు పరచిన రాతి బండలతోను కూడుకొని వుంటుంది.

ప్రాకృత భాషలో నిలువురాతి స్తంభానికి 'థబో' అని, అడ్డుకమ్మికి 'సూచి' అని, చదురురాతిబండకు ఉన్నీస (ఉష్ణీష - సంస్కృతం)మని పేర్లు. అశోకచక్రవర్తి కాలం నాటి యిలాంటి స్తూపాలు పిప్రావ, సారనాథ్, సాంచీలలో బయటపడ్డాయి.

## స్తూపం - థూపో - దాగబ (దాగోబ) - పెగోడా

స్తూపమనే సంస్కృత పదానికి తెలుగులో **'దిబ్బ'** అని, పాలీభాషలో **'థూపో'** అనే పదాలు సమానార్థకాలు. బుద్ధుని అవశేషాలపై శారీరక స్తూపాలు మొదట ఎనిమిది వెలిశాయి.

వీటికే **ధాతుచైత్యాలని** పేరు. ధాతువులనబడే ఈ అవశేషాలుండే భాగానికి **'ధాతుగర్భమని'** పేరు. **'ధాతుగర్భ'** పదానికి అపభ్రంశము లేదా భ్రష్టరూపం (Corrupted form) **'దాగబ'** లేక **'దాగోబా'**. ధాతుగర్భం మీది దిబ్బకు చైత్యమని పేరునప్పటికి కాలక్రమంలో ఈ రెండు భాగాలు కలసిన సంపూర్ణనిర్మాణానికే 'స్తూప' మనే పేరు రూఢి అయింది.

స్తూపానికి సింహళ భాషలో **దాగబ (దాగోబా)** అని, నేపాళ దేశంలో **'చైత్యము'** లని బర్మాదేశంలో **'పెగోడా'** అని వ్యవహరిస్తారు. సంపూర్ణనిర్మాణం కలిగిన ధాన్యకటక చైత్యానికే, అమరావతీ స్తూపమని పేరు, విఖ్యాత మైంది. భారతీయ శిల్పకళా విన్యాసంలో 'అమరావతీ రీతి విశిష్టమైంది.

విలక్షణమైన విషయమేమంటే, చితియొక్క వివిధాకారాలను గూర్చి చెబుతూ, శ్రౌతగ్రంథాలు, అవి రథచక్రాకారంతోను, సమూహ్యా లేక ధాన్యరాశి ఆకారంతోను నిర్మింపబడుతాయని చెప్పాయి. నిశితంగా పరిశీలిస్తే స్తూప నిర్మాణ విషయంలో కూడా రథచక్రాకారపు పునాదిపైన, లేదా ధాన్యరాశి ఆకారాన్ని అర్ధవర్తులాకారంగా మార్చి కట్టబడి యుండడం మనకాశ్చర్యాన్ని కల్గిస్తుంది.

'వివిధ సంప్రదాయాల సమన్వయం – భిన్నత్వంలో ఏకత్వం' అనే చతుర్థాధ్యాయంలో సమన్వయప్రాతిపదిక మీద అనేక విశేష విషయాలు మరిన్ని తెలుసుకుందాం!.

## పాదసూచికలు


1. మాండూక్యోపనిషత్తు – ఆంగ్లవాఖ్య – స్వామిచిన్మయానంద, తెలుగు అనువాదం – శ్రీమతి వరలక్ష్మమ్మ, విజయవాడ, 1961, పుటలు 448–449

2. C.S. Srinivasachari and M.S. Ramaswamy Aiyangar, A History of India Part - I (Hindu India), S. Varadachari & Co., Madras, 1952, pp. 51-53.

3. ధమ్మపదం – పాళీ, సంస్కృతచ్ఛాయా ఆంధ్రానువాద సహితము, డా॥ రత్నాకరం బాలరాజు, అధ్యాత్మ విద్యాగ్రంథమాల, సాకేతనిలయం, అనంతపురం, 1994, పుటలు 133–134.

4. Haribhadrasuri's Shad - darsana - Samuccaya, Edited with English translation and critical notes by M. Sivakumaraswami, Prasaranga, Bangalore University, 1977, pages 239 - 240.

5. బుద్ధదర్శనము ( The Vision of Buddha and His Dhamma) డా॥ రత్నాకరం బాలరాజు, అనంతపురం, 1995.

6. పై గ్రంథమే, పుట - 260.

7. బౌద్ధయుగము, (రెండవసంపుటం), రత్నాకరంబాలరాజు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి, 1960, పుటలు 557-563.

8. Indian Philosophy, Vol. I, Dr. Sarvepalli Radha Krishnan, George Allen & Unwin Ltd., London, 1929, pp. 624-643.

9. The conception of Buddhist Nirvana with Sanskrit text of Madhyamika Karika, Theo. STCHERBATSKY, Bharatiya Vidya Prakashan Varanisi, 1975

10. Lankavatara Sutra, A Mahayana Text, Translated for the first time from original Sanskrit, Daisetz Teitaro Suzuki, George Routledge and Sons Ltd., London 1932.

11. Indian Philosophy Vol. I, Dr. Sarvepalli Radhakrishnan, pp. 643-669.

12. Mahavamsa (Parts I & II), Translated from the Original Pali into English for the Government of Ceylon, L.C. Wijesinha Mudaliyar, Colombo, 1909.

13. నన్నయకు పూర్వం ఆంధ్రభాష - వేటూరిప్రభాకర శాస్త్రి, ప్రభాకరస్మారిక, Vol. II మణిమంజరి ప్రచురణలు, వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్, హైదరాబాద్, 1989, పుటలు 722 - 723.

14. సౌందరనందము, ఆర్యభదంత అశ్వఘోషుని సంస్కృత కావ్యానికి తెలుగువచనం, ధూళిపాళ శ్రీరామమూర్తి, విజయవాడ, 1951, చూ॥ అనుబంధము పుటలు 1-3 మరియు 12-16.

15. The Buddha Carita of Asvaghosha, edited from three Mss, E.B. Cowell, Anecdota Oxoniensia, The Clarendon Press, Oxford, 1893, Page - 37.

16. Asvaghosa and His Times, Sarla Khosla, Intellectual Publishing House, New Delhi, 1986, Pages 10-28.

17. ఎ) మహాకవి అశ్వఘోషుని వజ్రసూచి - వర్ణవ్యవస్థ పై ధ్వజమెత్తిన తొలి సామాజికదర్శన గ్రంథం - సంస్కృతమూలం నుండి తెలుగు అనువాదం - డా॥ మలయశ్రీ, సంపాదకుడు : టి. రవిచంద్ (మార్క్సిస్ట్ - అంబేత్కరైట్), మిళింద్ర ప్రచురణలు, గుంటూరు 1998.

బి) వజ్రసూచి - వివిధ పత్రికల్లో వెలువడిన అభిప్రాయాల సంకలనం - సంపా: డా॥ మలయశ్రీ, మిళింద్ర ప్రచురణలు, గుంటూరు 1999.

18. One Hundred and Eight Upanishads Ed. Vasudev Lakshman Sastri Pansikar, Nirnaya Sagar Press, Bombay, 1932, pp. 222 - 223.

19. భగవద్గీత జ్ఞాన విజ్ఞానయోగము, 7-3.

20. బుద్ధఘోషోత్పత్తి - వేటూరి ప్రభాకర శాస్త్రి, ప్రభాకరస్మారిక, Vol. II, మణిమంజరీ ప్రచురణలు, హైదరాబాద్, 1989, పుటలు 675 - 676

21. బౌద్ధయుగము (రెండవ సంపుటం) -రత్నాకర బాలరాజు, రాజమండ్రి, 1960, పుటలు, 569-569

22. a) Suniti Kumar Chatterji, Calcutta, -- Prof. Raghu Vira - A Vast sweep of Vision
b) N. Suji (Tokyo),-- Prof. Raghu Vira - The Vedisant
c) Nicholas Poppe (Seattle, USA), -- Prof. Raghu Vira and Mangolian Studies

See : A Profile and Bibliography of the works of Prof. Dr. Raghu Vira, Ed., Prof. Lokesh Chandra. Pub : An International Academy of Indian Culture, J-22, Hauzkhas Enclave, New Delhi - 110 016. Founded by Prof. Dr. Raghu Vira and now maintained by Prof. Lokesh Chandra.

23. Dr. Lokesh Chandra, Formely Member of Parliament
J - 22, Hauz Khas Enclave, New Delhi - 110 016.

24. Buddhist Text Information, The Institute for Advanced Studies of World Religions, Melville Memorial Library, State University of New York at Stony Brook, Stony Brook, New York - 11794, U.S.A.

25. 1) బౌద్ధధర్మానికి, సంస్కృతికి అంకితమైన ధర్మ సంస్థ, ఆనందబుద్ధ విహార ట్రస్ట్, సాయినగర్, తుకారాంగేట్, నార్త్‌లాలాగూడా, సికింద్రాబాద్ - 500 017.

2) తిరుపతి లోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థకు 1941 ఏప్రిల్ 28వ తేదీన "త్రిపిటకములు" చైనీయుల భాషలో వ్రాయబడినవి బహూకరింపబడినవి. ఈ ముద్రణకు షాంఘైముద్రణ(SHANGHAI Edition) అంటారు. బెంగాలు రాష్ట్రంలోని 'విశ్వభారతి', చీనాభవనానికి డైరెక్టర్‌గా వుండిన ప్రొఫెసర్ TAN YUN SHAN సిఫార్సు మేరకు ఈ ముద్రణ చైనా రాజధాని నుండి వచ్చినది. చైనా రిపబ్లిక్‌కు అప్పటి అధ్యక్షులైన CHAING KAI SHEK మరియు విద్యాశాఖామంత్రియైన CHEN LI FU ఈ విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకొన్నారు.

త్రిపిటకాల షాంఘై ముద్రణలోని పుస్తకాల సంఖ్య 1916. మొత్తం చిన్న చిన్న పుస్తకాలు కలిపి 8416. ఇవి చైనీయభాష లోనికి సంస్కృతం నుండి అనువదింపబడిన గ్రంథాలు. వీటికి సంస్కృత మూలగ్రంథాలిప్పుడు లభించడం లేదు. దీనికే హోర్యూన్ ముద్రణ

(HARDOON Edition) అని కూడ పేరు. ఈ ముద్రణకు ధనసహాయం చేసిన వారు చైనాదేశంలోని Hardoon Estate కు అధికారిణియైన Madam LIZA HARDOON అని అనే మహిళ. చైనీయ బౌద్ధ సూత్రాలు (Chinese Buddhist Cannon) చైనా, కొరియా, జపాన్ దేశాలలో ముద్రితమైనప్పటికీ ఈ ప్రస్తుత ముద్రణలో పూర్వ ముద్రణల్లోని లోపాలను సవరించడమే కాక, జారిపోయిన సూత్రాలు కూడ చేర్చబడివున్నాయి.

చైనీయుల భాషలోని ఈ త్రిపిటకాలు మొత్తం **40** కట్టలు (bundles) గా ఒక్కొక్క భాగం **8** నుండి **15** చిన్న పుస్తకాలుగా కర్పూరపుటట్టల మధ్య కట్టి భద్రపరచబడియున్నవి. - Presentations to the Library of S.V.O.I., Tirupati - N. Aiyaswami Sastri. Annals of Sri Venkateswara Oriental Institute, Vol. II Pt. I, 1941 pp. 173-176.

**3**) వారణాసి వాస్తవ్యులైన భిక్షు జె. కాశ్యప్ గారు సాధారణ సంపాదకులుగా( General Editor) నలందా దేవనాగరీ పాళీ గ్రంథమాలా **1960** లో ప్రారంభింపబడింది. బీహారు రాష్ట్రప్రభుత్వపు ఆధ్వర్యవంలో పాళీ పబ్లికేషన్ బోర్డు వారు పై గ్రంథమాలా ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ గ్రంథమాలలో త్రిపిటకములలోని సుత్త పిటకం - **20** సంపుటాలు, వినయపిటకం **4** సంపుటాలు, అభిధమ్మ పిటకం **13** సంపుటాలు వెలువడ్డాయి. ఈ సంపుటాలకు సాధారణ పీఠిక (General Preface) వ్రాసిన వారు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు.

**4**) వారణాశిలోని సంస్కృత విశ్వవిద్యాలయంలోని పరిశోధన సంస్థకు డైరెక్టరుగా ఉండిన డా॥ భగరథప్రసాద్ త్రిపాఠీ సాధారణ సంపాదకులు (General Editor) గా, పాళీ గ్రంథమాలా **1970**లో ప్రారంభింపబడింది. ఈ గ్రంథమాలలో బుద్ధ ఘోషుని విశుద్ధిమగ్గము దానిపై భదంతాచార్య ధమ్మపాలుని పరమార్థ మంజరీటీకా సహితంగా డా॥ రేవతధమ్మ పరిష్కరించి ముద్రించారు. ఈ వరుసలోనే అభిధమ్మత్థసంగ్రహ వంటి గ్రంథాలు కూడా వెలువడ్డాయి.

**5**) లండన్‌లోని పాలీటెక్స్ట్ సొసైటీ వారు పాలీభాషలోని త్రిపిటకాలను రోమన్ లిపిలో transliterate చేసి సంపుటాలుగా ప్రచురించారు. వీరు త్రిపిటకాలనే గాక, బౌద్ధుల యితర గ్రంథాలను, నిఘంటువులను కూడ ప్రచురించారు.

**6**) దర్భాంగాలో డా॥ పి.ఎల్. వైద్యాగారు బౌద్ధ సంస్కృత గ్రంథావళీ అనే శీర్షికతో సంస్కృతంలో వ్రాయబడిన బౌద్ధగ్రంథాలను పరిష్కరించి ప్రచురించారు.

**7**) ప్రస్తుతం తెలుగులో త్రిపిటకానువాదం చేస్తున్న వారు డా॥ రత్నాకరం బాలరాజు గారు. వీరు అనంతపురం వాస్తవ్యులు. వీరిదివరకే బౌద్ధయుగం (**2** సంపుటాలు) **1960** బౌదదర్శనము (**1995**), ధమ్మపదం (**1994**) తెలుగులో పండిత పామరజనామోదంగా వ్యాఖ్యానించి ప్రచురించివున్నారు.

26. a) ఆచార్య నాగార్జున సుహృల్లేఖ – అనువాదం– గజ్జెలమల్లారెడ్డి, పీఠిక – ఆనందబుద్ధవిహార ట్రస్ట్, సికిందరాబాద్, 1997, పుటలు – 8-9

b) Nagarjuna - Prof. K. Satchidananda Murthy, National Book Trust, New Delhi 1971.

c) Religion in Andhra --Survey of Religious developments in Andhra from Early times upto A.D. 1325 - Dr. B.S.L. Hanumantha Rao, Guntur, 1973.

27. a) అమరావతీ స్తూపము – ఇతర వ్యాసములు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, మద్రాసు 1932, పుటలు 18-22

b) గండవ్యూహ సూత్రము – (సంపా) పి.ఎల్. వైద్యా, బౌద్ధసంస్కృత గ్రంథావళీ, సంఖ్య – 5, దర్భాంగా, 1960

28. a) మధ్యమకావతారము – చంద్రకీర్త్యాచార్యుడు, సంస్కృతీకరణ – పండిత ఎన్. అయ్యాస్వామి శాస్త్రి.

b) మరియు చూ॥ నాగార్జునుని గూర్చి – వేటూరి ప్రభాకర శాస్త్రి, భారతి, తారణ, పుష్యమాసం. ప్రభాకరస్మారిక Vol. II, 1989, pp. 621 - 623.

29. సుఖావతీవ్యూహము - Description of Sukhavati, The Land of Bliss, Buddhist Texts from Japan, Ed., F. Max Muller, Bunyin Nanjio.

Anecdota Oxoniensia, Texts, Documents and Extracts Chiefly from MSS. in the Bodlein and other Oxford Libraries, Clarendon Press, Oxford, 1883.

Also see : Larger and Smaller Sukhavati Vyuhas, Sacred Books of the East, ed., F. Max Muller, Motilal Banarasidass, Delhi.

30. వజ్రచ్ఛేదికా ప్రజ్ఞాపారమితా సూత్రము Commentary by Asanga, ed., L.M. Joshi, Central Institute of Higher Tibetan Studies, Saranath, Varanasi, 1978.

31. ఎ) ఖుద్దకనికాయము – 1 భాగం, పుట – 367 (గాథా సంఖ్య 1013 - 1014)

బి) సద్ధర్మపుండరీకమ్ – The Lotus of the wonderful Law or The Lotus Gospel, Eng. TV. W.W. Soothell, Claredon Press, Oxford, 1930.

32. అర్యాష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితాపిండార్థము –ed., P.L. Vaidya బౌద్ధసంస్కృత గ్రంథావళీ సంఖ్య – 4, దర్భాంగా, పుట – 263, కారిక – 1, Journal of Royal Asiatic Society, 1942.

33. నవశ్లోకీ, ed., Guissepe Tucci, Minor Buddhist Texts, Vol-I, P-216

34. ధర్మసంగ్రహము – ఆచార్యనాగార్జునుడు ed., P.L. Vaidya బౌద్ధసంస్కృత గ్రంథావళీ సంఖ్య – 17, దర్భాంగా, 1961.

35. దశభూమికా సూత్రము – ed., P.L. Vaidya బౌద్ధసంస్కృత గ్రంథావళీ సంఖ్య – 7, దర్భాంగా 1967.

36. i) A Critical study of the Mahavastu - Bhikku Telwatte Rahula, Motilal Banarasidass, Delhi, 1978, pp. 62-69.
ii) Mahayana Buddhism - Nalinaksha Dutt, Motilal, Delhi, 1978.

37. A critical study of the Mahavastu, Page No.69

38. పాతంజల యోగదర్శనమ్ – వాచస్పతిమిశ్ర విరచిత తత్త్వవైశారదీ వ్యాఖ్య, విజ్ఞానభిక్షుకృత యోగవార్తికమ్, మరియు వ్యాసభాష్యసమేతమ్. సంపాదకుడు : నారాయణ మిశ్ర, ప్రచురణ : భారతీయ విద్యాప్రకాశన్, వారణాశి, 1971.

39. a) Yoga System of Patanjali or the Ancient Hindu Doctrine of Concentration of Mind, Eng. Tr. & Introduction : J.H. Woods, Harward Oriental Series Vol. 17, Delhi, 1917/1977.
b) An Introduction to the Yogasutra - Ram Shankar Bhattacharya Bharatiya Vidya Prakashan, Delhi, 1978, pp. 123-124.

40. పాతంజల యోగసూత్రానికి వ్యాసభాష్యంపై శంకరుని వివరణటీక లోని శ్లోకమిది. ఈ సందర్భంలో 'ధర్మమేఘు' మనే పదబంధాన్ని గురించి ప్రస్తుత గ్రంథకర్త యొక్క కొన్ని పరిశీలనలు పాఠకులు చిత్తగించగలరు.

ఎ) డా॥ వి.వి.యల్. నరసింహారావు గారు వ్రాసిన 'ధర్మమేఘు' మనే వ్యాసంలో మణిమంజరి, 1982, పుటలు 60–65) 'బౌద్ధుల ధర్మమేఘా భూమిక' ప్రస్తావించబడలేదు.

బి) బౌద్ధుల 'ధర్మమేఘు' మనే భూమికనే, హైందవుల పాతంజల యోగ సూత్రం ఎరువు (borrow) గా తెచ్చుకొన్నదని కలకత్తాలోని రామకృష్ణమిషన్ వారు ముద్రించిన Cultural Heritage of India Vol. III (Religions) పుట – 74లో వ్రాయబడింది. కాని, ఈ ఊహ సరైనది కాదు.

సి) బౌద్ధదర్శనం నుండి హైందవులు కొన్ని భావనలు (concepts) గ్రహించియున్నారనడం వాస్తవమే. ఉదాహరణకు, అలంకార శాస్త్రంలో అష్టరసాలే ఉండగా నవమరసమైన శాంతరసానికి, దానికి స్థాయి భావమైన 'తృష్ణాక్షయసుఖము' బౌద్ధమత ప్రభావంతో ఏర్పడినదే. (విశేషవిషయాలకు చూ॥ వాల్మీకి – విశ్వనాథ – రామకథాను శీలనము –

డా॥ ముదివేడు ప్రభాకరరావు, 1993, పుటలు 100–134 ) అంతమాత్రం చేత హైందవుల శాస్త్ర గ్రంథాలలోని భావనలు, పరిభాషలన్నీ బౌద్ధుల నుండి ఎరవు (borrow) తెచ్చుకొన్నవి కావు. ఆదాన ప్రదానాలు (mutual borrowings) రెండు వైపులా సమానంగా జరిగాయి. 'ధర్మ' మనే శబ్దంలో, 'మేఘ' మనే శబ్దాన్ని జోడించి అది ఒక 'భూమికా' పరంగా ప్రయోగించిన సందర్భం బౌద్ధుల 'దశభూమికా సూత్రం' లో తప్ప బౌద్ధదర్శన గ్రంథాలలో మరెక్కడా కనబడదు. తచ్ఛాయలు గల శబ్దాలు ఒకటి రెండు లేక పోలేదు. కాని, అవి వ్యక్తుల పేర్లుగా, బిరుదవాచకంగా, గ్రంథనామధేయంగా మాత్రమే కనబడుతున్నాయి.

i) సిరిమేఘవణ్ణ (శ్రీమేఘవర్ణ) : ఇతడు శ్రీలంకను క్రీ.శ. 362 – 409 మధ్యకాలంలో పరిపాలించిన రాజు - Dictionary of Pali Proper Names - G. Malalasekera, 1937 - 38, Vol. II p - 1144.

ii) ధమ్మిక సిలామేఘ (ధార్మిక శిలా / శీల మేఘ) ఇది మూడవ మహిందుడనే రాజు యొక్క బిరుదు See : చూలవంశ , ed., Geiger, 2 Vols, Pali Text Society No. 39, Ref : - Malalasekera, Vol.I Page - 1156.

iii) ద్వాదశ సహస్రమహామేఘమ్ : క్రీ.శ. 6వ శతాబ్దికి చెందిన చంద్రకీర్త్యాచార్యుడు, మధ్యమకావతారమనే గ్రంథంలోని ఆరవ ప్రకరణంలోపై పేరు గల గ్రంథాన్ని పేర్కొన్నాడు..

ఈ విధంగా అరకొరవగా వాడిన పదాలు తప్ప 'ధర్మమేఘ' మన్న పరిభాష బౌద్ధుల దర్శన గ్రంథాలలో వ్యస్తంగా యోగసమాధిపరంగా (దశభూమికా సూత్రంలో తప్ప) మరెక్కడా ప్రయోగింపబడలేదు. ఇది హైందవుల యోగ శాస్త్ర పరిభాషల నుండి బౌద్ధులు ఎరవుగా (borrowed term) తెచ్చుకొన్న పదమని స్పష్టమౌతున్నది.

41. Petakopadesa - ed., Aravinda Barua, Pali Text Society, London, 1949.

42. భావరాజు వెంకటకృష్ణారావు, ఆంధ్రదేశమున జైనమత వ్యాప్తి, భారతి, జూన్ 1943, పుటలు 558–574.

43. మొట్టమొదట బుద్ధుని 'దంతధాతువు' నిక్షిప్తపరచడం చేత ఆ ప్రాంతానికి (కళింగ రాజధానియైన దంత పురానికి) ఆ పేరు సార్థకమై ఉంటుంది. కాని, బౌద్ధమతం ఆంధ్రదేశంలో క్షీణదశకు వచ్చినప్పుడు హైందవుల పురాణాల ప్రభావంతో, దంతపురమే దంతావక్త్రునికోటగా మార్పు చెందివుంటుంది. ఎట్లంటే, అష్టాదశపురాణాలలో మహాభాగవత పురాణమొకటి. విష్ణుభకులై వైకుంఠ ద్వారపాలకులైన జయ విజయులు సనకసనందనాదుల శాపం చేత కృతయుగంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా,

త్రేతయుగంలో రావణకుంభకర్ణులుగా, ద్వాపరయుగంలో శిశుపాల, దంతవక్త్రులుగా జన్మించారని పురాణాలు చెబుతున్నాయి. ఈ దంతవక్త్రుడు శ్రీ కృష్ణునికి శత్రువు. ఒక విధమైన నాస్తికుడు. వీడు శ్రీకృష్ణునితో పోరాడి మరణించాడు. అంధక (ఆంధ్ర) వంశీయుడు కంసుడూ, అంధక దేశీయుడు చాణూరుడూ వీరిద్దరూ కృష్ణుని చేత హతులయ్యారు. అంధకం ఆంధ్రదేశంగా గుర్తింపబడింది. కళింగదేశంలో దంతపురం రాజధానిగా పరిపాలించిన బ్రహ్మదత్తునే దంతవక్త్రునిగా భావించి బౌద్ధమతం క్షీణించిన తర్వాత, దంతపురాన్నే దంతవక్త్రుని కోటగా చేసి పురాణకాలం నాటి స్థలంగా గుర్తించినారా? అనిపిస్తున్నది. ఇదే నిజమైతే శ్రీకృష్ణుడు మరొక నాస్తికుడైన, విశేషించి ఆంధ్రదేశీయుడైన రాజు దంతవక్త్రుని యుద్ధంలో సంహరించినాడని చెప్పవలసి వుంటుంది. ఔతరాహుడై ద్వారకాధీశుడైన శ్రీకృష్ణునికి, దాక్షిణాత్యుడై దంతపురాధీశుడైన దంతవక్త్రునికి యుద్ధం ఎలా సంభవించిందో పురాణకథలోని కార్యకారణకల్పన కాకుండా, చారిత్రక దృష్ట్యా నిరూపించడానికి వీలవుతుందేమో చారిత్రకులు పరిశోధించాలి.

44. బండారు సుబ్రహ్మణ్యం, ఆంధ్రదేశంలో బుద్ధధాతుపేటికలు, ఆనందబుద్ధవిహారట్రస్ట్, సికింద్రాబాద్, 1997.

45. Buddhist Remains in South India and Early Andhra History 223 AD to 610 AD. - K.R. Subramanian, Cosmo Publications, New Delhi 1981 (First Ed., 1927) Preface pages xiii - xiv.

46. Ananda Coomaraswamy, Gudimallam Lingam, Indian Historical Quarterly, Vol III, 1931, Page - 750.

47. Inguva Kartikeya Sarma, The Development of early Saiva Art and Architecture with special reference to Andhra Desa, Delhi, 1982, Page - 37.

48. Manorama Jauhari, South India and its Architecture, Bharatiya Vidya Prakashan,Varanasi, 1969, Pages 81-89.

49. Percy Brown, Indian Architecture ( Buddhist and Hindu period), D.B. Taraporevala Sons & Co., Pvt. Ltd., Bombay 7 th Ed., 1976.

50. శ్రీ శంకర భగవత్పాదుల సౌందర్యలహరి లోని ఒక శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ, 'చితి' అంటే ''చిత్పదలక్ష్యార్థాః'' అని లోల్లలక్ష్మీధరులు వ్రాశారు. చూ॥ సౌందర్యల హరి – చదలువాడ జయరామ శాస్త్రి, నెల్లూరు, 1960.

# చతుర్థాధ్యాయం

## వివిధ సంప్రదాయాల సమన్వయం - భిన్నత్వంలో ఏకత్వం

### భాగవత పాంచరాత్రము - వ్యూహములు

వైదికమైన యాజ్ఞికమతాన్నీ, అటు తర్వాత వచ్చిన ఉపనిషన్మతములోని ఉపాధి, ఉపాసనలను త్రోసి రాజని పుట్టిన మతములు మూడు. 1) జైనము, 2) బౌద్ధము, 3) భాగవత మతములు.

ఉపనిషత్తులు వైదికమైన యజ్ఞాన్ని అంతరయజ్ఞంగా నిరూపించి నిదిధ్యాసనమే మోక్షమార్గమని చెప్పినది. ఈ ఉపనిషత్ సిద్ధాంతమైన అవ్యక్తపరబ్రహ్మ ( Impersonal Absolute Brahman) నూ, భక్తిమార్గమైన ఇష్టదైవాన్నీ ( Devotional personal God) మేళవించి ప్రారంభింపబడిన భావధార క్రమంగా జైన, బౌద్ధ, భాగవతమతములకు దారితీసినది. ఈ మతాలు మూడు క్రీ.పూ. 6వ శతాబ్దినాటికే ఉపనిషన్మతం పై తమ తిరుగుబాటును వ్యక్తం చేశాయి.

జైనమునకు కుండలినీ యోగమునకు గల దగ్గరి సంబంధము చూచినాము. (చూ॥ ఇదే గ్రంథం పుటలు 60-61) బౌద్ధ దర్శనము పాతంజల యోగ దర్శనము నుండి 'ధర్మమేఘసమాధి'ని ఒక 'ఉత్కృష్ట భూమిక' గా గ్రహించినప్పటికీ వారి దర్శనానికి స్వతస్సిద్ధమైన పరిభాషాపదములు రెండు మాత్రమే. 1) భూమిక, 2) వ్యూహము. హీనయాన, మహాయానములలో 'భూమికా' ప్రాధాన్యాన్ని గూర్చి విపులంగా చర్చించాము.(చూ॥ ఇదే గ్రంథం పుటలు 241-246 ) ఇక మిగిలింది వ్యూహము.

లిచ్ఛవులు జైనమతానికీ, శాక్యులు బౌద్ధమతానికీ, సాత్వతులు భాగవత మతానికీ మూల పురుషులయ్యారు. వైఖానస పాంచరాత్రములే ఒక దశలో భాగవత మతమునందు విలీనమైనవి. రామాయణ కాలము నాటికే వైఖానసులున్నారు. మహాభారత కాలము నాటికి పాంచరాత్రులు ''భగవాన్ వాసుదేవశ్చకీర్త్యత్యేత్ర సనాతనః' అని గుర్తించి వ్యూహ నిర్మాణ రచనలో నిమగ్నులైయున్నారు.

ఉపనిషత్తుల్లో చెప్పబడిన ఉపాధి, అధ్యాస, బౌద్ధదర్శనములో చెప్పబడిన భూమిక, వ్యూహము - ఆధ్యాత్మిక భావనకు, వేదాంత శాస్త్రమునకు చెందిన పరిభాషలు. ఉపాధి అనగా శరీరము. అధ్యాస అనగా అదికాని దాని యందు మరొకటి ఆరోపింపబడుట. 'భూమిక' బౌద్ధమతంలో అధ్యాత్మిక ప్రజ్ఞావిశేషాన్ని సూచించుదశా విశేషము. 'వ్యూహ' మను మాట

బౌద్ధ దర్శనంలో ఒక పరిభాషా లక్షణాన్ని సంతరించుకొన్నదే తప్ప ఒక నిర్దిష్ట అధ్యాత్మిక పరివేషాన్ని ధరించలేదు. అవతార వాదానికి సన్నిహిత మౌతూ ఒక చోట నిలిచిపోయిన పరిభాషయిది.

ఉదాహరణకు పూర్వపు పుటల్లో చెప్పబడిన 'సుఖావతీ వ్యూహము' – భూమికలను సంభావింపవచ్చును. ఈ పరిభాషను బౌద్ధులే తొలిసారిగా సృష్టించినట్లు కన్పిస్తోంది. గండవ్యూహము, కారండ వ్యూహము అనే గ్రంథాల పేర్లు దీనినే సూచిస్తున్నాయి.

బౌద్ధులు భూమికా, పారమితా వాదాన్ని ప్రపంచించినంతగా వ్యూహవాదాన్ని ప్రపంచించ లేదు. బౌద్ధమతానికి అవ్యవహిత పూర్వకంగా పుట్టిన భాగవత మతంలో క్రమంగా ఈ భావన వేళ్లుతన్నుకొన్నవి. ఈ వ్యూహవాదానికి అవతారవాదం ప్రోద్బలకమై శ్రీ కృష్ణుడు దశావతారాల్లో ఒక్కడైనాడు. బుద్ధుడూ ఒక అవతారపురుషుడైనాడు.

" The **Vyuha** doctrine is one of the principal tenets of the old **Pancaratra** system which was absorbed in the **Bhagavata** religion as well as the latter **Sri Vaishnava Philosophy**."[1]

శ్రీ వైష్ణవ సంప్రదాయంలో భగవత్తత్త్వము పంచధానిరూపితమవుతుంది. పరమపదమైన శ్రీ వికుంఠములోని పరవాసుదేవతత్త్వము మొదటిది. రెండవది వ్యూహము, ఇది నాల్గువిధాలు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపమైంది. ఒక జ్యోతి నుండి వేరొక జ్యోతి పుట్టినట్లు ఈ వ్యూహములు ఒక దాని నుండి వేరొకటి పుడుతూ ఉన్నవి. వాసుదేవ వ్యూహము షడ్గుణమహితము. మిగిలిన మూడు వ్యూహములు ప్రధానంగా రెండు రెండు గుణాలు కలిగి ఉంటాయి.

జ్ఞానశక్తులు సంకర్షణ వ్యూహంలో
బలైశ్వర్యములు ప్రద్యుమ్న వ్యూహంలో
వీర్యతేజస్సులు అనిరుద్ధ వ్యూహంలో ఉండే ప్రధాన గుణాలు

సంకర్షణుడు – జీవుడికీ
ప్రద్యుమ్నుడు – మనస్సుకీ
అనిరుద్ధుడు – అహంకారానికీ ప్రతీకలు

ఈ వ్యూహాల నుంచి ఒక్కొక్కదానిలో మూడుగా కేశవాది ద్వాదశ ఉపవ్యూహాలు కలుగుతవి.

1) వాసుదేవుని నుండి - కేశవ, నారాయణ, మాధవములు

2) సంకర్షణుని నుండి - గోవింద, విష్ణు, మధుసూదనములు

3) ప్రద్యుమ్నుని నుండి - త్రివిక్రమ, వామన, శ్రీధరములు

4) అనిరుద్ధుని నుండి - హృషీకేశ, పద్మనాభ, దామోదరములు

ఈ పన్నెండు ఉపవ్యూహములు చైత్రాది ద్వాదశ మాసాలకు ప్రతీకలు. ఇది సంక్షేపముగా వ్యూహనిర్మాణ పద్ధతి. విశిష్టాద్వైతము నందిది మిక్కిలి ప్రధానమైన విషయము.

**''పంచధావస్థితః ఈశ్వరః, విభ్వంతర్యామ్యర్చావతార భేదాత్ పరః ఏకధా, వ్యూహాశ్చతుర్ధా - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధభేదాత్''**

''విశిష్టాద్వైతమునకు యతీంద్రమతమని పేరు. పాంచరాత్రాగమములో నీ వ్యూహసిద్ధాంతము ప్రధానమైనది. వ్యూహశబ్దము 'ఉహ్' ధాతువు నుండి పుట్టినది. 'వి' ఉపసర్గ. 'ఉహ్' అనగా ముందునకు త్రోయుట. ఈ ముందునకు త్రోయుట యెట్టిదనగా అరుగుణములు మూడు జంటలుగా వెలికివచ్చినవని వారు చెప్పుదురు.''

''అన్ని మతములు ఉపాసనామార్గములే. మహానుభావులైన మతకర్తలు జీవలక్షణాను సారముగా నుపాసించుటకు నిన్ని మార్గములను గనిపెట్టిరి. జగత్తు యొక్క క్షేమము కోసము చేసిన పని. జీవుల సంస్కార రూపముగా వారు వారు తమ తమ కనుకూలమైన యుపాసనా మార్గమున స్వీకరించవలెనని కాని మరియొకటి కనిపించుట లేదు.''

''విశిష్టాద్వైతములో నీ వ్యూహ నిర్మాణ పద్ధతి చూచినచో జీవుడు క్రమముగా నధిరోహించెడి సోపానముల వరుస సూచింపబడినట్లున్నది. '' అని తమ ప్రద్యుమ్నోదయ కావ్య స్వీయ వ్యాఖ్యానములో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాశారు.[2]

ఆర్.జి. భండార్కర్ అభిప్రాయంలో విశిష్టాద్వైతంలోని చతుర్విధ వ్యూహములకు, భగవద్గీతలో చెప్పబడిన జీవుడు, మనస్సు, అహంకారములే మూలమని, అవే తర్వాత సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములుగా రూపింపబడినవనినారు.''[3]

పాంచరాత్రాగమంలోని వ్యూహసిద్ధాంతము, పాతంజల మహాభాష్యంలో ఎవరో అజ్ఞాత కవి వ్రాసిన శ్లోకపాదముట్టంకింపబడిన దానిని బట్టి అత్యంత ప్రాచీనమని నిర్ణయింపబడుచున్నది.

ఆశ్లోక పాదమిది - ''**జనార్ధనస్త్వాత్మ చతుర్థ ఏవ**'' ఇది వాసుదేవకృష్ణుని జీవితమును స్ఫురింపజేయు కావ్యమని తెలియచున్నది.

డా॥ ఒట్టోష్రాడర్‌ను అనుసరించి పాంచరాత్రాగమములు కాశ్మీర దేశములో క్రీ.శ. **4-8** శతాబ్దములు మధ్య రచింపబడినవి.[4] క్రీ.శ. **6**వ శతాబ్దికి చెందిన అమరకోశములో వ్యూహములన్నీ ప్రస్తావింపబడినవి. వరాహమిహిరుని బృహత్సంహిత (LV III - 37-39) లో బలదేవ, కృష్ణ విగ్రహాల మధ్య ఏకానంశ విగ్రహాన్ని నిలిపి ప్రతిష్ఠించే విషయం ప్రస్తావింపబడినది. ఇది వ్యూహవాదం ఆనాటికే ఉన్నట్లు బలపరుస్తున్నది. ఒరిస్సాలో ఇప్పటికిని కృష్ణ, బలదేవుల మధ్య సుభద్రా విగ్రహమున్న మూర్తి సన్నివేశము కలదు.

## వ్యూహవాదము - అవతారవాదము

కొందరు పండితుల అభిప్రాయంలో వ్యూహవాదము పాంచరాత్రానికే పరిమితమైన సిద్ధాంతమని, అవతార వాదముతో దానికెటువంటి సంబంధము లేదని. కాని, డా॥ డి.సి. సర్కార్ ఈ విషయంలో యిలా వ్రాశారు. " It is clear that, while the **vyuhavadins** were very much influenced by the **avatara** theory as early as the days of the early **pancaratra samhitas**. Krishna and Balarama were recognised as avataras in the Vaishnava literature practically from the Gupta period."

" The **Catur - Vyuha** doctrine was undoubtedly an outcome of the deification of several **Vrishni Viras** besides **Vasudeva.**"[5]

మధురకు పశ్చిమంగా ఏడుమైళ్ల దూరమున నున్న 'మోరా' అనే గ్రామంలోని శాసనం క్రీ.శ. **1**వ శతాబ్దికి చెందినది. అందులో - ''**భాగవతాం వృష్ణీనామ్ పంచవీరాణామ్ ప్రతిమాః**'' అని యున్నది. ఈ వృష్ణివంశవీరులు సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, సాంబ, అనిరుద్ధులు. సంకర్షణుడు సాత్వత లేక పాంచరాత్ర ప్రవర్తకుడైనట్లు మహాభారతము లోను, అహిర్బుధ్న్యసంహిత లోను చెప్పబడింది. మహాభారతము లోని శాంతిపర్వానుసారము వాసుదేవుడు పరమాత్మ. సంకర్షణుడు జీవాత్మ. కాలక్రమంలో సంకర్షణారాధకులు వాసుదేవారాధకుల్లో కలిసిపోయారు. ప్రద్యుమ్న, అనిరుద్ధుల ప్రత్యేకోపాసనము కూడా క్రమంగా అడుగంటింది.

" The age of the Guptas witnessed the evolution of neo-vaishnavism from the tribal form of **Bhagavatism** which was orginally practised by the members of the **Yadava - Satvata - Vrishni** - clan."[6]

ఈ విధంగా బౌద్ధులు సూచించి వదలివేసిన 'వ్యూహ' మనే పరిభాష భాగవతమతంలో విస్పష్టీకరింపబడి పాంచరాత్ర సిద్ధాంతమై, విశిష్టాద్వైత మతానికి మూదలయ్యైనది. పీఠికయ్యైనది.

## ఉపనిషత్తు - ఉపాధి, ఉపాసన

ప్రధానమైన ఉపనిషత్తులు జైన, బౌద్ధ, భాగవతమతములకంటే ముందే రచింపబడినప్పటికీ వాటిని తర్వాత చర్చించడంలో శ్రీ ఆదిశంకరులు క్రీ.శ. 7వ శతాబ్దిలోనే ఉపనిషత్తులకు భాష్యం వ్రాసి ఉపనిషన్మతాన్ని పునరుద్ధరించిన వారు కావడంవల్లనే. కాబట్టి, శ్రీ శంకరులభాష్యాలను ఉదాహరించకుండా ఉపనిషత్తులను గూర్చి చర్చించడానికి వీలు లేదు.

ఎందుకంటే, '' శ్రీమద్రామానుజులు ఉపనిషత్తులకు వేరు భాష్యమును అనుగ్రహించలేదు. ప్రస్థానత్రయంలో భగవద్గీత, బ్రహ్మసూత్రములకే భాష్యములనుగ్రహించిరి. ఉపనిషద్భాష్యముగా శ్రీ రామానుజ దర్శనమున వేదార్థ సంగ్రహమే స్వీకరించదగినదని పెద్దల నిర్ణయము.''[7]

'ఉపాధి' 'ఉపాసన' ఈ రెండు శబ్దములు అన్యోన్యాశ్రితములైనవి. శరీరమే ఉపాధి. ఉపాసనయే మోక్షము. 'ధర్మసాధనము లందు ఆద్యమగు సాధనంబు దేహంబ కాదె' అని శ్రీనాథుడన్నట్లు ఉపాధి రహితమైన ఉపాసన సాధ్యము కాదు. అందుకే శ్రీ శంకరులు బృహదారణ్య కోపనిషద్భాష్యము లో -

**తస్యైవాత్మనః సోపాధికస్య** శబ్దార్థాది
వ్యవహార విషయాపన్నస్య పురస్తా దనుక్తా
**న్యుపాసనాని** కర్మభి రవిరుద్ధాని ప్రకృష్టా
భ్యుదయ సాధనాని క్రమముక్తి భాఞ్జి చ॥[8]

అన్నారు. ఆత్మకు శరీరము ఒక ఉపాధి, తొడుగు. ఆత్మ వస్తువుకు శరీరము అధ్యారోపితము. ఇది బ్రహ్మ సత్యమ్, జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః అన్న వాక్యము దృష్ట్యా పర్యాలోచించాలి.

శ్రీ శంకరులే ఛాందోగ్యోపనిషద్భాష్యము లో -
**''కస్తర్హి అద్వైత జ్ఞానస్యో పాసనానాం చ విశేషః?''**
అని ప్రశ్నించుకొని యిట్లన్నారు.
ఉచ్యతే - స్వాభావికస్యాత్మ న్యక్రియేఽ **ధ్యారోపితస్య** కర్త్రాది కారక క్రియాఫల భేద

విజ్ఞానస్య నివర్తక మద్వైత విజ్ఞానమ్, **రజ్వాదావివ సర్పాద్య ధ్యారోప లక్షణ** జ్ఞానస్య
ుజ్వాది స్వరూప నిశ్చయః ప్రకాశనిమిత్తః । **ఉపాసనంతు** యథా శాస్త్ర సమర్థితం
ంచిదాలంబన **ముపాదాయ** తస్మిన్ సమాన చిత్తవృత్తి సంతాన కారణం తద్విలక్షణ
ప్రత్యయానంతరిత మితి విశేషః ।''[9]

అధ్యారోపిత భావాన్నే శాస్త్రంలో 'అధ్యాస' అంటారు. " **Adhyasa** which is an
ıropa or super imposition of an unrelated concept "[10] అని డా॥ రాఘవన్
ిర్వచించారు.

బ్రహ్మపదార్థము రెండు దృష్టులతో ఉపనిషత్తులలో బోధింపబడినదని శ్రీ శంకరులు
ుాశారు.

**''ఏకమేవ బ్రహ్మ అపేక్షితోపాధి సంబంధం**
**నిరస్తోపాధి సంబంధం చ ఉపాస్యత్వేన,**
**జ్ఞేయత్వేన చ వేదాంతేషు ఉపదిశ్యతే''**

ఏకైకమైన బ్రహ్మ పదార్థము – ఎ) అపేక్షితోపాధి సంబంధము వలన ఉపాస్యత్వము
నకు బి) నిరస్తోపాధి సంబంధము వలన జ్ఞేయత్వమునకు సూచకములై యున్నవని వేదాంతము
చెప్పుచున్నది.

'ఉపాధి' శబ్దము చక్కగా అర్థము కావడానికి విశ్వనాథ వారి వాక్యాలనే ఉల్లేఖిస్తాను.
''నారాయణుడు వచ్చి నివసించుటకు దగిన **యుపాధిని** కౌసల్యకన్నది. నారాయణుడు వచ్చి
మొట్టమొదటి సారి రాముని **యుపాధిలో** ప్రవేశించినాడు. ఇది ప్రథమ నారాయణావిర్భూతి''
''సీతారాములు నిత్యదంపతులు. ప్రకృతి పురుషులు. సర్వజ్ఞులు. **ఉపాధులు** మాత్రమే
క్రొత్తవి.''

'' లక్ష్మీనారాయణులైన సీతారాములందు సుఖము సహజస్థితి. దుఃఖము అసహజస్థితి.
పరమేశ్వరుడు సచ్చిదానందస్వరూపుడు గనుక అది ఆయనకు సహజస్థితి. **ఉపాధి
పరమేశ్వరునకు అసహజస్థితి.**''[11]

## ఉపాసన - స్వరూప నిర్వచనములు

''అసలు మన మతము ఉపాసనా మతము. వైదిక మతమని, హిందూమతమని, సనాతన మతమని తరువాత వచ్చిన పేర్లు. ఈ ఉపాసనను సాధించుట యెట్లు? ఉపాసన యొక్క ప్రథమ స్వరూపము యజ్ఞము.''[12] అన్నారు విశ్వనాథ వారు.

వేదకాలము నందు యజ్ఞము బాహ్యక్రియాకలాపములతో నుండగా ఉపనిషత్కాలము నాటికి ఇది ఆంతర యజ్ఞముగా సమన్వయింపబడినది. తిక్కన గారు 'అంతర్యాగపరీపాకరూప' అన్నది దీనినే. 'అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా' అని శ్రీ లలితా సహస్రనామము.

'కర్మకూ జ్ఞానానికీ మధ్య ఉపాసన ఉన్నది'. అంటూ డా॥ రాఘవన్ యిలా వ్రాస్తున్నారు." In the transition from KARMA to JNANA, UPASANA occupies an intermediate position and function. It plays the role of a bridge or a golden link as it were between the two.[13]

'స్వర్గకామోయజేత' అన్న పూర్వమీమాంస కర్మకాండకు సంబంధించిన యజ్ఞయాగాది కర్మలను నిర్దేశించగా, **'ఇతి కర్తవ్యతా భాగం మీమాంసా పూరయిష్యతి'** అన్న ఉత్తర మీమాంస జ్ఞానకాండకు సంబంధించిన 'ఉపాసన' లను ఉపనిషత్తులలో ప్రతిపాదించినది.

ఉపనిషత్తులే ఉపాసనలన్నారు శ్రీ శంకరులు. ''ఉపనిషదః ప్రియం ఇత్యేతద్ ఉపాసిత ఇత్యాదయః'' ఇవి 'విద్యలు', 'గుహ్యాదేశము' (Secret instructions) లని చెప్పబడినవి. ఛాందోగ్యోపనిషద్భాష్యములో శ్రీ శంకరులు ''తత్రకర్మాభాసస్య దృఢీకృతత్వాత్ కర్మపరిత్యాగేన **ఉపాసన ఏవ** దుఃఖ చేత స్సమర్పణం కర్తుమితి కర్మాంగ విషయమేవ తావదాదా **వుపాసనముపన్యస్యతే**''.

ఉపాసన క్రమక్రమంగా ఉన్నతోన్నత పథాల వైపు కొనిపోతుందని చెబుతూ శ్రీ శంకరులే

''అథవా సోపానారోహణవత్ స్థూలాదారభ్య
సూక్ష్మం, సూక్ష్మతరం చ బుద్ధి విషయం జ్ఞాపయిత్వా''

అని సమన్వయించినారు. 'విద్య' 'ఉపాసన' – బ్రహ్మానుభూతిగా పరిగణింపబడినది. 'ఉపాస్' అనే శబ్దం ఉపనిషత్తుల్లో బ్రహ్మనిర్దేశకంగా వాడడం వల్లనే 'విద్యలు' 'బ్రహ్మవిద్యలయ్యాయి. కొన్ని విద్యలు బ్రహ్మోపాసనలు, కొన్ని అభ్యుదయాన్ని కోరేవి కొన్ని క్రమముక్తిని కాంక్షించేవి, మరికొన్ని కర్మ సమృద్ధిని ఆకాంక్షించేవిగా ఉన్నాయని బ్రహ్మసూత్ర

భాష్యోపోద్ఘాతంలో శ్రీ శంకరులన్నారు. ఈ సందర్భంలో ఆయన 'ఆధ్యాన' మనే మాట వాడారు. జ్ఞానప్రాప్తికి 'ఆధ్యానము' వాహిక అన్నారు. '**సమ్యక్ దర్శనార్థమేవ హి ఆధ్యాన ముపదిశ్యతే**'' అని స్పష్టీకరించారు. ఇటువంటి ఉపాసన రెండు విధాలు 1) ప్రతీకోపాసనము, 2) అహంగ్రహోపాసనము. మొదటిది ప్రతీకల ద్వారా బ్రహ్మాను సంధానమునకు తోడ్పడగా, రెండవది వస్తువునకే నామాంతరము కల్పించునట్టిది. అపేక్షితోపాధి, నిరస్తోపాధులచే ఉపాసన సగుణధ్యానం, నిర్గుణధ్యానంగా ద్విధాకరింపబడుతున్నది.

సగుణధ్యానమే అహంగ్రహోపాసన. ఇందులో 'సోఽహమాత్మా, సోఽహమేవ, సోఽహమస్మి' అని జపించుటచే అహంగ్రహోపాసనమైనది. 1) హృత్పుండరీక ధ్యానం, 2) వైశ్వానరధ్యానం, 3) అదిత్యమండల ధ్యానం, 4) భాధ్యానం, 5) పర్యంక ధ్యానం – ఇవి సగుణోపాసనలు.

ఉపాసనలన్నింటిలో నిర్గుణోపాసనమైన గాయత్రీ విద్య ఉత్తమోత్తమ మైనది. ఇది ప్రణవోపాసన. ప్రణవము ప్రతీక కావడమే గాక ఆత్మకు అత్యంత సన్నిహితమైనది.

''ఏవం నామత్వేన, ప్రతీకత్వేన చ
పరమాత్మోపాసన సాధనం శ్రేష్ఠమితి
సర్వవేదాంతేష్వవగతమ్॥''

అని శ్రీ శంకరులు ఛాందోగ్యోపనిషద్భాష్యము. కాగా, శ్రీమద్రామానుజులు కూడా శ్రీ భాష్యములో –

''ప్రతీకోపాసనం హి నామ అబ్రహ్మణి
బ్రహ్మదృష్ట్యాను సంధానమ్'' [14] అని చెప్పారు.
శ్రీ శంకరులింకా ఈ విధంగా స్పష్టీకరించారు –
''తచ్చద్విప్రకారత్వేన ప్రతీకత్వేన, అభిధానత్వేన చ.
ప్రతీకత్వేన యథా విష్ణ్వాది ప్రతిమా అభేదేన
ఏవమోంకారోఽపి బ్రహ్మేతి ప్రతిపత్తవ్యః''
అని బృహదారణ్యకోపనిషద్భాష్యము

శివగీతలో ఉపాసన లేక విద్య నాల్గు విధాలుగా వింగడింపబడినది. 1) సంపద్ 2) ఆరోప 3) సంవర్గ, 4) అధ్యాస. 'ఉపాసన' నే ఉపనిషత్తులు 'ఉపాస' అంటుందని చెప్పాము కదా! శివగీత యిట్లన్నది.

'ఉపాసా విధయస్తత్ర చత్వారః పరికీర్తితాః
సంపద్, ఆరోప, సంవర్గ, అధ్యాసా ఇతి మనీషిభిః॥ [15]

గాయత్రీ విద్యను గూర్చి చెప్పడానికి ముందుగా ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడిన ద్వాత్రింశద్బ్రహ్మ విద్యలను గూర్చి కొంత. ఇవి 32 విద్యలుగా లెక్కింపబడినవి. 1) గాయత్రీ విద్య, 2) అక్షివిద్య, 3)అంతరాదిత్య విద్య, 4) మధువిద్య, 5) పురుష విద్య, 6) ప్రాణ, ప్రతర్దాన విద్య, 7) ప్రాణాగ్నిహోత్ర విద్య, 8) ఉద్గీథ విద్య, 9) నాచికేతాగ్ని విద్య, 10) ఉపకోసల విద్య, 11) సత్యకామ విద్య 12) వైశ్వానర విద్య 13) పంచాగ్ని విద్య 14) సంవర్గ విద్య 15) ఆకాశ విద్య 16) గార్గి అక్షర విద్య, 17) భృగువారుణీ విద్య 18) ఆనందమయ విద్య 19) అంగుష్ఠమాత్ర విద్య, 20) శాండిల్య విద్య, 21)దహర విద్య, 22) బాలాకి విద్య, 23) ఉషస్తకహోల విద్య, 24) ఉద్దాలక ఆరుణి విద్య, 25) మైత్రేయి విద్య, 26) పరమపురుష విద్య, 27) అక్షరాక్షర లేక అక్షరపరా విద్య, 28) సద్విద్య, 29) భూమ విద్య, 30) పర్యంక విద్య, 31) జ్యోతిషాం జ్యోతి విద్య, 32) ఈశవిద్య, 33) శ్రీమన్న్యాస విద్య.

ఇవి గాక శ్రీ శంకరులు వేదాంతసూత్ర భాష్యములో షోడశకలావిద్య, సత్యవిద్యలను ప్రస్తావించినారు.

## గాయత్రీ విద్య - ఆజ్ఞాచక్రం

గాయత్రీ మంత్రమునకు సంకల్పమే 'పీఠిక'. ఇది కుండలినీ యోగ రహస్యము తప్ప వేరు కాదు. మూలాధారము, బ్రహ్మదండము, సహస్రారమును స్ఫురింపజేయు ఈ సంకల్ప మంత్రమే దీనికి సాక్ష్యము

''పృథివ్యాః మేరుపృష్ఠ ఋషిః, కూర్మోదేవతా
సుతలం ఛందః, ఆసనే వినియోగ :
అనంతాసనాయ నమః ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః
పరమాత్మా దేవతా, దైవీగాయత్రీ ఛందః ప్రాణాయామే
వినియోగః ఓం భూః, ఓం భువః ఓం సువః, ఓం
మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, ఓం
తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః
ప్రచోదయాత్''

" In the true Rajayoga, we are asked to meditate first on the heart centre and not on the other centres. In the outer world, Yogins there are who ask us to meditate on the **Ajna Chakra** or the centre between the two eye brows or on the navel chakra and so on. The mastery of the navel or **Manipuraka** Centre and other centres lower down, connected with the **Kundalini** there in, given us **Siddhis**, where as, the mastery of the **Ajna Charka** enables us to go beyond the **Jagrat** of the second plane and to develop therefore clairvoyance and other kindred powers."

"Upanishads as to what we mean by the **Purusha** or self - consciousness in man and as to its relationship to the **Akasa** and other bodies."[16]

| క్రమ సంఖ్య | లోకములు | తత్త్వములు | శరీరములు | అవస్థలు | పురుషుడు |
|---|---|---|---|---|---|
| 1. | భూః | పృథివి | స్థూల | జాగ్రత్ | విశ్వ |
| 2. | భువః<br>సువః<br>మహః | ఆపః<br>అగ్ని<br>వాయు | సూక్ష్మ | స్వప్న | తైజస |
| 3. | జనః | ఆకాశ | కారణ | సుషుప్తి | ప్రాజ్ఞ |
| 4. | తపః | అహంకార<br>లేక<br>అనుపాదక | జీవ<br>లేక<br>పురుష | తురీయ | తురీయ |
| 5. | సత్యం | మహద్<br>లేక<br>ఆది | హిరణ్య గర్భ<br>లేక<br>బ్రహ్మ | తురీయాతీత | తురీయాతీత |

బృహదారణ్యకోపనిషత్తు యజ్ఞాన్ని ఎలా ఆంతరయజ్ఞంగా సమన్వయించిందో చూడండి.

త్వం బ్రహ్మ, త్వం యజ్ఞ, స్త్వం లోకః
అహం బ్రహ్మో౽హం యజ్ఞో౽హం లోకః
మేవైకే చ యజ్ఞాస్తేషాం
సర్వేషాం యజ్ఞ ఇత్యేకతా॥ (1-5-17)

వాగ్వై యజ్ఞస్యహోతా (బృహ 3-1-3)
చక్షుర్వై యజ్ఞస్యాధ్వర్యుః (3-1-4)
ప్రాణోవై యజ్ఞస్యోద్గాతా (3-1-5)
మనోవై యజ్ఞస్య బ్రహ్మ (3-1-6)

ద్వాత్రింశద్బ్రహ్మ విద్యలలో 'ప్రాణాగ్నిహోత్ర' విద్యయొకటి. అది, 'వేది'ని 'యూపాన్ని' ఎలా ఆంతరంగా సమన్వయించిందో చూడండి -

శరీర యజ్ఞస్య కావేదిః ?
శరీరం వేదిః (ప్రాణాగ్ని 3-4)
శారీర యజ్ఞస్య కో యూపః ?
ఓంకారో యూపః

ఇక ఛాందోగ్య, బృహదారణ్యక, మహానారాయణోపనిషత్తులలో 'వేది' నీ 'యూపా'న్నీ యిలా సమన్వయించడం జరిగింది.

'ఉర ఏవ వేదిః' ( ఛాందోగ్యం 5-8-2)
'తస్యావేది రుపస్థః' (బృహదా 6-4-3)
'ఉరోవేదిః
హృదయం యూపః (మహానా 25-1)

'యజ్ఞే సర్వం ప్రతిష్ఠిం తస్మాద్యజ్ఞం పరమం వదంతి అని' మహానారాయణోపనిషత్తు (23.1) చెప్పగా 'వేదాంతే సుప్రతిష్ఠోఽహం వేదాంతంసముపాశ్రయ' అని ముక్తికోపనిషత్తు చెప్పినది (1-7) ఉపనిషత్తులే వేదాంతములు. శ్రీ శంకరులకు షణ్మతస్థాపనా చార్యులని బిరుదు. ఇది ఆధ్యాత్మ విద్య. 'ఆధ్యాత్మ విద్యా విద్యానాం' అని భగవంతుని గీతావచనము. కాబట్టి వేదాంత వాక్యార్థ విచారణ చేతనే ముక్తి, మోక్షము, కైవల్యము.

## ఆదిశంకరులు - అద్వైత పీఠములు[17]

''చతుర్భిస్సహ శిష్యైస్తు శంకరోఽవతరిష్యతి'' అని మఠామ్నాయ మహాను శాసనము చెప్పుచున్నది. శ్రీ శాంకరమఠామ్నాయ మహానుశాసనము ననుసరించి శ్రీ శంకర భగవత్పాద శిష్యులకు ''వైదిక సామ్రాజ్య చక్రవర్తి చిహ్నత్వేన, స్వర్ణరత్నకిరీటాది ధారణ లక్షణం గజాద్యారోహణ లక్షణం చ దేవరాజోపచారాదికమపి ధర్మాను బంధిత్వేనైవ శ్రీ శాంకర జగద్గురు పీఠాధీశానాం పరమహంసానామపి యుక్తమే తేవ సిద్ధమ్.''

రేణుకాతంత్రము ననుసరించి శ్రీ శాంకరపీఠాధీశ్వరులైన పరమహంసలు సింహాసనారోహణము, గజారోహణము విశేష ధర్మములుగా స్వీకరించుట గలదు.

ఛత్ర చామరముఖ్యాని బిరుదాదీని ధారయ।
దేవీ రూపేణ చాత్మానం సదా భావయనాన్యధా ॥
త్వయా ధృతాని సర్వాణి దేవ్యా ఏవేతి భావయ।
మండలాధిప చిహ్నాని ధారయాస్మ న్మతానుగః ॥
మూర్ధాభిషిక్త పురుషశ్రేష్ఠాయ యతిశేఖర।
సింహాసనపతే బ్రహ్మ సృష్టవాన్ దంతిశేఖరమ్॥
**మూర్ధాభిషిక్తా స్త్రివిధాస్తథా సింహాసనం త్రిధా।**
**రాజ్య సింహాసనం చైవ భాష్యసింహాసనం తథా।**
**మంత్ర సింహాసనం చైవ త్రివిధం నిర్మితం పురా।**
**అతో మూర్ధాబిషిక్తస్త్వం గజారోహణ మాచర॥**

బ్రహ్మవిద్యావ్యాఖ్యాన సింహాసనము నధిష్ఠించిన వారు శ్రీ శంకరభగవత్పాదుల వారు. ఆయన నలుగురు శిష్యులు భాష్య సింహాసనాధిష్ఠితులే.

విద్య- పర, అపర అని రెండు విధాలుగా శ్రుతి చెప్పుచున్నది. ఇది ప్రవృత్తి, నివృత్తి రూపాత్మకమైనవి. పరమహంస 'పరావిద్యఅక్షరమైనది' గా వ్యాఖ్యానించుటచే పరవిద్యాధికారి అగుచున్నాడు. ఈ సందర్భములో రేణుకాతంత్రమిట్లు చెప్పినది.

''తేషామేవ పరాపర బ్రహ్మ విద్యా పారంగతానాం
మహామేరు శిఖరాగ్రస్థితానాం సర్వమార్గేశ్శిఖరారోహణం
కుర్వద్భ్య ఇవ వివిధ చాతుర్వర్ణ్య చతురాశ్రమ ధర్మపథైః
**ప్రవృత్యేభ్యః స్వానుభూత్యా సమ్యగుత్తోరోత్తర భూమికా**
**ఉపదేష్టుం విద్యమాన భూమికా స్వకీకర్తుం చ సమ్యగధికారః**
**పరమహంసా నామేవ శ్రీ శాంకర పీఠాధిపతీనాం విశేషధర్మ**
వశాద్ భవతీతి తేషామేవ నిఖిల ధర్మస్థాపనాచార్య
జగద్గురు పీఠాధీశత్వం సార్థకం యుక్తమ్।''

## చతురామ్నాయ పీఠములు

చాతుర్వర్ణ్యం యథాయోగ్యం వాఙ్మనః కాయ కర్మభిః ।
గురోర్పీఠం సమర్చ్యేత విభాగాను క్రమేణవై ॥
ధరామాలంబ్య రాజానః ప్రజాభ్యః కరభాగినః ।
కృతాధికారా ఆచార్యా ధర్మతస్తద్వదేవహి॥
మఠాశ్చత్వార ఆచార్యాశ్చత్వారశ్చ ధురంధరాః ।
సంప్రదాయశ్చ చత్వార ఏషా ధర్మ వ్యవస్థితి ః॥

అని భగవత్పాదీయమహానుశాసనము ననుసరించి చతుర్దిశలలో చతురామ్నాయ పీఠములు సంస్థాపింపబడినవి.

''తథాపి శ్రీమద్భగవత్పాదీయ మఠామ్నాయ మహానుశాసనాది ప్రమాణవచన పరీక్షావసరే శ్రీ జగన్నాథపురీ, శృంగేరీ, ద్వారకా, బదరికాక్షేత్రేషు యావద్భారత భూగతచాతుర్వర్ణ్య, చతురాశ్రమాచార విచార వ్యవస్థాపనార్థం క్రమాద్ భగవత్పాదాంతే వాసి ప్రముఖ హస్తామలక, సురేశ్వర, పద్మపాద, తోటకాచార్యాధిష్ఠితేషు, ఋగ్యజుస్సామాథర్వ వేద చతుష్టయ సంప్రదాయ సంస్థాపితేషు తత్తత్సంప్రదాయానుసారేణ యద్ యద్ జగద్గురు పీఠచతుష్టయ గురుపరంపరా చతుష్టయం ప్రచలతి తద్వ్యతి రిక్తస్య కస్యాపి శాంకర పీఠస్య యథా యత్ర కుత్రాపి సంభవావకాశో నస్యాత్ ।''

ఇటువంటి విభాగములు చేసి అచ్చటచ్చట కార్యక్రమములను క్రమబద్ధము చేసిన విషయాన్ని భగవత్పాద మహానుశాసనమే యిట్లు స్పష్టీకరించినది.

అంగవంగ కళింగాశ్చమగధోత్కళ బర్బరాః ।
గోవర్ధనమఠాధీన దేశాః ప్రాచీవ్యవస్థితాః ॥
ఆంధ్ర ద్రవిడ కర్ణాట కేరలాది ప్రభేదతః ।
శృంగేర్యధీనా దేశాస్తే వ్యావాచీదిగవస్థితాః ॥
సింధు సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర స్తథాంతరాః।
దేశాః పశ్చిమ దిగస్థా యే ద్వారకామఠ భాగినః ॥
కురుకాశ్మీర కాంభోజ పాంచాలాది విభాగతః ।
జ్యోతిర్మఠవశా దేశా ఉదీచీ దిగవస్థితాః ॥

ఆయా ప్రాంతాలలోని మఠాధిపతులీనల్వురు అక్కడక్కడ వర్ణాశ్రమాచార ధర్మములకు రక్షణ కల్గించాలి. అంతే కాదు, తాను ఏయే ప్రాంతాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాడో ఆయాప్రాంతాలకు సంచారము విధింపబడింది. ఆచార్యుడు మఠములోనే ఎల్లకాలము నివసింపరాదు. సంచరించాలి.

“తథా చ ‘సజ్ఞేయో యజ్ఞియో దేశ’ ఇతి యాజ్ఞవల్క్యోక్తిం సార్థకయద్భిః **యావద్భారత భూమిం యజ్ఞకుండం కృత్వా** తత్ర ఆధారా భ్యామివ గోకర్ణాదా మణిపూరం, పాంచాలాదాకటకాదా సముద్రం ప్రసృతాభ్యాం నైఋతీశాన్య రేఖాభ్యాం వాయవ్యాగ్నేయ రేఖాభ్యాం విభాగం విధాయ యావద్భారత భూమిం త్రికోణఖండ చతుష్టయాత్మికాం కృత్వా, నిరుక్త భూవిభాగ వ్యవస్థయా, నిరుక్తపీఠ చతుష్టయ మాత్ర పరిపాల్యత్వేన భగవత్పాదైరేవ నిర్ణీతత్వాత్తేషామేవ చతుర్దిక్ చతురామ్నాయ పీఠాధిపతీనాం ప్రోక్త విశేష ధర్మాధికారేణ స్వస్వ విభక్త దేశసంచారాధికారో, నాన్యేషాం పరమహంసానామితి కరబదరాయితవ్యమ్ ।

అస్మత్పీఠే సమారూఢః పరివ్రాడుక్త లక్షణః ।
అహమేవేతి విజ్ఞేయో యస్యదేవ ఇతి శ్రుతేః ॥

శ్రీ శంకరుల అనంతరం పీఠాధిష్ఠితులైన పరివ్రాజకుడు శ్రీ శంకరభగవత్పాదులేనని గ్రహించాలి.

| క్రమ సంఖ్య | ఆచార్యుడు | ఆమ్నాయము | క్షేత్రము | మఠము | దిక్కు | ప్రాంతములు |
|---|---|---|---|---|---|---|
| 1. | హస్తామలకుడు | ఋగ్వేదము | జగన్నాథపురం | గోవర్ధనపురం | తూర్పు | అంగ వంగ కలింగ మగధ ఉత్కళ బర్బరములు |
| 2. | సురేశ్వరుడు | యజుర్వేదము | శృంగేరి | శారదాపీఠము | దక్షిణం | ఆంధ్ర ద్రావిడ కర్ణాటక కేరళములు |
| 3. | పద్మపాదుడు | సామవేదము | ద్వారక | | పశ్చిమం | సింధు సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్రములు |
| 4. | తోటకాచార్యుడు | అథర్వణ వేదము | బదరిక | జ్యోతిర్మఠము | ఉత్తరం | కురు కాశ్మీర కాంభోజ పాంచాలములు |

## విశిష్టాద్వైతము - రామానుజకూటములు

విశిష్టాద్వైతమునకు 'విశిష్టస్య అద్వైతమ్' విశిష్టయోః అద్వైతమ్' అని రెండు విధాలుగా నిర్వచింపవచ్చును.

" According to the former interpretation it signifies the non-duality of Brahman. The latter explains the identity between the two qualified Brahmans."[18]

శ్రీమద్రామానుజులు ప్రస్థానత్రయంలో భగవద్గీత బ్రహ్మసూత్రాలకు మాత్రమే భాష్యము వ్రాశారు. వారి వేదార్థసంగ్రహమనే గ్రంథాన్నే ఉపనిషద్భాష్యముగా గ్రహించాలని పెద్దల నిర్ణయము.

" The **Vedantha Sangraha** is mainly aimed to harmonising the apparently conflicting texts of the **Upanishads** by the basic concept **Sarira Sariribhava**. The Visistadvaitins give equal importance for all the **Srutis** whether they are **Bheda Srutis** or **Abheda Srutis**. To maintain the synthesis between controvertial sentences of Upanishads they establish **Sarira Sariribhava** with the help of **Ghataka Srutis** ie reconciling sentences like -

యస్యాత్మా శరీరమ్
యస్య పృథీవీ శరీరమ్ etc.,[19]

ఈ విధంగా రామానుజులు శ్రుతివాక్యప్రమాణములతో శరీరి శరీం భావమునకు గల సంబంధము సమన్వయించినారు.

భగవద్రామానుజులు శ్రీరంగము, కంచి, మేల్కోటలలోనే గాక శ్రీ వైష్ణవులకు పరమపవిత్రమైన అష్టోత్తర శత దివ్యదేశములలో రామానుజకూటములను స్థాపించినారు. అవి నేటికిని తమ కార్యక్రమములను నిర్వహించుచున్నవి.

## మధ్వాచార్యులు - ద్వైత పీఠత్రయం[20]

క్రీ.శ. 12వ శతాబ్దము వేదాంత శాస్త్ర వ్యాపనమున కత్యుచ్ఛకాలము, ఇది వరలో శంకరాచార్య స్థాపితమైన యద్వైతము మీమాంసా సిద్ధాంతమును, బౌద్ధ సిద్ధాంతమును జయించి యాసేతు శీతాచలమును నేకచ్ఛత్రముగ నేలుచుండెను. ఏతద్వ్యాపనము పాషండ, శైవ, వైష్ణవ

మతములకు కంటకముగా నుండెను. వీనిలో శైవమున నది వరకే నీలకంఠుడు బ్రహ్మ సూత్రములకు భాష్యమును వ్రాసి తన్మతమునకు వైదిక మత గౌరవమును తెచ్చెను. ఆగమ వైష్ణవము మాత్ర మీ యద్వైతము యొక్క దెబ్బకు తాళజాలకుండెను. ఇంతలో నొక ప్రక్క నుండి రామానుజుడును, మరియొక్క వంక నుండి మధ్వాచార్యుడును అద్వైతము పై దండయాత్ర చేసిరి. ఇద్దరు **12**వ శతాబ్దము నందుండిన వారే కాని వీరిలో రామానుజుని కంటె (క్రీ.శ. **1017 - 1137**) మధ్వాచార్యుడర్వాచీనుడు. ఈ మధ్వాచార్యులు మాత్ర మద్వైతమునకు గర్భశత్రువు. మధ్వాచార్యులు శ్రీ శంకరులను ''ప్రచ్ఛన్న బౌద్ధు''డని, ''మాధ్యమికస్య అపరావతారః'' అని నిందిస్తూ ఆయనను నిత్య బద్ధులలో చేర్చి యాయనకెన్నటికిని నిర్వాణమనునది లేదనియు, నిత్యనరకమనియు చెప్పెను. ద్వైతులు పరిణామవాదులు. అద్వైతులు వివర్తవాదులు. కారణసమసత్తాకము పరిణామము. కారణాసమసత్తాకము వివర్తము.

మధ్వాచార్యుల జననము క్రీ.శ. **1118** సంవత్సరమని కొందరు, **1199** అని కొందరు, **1238** అని మరి కొందరు చెప్పుచున్నారు. వీనిలో రెండవ దానికి శాసనాధారములున్నవి.

శంకర, రామానుజుల వలెనే మధ్వాచార్యులును తన మత ప్రచారమునకై యొక గురుపీఠము స్థాపించెను. మొదటనీ పీఠ మొక్కటిగానే యుండెను. కాని యాయన తర్వాత కొన్ని తరములకది మూడుగా చీలెను. తన్మతానుయాయుల సంఖ్య యధికమగుటయు, వారన్ని ప్రాంతముల నుండుటయు దీనికి కారణము. అవియు దేశవిభాగము చొప్పున మతాధికారము చెలాయించుచుండెను. ఇప్పటికిని తత్పీఠత్రయమున్నది. మధ్వగురుపరంపర యిట్లున్నది –



ఈ గురుపరంపరలో మధ్వాచార్యుల తరువాత నాయన గ్రంథముల కన్నిటికిని జయతీర్థులు వ్యాఖ్యానములను రచించిన విద్వత్సన్యాసి. వ్యాసరాజు లేక వ్యాసతీర్థుడు కూడా గొప్పపండితుడే. రెండవ మఠాధిపతి యుత్తర దేశమును జయించుటచే నా పీఠమున కాపేరు వచ్చెనట! మూడవదియగు సుమతీంద్ర మఠ గురుపరంపర లోనివాడు విజయీంద్ర భిక్షువు. ఈయనకు విజయీంద్ర తీర్థుడని కూడా పేరు కలదు. ఈయన గురుశిష్య పరంపర యిట్లున్నది.

**సురేంద్రుడు ⟶ విజయీంద్రుడు ⟶ సుధీంద్రుడు ⟶ రాఘవేంద్రుడు**

## యజ్ఞశాల - దేవాలయ నిర్మాణము

కృష్ణసారస్తు చరతి మృగోయత్ర స్వభావతః ।
స జ్ఞేయో యజ్ఞియోదేశో మ్లేచ్ఛ దేశస్త్వతః పరః ॥

అని మనుస్మృతి (2-23) చెప్పినది. నల్లజింక (కృష్ణసార మృగము) ఎక్కడ తిరుగుతుంటుదో అది యజ్ఞియ దేశమని తక్కినవి మ్లేచ్ఛదేశము లని చెప్పబడినవి. ఈ కృష్ణసార మృగము యిప్పటికిని భారతదేశమందే లభించుచున్నదని ప్రపంచంలోని జంతు శాస్త్రవేత్తలు నిర్ణయించుట మనువు నిర్ణయమును ధ్రువీకరించుచున్నది.

రామాయణములో మారీచుడు జింకగా వచ్చుట ఆనాటి యాజ్ఞికమైన నాగరికతను ధ్వనిస్తున్నది. యజ్ఞ సంబంధమైన భావన నుండే రామాయణము పుట్టినది. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలములో దుష్యంతుడు జింకను తరుము ఘట్టములో యజ్ఞమృగమును వెంబడించు సాక్షాత్ పినాకి వలె ఉన్నాడని వర్ణింపబడినాడు. ప్రజాపతి మృగరూపధరుడై సంతాన వైవిధ్యమును సృష్టించెనని ఉపనిషత్తులలో నొకగాథ కలదు.

ఈ విధంగా భారతీయ మనస్తత్త్వముపై యాజ్ఞికమైన సంస్కృతీ ప్రభావము అవ్యక్తముగా నేటికిని పనిచేయుచునే యున్నది. ఉపనిషత్కాలము నాటికే ఉపాసన సగుణ, నిర్గుణోపాసనలుగా విభజింపబడినది. ఆచార్య పురుషులైన ఆది శంకరులు సగుణోపాసనను సమ్మతించినారు. అద్వైతములో కంటె విశిష్టాద్వైతములో సగుణోపాసన పరాకాష్ఠకెక్కినది. దానితో దేవాలయనిర్మాణానికి చెందిన ఆగమశాస్త్రము, మూర్తి శిల్పము, ప్రతిష్ఠ యజ్ఞసంబంధమైన ఆంతర సమన్వయ సూత్రముతో లగింపబడినది.

# యజ్ఞశాలకూ దేవాలయానికీ గల సామ్యము










యజ్ఞశాల దేవాలయము

# యాగశాలానిర్మాణమే దేవాలయ నిర్మాణము

| | యాగశాల | | దేవాలయము |
|---|---|---|---|
| 1. | యూపము | 1. | ధ్వజము |
| 2. | ఉత్తరవేది | 2. | బలిగృహము |
| 3. | దశపదము | 3. | బలిపీఠము |
| 4. | హవిర్ధానము | 4. | నైవేద్యపాకశాల |
| 5. | సదస్సు | 5. | మండపము (వేదమంత్రపారాయణము జరుగు స్థలము) |
| 6. | అగ్నిహోత్రశాల | 6. | గర్భగృహము |
| 7. | ప్రధానవేది | 7. | మూలవిరాట్ ప్రతిష్ఠ |
| 8. | పత్నీశాల | 8. | మూలవిరాట్ యొక్క శక్తి ప్రతిష్ఠ |

పై పోలికలే కాకుండ ఇంకను ఈ సామ్యములు గలవని ఎల్.ఏ. రవివర్మ Rituals of Worship అనే వ్యాసంలో యిలా వ్రాస్తున్నారు. " There is an **ISTAKA - CAYANA** (Piling with bricks) in the **garbhagruha** or sanctum sanctorum of temples. This strongly reminds one of the elaborate **Istaka-Cayana** in the Vedic Yagas. Again, Agamic texts like 'వితానాగ్నిభం విష్ణోర్బింబమ్' (the idol of Vishnu is equivalent to the **Vitanagni** or Vedic 'oblation fire.') and '' వైష్ణవేచ మహాయజ్ఞే స్థాపయేద్ ధ్వజముత్తమమ్, యథైవ వైదికే యూపం శ్రుతిదృష్టం విచక్షణః'' (in the **Vaishnava Mahayajnas** the flag staff should be raised, as the yupa is raised for the vedic yagas) point to the relationship which their rites have with Vedic forms. It may be remembered that pollutions to temples are reckoned on the basis of pollutions to the **Vitanagni** which is held sacred. In the other words, the idol is fully identified with the Vedic oblation fire."[21]

'హిందూదేవాలయము' అనే బృహద్గ్రంథంలో డా॥ స్టెల్లాక్రమరిష్ వ్రాసిన వాక్యాలు ఈ సందర్భంలో మననం చేయదగినవి.

"Consistent in its completeness and appearence the **Prasada** is yet not of one origin as in the **Vedic alter**. It's Socle or base (అధిష్ఠాన పీఠ) , the covered and enclosed chamber **గర్భగృహ** and its super structure the support of the finial are the three main architectural parts in the vertical direction each of which refers to a different source.

The Socle is known as అధిష్ఠాన in South Indian texts, తంత్ర సముచ్చయ ( I. 2:37) కాశ్యపశిల్ప (X.1)and as పీఠ in the సమరాంగణ సూత్రధార (Lxl). In Orissa the lower most part of the wall is called పాభాగ the foot of the well. It corresponds to the **వేదికా** . The Socle is called పిష్ట (పీఠ)

The entire structure more over of certain temples rests on a wider terrace (కటి, జగతీ) and more than one building may rise from one and the same terrace. Another name of the **జగతి** is **పీఠకా లేదా జగతీ పీఠ** (సమరాంగణ సూత్రధార, LXVIII - 4-35)

On the massively packed Socle (Pitha) alike to the alter, the CITI (చితి) which is piled on the ground or వేది rests the walls (భిత్తి) of the గర్భగృహ. Their lower most part is also called వేది or వేదికా.

The living memory of the **Fire - Alter** however has not only remained at the bottom of the temple, where the వాస్తు పురుష మండల represents its main residues co-terminous as it is actually or in with the వేది the total site or with the extent of the **Prasada.** The **Vedic alter** survives in the structure of the body of the temple, in its lowest and its highest part. In technique and the name the **Prasada**, the Hindu temple shares in the name of the వేది and చితి. Its total structure moreover, when seen from outside has the appearance of a massive pile and is a monument mere than a building. The thickness of the walls of the గర్భగృహ and the often nearly **compact super structure also reveal that the entire Prasada is a చితి**. This is confirmed by its very names ప్రాసాద, సద్మ, సదనమ్, derived from or identical to the word సాదనమ్ **itself which denotes the piling of the Vedic alter.**

It is thus as చైత్య that the exterior of the temple, the Prasada, is proportionate in its measurement (విమాన), and the object of being looked at దర్శన.''[22]

## విగ్రహప్రతిష్ఠ లేక షడాధార ప్రతిష్ఠ

సగుణోపాసనకు ఎప్పుడైతే ప్రాధాన్యం ఏర్పడిందో ఆగమ శాస్త్రనిర్మాణము జరగడం ప్రారంభించింది. దేవాలయ నిర్మాణ శాస్త్రమునకు చెందిన దీనిలో విగ్రహ ప్రతిష్ఠ అత్యంత ప్రముఖమైనది. విగ్రహము యాజ్ఞికమైన అగ్నికి అనగా నిరాకార పరబ్రహ్మమునకు సాకారమైన ప్రతీక! ఈ ఆగమ శాస్త్రము యొక్క పునాదులు యాజ్ఞికమైన రేఖాగణిత శాస్త్రము నుండి, యోగ సంబంధమైన అనగా సహజయోగమైన కుండలినీ యోగము నుండి స్ఫూర్తిని పొంది ప్రకృష్టముగా నిర్మింపబడింది.

'తంత్రసముచ్చయ' మనే గ్రంథంలో (I.70 ff) 'షడాధార ప్రతిష్ఠ' అనే శీర్షికతో మూలవిరాట్టును ప్రతిష్ఠించే విషయం కుండలినీ యోగపరంగా ఎలా సమన్వయించి చెప్పబడిందో చూడవచ్చు.[23]




1. ఆధారశిల
2. నిధికుంభము
3. పద్మము
4. కూర్మము
5. వెండితో చేసిన పద్మము - కూర్మము
6. బంగారుతో చేసిన పద్మము - కూర్మము
7. యోగనాళీ
8. నపుంసకశిల
9. పీఠము
10. విగ్రహము
11. గర్భగృహ భూమి
12. ఇష్టకా చయనము

" In the middle of the site for the గర్భగృహ where the idol will be placed, an excavation is made to a sufficient depth, and the following articles are ceremonially fixed there in, successively with appropriate mantras. This is known as షడాధార ప్రతిష్ఠా or the fixing up of the six ạdharas or supports."

" It is an important ceremony and is done only by the Chief Priest or tantrin. The lowest is a sequence block of granite or other hard stone of definite dimensions. This is known as ఆధారశిల or supporting stone. This represents మూలధార the lowest of the six chakras (plexures) in the body. Over this come a pot like device in stone or copper, known as నిధికుంభ (pot of deposit). This stands for the second or స్వాధిష్ఠాన చక్ర . Above this comes a పద్మ (lotus bud) made of stone and known as మణిపూర . Next comes a tortoise made in stone and known as కూర్మ which stands for అనాహత చక్ర. Above this come an open lotus flower in silver with the tortoise of the same metal in it. this represents the విశుధ్ధ చక్ర . Over this comes a similar set of lotus and tortoise done in gold; this stands for the sixth or ఆజ్ఞాచక్ర. Above this comes a hollow copper tube knows as యోగనాళి . This represents the సుషుమ్నా or the spinal cord. The very names are sufficient to show

the underlying yogic sense. This arrangements depicts the క్షేత్ర (temple) itself as the క్షేత్ర (body) of the yogin. The actual idol will be placed where the సహస్రారపద్మ would be. Thus a perfect and complete yogic representation is given to the విగ్రహప్రతిష్ఠా.''[24]

## తంత్రము - తాంత్రికోపాసనకు మూలములు

‘తన్యతే విస్తార్యతే ఇతి తంత్రః’ అని నిర్వచనము. "The origin and development of the Tantras as a special class of literature and tantra as a special mode of sadhana, were intimately connected with the rise of **Saivism** and the **Pancaratra**, the **Sankhya-yoga** supplying them with a philosophical background."[25]

పాంచరాత్ర సాహిత్యమంతయు తంత్రసంబంధమైనదే. భండార్కర్‌గారు సాత్త్వతసంహితను ‘రహస్యామ్నాయ’ముగా గుర్తించినారు. ‘ఉపాసనా’ శబ్దము పాంచరాత్ర విధానము లోనిది. " In one of these **Pancaratra samhitas** a system known as **రహస్యామ్నాయ** or a secret method gives a mystic arrangement of letters and formulas, meditation of which by a special mode of worship by means of **mantras** appears to be a forerunner of the **Mahavidya Sadhana.** [26]

వైష్ణవపాంచరాత్రాగమములు గుప్తుల కాలానికి కొంచెము ముందుగా ప్రారంభింపబడి గుప్తుల పరిపాలనా కాలంలో దాదాపు ముగింపబడినవి. తాంత్రికోపాసనలోని మంత్ర పురశ్చరణ,, దీక్షాస్వీకరణము, న్యాసము, మంత్రప్రాధాన్యము, హోమము ‘మహావిద్యా’ ఉపాసనలోనివి - క్రొత్తగా సృష్టింపబడినవి కావు. ఇవి వైదిక, ఉపనిషత్, పాంచరాత్ర ఆగమముల ప్రభావముతో ఒక సమ్మిశ్రణ రూపమై పరిణతి చెందినదని నా విశ్వాసము.




తాంత్రికోపాసన లోని మహావిద్యా స్వరూప నిర్మాణము

ఇది తాంత్రికోపాననకు నేపథ్యబిందువు. పీఠబిందువు. పృష్ఠ బిందువు లేదా పీఠికా బిందువు . తాంత్రికపరిభాషలో సువర్ణ బిందువు.

'Dasa Mahavidya and Tantra Sastra అనే గ్రంథంలో శరభేశ్వర శతపథి గారు ' The Back-drop of Tantra worship' అనే అధ్యాయంలో (pp. 1-44) విపులంగా తాంత్రికోపాసనా పృష్ఠభూమిని వివరించినారు.

తల్లి సతీదేవి దశ దిశలలో దశవిధములుగా మూర్తిదాల్చినిల్చిన భీకరాకారములే దశమహావిద్యలుగా తంత్ర శాస్త్రమున ప్రసిద్ధికెక్కినది. సర్‌జాన్ ఉడ్‌రాఫ్ గారు, Principles of Tantra అనే గ్రంథంలో ఆ దశవిధమూర్తి విశేషములను తెల్పినారు.

| | | | |
|---|---|---|---|
| 1) | కాళీ | – | ఉత్తరము |
| 2) | షోడశి | – | ఈశాన్యము |
| 3) | ఛిన్నమస్తా | – | తూర్పు |
| 4) | ధూమావతి | – | ఆగ్నేయము |
| 5) | బగళ | – | దక్షిణము |
| 6) | కమల | – | నైఋతి |
| 7) | భువనేశ్వరి | – | పడమర |
| 8) | మాతంగి | – | వాయవ్యము |
| 9) | తార | – | ఆకాశము |
| 10) | భైరవి | – | భూమి |

" The beauty of Tantra Sastra is that it is entirely catholic in its approach and afford religio-philosophic opportunity to every individual irrespective of its caste or sex."[27]

## 'చిద్రూపిణీ మహావిద్యా మహానీల సరస్వతీ'
## 'విద్యామంత్రాత్మికా దేవీ'

మహావిద్యారూపమైన తాంత్రికారాధన వేద పూర్వకాలంలో గాని, వేదకాలంలోగాని ఉన్నట్లు తెలియడం లేదు కాని పురాణములలో స్మృతులలో అక్కడక్కడ చెదురుమదురుగా కొన్ని ఆధారాలు కనబడుతున్నాయి. మహావిద్య హిందువులైన తాంత్రికులు ఆరాధించు విద్య.

ఋగ్వేదకాలంలో 'సరస్వతి' గొప్ప దేవతగా ఆరాధింపబడగా, పురాణకాలము నాటికి

దుర్గా, మానసా, కాళీ రూపములుగా ఆరాధింపబడి, ఆగమముల రచనతో తంత్రశాస్త్రము వృద్ధిచెంది మహావిద్య, మహావిద్యా స్వరూపిణిగా దేవీతత్త్వము రూపు దాల్చినది. మహావిద్యయే తంత్రవిద్య, యోగవిద్య, కుండలినీ యోగవిద్య.

ధ్వనులు, వర్ణముల యొక్క సమాహార స్వరూపానికి రూపావిష్కరణమే విద్యాస్వరూపము. ఈ విద్యాదేవతోపాసనచే జ్ఞానసాక్షాత్కారము గల్గి మోక్షప్రాప్తి గల్గుట పరమ ప్రయోజనము. దేవ్యుపాసనచే మాయనుండి అవిద్య నుండి విముక్తి లభించును. కాని తంత్రము ఏమి చెప్పుచున్నదనగా దేవి విద్యకాదు, అవిద్యకాదు – ఆమె మహావిద్య, మంత్రస్వరూప. ఆమె ప్రకాశ, విమర్శ శక్తుల యొక్క కూడికయని వేదాంతము చెప్పుచున్నది. మహాభాగవత పురాణములో దక్షయజ్ఞ ఘట్టములో దశమహావిద్యా స్వరూపము వర్ణింపబడియున్నది.

మహానిర్వాణతంత్రము, విశ్వసారతంత్ర గ్రంథాల్లో యోగ విషయమై సప్త ఊర్ధ్వలోకములు, సప్త అధోలోకములు చెప్పబడినది. ఇవి సత్యలోకముల నుండి పాతాళ లోకము వరకు వ్యాపించియున్నవి.

సప్తఊర్ధ్వలోకాలు – భూః, భువః, స్వః, మహః, జనః, తపః, సత్యమ్.

సప్తఅధోలోకాలు – అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ లోకములు. 'శాక్తానందతరంగిణి' లో మానవశరీరములోని మేరువు వెన్నముక పైభాగముపై గలదని బ్రహ్మదండమును ఆశ్రయించి షట్చక్రములున్నవని చెప్పబడినవి.

| | | | |
|---|---|---|---|
| 1) | సత్యలోకము | – | సహస్రారము |
| 2) | తపోలోకము | – | అజ్ఞాచక్రము |
| 3) | జనోలోకము | – | విశుద్ధిచక్రము |
| 4) | మహర్లోకము | – | అనాహతచక్రము |
| 5) | స్వర్లోకము | – | మణిపూరచక్రము |
| 6) | భువర్లోకము | – | స్వాధిష్ఠానచక్రము |
| 7) | భూలోకము | – | మూలాధారచక్రము |

మూలాధారము క్రింద, సంధులలో, ప్రక్కభాగమున, అధోలోకములున్నవి. ఈ అధోలోకములు 'అపానము' చే సంరక్షింపబడుచు దశవిధవాయువులచే నిర్మితమైనది. ఊర్ధ్వలోకములు ప్రాణముచే సురక్షితమైనది. ప్రాణాపానముల సమంచన ప్రసారణమే యోగము.

''అపానేజుహ్వతి ప్రాణమ్'' అని గీతలో చెప్పబడినదనగా దానికర్థమిదియే.

## తంత్రసంప్రదాయము - తాంత్రిక పీఠములు

తంత్రసాహిత్యమొక స్వతంత్ర మతవాఙ్మయము. దీనికి ప్రత్యేకమైన తాత్త్విక సిద్ధాంతములున్నవి. కాని దీనియొక్క పుట్టుక ఏయితర సిద్ధాంతముతోను, తత్త్వముతోను ముడిబెట్టుటకు వీలులేదు. ఇందులో ప్రధానంగా మతపరమైన కొన్ని పద్ధతులు సాధనలు ప్రాచీనకాలము నుండి పరంపరగా సాగివచ్చుచున్నవి. తంత్రసాహిత్యములో ఉన్నతమైన యోగము, స్తోత్రజాలము, హోమములు, యాగములు, విలక్షణ సిద్ధాంతములు, ఇంకను రాజనీతి, వైద్య, మంత్రజాల విద్యలు కూడా కలవు.

" The notion that the whole universe with the totality of its phenomena forms one single whole, in which even the smallest element has an effect upon the largest bacause secret threads connect the smallest item with the eternal ground of the world. This is the proper foundation of all tantric philosophy." అని H.V. Glasenapp [28] తాంత్రిక సంప్రదాయతత్త్వమును వివరించినారు.

బౌద్ధతంత్రము, హిందూతంత్రముల మధ్య సూక్ష్మమైన ఒక సామ్యమున్నది. బౌద్ధతంత్రము అనేకమైన చిన్న చిన్న శక్తులను హిందూమతము నుండి గ్రహించినది లేదా హిందువులకు, బౌద్ధులకు, అనాగరికులైన అటవికుల సంప్రదాయములకు కొటారువంటిదైన వేదవాఙ్మయము నుండి గ్రహించినవి.

హిందూతంత్రములు బౌద్ధమతములోని మహాయాన పరిణామమైన వజ్రయానము నుండి వారి పౌరాణిక వాఙ్మయము నుండి 'ఏకజటా' దేవిని ఎరవుగా తెచ్చుకొన్నది. ఇది టిబెట్టు నుండి భారతదేశమునకు కొని రాబడినట్లు తెలియుచున్నది. బౌద్ధము నుండి ఎరవుగా తెచ్చుకొనబడిన ఇతర దేవతలే వరుసగా - మహాచీనతారా, కురుకుల్లా, జాంగులీ.

శ్రీ ఆదిశంకరులకు తంత్రశాస్త్రముపై గల అభిమానము, అభిముఖ్యము సుప్రసిద్ధమైనదే. ఆయన తంత్రములచే మిక్కిలి ప్రభావితుడగుటకు బలవత్తరమైన కారణాలు కూడా ఉన్నాయి. జైన, బౌద్ధమతాల్లోని పీఠాలను స్ఫూర్తిగా గ్రహించియే శంకరులు నాల్గు దిక్కుల్లో చతురామ్నాయ పీఠాలను స్థాపించినారు.

శ్రీ శంకరులను ప్రచ్ఛన్న బౌద్ధుడని (Crypto - Buddhist) హైందవులైన ద్వైతులే ప్రచారము చేసినారగా శ్రీ శంకరుల బ్రహ్మ అత్యంత విలక్షణము, విశ్వజనీనము, సార్వకాలికము

కావడమే దీనికి ప్రధానకారణం. అది బౌద్ధుల శూన్యవాదము నుండి పుట్టినదనుట అపరిణత ప్రజ్ఞులైన వారు చెప్పెడిమాటలే. ఇదే ఏ బౌద్ధ ఆచార్యుడినో నిందిస్తూ అతని 'ప్రచ్ఛన్న హిందువ'ని ఎవరైనా అన్నారా? ఆ నిందావాక్యము ఏ భాష్యములోనైనా గ్రంథస్థమైనదా? మేధావులైన హిందువులే ఎందుకో బౌద్ధమతదర్శనముపై అకారణమైన ద్వేషాన్ని అసూయను పెంచుకొని మన మతాచార్యులనే నిందించటం మిక్కిలి శోచనీయమైన విషయం. కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ వారికి కూడా బుద్ధునిపై బౌద్ధమతముపై ఏ మాత్రము గౌరవము లేదు.

జైనములో సంఘములు, గణములు, గచ్ఛలు వర్ధిల్లినట్లుగా పీఠములు ఎక్కువగా లేవు. కాని, బౌద్ధములో సంఘము తర్వాత పీఠమునకే అత్యధిక ప్రాధాన్యము. కాబట్టి బౌద్ధమతమే పీఠము యొక్క ప్రాథమిక రూపనిర్మాణమునకు మూదలయ్యె ఆ భావన క్రమంగా అద్వైతాది వివిధ మతాలలోనికి ఎక్కినది.

ప్రస్తుతము బౌద్ధతాంత్రిక పీఠములను గురించి తెలుసుకొని అవియే క్రమంగా హిందువులచేతను అంగీకరింపబడి అష్టోత్తర శతపీఠాలకే విధంగా దారితీసిందో పరిశీలిస్తాము.

## సమ్మోహతంత్రంలో చెప్పబడిన పీఠాలు

సమ్మోహతంత్రం మూడవ అధ్యాయంలో శక్తిస్వరూపిణియైన దేవతలను అరాధించే అనేక పీఠాల పేర్లు చెప్పబడినవి. ఆ పీఠాలను దేశాత్మకముగా విభాగించుటయే గాక, 'కాది', 'హాది' అనే రెండు పద్ధతులుగా వింగడించినది.

భోటా, మహాచీనా, చీనా అనెడి శాక్త దేవతలను కాదిపీఠములలో చెప్పబడినాయి. సంప్రదాయజ్ఞులైన వారిలో ఏకగ్రీవమైన అభిప్రాయమేమంటే కాది మంత్రములు తాంత్రిక సాధనల్లో పురశ్చరణ చేయడం వలన భౌతికమైన శక్తులు – ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు సిద్ధిస్తాయి అంటారు.

కాని, హాది మంత్రముల జపము వలన ఉన్నతమైన నిర్వాణస్థితి లేదా మోక్షము లభిస్తుందని నిష్కర్షించినారు.

బౌద్ధుల తారాశక్తియే హిందువుల నీలసరస్వతి. ఆమె అక్షోభ్యదేవీమూర్ధన్యగా పిలువబడినది. అనగా ఆమె శిరస్సుపై అక్షోభ్యమున్నది. శిరస్సే మేరువు కాబట్టి ఆ శక్తి మేరుపర్వత పశ్చిమదిగ్భాగములో నివసించుచున్నట్లు చెప్పబడినది. అమెయే బౌద్ధులు గుర్తించిన మహాచీనా, భోటా అను శాక్త దేవతలు.

## పీఠ మెలా పుట్టినది ? తీర్థము - పీఠము

తంత్ర సంప్రదాయంలో సాధకులు ఆరాధింపదగిన పవిత్ర పుణ్యస్థలాన్ని 'పీఠము' అంటారు. అది దేవి యొక్క పీఠము అనగా నివాసస్థానము. తంత్రవాఙ్మయము చాలా అరుదుగా 'తీర్థ' మనే మాట ప్రస్తావిస్తుంది. బహుశః దీనికి ప్రధానకారణం తీర్థము, పీఠముల మధ్య గల ప్రముఖమైన భేదాన్ని పౌరాణిక ప్రతీతిని ప్రసిద్ధినిబట్టి వింగడించడమే ఇక్కడ ముఖ్యోద్దేశ్యం.

ప్రముఖంగా దేవికి అవాసమైన స్థానములు పీఠములు. కాగా, దేవునికి, దేవికి వారిపరివార దేవతలకు వాసస్థానమైనది తీర్థము. తాంత్రికులీ భేదాన్ని విస్పష్టంగా పాటిస్తారు. కావుననే దేవాలయము, దేవాయతనము అని తీర్థములలో పిలువబడగా, దేవ్యాలయము, దేవ్యాయతనము అని పీఠములలో పిలుస్తారు.

కాబట్టి 'పీఠ' మనే మాట ప్రధానంగా తాంత్రిక పరిభాషకు చెందినదని స్పష్టమైనది. తరువాతి కాలంలో వుత, తాంత్రికపరమైన ఈ మాటయే, లౌకికవిద్యలు బోధించు విద్యాస్థానమునకు ఘటికాస్థానమునకు 'విద్యాపీఠము' అని పిలుచుట పరిపాటియైనది. బౌద్ధకాలము నాటికే ఈ విద్యాపీఠములు నలందా మొదలైన చోట్ల ఉన్నట్లు చీనా దేశ యాత్రికుల వ్రాతల వల్ల తెలుస్తున్నాయి.

## బౌద్ధతాంత్రిక పీఠములు

'నాలుగు పీఠములు' అన్న భావన బౌద్ధమతము నుండియే స్ఫూర్తిని పొందినది. మోనియర్ విలియమ్స్, హిందూయిజమ్ అనే గ్రంథంలో 'శాక్తపీఠము' లున్నవని స్పష్టంగా చెప్పలేక - " There are also four celebrated shrines of Goddess" అంటూ నాల్గుపేర్లు వ్రాశాడు.

| | | | |
|---|---|---|---|
| 1) | మహాలక్ష్మి | - | కొల్హాపురం |
| 2) | భవాని | - | షోలాపురం |
| 3) | రేణుక | - | మతపురం |
| 4) | యోగేశ్వరి | - | అహమద్‌నగర్ |

ఈ విధంగా నాల్గు పీఠాల ప్రసక్తి ఎలా ఏర్పడింది? దీని మూలహేతువు వేమి? అని విచారించగా డా॥ డి.సి. సర్కార్ యిలా వ్రాసి యున్నారు. " The conception of the four pithas may have been associated with the Buddhist tantric notion according to which the adept (సాధక) can rise to mahasukha (మహదానంద) through the esoteric practices innolving sex"[29]

# బౌద్ధుల చతుష్పీఠతంత్రము

తొలినాటి తంత్ర గ్రంథాలు పేర్కొన్నవి చతుష్పీఠములు. ఈ చతుష్పీఠ భావనాపరికల్పన బౌద్ధుల సహజయాన మార్గ పద్ధతికి చెందిన భావన నుండి పుట్టినదని సర్కార్ గారి నిష్కర్ష. బౌద్ధుల తాంత్రిక గ్రంథమే చతుష్పీఠతంత్రము.

ఈ 'చతుష్పీఠతంత్ర' గ్రంథము ఖచ్చితంగా ఎవరిచే ఎప్పుడు వ్రాయబడిందో తెలియడం లేదు గాని అనేక వ్యాఖ్యలతో నున్న ఈ తంత్రగ్రంథం క్రీ.శ. **1145**లో ప్రతి విలేఖన కాలంగా నేపాలులోని దర్బార్ లైబ్రరీలో లభించినది. ఈ గ్రంథమున పేర్కొనబడిన చతుష్పీఠములివి

**1**) ఆత్మపీఠము – (బౌద్ధమత దర్శనంలో 'ఆత్మ' శబ్దమే ప్రయోగింపబడలేదు. ఆత్మను బౌద్ధులు అంగీకరింపరు. ఆత్మవాదులు కాని బౌద్ధులు ఆత్మపీఠాన్ని పేర్కొనడం ఆశ్చర్యంగానే ఉంది)

**2**) పరాపీఠము – పరా, అపరా శబ్దములు హిందువుల ఉపనిషత్తులలోనిది.

**3**) యోగపీఠము – పద్మపురాణోత్తర ఖండములో 'యోగపీఠము' పేర్కొనబడినది.

**4**) గుహ్యపీఠము – 'గుహ్యసమాజతంత్రము' బౌద్ధతంత్ర గ్రంథమే కాబట్టి ఇది ఒక్కటే బౌద్ధులదిగా తోచుచున్నది.

చతుష్పీఠతంత్రమున 'వజ్రసత్వులు' అనువారు యోగినులతో లేక ప్రజ్ఞాపారమితులనబడే యోగినులతో కలిసిచేసెడి సంభోగక్రియ తాంత్రికధోరణిలో చెప్పబడినది. ఈ తాంత్రికనేపథ్యమే చతుష్పీఠ భావనకు కార్యకారణ సంబంధమై అవి క్రమంగా నాల్గు విలక్షణ స్థలాలకు చెందిన పీఠములయినాయి.

సర్కార్‌గారు ఈ సందర్భంలో రెండు సందేహాలను చెప్పారు. ఈ చతుష్పీఠాలకు ఒరిస్సాలోని జాజ్‌పూర్ లోగల చతుష్పీఠ పర్వతానికి ఎలాంటి సంబంధముందో తెలియడం లేదు. అలాగే 'చతుః' శబ్దము సహజయాన బౌద్ధుల భావనయైన 'చతురానంద'ముతో ఎట్టి సంబంధముగలదో తెలియుట లేదనిరి.

అగేహానంద భారతి గారు Tantric Tradition అనే గ్రంథంలో మొదటి దానికి సమాధానమిచ్చారు. " The mountain is a purely tantric shrine and Orissa in general is a tantric region par excellence."[30]

ఇక రెండవది సహజయాన బౌద్ధుల 'మహాసుఖమే' 'చతురానందము'. 'చతుర' శబ్దం సంఖ్యా సూచకమే కాక 'చాతుర్య'మన్న భావాన్నీ ధ్వనిస్తోంది. బౌద్ధుల తంత్రంలో భౌతికమైన 'ముద్ర'లకు ప్రాధాన్యం ఉంది. ఇది వజ్రసత్త్వులు యోగినులతో జరిపే తాంత్రిక సంభోగక్రియ. మహాసుఖము, చతురానందము తాత్త్విక పరిభాషయైనా ప్రాథమిక దశలో శారీరకమైనదే. దీనికి ఉపబలకంగా "Tantricism - A study of the Yogini Cult" - H.C. Das (1981) గారి గ్రంథమూ, Mudras - The Ritual Hand poses of the Buddha priests and the Siva priests of Bali - Tyra De Kleen (1975) గ్రంథాలూ చూడవచ్చు.

## హేవజ్రతంత్రము - తాంత్రిక చతుష్పీఠములు

హేవజ్రతంత్రము క్రీ.శ. 690లో రచింపబడినది. నిర్దుష్టమైన ప్రామాణికమైన పీఠ నిర్ణయము చేసి చెప్పిన తంత్ర గ్రంథమిది. ఇందలి చతుష్పీఠ నిర్ణయాన్నే బౌద్ధులు, హిందువులూ ఏకగ్రీవంగా అంగీకరించారు. కాబట్టి ఇది చతుష్పీఠ నిర్ణయంలో తొట్టతొలి పరిగణన అవుతున్నది.

1) **జాలంధర పీఠము** - జలంధర్, తూర్పు పంజాబు. ఆచార్య కొర్లపాటి వారు తమిళనాడనుట సరికాదు.

2) **ఒడ్డియాన, ఉడ్డియాన లేక ఓడ్యాణ :** టిబెటన్ భాషలో Urgyan. Uddiyana in the Swat Valley అని సర్కార్, అగేహానంద భారతి చెప్పారు. కాని, శరభేశ్వర శతపథి ఒరిస్సా ఓడ్యాణపీఠ నిలయమన్నారు. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు బౌద్ధ సంబంధంగా భారతదేశానికి ఉడ్డియాన దేశమని పేరువచ్చినదన్నారు. (భారతి డిసెంబరు, 1959). దీనిపై, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు ఆంధ్రదేశము ఓఢ్యాణ దేశమని విశేషించి శ్రీశైలం ఓడ్యాణపీఠనిలయమన్నారు. (భారతి మార్చి, 1966). దీనిపై పుట్టా మురళీ రావు గారు ఒరిస్సా సరిహద్దులలోని శ్రీకాకుళానికి 'ఉద్దాన' మనే పేరున్నదని జ్ఞాపకం చేశారు. ఇదే సరైన ఊహ ఒరిస్సా ఓడ్యాణ పీఠంగా ప్రసిద్ధికెక్కింది. (భారతి, ఏప్రిల్ 1966)

3) **పూర్ణగిరి** - 'సర్కారు' మౌనము వహించగా 'భారతి' తెలియడం లేదన్నారు. ఇది నేపాలులోని సుప్రసిద్ధతాంత్రిక పీఠము. కొర్లపాటి వారు కర్ణాటకలోని దనుట సరికాదు.

4) **కామరూపము** - అస్సాంలోని కామరూప్. ఇప్పటికిని ప్రచారములో ఉన్న పీఠము.

## కాలికాపురాణం - నాల్గు పీఠాలు

1) ఓఢ్రా - కాత్యాయనీదేవి, జగన్నాథుడు, ఒరిస్సా, పూరీ దేవాలయం.

2) జలశైల (జలంధర) - చండీదేవి, మహాదేవుడు జలంధర్, తూర్పు పంజాబు

3) పూర్ణ లేక పూర్ణశైల - పూర్ణేశ్వరీ దేవి, మహానాథుడు, నేపాలు.

4) కామరూపం - కామేశ్వరీదేవి, కామేశ్వరుడు, అస్సాం, కామరూపం.

ఇదిగాని, పై చెప్పబడిన ప్రధాన పరిగణన గాని, భారతదేశములోని నాల్గు దిక్కులకు సరిపోవుట లేదు. అగేహానంద భారతి గారు పీఠపరిగణనలో దక్షిణదేశము లెక్కింపబడలేదన్నారు. అది నిజమే. వైష్ణవుల అష్టోత్తర శతదివ్యదేశాలలో తమిళదేశానికే ప్రాధాన్యమిచ్చినట్లు చతుష్పీఠ నిర్ణయంలో ఔత్తరాహమునకే ప్రాముఖ్యము వచ్చినది. దక్షిణ దేశము ప్రముఖంగా శైవవైష్ణవాలకు, ఔత్తరాహము శాక్తమతమునకు పుట్టినిల్లు కావడంచేత ఈ విధమైన పరిగణన చేసియుండవచ్చు. అష్టాదశ శక్తిపీఠాలలో దక్షిణ దేశానికి ప్రాధాన్యం వచ్చినది. పీఠాల సంఖ్య క్రమ క్రమంగా పెరిగి అష్టోత్తర శతసంఖ్యను చేరడానికి హేతువు ఈ భూమి అంతా 'వేది' యని, పృధివి అంతా 'పీఠిక' అని వేద, బౌద్ధమతాలు విశ్వసించడమే.

ఈ సందర్భంలో Louis Renou, సర్కార్ వ్రాసిన "Sakta Pithas" అనే గ్రంథానికి వ్రాసిన foreword నుండి కొన్ని వాక్యాలుదాహరించడం సమంజసంగా ఉంటుంది.

" The origin of the **Pithas** in the well-known epico-puranic account of Daksa's sacrifice, interruppted by Siva's wrath. The story seems to have developed out of certain allusions in the Brahmanas referring to the peculiar misfortunes of **Bhaga** and **Pusan**. In the later Puranas and the Purana - type Tantras, the image of Visnu cutting off, part by part, Sati's corpse borne on Siva's shoulder has been grafted on this legend. The severed parts of Satis' body fell on the earth and each formed a **Pitha**, a cult having came to be crystallised on it.

Dr. Sircar recalls in this connection the Buddhist legends about the Buddha's relics and the more distant Greek version of the Osiris myth. We see here, once again, that a cult, quite well localised geographically, develops on absolutely mythical conceptions."

"Certain **Pithas** appear to be associated more especially with the breasts and the female organ of the Goddess, probably analogous to the conception of the Phallic emblem of Siva. What ever it may be, the religious crystallisation seems to have taken place originally on the basis of a group of four **Pithas** at a time which, according to Dr. Sircar, may coincide with the appearance of the early Tantras."

" The four **Pithas** are supposed to represent the four cardinal points though, from the beginning, the region of **Kamarupa (Assam)** enjoyed a privileged position in the scheme. Gradually there appeared seven Pithas, then ten, then eighteen (a sanctified number), ultimately (through the intermediate numbers 42, 50, and 51) as many as 108 (an equally expected number). The **PITHANIRNAYA** is based on a list of 42 which was later enlarged, by the inclusion of the10 mahavidyas of the Mother Goddess, the counter part of the 10 avataras of the Visnuite cycle."[31]

## పీఠ నిర్ణయము లేక మహాపీఠ నిరూపణము

పీఠ న్నిర్ణయం లేక మహాపీఠ నిరూపణమనే గ్రంథమున్నది. అందులో 42 పీఠములు మాత్రమే చెప్పబడినవి. శివచరితమనే గ్రంథంలో 51 మహాపీఠములు, 26 ఉప పీఠములు గలవు. కాని సంప్రదాయంలో 108 పీఠములు చెప్పబడినవి. ఈ పట్టికలు బృహన్నీలతంత్రములోను (పటలము - 5), ప్రాణతోషిణీతంత్రములలోను చెప్పబడినవి.

పీఠ న్నిర్ణయములోని 43 పీఠాల్లో ఆంధ్ర దేశములోనికి రెండు మాత్రమే. అవి శ్రీశైలము, గోదావరీతీరం దక్షిణ దేశంలో 'కాంచీ' చెప్పబడింది. శివచరితలోని 51 పీఠాల్లో పాలకొల్లు (క్షీరగ్రామము) చేర్చబడినది, బౌద్ధులు, హిందువులచే ఏక కంఠముగా అంగీకరింపబడిన చతుష్పీఠాలలో ఒడ్డియానము, శ్రీహట్టము (శ్రీశైలం) పూర్ణగిరి, జాలంధరము లలో 'శ్రీశైల' ముండుట గమనార్హము.

## అష్టాదశ శక్తి పీఠములు - పీఠికాపురము

ఏక పీఠం జగత్సర్వం ఏకమాకాశ మాలయమ్ ।
ఏకతోయం సదాపీత్వా జాతి భేదం నకారయేత్ ॥

అని వీరశైవ సంప్రదాయము. 'జగత్తు' సర్వము ఏకైకమైనపీఠము' అనెడి భావన ఈనాటికి కాదు. 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అన్నట్లు ఋగ్వేదములో -

''సా వా ఇయం సర్వ్యై వవేది :''

ఈ సమస్తమైన పృథివి యంతయు 'యజ్ఞవేది' అని వేదము చెప్పినది. బౌద్ధులు కూడా 'పృథివీతస్య పీఠికా' అని చెప్పినారు. ఈ భూమి సర్వమూ, వేదిక, పీఠిక అయినప్పుడు అందులో ఏది పీఠము ? ఏది పీఠము కానిది? కాని గుర్తింపు పొందిన అష్టాదశ శక్తి పీఠము సంప్రదాయమున శ్రీ శంకరాచార్య విరచితముగా కొన్ని శ్లోకములు గలవు.

శ్లో॥ లంకాయాం శాంకరీదేవీ
కామాక్షీ కాంచికాపురే।
ప్రద్యుమ్నే శృంఖలాదేవీ
చాముండీ క్రౌంచపట్టణే ॥

శ్లో॥ అలంపుర్యాం జోగులాంబా
శ్రీశైలే భ్రమరాంబికా ।
కొల్హాపురే మహాలక్ష్మీ
మాహూరే ఏకవీరకా ॥

శ్లో॥ ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠ్యాంచ పురుహూతికా ।
ఓడ్యాణే గిరిజాదేవీ
మాణిక్యా దక్ష వాటికే ॥

శ్లో॥ కురుక్షేత్రే కామరూపీ
ప్రయాగే మాధవేశ్వరీ
జ్వాలాయాం వైష్ణవీ దేవీ
గయే మాంగల్య గౌరికా ॥

శ్లో॥ వారాణస్యాం విశాలాక్షీ
కాశ్మీరేతు సరస్వతీ ।
అష్టాదశేషు పీఠేషు
శక్తయో మునిసంస్తుతాః ॥

తాసాంస్మరణ మాత్రేణ
మృత్యుదారిద్ర్యనాశనమ్ ॥

ఇది శ్రీ శంకరాచార్య విరచిత శ్లోకములుగా డా॥ డి.సి. సర్కార్ 'శాక్తపీఠములు' అనే ఆంగ్ల గ్రంథంలో తప్పులతడకగా యిచ్చిన శ్లోకములకు పరిష్కృత రూపము. ఈ పీఠములు – శక్తుల పేర్లను విడిగా ఎత్తి వ్రాస్తాను.

1) లంక – శాంకరీదేవి, 2) కాంచీపురం – కామాక్షీదేవి, 3) ప్రద్యుమ్నము – శృంఖలాదేవి, 4) క్రౌంచపట్టణము – చాముండీ దేవి, 5) అలంపురీ – జోగుళాంబ, 6) శ్రీశైలము – భ్రమరాంబిక, 7) కొల్హాపురము – మహాలక్ష్మి, 8) మాహూరము – ఏకవీర, 9) ఉజ్జయిని – మహాకాళి, 10) పీఠికాపురము – పురుహూతికా, 11) ఓడ్యాణము – గిరిజాదేవి, 12) దక్షవాటిక – మాణిక్యాంబ, 13) కురుక్షేత్రము – కామరూపి, 14) ప్రయాగ – మాధవేశ్వరీ, 15) జ్వాలాక్షేత్రం – వైష్ణవీ దేవీ, 16) గయాక్షేత్రం – మాంగల్యగౌరికా, 17) వారాణాశి – విశాలాక్షి 18) కాశ్మీరము – సరస్వతి.

తెలుగులో చూతపురీవిలాసమనే యక్షగాన ప్రబంధములో ఎల్లూరి నరసింగకవి (1980, పుట – 26) అష్టోత్తర శతదివ్యదేశ స్తోత్రముతో పాటు, అష్టాదశపీఠశక్తి స్తోత్రమును చేసినాడు. అపేర్లీ క్రింది విధంగా వున్నాయి.[32]

1) క్రౌంచద్వీప చాముండి, 2) వడ్డాది గిరిజ (ఓడ్యాణము), 3) అహిచ్ఛత్రపుర కామరూపిణీ, 4) గయామంగళగౌరీ, 5) కాంచికాపురి కామాక్షి, 6) కురుక్షేత్ర మహమ్మాయి, 7) మాహురీ ఏకవీరశక్తి, 8) **పీఠికాపురి పీఠాంబ**, 9) ప్రద్యుమ్నవాసిని సింహళదేవి, 10) జ్వాల వైష్ణవి, 11) లంక శాంకరీ, 12) శ్రీశైలభ్రమరాంబ, 13) ఉజ్జయిని నీలవేణి, 14) మాపురమహంకాళిక, 15) కాశీ విశాలాక్షి 16) ప్రయాగమాధవి 17) అలంపుర జోగులాంబ, 18) చక్రకోటి (దక్షవాటి) మాణిక్యాంబ, 19) కొల్లాపుర లక్ష్మి.

వీటిని 'శ్రీమదష్టాదశ మహాసింహాసనము'లనినాడు కవి. ఇందు కొన్ని దోషములున్నప్పటికి ప్రధానమైన అంశవివరణమున్నది. సంస్కృత స్తోత్రంలో **'పీఠ్యాంచ పురుహూతికా'** అన్న మాటను వ్యాఖ్యానిస్తున్నాడా అన్నట్లు **పీఠికాపురి పీఠాంబ** అని వివరించినాడు కవి. ఇంతకూ ఈ పీఠికాపుర మెక్కడిది ? దాని విశేషమేమి? అన్న జిజ్ఞాస కల్గడం సహజం.

**''పీఠికాపురమేవ త్రివిష్టపమిహ''** అని హరికథా పితామహులు శ్రీమదజ్జాడ ఆదిభట్టనారాయణదాసు గారు చెప్పిన ఆ పీఠికాపుర త్రివిష్టపత్వమును గూర్చి కొంచెం వివరించుకొందాము. శాసన వాఙ్మయంలో – పిష్టపురము, పైష్టకపురము, పైష్టపురము అనియూ, వ్యవహారంలో – పీఠికాపురము – పీఠాపురము –పిఠాపురము అని పేరు గలిగిన నేటి 'పిఠాపురమే' ప్రాచీనమైన 'పీఠికాపురము' ఈ పిష్టపురము తూర్పుగోదావరి మండలములో 'పిఠాపుర'మను జమీందారీ గ్రామము. ఆంధ్రప్రదేశములో నత్యంత ప్రాచీన గ్రామములలో నొకటి. చారిత్రక ప్రసిద్ధిని గాంచినది.

దాక్షారామము, పీఠికాపురము, నాంధ్రప్రాజ్యరాజ్యస్థలా
లక్షయ్యంబు పురాణకాలమున యందైనన్ త్రిలింగ క్షమా
నిక్షేపంబులు నేటిదాక నటులే నిల్చెన్ మఱిన్ సత్కవి
త్వ క్షేమంకరమైన గాథ లివియే వ్రాసెన్ సుధాబుద్ధియై [33]

అని విశ్వనాథ సత్యనారాయణ గారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు 'దక్షారామ' కావ్యానికి పీఠికాపద్యాలు వ్రాస్తూ ప్రశంసించారు.

'మునుపు శ్రీనాథుడిచ్చట బులకరించె
బరగ జాళుక్య రాట్తతి పరిమళించె'

అని చెప్పిన విశ్వనాథ వారి మాటల్లో శ్రీనాథుడీ 'పీఠికా' పురాన్ని గూర్చి భీమేశ్వర పురాణంలో ఎలా చెప్పిందో పరిశీలించుదాము.

సీ॥ ఏ పట్టణము మ్రోల నేలేరు ప్రవహించు
పృథివికి ముత్యాల పేరు వోలె
మున్నూట యఱువది మూర్తి భేదములతో
విహరించు నేవీట వేల్పుపిండు
**పీఠాంబ చెలి యోగపీఠి హుంకృతి దుర్గ**
ననిచి కాపుండు నే నగరికెలన
గుంతీమహాదేవి కూర్మి మేనల్లుడు
మాధవుండేవీట మరగినాడు
పెద్దగవకుల నేపుట భేదనమున
నెలమినిలుచుండు వ్రీడావిహీన జఘను
డట్టి పీఠాపురముఁజేరనరుగు దెంచె
బరమ శైవుఁడు శ్రీపరాశరసుతుండు [34]

సింహాచల క్షేత్రాన్ని వర్ణించిన తర్వాత శ్రీనాథుడు హుంకారిణీ శక్తి పీఠమగు పీఠికాపురమును వర్ణించినాడు. పీఠికాపుర సమీపమున బ్రవహించెడి యేలేటి కాలువల నీటి సౌరు ముత్యాల హారపు పేటలవలె నుండును. అది భూదేవికి ముత్యాలహారమనిపించును. అచట పలు విధములైన దేవతా మూర్తులు గలవు. అది హుంకారిణీ శక్తిపీఠము. ఆశక్తి విగ్రహ మీనాడు గానరాదు. పూర్వమొకప్పుడా శక్తి విగ్రహముండెడి దనియు కొంత కాలము వెనుక భూస్థాపితమైన దనియు నచటివారు వాకొందురు.

ఆపట్టణము నందలి యీశ్వరుడు కుక్కుటేశ్వరుడు. ఆ యీశ్వరుని సన్నిధి యందుండిన తీర్థమును పాదగయాతీర్థమని యందురు. గయాసురుని శిరస్సు గంగానదీ తీరము నందలి గయ యందుండుటచే దానికి 'గయాశీర్ష' మనియు, పాదములు పీఠాపురమునందుటచే దానికి 'పాదగయ' యనియు పేరేర్పడినది. అచటి విష్ణువు కంతీమాధవ స్వామి. కుక్కుటేశ్వరాలయ ప్రాకార మందలి కాలభైరవ స్వామి విగ్రహము ఇతర స్థలములందలి కాల భైరవ విగ్రహముల కంటె దిగంబర వేషమున విలక్షణముగ గన్పట్టును. అచటి కాలభైరవుడు వ్రీడావిహీన జఘనుడై ప్రత్యక్షమున గన్పట్టును. అతడు సిగ్గువీడియున్నను జూచు వారికి సిగ్గునొదవించును.

ఈ పట్టణమునకు 'బీఠాపురము' అను పేరు వచ్చుటకు గారణము అది పీఠాంబిక నెలవగుట. ఈ పీఠాంబిక నిట్లు శ్రీనాథుడు చిత్రించియున్నాడు. (2-57)

హాటక పాన పాత్రయును, నారగఁబండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొగింధరియించి పురోపకంఠ శృం
గాటక భూమి భాగమున గాపుర ముండెది **పీఠికాంబకున్**
గైటభదైత్య వైరి ప్రియకాంతకు మ్రొక్కునతండు భక్తితోన్

ఈ పీఠికాంబకు నాల్గు హస్తములు. ఆనాల్గింటిలో క్రమముగా బంగారు పాన పాత్ర, పండిన మాదీఫలము, త్రిశూలము, లోహదండమును గలిగి యూరిపొలిమేరలో నాలుగు త్రోవలు గల చోట శ్రీనాథుని నాడు కాపురము చేయుచుండెడిదట! కైటభాంతకుని ప్రియకాంతయైన యీ శక్తి యునికిని గనుగొనుట కొంత శ్రమసాధ్యమేయైనదని ఆ విషయమును శ్రీ నాథుని భీమఖండము లేదా భీమేశ్వర పురాణాన్ని పరిష్కరించి విపుల పీఠిక వ్రాసిన పిఠాపుర మహారాజా ప్రభుత్వ కళాశాలోపన్యాసకులుగా నుండిన శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రి (1958) గారిలా వ్రాస్తున్నారు.

''ఈ పీఠాంబికా శక్తి విగ్రహము పై పద్యములో దెలిపిన రీతిగా నుండినను అది ఏలానదీ తీరమున నుండుటమాని ఈ నాటి క్రొత్తపేటలోని కుమారస్వామి యాలయమున కెదురుగ నుండిన చెఱువులో జిరకాలముండి, ఒకప్పుడు బయటకు వచ్చి యచటి కుమారస్వామి యాలయములో తలదాచుకొనినది. నేటికి పదియేండ్ల క్రిందటి సంగతి. ఆ విగ్రహమును గుర్తింపబోయినపుడాలయాధికారులు నాతో నిట్లు తెలిపిరి.''

''ఇది యేదియో శక్తి విగ్రహము. కావున నిది యాలయమున నుండరాదని మాంత్రికులు దెలిపిరి. వేరొక పార్వతీ విగ్రహమును స్థాపింపనై యుంటిమి'' అని విని వారితో నేనిట్లంటిని. ''ఇది యీ గ్రామమున నుండెడి పురాతనమైన శక్తి విగ్రహము. గ్రామమున కనర్థదాయకము గాదు. మరియొక విగ్రహమును స్థాపించినను దీని నెచటనైన భద్రము చేయుడు'' పిమ్మట నా కుమారస్వామి యాలయము నందే యా విగ్రహము ప్రాకారములో నస్తిత్వమును గోల్పోక యుండెనని వినుచుంటిని.''

పీఠాపట్టణమునకు గల విశిష్టతను మరియొక గద్యములో శ్రీనాథుడిట్లు వర్ణించినాడు.

''అఖిల భువనాభిరామంబులైన యారామంబుల వలన గన్నుల పండువై కుంతీ మాధవ దేవునకు విశ్రాంతి ప్రదేశంబును, **హుంకారిణీ మహాదేవికి విహారసంకేత భువనంబును, పీఠాంబికా లక్ష్మీకాటకూటంబును,** హేలాసానికి లీలాపాన గోష్ఠీ మండపంబు ననందగి భూత భేతాళడాకినీ ప్రేతరంకా భైరవ వ్రాత నిర్మిత ప్రాకార వప్రహట్ట కుట్టిమంబగు పీఠాపట్టణము''

''ఒక చోటఁబీఠాంబికోన్నత స్తన భరా
స్ఫాల జర్ఝరిత కల్లోల యేల''

పిఠాపురము నందు నెలకొనిన పీఠాంబిక స్తనభారాస్ఫాలనముచే ఏలానదీ ప్రవాహము జర్ఝరితమై తరంగములు లేచెడివట! పీఠాంబికా విగ్రహమున కంతటికీ స్తనభారము విశిష్టముగ గన్పట్టును. 'యేస్యేస్తనః శశయః' అని ఋగ్వేద మందు వర్ణింపబడిన రీతిగా శక్తి విగ్రహములకంతటికీ సర్వసామాన్యముగా స్తనౌద్ధత్యముండుట వేదకాలము నుండి ప్రసిద్ధము.

అగస్త్యుడు వ్యాసునకు భీమమండలి లోని ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రములను ఆకాశము నుండి కన్పింపజేయు ప్రకరణములో తత్తన్మహత్త్వము నిట్లు తెలిపినాడు.

''**అదెకుక్కుటేశ్వరం** బయ్యుపాంతము మేడ **హుంకారిణీ దేవి** యోలగంబు''

సీ॥ ''మహిత గోదావరీ మండల ప్రాంతంబు ప్రాకటాంభోరాశి పరిసరంబు
**విశ్రుతాష్టాదశ పీఠాధి రాజంబు పాదగయాక్షేత్ర పావనంబు**
నిరుపమ కుక్కుటేశ్వర దివ్యనిలయంబు త్రిముఖలింగేశ్వరాధిష్ఠితంబు
శ్రీకుంతి మాధవ స్థిరతరాగారంబు భాస్వదేలానదీ పరివృతంబు
పృథుల తరశాస్త్రవరపురాణేతి హాస వేదవేదాంత విద్యావివేక సహిత
భూసురాగ్రేసరాత్యంతభాసురంబు పుణ్యనికరంబు **పీఠికాపురవరంబు**
(1-37)

**పృథివి బదునెనిమిది యోగపీఠ శక్తి గణములందెంచ సర్వశృంగారయగుచు**
భీమనాథుని సన్నిధి ప్రేమ వెలయు మాణికాదేవి సకల కల్యాణ మూర్తి (1-103)

భారతావనిలో అష్టాదశ యోగపీఠములున్నవి. అందు మాణిక్యాంబ ఒక పీఠాధినేత్రి. ఈమె దక్షారామమందున్నది. శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు 'పీఠాపురము'ను గూర్చి వ్రాసిన మూడు పద్యాలు పీఠాంబికా దేవికి ముప్పేటహారము వలె కంఠసీమ నలంకరించుచున్నది.

పెనువాత్సల్యము గుండెలో నొలయ **శ్రీ పీఠాంబికాదేవి,** చే
పిన వక్షోజయుగంబు జుర్దుకొని తృప్తిం జెంది సాహిత్య వా
హిని సంగీతధునిన్ తెనుంగు ధరనెంతే వేడ్క బాటించి మిం
చిన విద్వాంసులు నీ కుమారులటె! యోసీ! యెంతపుణ్యాత్మవే!

ఏలాలాలిత శీతవాయువుల సాహిత్యంబుతో భద్రని
ద్రాలీలావతి నిన్ను మేల్కొలుప గాదా, యాదిదేవుండుతత్
కైలాసంబును వీడి కోడియయి ప్రాతర్మాగధ స్తోత్రగా
థాలాలస్యము నందెc **పీఠనగరీ** దాక్షాయణీ! పావనీ!

పెట్టిన పేరు సార్థకత పెంపు వహింపగనుంటి కాశికా
ఘట్ట గయాప్రవాహము లఖండ పవిత్రత పండి నీయెడన్
గొట్టిన పిండియయ్యె ననుకొందుము మాతలపిద్ధి కానిచో
నెట్టులుగల్గె '**పిష్టనగరీందిర**' యన్న యభిఖ్య చెప్పవే![35]

మొదటి పద్యంలో అవ్యాజకరుణామూర్తియైన శ్రీ పీఠాంబికా దేవి ఉన్నత వక్షోజములు సంగీత, సాహిత్యములని, రెండవ పద్యంలో పీఠికాపురంలో ప్రవహించే ఏలానదిని, స్వామి కుక్కుటేశ్వరుని, మూడవ పద్యంలో 'పిష్టనగర' మన్న పేరు యొక్క సార్థక్యము 'కొట్టిన పిండి' అన్న మాటతో అర్థవంతమైనది.

## పీఠికాపురము - చారిత్రక నేపథ్యము - శాసనాధారములు

శ్రీవడ్డాది శ్రీరామచంద్రమూర్తి గారు 'పిష్ఠపురప్రాచీన చరిత్ర' అనే సిద్ధాంత గ్రంథం వ్రాశారు. 1937 లో తమ సిద్ధాంత గ్రంథంలోని ప్రధాన విషయాన్ని సంగ్రహించి 'పిష్ఠపురచరిత్ర' అనే వ్యాసాన్ని ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో ప్రకటించారు. [36]

"పిష్ఠపురము (నేటి పిఠాపురము) క్రీస్తు శకారంభము నుండియు సుప్రసిద్ధమగు రాజధాని నగరమై యుండెడిది. మొదట పిష్ఠపురము ప్రఖ్యాత బౌద్ధక్షేత్రమై యుండెననుటకు ప్రబల ప్రమాణములగ పడుచున్నవి. పిఠాపురమునకు సమీపముననున్న కొడవలి యొద్ద నాంధ్రరాజగు చందపాతి రాజు రెండవ రాజ్య సంవత్సరమున శశియను నాతని మంత్రి యచ్చటి బౌద్ధస్తూపములకు గొన్ని రాతినూతుల గట్టించినట్లు శాసనాధారములు గలవు. నేడు గూడ పిష్ఠపురమున రెండు బౌద్ధ స్తూపములు భూగర్భమున దాగియున్నవని నాయనుమానము. ఆయాస్థలములు గుర్తింపబడినవి. సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రమై 15వ శతాబ్దమున కవిసార్వభౌముని పొగడ్తగాంచి నేడాంధ్ర భోజునిచే (సూర్యరావు బహద్దరు) పరిపాలింపబడుచున్న యీ పిష్ఠపుర చరిత్ర, క్రీస్తు శకారంభము నుండి తూర్పు చాళుక్యుల వశమగు వఱకే వ్యాసమున క్లుప్తముగా వ్రాయబడినది."

''సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున ఉట్టంకింపబడిన మహేంద్రుడు పిష్టపురాధిపతి. రెండవ పులకేశి ఐహోళె శాసనము నందును, విష్ణువర్ధనుని తిమ్మాపురశాసనము నందునూ, శక్తివర్మ రాగోలు శాసనమునందును పిష్టపురము ప్రసక్తమైనది.''

పిష్టపురము కొంతకాలము తూర్పు చాళుక్యుల రాజధాని, కొంతకాలము వెలనాటి చోడుల విడిదిపట్టు. 12వ శతాబ్దాంతమున గజపతుల వశమయినది. కొండవీటి రెడ్లు కొంతకాలము దీనిని పాలించిరి. వెంటపల్లి వారను కమ్మవారు కొంతకాలము (క్రీ.శ. 1572 - 1647) గోల్కొండ నవాబుల కాలమున దీనిపై తమ ప్రభుతను వెలయించిరట! ఆ పిమ్మట గోలకొండ నవాబులు దీనిని 'చిట్నీవీడి' అను పేరు గల వెలమదొరల కిచ్చిరట! పిఠాపురము సంస్థానాధిపతుల కూటస్థునకు మేనమామయని పరిగణింపబడుచున్న రామారాయణింగారు 'చిట్నీవీడి' వారి కుదురునకు చెందినవారు.'' అని వ్రాస్తున్నారు ఆచార్యతూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణమనే గ్రంథంలో.[37]

1) పైష్టపురము - సముద్రగుప్తుని అలహాబాదు శిలాస్తంభ శాసనములో (సుమారు క్రీ.శ. 360 ప్రాంతము)

''..... పైష్టపురక మహేంద్రగిరి కౌట్టూరక స్వామిదత్తె......''

**'Paistapura'** is the same as the fortress **'Pistapura'** captured by the Chalukya King Pulakesin II and is the modern **Pithapuram** in the East Godavari District of Andhra Pradesh.[38]

2) రెండవ పులకేశి ఐహోళె శాసనములో (క్రీ.శ. 634-635)

**పిష్టం పిష్టపురంయేన జాతం దుర్గమదుర్గమమ్।**
**చిత్రం యస్య కలేర్వృత్తిం జాతం దుర్గమదుర్గమమ్ ॥**

3) పిష్టపురము - మొదటి విష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనములో - ''శ్రీమత్పిష్టపుర వాసకాన్ .... నరలోక విక్రమః పరమభాగవతః పరమబ్రహ్మణ్యోమాతాపితృపాదానుధ్యాతః శ్రీ విష్ణువర్ధన మహారాజః ''

4) శక్తివర్మ రాగోలు శాసనములో నతడు పిష్టపురము నుండి కళింగ విషయములోని రాగోలు (రా కలువ) గ్రామమును దానము చేసెనని చెప్పబడినది.

''స్వస్తివిజయ **పిష్టపురాత్మలింగాధిపతి** ర్మాగధ
కులాలంకరిష్ణు ర్వాశిష్ఠీ పుత్రో మహారాజశ్రీ
శక్తివర్మా కలింగ విషయే రాకలువ గ్రామే ''

5) దేవ రాష్ట్రాధిపతియు, ననేక సమర సంఘట్ట విజయాధిగత యశస్కుడును వాసిష్ఠీకులచంద్రుడనునగు మహారాజ గుణవర్మ పౌత్రుడును, శ్రీ మహారాజ ప్రభంజన వర్మ ప్రియపుత్రుడును స్వబల విక్రమోపార్జిత భూర్న్యయ వినయ సత్వసంపత్తాధిగత యశస్కుడును కళింగాధిపతినగు శ్రీ మహారాజ అనంతవర్మ కిందొప్ప శాసనము - **'విజయ పిష్టపురాధిష్ఠానము** నుండి శాసింపబడినది.

6) ఈ పిష్టపురము వాసిష్ఠ కులజులకును, మాఠర వంశము వారికి, రాజధానియై తర్వాతి వేంగి, రెడ్డి రాజ్యములలో నంతర్భాగమై ఆయా సామంత మండలేశ్వరుల పాలనములో నుండెను.

పదునైదవ శతాబ్దములోని దాక్షారామ శాసనములలో నొకదాని యందు ''ద్రాక్షారామ శ్రీ భీమశ్వర దేవరకు **పిటాపురస్తళం** లోని నడకుతారు గ్రామమును వాల్లెంక పోతినేనిం గారు సమర్పణ చేసి''నట్లు వ్రాయబడినది.

పైన చెప్పబడిన గ్రామము నేటికిని కాకినాడ తాలుకాలో గలదు. 'పిటాపుర స్థలము' 15వ శతాబ్దమున నేటి పిఠాపురము, కాకినాడ తాలుకా ప్రాంత మధ్యభాగమ్మైయుండెనని తోచుచున్నది.''[39]

7) 'శాసనపద్యమంజరి' లో -

భీమాపురము డాకరేమి పాల్కొలను ద్రా
చ్యారామపురి శ్రీమదమరడాలు
య (న)ను నంధ్రధరణి పంచారామముల మహా
దేవరలకు **బుద్ధ దేవరలకుం**
జేంబ్రోల నమ్మహాసేనునకుం **బిఠ**
**పురము హుంకారి శంకరికిం** గరము
రూఢికెక్కిన బెజవాడ మల్లేశ్వర
దేవరకు నఖండదీపతతులు వెట్టి [40]

శ్రీనాథుడు భీమేశ్వర పురాణము (4-151)లో పంచారామముల వర్ణించినాడు. సంస్కృత భీమేశ్వర పురాణము లోను -

పంచఖండాని కృత్వాథ పంచస్వారామ భూమిషు
అమరేశారామ, సోమారామ, క్షీరవనానిచ
కుమారారామ విఖ్యాతాచ్చతురారామ పట్టణే
ప్రతిష్ఠాప్య స్వయం భీమో దక్షిణాబ్ది తటస్థితే
దాక్షారామపురే రమ్య దక్షిణానందకాననే
శుద్దస్పటిక సంకాశం సర్వలోకమనోహరమ్

1) ద్రాక్షారామం 2) చాళుక్యభీమవరం 3) పాలకొల్లు (క్షీరవనం, క్షీరగ్రామం) 4) గుణపూడి భీమవరం 5) అమరావతి ఇవి పంచారామములు.

శ్రీనాథుడు శివరాత్రిమహాత్మ్యములో -
**'కుక్కుటేశ్వర వరకుండి పిఠాపురి** నఘతమస్కాండ చండాంశుదీప్తి!

అని వర్ణించిన కుక్కుటేశ్వర స్వామి క్షేత్రముపై జైనమత ప్రభావముందని రెండవ అధ్యాయంలో తెలిసికొన్నాము. ప్రస్తుతము కూచిమంచి తిమ్మకవి వ్రాసిన కుక్కుటేశ్వర శతకాన్ని గురించి తెలుసుకొందాము. కూచిమంచి తిమ్మకవి 14 గ్రంథాలు వివిధ ప్రక్రియలలో వ్రాసి కుక్కుటేశ్వరునికి అంకిత మిచ్చుటతోడనే తృప్తినొందక ప్రత్యేకముగా నొక శతకమునే ఆ దేవుని పేర విరచించినాడు. అదియే కుక్కుటేశ్వర శతకము. ఈ కుక్కుటేశ్వర స్వామి పిఠాపురమున వెలసిన దైవము ఈ శతకము సీసపద్యమయము. 92 పద్యాలే లభించాయి.

భూనుత విలాస! **పీఠికాపురనివాస!** కుముద హితకోటి సంకాశ! **కుక్కుటేశ!**

అన్నది ఈ శతకంలోని మకుటం. ఈ మకుట నిర్మాణమును క్రీ.శ. 1715 నాటికే కవి తన రుక్మిణీ పరిణయ కావ్యమున చేసినాడు. ఆనాటి నుండి తన అవసాదదశ వరకు గల అనుభవములోని విషయముల నిందు పొందుపరచినాడు. ఈ నాటికీ ఈస్వామి పేరును నామకరణం చేసే సంప్రదాయం తెలుగుదేశంలో ఉంది. ఉదాహరణకు గాడేపల్లి కుక్కుటేశ్వర రావు సుప్రసిద్ధ కవులు.

## చాళుక్య జయసింఘువల్లభుని పిష్టపుర శాసనములు [41]

పై శాసనములను పరిష్కరించి ప్రకటించిన వారు ఆచార్య యస్వీజోగారావు గారు. తూర్పుగోదావరి మండలమున పిఠాపురమునకు మూడు మైళ్లదూరములో నున్న విరవాడ గ్రామమున రెండు తామ్ర శాసనములు లభించినవి.

లిపి క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన సాలంకాయన చాళుక్యసంధి కాలపు తెలుగు - కన్నడ లిపి. జయసింహ వల్లభుని ఈ తామ్ర శాసనము ముద్రపై '**శ్రీసర్వసిద్ధి**' అను బిరుదము కన్పట్టుచున్నది. ఇతని తదితరములైన నిడుపర్రు, పులిబుర్రు, పెదవేగి, పెదవుద్దాలి శాసనములందును ఈ బిరుదమే యున్నది.

మొదటి కీర్తివర్మ పుత్రుడును, రెండవ పులకేశి మహారాజునకు తమ్ముడును అగు కుబ్జవిష్ణువర్ధనుని కాలమున తెలుగుగడ్డపై చాళుక్య ప్రభుత్వ మేర్పడినది. ఆకుబ్జ విష్ణువర్ధనుని తరువాత రాజ్యమునకు వచ్చిన వాడతని జ్యేష్ఠపుత్రుడగు మొదటి జయసింహవల్లభుడు. Sewell తన Historical Inscription of Southern India అనే గ్రంథంలో దీనికాలము క్రీ.శ. **633-663** అని చెప్పగా, డా॥నేలటూరి వేంకటరమణయ్య The Eastern Chalukyas of Vengi లో క్రీ.శ. **641 - 673** అని నిర్ణయించారు. ఇది సంస్కృత గద్యఘటిత శాసనము. దీనిలో 'పిష్టపుర' మనే పేరు మూడు సార్లు ప్రయుక్తమైనది.

**1)** స్వస్తి శ్రీ మదసనపుర వాసకాత్ స్వశక్తి ముఖక్షపిత దను
తనయ మహాసేనేన ...... మాతాపితృ పాదానుధ్యాత :
శ్రీ పృథివి జయసింఘవల్లభ మహారాజః **పిష్టపుర**
మధివసతో ధర్మాధి కరణ ప్రముఖా (నధికారిణః)

తెలుగు అర్థము - అసనపుర నివాసము నుండి తన శక్తి ముఖముచే దానవసేనను నాశనము చేసిన కుమారస్వామిచే అభివృద్ధి పొందిన రాజ్యము గలవాడు ...... మాతాపితృ భక్తుడునైన శ్రీ పృథివీ జయసింఘ వల్లభ మహారాజు పిష్టపురమున అధివసించి ధర్మాధికరణ ప్రముఖుల నాజ్ఞాపించు చున్నాడు.

**2)** స్వస్తి శ్రీ విజయస్కంధా వారాత్ ..... మాతాపితృ పాదానుధ్యాతః
శ్రీ పృథివీ జయసింఘ వల్లభ మహారాజః **పిష్టపుర**
కుటుమ్బినః విషయాధికారిణశ్చా సమాజ్ఞాపయతి।

**3)** ..... సామి శర్మణే **పిష్టపుర** పశ్చిమదిగ్భాగే తొమ్బ్రది
యన్నామక్షేత్రం సర్వకర పరిహారేణాగ్రహారీకృత్య సమ్ప్రదత్తమ్।

తెలుగు అర్థము - విజయస్కంధావారము నుండి ....... మాతాపితృ భక్తుడునైన శ్రీపృథివీ జయసింఘవల్లభ మహారాజు పిష్టపురనగర వాస్తవ్యులను విషయాధికారుల నిట్లాజ్ఞాపించుచున్నాడు.

'' .......... సామిశర్మకు పిష్టపుర పశ్చిమదిగ్భాగము నందలి 'తొంబదియం' అను కమును సర్వకరపరిహారముగా అగ్రహారముగా చేసి యిచ్చుటయైనది.

డా॥ డి.సి. సర్కార్ " The Successors of the Satavahanas గ్రంథంలో ుటు - 117 ) The Eastern Chalukyas ruled first probably from **Pistapura**, xt **Vengi** and then **Rajahmundry**" అని చేసిన యూహాసరియైనదని తోచు చున్నది.

ఈ రెండు శాసనములందే గాక జయసింహవల్లభుని తదితర శాసనములలోను **సనపుర'** మను పేరు కానవచ్చుచున్నది. వి. రంగాచారి గారు ఇది '**అన్నవర'** మగునేమోయని దేహించినారు. వారియూహాసరియైనదే. ఎట్లనగా తెలుగు లిపి శాసన లేఖకుడు ('శ' కు ములుగా 'స') 'అసనపుర' యని వ్రాసినాడు. **ఆసనపురమైతే 'పిష్టపుర' ' పీఠికాపుర'** గును. కాని 'అసన' మనియే నాల్గైదుసార్లుండుటచే ఆశనమనగా ఆహారము, ఆహారము ధానంగా అన్నము కాబట్టి '**అశనపురమే'** సరియైన రూపమని అదియే నేటి '**అన్నవర'** మని మాధానము.

## సామ్రాజ్యలక్ష్మీ పీఠికాతంత్రము

''సామ్రాజ్యలక్ష్మీ పీఠికాతంత్రమని యొక గొప్పతంత్రగ్రంథము తంజాపురము సరస్వతీ స్తక భాండాగారమునందున్నది. అందు రాజధర్మములు, వారి దినచర్యాదులు మిక్కిలి చక్కగా శంసింపబడినవి. రాజాస్థానమున పండితగోష్ఠినెట్లు నెఱపవలయునో, విద్వద్వివాదము నెట్లు పవలెనో, జయించిన వారికెట్టి సత్కారము కావింపవలెనో యందున్నది. విద్వద్వివాదమందు జయమందిన వారికి జేయదగిన సత్కారములలో కనకాభిషేకమొకటి! అభిషేకించిన ర్ణముద్రికాదులను అప్పుడచ్చటికి విచ్చేసియున్న పండితులకు, కవులకు తదితరులకు ంచిపెట్టవలెనట! ప్రాచీన పండితగాథలను పరిశీలింపగా నీకనకాభిషేక సత్కారము గాంచిన రాంధ్రులే పెక్కురగపడుచున్నారు. ఈ వంశము (కొలచెలమ) వాడేయగు పెద్దిభట్టు, తరులలో కవిసార్వభౌముడు శ్రీనాథుడు మొదలగువారు కనబడుచున్నారు. అని తొలిసారిగా మ్రాజ్యలక్ష్మీపీఠికాతంత్రాన్ని ప్రస్తావించిన పరిశోధన ప్రాగ్రసరులు వేటూరి ప్రభాకరశాస్త్రి రు (1922)[42]

ఇది అముద్రిత గ్రంథంగా ఉన్నప్పుడే వేటూరి వారు పరిశీలించారు. ఈ తంత్రగ్రంథం 952లో తంజావూరు సరస్వతీమహల్ వారిచే కె. వాసుదేవ శాస్త్రి, కె.యస్. ుబ్రహ్మణ్యశాస్త్రి సంపాదకత్వంతో వెలువడినది. ఇంతకూ ఈ గ్రంథస్వరూపమేమి?

"**Samrajyalakshmi Pithika**" may be described as an Emperor's

Manual. It is a part of Tantra Literature. The popular notion that Tantras or Agamas and Puranas deal only with details of worship and mystical stories, is highly erroneous and the sooner it is corrected the better."

"This book contains a detailed account of all the subjects that a prince has to learn for discharging his duties as a King in later life. The daily routine of the Head of a state for self-culture and successful administration of the country is fully dealt with. The propitiation of duties for his own good and the good of the people takes the first place in this book."

The propitiation of various forms of God - head by Vedic rites and Tantric rites is also recommended as a valuable aid is warding off unforeseen obstacles and enemies and securing the desired objects."

" The deity representing the power and glory of the State is named **Samarajya- Lakshmi**. The first 5 chapters deal with the description of her glorious abode and her retinue. The next 4 chapters describe the method of **Japa** and **Homa** ie., repetition of the **mantra** and giving offerings in her name in sacrificial fire as an aid to devotion and contemplation."[43]

అని 'పీఠిక' లో సంపాదకులు వ్రాసిరి. ఈ గ్రంథము శివపార్వతుల సంవాద రూపంగా ఉంది. 139 పటలములుగా విభాగింపబడినది.

| | | |
|---|---|---|
| పటలం 1 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి మహాత్మ్యకథనమ్ |
| పటలం 2 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి స్వరూపకథనమ్ |
| పటలం 3 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి మంత్రస్వరూప కథనమ్ |
| పటలం 4 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి యంత్రస్వరూప కథనమ్ |
| పటలం 5 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి మంత్రజపస్వరూప కథనమ్ |
| పటలం 9 | - | శ్రీసామ్రాజ్యలక్ష్మి ఆవరణదేవతాది లక్షణమ్ |
| పటలం 125 | - | నృపాభిషేకప్రకార కథనమ్ |
| పటలం 139 | - | సామ్రాజ్యలక్ష్మీస్తుతిః |

**సన్మార్గవర్తినాం రాజ్ఞాం సామ్రాజ్య ప్రతిపాదనాత్।**

**సామ్రాజ్యలక్ష్మీరితి సా కథ్యతే శ్రీర్జగత్త్రయే॥**

సప్తప్రకార శోభితమైన పురములో రత్నస్వర్ణరూప్యనిర్మితమైన గృహము చింతామణివలె నున్నది. అందులో రత్నమండపమున్నది. దానికి సోపానములు, దానిపై మణివేదిక ఉన్నది. అక్కడ రత్న సింహాసన మున్నది.

**తస్మిన్ సహస్ర పత్రాఢ్యం సౌవర్ణం సరసీరుహమ్।**
**తత్కర్ణికాయాం మహతి యోగపీఠేఽతి విస్తృతే॥**

**పద్మాసనే సమాసీనా పద్మకింజల్క సప్రభా ।**
**శ్వేతచ్ఛత్రేణ మహతా చామరాభ్యాం విరాజితా॥**

**లలాట పట్ట రచిత కస్తూరీ తిలకాంచితా।**
**మంజుమాణిక్య మకుట మనోజ్ఞమణి కుండలా ॥**

ఈ విధంగా అష్టవిధలక్ష్ములు వర్ణింపబడినారు.

**సేవ్యమానానిశం దేవీ సామ్రాజ్యసిద్ధయే।**
**ఇత్యేవం తవ దేవ్యాః స్వరూప ముపవర్ణితమ్ ॥**

సామ్రాజ్యలక్ష్మీమంత్ర స్వరూప కథనములో -
**సామ్రాజ్యదో విశేషేణ రాజ్ఞాం సామ్రాజ్యకాంక్షిణామ్ ।**
**మంత్రమేనం పురోపాస్య నాభాగ నహుషాదయః ॥**

వేదికాన్వితమైన 'మహావేదీ' పూజాకథనము తర్వాత -

**సామ్రాజ్యలక్ష్మీం సంప్రాప్యపాలయే దఖిలం జగత్ ।**
**సామ్రాజ్యలక్ష్మ్యా స్సర్వార్థసిద్ధిదా సిద్ధపూజితే।**

నృపాభిషేక ప్రకార కథనములో -

**నృపమౌదుంబరే పీఠే స్వాస్తీర్ణవ్యాఘ్రచర్మణి ।**
**తత్పీఠస్య దక్షిణే భాగే విన్యస్య నృపకుంజరః ॥**

నృపాభిషేకం, కనకాభిషేకం, నృపదినచర్యాదులు గల ఈ గ్రంథానికి తంత్రమని పేరు పట్టడంలోనే రాజ్యాభిషేకం యోగసంబంధమైన అభిషేకంతో సమానమైందనే భావం స్ఫురింపజేస్తున్నది. అలాగే పండితులకు 'కనకాభిషేకం' గొప్పసన్మానం. దీనికి మూలసూత్రమేదని విచారించగా -

## కుండలినీ యోగం - అభిషేకం [44]

కుండలినీయోగి సప్తవిధ అభిషేకాలకు నోచుకొంటాడట!

1) **శక్త్యభిషేకం** : ఇందులో గురువు, శక్తితత్త్వముల రహస్యాలను చెబుతాడు. దీనితో శిష్యునిలో దుష్టశక్తులు నశించి అద్భుతశక్తి ఆవిర్భవిస్తుంది.

2) **క్రమదీక్షాభిషేకం :** ఈ సాధన మిక్కిలి కష్టమైంది. ఒకప్పుడు వశిష్ఠుడు దీనిలో చిక్కుకు పోయినాడు. విశ్వామిత్రుడు ఈ సాధన వల్ల బ్రాహ్మణత్వం పొందగలిగాడు. దీనిలో శిష్యుని కంఠమందు అతని జందెము మాలగా వేయబడి అనేక పరీక్షలు ఇవ్వబడుతుంది. (జంధ్యం తీవితి భూత్వా)

3) **సామ్రాజ్యాభిషేకం :** పై సాధనలోని పరీక్షలను జయించిన వానికి చేయబడే యోగసామ్రాజ్యాభిషేకం.

4) **మహాసామ్రాజ్యాభిషేకం :** యోగసాధనా పట్టభద్రుడైన అనగా స్నాతకుడైన వానికి చేయు మహాస్నాతకోత్సవము – ఇది యోగమహాసామ్రాజ్యాభిషేకము.

5) **యోగదీక్షాభిషేకం :** ఇది కష్టాతికష్టమైంది. సాధకుడు అష్టాంగములలో చివరి పంచాంగములను సాధన చేస్తాడు.

6) **పూర్ణాభిషేకం :** ఇదే అసలైన సాధన. యమ, నియమ, ఆసన సాధనలు చేస్తాడు సాధకుడు. దీనిలోనే సాధకుడు నిలువగలిగేదీ లేనిదీ తెలుస్తుంది.

7) **విరాజగ్రహణాభిషేకం లేక తురీయాభిషేకం :**

పూర్ణాభిషేకానంతరం తురీయానందాన్ని పొందిన సాధకుడు పొందే పరిపూర్ణ బ్రహ్మను భావానంద స్థితియే తురీయాభిషేకం. ఇదే ఆఖరిదశ, చిట్టచివరి దశ.

దీని తర్వాత సాధకుడు తన శ్రాద్ధమును తాను చేసుకొని తన జందెం, శిఖలను తీసి వాటితో పూర్ణాభిషేకం చేస్తాడు. దీనితో గురుశిష్యన్యాయం పోతుంది. ' సోఽహం 'సాధనలో ఉంటాడు. 'సోఽహం' సాధనసిద్ధి పొందిన వారిని జీవన్ముక్తుడని, పరమహంస అని అంటారు.

శ్రీరామకృష్ణపరమహంసగా తంత్రశాస్త్రము జన్మించినది. తంత్రశాస్త్రము వల్ల ఏ విధంగా సిద్ధి పొందవచ్చో పరమహంస తన జీవితం ద్వారా చేసి చూపించారు. యోగసాధకులకు వీరి జీవితం ఒక నిఘంటువు అంటే అతిశయోక్తి కాదు.

నృపాభిషేకాన్ని 'పీఠికాతంత్రంగా' అంటే యోగపీఠికాతంత్రంతో సమానంగా సంభావించడంలో గల అంతర్యం దీనిచే స్పష్టమౌతోంది. యోగసామ్రాజ్యాభిషేకమే మహారాజుల, సమ్రాట్టుల, చక్రవర్తుల సామ్రాజ్యాభిషేకంగా నిరూపింపబడిందీ 'సామ్రాజ్యలక్ష్మీ పీఠికాతంత్రం' లో

'మహాసామ్రాజ్యాభిషేకం కూడా యోగంలోని సప్తవిధ అభిషేకాల్లో నాల్గవదే వుతోంది. అంటే తంత్ర విధానంతో పోల్చినప్పుడు మహారాజైనవాడు కూడా తర్వాత ందవలసిన మూడుదశలున్నాయని దీనికి అంతరార్థం. ఈ విధంగా రాజ్యాభిషేకం - యాగాభిషేకంతో ఒక దశలో తుల్యమైనదే కాని సంపూర్ణంగా సమానమైనది కాదు. అందుకే నికి 'సామ్రాజ్యలక్ష్మీపీఠికాతంత్ర' మని 'యోగపీఠికాస్ఫూర'కంగా పేరు పెట్టబడినది.

## తిలకధారణ - యౌగికనేపథ్యము

యోగనేపథ్యము లేనిదే భారతీయసమాజము లేదు. అనగా సామాజిక జీవితములో రూఢిగా పాతుకొన్న అంశాలకూ, సంప్రదాయాలకూ యోగనేపథ్యము తప్పనిసరిగా ఉన్నది. ందూసమాజము లోని స్త్రీలు తిలకధారణాన్ని విధిగా పాటిస్తారు. ఎందుచేత? ఇది యౌగిక షయము అనగా యోగనేపథ్యము గల్గినది.

''కందరదాగ్ర నెన్నొసల గుమ్మడిగింజ తెఱంగు పాండుమృద్బిందువు దీర్చి .... ''
(ఆముక్తమాల్యద 5-90)

'' గీరుచు గుమ్మడిగింజ నామము దీర్తు నదిమాని డిల్లబొట్టువధరింతు ''

'బొట్టు'కు 'గుమ్మడి గింజ' అను ఉపమానము కవి ప్రసిద్ధమే. కాని 'నొసటిపై వ్వుగింజంత బొట్టు' అనడం గ్రామీణుల వాడుకలో ఉంది. 'నొసలకుంకుమ బెట్టి పసుపిచ్చి రా యింటి పేరంటమునకు పిలిచినాము. అంటారు రాయప్రోలు. 'తిలకము' ఈ పేరును చ్చరించాలి. 'తిల' - నువ్వుగింజ. 'నువ్వుగింజ'తో పోలినదగుటచే 'తిలక' మనే పేరు చ్చింది. 'తిల'ల నుండి 'తైలం' తీస్తారు. దీపాన్ని 'తిల్లిక, 'తిర్లిక' అంటారు. తిలకస్థానమేది భృకుటి. ఇది 'అగ్ని' యోగాగ్ని. అనగా ఆజ్ఞాచక్రస్థితమైన బిందువు. కాబట్టే తిలకం బిందువు' ఆకారంలో ఉంటుంది. అగ్ని వర్ణము 'ఎఱుపు' కాబట్టి తిలకం ఎఱ్ఱగా ఉంటుంది. క్షేమేంద్రుడు, సూరన 'తిలకాయమాన' శబ్దాన్ని వాడారు. ఈ సందర్భంలో 'జ్ఞానసుందరి' అనే సంస్కృత కవయిత్రి (క్రీ.శ. 19వ శతాబ్ది) చెప్పిన శ్లోకం మననం చేయదగింది.

శ్లో॥ **తస్యాలలాట లీన స్వాహాపతిరేవ శాంత సంతాపః ।**
**రేజే కుంకుమతిలకావ్యాజాన్నూనం బుధా హికాలవిదః ॥** [45]

స్వాహాపతి అనగా అగ్నిదేవుడు. రేజే అనగా విరాజిల్లెను. నూనం అనగా నిశ్చయముగా అని అర్థాలు. ఆమె లలాటమందలి తిలకమును కాలవిదులైన పండితులు సార్థకమైనదిగా తలంచినారు. ఎట్లనగా ఆమెలలాటలీనమైన కుంకుమ తిలకము అగ్నిదేవుని ఎఱ్ఱని కాంతివలె శాంతమును, సంతాపకారకమునై యున్నది.

'లలాటలీనస్వాహాపతిరేవ' అనెడి మాట 'శమీమివాభ్యంతర లీనపావకామ్' అన్న మాటను తలపింపజేయటమే కాదు. యోగసంబంధమైన ఆజ్ఞానచక్రగత అగ్నితత్త్వమును స్ఫురింపజేయుచున్నది.

కవయిత్రి పేరు జ్ఞానసుందరి. జ్ఞానము ఆజ్ఞాచక్రగతమైనది. అగ్నిదానికి సంకేతము. యత్కించిత్ జ్ఞానం ఎక్కడైతే కలుగుతుందో అది ఆజ్ఞాచక్రం. తిలకధారణభ్రుకుటిలో చేయడంలో గల విశేషార్థమిది.ఇది సామాజికమైన ఆచారంగా పరిణమించింది. తిల్లిక, తిర్లిక, శబ్దాలు లోకవ్యవహారంలో ఉన్నాయి.

అగ్ని శిఖాజన్మత్వాత్
అగ్ని శిఖాలంకృతా తవప్రీతిః ।
అథవాస్వజన్మ భవనే
నహి కాసాం ప్రీతిరంబమహిళానామ్ ॥ (శ్రీ) తిరుపతి వేంకటకవుల కాళీసహస్రము

ఇక్కడ అగ్ని శిఖాలంకారమనగా తిలకము. తిరుపతి వేంకటకవుల్ని వర్ణిస్తూ జరుక్ శాస్త్రి ''లలాటాన కుంకుమాగ్ని'' అని ప్రారంభిస్తాడు.నిరంతరరామునామజపంచే పునీతురాలైన సీత 'యోగిని' గా ఒక నూతనాగ్ని శిఖ' గా రామాయణ కల్పవృక్షంలో హనుమచే వర్ణింపబడింది.

తిల్లిక - దాని పుటుపూర్వోత్తరాలు అనే వ్యాసంలో శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి గారు ఈ క్రింది విశేషాలు తెల్పారు.[46]

**1)** 'తిల్లిక' అనే తెలుగుపదం 'తిరువిళక్కు' అనే తమిళ పదానికి భ్రష్టరూపం అని గన్నవరపు సుబ్బరామయ్య వ్రాశారు.

**2)** ఆంధ్రపదపారిజాతమున 'తిల్లిక' 'తిర్వాళిక' పదాలు ఏకముగా గ్రహింపబడినవి.

'తిర్వాళిక' లో 'అలిక' శబ్దం గమనింపదగింది. అలిక మంటే భ్రుకుటి. రెండు కనుబొమ్మల నడిమి ప్రదేశం. ''అలికంబున అక్షినిడాచినట్టి సర్వజ్ఞుడని'' నాచనసోమనను చిన్నయసూరి ప్రశంసించాడు.

**3)** బ్రౌనునిఘంటువున 'తిర్లిక' అనగా 'దీప' మని అర్థము చెప్పబడినది.

**4)** శబ్దార్థ చంద్రికలో 'తిల్లిక' 'తిర్వాళిక' దీపార్థములో ప్రయోగింపబడినవి.

**5)** పద్యరూప సాంబనిఘంటువులో 'తిర్వాళిక' అరవపదమని జోతి, దివ్వె కిది పర్యాయపదమని చెప్పబడింది.

**6)** హంసవింశతిలో 'తిర్వాళిఘ' అని కవిప్రయోగమున్నది.

'తిర్వాళికలు' అని శబ్దరత్నాకరకారులు. తిరు విళక్కు = విళక్కు దీపవాచకము, ప్రకాశార్థకము. దీపశబ్దము ప్రకాశార్థకధాతుజన్యమే కదా! అలాగే 'విళక్కు' ప్రకాశార్థకమగు 'వెలిచ్చం' అను పదమునకు సంబంధించినది. దీనికి 'తిరు' చేరడంతో ఇది మొదట 'దేవతా

సన్నిధి నుంచు దీపము' లకు మాత్రమే వాడబడి క్రమక్రమంగా గృహదీపానికీ, సామాన్య వాచకమైంది. 'సర్వము సంస్కృత జన్యమను వారు 'తిలల' నుండి లాగజూచెదరేమొ? అదియు సంప్రదాయ సిద్ధము కాజాలదు. అన్నారు కాని ఇది 'తిలక' మను పేరెట్లు వచ్చినదో సమర్థింపలేక పోయారు. తిలకధారణ సార్థక్యము ప్రస్తుతాంశము. 'తిల్లిక'తో సంతసింపక దీపపర్యాయాన్వేషణమునకై మనము ప్రయత్నింప వలసియున్నది. దీనిపై గుఱ్ఱం జాషువ గారు 'తిర్లిక' అనే వ్యాసంలో యిలా వ్రాశారు.[47] ''ఇంటి దీపమే తిల్లిక. ఈ తిల్లికనాగరజనుల మాట. బ్రౌన్ దొర మాత్రమే తిల్లిక అనగా దీపమని వ్రాసినాడు. 'తిల్లిక' గుంటూరు మండలమున వ్యవహారములో కలదు. తిల్లిక మా వైపున బసిపిల్లలకును కొట్టిన పిండి. ''తిల్లికలో నూనె లేదు'' ''తిర్లిక పెద్దజేయుము'' అని మేము వ్యవహరింతుము. పెద్దజేయుమన్న నార్పుమని యర్థము. 'తిల్లిక' వాడుకలో జీవించి యున్నదని తెలిసికొని రచయితలు తమ కావ్యములలో నుచితస్థానము నిచ్చినాదరింపవలయునని ప్రార్థన' అని వ్రాసినారు. అంతే కాదు, తమ 'గబ్బిలము' అనే కావ్యంలో –

> **తిల్లిక** నాఱిపి దయ్యపు
> బిల్లవలెందిరుగు దబిసిపిట్టనరయగా
> బల్లవితమయ్యె నాతని
> యుల్లంబున గ్రొత్త క్రొత్త యూహాంకురముల్, అని ప్రయోగించి చూపినారు.

'తిల్లిక' – మొహంజొదారో కుండ గుర్తులు' అన్న విపుల పరిశోధన వ్యాసం వ్రాసిన వారు కాళ్లకూరి సూర్యనారాయణ గారు.[48]

'తిల్లిక' అనే తెనుఁగు మాటతో సంబంధం ఉన్న మరికొన్ని మాటలను ఉదాహరించి వాటిని ఏయే అర్థాలలో ఇప్పటి తెలుగువారు ఉపయోగిస్తున్నారో తెలియపరచిన తరువాత వాటి వ్యుత్పత్తిని గురించి చర్చిస్తాను.'' అని వ్రాస్తూ

1) **తిలకం** : – వాడు తిలకం దిద్దినాడు. ఇది పూర్ణతిలకంగా ఉండేటప్పుడు దీని ఆకారము యిలా ఉంటుంది. (చిత్రం – 1)




రాను రాను చట్టూ ఉన్న సున్న జారిపోయింది. అందువల్ల మిగిలిన దానికే 'తిలకం' అని పేరు వచ్చినది (చిత్రం – 2,3)

2) **టిల్లకం** :– వాడికి టిల్లక్కం పెట్టి పంపించారు. 'నామం పెట్టినా'రని అర్థం.

3) వాడికి టొల్లెకం చూపించినారు – నామర్దాపని చేసినాడని భావం.

4) టిల్ల, టిళ్ళ – పిల్లల ఆటలలో చూపుడు వేలునూ, మధ్య వేలునూ మడిచి వంచిన యెడల దాని మధ్య తిలకాకారము ఏర్పడుతుంది. ఆ విధంగా ఎవరివైపు చూపబడుతోందో వారికి వదలివేయాలని భావం.

5) తిల్లిక :– పిండితిల్లిక, వరిపిండి లేదా గోధుమపిండిలో ఆవు నెయ్యి పోసి వెలిగించే దీపం.

6) దీపసామాన్యార్థము :– తిలకంలో ముఖ్యభాగానికి ఎట్టి ఆకారమో అదే ఆకారము గల ఇతర వస్తువులుకున్నూ ఈ పేరు వచ్చినది. తిలకము, తిలగింజ, 'టిల్ల' వెలిగే దీపము – మొదలైన వాటి ఆకారము ఇంచుమించుగా ఒకటే.

7) 'తల' అనే పదమునకూన్నూ 'తిలక'ము నకున్నూ గల సంబంధం చూపిస్తే ఈ మాటలన్నీ ఒక తోరణము లోనివని తేలుతుంది.

అనాది నుండిన్నీ, మృగములలో మృగమువలె సంచరిస్తూ ఉండే రోజుల దగ్గర నుంచీ మనుష్యుడు మూడింటియందు పరమభక్తిని కనబరచే వాడనుటకు తగిన నిదర్శనము లనేకములున్నవి. అవి ఏమంటే 1) జననము 2) జీవము 3) మరణము. పుట్టుకను దేవునిగా భావించి బ్రహ్మరూపంగా పూజిస్తున్నాడు. జీవమును దేవునిగా భావించి విష్ణుమూర్తిగా పూజిస్తున్నాడు. మరణమును దేవునిగా భావించి ఈశ్వరునిగా పూజిస్తున్నాడు. వీరే త్రిమూర్తులు. శిశుజననమే భగవంతుడు – బ్రహ్మ – పూజనీయుడు (అట్టి జననమునకు సహాయపడు మనుష్యావయవము కూడా పూజనీయమే. కాబట్టి అట్టి అవయవములను గురుత్వముతో చూచే వాడుక. అందుచేతనే వాటిని పూజించుట.)

పుట్టుట ఎంత వింతో జీవమున్నూ అంతే వింత. కాబట్టి జీవమును విష్ణువుగా భావించి ప్రజలు ఆయనను పూజిస్తున్నారు. జీవమునకు శరీరము ఆధారము. శరీరావయవములన్నిటిలోను శిరస్సు ప్రధానమైనది –

'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్'

మనుష్యునకూ, మృగమునకును వ్యత్యాసమును కల్పించి వానికి ఉన్నత స్థానము నొసంగునది వాని శిరస్సే. అందుకు జ్ఞానమంటూ మనుష్యునకు కలిగిన దగ్గర నుంచీ అతడు శిరస్సును పూజిస్తూ వస్తున్నాడనుటకు తగిన ఆధారములు చాలా ఉన్నవి. ఈ ఆచారాన్ని బట్టి మానవజాతికి 'తల' పూజనీయమైనది. శిరస్సు గుండ్రముగా ఉంటుంది. కాబట్టి 'తిలకం'లో వెలుపల నున్నది. లలాట మందు వ్రాసిన మూడు గీతలును అడ్డుగా ఉంటే శివుడు, నిలువుగా ఉంటే విష్ణువు. శివకేశవులకు భేదం లేదు. నిలువుగా ఉన్న గీతలు రాను రాను తిలకముగా మారినది. తిలకమునకున్నూ, తలకున్నూ గల సంబంధము ఇప్పుడు కనబరచినాను. ఈ శివ, విష్ణు ఆకారము గల పటములే (☰ U) ఇంకొక జాతి వారిలో చదరము మాదిరిని ( ▭ ) ఏర్పడినది. తమిళులు ముఖ్యంగా శైవులు నుదుట విభూతిని

ంచెము రాచుకొంటారు. అది చదరంగా ఉంటుంది. చదరంగా వ్రాయడం తమిళ
ప్రదాయం. గుండ్రంగా వ్రాయడం తెలుగు సంప్రదాయం. వాస్తవానికి దగ్గరగా ఉన్నది తెలుగు
ప్రదాయమే. చాలా వరకు మార్పు చెందిన తర్వాత నిలకడ అయినది తమిళ సంప్రదాయము.

మరణము సంకేతిస్తూ ఈశ్వరుని ఆరాధిస్తారు. ఈశ్వరారాధన అనాది కాలము నుండి
స్తున్నది. శైవులు నుదుట గీతలు అడ్డుగా ధరిస్తారు. వైష్ణవులు నిలువుగా ధరిస్తారు.

నిలువు గీతలు - నాద సహితమైన ఊపిరి
అడ్డు గీతలు - నాద రహితమైన ఊపిరి

ప్రణవనాదము నుండి వేదము పుట్టినది. వేదరక్షకుడు విష్ణుమూర్తి 'నాదతను మనిశం
ంకరం' అన్నాడు త్యాగరాజు స్వామి. నాదమే తనువుగా గలవాడు శివుడు. ఇది శివకేశవుల
కత్వము. ఈ రెండున్నూ జీవ చిహ్నములే. ఒకరు ఊపిరే ముఖ్యం అంటే నాదంతో కూడు
'ంటేనే ఊపిరి వల్ల ఫలం. ప్రాణమునకు స్పందన జీవనాడి. ఈ స్పందన సంకోచ
్యకోచములతో కూడినది. వ్యాకోచము విష్ణువు. సంకోచము శివుడు.

టెంకాయ అనగా తలకాయ. తలకాయ వలెనే దీనికిన్ని జుట్టు ఉన్నది. తల నుండి
ద్భవమైన' శివునికి వలెనే దీనికిన్నీ మూడు కండ్లు. అందుకే శివకేశవులకు దీనియందు
తి. దేవునికి కొబ్బరికాయ కొట్టినారంటే మనిషి తలకు మారుగా తలవంటి కాయను వేట
క బలివేస్తున్నారని భావము. ఈ కారణము చేతనే వరలక్ష్మీ వ్రతం చేస్తున్నపుడు లక్ష్మి
ుఖముగా కనబడేటట్టు టెంకాయకు ముక్కు చెవులు నోరు ఏర్పరచి కలశమనే గర్భంపైన
ంచి 'కలశస్యముఖే విష్ణుః అని పూజించడం సంప్రదాయం. శివుని మూడవకన్ను జ్ఞాన నేత్రం
ోగపరంగా ఆజ్ఞాచక్రం.''

[49]'తిర్లిక' అనే వ్యాసంలో పం. వెంకటాచార్యులు గారు యిలా వ్రాస్తున్నారు.
వాస్తవమునకు 'తిరువిళక్' అను అరవపదము యొక్క యపభ్రంశ రూపమే 'తిల్లిక'.

తిరువిళకు → తిర్వ్ళ → తిర్లిక → తిల్లిక

వికృతిపదములందు వర్ణలోప, వర్ణాగము, వర్ణవ్యత్యయములు విధిగా గన్పడును. ప్రకృతి,
ికృతితత్వమును బరిశీలించునపుడు సమీపసంబంధమే ముఖ్యముగా చేకొనదగినది.

అరవములో 'విళక్' దీప సామాన్యవాచకము. '' ..... ఉణార్వెనుం శుడర్ విళక్కేట్రి''
తిరు' పదము శ్రేష్ఠవాచకము. ఈ యుభయ పదములను మేళవించి పూజాసమయములందు

'తిరువిళక్కు' నుపయోగించుట శ్రీ వైష్ణవసంప్రదాయము. దీనిని బట్టియే 'తిరువిళకు' 'తిర్విళకు' ఆంధ్రదేశమున జొచ్చి జనసామాన్యముచే 'తిర్లిక' 'తిల్లిక' రూపములు దాల్చి దీపసామాన్య వాచకములైనవి. ఇంకొక విశేషము ఈ 'తిరు' పదరహితమైన 'విళకు' కన్నడమున బెళకు (కాంతి)గా మారి తెలుగులో 'బెళుకు' రూపుతో వెలయుచున్నది.

సంస్కృత నాటకాలలో పాత్రలు 'ప్రకాశముగా' అని సంభాషించే రీతిగా, తమిళంలో కూడ ఎవరైనా అస్పష్టంగా విషయాన్ని చెప్పినపుడు ''కొంజెం విళక్కమాగ శొల్లుంగళ్'' అని అడుగుతారు. అంటే 'కొంచెం విషయాన్ని విడమరచి విస్పష్టంగా ప్రకాశకంగా చెప్పండి' అని దీనికర్థం. ఆంగ్ల భాషలో అయితే " Please enlighten me" అంటారు.

ఏ భాషలో చెప్పినా దీనికంతటికీ మూలమొక్కటే! దీపం ప్రకాశంతో కూడుకొన్నది. శబ్దానికుండే అర్థం మస్తిష్కంలో తటిల్లతలా, లేక దీపంలా వెలుగకపోతే అస్పష్టత, పులుముడు తనం ఏర్పడి వాక్యావగాహన లోపిస్తుంది. దీన్నే భాషాశాస్త్రంలో Syntactical error అంటారు. భర్తృహరి ఈ విషయమై వాక్యపదీయంలో వక్తృవివక్షా (Intention of the Speaker) అనే పేరుతో సుదీర్ఘమైన చర్చచేశాడు.

దీపానికి పేరుగా 'విళక్కు' అని ప్రయోగించే తమిళులు అర్థప్రకాశకత్వానికి కూడ 'విళక్కు' అని వాడడం గమనింపదగింది. ఇక్కడ శబ్దం ప్రకాశింప జేసే అర్థానికీ, దీపం అందించే వెలుగుకీ ఒకే పదం వాడబడింది. అందుకే దాక్షిణాత్యుడైన దండిపండితుడు శబ్దాన్ని జ్యోతిగా పోలుస్తూ కావ్యాదర్శమనే అలంకార శాస్త్రాన్ని ఈ క్రింది శ్లోకంలో ప్రారంభించాడు.

శ్లో॥ ఇద మంధతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారాత్ న దీప్యతే॥

శబ్దమనే జ్యోతియే గనుక ఈ ప్రపంచంలో ప్రకాశింపక పోయివుంటే, మూడు లోకాలు గాఢాంధకారంలో మునిగిపోయివుండేది.

భర్తృహరి వాక్యపదీయ ప్రారంభంలో –

అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్ ।
వివర్తతేర్థ భావేన ప్రక్రియాజగతోయతః ॥

అని చెప్పడంలో కూడ పరబ్రహ్మ యొక్క వివర్తరూపమే శబ్ద బ్రహ్మమనీ, బ్రహ్మతత్త్వ మెలా క్షతి లేనిదో, శాశ్వతమైనదో అలాగే శబ్దతత్త్వం కూడ అక్షరరూపమై, అనశ్వరంగా లోకంలో ప్రకాశిస్తూవుందని స్పష్టీకరించాడు. అంతే కాదు, శబ్ద బ్రహ్మణినిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి' అని శబ్ద బ్రహ్మను తెలుసుకున్నవాడు పరబ్రహ్మను చేరుకుంటున్నాడన్నాడు.

ఆనందవర్ధనుడు వ్రాసిన ధ్వన్యాలోకంలోని పరిచ్ఛేదాలకు 'ఉద్ద్యోతము' అని పేరు. ద్ద్యోత' మంటే ప్రకాశం (illumination) అని అర్థం. శబ్దగత వ్యంజకతా శక్తి చేత గర్భితమైన ర్థం రహస్యంగా శ్రోత హృదయంలో ప్రకాశిస్తుంది. అంటే ఉద్ద్యోతనం జరుగుతూ వుంది. ఏ వక్త- శ్రోతల మధ్య నిత్యమూ జరిగే ప్రక్రియ! దీన్ని ఉద్దేశించియే ఆనందవర్ధనుడు ఉద్ద్యోత నే పేరు ఎన్నుకున్నాడు. జైన పండితులు గొప్ప తార్కికులు. జైన పండితుల్లో ఉద్ద్యోతన గారి ప్రసిద్ధుడు. అలాగే బౌద్ధ గ్రంథాలలో ఉద్ద్యోతనమనే శబ్దం విరివిగా వాడబడింది. ఆ భావంతోనే ఆనందవర్ధనుడు ఈ మాటను వాడాడు. శాంతరసానికి స్థాయిభావంగా నందవర్ధనుడు ప్రతిపాదించిన 'తృష్ణాక్షయసుఖ'మనే మాట బౌద్ధుల ధమ్మపదం తణ్హావగ్గం - 22) నుండి ఎరవు తెచ్చుకొన్నదే! అభినవ గుప్తుడు అత్యంత అభినివేశంతో ఈ స్థాయిభావాన్ని లోచనవ్యాఖ్యలో సమర్థించాడు.

## బౌద్ధుల తాంత్రిక వాఙ్మయము - వజ్రయానము

''మహాయానమున పౌరాణిక బౌద్ధదేవతా సంఖ్య యధికమయి, యాదేవతలకు పూజావిధియు, స్తోత్రాదికములును అతిశయిల్లుటతో మంత్ర, తంత్రాదికములు కూడ తావు ల్పించుకొనినవి. వీనికి మూలములయిన తాంత్రికాభిప్రాయములు మహాయాన ప్రారంభమున నుండియు అందు అవ్యక్తముగ నుండి కాలక్రమమున సువ్యక్తములయి బౌద్ధము హొందిన తరువాతి పరిణామముగు **'వజ్రయానము'** న విధి విహితముగ పరిద్యోతితములయినవి.

ఆంధ్ర దేశమునందలి మహాసాంఘికుల మహాయాన బౌద్ధము నందలి గొప్ప పరిణతి హొందిన బౌద్ధదర్శనము **మాధ్యమిక** వాదమనుపేర వికసించినది. ఈ వాదమును బ్రతిపాదించిన వాడు బౌద్ధశ్రావకుడయిన **యార్యనాగార్జునుడు.** మాధ్యమికవాద ప్రవర్తకుడితడే. క్రీ.పూ. మొదటి శతాబ్దము నుండి క్రీ.శ. మూడవ శతాబ్ది వరకు ఈతని కాలన్నిర్ణయములో వివిధ మతభేదములున్నవి. క్రీ.శ. 2వ శతాబ్ది వాడనుట సర్వజన సమ్మతము.

తాంత్రికపద్ధతి ప్రబలిన యీ కాలమున కూడ ఈ ధాన్యకటకము ప్రాధాన్యము వహించుట చేత కానోపు, నిది దక్షిణాపథమున తంత్రప్రతిష్ఠాపనములకు చాలా ప్రసిద్ధికెక్కినదని టిబెట్టు దేశ బౌద్ధ గ్రంథములు నుడువుచున్నవి. 'దశబలు' డను బౌద్ధ సాధువు శ్రీ ధాన్యకటక చైత్యము కడ తంత్రముల కొన్నిటిని చేర్చెనట. **'మాతృతంత్ర కాలచక్ర'** మీ ధాన్యకటక చైత్యము కడకు చేర్పబడినదనియు, నిచట బుద్ధుడు **'కాలచక్ర'** మను ధ్యానసమాధిని గూర్చుండిన

చోట 'వజ్రపాణి' యను బోధిసత్త్వుడు దివ్యమైన రమ్యహర్మ్యమును ఆశ్చర్యకరముగ తమ మహిమ చేత నిర్మించెననియు, టిబెత్తు బౌద్ధతంత్ర గ్రంథములందు గలదు. ఈ గ్రంథముల యాధారముననే నాగార్జునున కిచట 'మహాకాలతంత్రము' లభించినదని తెలియుచున్నది. పూర్వోక్త గాథల యాథార్థ్యమెటులున్నను ధాన్యకటకమునకు తాంత్రిక బౌద్ధముతో సంబంధము కలదను విషయము నవి స్థిరపరుప గలవు. అని మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు అమరావతీ స్తూపమను గ్రంథమున వ్రాసిరి.[50]

బౌద్ధతంత్రమున 'తార' అనబడు తాంత్రికదేవతల సమాహారమొకటి కలదు. అందు 'మహాచీనాతార' 'ఉగ్రతార' అను పేర్లు గలిగినవి ప్రసిద్ధమైనవి. ఇవి 'అక్షోభ్య' మను దేవతాసంసర్గముచే నుత్పన్నమైనవి. శాక్త తంత్రములలోనిది సుప్రసిద్ధము. ఇందలి 'ఏకజటా' యను శక్తిని సిద్ధ నాగార్జునుడు టిబెట్టు నుండి భారత దేశానికి తెచ్చినాడని తెలియుచున్నది. ఇంతకూ 'తారా' సమాఖ్యలోని తాంత్రిక దేవతల పేర్లివి. ఖర్జుబనితార, మహాశ్రీతార, ధనదతార, సితాతార.

'బౌద్ధ తాంత్రిక శక్తియైన తార – టిబెట్టు, చైనా దేశములలో అత్యంత ప్రసిద్ధి పొందినా హిందువుల మహావిద్య పైదాని ప్రభావము లేదు.' అని శరభేశ్వర శతపథిగారు స్పష్టీకరించినారు.

## తాంత్రిక శ్రీచక్రము

తనోతి విపులానర్థాన్ తత్ర మంత్ర సమన్వితాన్।
త్రాణం చ కురుతే యస్మాత్ తంత్ర మిత్యభిధీయతే॥



మొహంజొదారో శిథిలావశేషాలలో మాతృదేవత ( Mother Goddess) యొక్క
తిమలు లభించినవి. దానిని గురించి శరభేశ్వర శతపథి యిలా వ్రాస్తున్నారు.

"At Mohenjodaro we come across deities in the form of male and
male generative organs. It has therefore aptly been told that the origin of
e **Tantric Yoni cult** is deeply ingrained in this Pre-historic substratum of
e Hindu religion of the 3rd millenium B.C."

" The **Tantric Srichakra** is nothing but the representation of the female
neratine organ. The word tantra is derived from the root 'tan' meaning 'to
read' ' to multiply'.[51]

'తారాకవచము' లో భుక్తి ముక్తికరం సాక్షాత్కల్పవృక్షస్వరూపకమ్' అని చెప్పబడినది.

## శ్రీ శంకరులు శ్రీ విద్యోపాసకులు

శ్రీ శంకరులు అద్వైతమత ప్రవర్తకులు. ఆయనను 'ప్రచ్ఛన్న బౌద్ధుడని' 'మాధ్యమికస్య
రావతారః' అని ద్వైతార్యులు నిందించుటలో ఆయన మాయావాదాన్ని స్థాపించినాడని
ు, శంకరులు శ్రీవిద్యోపాసకులై 'సౌందర్యలహరీ' యిత్యాది శ్రీ విద్యోపాసనకు చెందిన
త్రగ్రంథములు రచించుటయేనని నా అభిమతము. శంకరుల కాలము నాటికి తంత్రము
ాళ వ్యాప్తిలోనికి వచ్చినది. మాధ్యమికవాద ప్రవర్తకుడు నాగార్జునుడు.

''శ్రీ మద్రామాయణ కల్పవృక్షములో అద్వైతాన్నీ శ్రీ విద్యనూ రెండింటినీ స్థాపించిన
ునాథ సత్యనారాయణ గారు యిట్లు వ్రాసినారు. ''అద్వైతమునకు శ్రీవిద్యకు నెట్లు
ుగును? రెండు నొకటియే. ఇది మంత్రశాస్త్రములోని రహస్యము.''[52]

## 'వర్ణరూపాత్మికాదేవి'

**ఆధారే లింగనాభౌ హృదయసరసిజేతాలు మూలే లలాటే**
**ద్వైపత్రేషోడశారే ద్విదళ దశదళే ద్వాదశార్ధేచతుష్కే ।**
**ఫాలామధ్యే డఫకర సహితే కంఠమధ్యే స్వరాణాం**
**హంక్షాం తతార్థయుక్తం సకల దళశతం వర్ణరూపం నమామి॥**

అని'షట్చక్ర నిరూపణము' లోని శ్లోకము. 'శబ్ద బ్రహ్మము' సకల జీవరాశులలో
ుండలిని' గా రూపెత్తుచున్నదని 'శారదాతిలకము' నందు చెప్పబడినది.

**చైతన్యం సర్వభూతానాం శబ్దబ్రహ్మేతి మే మతిః**
**తత్ ప్రాప్యేయ కుండలీ రూపం ప్రాణినాం దేహమధ్యగమ్**
**వర్ణాత్మనాభిర్భవతి గద్య పద్యాది భేదతః''**

కుండలిని, మహామాతృకాసుందరీ స్వరూపిణిగా 51 చుట్లు చుట్టుకొని యున్నది. 'మాతృక' లనగా స్థూలాక్షరముల యొక్క సూక్ష్మమంత్రవర్ణ స్వరూపము.




మూడున్నర చుట్లు చుట్టుకొన్నప్పుడే ఆమె సృజనాత్మక శక్తియై మూలాధారచక్రమందు అధివసించియున్నది. నాలుగు చుట్లు కలిగియున్నప్పుడు దేవీ ఏకజటా అని పిలువబడుచూ '**మహావిద్యా మహానీల సరస్వతీ**' గా గుర్తింపబడినది. '**శక్తిసంగమ తంత్రము**' లో కుండలిని పది చుట్లు చుట్టుకొనబడి యున్నప్పుడు '**దశమహావిద్య**' యని పిలువబడునని చెప్పబడినది.

తంత్రశాస్త్రము వర్ణములు, శబ్దములు శక్తియొక్క వివిధ రూపములని అంగీకరించుచున్నది.

**కుండలిని → శక్తి → ధ్వని → నాద → నిరోధికా → అర్ధేందు → బిందు → పరా → పశ్యంతీ → మధ్యమా → వైఖరీ.**

ఈ విధంగా దశవిధ శబ్దాకృతులను కుండలిని ధరించుచున్నది. "Thus **Dhvani** is a subtle casual principle and not a gross manifestation of **Sabda. Madhyama** is subtle state of **Sabda** which comes from **Para** and **Pasyanti**. **Para** and other **sabdas** are located in various **Yogic Chakras** as mentioned by Raghava Bhatta."[53]

శిరోరః కంఠతాలుస్థా శిరోఘ్రాణరదస్థితా।
జాహ్వామూలోష్ఠ నిః సృత సర్వవర్ణ పరిగ్రహా
శబ్ద ప్రపంచ జననీ శ్రోత్ర గ్రాహ్యాస్తు వైఖరీ।

' Kundalini Sakti is not a mystic thought as the basis of Yoga is essentially 'ational."[54] అని శరభేశ్వర శతపథి నిష్కర్షించినారు.

## తంత్రశాస్త్రము - ఆజ్ఞాచక్రము - త్రివేణి

" The **Ida** and **Pingala nadis** are the left and right sympathatic cords crossing central column **Susumna** from one side to the making a three fold knot called **Triveni** of the **Ajna Chakra.** This is the spot known as medulla in physiological science where the sympathetic cords join together and when they take their origin."[55]

''శ్రీసుబ్రహ్మణ్య సహస్రంలో - షట్కోణ మధ్య నిలయాయనమః, షట్క్రమాయనమః అన్న జంట నామములున్నవి. త్రివిక్రముడు వామనుడైనాడు. ఇది సృష్టి. వామనుడు త్రివిక్రముడౌతాడు. ఇది ముక్తి. రెండూ యజ్ఞమే. కలిసిన మహాయజ్ఞం షట్క్రమాత్మకం.''

''షట్చక్రాలు షట్క్రమ సూత్రమే. ఆజ్ఞ నుండి క్రిందనున్న ఐదు చక్రాలు పంచభూతాలు. ఆజ్ఞ మహత్తత్త్వం ఆ + జ్ఞ = **పూర్ణజ్ఞానం లేక విరాట్పురుషుడు.** సప్తమ చక్రం సహస్రారం. శివపార్వతీ ద్వంద్వస్థానం. బైందవం ( విష్ణువునకు సువర్ణబిందువని నామం ) ఈ సప్తమ బిందువు సృష్టిగా వికసించిన సూత్రం షట్క్రమం. ఆ మెట్లే షట్చక్రాలు. ఎక్కటానికీ అవే మెట్లు. దిగటానికిన్నీ.''

''ఆజ్ఞయే - విజ్ఞానమని ఉపనిషద్విద్య. ఇది శ్రీ అరవిందులు ఈశావాస్యోప నిద్భాష్యములో చెప్పారు. **క్రింద నున్న ఐదు చక్రాలైన పంచభూతాలను సహస్రారంతో బంధించేది ఆజ్ఞాచక్రమే!** ఇదే కుంతమంటే. జ్ఞానమే కుంతం. దీనికి 'శక్తి' అన్న పేరుంది! ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులే శక్తి! పరమేశ్వరుని ఆంతర శక్తినే కుంతాయుధంగా ధరించాడు సుబ్రహ్మణ్యుడు. ఇది ఆజ్ఞాచక్రవిషయం! అని వ్రాశారు ఆచార్యతుమ్మపూడి కోటీశ్వరరావు గారు 'కుమారభారతీ' కావ్యపీఠికలో.[56] శ్రీ శరభేశ్వర శతపథిగారు 'దశమహావిద్యా' అనే గ్రంథంలో బౌద్ధుల హీనయాన, మహాయానాల్లోని దశవిధ భూమికలు, దశమహావిద్యలతో సామ్యాన్ని వహిస్తున్నాయని చెప్పారు గాని అది అంగీకరించడానికి వీలులేదు. బౌద్ధతంత్రము నుండి దశమహావిద్య పుట్టలేదు. స్ఫూర్తినీ పొందలేదు. అని చెప్పినవీరే ఈ సామ్యాన్ని చెప్పడం వింతగా ఉంది. ఈ రెంటికీ పొంతన కుదరదని వేరుగా చెప్పవలసిన పని లేదు.

ఆజ్ఞాచక్రమే త్రివేణి – ''శాస్త్రముున ప్రయాగయన్న దొకరహస్యాభిజ్ఞ! ప్రయాగ లేక త్రివేణీ సంగమము అనునది భ్రూమధ్యమున నుండు ఆజ్ఞాచక్రమునకు సంకేతము. జీవునకు, సాధకునకు ''**ఇతః పరం కర్తవ్యమిత్యేవమ్**'' అన్న ఆజ్ఞ భగవంతుని నుండి లభించును గాన ఆజ్ఞాచక్రము మరియు నిది పరమాత్మకధిష్ఠానము నగుటచే సాధనాది విషయములందు నిశ్చయజ్ఞానమిటనుండియే కలుగుచున్నది.''[57]

## తాంత్రికోపాసన లోని సప్తవిధ ఆచారములు – యోగవాసిష్ఠములోని సప్తవిధజ్ఞాన భూమికలు

కుల్ణార్ణవతంత్రములో సాధకునికి సంబంధించిన సప్తవిధాచారములు ఉల్లేఖింపబడినవి. 1) వేదాచారవము, 2) వైష్ణవాచారవము, 3) శైవాచారవము, 4) దక్షిణాచారవము, 5) వామాచారము, 6) సిద్ధాంతాచారము, 7) కౌలాచారము. వీటిలో –

| | |
|---|---|
| వేదాచారము | – కాయమనశ్శుద్ధులకు |
| వైష్ణవాచారము | – భక్తికి |
| శైవాచారము | – జ్ఞానమునకు |
| దక్షిణాచారము | – పై మూడు దశల సమీకరణానికి |
| వామాచారము | – సన్యాసమునకు |
| సిద్ధాంతాచారము | – సాధకుడు ఒక నిశ్చయ జ్ఞానమునకు ధ్యేయమునకు దృష్టిని లగింపజేయడానికి |
| కౌలాచారము | – నిశ్చయజ్ఞానముతో కౌలము యొక్క ఆఖరిదశకు చేరడం. |

ఈ పై సప్తవిధాచారములను మూడు దశలుగా వింగడించినారు. ఎ) వేద, వైష్ణవ, శైవ – పశుభావదశ, బి) దక్షిణ, వామ – వీరభావ దశ, సి) సిద్ధాంత, కౌల – దివ్యభావ దశ.

పరశురామ కల్పసూత్రము – మొదటి ఐదు దశల వరకు గురువు యొక్క మార్గదర్శిత్వము ఉండాలని, ఆ తర్వాత సాధకుడు తన యిష్టానుసారము మార్గాన్వేషణ, సాధన చేయువచ్చునని తెలిపింది.

యోగవాసిష్ఠమును గూర్చి విడిగా పరిశీలింపబడుతుంది కాబట్టి యిక్కడ సంక్షిప్తముగా పోలికలు, భేదాలు మాత్రం చెప్పబడుతుంది. యోగవాసిష్ఠములో చెప్పబడిన సప్తవిధజ్ఞాన భూమికలు తాంత్రికోపాసనలోని సప్తవిధాచారములతో చాల సన్నిహితత్వము గలిగియున్నవి. ఆ భూమికల పేర్లివి - 1) వివిదిషా లేక శుభేచ్ఛా 2) విచారణా 3) తనుమానసా 4) సత్త్వాపత్తి 5) అసంసక్తి 6) పదార్థభావినీ 7) తురీయా.

"The difference between the **acaras** of the **Tantra** and the **Jnana bhumikas** of **Yogavasista** is that in the former the aspirant reaches Jnana through the path of **bhakti**, (వైష్ణవచార) whereas in the latter path of dry ratiocination, the stage of **tanumanasa** (bhakti) comes to him when, after passing through a number of insurmountable difficulties, he finds that without **bhakti** he can make no further progress." [58]

## యోగవాసిష్ఠము - జ్ఞాన, అజ్ఞాన భూమికలు

## విజ్ఞాన భైరవము - సమగ్ర భారతీయ యోగ శాస్త్రము

భారతీయ వేదాంత వాఙ్మయంలో యోగవాసిష్ఠానికి ఒక విశిష్టస్థానమున్నది. ఈ గ్రంథంపైన డా॥ భీఖన్‌లాల్ ఆత్రేయ గారు ప్రశంసనీయమైన కృషిచేశారు. వారి పరిశోధనలవల్ల ఈ గ్రంథం క్రీ.శ. 7వ శతాబ్ది ప్రారంభంలో రచింపబడిందని తేలింది. డా॥ ఎస్.ఎన్.దాస్ గుప్త గారు 'భారతీయ దర్శన ఇతిహాసం' రెండవ సంపుటంలో యోగవాసిష్ఠాన్ని గూర్చి వ్రాస్తూ ఈ గ్రంథం వ్రాసిన వారు గౌడపాదులో లేక శ్రీ శంకరుల సమకాలికులో అయివుంటారని బహుశః క్రీ.శ. 8వ శతాబ్ది ప్రాంతాలలోనే ఒక శతాబ్దంగా ఈ గ్రంథం బహుళప్రచారంలో ఉండినదని తెల్పారు. ఆధునిక పరిశోధకులు, ప్రాచీన విద్వాంసులందరు యోగవాసిష్ఠాన్ని వేదాంత గ్రంథంగా నిష్కర్షించి చెప్పారు.

**బౌద్ధవిజ్ఞానవాద ప్రభావం** - డా॥ దాస్‌గుప్తగారు యోగ వాసిష్ఠంపైన బౌద్ధ విజ్ఞానవాద ప్రభావముందని చెప్పారు గాని శైవదర్శనం యొక్క స్పంద లేక ప్రత్యభిజ్ఞాశాఖతో దీనికి గలసంబంధాన్ని చర్చించలేదు. ప్రాణ విషయ ప్రసంగంలో మాత్రం ఆయన శివసూత్ర విమర్శినీ, విజ్ఞానభైరవ వివృతి గ్రంథాలను తప్పక ఉటంకించారు.

**యోగవాసిష్ఠానికే మరోపేరు మోక్షోపాయము :-** 'మోక్షోపాయ' మనునది యోగవాసిష్ఠానికి నామాంతరం. విజ్ఞానభైరవం వలెనే యోగవాష్ఠింలో కూడా బంధమోక్షముల యొక్క పరమార్థసత్తా ఒప్పుకొనబడలేదు. వస్తుతః ఈ గ్రంథం పైన మాలినీవిజయం (ఇది అభినవ గుప్తుని ప్రకారం త్రిక లేక ప్రత్యభిజ్ఞాదర్శనం యొక్క ఆధార గ్రంథం), విజ్ఞాన భైరవం, స్పందకారికా, ప్రభృతి గ్రంథాల యొక్క స్పష్టమైన ప్రభావమున్నది. స్పందకారికలోని ప్రథమ శ్లోకం లోని ప్రథమపంక్తి ఈ గ్రంథంలో అనేక చోట్ల ఆవృత్తినందినది. ఈ గ్రంథంలోని ఉపశమప్రకరణంపై విజ్ఞానభైరవం యొక్క ప్రభావం విశేషించి ఉంది.

స్పంద, సమతా, పౌరుషప్రయత్న, (జ్ఞాన లేక శక్తి) బంధమోక్షములు, ప్రబుద్ధ, సంప్రబుద్ధ, అప్రతిబుద్ధ, కలంకాంక, సత్తాసామాన్య, ఉచ్చూన, చిదగ్ని, మహాసత్తా, చిదర్క, భరితాత్మత, శక్తిపాత, బ్రహ్మసత్తా, జీవన్ముక్తి, పుర్యష్టక మొదలగు శబ్దాల యొక్క వ్యాఖ్య పూర్తిగా కాశ్మీరశైవ పరిభాషలననుసరించియే యున్నది.

ఈ ప్రకారం యోగవాసిష్ఠం యొక్క సాఫల్యం అనుపాయప్రక్రియ (సహజయోగము) ను ప్రతిపాదించుటలో నున్నది. తంత్రశాస్త్రంలో శాస్త్రం, గురువు, స్వయం ప్రతిభతో జ్ఞానప్రాప్తి అవుతుందని చెప్పబడింది. కాని యోగవాసిష్ఠంలో యిలా చెప్పబడింది -

**శాస్త్రార్థే ర్బుధ్యతే నాత్మా గురోర్వచనతో నచ ।**

**బుధ్యతే స్వయమే వైష స్వబోధవశతః స్వతః ॥**

- నిర్వాణప్రకరణం-పూర్వార్ధం (**41-14**)

శాస్త్రము లేదా గురువు యొక్క వచనంతో ఆత్మజ్ఞానము కలుగదు. ఆత్మజ్ఞానం స్వయంగా తనదైన బోధ (intuition) వల్లనే కలుగుతుంది. ఈ విధమైన నిర్ణయాలే ఈ గ్రంథాన్ని సర్వోత్తమస్థానంలో ఉంచగల్గాయి. భాగవతపురాణంలో శ్రీకృష్ణుడు నిర్యాణానికి ముందు ఉద్ధవునితో ''ఏవడికివాడే గురువు'' అనే రహస్యాన్ని చెప్పాడు.

## యోగవాసిష్ఠము - అజ్ఞానభూమికలు [59]

యోగవాసిష్ఠము శ్రీరామ వశిష్ఠసంవాద రూపముగానున్నది. శ్రీరాముడడిగిన ప్రశ్నలకు వశిష్ఠమహర్షి సమాధానములు చెప్పును. ఉత్పత్తి ప్రకరణము, **117**వ సర్గలోని విషయమిది.

కీదృశో భగవన్ యోగ భూమికాః సప్తసిద్ధిదాః।
సమాసేనేతి మే బ్రూహి సర్వతత్త్వవిదాం వర ॥

ఓ మహాత్మా! బ్రహ్మవిద్వరా! మోక్షసిద్ధిని చేకూర్చునట్టి సప్తజ్ఞాన భూమికలెవ్వియో సంగ్రహముగ తెలియజేయుము.

అజ్ఞాన భూః సప్తపదాజ్ఞ భూః సప్తపదైవహి ।
పదాంత రాణ్యసంఖ్యాని భవంత్య న్యాన్యథైతయోః ॥

ఓ రామా! అజ్ఞాన భూమిక లేడును, జ్ఞాన భూమిక లేడును గలవు. ఇంకను వీనికి అవాంతర భేదము లెన్నియో గలవు.

స్వయత్న సాధక రసా న్మహాసత్తా భరోన్నతేః ।
ఏతే ప్రతిపదం బద్ధమూలే సంఫలతః ఫలమ్ ॥

స్వాభావిక ప్రవృత్తి రూపమగు పురుషయత్నము, విషయభోగములందు దృఢమగు నాసక్తియను నీ రెండును అజ్ఞాన భూమికా స్థితి కసాధారణ హేతువులు. అధిష్ఠానమగు బ్రహ్మసత్తకధీనమగు నాత్మ లాభ ప్రాప్తి రెంటికిని సాధారణ హేతువగును. ఈ హేతువులచే నీ ద్వివిధ భూమికలును, క్రమముగ దృఢపడుచు తమకు యోగ్యమగు సంసారస్థితిని, దుఃఖమును; దుఃఖవిముక్తి రూపమగు నిరతిశయానంద ప్రాప్తియును ఫలమును గల్గింపజేయుచున్నవి. అధోలోకము లేడును ఉత్తరోత్తరముగ అధిక దుఃఖమయములు. ఊర్ధ్వలోకము లేడును అధికసత్త్వజ్ఞానమయములు.

స్వరూపావస్థితి ర్ముక్తిః తత్ భ్రంశోऽహంత్వ వేదనమ్।
ఏతత్సంక్షేపతః ప్రోక్తం తజ్ఞత్వా జ్ఞత్వ లక్షణమ్॥

శుద్ధమగు ఆత్మ స్వరూపమందు స్థితి పొందుటయే ముక్తి, జ్ఞానము. అట్టి స్వస్వరూపస్థితి నుండి తొలగి బాహ్యవిషయప్రవృత్తి గల్గి దేహాదులం దహంభావనను పొందియుండుటయే అజ్ఞానము. ఇది దుఃఖహేతువగును. ఇదియే జ్ఞాన, అజ్ఞాన భూమికల సంక్షిప్త లక్షణములు.

**సప్తవిధ అజ్ఞాన భూమికలు** : - 1) బీజజాగ్రత్తు, 2) జాగ్రత్తు, 3) మహాజాగ్రత్తు, 4) జాగ్రత్స్వప్నము, 5) స్వప్నము, 6) స్వప్నజాగ్రత్తు, 7) సుషుప్తి

**1) బీజజాగ్రత్తు** : జాగ్రదవస్థ యొక్కయు, సుషుప్త్యంతము యొక్కయు అజ్ఞానోపహితమగు చైతన్యస్థితియే బీజజాగ్రత్తనబడును.

**2) జాగ్రత్తు :** నవ్యోత్పన్న బీజ జాగ్రత్ స్థితికి పూర్వము 'ఈస్థూలదేహము నేను, ఈ భోగ్యపదార్థములు నావి' యనునట్టి ప్రతీతియే జాగ్రత్తనబడును.

**3) మహాజాగ్రత్తు :** ఈ జన్మమందు గాని, లేక పూర్వజన్మమందు గాని గావింపబడిన యభ్యాసముచే దృఢపడిన సంస్కారములచే స్ఫురించు జాగ్రత్ స్థిత్యనుభవమే మహాజాగ్రత్తనబడును.

**4) జాగ్రత్స్వప్నము :** అభ్యాసాభావము చేగాని, అదృఢాభ్యాసముచే గాని కల్గు జాగ్రత్ స్థితి యందలి మనోరాజ్యమే జాగ్రత్స్వప్నమనబడును.

**5) స్వప్నము :** నిద్రామధ్యమున గాని, నిద్రాంతమున గాని, నిద్రయందుగాని యనుభవించిన పదార్థమును గూర్చి 'నేను దానిని స్వల్పకాలము మాత్రము గాంచితిని. కాని అయ్యది అసత్యము గాదు' అను నీయనుభావమునకు హేతువగునదియే స్వప్నమనబడును.

**6) స్వప్నజాగ్రత్తు :** చిరజాగ్రదభావముచే, అవికసితమును, మహచ్ఛరీరయుతమును, దృఢాభిమానముచే గాని, చిరకాలస్థాయిత్వ కల్పనచే గాని, జాగ్రద్రూపముగ వృద్ధినొందినదియు, మహాజాగ్రత్ స్థితిని పొందినట్టిదియు నగు స్వప్నము స్వప్న జాగ్రత్తని చెప్పబడును.

**7) సుషుప్తి :** పైన తెల్పిన అరవస్థితిని పొందిన జీవుని యొక్క జడత్వస్థితి, భావికాలమున దుఃఖమును గలుగజేయు వాసనలచే పూర్ణమైయుండి సుషుప్తియనబడును. ఈ యవస్థ యందు తృణ, లోష్ఠ, శిలాది, పరమాణుమయ వస్తువులవలె జీవుడు జడరూపమున నుండును.

## సప్తవిధ జ్ఞానభూమికలు

వదంతి బహుభేదేన వాదినో యోగభూమికాః ।
మమత్వభిమతా నూన మిమా ఏవశుభప్రదాః ॥

భిన్న భిన్న మతవాదులీ జ్ఞానభూమికలను భిన్న విధములుగ వర్ణించుచుందురు. కాని సిద్ధిప్రదములగు నివియే నాకు ప్రియములగును.

అవబోధం విదుర్ జ్ఞానం తదిదం సప్తభూమికామ్ ।
ముక్తిస్తు జ్ఞేయ మిత్యుక్తం భూమికా సప్తకాత్పరమ్ ॥

అఖండమగు స్వాత్మాకారవృత్తియందారూఢమగు బ్రహ్మము అజ్ఞాన నివర్తకమగుట జేసి యీసప్తవిధభూమికలే జ్ఞానమున్ను, వానికి పరమగు ముక్తి జ్ఞేయమున్ను నగును.

సత్యావ బోధోమోక్షశ్చైవేతి పర్యాయ నామనీ।
సత్యావబోధో జీవోఽయం నేహ భూయః ప్రరోహతి॥

సత్యస్వరూపుడగు పరమాత్మను గూర్చిన జ్ఞానము, మోక్షము ఈ రెండును పర్యాయవాచకములే యగును. అట్టి సత్యవస్తు జ్ఞానమెవడు పొందునో యాతడీ సంసారమున మరల జన్మింపడు.

**ఆత్మజ్ఞానము యొక్క -**

| | | |
|---|---|---|
| ప్రథమ భూమిక | - | శుభేచ్ఛ |
| ద్వితీయ భూమిక | - | విచారణ |
| తృతీయ భూమిక | - | తను మానస |
| చతుర్థభూమిక | - | సత్వాపత్తి |
| పంచమ భూమిక | - | అసంసక్తి |
| షష్ఠ భూమిక | - | పదార్థాభావని |
| సప్తమ భూమిక | - | తుర్యగ |

ఈ సప్తభూమికల యంతమున ముక్తిస్థితమై యున్నది. అద్దానిని పొందినచో నిక జీవుడు దుఃఖమును పొందనేరడు.

**1) శుభేచ్ఛ** - ఇంకను మూఢుని వలె నుండనేల? శాస్త్రములను బరికించెద, సజ్జనులగు మహాత్ముల దర్శించెద నను నిట్టి వైరాగ్యపూర్వకమగు సత్సంకల్పమే శుభేచ్ఛయని విజ్ఞులు పలుకుదురు.

**2) విచారణ** - శాస్త్ర సజ్జన సంపర్కముచే వైరాగ్యమందును, అభ్యాసపూర్వకముగ నొనర్పబడు శ్రవణమననాది రూపమగు సదాచారమందును కల్గు ప్రవృత్తియే విచారణ యనబడును.

**3) తనుమానస** - విచారణ, శుభేచ్ఛలచే గల్గు శబ్దస్పర్శాదులందలి యనాసక్తియే నిదిధ్యాసన రూపమగుటచే 'తనుమానస' యనబడును.

**4) సత్వాపత్తి** - పై మూడు భూమికలను అభ్యసించుచురాగా బాహ్యవిషయముల నుండి చిత్తము మరలి విరామము చెంద అట్టి విరతి స్థైర్యముచే మాయయు, అద్దాని కార్యరూపమగు అవస్థాత్రయబంధమును తొలగ, సర్వాధిష్ఠాన సన్మాత్రరూపమగు ఆత్మయందు స్థితిగల్గి యుండుటచే సత్వాపత్తియనబడును.

సత్వమగు ఆత్మయందు స్థిరుడై యుండుటబట్టి యిది సత్త్వాపత్తి యనబడినది. ఇయ్యది నిర్వికల్పసమాధి రూపమగును. ఈ భూమిక యందుండు వివేకి 'బ్రహ్మవిత్' అని పేర్కొనబడును.

5) **అసంసక్తి** – ఈ నాల్గు భూమికలను లెస్సగ నభ్యసించుట చేత బాహ్యాభ్యంతర విషయములచే గాని తద్గత సంస్కారములచే గాని స్పృశింపబడకయుండ, అసంగరూపమగు సమాధి పరిపాకముచే వృద్ధి నొందిన నిరతిశయానందరూపమగు బ్రహ్మాత్మభావన గల అనగా ఆత్మసాక్షాత్కారము గల్గి యుండు నట్టిస్థితియే 'అసంసక్తి' యని చెప్పబడును. ఈ భూమిక యందుండు జ్ఞాని **బ్రహ్మవిద్వరుడ**నబడును.

6) **పదార్థా భావన** – ఈ యైదు భూమికలను బాగుగ నభ్యసించుటచే నుపరతి గల్గి సదా ఆత్మారాముడై బాహ్యాభ్యంతర పదార్థము లేవియును భావింపక దేహయాత్ర కొరకు మాత్రము పరప్రయత్నముచే ప్రబోధితుడై ఆయాపదార్థముల గూర్చియించుక భావించు నవస్థ ఆఱవదగు పదార్థా భావన యనబడును. ఈ భూమిక యందు ప్రతిష్ఠితుడగు జ్ఞాని **బ్రహ్మవిద్వరీయు**డని చెప్పబడును.

7) **తుర్యగ** – ఈ యాఱవ భూమికనే చిరకాల మభ్యసించుటచే భేదభావమంతయు నమసిపోవ కేవలము స్వస్వరూపమందు స్థితిని బడయుటచే నేడవదగుతుర్యగ యను భూమికయగును. ఇట్లు జాగ్రదాది త్రివిధావస్థల నుండి విముక్తుడై కేవలము, శివము, అద్వైతమునగు తురీయస్థితి యందు నిలుకడ జెంది యుండు జ్ఞాని **బ్రహ్మవిద్వరిష్ఠు**డనబడును.

ఈ తురీయ స్థితి జీవన్ముక్తులకే సిద్ధించును. విదేహముక్తికి సంబంధించిన దగు **తురీయాతీతస్థితి** దీనికిని పరమైయొప్పును.

ఏ మహాత్ములీ యేడవభూమికను పొందుదురో వారు **ఆత్మారాములన**బరగుదురు. అట్టి వారు బ్రహ్మరూపమగు మహత్పదవి ని ప్రాప్తి నొందిరనియే యెఱుంగుము.

యోగవాసిష్ఠమందే నిర్వాణప్రకరణము 120వ సర్గయందు ఇక్ష్వాకుమను సంవాదరూపమైన ముముక్షుజ్ఞాన భూమికలు ఏడు చెప్పబడినవి. ఇవి పై చెప్పబడిన జ్ఞానభూమికలకు దగ్గరగా నున్నవి. 1) శాస్త్రసజ్జన సంపర్కము, 2) విచారణ, 3) అసంగభావనీ, 4) విలాపినీ, 5) శుద్ధసంవిన్మయరూపా, 6) స్వసంవేదన రూపా, 7) తుర్యావస్థ.

# విజ్ఞానభైరవము - ఆజ్ఞాచక్రము

విజ్ఞానభైరవము యోగవాసిష్ఠము వలెనే క్రీ.శ. 7-8 శతాబ్దముల మధ్యకాలములో వ్రాయబడిన సమగ్ర భారతీయయోగ శాస్త్రము. క్రీ.శ. 8వ శతాబ్దాంత్యములో ఈ రచన జరిగినట్లు దాఖలాలు లభిస్తున్నాయి. ఎట్లనగా, నేత్రతంత్రములోను, యోగవాసిష్ఠము లోను విజ్ఞానభైరవములోని కొన్ని అభిప్రాయాలు ఖండింపబడినందు వల్ల ఈ రెండు గ్రంథాలకంటే ముందే దీని రచన జరిగినదని చెప్పవచ్చును.

భీరూణా మభయప్రదో భవభయాక్రందస్య హేతుస్త తో
హృద్ధామ్ని ప్రథితశ్చ భీరవరుచామీశో ఽంత కస్యాంతకః।
భీరం వాయతి యః స్వయోగి నివహస్తస్య ప్రభుర్భైరవో
విశ్వస్మిన్ భరణాదికృద్ విజయతే విజ్ఞానరూపః పరః ॥

ఇది క్షేమరాజ కృత విజ్ఞానోద్యోతములోని మంగళ శ్లోకము. విజ్ఞాన భైరవములో 112 విధములైన యోగములు చెప్పబడినవి.

తయాఽఽపూర్యాశు మూర్ధాంతం భంక్త్వా భ్రూక్షేప సేతునా।
నిర్వికల్పం మనః కృత్వా సర్వోర్ధ్వే సర్వగోద్గమః॥

"తయా జన్మాది చక్ర క్రమేణ శక్త్యా ప్రాణాఖ్యయా మూర్ధాంతం ద్వాదశాంత మాపూర్య, తథా తమేవ ద్వాదశాంతం భ్రూక్షేప సేతునా భ్రూభేదన క్రమేణ సేతునేవ గురూపదేశయుక్త్యా భఙ్క్త్వా ... " అని వాఖ్య.

కరరుద్ధ దృగస్త్రేణ భ్రూభేదాత్ ద్వారరోధనాత్।
దృష్టే బిందౌ క్రమాల్లీనే తన్మధ్యే పరమాస్థితిః ॥

" ...... భ్రూభేదో భ్రూమధ్యస్థ గ్రంథి విదారణమ్, తస్మాత్
ఏతోర్బిందౌ దృష్టే. క్రమాదేకాగ్రతా ప్రకర్షాత్ సంవిద్గగనే
తస్మిన్ బిందౌ లీనే చ సతి సంవిద్ గగన మధ్య ఏవయోగినః
పరమాస్థితి : పరభైరవాభివ్యక్తిః స్యాత్ ।"

**ధామాంతః క్షోభ సంభూత సూక్ష్మాగ్నితిలకాకృతిమ్ ।**
**బిందుం శిఖాంతే హృదయే లయాంతే ధ్యాయతో లయః ॥**

" ..... సూక్ష్మాగ్ని తిలకాకృతిం నయన రశ్మిరూపం బిందుం
శిఖాంతే ద్వాదశాంతే హృదిచ ధ్యాయతః ।

సమావేశ, సమాపత్తి, సమాధి - ఈ మూడు పర్యాయవాచకాలు. సమావేశ దశలో వ్యక్తి బాహ్యస్వరూపాన్ని మరచి ఇష్టదేవతా స్వరూపంలో లీనమైపోతాడు.

విజ్ఞానభైరవానికి సంస్కృత హిందీ వ్యాఖ్యలు వ్రాసిన పండిత వ్రజవల్లభద్వివేది యిలా వ్రాస్తున్నారు.

''కుండలినీ శక్తికో 'ప్రాణశక్తి' కహోజాతాహై।
యహ్ శక్తీ శరీర్‌మే 'హ' కార రూపీ నాదకే స్వరూపమే
సదా నదనకర్‌తీ రహతీహై। యోగీ అపనే దోనోం కానోం
కో బంద్‌కర్ ఇస్‌కే నదన వ్యాపారకో సున్ సక్‌తాహై।
యహ్ శక్తీ భ్రూమధ్యమే బిందుకే రూప్‌మే నివాసకర్‌తీ
హై। సారే సంసార్‌కే యహీ మంగళమయీ జననీహై।
అపనే తేజ్‌సే ప్రకాశిత ఇస్ బిందురూపశక్తి కా
యోగీ నిత్య దర్శన కర్‌తేహై। ఉస్‌బిందుకే చంద్ర
ఔర్ సూర్య - వామ్ ఔర్ దక్షిణ నేత్రహై।
ఇన్‌కే ఆశ్రయహీన్ కర్ అర్థాత్ విషయోం సే
హటాకర్ యోగీ పరమపద యానీ బ్రహ్మమే ప్రతిష్ఠ హో జాతాహై।''[60]



| సంఖ్య | సప్తకమలాలు | స్థానం | తత్త్వం | తత్త్వకాంతులు | దళములు | వర్ణములు | జ్ఞానేంద్రియాలు | రంగు | మండలాకారం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 | సహస్రారం | శిరస్సు | ఆత్మ | అనంతం | 1000 | 1000 | — | — | — |
| 6 | ఆజ్ఞాచక్రం | భ్రూమధ్యం | మనస్సు | 64 | 2 | హం, క్షం. | చిత్తము<br>మనస్సు | — | బిందువు |
| 5 | విశుద్ధం | కంఠం | ఆకాశం | 72 | 16 | అచ్చులు-16 | వికసనం<br>శ్రవణం<br>శ్రోత్రం | తెలుపు | చక్రం |
| 4 | అనాహతం | హృదయం | వాయువు | 54 | 12 | 'క' నుండి<br>'ఠ' వరకు | సంచలనం<br>స్పర్శం<br>త్వక్కు | వ్యోమం | షట్కోణం |
| 3 | మణిపూరం | నాభి | అగ్ని | 52 | 10 | 'డ' నుండి<br>'ఫ' వరకు | వ్యాపనం<br>రూపం<br>చక్షువు | ఎఱుపు | త్రికోణం |
| 2 | స్వాధిష్ఠానం | లింగస్థానం | జలం | 62 | 6 | 'బ' నుండి<br>'ల' వరకు | సంకోచనం<br>రుచి<br>జిహ్వ | తెలుపు | అర్ధచంద్రం |
| 1 | మూలాధారం | గుదస్థానం | భూమి | 56 | 4 | వ శ ష స | సంయోగం<br>గంధం<br>ఘ్రాణేంద్రియం | పసుపు | చతుష్కోణం |

## మహాపురాణములు - యోగపీఠిక

క్రీ.శ. 7,8 శతాబ్దాలలో తంత్ర గ్రంథముల రచన విజృంభించుచుండగా మరొకవైపు పురాణములు ఆ తంత్ర రహస్యములను కథారూపమున ప్రతిపాదించటం ప్రారంభించినాయి. పద్మపురాణోత్తర ఖండమున వైకుంఠలోక వర్ణనలో యోగ పీఠికనిర్వచనము లభించుచున్నది.

శక్తిరాధార శక్తిశ్చ చిచ్ఛక్తిశ్చ సదాశివా ।
ధర్మాధి దేవతానాంచ శక్తయః పరికీర్తితా : ॥
వసంతి మధ్యమే తత్రవహ్ని సూర్యసుధాంశవః ।
కూర్మశ్చనాగరాజశ్చవైనతేయస్త్రయీశ్వరః ॥
**ఛందాంసి సర్వమంత్రాణి పీఠ రూపత్వమాస్థితాః ।**
**సర్వాక్షరమయం దివ్యం యోగపీఠమితిస్మృతమ్ ॥**
తన్మధ్యేష్టదళం పద్మముదయార్కసమ ప్రభమ్ ।
తన్మేధ్యే కర్ణికాయాంతు సావిత్ర్యాం శుభదర్శనే ॥[61]

సర్వవేద స్వరూపంబును, శుభకరంబును, పాదస్వరూపములైన, ధర్మజ్ఞానైశ్వర్య వైరాగ్యములు గలవియు, ఋగ్యజు స్సామాథర్వణ స్వరూపములను, నిత్యసూరి స్వరూపములునగు నాలుగు పాదములచే నలంకృతమైన సింహాసన మొకటి గలదు. ఆ ధర్మాది దేవతలకు శక్తి, ఆధారశక్తి, చిచ్ఛక్తి సదాశివ యనెడి శక్తి అను శక్తులు గలవు. ఆ సంహాసనమునడుమ సూర్యచంద్రాగ్నులు మండల స్వరూపులైయున్నారు. కూర్మము, ఆదిశేషువు, వేదత్రయ స్వరూపుడగు గరుత్మంతుడు, ఛందస్సులు సమస్త మంత్రములును పీఠరూపము నొందియున్నవి. దాని నడుమ సర్వాక్షర స్వరూపమైన దివ్యమగు యోగ పీఠమొకటి కలదు. దాని యందు బాలసూర్యుని బోలిన తేజస్సుగల ఎనిమిది రేకుల పద్మమున్నది. దాని నడుమ నుండెడి సావిత్రీ స్వరూపమైన 'కర్ణిక' యందు పరమపురుషుడు దేవ దేవుడు లక్ష్మితో సుఖాసీనుడై యున్నాడు.

ఇదే విషయం త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు[62] నందు 'చిన్మయవేదికా', 'ఆనందవేదికా' అని చెప్పుతూ **తత్పద్మకర్ణికాయాం శుద్ధశేషభోగాసన విరాజతే।** అందు ఆదినారాయణుడున్నాడని చెప్పబడింది. ఇదే ఉపనిషత్తులో ఆనందవ్యూహమధ్యస్థమైన ప్రణవ విమానాన్ని వర్ణిస్తూ చిదానందమయ వేదికను, అష్టాక్షరీపద్మవిభూషిత చిన్మయాసనాన్నీ 'ప్రణవకర్ణిక'ను చెప్పడం జరిగింది.

కాబట్టి 'కర్ణిక' యే 'వేదిక' అదే 'పీఠ'ము 'యోగపీఠిక' అని స్పష్టీకరింపబడింది. దేవీ భాగవతమున [63]- పీఠంకృత్వాసవేస్థానే సంస్థాప్యజగదంబికామ్ । అని నారదుడు ఉపదేశించగా - కారయిత్వా శుభం పీఠం స్థాపయిత్వాఽంబికాం శివామ్ । అని రాముడు ఆచరించినట్లు చెప్పబడింది.

**కదళీపుష్పనేత్రం చ భ్రుకుటీ కుటిలం తదా ।**

**నిష్క్రాంతా చ తదా కాళీ లలాట ఫలకా ద్రుతమ్ ॥**

అరటి పూవు వలె ఎఱ్ఱని నేత్రములు, వంపుసొంపులు దిరిగిన కనుబొమలు గల దేవినెన్నుదుటి నుండి మహాద్భుతముగా (శ్రీ) కాళికాదేవి యుద్భవిల్లెను.

(శ్రీ)దేవి భాగవతమున 'సుదర్శనుడ' ను రాజు 'కామరాజ బీజము'ను జపించి తల్లి కృపకు పాత్రుడై 'శశికళ' అనే కన్యను వివాహమాడుట సాంకేతిక విషయము అనగా కుండలినీ యోగ విషయము.

**సుదర్శనేన సాజ్ఞాతా దేవీ సర్వార్థదా శివా ।** ఆ సర్వార్థ ప్రదయగు శివాదేవి సుదర్శనుని చేత గుర్తింపబడినది.

**నాన్యం వరం వరిష్యామి తమృతే వై సుదర్శనం ।** 'ఆ సుదర్శనుని గాక నేనితరుని వరింపజాలను' అన్నది శశికళ. దీని ఆంతర్యమేమనగా, భ్రుకుటిపై దృష్టిని కేంద్రీకరింపగల్గిన వాడే 'సుదర్శన' శబ్దవాచ్యుడౌతాడు. అట్టివానికే **'శశికళ'** స్వాధీనమౌతుంది.

1) వాగ్బీజము → సరస్వతి → హృదయము

2) శాంభవీబీజము → మహాలక్ష్మి → శిరము

3) కామరాజ బీజము → మహాకాళి → శిఖ

**'ఓం ఐం హ్రీం క్లీం చాముండా యైవిచ్చే'** యనునది నవాక్షరమంత్రము.

**మధుకైటభ నాశార్థం యాం తుష్టావాంబుజాసనః ।**

**ఏవం ధ్యాయే న్మహాకాళీం కామబీజ స్వరూపిణీమ్ ॥**

'చాముండాయై' అను నాల్గక్షరములను కవచమున 'విచ్చే'యను రెండక్షరములు నేత్రత్రయమున మొత్తము నవార్ణమంత్రమును అస్త్రమున న్యాసమొనర్పవలెను.

మత్స్యమహాపురాణములో ఆగమశాస్త్రానుబంధియైన అనగా దేవాలయ నిర్మాణములో పిండికా లేక పీఠికా నిర్మాణ లక్షణములు చెప్పబడినవి.[64]

పిండికా లక్షణం వక్ష్యేయథా వదను పూర్వశః ।
పీఠోచ్ఛ్రాయం యథావచ్చభాగాన్ షోడశకారయేత్ ॥

దేవాలయము ద్వారపు ఎత్తును దృష్టియందుంచుకొని పీఠపు ఎత్తును నిర్ణయించుకొనవలయును. దాని ననుసరించి నిర్ణయించుకొనిన పీఠపు మొత్తము నిలువటెత్తును 16 భాగములుగా చేసుకోనవలయును.

పిండికల సామాన్యలక్షణము లేవియనగా - 1) జగతి, 2) కంఠము, 3) వృత్తపటలము, 4) కంఠపట్టము, 5) ఊర్ధ్వపట్టము, 6) పిండికా (పీఠికా) 7) ప్రణాళిక. ఇందులో పీఠికాలక్షణములు వివిధ దేవతలకు వివిధాకారములతో నుండును. పీఠిక ఆకార విశేషములివి - 1) స్థండిలా, 2) వాపీ, 3) యక్షీ, 4) వేదీ, 5) మండలా, 6) పూర్ణచంద్ర 7) వజ్రా, 8) పద్మ, 9) అర్ధచంద్ర, 10) త్రికోణ.

యస్య దేవస్య యాపత్నీ తాం పీఠే పరికల్పయేత్ ।
ఏతత్సర్వం సమాఖ్యాతం సమాసాత్పీఠ లక్షణమ్ ॥

ఏ దేవుని పత్ని ఎవరో ఆ దేవి రూపము ఆ దేవుని పీఠమునందు రూపొందించవలెను. ఇది దేవాలయమందలి దేవతాపీఠ లక్షణ సంక్షేపము.

## మత్స్యపురాణము - నక్షత్రవీథీపథము నుండి యజ్ఞవేదికా రూపనిష్పాదనము

మత్స్యమహాపురాణమున (అధ్యా 122 శ్లో. 49-61) చెప్పబడిన విధమున నక్షత్రవీథీ - పథ విభాగము చేయుటచే దేవయాన, పితృయానములు రెండును రెండు ప్రక్కల నుండగా నడుమ మరల రెండు వైపులను సర్వప్రాణి సాధారణమగు మధ్యమ మార్గముండును. వీని విభాజక బిందువులను కలుపగా యజ్ఞవేదీ రూపము ఏర్పడును. [65]




యజ్ఞవేదీస్వరూపనిష్పాదనము

దీని యర్థము ఇట్లు చెప్పుకొనవచ్చును. యజమానుడు యజ్ఞమాచరించుటకై కూర్చుండగా అతని ఎదురుగా అగ్నిహోత్రుడుండును. అతనికి ముందు వెనుకలును మధ్యమయానమును కుడి ఎడమలందు దేవయాన, పితృయానములున్నవి.

ఇట్లు మన ప్రాచీన ఋషులు యజ్ఞవేదికా రూపకల్పనమును ఈ నక్షత్రవీధీ వ్యవస్థతో ఏర్పడిన దేవయాన పితృయాన, మధ్యమయాన వ్యవస్థ నుండియే నిష్పాదన మొనర్చిరని తెలియుచున్నది.''

## గోవిందభిక్షువు - రసహృదయతంత్రము [66]

అఖిల భారతీయ రసతంత్రవేత్తలలో 'రసహృదయతంత్ర' మను రసశాస్త్రమును రచించిన గోవిందభిక్షువు లగ్రగణ్యులు. భారతీయ రసాయన శాస్త్రేతిహాసమను గ్రంథము (History of Chemistry in Ancient India) రచించిన డా॥ ప్రఫుల్ల చంద్రరాయ్ గారు గోవిందభిక్షువును బౌద్ధభిక్షువుగా అభిప్రాయపడిరి. కాని వీరిని భిక్షు శబ్దమాత్రమున బౌద్ధసన్యాసిగ నూహించుటకాధారము లేదు. రసహృదయతంత్రమున మంగళాచరణశ్లోకము హరిహరులను ఉద్దేశించినట్టిది. ప్రథమావబోధంబున వేదాంతైక గమ్యమగు బ్రహ్మమును ప్రతిపాదించుటచే ఈయన బౌద్ధభిక్షువు కాడు.

**''రసహృదయాఖ్యంతంత్రం విరచితవాన్ భిక్షు గోవిందః''** అని యుండుటచే ఈయన శ్రీ ఆదిశంకరుల దేశికులగు గోవిందభగవత్పాదులేయనుటకు ఆధారములు గలవు. శ్రీ శంకరుల **'బాలస్తావత్ క్రీడాసక్తః '** అన్న శ్లోకము రసహృదయతంత్రంలో – **'బాలః షోడశ వర్షో విషయరసాస్వాదనలంపటః'** అని కలదు. దీనిచే గురుశిష్యభావము సూచితమగుచున్నది. శంకరమతానుయాయియు, వేదభాష్యకర్తయునగు మాధవాచార్యులు 'సర్వదర్శనసంగ్రహము' న గోవిందభిక్షువులను ఉదాహరించినాడు.

**భ్రూయుగ మధ్యగతం యచ్ఛిఖి విద్యుత్సూర్యవ జ్జగద్భాసి ।**
**కేషాంచిత్పుణ్య కృతా మున్మీలతి చిన్మయం జ్యోతి :**
**పరమానందైకమయం పరమం జ్యోతిః స్వభావమవికల్పం**
**విగళిత సర్వక్లేశం జ్ఞేయం శాంతం స్వసంవేద్యః ॥**

ఈ శ్లోకము కుండలినీ యోగవిషయమైన ఆజ్ఞాచక్ర వర్ణనము. రసహృదయ తంత్రములోనిది. మాధవాచార్యులు తమ **రసేశ్వర దర్శనమునందును** దీనిని ఉదాహరించినాడు. కావున, రసహృదయతంత్రమును గోవింద భగవత్పాదుల వారు క్రీ.శ. 710 ప్రాంతమున రచించినట్లు నిశ్చయింపవచ్చును.

## రససిద్ధులు

పూర్వము 84 మంది రససిద్ధులున్నట్లు సంప్రదాయము చెప్పుచున్నది. అందు ప్రముఖులగు వారు వీరు –

మంథానభైరవో యోగీ సిద్ధబుద్ధశ్చ కంథడీ
కోరంటకః సురానందః సిద్ధపాదశ్చచర్పటీ
కణేరీ పూజ్యపాదశ్చ నిత్యానాథో నిరంజనః
కపాలీ బిందునాథశ్చ కాకచండీశ్వరో గజః
అల్లమ ప్రభుదేవశ్చ ఘోడా చోళీ చరింతినీ
భాలుకీ నాగదేవశ్చ ఖండః కాపాలికస్తథా
ఇత్యాదయో మహాసిద్ధా రసభోగ ప్రసాదతః
ఖండయిత్వా కాలదండం త్రిలోక్యాం విచరంతి తే॥

ఇందుదాహరింపబడిన వారిలో పూజ్యపాద, సిద్ధపాద, సిద్ధ, బుద్ధాదులు జైన, బౌద్ధ ప్రసిద్ధులై యున్నారు. మరి కొందరు కాపాలికులు, కొందరు ఋషిపుంగవులు. అల్లమ ప్రభువు వీరశైవమతోద్ధారకుడు. తక్కిన వారు నాథసంప్రదాయమునకు చెందిన యోగులు. ఆచార్య అభయదత్తశ్రీ గారు హిందీలో ''చౌరాసీ సిద్ధోం కా వృత్తాంత్'' అనే గ్రంథంలో 84 యోగుల వృత్తాంతములు విపులంగా వ్రాశారు. వీరిలో మీనపా, గోరక్షా, చౌరంగపా, కణ్హపా, జలంధరపా, వీరు నాథయోగులు.

## ప్రాచీన శైవమతము - అందలి భేదాలు

శైవమతము కాలక్రమమున అనేక విధములైన అనుభవములకు ప్రతిస్పందించి అనేక రూపముల అభివృద్ధి చెందినది. 1) ఆగమములు - తంత్రము, 2) శైవ సిద్ధాంతము, 3) పాశుపతులు, కాపాలికులు, 4) జంగములు లేక లింగాయతులు, 5) కాశ్మీరశైవతత్త్వము (క్రమ, త్రిక, ప్రత్యభిజ్ఞ), 6) ఆజీవకులు, 7) నాథులు, 8) సిద్ధులు.

మత చరిత్ర వ్రాయడం ఇక్కడ ప్రధాన విషయం కాదు కాబట్టి ప్రధానమైన కాశ్మీర శివాద్వైతము, నాథసంప్రదాయము, హఠయోగములలోని కీలకమైన విషయాలు మాత్రమే ప్రస్తావించుకొందాము. కాశ్మీర దేశములో పుట్టిన అద్వైతమతానికి కాశ్మీర శివాద్వైతమని పేరు. దీనికే త్రిక శాస్త్రమము, త్రిక శాసనము, సంక్షిప్తముగా 'త్రిక'మని, విశేషించి, రహస్యసంప్రదాయము, త్రయంబక సంప్రదాయమని పేర్లు. త్రిక మనగా మూడుతత్త్వముల సమాహారము.

| | | |
|---|---|---|
| 1) సిద్ధ - | నామక - | మాలిని |
| 2) శివ - | శక్తి - | అణు |
| 3) పతి - | పాశ - | పశు |
| 4) శివ - | శక్తి - | నర |
| 5) పరా - | అపర - | పరాపర |

ఇది యథార్థ జ్ఞానము యొక్క అభేద - భేద - భేదా భేదములను వివరించుటచే త్రిక ద్ధాంతమైనది. ఈ మతము క్రీ.శ. 9వ శతాబ్ది ప్రారంభములో తలయెత్తినది. అప్పటికే ంత్రములు బహుళ వ్యాప్తిలో నుండుటచే కాశ్మీర శివాద్వైతముపై తాంత్రిక ప్రభావముపడినది. ికక శాస్త్రము యొక్క వాఙ్మయము మూడుగా వింగడింపబడినది.

1) ఆగమ శాస్త్రము, 2) స్పంద శాస్త్రము, 3) ప్రత్యభిజ్ఞా శాస్త్రము.

శైవాగమములోని ప్రధాన తంత్రగ్రంథములివి - మాలినీ విజయము, (మాలినీ జయోత్తరము), స్వచ్ఛంద తంత్రము, విజ్ఞానభైరవ తంత్రము, ఉచ్ఛుష్మ భైరవ తంత్రము, ృగేంద్ర తంత్రవము, నేత్ర తంత్రవము, నైశ్వాస తంత్రవము, స్వాయంభువ తంత్రవము, ుద్రయామళములు. వసుగుప్తుడు ప్రథమతః శివసూత్రములను రచించినాడు. ప్రఖ్యాతిగాంచిన వాచార్యులు వీరు - వసుగుప్తుడు, కల్లటుడు, సోమానందుడు, ఉత్పలుడు, భాస్కరుడు, ిభినవ గుప్తుడు, క్షేమరాజు, యోగరాజు, జయరథుడు.

వసుగుప్తుడు కాశ్మీరశివాద్వైత ప్రవర్తకుడు. ఇతడు క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన వాడు. సుగుప్తుడే స్పంద సూత్రములు లేక స్పంద కారికలు రచించగా కల్లటుడు దానిపై భాష్యము ాసినాడు. కాశ్మీరశైవానికి బౌద్ధమతముతో వచ్చిన పోటీ వలన దానికి తట్టుకొని నిలబడుటకు ిటిష్ఠము, ప్రకృష్టమునైన ప్రత్యభిజ్ఞా శాస్త్రము పుట్టినది. సోమానందుడు ప్రత్యభిజ్ఞా శాస్త్ర ివర్తకుడు. సోమానందుని శిష్యుడే ఉత్పలుడు. అతని శిష్యుడు లక్ష్మణ గుప్తుడు. ఇతడే ిభినవగుప్తపాదుల గురువు. సోమానందుడు 'శివదృష్టి' అను గ్రంథము వ్రాసినాడు.

సోమానందుని కుమారుడు, శిష్యుడునైన ఉత్పలుడు ఈశ్వర ప్రత్యభిజ్ఞా కారికలు ాసిదానికి టీకనూ వృత్తినీ సంతరించాడు. ఈశ్వరసిద్ధి. ఆజడప్రమాతృ సిద్ధి, స్తోత్రావళి అనే ంథాలు రచించాడు. ప్రత్యభిజ్ఞా సూత్రము కాశ్మీర శివాద్వైతమునకు గుండెకాయ వంటిది. ిభినవగుప్తుని 'వివృతి' 'వివృతి విమర్శిని' ఈ గ్రంథ గౌరవాన్ని ఇనుమడింపజేశాయి.

మహామాహేశ్వరుడైన అభినవగుప్తుడు బహుముఖ ప్రజ్ఞావంతుడు. క్రీ.శ. 10వ శతాబ్ది ుత్తరార్ధంలో జీవించిన వాడు. అలంకార శాస్త్రములోను, శైవదర్శనములోను అందెవేసిన ియి. సవ్యసాచి, తంత్రాలోకము ఈతని ప్రధాన గ్రంథము. ఇది మాలినీ విజయతంత్రముపై ిధారపడినట్లు డా॥ కె.సి. పాండే చెప్పినారు. అభినవగుప్తుడు కాశ్మీర శైవంలోని మూడు ిభాగాలపై కృషిచేసినాడు. 1) క్రమపద్ధతి, 2) త్రిక (ప్రత్యభిజ్ఞ ఇందలి భాగమే) 3) కుల.

క్రమపద్ధతికి చెందిన గ్రంథమే సిద్ధనాథకృత క్రమస్తోత్రము. దానిపై 'చిద్గగన చంద్రిక' అనే వాఖ్యను 'శ్రీవత్సుడు' వ్రాశాడు. ఇది కాళిదాసు కృతముగా ప్రసిద్ధి ఉన్నది. కాని అది సరికాదు. డా॥ నవజీవన్ రస్తోగీ The Krama Tantricism of Kashmir అనే గ్రంథంలో శ్రీవత్సుడు చిద్గగన చంద్రికా గ్రంథకర్తయని నిరూపించారు. [67] శ్రీవత్సుని కాలము క్రీ.శ. 1125-1175 అని రస్తోగీ నిరూపించారు.

## ఆజ్ఞాచక్ర భేదనమే భైరవతత్త్వము

యోగవాసిష్ఠాన్ని గూర్చి వ్రాసినప్పుడు విజ్ఞాన భైరవాన్ని గురించి చెప్పుకొనినాము. కాశ్మీర శైవాగమములలో విజ్ఞాన భైరవము ప్రధానమైనది. శివసూత్ర విమర్శిని (I-5) లో ఈ విషయము ప్రస్తావింపబడినది. " The breaking in of the vision is called **Bhairava** because it is his and is caused by him." " The **spanda** school mentions" the drawing of the form or vision of **Bhairava** or God." on the mind in the course of meditation and there by the clearing away of the impurities as the way to be realisation of the identity with God, while the followers of **Pratyabhijna** maintain that recognition of oneself on God in the way." [68]

''అబిందు మవిసర్గం చ అకారం జపతో మహాన్
ఉదేతి దేవి సహసా జ్ఞానౌఘః పరమేశ్వరః (శ్లో. 88)

అని విజ్ఞానభైరవము **'ఆత్మపీఠము'** యొక్క నిరూపణ చేసినది. వ్రజవల్లభ ద్వివేరి దీని నిలా వ్యాఖ్యానించారు. ''శాస్త్రోంమే ఆచార్యోం నే ఇస్ బాత్ కో ఇస్ తరహ్ స్పష్ట్ కియాహై - కీ నాభీసే ఏక్ వితస్తి ఊపర్ ఔర్ కంఠసే ఛః అంగుల నీచే హృదయ విద్యమాన్ హై। ఇస్ హృదయకే బీచ్‌కే భాగ్‌మే ఏక్ కమలహై। ఇస్‌కమలకే బీచ్‌మే తీన్ కోనోం వాలీ కర్ణికా హై। ఇస్ కర్ణికా కే మధ్య భాగమే అకారకా స్వరూప్ ధారణ్ కర్ **'ఆత్మా'** రహతీ హై। ఇస్ 'అకార' కే భీతర్ అత్యంత సూక్ష్మతత్త్వ నివాస కర్‌తాహై జిసమే కీ **చిత్‌తత్త్వ** కా నిరంతర స్ఫురణ హోతా రహతాహై। విజ్ఞాన భైరవకే 'అబిందు మవిసర్గం చ' ఇత్యాది శ్లోకమే ఇసీ చిత్ తత్త్వ కీ ఉపాసనా కా విధాన్ హై।'' [69].

1) 'అ' కారము - సృష్టి - ఉపక్రమము
2) విసర్గము - ఉపసంహారము - లయము

వర్ణస్య సవిసర్గస్య విసర్గాంతం చితిం కురు।
నిరాధారేణ చిత్తేన స్పృశేద్ బ్రహ్మసనాతనమ్ ॥ (శ్లో 89)
అను శ్లోకములో పై భావమే చెప్పబడినది.

## స్పంద - నిష్యందము

స్పందకారికలు భట్ట కల్లట (క్రీ.శ. 855 - 83) రచితము. దీనికి వృత్తి కూడ కల్లటుడే వ్రాశాడు. ఇది వసుగుప్తుడు రచించిన శివసూత్రములపై వాఖ్య. భట్టకల్లటుని స్పందకారికలపై రాజానక రామకంఠుడు క్రీ.శ. 9వ శతాబ్దిలో వివృతి వ్రాశాడు. రామకంఠుని వివృతితో లభించు ఈ కారికా గ్రంథము నాల్గు అధ్యాయములు గలది. ఈ అధ్యాయములకు 'నిష్యందము' అని పేరు పెట్టబడినది.

| | | |
|---|---|---|
| గ్రంథనామధేయము | - | స్పందము (Pulsation) |
| వివృతికి పేరు | - | నిష్యందము (Vibration) |

భట్టకల్లటుడు తన గురువు వసుగుప్తుని స్తుతిస్తూ గ్రంథాంతంలో వ్రాసిన 'గురుభారతీస్తుతి[70]ని వ్యాఖ్యానిస్తూ రామకంఠుడు స్పందనిష్యంద నామకరణౌచిత్యాన్ని యిలా సమర్థించినాడు.

''గురోః వసుగుప్తాభిధానస్య సాక్షాత్ సిద్ధముఖ సంక్రాంత సమస్త రహస్యోపనిషద్భూత **స్పందతత్త్వామృత నిష్యందస్య భారతీం వాచం స్తౌమి.**'' 'స్పందతత్త్వము యొక్క అమృతనిష్యందము' అనే అర్థంలో అధ్యాయాలకు 'నిష్యంద' శబ్దనామకరణం చేశాడు. రాజానక రామకంఠుడు.

## స్పంద - ప్రత్యభిజ్ఞాతత్త్వములు

According to **Spanda** school, the individual self or **Jiva** is divine or Siva but he has forgotton his real nature and is identified with has psycho-physical mechanism. 'Spanda' meaning vibration of activity of **Siva** is supposed to be the cause of all distination. [71]

**'యస్పందే సంస్పందః ప్రథమః శివతత్త్వముచ్యతే తజ్ఞైః'**। జీవం లేదా ప్రాణం పరమశివుని ప్రథమ స్పందమని అదే శివతత్త్వమని పండితులు చెబుతున్నారు. ఆ ప్రథమ స్పందాన్ని నిగ్రహించి స్వాధీనంలో వుంచుకొని సృష్టిని ప్రవర్తింపజేసేదే శక్తితత్త్వం.

నాట్యమంటే స్పందశక్తి లాస్యమేనని అభినవ గుప్తపాదుల హృదయం. నాట్యశాస్త్ర వ్యాఖ్యలో చాలాచోట్ల రసాన్ని స్పందశక్తి కున్ముఖంగానే ఆయన వ్యాఖ్యానించారు. చమత్కారమనేది స్పంద శక్తికొక పేరు. భోక్త హృదయంలో కలిగే అద్భుతమైన ఒకానొక స్పందమే చమత్కారం.

**''భుంజానస్యాద్భుత భోగస్పందా విష్టస్య చ మనః కరణం చమత్కార ఇతి''**

అని అభినవభారతి, రససూత్ర వ్యాఖ్య. అందుకే నాట్యశాస్త్రమన్నారు కాని అలంకార శాస్త్రమన లేదు. నాట్యమంటే విశ్వసంకోచ వికాసాల్లోని ఛందోనర్తనం. స్పందమంటే ఇదే. కాబట్టి 'స్పం' అన్నప్పుడు హృత్పద్మం ముకుళితమై 'దం' అన్నప్పుడు వికసితమౌతున్నట్లుగా అనుభూతి. ఈ శబ్దంలోనే సృష్టికి మొదలు, తుది యిమిడి ఉన్నాయి.

"The term **Pratyabhijna** means 'recognition'. It considers recognition of the reality as the **sine qua non** for liberation. **Abhinavagupta** also puts its in the same way -

**''మోక్షోహినామ నైవాన్యః స్వరూపప్రథనాహితత్''**

అని తంత్రాలోకము (I పుటలు - **192**)' **Moksha** is nothing but the awareness of one's true nature.' Thus we find that there is no rudimentary difference between the doctrines and tenets of these two branches of Kashmira Saivism. The only divergence is the way or means of ulltimate realisation." [72]

## స్పందము - కుండలిని

తమా శ్రితోర్ధ్వ మార్గేణ చంద్రసూర్య వుభావపి ।
సౌషుమ్నేఽధ్వన్యస్తమితో హిత్వా బ్రహ్మాండ గోచరమ్ ॥

తదా తస్మిన్ మహావ్యోమ్ని ప్రలీన శశి భాస్కరే ।
సౌషుప్త పదవన్మూఢః ప్రబుద్ధః స్యాదనావృతః ॥

" **Spanda sastra** lays greater emphasis on the spiritual discipline for the recognitive intuition of a Soul's identity with Siva. It is divine power in the form of **Serpent power** ( కుండలిని) which is asleep or coiled at the basic centre, awakened by breath control and concentration on the Divine at it and made to pierce six centres (చక్ర) in **Susumna**, spinal cord and to ascend to the highest centre abone the cerebrum and unite with Siva."

"Ksemaraja speaks on Siva as possessed of **Spanda** and Self - existent. So, **Spanda** is the vibration of the divine power of freedom not distinguishable from Him." [73]

## తంత్రశాస్త్ర రహస్యాలు - శ్రీపీఠం

'' శివశక్తుల సంయోగమే శ్రీచక్రం. ఈ చక్ర మధ్యంలో బిందువైన బీజం నుండి

సమస్తలోకాలు, భూతాలు పుట్టినవి. శ్రీచక్రము, సహస్రారకమలము ఒక్కటే. ఇక్కడ వేయి సూర్యుల ప్రకాశం గల **బిందుపీఠం** ఉంది. ఇదే **శ్రీపీఠం.** దీనిని **మహాపీఠమనీ, విద్యాఖ్యపీఠమనీ, ఆనందపీఠమనీ** అంటారు. ఇందు సదాశివుడు మంచఫలకాకారంగా ఉన్నాడు. ఆయన ఒడిలో సదాషోడశాబ్ద నూత్నయౌవనదర్పితమైన కన్య కూర్చొని ఉన్నది. ఆమెయే సకలజనని లలితాంబ!

మానవుని వెన్నముకలో సూక్ష్మరూపంగా సుషుమ్న అనే నాడి యున్నది. ఇది నిటారుగా ఉంటుంది. ఇదే క్రింది మానసిన శక్తులను, ఉన్నత మానసిక శక్తులతో కలుపు నాడి, భ్రూస్థానం వద్ద ఆగ్నేయచక్రమున్నది. ఇందులో మనస్తత్వం, బ్రహ్మ బీజాక్షరములైన హ, క్ష రెండక్షరములున్నాయి. ఈ రెండక్షరములతో అక్షర సంఖ్య 50 అవుతుంది.

సహస్రారంలో వేయి అక్షరాలున్నాయి. 'సహస్రాక్షరా పరమేవ్యోమన్' అని ఋగ్వేదము. మనం ఏ అక్షరాన్ని ఉచ్చరిస్తే ఆ అక్షరానికి సంబంధించిన చక్రంలో దానికి చెందిన శక్తి పుట్టుతుంది. మంత్రశక్తి వల్ల మూలాధారంలో నిద్రిస్తున్న కుండలినీ శక్తి మేల్కొంటుంది.

తంత్రశాస్త్రంలో ప్రధానకారణమైన మహాబిందువు, ఆదినాథుడైన గురువుకు ఉన్నత స్థానమున్నది. ఇవి గుప్త స్థానములు. 'ఆజ్ఞాచక్రం' మీద ఒక గుప్తచక్రం ఉంది. దీనిని **మానసచక్రం** అంటారు. దీనికి ఆరుదళాలున్నాయి. ఇవి మనస్సు యొక్క ఆరు గుణాలు. ఈ చక్రం చైతన్యం పొందినప్పుడు ఈ గుణములు వికసించి దూరదర్శన శక్తి మొదలైనవి కలుగుతాయి. ఈ చక్రం మీద ఇంకొక గుప్తచక్రం ఉంది. దీనిని **సోమచక్రం** అంటారు. దీనికి షోడశ కళ లనబడే 16 దళాలున్నాయి. వీటిలో చిట్టచివరిదీ, ఉత్కృష్టమైనదీ ఏకాగ్రత.

ఈ చక్రం మీద ఆధారం లేని గృహమున్నది. దీనిని **'నిరాలంబపురీ'** అంటారు. యోగులు ప్రకాశమానమైన ఈశ్వరుని సందర్శించే స్థానం ఇదే. దీనిమీద వెలుగువలె ప్రకాశించే ప్రణవమున్నది. **ప్రణవం** మీద తెల్లని బాలచంద్రుని వంటి **నాదం** వుంది. నాదం మీద **బిందు** వున్నది. ఇక్కడ తెల్లని పద్మం వుంది. ఇది 12 దళాలు గలిగి ఊర్ధ్వముఖియై వుంది. ఈ పద్మం మీద యోగులు కాంక్షించే ముఖ్యాతి ముఖ్యమైన **సుధాసింధు** వున్నది. దీని మధ్య మణి వలె ధగద్ధగాయమానంగా వెలిగే మణిద్వీపముంది. దీని మధ్య **'చింతామణి'** ఉంది. దాని మీద అ, క, థ – లు గల త్రికోణాకారం ప్రకాశమానమై ఉంది. దీనిలో నాదబిందువులున్నవి. వీటిపై వున్నది **పరమహంస.** దీనిమీద పాదుకలుంచుకొని గురునాథుడు కూర్చుని ఉన్నాడు. గురుధ్యానం చేయవలసిన చోటిదే. పాదుకలున్న పరమహంస యొక్క శరీరము జ్ఞానమాయ. రెక్కలు రెండూ ఆగమ నిగమములు. కాళ్లు రెండు శివశక్తులు. ముక్కు ప్రణవం. కంఠం, కాళ్లు కామకళలై వున్నవి.

సహస్రారం దగ్గరగా చంద్రుని 16వ కళ గల పద్మం ఉన్నది. దీనిని **అమాకల** అంటారు. ఇది అగ్నివలె శుద్ధంగా, ఎఱ్ఱగా ఉంది. ఇది అధోముఖంగా ఉంది. దీనిలో సూర్యునివలె వెలిగే **నిర్వాణ కళ** ఉంది. ఇది వెంట్రుకలో వెయ్యోవంతు సన్నగా ఉంది. ఇదే అందరి ఇష్టదేవత. నిర్వాణ కళ వద్ద **పరమనిర్వాణ కళ** ఉంది. ఇది చాలా సూక్ష్మంగా రవి ప్రభాభాసమానంగా వుంది. తత్త్వజ్ఞానమునకు జన్మభూమి ఇదే.

దీని మీద బిందు, విసర్గలున్నవి. ఆనందమునకు మూలస్థానం ఇది. సహస్రార చక్రం బ్రహ్మరంధ్రం నుండి అధోముఖమై ఉంది. ఇది బ్రహ్మలోకస్థానం. ఇందు పరమశివుడూ ఆద్యశక్తి ఉన్నారు. ఇదే బ్రహ్మాండ పిండాండములకు సూర్యస్థానం. ఇదే సగుణ బ్రహ్మవాచక శక్తి. ఇందులో గుణాలు, శక్తులు, లోకాలు ఉన్నవి.

| | | |
|---|---|---|
| శైవులు | – | శివస్థానమని |
| వైష్ణవులు . | – | పరమపురుషస్థానమని |
| శాక్తేయులు | – | దేవీస్థానమని |
| సాంఖ్యులు | – | ప్రకృతి పురుషస్థానమని |
| వివిధమతస్థులు | – | హరిహరస్థానమని, శక్తిస్థానమని, పరబ్రహ్మ |

స్థానమని, పరమహంసస్థానమని, పరంజ్యోతి స్థానమని, కుల (శక్తి) స్థానమని, అకుల (శివ) స్థానమని చెబుతారు.

సృష్టి మూలస్థానమిదే. శ్రీచక్రంలోని బిందువిదే. యోగులు కోరే గుప్తభూమి ఇదే. లలితోపాఖ్యానం (దేవీభాగవతం) (మార్కండేయపురాణం) లో చెప్పబడిన మహాపద్మమే ఈ సహస్రారపద్మం.''[74]

## మంత్రశాస్త్రము - కుండలినీ శక్తి

''శివశక్తుల మైథునం వల్ల బిందూత్పత్తి అవుతుంది. బిందువే ఈశ్వరుడు. సమస్తదేవతానీకం రహస్యంగా పూజించేది ఈ బిందువునే. దీనినే పౌరాణికులు మహావిష్ణువన్నారు. ఇతరులు బ్రహ్మపురుషుడన్నారు. సహస్రారపద్మంలో వున్న సత్యలోకమే ఈ బిందువు. **పరబిందువులో శివశక్తులు అభేదంతో ఉన్నారు. ఇది వికసించినప్పుడు మూడు రూపాలు పొందుతుంది. శివుడు బిందువవుతాడు. శక్తి బీజమవుతుంది. వీరిద్దరి మైథునం వల్ల నాదం పుడుతుంది. బిందువు - బీజం - నాదం మూడు కలసి త్రికోణాకారం అవుతుంది. ఈ త్రికోణాకారమే కామకల. ఇది మంత్రశాస్త్రమునకు తల్లి వంటిది.**''

కుండలనీ శక్తికి రెండు రూపాలున్నవి. 1) జ్యోతీరూపం, 2) మంత్రరూపం. మొదటిది సూక్ష్మరూపం. రెండవది స్థూలరూపం. మంత్రములన్నిటిలో గాయత్రీ మంత్రము గొప్పది. అన్ని దేవతలకు పురుషుడుంటాడు. రాధకు కృష్ణుడున్నాడు. గాయత్రికి అట్లుగాక అది ఒక్కటే. అది పూర్ణశక్తి. **గాయత్రియే బ్రహ్మశక్తి. గాయత్రి ఉపాసన చేసిన వారు మూలధారచక్రం నుండి సాధన ఆరంభించవలసిన పనిలేదు. ఆజ్ఞాచక్రం నుండి ఆరంభించిన వారికి త్వరగా సిద్ధికల్గుతుంది.** మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, చక్రాల్లో లోభమోహ, కోపాలున్నవి. గాయత్రీ ఉపాసకుల కివి జయించబడి ఉంటవి. ఇవి జయించబడనిది పైకి పోలేడు సాధకుడు. వీటిని జయించుటకే ఇతరులు మూలాధారచక్రం నుండి ఆరంభించుట. మంత్రశక్తియే కుండలినీ శక్తి.''[76]

## మంత్రము - తంత్రము - యంత్రము - సమన్వయము

శ్రీచక్రమే శ్రీయంత్రము. శ్రీచక్రమూ, సహస్రారకమలమూ ఒకటే. బహిః పూజలకు శ్రీయంత్రమును ఉంచి పూజిస్తారు. అంతః పూజలకు సహస్రారపద్మం. శ్రీలలితాసహస్రనామంలో తల్లి ''అంతర్ముఖ సమారాధ్యాబహిర్ముఖ సుదుర్లభా'' అని చెప్పబడినది.

1) మంత్రం – వాగ్రూపము, వర్ణాత్మకమైంది
2) తంత్రం – ఆంతరమైన యోగప్రక్రియ – ధ్వన్యాత్మకమైంది.
3) యంత్రం – ఆంతరమైన యోగానికి బాహ్యప్రతీక

ఈ దృష్టితో పర్యాలోచిస్తే –

1) పీఠిక – యోగపీఠిక – ఆంతరము
2) భూమిక – యోగాధార భూమిక – బాహ్యము

'పీఠిక' – ఒక గ్రంథంలో గల ఆంతరతత్త్వాన్ని ఆవిష్కరించేదిగా ఉండాలి. అంటే కవిమనస్తత్త్వము – కావ్యాంతర్గత ధ్వని – రసనిరూపణము – మూలతత్త్వము వీటిని ఆవిష్కరించాలి.

భూమిక – ఒక గ్రంథానికి సంబంధించిన బాహ్య విషయాలను పరామర్శించేదిగా ఉంటుంది. అనగా కవి – కాలము – దేశము – కర్తృత్వనిర్ణయము – అది అముద్రిత గ్రంథమైతే ప్రతుల కాలనిర్ణయం – పాఠాంతర పరిష్కరణము – ఇత్యాది methodology కి సంబంధించిన విమర్శన 'భూమిక' లో ఎక్కువగా చోటు చేసుకొంటుంది. అందుకే 'పీఠిక'ను Genesis అని, 'భూమిక'ను Prolegemena అంటారు.

కాబట్టి, శరీరము - యంత్రము
వాక్కు - మంత్రము
యోగము - తంత్రము

అని సమన్వయింపవచ్చు. ఇవే క్రమంగా -

1) లిపిబద్ధమైన గ్రంథము - యంత్రము - వాక్శరీరము
2) అక్షరబద్ధ వాగ్రూపశక్తి - మంత్రము - వాక్తత్త్వము
3) వాక్తత్త్వావిష్కరణము - తంత్రము - విమర్శశక్తి

ఇందు రెండవ, మూడవ అంశాలకే ప్రాధాన్యము - కాగా, ఒకటి స్థూలము, మరొకటి సూక్ష్మము, ఒకటి ప్రకాశము, వేరొకటి విమర్శము, ఒకటి బాహ్యము ఇంకొకటి ఆంతరము.

పై త్రిపుటి యొక్క సంపుటీకరణమే భ్రుకుటి యందు ఆజ్ఞా చక్రబద్ధమై, జ్ఞానరూపమై, తత్త్వావిష్కరణ సమర్థమగు చున్నది. తత్త్వజ్ఞానమునకు జన్మభూమి ఆజ్ఞాచక్రభేదనము. ఆ + జ్ఞ = ''పూర్ణజ్ఞానమునకిది పీఠిక'' అని. ⌒ + ◡ = ○

శ్రీ అరవిందులు ఈశావాస్యోపనిషద్భాష్యంలో వ్రాశారు. శివశక్తుల సమ్మేళనము. ప్రకాశ విమర్శాంశల మేళనము. సంపూర్ణము.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదుచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥ అని ఉపనిషత్ సమన్వయము.

## సహజమార్గయోగిని, కాశ్మీరదేశ కవయిత్రిలల్లేశ్వరి లేక లల్లాదేవి (క్రీ.శ. 1326 - 1419)

**శివో వా కేశవో వాపి జినో వా ద్రుహిణోఽపి వా ।**
**సంసార రోగేణాక్రాంతామబలాం మాం చికిత్సతు ॥**

అతనిని శివుడనియో, కేశవుడనియో, జినుడనియో బుద్ధుడనియో, బ్రహ్మమనియో, మీకిష్టమైన ఏదో యొక పేరుతో పిలువండి. ఆ ఒక్కడైన పరమాత్ముడు అనేక నామధేయాలు గలవాడు. అట్టివాడు అబలనైన, దీనురాలైన నన్ను సంసారమనే రుగ్మతచే పీడింపబడుచున్న దానిని చికిత్స చేసి ఉద్ధరించును గాక!

ఇట్టి స్వతంత్రభావాలను వ్యక్తీకరించినదెవరు ? ఇంతటి సహజమైన, నిసర్గమైన ఆలోచనలను గల్గిన ఆ వ్యక్తి ఎవ్వరు? అమెయే సహజమార్గ యోగిని, కాశ్మీరదేశకవయిత్రి లల్లేశ్వరి లేక లల్లాదేవి.

'లల్లాయోగిని' అని కాశ్మీర దేశవాసులు ప్రేమతో పిలిచే ఈమె క్రీ.శ. **1326** వ సంవత్సరం ఒక హిందూబ్రాహ్మణ కుటుంబములో జన్మించినది. తండ్రి పేరు చంద్రభట్టు. కాశ్మీర దేశంలోని సెంపూర్ ఈమె జన్మస్థలము. హర్షీశ్వరుడనే పేరు గల అక్కడి ఈశ్వరుని ఆమె చిన్ననాటి నుండి ఆరాధించినది. ఆమె పుట్టినప్పుడు ఉదయనదేవుడు కాశ్మీరును పరిపాలిస్తున్నాడు. కాని, రాజకీయ కల్లోలములలో **1339** నాటికే షామీర్ అను మహమ్మదీయుడు సుల్తాన్‌షం సుద్దీన్ అనే పేరుతో కాశ్మీర రాజ్య సింహాసనము నాక్రమించినాడు.

కాశ్మీరదేశము తాత్త్విక విచారణకు, అలంకార శాస్త్రమునకు పుట్టినిల్లు. సుప్రసిద్ధ యోగి,కవి పండితుడైన అభినవగుప్తుడు (క్రీ.శ. **955 - 1015**) యోగసంబంధమైన సాధనలను తన తల్లి నుండి నేర్చుకొన్నాడని తెలుస్తోంది. కాశ్మీరములో ఇటువంటి యోగినులెందరో ఉండే వారు. అట్టి వారిలో విలక్షణమైన భావ ప్రపంచాన్ని అవిష్కరించిన లల్లాదేవి గొప్పయోగిని, విదుషీమణి.

లల్లాదేవి స్త్రీలందరి వలెనే వివాహమును తప్పించుకొన లేక పోయినది. మానసికముగా ఆమె ఏనాడో శివునికి అర్పితమెనప్పటికీ భౌతికముగా ఆమె ఒక పురుషునికి భార్య కావలసి వచ్చినది. పదకొండవ యేటనే లల్లాదేవికి వివాహము నికాభట్ అను యువకునితో జరిగినది. ఇతనికే సోమభట్టు అని కూడా పేరు. కారణజన్మురాలైన ఆమె సాంసారిక జీవితము సుఖప్రదంగా ఎందుకుంటుంది? వివాహమై అత్తవారింటికి వచ్చిన లల్లాదేవి 'పంపర్' అనే గ్రామంలో కాపురముండినది. 'పద్మాపురము' అనే పేరే ఉచ్చారణలో 'పంపర్' అయినది. చిప్పట జయాపీడుని మాతులుడైన పద్మడనే వాడు ఈ పద్మాపురాన్ని స్థాపించిన వాడు. క్రీ.శ. 9వ శతాబ్దిలో నిర్మింపబడిన ఈ పురంలో రాజుతల్లియైన జయదేవి ఆజ్ఞచొప్పున పద్మడు శివాలయాన్ని నిర్మించి ఆ స్వామికి జయేశ్వరుడని పేరు పెట్టాడు. ఆతడే అక్కడ 'విష్ణుపద్మస్వామి' ఆలయాన్ని కట్టించాడు. పద్మాపురానికి నాల్గుమైళ్ల దూరంలో ఒక స్వయంభూలింగము' కూడా ప్రసిద్ధికెక్కినది. ఇదంతయు ఎందుకు చెప్పవలసి వచ్చినదనగా లల్లాదేవి తన వైవాహిక జీవితములో పై ముగ్గురు దేవతలను ఆరాధించినది. సాంసారికమైన కష్టములను భరించలేక విరక్తి చెందిన ఆమె ఇల్లు విడిచి వెళ్లిపోయింది.

సిద్ధ శ్రీకంఠుడనే గురువు చే యోగమార్గము స్వీకరించినది. ఆమె నగ్నముగా సంచరించుటచే పొత్తికడుపు వేలాడుతూ ఉండేదని అందుచే ఆమెకు 'లల్ల' అని పేరు వచ్చినదని పర్షియన్ చరిత్రకారులు వ్రాశారు. కాని అది సరికాదు. ఆమెకు దీక్షాస్వీకరణానికి పూర్వమే 'లల్ల' లేక 'లల్లి' అనుపేరున్నది. కాశ్మీర దేశంలో స్త్రీలకు ఇప్పటికిని 'లలిత' అని పేరు

పెట్టి ముద్దుగా 'లల్ల' లేక 'లల్లి' పిలువడం ఉంది. క్రీ.శ. 10వ శతాబ్దిలోని కల్హణుని రాజతరంగిణిలో ఒక రాజు పేరు లలితాదిత్యుడు.

యోగవిద్యా జిజ్ఞాసతో ఆమె ముస్లిమ్ గురువైన 'సయ్యద్ హుస్సేన్ సమ్నాని' ని ఆశ్రయించి యోగ సాధనలు చేసింది. ఆమె యోగసాధనలను గురించి మనకు ఇదమిత్థంగా ఏమీ తెలియటం లేదు. కాని, 'లల్లేశ్వరి' అనే ఆంగ్లగ్రంథంలో B.N. Parimoo యిలా వ్రాస్తున్నారు.

" There are indications in the Vakhs, however that she took to Kundalini Yoga. There are scholars of Lalla Ded what so ever that she practised is **Nada - Bindu Yoga** which according to Grierson, is another name of the **Kundalini Yoga**" [76]

లల్లాదేవి కాలానికి కాశ్మీరంలో బౌద్ధమత ప్రభావమున్నది. శాక్తమతము విజృంభించినది. కాశ్మీరశివాద్వైతము త్రిక, స్పంద, ప్రత్యభిజ్ఞా సిద్ధాంతములతో బహుళవ్యాప్తి పొందినది. రాజ్యము మహమ్మదీయులచే పరిపాలింపబడుచుండుట వలన ముస్లిమ్ మత ప్రభావము జనులపై పడసాగింది. ఇన్ని మత భేదములున్న పరిస్థితులలో ఆమె ఏ మార్గమును స్వీకరింపక సహజమైన యోగమార్గమును అవలంబించినది. అందుచేతనే ఆమె 'వాక్యము' లలో శైవమతము, వైష్ణవ మతము, జైన, బౌద్ధ మతాలనన్నిటిని ప్రస్తావించుచూ, జీవునికి సంసారతాపత్రయం నుండి ఉద్ధరింపబడే మార్గమే గొప్పదని స్వతంత్రనిర్ణయం చేసింది. స్వాత్మ విమర్శన (Self - introspection) ఆమెలో ఎక్కువగా కనబడుతుంది.

**''దివానిశం స్వాత్మ విమర్శ నాఢ్యో యథాస్థితస్త్వం పరమోస్త్యుపాయః ''**

**''స్వాత్మాన్వేషణ యత్నమాత్ర నిరతా శ్రాంతా తతోఽహం స్థితా।''**

శిలలలో ఆయా జాతిభేదము వలన అనేక విధములైనవి ఉన్నట్లుగా పీఠములలో కూడ వివిధ మత భేదములననుసరించి అనంతవిధముగా నున్నవి. కాని శివుని తెలిసికొనుటకు సరియైన గురువు లభించుట ఒక్కటే మిక్కిలి కష్టమైనదని ఆమె భావించినది. ఆమె 'వాక్య' మిది

**యథా శిలైకైవ స్వజాతి భేతాత్ పీఠాది నానావిధ రూప భాగినీ ।**
**తథైవ యోఽనంతతయా విభాతి కష్టేన లభ్యం శృణు తం గురోః శివమ్ ॥**

''అది శైవపీఠము కావచ్చు, శాక్తపీఠము కావచ్చు. వైష్ణవపీఠము కావచ్చు లేదా జైనపీఠము కావచ్చు. బౌద్ధపీఠము కావచ్చు మరియే యితర పీఠమైనా కావచ్చు. ఏమత పీఠమైనప్పటికీ

మానవుని జ్ఞానతృష్ణను, శమింపజేసి సన్మార్గము చూపింపగలిగినదే అసలైన పీఠము. అనగా సంసారరోగముచే బాధపడు జీవునికి చికిత్స చేసి 'జ్ఞానపీఠము'నధిష్ఠింప జేయగల్గినదియే అసలైన మతపీఠమని లల్లాదేవి ఆంతర్యము.

'లల్లాహం నిర్గతా దూరమన్వేష్టుం శంకరం విభుమ్' 'లల్లేతి లోకే ప్రథితా తదాహమ్' అని తనను గురించి చెప్పుకొన్న లల్లాదేవి – బౌద్ధమతాన్ని తన 'వాక్యాల'లో ప్రస్తావించినది.

'శూన్యాచ్ఛూన్యం నైవభిన్నం యథైవం' పూర్ణము నుండి పూర్ణమెట్లో శూన్యము నుండి శూన్యమని, 'స్మరామి శూన్యం ఖలుసప్తవారమ్' అని బౌద్ధులైన మాధ్యమికవాదులు లంకావతార సూత్రంలో చెప్పిన సప్తవిధ శూన్యతలను, 'ద్రుహిణోపివా అని బ్రహ్మను ఆరాధించే వారిని – 'జినోవా' జైనమతాన్ని, 'ప్రత్యభిజ్ఞా' అని కాశ్మీర శివాద్వైతాన్ని ప్రస్తావించినది.

## కుండలినీ యోగిని

**కామాదికం కానన షట్కమేత**
**చ్ఛిత్వామృతం బోధమయం మయాప్తమ్।**
**ప్రాణాది రోధాత్ ప్రకృతిం చ భంక్త్వా**
**మనశ్చ దగ్ధ్వా శివధామ లబ్ధమ్ ॥**

ఆరు అడవులు దాటగనే **శశికళ** అమృతనిష్యందమై వచ్చినది. ప్రకృతిని రూపుమాపి ప్రాణాయామము జయించినది. **కామదహనముచే మనస్సు దగ్ధమొనర్చి** నేను **శివధామమును** చేరుకొంటిని.

'ఆరు అడవు'లనగా షట్చక్రములు. **'శశికళ'** సహస్రారములోని **'సుధాసింధువు'** యోగియైనవాడు ప్రకృతినీ, మనస్సును లయింపజేస్తే తప్ప ప్రాణాయామ దశలో యోగ సిద్ధిని పొందలేడు. ఇది కుండలినీ యోగమే! లల్లాదేవి కుండలినీ యోగిని అనడానికిదొక ఉదాహరణ! ఇది నాథయోగుల 'సంధ్యాభాష' వలె నున్నది.

**అనాహతః స్వస్వరూపః శూన్యస్థోవిగతామయః ।**
**అనామ రూపవర్ణో౽జో నాద బింద్వాత్మకో౽స్తి సః ॥**

**చిత్తాదర్శే నిర్మలత్వం ప్రయాతే**
**ప్రోద్భూతామే స్వేజనే ప్రత్యభిజ్ఞా ।**
**దృష్టోదేవః స్వస్వరూపో మయాసౌ**
**నాహం నత్వం నైవ చాయం ప్రపంచః ॥** [77]

ఇటువంటి స్వతంత్ర భావన గల యోగిని 93 సంవత్సరాలు జీవించి క్రీ.శ. 1419లో యోగసిద్ధి పొందినది. నుండఋషి లేదా రుండ ఋషి ఈమెకు సమకాలీనుడైన యోగివర్యుడు.

భక్తితత్త్వ ప్రచారంలో ఈమె తమిళనాడులోని అవ్వైయార్ (క్రీ.శ. 7వ శతాబ్ది), తెలుగునాడులో తరిగొండ వెంగమాంబ (క్రీ.శ. 1730-1817), కన్నడనాడులోని అక్కమహాదేవి (క్రీ.శ. 12వ శతాబ్ది), రాజస్థాన్‌లోని మీరాబాయి (క్రీ.శ. 1580-1630) వీరితో సమానంగా సంచారయోగినిగా తిరిగి ప్రజలను నైతిక మార్గ ప్రవర్తకులునుగా చేసినది.

## పాతంజల యోగం - హఠయోగం

''మనస్సు గురించి అర్థం చేసుకుంటే యోగమును అర్థం చేసుకున్నట్లే. పంచీకరణం ప్రకారం ఆత్మసగం, వాయువుసగం కలియగా మనస్సు ఏర్పడుతుంది. ఆత్మ అనగా జ్ఞానము. వాయు వనగా స్పందనము. తరంగము కదలిక. జ్ఞానం వాయువుచే అహతమైనప్పుడు స్తిమితం పోతుంది. వాయుతాడితమైన ఈ స్పందనాన్ని తీసివేయుగా స్థిరత్వం పొందిన జ్ఞానం మిగులుతుంది. దీనినే పాతంజల యోగసూత్రం - ''యోగశ్చిత్తవృత్తి నిరోధః'' అని చెప్పింది. చిత్తవృత్తినిరోధమే యోగము. వృత్తులే వాయు లక్షణమైన స్పందనం. దీనిని తొలగించుట యోగం. ఇది రాజ యోగం. యోగము 'యుజ్' అనే ధాతువు నుండి పుట్టినది. 'యుజ్' అనగా కలుపుట. జీవిని బ్రహ్మతో కలుపుటయే యోగము. ఇదే తంత్రసాధనల పరమలక్ష్యం.

**హఠయోగం :-** హఠయోగం పాతంజలయోగానికి వ్యతిరేకం. సూర్యచంద్రులను, ప్రాణాపానమును, శివశక్తులను కలుపుటయే హఠయోగము. దీనినే ఘటయోగమని అంటారు. ఘట మనగా శరీరము. జ్ఞానవాసిష్ఠం దీనిని ఒప్పుకోదు. వాసనాక్షయం వల్లనే సిద్ధిపొందాలంటుంది.

ఏ యోగానికైనా పర్యవసానం సమాధిసిద్ధి. భగవద్గీతలో సాధనను గురించి నాసికాగ్ర దృష్టి ఒక్కటే చెప్పబడినది. ఎంత వెదికినా హృదయం నాయందుంచి నాసికాగ్రం చూడమన్నాడు.

కుండలినియే సరస్వతియైన శబ్ద శక్తి. శబ్దములు ఈమె యందున్నవి. ప్రాణము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఈమె వల్ల జరుగుతున్నవి. ఈమె బ్రహ్మశక్తి. ఈమె త్రిపుర సుందరీ దేవి. సుషుమ్న ప్రక్కలను సూర్యచంద్రనాడులున్నవి. ఈ మూడు నాడులే త్రిపురములు. కుండలిని అగ్నిశక్తి. అగ్నికుండంలో పుట్టినది. ఈమె మంత్రంలో ఇట్లున్నది -

**'మహాకుండలినీ జాత జాతవేదసమండలమ్'**

ఆంతరమైన కుండలినీ శక్తియే బాహ్యంగా శ్రీవిద్యలోని లలితా త్రిపురసుందరి.

17

ఈ శక్తిని ప్రాణాయామం వల్ల, ఇంకాకొన్ని సాధనల వల్ల మేల్కొల్పి సహస్రారంలో ఉన్న పరమేశ్వరునితో కలుపుటయే జీవబ్రహ్మైక్యం.[78]

బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి
విష్ణు జంపి శివుని వెలయ గలిపి
శివుని జంపి తాను శివయోగికావలె

అంటాడు వేమన – ఇది పూర్తిగా హఠయోగవిషయం.

**హఠయోగ ప్రదీపిక :**

''శ్రీ ఆదినాథేన సపాదకోటిలయం ప్రకారాకథితా జయంతి ।
నాదాను సంధానక మేక మేవ మన్యామహో ముఖ్యతమం లయానామ్ ॥
ముక్తాసనేస్థితో యోగీ ముద్రాం సంధాయ శాంభవీమ్ ।
శృణుయాద్దక్షిణే కర్ణేనాద మంతః స్థ మేకధీ : ॥
శ్రవణపుటనయన యుగల ఘ్రాణముఖానాం నిరోధనం కార్యమ్ ।
శుద్ధసుషుమ్నా సరణౌ స్ఫుటమమలః శ్రూయతేనాదః

**ఆరంభావస్థా**

బ్రహ్మగ్రంథేర్భవే ద్భేదోహ్యానందః శూన్యసంభవః ।
విచిత్రః క్వణకోదేహఽనాహతః శ్రూయతే ధ్వనిః॥

**ఘటావస్థా**

విష్ణుగ్రంథేస్తతో భేదా త్పరమానంద సూచకః ।
అతిశూన్యే విమర్దశ్చ భేరీశబ్దస్తదా భవేత్ ॥

**పరిచయావస్థా**

రుద్రగ్రంథియదాభిత్వా శర్వపీఠగతోఽనిలః ।
నిష్పత్తౌవైణవః శబ్దః క్వణద్వీణాక్వణో భవేత్ ॥
ఏకీభూతం తదాచిత్తం రాజయోగాభిధానకమ్।
సృష్టిసంహార కర్తాసౌ యోగీశ్వర సమోభవేత్ ॥

''ఇందు శ్రీ ఆదినాథుడనగా శివుడు. అతడు నాథసంప్రదాయము నందు ఆదినాథుడు. శివప్రోక్తమైన నాథయోగమైన శాంభవీముద్రలోని బ్రహ్మవిష్ణురుద్ర గ్రంథిభేదనమే వేమన పద్యము నందు కలదు. వెల్లడిగ లేదు. మర్మముగ గలదు. మర్మకవిత్వమునకు నాథసంప్రదాయము జీవనాడి.''[79] అంటున్నారు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు

# నాథ సంప్రదాయము - పీఠ చతుష్టయము

రససిద్ధులైన నాథయోగుల నామధేయములు పూర్వమే చెప్పబడినది. క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధమే రచితమగు కొలను గణపతి దేవుని శివయోగసారము. నాథ సంప్రదాయమునకు సంబంధించిన యోగశాస్త్ర గ్రంథము.

''యోగాభ్యాసక్రమం బెట్టిదనిన యోగంబు నాల్గు విధంబులై 1) మంత్ర, 2) లయ, 3) హఠ, 4) రాజయోగంబులనం బరగు. తత్ప్రకారంబున సర్వంబును బూర్వంబున శివప్రబోధిత సిద్ధమునీంద్ర సముద్దీపితంబై యొప్పుచుండు.''

''ఇందుకు సాధనంబులైన మూలబంధోడ్యాణబంధ జాలంధరబంధంబులు మూడును మొదలన నెఱుంగవలయు.''

శివయోగసారము నాథ సంప్రదాయమునకు ఉజ్వల రత్నదర్పణము. క్రీ.శ. 16వ శతాబ్దిని ఆంధ్రదేశమున నాథ సంప్రదాయము కలదు. ఇక నాథపీఠములుండుట ఇతోఽధిక విశేషము.

సహస్రలింగార్చన చేయు సందర్భము నందు ప్రథమతః శ్రీ మహాగణపతి పూజ కావించి తదుపరి ఉమాపార్థివేశ్వర పూజ చేయు విధానమిట్లు కలదు.

**''ఆదౌశుద్ధోదకేన భూమౌ బిందుత్రికోణ షట్కోణ**
**షడంగాని చ। చతురస్ర ఓడ్యాణ, జాలంధర,**
**పూర్ణగిరి, కొల్హాపురాఖ్యా పీఠ చతుష్టయం సంపూజ్య''**

1) యథాపూర్వద్వారే ఓడ్యాణపీఠాయనమః ఓడ్యాణేశ్వరాయ నమః ఓడ్యాణేశ్వర నాథాయనమః ఓడ్యాణాంబా శ్రీమణిపాదుకాం పూజయామి. నమస్తర్పయామి.

2) దక్షిణద్వారే – జాలంధరపీఠాయనమః జాలంధరేశ్వరాయ నమః। జాలంధేశ్వర నాథాయ నమః। జాలంధర్యంబా శ్రీమణిపాదుకాం పూజయామి.నమస్తర్పయామి.

3) పశ్చిమద్వారే –పూర్ణగిరిపీఠాయ నమః। పూర్ణగిరీశ్వరాయ నమః। పూర్ణగిరీశ్వర నాథాయ నమః। పూర్ణగిర్యంబా శ్రీమణి పాదుకాం పూజయామి. నమస్తర్పయామి.

4) ఉత్తరద్వారే – కొల్హాపురి పీఠాయనమః। కొల్హాపురేశ్వరాయ నమః। కొల్హాపురి నాథాయనమః। కొల్హాపుర్యంబా శ్రీమణి పాదుకాం పూజయామి నమస్తర్పయామి.

ఇది ఎప్పటి నుండి సహస్రలింగార్చన మంత్రము లందు కలదో గాని ఇందలి జాలంధర నామధేయమును బట్టి నాథశబ్దాంత శివనామధేయములను బట్టి నాలుగు పీఠములు నాథపీఠములు కావలయును.

కొల్హాపుర పీఠము ఉత్తరద్వారము నందు కలదు గావున నాలుగు పీఠములును దక్షిణ భారతదేశమునకు మాత్రమే సంబంధించిన నాథపీఠములు కావలయును.

1) ఉత్తరద్వారము - కొల్హాపురము - మహారాష్ట్ర దేశము
2) తూర్పు ద్వారము - ఓడ్యాణము - ఓఢ్రదేశము
3) ధక్షిణద్వారము - జాలంధరము - తమిళ దేశము
4) పశ్చిమ ద్వారము - పూర్ణగిరి - కన్నడ దేశము

తమిళోత్కళ కర్ణాట మహారాష్ట్ర దేశములందు నాథసంప్రదాయము కలదు. ఈ నాల్గు పీఠములకు మధ్యస్థమైన ఆంధ్రదేశము సహస్రలింగార్చనము లోని ఉమాపార్థివేశ్వర పూజా విధానమునకు ఉద్భవస్థానమగును. నాథపీఠపరమైన పూజా విధానము, పుట్టుక ఆంధ్రదేశమునందు అప్పుడు నాథ సంప్రదాయము ప్రబలముగ గలదనుటకు ప్రబల నిదర్శనము.

**ప్రతీకలు** : నాథయోగుల ప్రత్యేక చిహ్నములలో ఛిన్నములైన కర్ణములందు దర్శన కుండలములు ధరించుట ఒకటి. కనుకనే వారికి కన్‌ఫట యోగులను వ్యవహారము కలిగినది. వారు ధరించు కుండలమునకు ముద్ర, దర్శనము, కుండలము, పవిత్రి అను పేర్లు కలవు. ఇది అవధూత గురువునకు శిష్యుడు పూర్తిగా అంకితమనుటకు ప్రతీక!

మానవ హృదయము నందు, విశ్వహృదయము నందు పరబ్రహ్మమునకు ప్రాతినిధ్యమువహించు అనాహత ధ్వని లేక ప్రణవము ( ఓంకారము) నకు నాదము ప్రతీక!

రుద్రాక్ష జ్ఞానదృష్టికి లేక పరబ్రహ్మప్రత్యక్షాను భవము వలని మానవ చైతన్య ప్రకాశమునకు ప్రతీక!

జ్ఞాన వైరాగ్యసమాధులకు ప్రతీక త్రిశూలము! నాథయోగులకు - బీహారు రాష్ట్రములోని సోనేపూర్‌లో గల హరిహరనాథాలయము, ఉత్తర ప్రదేశము నందలి గోరఖ్‌పూర్ లోని గోరక్షనాథాలయము పంజాబ్‌లోని తిల్ల, వారణాశిలోని విశ్వనాథాలయము, భైరవనాథాలయము, కేదారనాథాలయము, చిటకాంగ్‌లోని వైద్యనాథాలయము, కేదారనాథాలయము, పశుపతినాథాలయము, పరశ్వథనాథాలయము పుణ్యక్షేత్రములైన పూరీ జగన్నాథస్వామి ఆలయమునందు, ఖజురహో దేవాలయము నందు నాథవిధులు అనుసరింతురని లేదా అనుసరించిరని పెక్కుమంది అభిప్రాయము.

నాథసంప్రదాయములోని మహాపురుషులు 1) మత్స్యేంద్ర నాథుడు, 2) గోరక్షనాథుడు, 3) జాలంధర నాథుడు - హాదిపా.

వీరి యోగానుభవములకు సంబంధించిన వాఙ్మయము కలదు. జాలంధరనాథుని నుండి గ్రంథ సముదాయము నాథులు భద్రపరచిరి. అంతే కాదు. మత్స్యేంద్రనాథుని, గోరక్షనాథుని బోధలను గ్రంథస్థము చేసిరి. గోరక్ష విజయము ప్రచుర ప్రచారము గల చరిత్ర గ్రంథము. అది వీరగాథవలె ఉత్తర భారత దేశమునందంతట పాడబడినది.

నాథగురువులు శుక్లశోణిత సంయోగము లేకుండ జన్మించినట్లు చెప్పబడిరి. కనుక వారిది శివకులము, రుద్రకులము. అందుచే వారికి 'నాథు'లని విశేషనామము కలిగినది. నాథులు తమకు ముఖ్యులని తలంచు తొమ్మండుగురు గురువులను బట్టి **నవనాథులని** వ్యవహరింపబడుదురు.

1. మీననాథుడు, 2) చౌరంగి, 3) గోరక్షుడు, 4) మేఘనాథుడు, 5) విరూపాక్షుడు, 6) నాగార్జునుడు, 7) ఖణికనాథుడు, 8) మంజునాథుడు, 9) బుద్ధసిద్ధుడు.

''నాథ శబ్దం దీక్షానామం తప్ప వ్యవహారిక నామం కాదు. శ్రీవిద్యాదీక్షితుడు నాథుడు. సౌందర్యలహరీ వ్యాఖ్యాత లోల్ల లక్ష్మీధరుడు - **విద్యానాథ** నామాంకితుడు. కామకళావిలాస కర్త పూర్ణానంద**నాథుడు**, వ్యాఖ్యాత నటనానంద**నాథుడు**. శ్రీ చక్రంలోని నవావరణలకు నవనాథులు గురువులు. ఆదినాథుడు మహేశ్వరుడు. నాథసంప్రదాయంలో ఆదినాథుడు - దేవి మనసా - ద్వంద్వానికి త్రిమూర్తులుదయించగా శివునికీ విద్య ఆదినాథుడు బోధించాడని మొదటి సిద్ధపంచకం శివుని శిష్యులైనారని కథ. మత్స్యేంద్రుడు జాలంధరి సంజ్ఞ కలవాడు. శ్రీచక్రంలోని మూడుకోణాలు మూడు పీఠాలు కాగా జాలంధరి ఉత్తరకోణం.''

నాథులలో పంద్రెండు శాఖలు గలవు. నాథసంప్రదాయమునకే 1) అవధూత మార్గము, 2) సిద్ధమార్గము, 3) యోగ మార్గము అని కూడ ప్రసిద్ధము.

మత్స్యేంద్ర నాథుడు హఠయోగమునకు ప్రప్రథమ సిద్ధాంత ప్రవర్తకుడని పరంపరాగతమైన అభిప్రాయము. హఠయోగ శాస్త్రము నందు ప్రసక్తమైన కొన్ని ఆసనములకు మత్స్యేంద్రాసనమని, గోరక్షాసనమని పేర్లు గలవు.

'హ' అను అక్షరము సూర్యునికి ప్రతీక! ప్రాణమునందుండును. 'ఠ' అను అక్షరము చంద్రునికి ప్రతీక! అపానమునందుండును. ఈ రెండు అక్షరముల కలయిక హఠము. సూర్యచంద్రుల సంయోగము హఠయోగము.

నాథులు – నాదమునకు, నాడికి గూఢమైన ప్రాముఖ్యము నుగ్గడింతురు. ఓంకారమును
ాదము యొక్క ధ్వని రూపమని అంగీకరింతురు. విశ్వచైతన్యమును అందుకొనుటకు
శ్వనాదము మిక్కిలి చలించు సాధనమని పరిగణింతురు. నాథ సంప్రదాయములో మంత్రము
ుక్కిలి శక్తివంతమైనది.

తంత్రశాస్త్రములోని చక్రముల అధ్యయనము నందు చక్కగా వర్ణించిన నరముల
్యవస్థయే నాడి. నాడీ సాధనము శరీరము యొక్క ప్రేరణల యొక్క నిగ్రహమునకు
ంబంధించినది. చక్రసాధనము సర్వోత్కృష్టమైన చైతన్యము యొక్క గూఢ వికాసమునకు
ంబంధించినది.

హఠయోగమునకు, నాథ సంప్రదాయమునకు అవినాభావ సంబంధము కలదనుటకు
మాణములు గలవు. **'గోరక్ష బోధ'** యందు గోరక్షనాథుడు హఠయోగభ్యాసములను
నర్ణించు కొన్ని విధులను నిర్దేశించెను. **'శివసంహిత', ఘేరండసంహిత** అను
ంథములందు మత్స్యేంద్రాసనము, జాలంధర బంధము, శూన్యబంధము, కుండలినీతత్త్వము
సక్తమైనవి అమరోలి, వజ్రోలి అను ముద్రలును గలవు. అత్యంత మార్మికమైన ఖేచరీవిద్య,
ండలినీ సాధనములును గలవు. ఇవి యెల్ల హఠయోగమును మోదలించును.
**'మనస్కయోగ బీజము'** అను గ్రంథమునందు యోగాభ్యాసమువలననే మోక్షమని
్పబడినది. హఠయోగ సంబంధమైన నాథసంప్రదాయము భారతీయ భావనయైన రసాయన
స్థానమునకు సజాతీయముగ కన్పట్టును. రసాయన ప్రస్థానములోని వైద్య, రసాయన వైద్య,
ాయన శాస్త్రములు యోగ శాస్త్రముగ రూపాంతరము చెందుటయే నాథసిద్ధుల తోడి
డము.

నాథ సిద్ధుల ప్రధాన సాధనము కాయసాధనమని సుప్రసిద్ధము. కాయసాధనము నందు
శరీరము నందు సూక్ష్మశరీరముగను తర్వాత కడకు నిత్యస్థితి గల శాశ్వతదివ్య శరీరముగను
ూపాంతరము చెందుట ఇమిడి యున్నది. ఈ యోగుల ప్రకారము సోమము లేక
ృతమునకు నిధానమైన చంద్రుడు సహస్రదళ పద్మమైన సహస్రారమునకు చేరువను క్రింద
డు. చంద్రునిలోని అమృతము రూపమున స్థూల శరీరము యొక్క సారము
పోయబడినది. ఈ అమృతమే శరీరమునకు పునర్యావనము కలిగించి శాశ్వతము చేయును.

సూర్యుని నుండి సోమము లేదా అమృతమును రక్షించుకొనుట ఎట్లు ? ఇందుకు
ధములైన యోగపద్ధతులను హఠయోగశాస్త్రములు, తంత్ర గ్రంథములు ప్రతిపాదించినవి.
దు ముఖ్యమైనది నాలుకను వెనుకకు త్రిప్పి తాలువు నందలి గుంటలోనికి దశమ ద్వారమును

సమీపించునట్లు పోనిచ్చి భ్రూమధ్యమున దృష్టిని నిలుపుట. ఇట్ల వెనుకకు త్రిప్పిన నాలుక దశమ ద్వారమును మూసివేయును. ఈ విధముగ సంరక్షించిన అమృతమును యోగిపానము చేయును. కొన్ని గ్రంథములందు చంద్రుని నుండి అమృతము పానము సేయు పద్ధతి అట్టడుగు నాడీవలయము నందు నిద్రాణమై యున్న కులకుండలినీ శక్తిని జాగృతము చేయు విధానముతో కూడి యున్నది. కుండలినీ శక్తి మేల్కొనుట, సహస్రారము వరకు సాగుట – అమృతము బొట్లు బొట్లుగ క్రిందికి జారుటకు కీలకపాత్ర వహించును.''

నాథ సంప్రదాయమునకు చెందిన అనేకానేక గ్రంథములలో **'సిద్ధసిద్ధాంత పద్ధతి'** మిక్కిలి ప్రధానమైనది. ఈ సంస్కృత గ్రంథమునందు సిద్ధయోగి సంప్రదాయమునకు సంబంధించిన ఆలోచనా విధానము ఆధిభౌతికాభిప్రాయములు, యోగులు, జీవితకాలము, యోగాభ్యాసము ద్వారా గవేషించు పరమాదర్శము సంగ్రహముగా సక్రమముగా గలవు. ఈ గ్రంథము సిద్ధ లేక నాథ సంప్రదాయమమునకు చెందిన అనేక గ్రంథములలో ఉట్టంకింపబడినది. సిద్ధలేక నాథమతమును, తత్త్వమును ఇంతకంటె స్పష్టము చేయు ఇంకొక గ్రంథము ఇంతవరకు లభింపలేదు. ఇది గోరక్షనాథకృతమని కలదు. కాని ఆధునిక పరిశోధకులను కర్తృత్వవిషయమున సందేహము కలదు. **'సిద్ధసిద్ధాంత సంగ్రహము'** అను పద్యకావ్యము పై గ్రంథమునకు సంగ్రహపద్యరూపము.

## సిద్ధసారస్వత మంత్రము

నాథినీ కథ, నవనాథ నామధేయములు మాత్రమే గాక సిద్ధసారస్వత మంత్రమును, జక్కన విక్రమార్క చరిత్రయందు గలదు. చంద్రచూడుడనెడి విద్వచ్చూడామణి కమలాకరునికి **''సిద్ధసారస్వత మంత్రం బుపదేశించె నంతం తదష్టాన విశేషంబునకు శారద ప్రత్యక్షంబై యతని సముచిత విద్యావిశారదుంగావించిన''**

ఇది చింతామణీ మంత్రము. సిద్ధసారస్వత మంత్రమునుటకు ఒక నిదర్శనము – రెండింటికిని అధిష్ఠాత్రి సరస్వతియే.

క్రీ.శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధమున రచింపబడిన వల్లభామాత్యుని క్రీడాభిరామములో

**''ప్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే సిద్ధసారస్వత శ్రీ వరించె''**

అని కలదు. క్రీ.శ. 15వ శతాబ్ది తుదిలో వ్రాయబడిన కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశిక యందు చంద్రకేతుడు ఒసగిన **'సిద్ధసారస్వతము'** వలన కమాలాకరుడు **'సకలకళాకోవిదు'** డైనట్లు చెప్పబడినది. ఈ విధంగా సిద్ధసారస్వత మంత్రోపాసనచే **'వాక్సిద్ధి'** పొందుట ప్రాచీన సారస్వతమున కన్పట్టును.

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణమదుచ్యతే ।**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥**

అన్నది శ్రుతివాక్యము కాగా – హఠయోగప్రదీపిక యందు

**అన్తః శూన్యో బహిః శూన్యః శూన్యః కుంభ ఇవాంబరే।**

**అన్తః పూర్ణో బహిః పూర్ణః పూర్ణః కుంభ ఇవార్ణవే ॥**

పై స్వాత్మారాముని శ్లోకానికి బ్రహ్మానందుని భాష్యమున్నది. దాని తాత్పర్యమిది – సమాధిస్థితి ఆకాశము నందు ఘటము వలె అంతశ్శూన్యము; బహిశ్శూన్యము. సముద్రము నందు ఘటము వలె అంతః పూర్ణము; బహిః పూర్ణము. బ్రహ్మాతిరిక్త వృత్తి లేక పోవుట వలన శూన్యము – బ్రహ్మాకారవృత్తి ఉండుట వలన పూర్ణము. బ్రహ్మాతిరిక్త వృత్తి లేక పోవుట యనగా బ్రహ్మాకారవృత్తి ఉండుటయే. కనుక బ్రహ్మము శూన్యము, పూర్ణము కూడ[81]. ఈ శూన్యము బుద్ధుడు చెప్పిన 'సర్వం శూన్యం సర్వం శూన్యం' అన్నదానితో సంబంధము లేదు. బౌద్ధదర్శనము నందు బ్రహ్మము కేవలము శూన్యమే. పూర్ణత్వమను ప్రసక్తి లేదు. కాని విచారించగా హఠయోగము బౌద్ధ దర్శనానికీ – హిందూమత దర్శనానికీ సమన్వయించు సేతువుగా నున్నది.

''నాథ సంప్రదాయమే గురుసంప్రదాయం కనుక సర్వమత సాధనమార్గాల్లోకి ప్రవహించి పోయిందనటానికి, ఇది ఆంతరవిద్యా విషయమనటానికి తార్కాణంగా **కాన్హా చర్యాగీతిక** ప్రథమోదాహరణం.'' అంటూ చివరలో– ఆచార్యకోటీశ్వరరావు గారు – ఇదంతా బ్రహ్మాండమైన సంకేతవిద్య. 'సంధ్యాభాష' లో చెప్పబడ్డ కథను వ్యావహారిక భాషగా గ్రహించి వాచ్యార్థం చెప్పకూడదు అన్నారు. ఇంతకీ సంధ్యాభాష అనగానేమి?

'లామా అనగరికా గోవింద' చెప్పిన మాటలుగా అగేహానంద భారతి The Tantric Tradition అనే గ్రంథంలో సంధాభాష లేక సంధ్యాభాష (Intentional Language) ను గురించి యిలా వ్రాశారు. " ............ their words (viz., of the 84 siddhas) as well as their biographies are phrased in a particular type of symbolic language which is called **Sandhyabhasa.** The Sanskrit expression literally means "**twilight language**" and indicates that a double sense underlies its words, according to whether it is to be understood in its common place or in its mystical connotation."[82]

చింతాతరంగ తరళః తృష్ణాసలిలం ప్రపంచవారాశిః ।

యదను గ్రహేణతీర్ణః తస్మై శ్రీనాథ నావికాయనమః ॥ [83]

## అష్టాదశ శక్తి పీఠాలలోని శ్రీశైలము - లలాట మధ్య స్థానీయమైన ఆజ్ఞాచక్రమే!

అచలాద్వైతం లేదా అచలబోధ సంప్రదాయ స్థాపకులు శ్రీ పోతులూరి వీరబ్రహ్మం గారీవిధంగా వ్రాశారు.

**నీళ్లలో వుండీ గొణుగుతువుంటే నిలకడ చెడునుర ఒరే ఒరే !**
**నిలకడ గలిగిన నిర్మల జ్యోతిని చూచుచుండుట సరే సరే !!**

పరబ్రహ్మ దర్శనాన్ని గురించి వీరబ్రహ్మంగారు తమస్వానుభావాన్నిలా వ్యక్తీకరించినారు.

**'' నే జూచినానే బ్రహ్మము నాలోనే జూచినానే**
**సద్గురు నాలోనే జూచినానే!**
**నే జూచినాను నెలతరో తారక రాజయోగంబు జూచే ...**
**కన్నుల నడుమను సన్నబిలంబులో**
**వెన్నెల తెరగట్టి పున్నమ చంద్రుని ''**

ఇది కనుబొమలనడుమగల ఆజ్ఞాచక్రవర్ణనమే ![84] పోతులూరి వీరబ్రహ్మం గారు

''శ్రీశైల గుడులకు పోయి మల్లికార్జునుని చూచి ముచ్చట లాడాలన్నది యోగార్థంలో తీసుకోవాలి. కుండలిని జాగృతిలో షట్చక్ర భేదన జరిగేటప్పుడు, **''లలాటమధ్యే శ్రీశైలః''** అని శాస్త్రప్రమాణం ఉంది. ఇంతకూ బ్రహ్మంగారి తత్త్వం మంజరీద్విపదలో యిలా వుంది.

**గురుతుగా శ్రీశైల గుళ్లకు బోయి -మల్లికార్జునుని జూచి ముచ్చటలాడి**
**చంద్రగుప్తమహారాజు అనియెడివాని - పాపవిమోచనము సేయగనపుడు**
**కానకయున్నారు బ్రహ్మమునా - కారణముగ ముందుగా వస్తిని.**

**''లలాటమధ్యే శ్రీశైలః''** అన్నది ఆజ్ఞాచక్రానికి గుర్తు. మూలాధారంలో కుండలిని జాగృతమై పెడబొబ్బలు పెడితే ఆజ్ఞాచక్రభేదనకు వచ్చేటప్పటికి ఎంత ప్రశాంతత మనస్సు అనుభవిస్తే గాని ముచ్చటలాడగలదు? చంద్రగుప్త మహారాజు అనేది ఒక చారిత్రక వ్యక్తి పేరు కాదు. ఒక సాంకేతికమైన గూఢార్థంలో తీసుకోవాలి. చరిత్రలో ప్రవేశిస్తే తారీఖులు, దస్తావేజుల గొడవలు తప్ప విషయం అంతుబట్టదు. ఆజ్ఞాచక్ర స్థితుడైన యోగి ఫాలభాగం, వెన్నెల విరిసినట్లు ఉంటుందని శాస్త్రం చెబుతున్నది. దీనినే **'అమా'** అని అంటారు. 'అమా' అనే చంద్రకళ లలాట మధ్యభాగం గుండ బయలుదేరి నాల్గువైపులా ప్రసరిస్తుంది.

ఆజ్ఞాచక్రానికి వెంటనంటి ఉండేదే సహస్రారం. ఇక్కడ నిండు పున్నమి వెన్నెల పరచుకొనివుంటుంది. ఈ రెంటినీ తగివలిచ్చేలాగా బ్రహ్మం గారు 'చంద్రగుప్తమహారాజు' అనే గుప్తారస్ఫోరకమైన పేరును వాడాడు. అది ఆజ్ఞాచక్రానికీ సహస్రారానికీ అన్వయించే పేరు. చంద్రుని వెన్నెల గుప్తంగా లోపల విరియగా యోగి, మహారాజువలె సిద్ధిని చూరగొంటున్నాడని దీనికి అంతరార్థం. ఇది సహస్రారం నుండి స్రవించే సుధాబిందువుల్ని సంకేతిస్తూ వుంది. [86]

**సాలము యంత్రపీఠము, విశాల కవాటిక ఘట్టనంబుధృ**

**జ్వలన, మైందవామృత సమేత పతాకిక జిహ్వ, చంద్రికా**

**జాలము భూతిపూత, నవచంద్రశిలాంబువు లశ్రుధారగా,**

**ప్రోలు ప్రశాంత ఘోషమయి పూర్ణసమాధి సెలంగె నయ్యెడన్ !**

అని వసుచరిత్ర ప్రబంధంలో రామరాజు భూషణుడు వ్రాసిన పద్యం. ఈ పద్యంలో కవి అర్ధరాత్రి వేళ ప్రశాంత గంభీరమై వెలుగొందే వసురాజు పట్టణాన్ని లంబికాయోగ సమాధిలోనున్న యోగితో పోల్చినాడు. లంబికాయోగ సమాధిలోని యోగి సహస్రార పద్మం నుండి జాలువారే అమృతబిందువులే ఆహారంగా స్వీకరిస్తూ ఎంత సుదీర్ఘకాలమైనా యోగ సమాధిలో ఉండిపోగలడు. చంద్రకాంత శిలలపై జాలువారే మంచుబిందువుల్ని ఆ విధంగా పోల్చడమనేది కవిత్వానికే పరాకాష్ఠయైన భావన ! ఈ భావనతో దీటైనదే బ్రహ్మం గారు వాడిన చంద్రగుప్త మహారాజు అనే సాంకేతిక నామధేయం కూడ!

మత్స్యేంద్ర నాథుడు కాలజ్ఞాన నిర్ణయంలో (అధ్యా 16 - శ్లో - 5) మూడు ముఖ్యమైన పీఠాలలో శ్రీశైలాన్ని ముందుగా పేర్కొన్నాడు అవి 1) శ్రీశైలము, 2) మహేంద్రగిరి 3) కామాఖ్యాపీఠములు. ఎవరైతే ఈ మూడు శూన్య ప్రదేశాలను ధ్యానిస్తారో వాళ్లు నిన్ను నన్ను సహస్రారంలో దర్శించుకొంటారని సదాశివుడు కులేశ్వరితో చెబుతున్నాడు.

**శ్రీశైలశ్చ మహేంద్రశ్చ పీఠం కామాఖ్య విశ్రుతమ్**
**సన్నిధానో హ్యహం భద్రే త్రిష్కాల సిద్ధమేలకమ్ ।**
**ప్రసన్నం నరా భద్రేవ్యోమ ధ్యానైకచేతసః**
**దర్శనం చ భవేత్ తస్మిన్ మయాసాధ్వి కులేశ్వరి ॥**

**శ్లో॥ అరుంధతీ భవే జ్జిహ్వా, ధ్రువో నాసాగ్రమేవచ ।**
**భ్రువోః విష్ణుపదం జ్ఞేయం, తారకం మాతృమండలమ్ ॥**

– శివస్వరోదయః – శ్లో. 367

లలాటమధ్య మందలి శ్రీశైలం ఆజ్ఞాచక్రస్థానీయమైన బిందుయోగము! ఈ యోగానికి అరుంధతి - నాలుక చివరిభాగం! (వైఖరీవాక్ శుద్ధి) ధ్రువుడు - నాసిక యొక్క చివరి భాగం (ఏకాగ్రత, నిష్ఠ) ముక్కు యొక్క కొనపై రెండు కన్నుల చూపులు నిలిపి ఏకాగ్రనిష్ఠతో చేసే ధ్యానమే బిందుయోగ మనబడుతుంది. రెండు కనుబొమల మధ్య గల ప్రదేశమే భ్రుకుటి! దీనికే విష్ణుపదము - ఆకాశమని పేరు! ఇక్కడ చంద్రుని వెన్నెల పాటమరించి ఫాలభాగమంతా వ్యాపిస్తుంది. భ్రుకుటి యొక్క ప్రదేశమే ఆజ్ఞాచక్రస్థానీయం!



Fig 9. భ్రూమధ్యస్థానం - ఆజ్ఞాచక్రం

యోగశాస్త్రం ప్రకారం శరీరం మూడు మండలాలుగా వింగడింపబడింది. 1) అగ్నిమండలం 2) సూర్యమండలం 3) చంద్రమండలం. పోతులూరి వీర బ్రహ్మం గారు ఈ మండలాలను తన తత్త్వాలలో పేర్కొన్నారు. వేమన యోగి కూడ ఈ మూడు మండలాలను మండలత్రయంగా చెప్పారు.

ఆ॥ వె॥ మండలములు మూడు మఱి చూడ చూడంగ
చంద్రసూర్య వహ్ని జెంది పిదప
దండి వెలుగుగాను ధరణికి దైవంబు
గాను నుండు మిగులు ఘనత వేమ !

1) చంద్రమండలం - మానవమస్తిష్కం
2) సూర్యమండలం - నాభికి, మస్తిష్కానికి మధ్య భాగం
3) అగ్నిమండలం - నాభికి క్రింది భాగం

ప్రామాణిక హఠయోగ గ్రంథమైన హఠరత్నావళి ( IV-42) లో కూడా - **'కపాలేచంద్రమండలమ్'** అని చెప్పబడింది. చంద్రమండలంలోని సహస్రార చక్రం గురించి వ్రాయబడిన **'షట్చక్రనిరూపణమ్'** లో కూడా -

శ్లో॥ **తదూర్ధ్వే శంఖిన్యా నివసతి శిఖరే శూన్యదేశే ప్రకాశమ్ ।**
**విసర్గాదః పద్మం దశశత దళం పూర్ణ చంద్రాతి శుభ్రమ్ ॥**

**మహాకాళతంత్రంలో** ఈ సహస్రార చక్రాంతంలో చంద్ర మండల స్థానం స్పష్టపరచడం జరిగింది.

**శ్లో॥ సహస్రారాంతరే శూన్యే దివ్యతోరణ శోభితే ।**
**చంద్రమండల మధ్యేతు హంసవర్ణద్వయోపరి**
**శుద్ధస్ఫటిక సంకాశం శుద్ధక్షౌమ విరాజితమ్ ॥**

తరిగొండ వెంగమాంబ తత్త్వకీర్తనల్లో త్రివేణినదియైన సుషుమ్నలో జలకమాడమని ధ్వనింపజేసింది. ఆజ్ఞాచక్రమే త్రివేణి. ప్రయాగ లేక త్రివేణి సంగమం భ్రూమధ్యంలో ఉండే ఆజ్ఞాచక్రానికి సంకేతం. ఇడా, పింగళా, నాడులు రెండూ సుషుమ్న అనే అంతర్గతమైన నాడితో కలిసే ప్రదేశం త్రివేణి! గంగా, యమునలు అంతర్వాహినియైన సరస్వతితో కలిసే మూడు నదుల సంగమస్థానం కనుక త్రివేణి! లోకంలోని ఈ మూడు నదులే యోగంలోని త్రినాడులు. కుండలినీ ఊర్ధ్వపయనాన్ని వెంగమాంబ ఎలా అలంకారికంగా వర్ణిస్తున్నదో చూడండి.

మూడు, రెండు దాటిపైన మేడ జేరరే!
పోడమిగను ముక్తికాంత పోడు మరయరే!!
**చక్కగా త్రివేణి నడుమ జలకమాడరే!**
**చొక్కము గను వెలుగుచున్న చుక్కగాంచరే !!**
శంకరాచార్య గురుని సమ్మతింపరే!
నిష్కళంక పరమయోగ మభ్యసింపరే !![88]

వేమనయోగి సహస్రారాన్ని – కొండవీడు, నందిదుర్గం, మేరు శిఖరం అని పిలువగా, ఏగంటివారు 'మేరువు' అంటారు. వెంగమాంబ కీర్తనల్లో భ్రూమధ్య మందిరము, అంబర వీధి, ఆరోపద్మం, గంగయమునలు, త్రివేణి, అసిపదము, నడివీధి యోగ సాంకేతిక పరిభాషలు! కవిబ్రహ్మ, ఉభయ కవిమిత్రుడు తిక్కన సోమయాజి ఆంధ్ర మహాభారత కర్ణపర్వాంతంలో వ్రాసిన రెండు పద్యాలతో ఈ గ్రంథపరమార్థాన్ని స్థాపిస్తూ, సహృదయ పాఠకుల కరకమలాలకు ఈ పుస్తకాన్ని అందిస్తూ అంజలి ఘటిస్తున్నాను.

చ॥ **అనలుడు, భాస్కరుండును, సుధాంశుడు నధ్వర సంప్రవర్తకుల్**
**వినుము నరేంద్ర! యీ క్రతువు విష్ణుమయం బిది!** నిర్వహించి ర
ర్జునుఁడును, గర్ణుఁడున్ సమర రూపమునందగ, నీ ప్రబంధ మిం
పొనర బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్

చ॥ ప్రకట మహార్థ సౌరభ పరాశరనందన వాక్యమంజరీ
ప్రకర సమర్చితా, పరమపావన నామ, జగత్త్రయీ విధా
యక పరిరక్షక ప్రతి సమాహృతి కారక చిత్తవృత్తి భా
వక, భవబంధమోచన, **దివాకరచంద్ర కృశానులోచనా!**

చ॥ హరిహరనాథ ! సర్వభువనార్చిత! నన్ దయజూడు మెప్పుడున్ !
– (స్వర్గా – ప. 94)

# పాదసూచికలు

1. D.C. Sircar, Early History of Vaishnavism, Cultural Heritage of India, Vol. IV, Sri Ramakrishna Mission Institute of Culture, Calcutta, Page - 126.

2. విశ్వనాథసత్యనారాయణ, ప్రద్యుమ్నోదయము, (కావ్యము), వి.యస్.ఎన్. అండ్ కో, విజయవాడ, 1967, టిప్పణి.

3. R.G. Bhandarkar, **Saivism, Vaishnavism and other minor religious systems**, Indological Book House, Varanasi.

4. F.Otto Schrader, An Introduction to Pancaratra Agama, Ahirbudhnya Samhita, Adyar Library and Research Centre, Adyar, Chennai.

5. Foot Note No. 1 Ibid, p - 128.

6. F.N. No.1 Ibid, p.129

7. ఆంధ్రవేదార్థ సంగ్రహము - శ్రీమద్రామానుజుల వేదార్థ సంగ్రహానికి అనువాదం - శిరశినహాళ్ కృష్ణమాచార్యులు - పీఠిక - త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి, 1986, పుట - VI

8. ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ శంకరుల బృహదారణ్యకోపనిషద్భాష్యమ్, మహేష్ రిసెర్చ్ ఇన్స్టిట్యూట్, వారణాశి.

9. ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ శంకరుల ఛాందోగ్యోపనిషద్భాష్యమ్, మహేష్ రిసెర్చ్ ఇన్స్టిట్యూట్, వారణాశి.

10. K. Narayanaswami Aiyar, The Thirty - two Vidyas, Introduction : Dr. V. Raghavan, Adyar Library and Research Centre, Adyar, Chennai, 1916/ 1975 p.xviii.

11. విశ్వనాథ సత్యనారాయణ, కల్పవృక్షరహస్యములు, పి.యస్. అండ్ కో, గుంటూరు, 1976, పుటలు 144-145.

12. పై గ్రంథమే, పుట - 5

13. F.No. 10, Ibid, p.1

14. శ్రీమద్రామానుజుల శ్రీభాష్యమ్ - భగవద్రామానుజ గ్రంథమాలా - (సంపా.) ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామి, గ్రంథమాలా ఆఫీస్, కాంచీపురం.

15. శ్రీ శివగీతాభాష్యమ్, శ్రీశృంగగిరి శ్రీ జగద్గురు శ్రీమదభినవ నృసింహస్వామిభిః విరచితమ్, శృంగగిరి జగద్గురు సంస్థాన ప్రకాశనమ్, మైసూరు, 1962.

F.N. No. 10, Ibid., pp. 21-22

ముదిగొండ వేంకటరామ శాస్త్రి, పీఠాధీశ విశేష ధర్మదర్పణః, పరమహంస బాహ్యదేవతార్చనా మీమాంసాచ, త్రిలింగమహా విద్యాపీఠము, విజయవాడ, **1978.**

&19 ఆంధ్రవేదార్థసంగ్రహము – తెలుగు అనువాదం – డా॥ తట్టావిజయరాఘవాచార్యులు, Introduction - Dr. S.B. Raghunathacharyulu, 1986, p.ii.

కురుగంటి సీతారామయ్య, తంజావూరు నాయకరాజస్థాన సంస్కృతాంధ్ర కవులు, భారతి, జూన్, **1934,** పుటలు – **885-894.**

1) L.A. Ravi Varma, **Rituals of Worship**, Cultural Heritage of India, Vol. IV, 1956/1975 pp. 448-449.

2) **Dr. Ananda K. Coomaraswamy, THE INDIAN TEMPLE** " It may re remarked in the first place, that the most essential part of the concept of a temple is that of **an alter** on which.or **hearth** in which offerings can be made to an invisible presence that may or may not be represented iconographically." - , SILPI, Vol. II, No.3, October 1947, pp. 83-70.

3) Naama Drury, **The Sacrificial Ritual in the Satapatha Brahmana**, Motilal Banarasidass, Delhi, 1981.

" My first objective was to consider the material of the Satapatha Brahmava in a comparative relationship by western scholars from culture other than Brahmamic Indian .... The completed **fire - alter** represented a **golden man** seated in a **golden.bird**, pointed towards the **Sun**. In this as in other rituals, Brahmamic sacrifice passes beyond any possible comparison with the known sacrifies of other cultures."

My second objective was to reduce portions of the voluminous **Satapatha Brahmana to** basic pattern of **ritual.** It is my belief that the importance of the classic of rituals to Indian and comparative studies and the intrinsic interest of its content, have been over looked because it is obscured by the Brahmamic style. After a life time devoted to the translation of the **Satapatha Brahmana** into English, **Julius Eggeling** (SBE Series) wrote of it as " of wearisome prolixity of exposition, characterised by dogmatic assertion and a flimsy symbolism rather than by serious reasoning. " **I would hope to refute Eggaling's opinion**. I have chosen three rituals, the **Agnistoma** which could be performed by any **Aryas**, the **Aswamedha** which could be performed only

by a **raja** and the **Agnicayana** which was performed by a **brahmana.**

My third objective was to demonstrate the creativity of the **Brahmanas** in their use of the **Prajapathi creation / salivation** myth as a means of re-interpreting the **Agnicayana** of the **Yajurveda** and in their use of material objects as bearers of symbolic meaning. An Analysis of the **alter-design** will show that individual graphics combined to make the plan of the alter and that these same graphics from the **Yantric** patterns familiar in **Hinduism** and **Buddhism.**"

My fourth objective was to show that, through the **ritual,** the **brahmanas** were concerned with death immortality and the relationship of man to divine reality ..... In the sacrificial system of **Satapatha Brahmana** immortality became the reward of only a limited number of men.... This philosophy found expression in the **Sataptha Brahmana** itself before it entered the period of the **Upanishads** as the **Brahman - Atman** relationship.


4) Prof. Raghu Vira, **Diagrams of Vedic Fire Alters** (వైదికచితయః) corrected and reproduced from palm leaf and paper manuscripts, Journal and Vedic Studies Vol. I, 1934, pp. 124-128, 249-256, 320-336 in collaboration with A.C. Woolner (Larore), A.B. Keith (Edinburgh), F. Edgerton (Yale, U.S.A.), H. Oertel (Munich) L. Renou (Paris)

5) **Vajasaneyi Madhyandina Satapatha Brahmana** with Vedartha Prakasha Commentary by Sayanacharya and Srihari Swami Vol. I - V, Pub :- Gangavishnu Srikrishnadass, Lakshmi Venkateswara Steam Press, Kalyan, Bombay, 1940.

6) **Satapatha Brahmana in the Kanviya Recension**, Ed., W. Caland, revised by Dr. Raghuvira, Motilal Banarasidan, New Delhi, First Ed., Lahore, 1926, Reprint 1983, 1998.

7) Dr. Catharina Kiehnle, **Vishnu, Vedi and Vamana**, Prof. Paul Thieme Felicitation Volume, Studien Zur Indologic and Iranamistic, Heft 5-6, 1980, pp. 123 - 136.

8) Chitrabhanu Sen, **A Dictionary of the Vedic Rituals**, based on the Srauta and Grhya Sutras, Concept publishing company, Delhi, 1978.

22. Stella Kramarisch, **The Hindu Temple**, Vol. II, Motilal Banarasidass, Delhi, 1946/1976, pp. 147-148.

23. 1) **Tantrasamuccaya of Narayana** with the commentary Vimarsini of Sankara, Ed., T. Ganapati Sastri, Pt. I, Trivendrum Sanskrit Series No. L XVIII, Trivendrum 1919, Pt. II, Ed., K.S. Mahadeva Sastry T.S.S. Series No. 169, 1953

    2) Dr. N.V. Mallayya, **Studies in Sanskrit Text on Temple Architecture with special reference to Tantrasamuccaya**, Journal of the Annamalai University, Vo. IX No. 1, 1939 pp. 24-29, Vol IX No. 2, 1940, pp. 115-226, Vol. XI No. 1, 1941, pp. 24-54, Vol XII No. 1, 1942, pp. I - xii and 343-354.

24. F.N. No. 21-1, Ibid, pp. 452-453.

25. P.C. Bagchi, **Evolution of the Tantras**, Cultural Heritage of India, page - 214.

26. Sarabheswara Satapathi, **Dasa Mahavidya and Tantra Sastra**, 1985, p - 7.

27. పై గ్రంథమే, పుట – 31.

28. Quoted by Agehananda Bharati, **The Tantric Tradition**, London, 1975, p-20.

29. Dr. D.C. Sircar, **The Sakta Pithas**, Motilal Banarasidass, Delhi, 2nd Ed., 1973, p-11.

30. See F.N. 28, Ibid, Notes, p.98.

31. Dr. D.C. Sircar, **The Sakta Pithas,** Foreword - L. Renou, 1st Ed., 1950, pp. iii - iv.

32. ఎల్లూరి నరసింగకవి, చూతపురీవిలాసము (యక్షగాన ప్రబంధము) (సంపా.) కపిలవాయి లింగమూర్తి, మహబూబ్‌నగర్, 1980, పుటలు – 26.

33. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, దక్షారామము (ఖండకావ్యము) పిఠాపురము, 1950.

34. శ్రీనాథుని భీమేశ్వర పురాణము, పరిష్కరణ–పీఠికారచన, చిలుకూరి పాపయ్యశాస్త్రి, రాజమహేంద్రవరము, 1958, ఆశ్వాసం – 2, పద్యం – 52.

35. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, చైత్రరథము (ఖండకావ్యసంపుటి), రాజమండ్రి, 1976, పుట – 34.

36. వడ్డాది శ్రీరామచంద్రమూర్తి, పిష్టపురచరిత్ర, ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక, రజతోత్సవసంపుటము (1911-35) ప్రచురణ 1937, పుటలు - 212-216.

37. ఆచార్య తూమాటి దోణప్ప, ఆంధ్రసంస్థానములు - సాహిత్యపోషణము, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు 1976, పుట - 242.

38. D.B. Diskalkar, **Selections from the Sanskrit Inscriptions**, New Delhi, 1977.

39. కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, హైదరాబాదు, 1963,1979. పీఠము (సం.పీఠమ్) ఆసనము, దైవపీఠము, లేక బలిపీఠము. The Pedastal or seat of an idol; a stone alter for offering rice etc., ''చోరైచ్చిరేణ చలితేస్య పురాణపీఠే పీఠాంతరం సచతురం విధివద్విధాయ.'' పండేశ్వర స్వామి దేవాలయంలోని - జయసేనాని శాసనం, Epigraphia Indica, Vol. V, p-17. మరియు చూ॥ శాసనశబ్దకోశము, పుట - 190.

40. జయంతిరామయ్యపంతులు, శాసనపద్యమంజరి, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, 1926, పుట - 26, మరియు చూ॥ South Indian Inscriptions, Vol. IV, No 742.

41. డా॥ యస్వీ. జోగారావు, చాళుక్యజయసింఘవల్లభుని పిష్టపుర శాసనములు, భారతి, డిసెంబరు 1983, పుటలు 17-20.

42. వేటూరి ప్రభాకరశాస్త్రి, కొలచెలమవారు, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1922, పుటలు -

43. సామ్రాజ్యలక్ష్మీ పీఠికాతంత్రము, (సం.పా.) కె. వాసుదేవ శాస్త్రి, కె.యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ, 1952, Introduction : K. Gopalan.

44. వాసిరెడ్డి పార్థసారథి, తంత్రశాస్త్రరహస్యాలు, భారతి, ఫిబ్రవరి 1960, పుటలు 73-79.

45. ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, సంస్కృత కవయిత్రులు - మరికొందరు, ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక, సంపుటం - 29, సంచికలు 2-3, 1940, పుటలు 145-152.

46. శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి, తిల్లిక - దాని పుట్టుపూర్వోత్తరాలు, భారతి, జూలై 1936, పుటలు 1-4.

47. గుఱ్ఱంజాషువ, తిర్లిక, భారతి, ఆగస్టు 1936 పుటలు 235-236.

48. కాళ్లకూరి సూర్యనారాయణ, తిల్లిక - మొహంజొదారో కుండగుర్తులు, భారతి, 1936, పుటలు 665-668.

49. పం. వెంకటాచార్యులు, తిర్లిక, భారతి 1936, పుటలు 669-670.

50. మల్లంపల్లి సోమశేఖర శర్మ, అమరావతీ స్తూపము - ఇతర వ్యాసములు, మద్రాసు, 1932, పుటలు 27-28.

51. See F.N. No. 26, Ibid., Page - 86

52. See F.N. No. 11, Ibid., పుట - 153

53. See F.N. No. 26, Ibid., Page - 82

54. See F.N. No. 26, Ibid., Page - 82

55. See F.N. No. 26, Ibid., Page - 83

56. ఆచార్య తుమ్మపూడి కోటీశ్వర రావు, కుమారభారతీ కావ్యము, పీఠిక, మలయకూట మంద్రస్వరాలు, అనంతపురం, 1981.

57. సువర్చలాదేవి, భ్రమరవాసిని - ఒక పరిశీలనము పుట - 99, మరియు చూ॥ శ్రీదేవీ భాగవతము - ఆంధ్రీకృతి - సరిపెల్లవిశ్వనాథ శాస్త్రి, పుట - 286.

58. A.B. Ghosh, **Spirit and Culture of the Tantras**, Cultural Heritage of India, Vol. IV, pp. 243-244.

59. యోగవాసిష్ఠము (వాసిష్ఠరామాయణము), పూర్వార్ధము - ప్రథమసంపుటము, అనువాదం పూర్ణానంద (నిర్వికల్పానందస్వామి) 1974, ఉత్తరార్ధము - ప్రథమసంపుటం - 1969, శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు.

60. పండిత వ్రజవల్లభద్వివేదీ, విజ్ఞానభైరవ్ - సమగ్రభారతీయయోగశాస్త్ర, అన్వయార్థరహస్యార్థ సంస్కృత హిందీవ్యాఖ్యాసంవలితమ్, 1978.

61. పద్మపురాణోత్తర ఖండము - ఆంధ్రవచనము - తెన్మఠం వెంకటనరసింహాచార్యులు, చెన్నపురి, 1894. అధ్యాయం - 34, శ్లోకములు - 23-26.

62. త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్ - వ్యాఖ్యాత - ఉపనిషద్బ్రహ్మయోగి, అడయార్ లైబ్రరీ, అండ్ రీసెర్చ్ సెంటర్, అడయార్, చెన్నై.

63. దేవీ భాగవతము - అనువాదము - దేవులపల్లి శివరామయ్య, హైదరాబాద్, 1984, స్కంధం - 3, అధ్యాయాలు - 17-22.

64. మత్స్యమహాపురాణము – అనువాదం – పాతూరి సీతారామాంజనేయులు, హైదరాబాద్, 1986, అధ్యాయం 261, శ్లోకములు 1–22.

65. మత్స్యమహాపురాణ పీఠిక – పాతూరి సీతారామాంజనేయులు, హైదరాబాద్, 1986, పుటలు 41–46.

66. కామఋషి మృత్యుంజయ శర్మ, గోవిందభిక్షువు – రసహృదయతంత్రము, ఆంధ్రపత్రిక దుందుభిసంవత్సరాది సంచిక, 1922, పుటలు 125–127.

67. Dr. Navjivan Rastogi, The Krama Tantricism of Kashmir, Vol. I, Motilal Banarasidass, Delhi, 1979, pp. 195-199.

2) మంగళగౌరీదేవి వచనములు ('దేవీపంచస్తవి'కి వచనానువాదం) – రాచగుండ్ల చెంచలరావు, కావలి, నెల్లూరు, 1995. "జ్యోతిర్మయీ వాఙ్మయీ" (పీఠిక) – డా॥ ముదివేడు ప్రభాకర రావు, పుటలు 7–17.

68. Pranavananda Jash, **History of Saivism**, Calcutta, 1974, Page 131.

69. వ్రజవల్లభ ద్వివేది, విజ్ఞానభైరవమ్, పుట – 112.

70. అగాధ సంశయాంభోధి
సముత్తరణ తారిణీమ్ ।
వందే విచిత్రార్థపదాం
చిత్రాం తాం గురుభారతీమ్ – భట్ట కల్లటుని స్పందకారికలు గ్రంథాంత శ్లోకం.

"I offer my salutations to that wonderful speeh of my teacher serving as a boat in going across the fathom less ocean of doubts and full of such words as expressions on many an interesting ideas."

- **Spanda Nirnaya** by **Ksemaraja**. A commentary in **Spanda Karika** English Translation by Madhusudan Kaul.

71. See F.N. No. 68, Ibid., Page - 130.

72. Ibid., P - 131

73. Ibid., Pages 130 - 131

74. See F.N. No. 44, Ibid., పుటలు 73–79.

75. వాసిరెడ్డి పార్థసారథి, మంత్రశాస్త్రోద్ధారకుడు – సర్‌జాన్ ఉడ్రాఫ్, ఆంధ్రపత్రిక ప్లవసంవత్సరాది సంచిక, 1961 – 62, పుటలు – 77–89.

76. B.N. Parimoo, Lalleswari, Sahitya Akademi, New Delhi, 1987, P 34.

77. ఎ) రాజానక భాస్కరాచార్యులు, లల్లేశ్వరీ వాక్యాని, కాశ్మీర భాషలోని లల్లేశ్వరీ వాక్యాలకు సంస్కృత శ్లోకానువాదం, శ్రీనగర్, 1932.

బి) శివశ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మ గారు కాశ్మీర శివయోగిని శ్రీలల్లా దేవి వాక్కులను ముత్యాలసరాలలో అనువదించారు. (శ్రీశివానందగురు ఎడ్యుకేషనల్ అండ్ కల్చరల్ ట్రస్ట్, ఆనందవనం, భీమునిపట్నం – 531 163), (1997) మచ్చుకు కొన్ని ముత్యాల సరాలు –

1) శివుఁడొ విష్ణువొ జినుఁడొ కానీ
పిలువపేరైదైన నేమీ?
ఆజవంజవ రోగ పీడిత
నబలననుఁబ్రోవన్

2) మదిరయో మాంసంబొ పూజా
విధికి నెయ్యదియైననేమీ?
దహరగుహ ఓంకార ముఖరిత
కుహరమై యుండన్

3) ఏటిగట్టున పొద్దువాలెను
బాట తప్పితి కాసులేదిఁక
దాఁట బెట్టెడు వాని కెయ్యది
తడయకేనిత్తున్ ?

4) శివుఁడు గుఱ్ఱము, జీను విష్ణువు
పంకజాసను ఁడంకె వన్నియ
పొంకముగ పై స్వారి చేసే
అంకకాఁడెవరో !

5) కానలాఱును గడవ శశికల
ప్రాణలీనమొనర్చి ప్రకృతిని
మానసమ్మున భక్తి వేలిచి
నేను శివుఁగంటిన్

6) తంత్రమణఁగెను మంత్రమందున
మంత్రమణఁగెను చిత్తమందున
చిత్తమణఁగిన దృశ్యమంతయు
శివుని యందణఁగెన్

7) శిలయొకండే గోపురము, గుడి
వెలయుపీఠము వేలుపునునై,
జెలఁగు విధమున శివుఁడొకండే
కల జగం బెల్లన్

78. See F.N. No. 44, Ibid., పుటలు 73-79.

79. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి, **నాథయోగి - మన వేమన**, శ్రీరమణ శ్రీప్రచురణ, విశాఖపట్టణం, 1987.

80. See F.N. No. 79.

81. See F.N. No. 28, Ibid., Pages - 167 - 168.

82. **నవనాథ చరిత్ర** - గౌరనామాత్యుడు, పీఠిక - ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్, 1984.

83. **కామకళావిలాసము**, పూర్ణానందనాథుడు, వ్యాఖ్యాత - నటనానందనాథుడు.

84. ఎ) **తెలుగు సాహిత్య కా ఇతిహాస్** (హిందీ) -
హిందీప్రచారసభ, హైదరాబాద్, 1967, పుటలు 304-305.

బి) పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి, **ఉడ్డియాన దేశము**, ''విదేశీయ బౌద్ధయాత్రికుల వ్రాతలబట్టి యావద్భారత దేశానికే 'ఉడ్డియాన దేశము' ని పేరున్నట్లు వీరు భావించారు'' భారతి, డిసెంబరు, 1959 (కలగూరగంప) పుటలు 92-93

సి) తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు, **ఆంధ్ర దేశమునకు ఓడ్యాణదేశమని పేరున్నదా?** వీరు మంత్రశాస్త్ర తంత్రశాస్త్ర గ్రంథాలను పరిశీలించి ఆంధ్రదేశమే ఓడ్యాణ (ఉడ్డియాన) దేశమని, శ్రీశైలం 'ఓడ్యాణ పీఠ నిలయమని వ్రాశారు. భారతి, మార్చి, 1966 (కలగూరగంప) పుటలు 65-67.

డి) పుట్టా మురళీరావు, **ఓడ్యాణదేశము**, శ్రీకాకుళ వాస్తవ్యులైన వీరు ఒరిస్సా సరిహద్దుల్లో గల శ్రీకాకుళం, ఇచ్ఛాపురం వరకు గల ప్రాంతాన్ని 'ఉద్దాన' శబ్దంతో వ్యవహరింపబడుతూ వుందని చరిత్ర పరిశోధకులు దీన్నింకా లోతుగా పరిశీలించాలన్నారు. వీరి ఊహాసరియైనదే! భారత దేశంలో ఒరిస్సా రాష్ట్రమే ఓడ్యాణ దేశంగా ప్రసిద్ధికెక్కినదని పండిత శరభేశ్వర శతపథిగారు Tantra Sastra and Dasa Mahavidya అనే గ్రంథంలో నిరూపించారు. శ్రీశైలంలోని భ్రమరాంబిక 'ఓడ్యాణపీఠనిలయ' గా మంత్ర తంత్ర శాస్త్రాలు చెప్పినప్పటికీ ఓఢ్రదేశమే ఓడ్యాణ దేశంగా ప్రసిద్ధ పరిశోధకులు నిర్ణయించారు. భారతి, ఏప్రిల్, 1966 (లేఖలు) పుటలు 68-69

85. ఎ) మేడపాటి వెంకటరెడ్డి, **తెలుగుయోగులు,** వేమన పరిశోధన సంస్థ, హైదరాబాద్, 1987, పుటలు 110-111 మరియు 178 - 179.

బి) మేడపాటి వేంకటరెడ్డి, (సంపా) **హరరత్నావళి** - శ్రీనివాసభట్ట మహాయోగీంద్రుడు, ఆర్తమూరు, తూర్పుగోదావరి జిల్లా, 1982.

86. శ్రీమచ్ఛంకర భగవత్పాదుల వారి దేవీభుజంగ స్తోత్రంలోని ఈ క్రింది శ్లోకాలు మాతృశ్రీ తరిగొండ వెంగమాంబను ప్రభావితం చేసివుంటాయని నేను భావిస్తున్నాను.

శ్లో॥ విరించ్యాదిభిః పంచభిర్లోక పాలైః
సమూఢే **మహానందపీఠే నిషణ్ణామ్** ।
ధనుర్బాణ పాశాంకుశ శరప్రోత హస్తమ్
మహస్త్రైపురం **శంకరాద్వైత** మవ్యాత్॥

శ్లో॥ యదన్నాదిభిః పంచభిః కోశజాలైః
శిరః పక్ష పుచ్ఛాత్మకైరంత రంతః ।
నిగూఢే **మహాయోగపీఠే నిషణ్ణమ్**
పురారే రథాంతః పురం నౌమి నిత్యమ్ ॥

శ్లో॥ గణేశైర్గ్రహైరంబ నక్షత్ర పంక్త్యా
తథా **యోగినీ రాశిపీఠై** రభిన్నమ్ ।
మహాకాల మాత్మానమామృశ్యలోకమ్
విధత్సేకృతిం వాస్థితిం వా మహేశి ॥

బంగారు పీఠంపై తల్లి పాదాల నుంచి కూర్చున్న తీరును శ్రీశంకర భగవత్పాదులు, **దేవీచతుష్షయష్ట్యుపచార పూజా స్తోత్రంలో** యిలా వర్ణించారు.

శ్లో॥ కనకమయ వితర్దిస్థాపితే తూలికాఢ్యే
వివిధకుసుమ కీర్ణేకోటి బాలార్క వర్ణే ।
భగవతి రమణీయే రత్నసింహాసనేఽస్మి
**న్నుపవిశ పదయుగ్మం హేమపీఠం నిధాయ॥**

చూడడం, అలాగే ఆలోచించడం, అట్లే బతికేయడానికి ( In Water - tight compartments) అలవాటుపడిపోయిన మనకు జీవితంలో అన్ని విషయాలకు ఎక్కడికక్కడ సమన్వయం ఉంటుందన్న స్పృహ ఏ కొద్ది మందికి మాత్రమే ఉండి, తక్కిన వారికెందుకు లేకుండా పోవాలి? అందుకే " We live in parts, we live in divisions అంటాడు Emerson అనే తాత్త్వికుడు. భౌతికవాదుల సంఖ్య మానవసమాజంలో మితిమీరి పెరిగిపోవడం మూలాన వేదార్థం అపార్థానికి దారితీసి, దురర్థాలచే, దుర్వ్యాఖ్యానాలచే విషమూర్ఛితమై కాలక్రమేణ యజ్ఞ భావన (Concept of Yajna) అడుగంటి పోయింది.

యజ్ఞభావన సంకుచితమైంది కాదు. అది విశాలమైన అఖండ భావన. ''**ఒక మహా విషయనిర్ధారణమునందు కాలఖండములయందున్న భావుకులకంటె నఖండకాలమునందున్న భావుకుల బుద్ధి ప్రమాణము**'' అని చెప్పిన విశ్వనాథ వారి వాక్యాన్ని మన మిక్కడ యజ్ఞ భావనకు అనుసంధానం చేసుకొంటే ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా ఆ విధంగా విశ్వజనీనంగా ఆలోచించగలవారు ఉంటారని, వారి వల్లనే మహావిషయాలకొక గుర్తింపు ఏర్పడుతూవుందని తెలుస్తుంది. ఐన్‌స్టీన్ యొక్క Principle of Relativity సిద్ధాంతం బాగా అర్థమయిన వాళ్లను ప్రపంచంలో ఎలా వేళ్లమీద లెక్క పెట్టవచ్చునో, అలాగే యజ్ఞం యొక్క యథార్థస్వరూపం తెలిసిన వారు కూడా అంత తక్కువ మందే వున్నారు!.

ప్రపంచంలోని మానవసమాజాలలో ఈనాడు యజ్ఞభావన (Concept of Yajna) అడుగంటిందని మనం స్పష్టంగా ఒప్పేసుకున్నాం! అయితే, గుడ్డిలో మెల్లగా, ''స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతే మహతోభయాత్'' అని గీతా ప్రవక్త అభయహస్తంతో వాగ్దానం చేసినట్లుగా ఏ కాస్తో కూస్తో అడుగుభాగంలో అంటుకొన్న ధర్మమే ( A residue of Dharma) మనల్నిప్పుడు రక్షిస్తూ వుంది. ఇలా ఇంగువకట్టిన గుడ్డల బతుకు బతికే మనకు ఉపనిషత్తులు పెద్ద ఊరటను కల్గిస్తున్నాయి.

ఉపనిషత్తులొక గొప్ప చమత్కారం చేశాయి. యజ్ఞభావన ఎప్పుడైతే అపార్థానికి దారితీయబడిందో, ఉపనిషత్తులు యాజ్ఞికమైన అగ్ని ఉపాసన (Fire worship) ను అంతరమైన బ్రహ్మవిద్యోపాసనగా రూపాంతరీకరణం ( The Transformation of Fire worship and concept of Yajna into Upanishadic Brahma Vidya) చేసింది. బాహ్యంగా ఏమీ లేదు అంతా లోపలే జరగాలి. యజ్ఞోపకరణాలన్నీ నీలోపలే ధ్యానమార్గం (meditation) లో అమర్చుకోవాలని చెప్పింది. ఆ విధంగా ఉపాసనా మార్గాలు ఒక్కొక్క సాధకుని భేదాన్ని బట్టి ముప్పై రెండు ఏర్పడ్డాయి. వీటినే ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలంటారు. '' అదేమి బ్రహ్మవిద్యా? '' అంటాం లోకంలో. అంటే, అంత కష్టమని అర్థం. చక్షురక్షరసంయోగంలాంటి యజ్ఞాన్ని

ఎప్పుడైతే కాదన్నావో అంతకంటే కఠినమైన (made difficult) బ్రహ్మవిద్యోపాసన మనకందుబాటులో లేకుండా పోయింది.

ఇది, ఇలా కాదని కొందరుమేధావులు, మహానుభావులు 'అమూర్తము' తాత్త్వికము, ప్రతీకార్థమైన అగ్ని ఉపాసనను, యజ్ఞశాలానిర్మాణాన్ని, బ్రహ్మ విద్యోపాసనలో మానవ శరీరమే దేవాలయమనే భావనను మేళవించి, సగుణము, సాకారమైన అర్చావిగ్రహాన్ని వైదికయజ్ఞంలోని అగ్నిస్థానంలో ప్రతిష్ఠించి, యజ్ఞశాలా పథకాన్నే దేవాలయంగా రూపొందించారు. అప్పుడు యజ్ఞశాల = దేవాలయమను నిర్మాణం, దేవాలయతత్త్వం = మానవశరీరం (మనుష్యాలయచంద్రికా) గర్భగుడి (Sanctum Sanctorum) యే యజ్ఞవేదికగా, యజ్ఞవేదికపై వెలిగే అగ్నియే, అర్చావిగ్రహబింబంగా రూపాంతరం చెందాయి.

అయినా సాధకులు కొందరు వదలక నిరాకారము, నిర్గుణము అమూర్తము అయిన పరబ్రహ్మతత్త్వాన్ని యోగసాధన చేతనే దర్శించాలని పట్టుదల గలవారయ్యారు. వీరందరికీ మార్గదర్శకంగా పతంజలి యోగదర్శనాన్ని అనుగ్రహించారు. యోగసూత్రాలు అష్టాంగ యోగాలను ప్రతిపాదించింది. ఇదే కాలక్రమేణ, శ్రీ విద్యోపాసనగా తాంత్రిక పద్ధతికి దారితీసింది. ఆ తర్వాత ఇది కుండలినీ యోగంగా యోగసాధకులు నేడు అనుష్ఠిస్తున్నారు. ప్రపంచ మతాలలో ఎందరో యోగులు జన్మించడంతో కుండలినీ యోగం అన్ని మతాలలో ఏదో ఒక పేరుతో, నేడు ప్రసిద్ధికెక్కింది.

పై చెప్పబడిన దేవాలయంలోని మూర్తిని అర్చించే విధానాలలో అత్యంత ప్రాచీనమైన విధానం వైఖానసం కాగా, మహాభారత కాలం నుండి పాంచరాత్రం రూపురేఖలు దిద్దుకొన్నది. వైఖానసం వైదికమైనది. ఇది అమూర్తమైన అగ్ని ఉపాసను యాజ్ఞిక ప్రక్రియను సమూర్తార్చనగా, దేవాలయం అర్చా విధానాలుగా రూపాంతరం చెందింపజేశాయి. పాంచరాత్రం చతుర్విధవ్యూహాత్మకమైనది. అది వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధవ్యూహాలు. ఈ పద్ధతి తాంత్రికమైనది. కనుక నవీనము. ఉపాధిగతుడైన జీవుడిందులో వ్యూహాత్మకుడై సోపానపరంపర ఎక్కుతూ చివరి సోపానమైన వాసుదేవ సోపానాన్ని అధిరోహించినప్పుడే ముక్తి! ''వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః'' అని గీతలో భగవంతుడే చెప్పినట్లు సనాతనమైన వాసుదేవ పరబ్రహ్మలో జీవుడు సాయుజ్యం చెందడానికి ఎన్నో ఆవరణలు, వ్యూహాలు ఛేదించుకొని వెళ్లవలసివుంటుంది.

యామునాచార్యులచే ఔత్తరాహం నుండి దక్షిణ దేశానికి కొనిరాబడిన పాంచరాత్రాన్ని ఆయన తర్వాత వచ్చిన శ్రీరామానుజులు ఎంతో అభిమానించి దేవాలయం అర్చావిధానంగాప్రవేశపెట్టినప్పటికీ, 'భక్తియోగం' గొప్పదని శ్రీభాష్యంలో సాధన సప్తకాన్ని నిర్దేశించారు. అది, కూడ ఒక రకంగా పాతంజల అష్టాంగ యోగ మార్గమే! చివరికి అది సాధకులకు నిర్దేశించిదని, సామాన్యులకు శరణాగతియే ఏకైక మార్గమని విస్పష్టంగా చెప్పారు.

''తుష్య చ వశీకరణే తచ్ఛరణాగతిరేవ'' అని శ్రీభాష్యంలో శ్రీరామానుజుల వాక్కు! భగవంతుని వశీకరించుకోవడానికి శరణాగతి ఒక్కటే మార్గము! భగవంతుని పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారాలనే ఐదు స్థితులలో, వేదోపనిషత్పురాణాలు పర, వ్యూహ, విభవావతారాలను గురించి చెప్పగా, పాతంజల, కుండలినీ యోగాలు అంతర్యామితత్త్వాన్ని చెప్పాయి. అర్చావతార సౌలభ్యంతో దేవాలయంలోని గర్భగుడిలో వెలసిన యజ్ఞమూర్తిగా యజ్ఞవిష్ణువు, 'అగ్నిస్థానీయమైన అర్చాబింబంగా' మనకు దర్శనమనుగ్రహిస్తూ యజ్ఞమే తానని, తానే యజ్ఞమని వైదిక రహస్యాన్ని మనకు తెలియజేస్తున్నాడు!.



## II

ఈనాటి ప్రపంచాన్ని రెండు భాగాలుగా వింగడించవచ్చు. పాతప్రపంచం (Old World), కొత్త ప్రపంచం (New World). పాతప్రపంచంలో ఏషియా (Asia), యూరోప్ (Europe), ఆఫ్రికా (Africa), తూర్పు సముద్రోత్తర ద్వీపాలు (Far East Islands), ఆస్ట్రేలియా (Australia), కొత్త ప్రపంచంలో ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికాలు.

ప్రపంచ ప్రాచీనచరిత్రలోకి త్రవ్వుకుంటూ వెళితే మన కత్యంతం ఆశ్చర్యాన్ని రేకెత్తించే అంశం ఒకటి తటస్థపడుతుంది. అన్ని మతాల సంప్రదాయాలు, నమ్మకాలు మానవజీవగతికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలన్నీ ఒకే విధంగా ఉండడమే కాదు, అవి వైదిక సంస్కృతికి చాల దగ్గరగా ఉందని తెలుస్తుంది. పురాతత్త్వ పరిశోధనలు కూడ ఈ విషయాన్నే ధ్రువీకరిస్తున్నాయి. కొందరు చరిత్రకారులు అతిప్రాచీన నాగరిక జాతుల్ని ఆర్యులని వ్యవహరిస్తున్నారు. నిన్న మొన్నటి వరకు సెమిటేస్ (Semites) ఛాల్డియన్స్ (Chaldeans) సుమేరియన్స్ (Sumerians) నార్డిక్స్ (Nordics) ఇలా వివిధ నామధేయాలతో పిలుస్తున్న వారిని 'ఆర్యులు' గా పరిగణించడానికి వెనుక బలవత్తరమైన కారణమేమైఉండాలి? ఇంతే కాదు, యూరోప్ లోను, ఏషియా మైనర్ లోను కొన్ని జాతులు తమను 'ఆర్యుల' ని పిలుచుకోవడంలో ఎంతో గర్వపడుతున్నారు. ఆర్యులనేది ఒక జాతిని సూచించే మాట కాకపోయినప్పటికీ సంస్కృతంలో ఆర్యులంటే ఉదాత్త, ఉన్నత వ్యక్తులని అర్థం. ఉత్తమ సంస్కారం గలవారిని సంస్కృతంలో ఆర్యులని పిలుస్తారు. ఆర్యా! అనే సంబోధన వేదాలలో, వైదిక వాఙ్మయంలో మనకు ఈ అర్థంలోనే కనబడుతుంది.

ఆర్యుల అత్యంత సూక్ష్మదృష్టి, దూరదృష్టి చేతనే ప్రపంచంలోనే తొట్టతొలి గ్రంథమైన వేదమిప్పటికి మౌలిక లక్షణాలతో పరిరక్షింపబడివుంది. అందుచేతనే, ఆ ఉదాత్త సత్త్వులను దైవిక జ్ఞాన సంపన్నులైన ఋషులుగా మనం పరిగణిస్తున్నాము. 'అర్షంతే ప్రాతిభంచక్షుః' అనే మాటకు వారు తార్కాణంగా నిలుస్తారు. వేదము తొలిసారిగా ఋషులకు కల్గిన జ్ఞానదర్శనం. ఈ దర్శనచ్ఛాయలు, అడుగుజాడలు ప్రపంచమతాలలోను ప్రసరించి ప్రతిఫలించడం చేతనే కాబోలు యూరోపు, ప్రాచీన ఈజిప్టు, ఏషియామైనర్, సిరియా, పర్షియాల నాగరికతను అర్యుల నాగరికతగా పిలుస్తున్నారు. వైదిక సంస్కృతియే ప్రపంచంలోని అన్ని నాగరికతలకు ఆధారభూమికయని అందరూ అంగీకరిస్తున్నారు.

వేదఋషి తొలిసారిగా ఉచ్చరించిన శబ్దం అగ్ని!

**''అగ్ని మీళే పురోహితం**
**యజ్ఞస్యదేవ మృత్విజమ్**
**హోతారం రత్నధాతమమ్''** (ఋగ్వేదం 1-1-1)

'అగ్ని' అనే మాట వెలువడినంతనే, భగవదారాధనకు మూలమైన ఆధారమేదో లోకానికి వెల్లడిచేయబడింది. **''అగ్నిముఖావై దేవాః''** దేవతలను అగ్నిద్వారానే అర్చించాలి. ఈ భూమిపై అగ్నిని తొలిసారిగా తెలుసుకున్న వారు ప్రాచీన ఋషులైన భృగువంశజులు. అగ్ని భౌతిక జగత్తులోని ఒక అఖండ శక్తి! ఇదే దుర్వారమైన శాశ్వత శక్తిగల సూర్యుడు! ఈ సూర్యుడే సృష్టికర్తయైన పరబ్రహ్మ! **''సూర్యోఆత్మాజగతౌ చక్షుషశ్చ''** సూర్యుడే ఆత్మ, జగత్తుకు కన్ను .ఈ భావమే మహాభారతం కర్ణపర్వంలో తిక్కన సోమయాజి యిలా వ్యక్తీకరించాడు!

**'' అనలుడు, భాస్కరుండును, సుధాంశుడు నధ్వరసంప్రవర్తకుల్ వినుము నరేంద్ర! యీ క్రతువు విష్ణుమయంబు''** సృష్టి అనేదొక అధ్వరం! యజ్ఞం ! ఈ యజ్ఞాన్ని ముగ్గురు నడుపుతున్నారు. వారు అనలుడు (అగ్ని) భాస్కరుడు (సూర్యుడు) సుధాంశుడు (చంద్రుడు). మరి, యజ్ఞము విష్ణుమయము. **''యజ్ఞోవైవిష్ణుః విష్ణుర్వైయజ్ఞః''** అని వేదము. అగ్ని, సూర్యుడు ఈ క్రతువులో భాగస్వాములన్నాము. సుధాంశుడెలా అవుతాడు? అనేది ప్రశ్న! అగ్ని, సూర్యులిద్దరు ఉష్ణశక్తులు, చంద్రుడు శీతలశక్తి! సూర్యుడు పగటికి, చంద్రుడు రాత్రికి ప్రతినిధులు. అందుకే, **''అగ్నీషోమాత్మకం జగత్''** అని వేదమే చెప్పినది. చంద్రుడు సృష్టి కారకుడు. **''కామస్తదగ్రే సమవర్తతాధిమనసోరేతః ప్రథమం యదాసీత్''** - అని అస్యవామీయసూక్తము. మనస్సుకు అధిష్ఠానదేవత చంద్రుడు! **'చంద్రమా మనసోజాతః'**

మనస్సు నుండి పుట్టేవాడు చంద్రుడు! అతడలా సృష్టికి కారకుడవుతున్నాడు! కాబట్టి, వ్యాసమహర్షి, చెప్పినది నూటికినూరుపాళ్లు సత్యం! ఎవరి మనస్సు నుండి పుట్టాడీ చంద్రుడు? అంటే సృష్టి అనే యజ్ఞాన్ని ప్రవర్తింపజేయడానికి సంకల్పించిన విష్ణువు యొక్క మనస్సు నుండి అందుకే, విష్ణుమనోజాతుడైన వాడు మన్మథుడు. జీవుల మనస్సులను మథించువాడు. ఆ విధంగా పరమాత్మ సంకల్పం సఫలమైనది. ''పరోక్షప్రియయా హిదేవాః'' దేవతలు పరోక్షప్రియులు.

శక్తికి ప్రతీకలైన అగ్ని, సూర్యుడు, చంద్రుడు - ఈ మూడుతత్త్వాలే మానవజీవిత గమ్యాన్ని, ధ్యేయాన్ని మలుస్తూవుంది. ఈ మూడు శక్తులను ఉపాసించడం చేత ఉన్నతమైన, ఉదాత్తమైన గుణగణాలను సంపాదించిన వారే 'ఆర్యుల' ని పిలువబడుతారు. లాటిన్ భాషలో **'అగ్ని'** శబ్దమే ఇగ్నిస్ గా పిలువబడుతున్నది. 'ఆర్య' శబ్దం ఎన్ని మార్పులతో ప్రపంచదేశాలలో ప్రయోగింపబడుతుందోతెలుసుకొందాము.

| | | |
|---|---|---|
| 1. | ప్రాచీన పర్షియన్ | ఆర్య = ఉదాత్తుడు, ఉన్నతుడు |
| 2. | సుమేరియన్ | **అర్, అర**, ధాతురూపాలు కాగా, **అరిస్** **అరిస్టోక్రట్** రూపాలు ఏర్పడుతున్నాయి |
| 3. | ఈజిప్టు | ఉదాత్తము, తేజస్సు, వైభోగము. రాజకుటుంబాల వారు '**అర**', '**ఆర్యా**' శబ్దాలను బిరుదాలుగా ధరిస్తారు. |
| 4. | గోథ్<br>స్కాండినేవియన్<br>జర్మన్<br>ఆంగ్లో - సెక్సాన్స్ | **హెర్, హెర** (Her, Hera)<br>**హెయర్రా** (Hearra)<br>**హెయర్** (Hearr)<br>వంటి పదాలను వాడుతారు. దీనికి ప్రభువు, స్వామి అని అర్థాలు |
| 5. | గేల్స్, ఐరిష్ స్కాట్స్ | **ఐరే** (Aire) = స్వామి, యజమాని (ఆర్య = అయ్య ప్రకృతి వికృతిరూపాలు. తమిళంలో 'అయ్య' శబ్దమే అయ్యర్, అయ్యంగార్ గా మారింది) |
| 6. | మెడెస్ (Medes) | **అరియోస్** (Arios), **హర్రి** (Harri), = ఉదాత్తత్వము |
| 7. | ''డేరియస్ దిగ్రేట్'' తనను-ఆర్యుడని పిలుచు కోవడంలో గర్వపడే వాడు | ఇతని సమాధిపై ''**ఒక ఆర్యుడు**'' ''**ఆర్యుల సంతతివాడు**'' అని వ్రాయబడింది. |
| 8. | జెర్ జెస్ (Xerxes) | తనను తాను **హర్రి** (Harri)అని పిలుచుకొనేవాడు |
| 9. | హిట్టైట్స్ | **అరి** |

ఈ పరిశీలన చేత విష్ణువుకున్న 'హరి' అనే పేరుకూడ 'ఆర్య' శబ్ద భవవేమో పరిశీలింపవలసివుంది. సంస్కృత పదం 'ఆర్య'అర్య పాలీ భాషలో 'అరియ' అవుతుంది. 'య'లోపింపగా ఉచ్చారణలో 'అ' 'హ' గా మారి 'హరి' అనే పదం ఏర్పడివుండవచ్చు. (హరివాణము - అరివాణము ప్రకృతి వికృతి రూపాలైనట్లు, అరిదళము - హరిదళము (వైకృతము, విశేష్యము).

ఈ దృష్టితో ప్రపంచంలోని వివిధ మతాలలో అగ్ని ఆరాధన, ఉపాసన ఎలా యిప్పటికీ ఏదో ఒక రూపంలో నిల్చివుందో పరిశీలిద్దాము.

పాతప్రపంచం ( Old World) లోని మతాలలో

1) హిట్టైట్ మతం (Hittite Religion)
2) సుమేరియన్ మతం (Sumerian Religion)
3) ఎఖిమీనియన్ మతం (Achaeminian Religion)
4) ఫోనీషియన్ మతం (Phoenician Religion)
5) ఆఫ్రికన్ మతం (African Religion)
6) గ్రీకు మతం (Greek Religion)
7) కెల్టిక్ మతం (CelticReligion)
8) రోమన్ మతం (Rome Religion)

కొత్త ప్రపంచం ( New World) లో-

1) హోపి మతం (Hopi Religion)
2) మయన్ మతం (Mayan Religion)
3) ఇన్కాస్ మతం (Incas Religion)
4) తక్కిన తెగలు

పాతప్రపంచం (Old World)లో భూగోళానికి తూర్పు దిశవైపు (Eastern hemisphere) గల మతాలు

1) షామన్ మతం (Shaman Religion)
2) ఐను మతం (Ainu Religion)
3) చైనీయుల మతం (Chinese Religion)
4) ఇండో చైనీయుల మతం (Indo - Chinese Religion)
5) ఇండో నేషియన్ మతం (Indonesian Religion)
6) ఫిలిపినో మతం (Filipino Religion)
7) పాలినేషియన్ మతం (Polynesian Religion)
8) ఆస్ట్రేలియన్ మతం (Australian Religion)
9) బౌద్ధమతం (Buddhism)
10) జైనమతం (Jainism)
11) పార్శీమతం (Parsee Religion or Zoroashtrianism)

12) జ్యూమతం లేక జూడాయిజమ్ (Jew Religion)

13) క్రైస్తవ మతం (Christianity)

14) ముస్లిమ్ మతం (Muslim Religion)

15) హిందూమతం (Hinduism)

16) సిక్కు మతం (Sikh Religion)

**హిట్టైట్ మతం :** హెబ్రూ పాత నిబంధన (Hebrew Old Testament) ప్రకారం హిట్టైటులు ఇజ్రాయిల్, జరూసలేమ్, మరియు పాలస్తీనా ప్రాంత వాసుల కంటే అతి పురాతనమైన గొప్ప నాగరికత గల జాతిగా గుర్తింపబడినారు. వీరి కాలము క్రీస్తు పూర్వము **3000** సంవత్సరాలకు ముందే చెప్పబడింది. సాధారణంగా వీరు సుమేరియన్లని పిలువబడినా, కొందరు వీరిని తొట్టతొలి ఆర్యుల అవశేషజాతిగా గుర్తిస్తున్నారు.

హిట్టైటుల తొలి పురోహిత రాజు సూర్యదేవుడుగా గుర్తింపబడినాడు. వీరు సూర్యారాధకులు. ఏరాజ శాసనాన్ని చూచినా ప్రారంభంలో సూర్యదేవతాస్తుతి కనబడుతుంది. ఖమ్మురబీ అనే రాజు యొక్క విశ్వాసం ప్రకారం అతనికి రాజ్యాంగ న్యాయసూత్రాలు సూర్యదేవుని నుండి సంప్రాప్తించాయంటారు. హెట్టైటుల పవిత్రచిహ్నం శిలువపై చెక్కిన సూర్యుడు. ప్రాచీన బ్రిటనులు ఈ గుర్తునే గలిగివున్నారు. పాలస్తీనుల వలె హిట్టైటులు కూడ మెసొపొటేమియా, సిరియా, గ్రీస్, ఈజిప్ట్ తత్పరిసర ప్రాంతాలపై తమ సాంస్కృతిక ప్రభావాన్ని ప్రసరింపజేశారు.

**సుమేరియన్ మతం :** జగచ్చక్షువైన సూర్యదేవతారాధనకు సంబంధించిన ఆర్యజాతి యొక్క ప్రాచీనపు ఆచారవ్యహారాలను పవిత్రంగా పరిరక్షించిన వారు పురాతన గోథ్లు, గుడియా లేక గూట్ జాతివారు. వీరు క్రీ.పూ. **2500** నాటివారు.

కొత్త పరిశోధనవల్ల ''ఆర్యులు తొలి సుమేరియన్లే'' నని వెల్లడి అయింది. గూట్ లేక గుడియా దేశపు రాజు యొక్క అల్లుడు ఉర్ (Ur dynasty) వంశానికి చెందిన వాడు. ఈ వంశపు మూలకర్త ఎవరో నిన్న మొన్నటి వరకు తెలియరాలేదు. ఈ రహస్యం మహాభారతంలోని ఔర్వుని కథ వలన వెల్లడయింది. ఉరుయష్ జీకం (Uruash Zikam) అనే వ్యక్తి ఉరు లేక ఔర్వుడేనని గుర్తింపబడింది. ఉరు లేక ఔర్వుడు అగ్ని ఉపాసకులకు ప్రాచీన పురోహితుడు. మహాభారత ఇతిహాసంలోనే భృగువు కథ చెప్పబడింది. అగ్నిని ఉత్పాదించి సంరక్షించే వైజ్ఞానిక విద్యను భృగువే కనిపెట్టాడు. ఇతడు వేదకాలంలో అగ్ని పరిశోధనలు జరిపిన పురోహిత కుటుంబానికి చెందిన వాడు. మహాభారతంలోని 'ఉరు' కూడ ఈ కుటుంబానికి చెందిన వాడే. ఉరుయష్ జీకం సూర్యుని నుండి సంక్రమించిన రాజ్యాంగ న్యాయసూత్రాలనే

పాటించాడు. భృగువంశజులైన వారు వేద మంత్రాలకు ద్రష్టలైనట్లే, ఉరుయష్ జీకంకు సూర్యదేవతా ప్రోక్తమైన రాజ్యాంగ న్యాయసూత్రాలు లభించడంతో పోలికవహిస్తున్నాయి. ఉరుయష్ కుమారుడు దుంగి (Dungi) తండ్రి రాజ్యకాలంలోనే పురోహితుడుగా ప్రసిద్ధికెక్కాడు. పురోహితుడంటే అగ్ని ఉపాసకుడు. అగ్ని ఆరాధన రాజ కుటుంబాలను ప్రభావితం చేసిందని దీన్ని బట్టి తెలుస్తున్నది. మహాభారతంలో భృగువంశానికి చెందిన జమదగ్ని యే పై కథలో 'దుంగి' గా చెప్పబడినాడు. ఉరు ప్రాంత వాసులైన 'ఉరుకోహయ'లను ఉద్దేశించి జమదగ్ని (దుంగి) పాడిన గీతం యిలా వుంది.

ఓ అగ్నీ! ఉరుప్రాంత వాసులే నిన్ను పుట్టించారు
వారి గీతాలనువింటూ ఈ హోమద్రవ్యాలను స్వీకరించు!
నీవు మానవజాతిచే చక్కగా అర్చించబడుతున్నావు !!

దుంగి యొక్క కుమారుడు పుర్షసిన్ లేక బర్షసిన్‌గా చెప్పబడింది. ఇతడు జమదగ్ని కుమారుడైన పరశురాముడుగా గుర్తింపబడినాడు. ఇతడు విష్ణువు యొక్క దశావతారాల్లో ఒక అవతారంగా, మహాశక్తిశాలిగా పరిగణింపబడినాడు. ఈ విధంగా ఈసిన్ (Esin dynasty) వంశానికీ, భృగు వంశానికీ (Bhrigu dynasty) ఎన్నో సామ్యాలు కనబడుతున్నాయి. భృగు, భార్గవుల ప్రభావం ఈసిన్ వంశంపై ఎంతగా ప్రసరించిందంటే ఉరుయష్ జీకం వంశీయులు తమకు 'భార్గవులు' గా పిలుచుకున్నారు. ఈ అంశాన్ని మరికొంత విస్తరించి చూస్తే భృగు వంశంలోనే పుట్టిన శుక్రాచార్యుడు అసురుల పురోహితుడుగా మన భారతీయ పురాణాలలో ఉన్నాడు. ఇతడు అసుర రాజ్యాలలో నివసించడం దీనిని బలపరుస్తూ వుంది.

**ఎఖిమీనియన్ మతం :** పురాతత్త్వవేత్తల త్రవ్వకాలలో ఎఖిమీనియన్లు ఆరాధించిన సూర్యదేవాలయం బయటపడింది. ఈ స్థలానికిప్పుడు భిషాపూర్ అని పేరు. ఫోనీషియన్లతో కూడా సంబంధం గల్గిన ఈ ప్రదేశానికి విశ్వపుర మనేది ప్రాచీననామం. అగ్ని ఆరాధనను విశ్వవ్యాప్తం చేయడంలో ఈ దేవాలయ ప్రాంతం కేంద్రస్థానం కావాలని వారి ఉద్దేశ్యం కాబోలు!

మరియొక త్రవ్వకంలో బయటపడిన శిల్పంలో ఒక రాజు, రాణి వృషభాన్ని అర్చిస్తున్నారు. వృషభం సృష్టి శక్తికీ, వాతావరణానికీ ప్రతీక! వృషభానికి ఎదురుగా ఒక అగ్ని వేదిక ఉన్నది. రాజు అందులో హవిస్సును సమర్పిస్తున్నాడు. హిట్టైటులు దేవాలయాలను పవిత్రంగా భావించి, అక్కడ జరిగే యజ్ఞాలు దేవాలయంలోని అధిష్ఠాన దేవతకు చెందేదిగా భావించారు.

**ఫోనీషియన్ మతం :** ఫోనీషియన్లు తమను **పురత్**, **ప్రుత్**, **భరత్** అని పిలుచుకుంటారు. వీరు తమ పూర్వీకులుగా పృథు చక్రవర్తినీ, భరతుని పరిగణిస్తారు. క్రీ.పూ.

3180 ప్రసిద్ధికెక్కిన సుమేరియన్ చక్రవర్తి పేరు **బర్తు** లేక **పిర్తు**. ఇవి **భరత**, **పృథు** శబ్దాలకు అపభ్రంశరూపాలే. ఫోనీషియన్లతో తర్వాతి తరం వారు మెడిటరేనియన్‌లో వ్యాపించారు. వారు సూర్యారాధకులు. ఒక అగ్ని వేదిక అక్కడ కనుగొనబడింది. సూర్యదేవుని కిరణాలతో చిత్రితమైన ఫలకం క్రీ.పూ. 400 నాటిదని నిర్ణయింపబడింది.

**ఆఫ్రికన్ మతం :** ప్రాచీన ఈజిప్టుల నాగరికత ఆర్యుల సంస్కృతిచే ప్రభావితమైందని చెప్పడానికి వారి మతం సూర్యశక్తిని ఆరాధించడమే! **మెనెస్ (Menes)** అనే ఒక ఈజిప్టు రాజు గొప్ప సూర్యారాధకుడు. అతని ప్రభావం ఎంతదూరం ప్రసరించిందంటే వారి నాగరికతా కేంద్రస్థానం మెసొపొటేమియా నుండి ఈజిప్టుకు మారినది. హిట్టైటులు సూర్యుణ్ణి పురుషదేవతగాను, స్త్రీ దేవతగాను కూడా ఆరాధిస్తారు. ఈజిప్టు దేశం 7000 సంవత్సరాల కంటే ఎక్కువ పురాతనత్వం గలిగింది. వీటికి లిఖితపూర్వక ప్రమాణాలు, చరిత్ర 2000 సంవత్సరాల వరకు లభించింది. కాబట్టి, మత విశ్వాసాలలో ఎన్నో మార్పు చేర్పులు జరిగివుండవచ్చు.

యజ్ఞవేదికలు మనకిక్కడ లభించక పోయినా సూర్యోపాసనకు గట్టి ఆధారాలు లభించాయి. 'ర' అని పిలువబడే సూర్యదేవతను హెలియోపోలిస్ అనే చోట ఆరాధించేవారు. ఈజిప్టు రాజు తన పేరుకు ముందు 'ర' చేర్చుకొని 'ర-నెబ్-మాట్' అని పిలుచుకొనేవాడు. 'ర' సూర్యునికే కాక సత్యదేవతకు కూడ పేరు. అస్తమిస్తున్న సూర్యునికి ఆత్మ లేక తుమ్ అని పేరు. ఉదయిస్తున్న సూర్యునికి ఖేపెర అని పేరు. చాచిన చేతుల మీద సూర్యకిరణాలు పడుతున్నట్లు బొమ్మలు లభించాయి. ఇవి వారిచ్చే కానుకలను సూర్యుడు స్వీకరించాడని అర్థం.

ఆఫ్రికా ఖండంలో సూర్యోపాసన ఏదో ఒక రూపంగా యిప్పటికీ ఉందని చెప్పవచ్చు. బెను యార్ ఘోష్ అనే తెగ వారు షిబూబా లో ఒక దేవాలయాన్ని నిర్మించుకొన్నారు. పేగన్ అనే పేరుగల మాగస్ (మాగి) తెగ వారు, ఈ దేవాలయాన్ని అగ్ని గృహం (House of Fire) గా అభివర్ణించారు.

**గ్రీకుమతం : ఓవెల్వ్** (Ovelv) అనేగ్రీకు పదానికి **అగ్ని వేదిక** అనే అర్థం చెప్పవచ్చు. ఈ పదానికి గల ధాతు రూపానికి 'పొగ' లేక 'నిప్పు' అనే అర్థాలున్నాయి. గ్రీకులలో కూడ యజ్ఞభావన తొలినాళ్లలో ఉన్నంతగా లేకుండ పవిత్రతను కోల్పోయింది. కాలక్రమేణ, యజ్ఞం (sacrifice) రక్త సహిత యజ్ఞం, రక్త రహిత యజ్ఞమని రెండు విధాలుగా విభజింపబడింది. రక్త సహిత యజ్ఞంలో వృషభాన్ని బలియిచ్చేవారు. క్రమేపీ దాని స్థానంలో కాయగూరలు, పండ్లు, పానీయాలు యివ్వడం ఏర్పడింది.

స్వచ్ఛమైన అగ్నివేదికలు డెలోస్‌లోని అపోలో దేవతకు ఉంది. దీనినే కయోపో యొక్క అగ్ని వేదిక (Kaoapo's alter) అంటారు. ఏథెన్స్ పట్టణంలోని జీయస్ (Zeus) దేవతకు గల అగ్నివేదిక పేర్కొనదగినవి. అలభ్యమైన యూరిపిడేస్ (Euripides)l నాటకంలో ఒక వాక్యం సమకాలీనుల వ్రాతలలో లభించింది. ఆ వాక్యం యజ్ఞ భావనకు నీరాజనమిస్తున్నది.

"Know well that when one sacrifies to the Gods in piety one wins salvation, though the sacrifice be little."

**కెల్టిక్ మతం :** కెల్టిక్ మత విశ్వాసాలు అతి రహస్యమైనవి. సీజర్ మొదలైన ప్రాచీన రచయితలను బట్టి కెల్టిక్ మతస్థులు పురాతన కాలంలో నరమేధం (human sacrifice) చేసేవారు. ఇది తర్వాతి కాలంలో జంతు బలి (Animal sacrifice) గా మారింది. ఇటీవలి కాలంలో అంటే 18వ శతాబ్దం నుండి అగ్ని మహోత్సవం (Fire Festival) జరుపుతూ అగ్నికి బియ్యం లేదా గోధుమ పిండితో చేసిన పదార్థాన్ని సమర్పించడం జరుగుతూవుంది.

ప్రాచీన కాలంలోనైతే బలియివ్వబడిన మనిషితో బాటు బండిలో పురోహితుడు కూడా ఊరేగుతూ వచ్చి ఊరి బయట పొలాల దగ్గర ఆ శవాన్ని దహనం పురోహితుడే స్వహస్తాలతో నిప్పంటించి చేసేవాడు. దీని వల్ల వచ్చే ధూమం పాడిపశువులకు, ప్రజలందరికీ సోకితే ఆరోగ్యవంతంగా ఉంటారని నమ్మకం.

మూడు కొమ్ములు గల్గిన ఎద్దును దైవత్వానికి ప్రతీకగా వీరు భావిస్తారు. పారిస్ నగరంలో దొరికిన అగ్ని వేదికపై ఈ బొమ్మ చెక్కబడివుంది. వృషభం కెల్టిక్ మతస్థులకుదైవత్వ ప్రతీక కావడమే కాదు. ఇది ప్రతీకాత్మక సంప్రదాయంగా స్థిరపడింది. ఈ దృష్టితో చూచినప్పుడు వైదికాగ్ని దేవత వృషభాన్ని కట్టి వేయడాన్ని, కెల్టిక్ వృషభం యొక్క ప్రతీకాత్మక సంప్రదాయంతో పోల్చవచ్చు.

**రోమన్ మతం :** రోమన్ ప్రజల దేవతారాధన యజ్ఞము (Sacrifice) , ప్రార్థన (Prayer) కు సంబంధించినది. ప్రజలు తమను తాము పవిత్రీకరించుకోవడానికి, చెడు నుండి వైదొలగడానికి దీన్ని చేసేవారు. రోమన్ భాషలోని 'Sacrificium' అనే మాటే, ఆంగ్లంలో 'Sacrifice' గా ఏర్పడింది. దీనికి 'త్యాగ'మని అర్థం. ఈ అర్థానికి తగినట్లుగానే దేవతలకు తమ ఆస్తిని లేదా విలువైన వస్తువుల్ని యిచ్చేవారు.

రోమన్ రైతు తన తొలిపంటను న్యూమినా (Numina) అనే ఆధ్యాత్మిక శక్తులకు సమర్పించే వాడు. ఆ శక్తులు రైతును రక్షిస్తాయని నమ్మేవారు. అగ్ని దేవత వద్ద చేసే తంతు

విస్తారంగా ఉండేది. ప్రార్థనలో ఏ చిన్న పొరపాటు దొర్లినా క్షమాపణ చెప్పుకొని మరల మొదటనుంచి చెప్పాలి.

లస్ట్రేషియో (Lustratio) అనే యాజ్ఞిక ప్రక్రియలో యజ్ఞం, ప్రార్థన, ఊరేగింపు తప్పని సరిగా ఉండేది. ఆహారంలో కొంత భాగాన్ని అవతలకు తీసిపెట్టి కాసేపు దాని ముందు మౌనం పాటించడం ఒక ఆచారం. ఇది హైందవులలో ఆపోశనానికి ముందు అన్నపు మెతుకుల్ని కుడిచేతి వైపు వరుసగా మూడు స్థలాల్లో పెట్టి దీనిపై నీళ్లు వదలిన తర్వాత భోజనం చేయడాన్ని, శ్రాద్ధంలో మూడు పిండాలను పెట్టడంతో పోలుతూవుంది.

రోమన్ మతంలోని ఆచారవ్యవహారాలు క్రీ.పూ. 200 నాటి వరకు చక్కగా నడచి తరువాత లుప్తమై పోయింది. ముఖ్యంగా హన్నిబల్ (Hannibal) తో జరిపిన 14 సంవత్సరాల యుద్ధంతో మతం ధ్వస్తమై పోయింది. నైతిక విలువలు నశించాయి. కొత్త రోమన్ రాజ్యం ఏర్పడింది.

ఈ విధంగా ప్రాత ప్రపంచంలోని వివిధ జాతుల వారి మత విశ్వాసాలు చాల వరకు వైదిక సంస్కృతితో సంవదిస్తూ వుంది. ఆర్యుల సంస్కృతి యొక్క చరిత్ర అంటే పురాతన ప్రపంచ జాతుల మత విశ్వాసాలచరిత్ర అని చెప్పవచ్చు.

**కొత్త ప్రపంచం (New World) :** ప్రపంచజాతులన్నింటి యొక్క సాంస్కృతిక విలువలు, ప్రామాణికత బేరీజు వేయాలంటే, మనం తప్పని సరిగా అమెరికాఖండంతో నివసించిన పురాతన ఆదివాసుల చరిత్రను సమగ్రంగా అధ్యయనం చేయవలసివుంటుంది.

ఉత్తర అమెరికాలో రెడ్‌మాన్ లేక రెడ్ ఇండియన్లనే పేరుతోను, మధ్య అమెరికా, దక్షిణ అమెరికాలలో మయన్స్ లేక ఇన్కాస్ అనే పేరుతోను పిలువబడే ఆదివాసులుండేవారు. అమెరికా ఖండంలో తొలుత ప్రవేశించిన రెడ్ ఇండియన్స్ ఎవరు? వారు ఒక వేళ పశ్చిమ దిశా (Western hemisphere) భూగోళం నుండి వలస వెళ్లినవారా? లేకుంటే వారెక్కడ నుండి వచ్చి అక్కడ స్థిరపడ్డారు? అనే జటిలమైన ప్రశ్నలు తెల్లజాతి వారికి కొలంబస్ (Columbus) కాలం నుండి వేధిస్తున్న సమస్య!

ఒక సిద్ధాంతమేమంటే, కనీసం 12,000 నుండి 15,000 సంవత్సరాల క్రితమే లేదా అంతకు పూర్వమే ఉత్తర పూర్వ ఏషియా ( North Eastern Asia) నుండి బయలుదేరిన కొందరు మొట్ట మొదటి వలసగా యిప్పటి అలాస్కా (Alaska) ను దాటి అమెరికాలో ప్రవేశించారు. ఇప్పటి బేరింగ్ స్ట్రైట్ (Bering Strait) అప్పుడు బేరింగ్ ల్యాండ్ బ్రిడ్జ్‌గా ఉండి

ఉండవచ్చు. కొత్త ప్రపంచమైన అమెరికా లోనికి ప్రజల రాకపోకలు అలాస్కా నుండి కేప్ హార్న్ (Cape Horn) వరకు నిదానంగా చాల సంవత్సరాల దాకా జరిగివుండవచ్చు. ఈ సిద్ధాంతాని: ఉపబలకంగా ఈ తెగల ప్రాథమిక సంస్కృతి సాక్ష్యాధారాలను సమకూరుస్తూవుంది.

**హోపివుతం** : ఉత్తర, దక్షిణ అమెరికాలలో ఎందరో ఆదివాసుల తెగలు నివసిస్తున్నారు. వారిలో హోపి తెగ ఒకటి. వీరు అరిజోనా పీఠభూమిలో నివసిస్తూ తాము తొట్టతొలిగా వలసవచ్చిన వారమని చెప్పుకుంటారు. తాము ఎన్నికకెక్కిన ప్రజలమని చెబుతారు. 'హోపి' అనే పదానికి 'శాంతి' అని అర్థం. శాంతి కాముకమైన జీవితం గడిపే వారుగా హోపి ప్రజల ఆచార వ్యవహారాలను వారి భావనా ప్రపంచాన్ని గమనిస్తే, మనలో అంతరమైన మార్పు ఎంత అవసరమో తెలిసివస్తుంది. ఒక పాశ్చాత్యుడికి వీరి జీవిత విధానం అగమ్యగోచరంగా ఉండవచ్చు. కొందరు వీరి జీవిత విధానాన్ని యథాతథంగా అర్థం చేసుకోవడానికి ఆరవ జ్ఞానేంద్రియం (Sixth sence) అత్యవసరమని నిష్పక్షపాతంగా అంగీకరిస్తున్నారు.

1) హోపీయులు నాల్గు ప్రపంచాలున్నాయనే సిద్ధాంతాన్ని నమ్ముతారు. ఇది హిందువుల పురాణాలు చెప్పే నాల్గు యుగాలు – కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు.

2) వీరు సృష్టికర్తకు పెట్టిన పేరు తైయోవా (Taiowa) ఇతడే సూర్యదేవుడు (Sun - God). తక్కిన ఆకాశమంతా అంతులేని అవకాశమే. దీనికి మొదలు లేదు, తుది లేదు. లేదు కాలవు, లేదు రూపవు, లేదు జీవవు. అనంతుడు, అవ్యయుడైన తైయోవా ఈ నశ్వరప్రాణికోటిని సృజించాడు. ఈ భావన ఋగ్వేదంలోని సృష్టిని వర్ణించే అస్యవామీయ, నాసదీయసూక్తాలను పోలివున్నది. వేదములు సూర్యుడే బ్రహ్మయని, సృష్టికర్తయని చెప్పింది. రెడ్ఇండియన్ల భావనలో తైయోవా తన మరియొక రూపమైన సోటుక్నాగ్ (So' tuk nag) గా అవతరించగా, ఆ అవతరించిన రూపం సాలీడు స్త్రీమూర్తి ( Spider woman) ని భూమిపై తనకు సహాయం చేయడం కోసం సృష్టించాడు. ఈమె భూమిపై ప్రాణికోటిని సృజించడంలో తోడ్పడింది. ఈ ప్రాణికోటిలో మానవుని సృష్టి అత్యున్నతమైనదిగా పరిగణింపబడి తైయోవా సంకల్పం సంపూర్ణంగా నెరవేరింది. 'దైవ' శబ్దమే 'తైయోవా' గా మారిందని నా ఊహ! (చూ॥ తెయ్వ – తమిళం)

3) తొలిసారిగా సృష్టింపబడిన మానవులతో సాలీడు స్త్రీదేవత ఇలా హితోపదేశం చేసింది ''అతడే సూర్యుడు! సృష్టికర్త. మీరు సృష్టి యొక్క మూడు స్థితుల్ని ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి''.

సృష్టి యొక్క మూడు స్థితులు వైదిక ఆర్యులు చెప్పిన సృష్టి, స్థితి, లయములు. ఇవి మూడు దాదాపు అన్ని మత విశ్వాసాలలో సమానంగా ఉండడం గమనించవచ్చు.

**4)** ప్రపంచపు పోకడల్ని కూడ ఈ ప్రాచీన జాతి ఎంత బాగా పరిశీలించారో ఆశ్చర్యం వేస్తుంది. మానవులలో ఏ కొందరు మాత్రమే సృష్టిమూల సూత్రాలను తు.చ. తప్పకుండా పాటిస్తున్నారని, తక్కిన వారు ఆ సాలీడు స్త్రీ దేవత ఆదేశాలను పూర్తిగా విస్మరించి ప్రవర్తిస్తున్నారని గుర్తించారు. బహుశా, ఇటువంటి తారతమ్యస్థితులే ఆర్య సంఘంలో ఏర్పడి అది వర్ణవ్యవస్థకు దారితీసిందాననిపిస్తుంది. ఇవే త్రిగుణాలకు తావిచ్చింది. విశ్వాసంలో, నమ్మకంలో పాళ్లు తగ్గుతూ పోవడమే త్రిగుణాల పరిగణనకు దారి తీసింది.

**5)** రెడ్ ఇండియన్ల పురాగాథల్ని పరిశీలిస్తే, ఈ భూమిపై సృష్టికర్తను ఆహ్వానించడానికి సూర్యుడు, నక్షత్రాలు, అగ్ని– మధ్యమాలు (Media)గా చేసుకున్నారు. వారి దృష్టిలో జీవితం అగ్నితోనే ప్రారంభమౌతూవుంది. ఇది సరిగ్గా వైదిక ఆర్యుల భావనయే. అగ్ని మానవులకు దేవతలకు సంధానకర్త. మానవులు సమర్పించే హవిస్సుల్ని మోసుకుపోయి దేవతలకు అందించే వాడు అగ్ని. కనుకనే అతనికి 'హవ్యవాహనుడని' పేరు. అందుకే వేదము 'అగ్ని' అనే మాటతోనే ప్రారంభమై అగ్నిదేవతాస్తుతి ప్రధానంగా చేయబడింది.

**6)** మెసవెర్డే (Mesa Verde) అనే చోట సూర్యదేవాలయం ఉంది. వీరు కేవలం సూర్యారాధకులే కాదు. సూర్యునికి దేవాలయాన్ని కూడ నిర్మించిన వారని తెలుస్తుంది.

**7)** వీరు చిన్న పిల్లలతో కన్న తల్లిపై ప్రేమ ఎంత ఉంటే అంతటి ప్రేమ తల్లి నేలపై కూడ ఉండాలని, అందరికీ తండ్రి సూర్యుడని, అతడే ప్రత్యక్ష దైవమని ఉపదేశిస్తారు.

**8)** కొత్తగా పుట్టిన శిశువుల్ని చీకటిగదిలో ఇరవై రోజులుంచిన తర్వాతనే సూర్యరశ్మిని సోకనిస్తారు. ఇది భారతీయ వైద్య శాస్త్రమైన ఆయుర్వేదంలో చెప్పబడిన విషయం కావడం ఆశ్చర్యం కల్గిస్తుంది.

**9)** పిల్లలకు మతపరమైన దీక్ష (initiation) నివ్వడం ఏడెనిమిది యేండ్ల వయస్సు లోనే జరుపుతారు. ఇది సరిగ్గా వైదిక ఆర్యులలోని ఉపనయనసంస్కారం ( ద్విజత్వం = రెండవ జన్మ) ఎనిమిదవ యేట చేయడాన్ని, జోరోయాస్ట్రియన్ (పార్శీలు) లలో నవజోత్ తర్వాత వేసే సంస్కారాన్ని తలపింపజేస్తుంది.

**10)** హోపీయులు మానవ శరీరంలోని సప్తవిధ నాడీకేంద్రాలను గుర్తించారు. ఇవి యోగశాస్త్రంలో సరిపోలడం మరింత ఆశ్చర్యం! ఈ ఏడింటిని వారు సప్తవిధ లోకాలన్నారు.

మనిషి ప్రాణాన్ని తలపైగల మాడుభాగం నుండి పొందుతాడు. మాడు భాగాన్ని కొ
(Kopavi) 'తెరచిన ద్వారము' అంటారు. మృత్యువు వరకు ఈ ద్వా
మూయబడివుంటుంది. మృత్యువు ఆసన్నమైనప్పుడు మరలా తెరచుకుంటుంది. ఇది ప
ప్రపంచంలోని తూర్పు దేశంలో 'కుండలినీ యోగం' గా చెప్పబడే అంశాలతో సరిపోలుత
వుండడం గమనించవచ్చు. వెన్ను పూసకు క్రింది భాగంలో మూలాధారచక్రముందని, శిరస్సు
సహస్రార పద్మముందని తలపై గల మాడుభాగం చిట్లి తెరచుకోవడం బ్రహ్మరంధ్రభే
మంటారని, సన్యాసి యిలా శరీరాన్ని వదలి పెట్టి బ్రహ్మైక్యము చెందుతాడని భారతీ
యోగశాస్త్రం చెబుతున్నది.

11) రెడ్ ఇండియన్లు కాలజ్ఞాన వేత్తలు కూడ. నాల్గవ ప్రపంచమని వారు చె
కలియుగంలో మానవులు భౌతిక వస్తుసంచయంలోను, భౌతిక జీవితలాలసత్వంతో, మ
మీరిన కోర్కెల ఊహల ఊబిలో చిక్కుకు పోయారని చెబుతారు. కాని, సరైన సమయం
ఒక కొత్త మలుపు రాక తప్పదని, ఆ లోపల మత విశ్వాసాలు, ఆచార వ్యవహారాలన్నీ మ
కలిసి పోతాయంటారు. తిరిగి కొత్త సమాజం ఆవిర్భవించి సంపూర్ణ విశ్వాసంతో నూ
జీవితం ప్రారంభమౌతుందన్న ఆశాజీవులు హోపీయులు.

12) ఈ పెద్ద మార్పు ఎలా సంభవిస్తుందని ప్రశ్నిస్తే త్వరలోనే మూడవ ప్రప
యుద్ధం జరుగుతుందని, అది ఆధ్యాత్మిక శక్తులకు, భౌతిక శక్తులకు మధ్య సంగ్రామమ
ఈ యుద్ధంలో అధ్యాత్మిక శక్తుల విజయం తథ్యమని, వారే నూతన సమాజ సృష్టికర్తలవుతా
చెబుతారు. ఈ విధమైన అధ్యాత్మిక శక్తుల విజయగీతికల్ని వాడెప్పుడూ పాడుతూవుంటా
ఈ భావన సరిగ్గా శ్రీ అరవిందులు చెప్పిన ఇంటిగ్రల్ యోగా (పూర్ణయోగం), సూపర్మ
(పరిపూర్ణ మానవుడు) ఆవిర్భావాన్ని తలపింప జేస్తూవుంది. ఆధ్యాత్మిక శక్తి సంపన
పూర్ణపురుషుడు! నేటి మానవుడు భౌతిక వ్యక్తి మాత్రమే!.

13) అగ్ని దేవాలయాలను రెడ్ ఇండియన్లు కీవాస్ (Kivas) అని పిలుస్తారు.
'కీల' శబ్దానికి అపభ్రంశరూపమేమో! అయితే ఈ దేవాలయాలు నేల మీద కట్టబడినవి కా
భూగృహంలో నిర్మింపబడినవి. దీనిని వీరు నేల తల్లి యొక్క గర్భము (womb of the Mot
Earth) అంటారు. ఇది చాల గొప్పవైదిక భావన! అగ్ని దేవాలయ పురోహితుడు క్వా
చెప్పులు లేకుండా భూగర్భగుడిలోనికి ప్రవేశించి అగ్ని వేదికను సమీపిస్తాడు. ఈ అగ్నివే
పైభాగం ఆకాశం కనిపించే విధంగా గుండ్రంగా మలచబడివుంటుంది. (ఇదంతా కుండ
యోగంలో మూలాధార, సహస్రార చక్రాలకు సంకేతం. హిందూ దేవాలయాలలో క
గర్భగుడి పైభాగం సూర్యరశ్మి సోకేలా మలచబడివుంటుంది)

ఉమ్ముకతో కప్పబడిన అగ్ని ఎప్పుడూ అరిపోకుండా ఉంచబడుతుంది. వివుఛిన్ (Wiwuchin) అని పిలువబడే నూతన అగ్ని మహోత్సవంలో ప్రతి యేటా అగ్ని జాజ్వల్యమానంగా ప్రజ్వలింప జేయబడుతుంది. అగ్ని గృహం పై భాగంలో గల రంధ్రాన్ని **'సీతాపూణి'** (Sitapuni) అంటారు. ఈ మాట భారతీయ ఇతిహాసాలలో గల 'సీతా' శబ్దాన్ని స్ఫురింపజేస్తున్నది. (నాగేటి చాలుకు సీత అని పేరు. మహారాష్ట్ర భాషలో అన్నపు మెతుకును సీత అంటారు) **''సావా ఇయం సర్వైవ వేదిః, 'పృథివీ తస్య పీఠికా'** అని వైదిక వాఙ్మయం చెప్పినట్లు, అగ్ని ఆరాధన విశ్వానికి నాభిస్థానమని రెడ్ ఇండియన్లు విశ్వసిస్తారు. **''అయం యజ్ఞో భువనస్యనాభిః''** అని ఋగ్వేదం!

14) అగ్ని దేవాలయ పురోహితుడు రెండు కొమ్ములుండే ఉష్ణీషాన్ని తలకు ధరించి నూతనాగ్నిమహోత్సవాన్ని ప్రారంభిస్తాడు. ఈ రెండు కొమ్ముల ఉష్ణీషాన్ని ధరించి ధ్యానముద్రలోని బొమ్మ ఒకటి మొహంజొదారో, హరప్పా, త్రవ్వకాలలో లభించింది. దీన్ని 'పశుపతి' గా కొందరు చెప్పారు. కాని, ఇది అగ్ని దేవాలయ పురోహితుని బొమ్మగా కూడ చెప్పవచ్చు. ఇంతే కాదు, వైదిక దేవతలలో అగ్నికి రెండు తలలు నాలుగు కొమ్ములుండడం ఈ భావనకు చాల దగ్గరగా ఉంది.

15) సృష్టికర్తయైన సూర్యభగవానుని యందు గల విశ్వాసం, అగ్ని ఆరాధన, ఆచారవ్యవహారాలు గల హోపీయులు ఈ భూమిపై జన్మించిన ప్రతి వ్యక్తి, శారీరక, మానసిక, ఆధ్యాత్మిక, సంఘసేవ భావాలకు అంకితం కావాలంటాడు. అత్మనిత్యమని నమ్మి, సప్తవ్యసనాలకు దూరంగా ఉండమంటాడు.

16) జీవితంలో ప్రతి రోజు ఆరాధనలు, అర్చనలు, మహోత్సవాలతో సృష్టి యొక్క మూలతత్త్వాన్ని అవగతం చేసుకొన్న హోపీయులు ఈ నాటి రాజకీయ వ్యవస్థకు దూరంగా తమకంటూ ఒకయైన సమగ్రజీవితాన్ని (Integral Life), నిబద్ధ జీవితాన్ని (Committed Life) గడుపుతూ సుఖశాంతులతో ఉన్నారు.

17) మరో గొప్ప విషయమేమంటే, హోపీయుల రాజ్యంలో ఏ వ్యక్తికి స్వంతభూమి ఉండదు. అది వారి తెగకంతటికీ ఉమ్మడి ఆస్తి. ఒక వ్యక్తి ఎంతమేర దున్ను కొని పండించుకోగలడో అంత వరకే వాడిదిగా ఉంటుంది. గృహావసరాలకు పరిమితమైన భూమియే అతడు తీసుకుంటాడు. అతడు వ్యవసాయం మానివేస్తే ఆ భూమి వెంటనే ఉమ్మడి ఆస్తిలో కలసిపోతుంది. ఆంగ్లేయులు రాకముందు భారతదేశంలోని పరిస్థితి యిలాగే వుండేది. Land Settlement Act ప్రవేశపెట్టి పేద రైతులకు భూమి లేకుండా చేశాడు పాశ్చాత్యుడు. భూస్వాముల సంఖ్య పెరిగి రైతు బక్క చిక్కాడు. ఇది మనం సాధించిన గొప్ప విజయం!

18) రెడ్ ఇండియన్స్‌లో అడవులూ, నదులూ ఎవరి స్వంతంకావు. అది భగవంతుని సృష్టిలోనివి గనుక అందరికీ వాటిపై సమానమైన హక్కు వుంది. ఎవడి గృహావసరాలకు ఎంత కావాలో అంతగా స్వీకరించడం వారి పద్ధతి. దోచుకొని దాచిపెట్టి యితరులకు లేకుండా చేయడం మన పద్ధతి. ఈనాటి నదీ జలవివాదాలు ఎంత సంకుచిత స్వార్థబుద్ధి ప్రేరేపితమో ఒక్క సారి ఆలోచించమని మనవి చేస్తున్నాను. నదులు, కొండలు, అడవులు దేశం యొక్క ఉమ్మడి ఆస్తి. ఏ ఒక్క రాష్ట్రానిది కాదని ఆదివాసుల జీవితాన్ని చూచి మనం నేర్చుకోవాలి.

19) ఆస్తిపాస్తుల సేకరణ కాదు, వాటిని సమానంగా పంచుకొని ఆనందించడం హోపీయుల అభిమతం. ఇది వేద సమ్మతమైన విశ్వజనీన భావన!

20) హోపీయుల అగ్నిచితులు గరుడాకృతిని కల్గియుండడం చూస్తే అది వైదిక అగ్ని చయనంలోని సుపర్ణచితిని, శ్యేన చితిని తలపింపజేస్తుంది. దీనిచే హోపీయులు ఆర్యుల కోవకు చెందిన ఆదిమానవులని స్పష్టంగా చెప్పవచ్చు.

**మయన్స్ మరియు ఇన్కాస్ తెగలు :** మయన్స్ మరియు ఇన్కాస్ తెగలవారు అత్యున్నతమైన సంస్కృతి నాగరికతలను కల్గి వారుగా చెప్పవచ్చు. పురాతత్త్వవేత్తల త్రవ్వకాలలో, సూర్యుని ప్రతిమలు, అగ్ని వేదికలు బయటపడ్డాయి. దీనిచే వారు అగ్ని, సూర్యారాధకులని స్పష్టమైంది. మయన్లు మధ్య అమెరికాలోను, ఇన్కాసులు దక్షిణ అమెరికాలోను నివసిస్తున్నారు. ఇక్ష్వాకు వంశీయులు సూర్యవంశక్షత్రియులైనట్లే, అమెరికా ఖండపు తొలి రాజులు సూర్యుని వంశపు కోవకు చెందిన వారుగా చెబుతారు. ఇన్కాస్ రాజులు సూర్యపుత్రులమని చెబుతారు. మయన్లు, అజ్‌టెక్‌లు ఇలాగే చెపుతారు. ఈ పురాతన సూర్యపుత్రులు కట్టిన సూర్యదేవాలయం వాస్తువులోను, శిల్పకళలోను అత్యద్భుతమైనదని అందరూ అంగీకరిస్తున్నారు.

**ఇతర తెగలు :** అమెరికాలో తొలి నుండి నివసిస్తున్న ఇతర తెగలలో నవజోస్, లకోటాస్, పాపగో, హథియాడ్, హవసుపాయ్, అజ్‌టెక్స్ మొదలైన తెగలెన్నో ఉన్నాయి. వీరి మత విశ్వాసం విశ్వసృష్టిలయతో లగింపబడివుండడం గమనింపదగింది. వారి ప్రార్థనలు, అరాధనలన్నీ అగ్ని మాధ్యమంతో కూడినదైనా వ్యక్తికీ, అతీత శక్తికీ, ఒక సామరస్యాన్నీ సమతౌల్యాన్ని సాధించడంలో కనబడుతుంది. అధునికులు వీరిని ప్రకృతి ఆరాధకులుగా చెప్పవచ్చు. కాని, ఆధునికులేనాడో కోల్పోయిన ఆధ్యాత్మిక సమన్వయాన్ని వారు చాల సులువుగా పట్టుకొన్నారని తెలుస్తుంది. సృష్టిలోని విభిన్న శక్తుల మధ్య సమన్వయాన్ని సాధించి, ఏకత్వ దృష్టితో దాన్ని అర్థం చేసుకొన్న ఆదివాసులు వీరు. వీరు ఆధునికులకు అందించే ఏకైక సందేశం, ఆశాకిరణం, మానవుని అంతశ్శక్తుల సమీకరణ మార్గాన్ని నిర్దేశించడం. ఆధునిక విజ్ఞానం మానవునికి ప్రకృతికి మధ్యగల లంకెను తెంపివేసింది. విశ్వశక్తితో సంబంధాన్ని కోల్పోయిన మానవుడు ఈనాడు తనను తాను పునర్మూల్యాంకనం (revaluate)

చేసుకోవలసిన స్థితిలో ఉన్నాడు. అప్పుడే తిరిగి నిజమైన ఆనందమయ జీవితాన్ని మానవుడు పొందగలడు. ఒక అతీత శక్తిపట్ల ప్రగాఢమైన విశ్వాసంతో, మతానికీ జీవితానికీ విడదీయరాని అనుబంధంతో ఆదివాసులు ఆధ్యాత్మికంగా ఉన్నతిని సాధించినారని చెప్పాలి.

మెక్సికన్లు అగ్నిని ఉత్పాదించే విధానం చాల విచిత్రంగా ఉంటుంది. అల్పమైన కాకివెదురుపై ఒక కొయ్యముక్కను రాపిడి చేయడం వల్ల వీరు అగ్నిని పుట్టిస్తారు. ఇది సరిగ్గా వైదిక ఆర్యుల అరణిమంథన ప్రక్రియతో సరిపోలుతున్నది. మెక్సికన్ బాలురను ఐదేండ్ల వయస్సులోనే పురోహితులకు అప్పగిస్తారు. చక్కని క్రమశిక్షణతో వీరి విద్యాభ్యాసం జరుగుతుంది. ఇది భారతీయ గురుకుల విద్యావిధానాన్ని పోలివున్నది.

'పెరు' అనే ప్రదేశం సూర్యోపాసనకు పెట్టింది పేరు. ఇది సంస్కృత 'పరు' శబ్ద భవమేమో! భారత దేశంలోని చాతుర్వర్ణ వ్యవస్థ వలె వీరు సమాజాన్ని నాల్గుగా వింగడించి అందరూ కలిసి సూర్యారాధన చేస్తారు. వైదికుల సంధ్యావందనం వలె జపోటెకా తెగ వారు ఉదయాన్నే సూర్యోపాసన చేస్తారు. తెలనేకన్ తెగవారు నాల్గు సంవత్సరాల దీక్షను వహించి ఎడతెగకుండా ప్రార్థనలు, ఉపవాసాలు చేసి అధ్యాత్మిక శక్తిని గడించి భగవంతునితో ప్రత్యక్షంగా సంభాషించగలరు.

## పాతప్రపంచంలో భూగోళానికి తూర్పుదిశవైపు గల మతాలు - షామన్‌మతం

ఉత్తరపూర్వ ఆసియాకు సంబంధించిన బేరింగ్ స్ట్రైట్ దగ్గర సైబీరియా ఉన్నది. ఉరల్ అట్లాంటిక్ ప్రజలు, బేరింగ్ స్ట్రైట్ పొలిమేరల్లో గల స్కాండినేవియా వారు అనుసరించే మతానికే షామానిజం అని పేరు. షామన్లు ఎంత పురాతనులైనప్పటికీ వారు ఒక నిర్దిష్ట విధానంలో నిర్ణీతసమయంలో, నిర్దుష్టమైన పద్ధతిలో ఆరాధనలు, అర్చనలు చేయడం ఉంటుంది. వ్యాధి నివారణ, దైవిక శక్తి సంపాదన వీరి ప్రధాన లక్ష్యాలు.

అమెరికాలోని రెడ్ ఇండియన్ల నూతనాగ్ని మహోత్సవం వీరిలోను ఉండడం చూస్తే, తొలిదశలో రెడ్ ఇండియన్లు సైబీరియా నుండే బేరింగ్ స్ట్రైట్స్ గుండా అమెరికాకు వెళ్లారని చెప్పవలసి వుంది. సైబేరియన్లు అగ్ని నుత్పాదించే ప్రక్రియ ఈ నాడు వడ్రంగి వాళ్లు కొయ్యలకు రంధ్రం వేసే డ్రిల్లింగ్ పద్ధతిలో ఉండడం గమనించవచ్చు. వంటచెరుకుపై ఈ విధంగా మానవాకారం గల ఒక బొమ్మను పట్టుకొని డ్రిల్ చేయడం వలన అగ్నినిపుట్టిస్తారు. వీళ్లు దీన్ని ఒక పవిత్రకార్యంగా భావిస్తారు. ఈ సందర్భంలో వాళ్లు కొన్ని స్తోత్రాలు చేస్తారు. ఇవన్నీ వైదికాగ్ని ఉత్పాదన, మంత్రపఠనలతో పోలివుంది. నియోసైబేరియన్లు సూర్యుని, ఆకాశాన్ని కూడ ఆరాధిస్తారు. ఇది కూడ వైదిక భావనకు దగ్గరిదే!

**ఐనుమతం :** సైబేరియాలో ఉత్తరం నుండి పాతజపానుకు దక్షిణ దిక్కు వరకు ఐనులు ఒకప్పుడు వ్యాపించి ఉండేవారు. ఇది అతి ప్రాచీన జాతి అయినప్పటికి యిప్పుడు కొందరే మిగిలారు. తొలినాళ్లలో వీరు ఏకదేవతారాధకులై ఉండేవారు. తర్వాత బహుదేవతల్ని ఆరాధించడం ప్రారంభించారు. పసే – కముయి (Pase Kamui) అనే సృష్టికర్త, స్వర్గాధిపతి ఐనుల ప్రధానదేవత. ఆకాశంలోని మెఱుపు సృష్టికర్తవైభవానికి సంకేతం. ఉఱుము (Thunder) ఆ దేవత యొక్క కంఠస్వరం. పాలవెల్లి (Milky way) ఆ దేవతకు చెందిన నదిగా భావిస్తారు.

సూర్యుడు క్రమం తప్పక ఉదయించడం, ప్రకాశించడం, సాయంత్రం అస్తమించడం యివన్నీ ఎవరి ఆజ్ఞవలన చేస్తున్నాడు. ఎవరి శక్తి వలన కదలుతున్నాడని వారు ప్రశ్నిస్తున్నారు. ఇది వేదఋషుల ప్రశ్నలవలె ఉన్నాయి. ఉపనిషత్తులు వీటికి సమాధానం చెప్పాయి.

సూర్యుడు ప్రత్యక్ష ప్రకృతి దేవతకాగా, భూమిపై గల మరో గొప్పశక్తి అగ్ని గా వారు చెబుతారు. అగ్నిని వారు చాలా పేర్లతో పిలుస్తారు. ఫుజి (Fuji), ఉంజి (Unji), హుఛి (Huchi) ఇరేసు-కముయి (Iresu-Kamui). అగ్ని వీరి దృష్టిలో స్త్రీలింగం. ఈ స్త్రీ దేవత మనల్ని కాపాడుతూవుందని గాఢంగా నమ్మిన వీరు అగ్ని దేవతాకమైన గీతాలు పాడుతారు. తనను, తన కుటుంబాన్నీ రక్షించమనీ, రోగవిముక్తులు చేయుమని ప్రార్థిస్తారు.

ప్రార్థనానంతరం అగ్నిలో ఆహుతులు చేస్తారు. జపాన్‌లోని షింటోమతంలోను ఈ ఆచారముంది.

**చైనీయుల మతం :** 2500 సంవత్సరాల క్రితం ప్రాచీన చైనా దేశాన్ని మూడు మతాలు ప్రభావితం చేశాయి. కన్‌ఫ్యూషియస్ కు పూర్వకాలంలో స్వర్గాధిపతియే విశ్వానికి సృష్టికర్తగా భావించారు. పితరుల ఆత్మశాంతికి నైతిక సంపత్తికి యజ్ఞం చేయాలని నిర్దేశింపబడింది. కన్‌ఫ్యూషియస్ (551-479 B.C.) స్వర్గారాధన, పితరుల పూజ, మానవుల నైతిక, సాంఘిక భద్రతకు మంచిదని అభిప్రాయపడ్డాడు. ఆయన నరమేధాన్ని నిరసించాడు. టావోయిజమ్ స్థాపకుడైన లీ (LI) కంఫ్యూషియస్‌కు సమకాలికుడు. కన్‌ఫ్యూషియస్ యితనిని అభిమానంతో 'పాత తాత్త్వికుడు' (Lao Tzu) అని పిలిచేవాడు. వీరిద్దరు కేవలం న్యాయశాస్త్ర నిర్మాతలే కాదు. ప్రాచీన మత సంప్రదాయాలు తెలిసినవారని చెప్పవచ్చు.

హిందువుల బ్రాహ్మణ గ్రంథాలలోని విస్తారమైన యాజ్ఞిక ప్రకియా విధానం చైనీయులలోను ఉండేది. రాజు స్వయంగా యజ్ఞంలో పాల్గొనేవాడు. అగ్ని వేదిక ముందు అనేక సార్లు మోకరిల్లి తన శరణాగతిని చాటుకునేవాడు. అగ్ని చితులను వివిధక్రతులతో

వివిధ ఋతువుల్లో జరిపే యజ్ఞాలలో నిర్మించడం ఉండేది. వేసవిలో వర్షం కురవడానికి Ki-nien-tien అనే యజ్ఞం చేసేవారు. యాజ్ఞిక మతం ప్రాచీన చైనాలో విస్తారంగా వ్యాపించింది. హోమద్రవ్య సమర్పణ, శాంతి పాఠంతో యజ్ఞం ముగిసేది. విశ్వశాంతి దీనికి ప్రధాన లక్ష్యం.

బౌద్ధమతం చైనా దేశాన్ని బాగా ప్రభావితం చేసింది. దానితో నరమేధమే కాదు, జంతు బడి కూడ పూర్తిగా తొలగింపబడి కేవలం అగ్ని ఉపాసనయే మిగిలింది. ఈ పద్ధతి చైనా నుండి జపాన్‌కు ప్రాకింది.

స్వర్గారాధన అనే భావన క్రీ.పూ. **1000** సంవత్సరంలో ఉన్నట్లు ప్రామాణిక ఆధారాలు లభించాయి. ఈ ఆరాధన అగ్నిముఖంగానే జరిగేది. ఈ విధమైన ఉపాసన స్వర్గాన్ని, భూమిని, పితరులను గౌరవించడమే కాక, గొప్ప రాజులను, ప్రవక్తలను జనింపజేయాలనే కోరికతో చేయబడేవి. ప్రాపంచిక విషయవైరాగ్యం సన్యాసాన్ని కూడ చైనీయులు అభిమానించి అనుసరిస్తారు.

ప్రపంచమే ఒక పెద్ద కామన్వెల్త్, మానవులంతా సోదరులే, విద్యకు జాతి, మత, కుల వర్గ, లింక వివక్ష లేదు అనే సూక్తులు కన్‌ఫ్యూషియస్ చెప్పినవే.

**ఇండో-చైనీయుల మతం** : ఇండోచైనాలోని వారిని ఈనాటి వారు అనాగరికులుగా చెప్పినా వీరి మతం మాత్రం సజీవమైనదని, సహజంగా బహుదేవతారాధనతో కూడినదని చెప్పాలి. వీరి మతం ప్రధానంగా అగ్ని ఆరాధనతో హవిస్సుంతో కూడుకొన్నది. బహువిధమైన ఈ ఆరాధనలకు మూలమైన అప్రాకృత శక్తిని యాంగ్ (Yang) అని పిలుస్తారు. వారి జీవితంలో ప్రతిపని ఒక ఆరాధనతో ముడివడి వుండడం విశేషం. దేవతాహ్వానం, నివేదనం, ప్రక్రియాబద్ధంగా జరుపుతారు.

వీరి నమ్మకంలో ప్రళయం తర్వాత అవ్వ-తాత యిద్దరే మిగులుతారు. వీరొక కొత్త మానవజాతిని సృజిస్తారు. ఆ మానవుల సంతోషం కోసం యాంగ్ (Yang) దివ్యమైన అన్నాన్ని (పరమాన్నం) కట్టెలు లేకుండా మండే విచిత్రమైన అగ్నిని (వైదిక పరిభాషలో అనింధన మహాగ్ని) తీసుకొని రాగా ఆ తర్వాతి కాలంలో మానవులకీ పవిత్ర వస్తువులు రెండూ దక్కకుండా పోయాయి. కృత్రిమత్వంతో కూడినవే మనకు దక్కాయని అర్థం. (భౌతికమైన అన్నం, సేంధన అగ్ని) ఒక మహాగ్ని రగులుకొని ఈ ప్రపంచమంతా చివరికి నశించిపోతుందని, అదే ప్రళయమని వారు విశ్వసిస్తారు.

**ఇండోనేషియన్ మతం** : ఇండోనేషియా ద్వీపాలలో పురాతన జాతుల వారు జీవాత్మను గురించి భావించడం కనబడుతుంది. ఒక జీవాత్మ యిప్పటి జన్మలోను మరొక్కటి

రాబోవు జన్మలోను వస్తుందని, మొదటిది అంతర్ధానమౌతుందంటారు. ఒక్కొక్కసారి జీవాత
ఏడు విధాలుగా కూడ ఉంటుందని విశ్వసిస్తారు. ఈ ఏడు జీవాత్మలు కుండలినీయోగంలో
ఏడు స్థానాలుగా కొందరు చెప్పారు కాని, ఏడు జన్మలదాకా జీవుని సంస్కారం వెన్నంటి వస్తుంద
వైదిక విశ్వాసమే దీనికి ఆధారంకావచ్చు. వివాహంలో 'సప్తపదులు' దీనినే సూచిస్తాయి.

చనిపోయిన వారి ఆత్మ శాంతి కోసం నరబలియిచ్చేవారు. రక్తతర్పణంతో కూడిన
గాక రక్తరహిత మానవ సమర్పణలు ఉండేవి. ఒక సజీవుడైన వ్యక్తిని మృతునివలె కట్టి తీసుకుపో
అడవుల్లో వదలిపెట్టి తిరిగిచూడకుండా వెళ్లిపొమ్మనడం రక్తరహితమైన మానవ సమర్పణ
తాము చంపకుండా అడవిలో ఏ క్రూరమృగమో ఆ వ్యక్తిని చంపితే చనిపోయిన వారికి ఆత్మశాం
కల్గుతుందని వారి విశ్వాసం!

ప్రకృతి ఆరాధనలో సూర్యునికే అగ్రస్థానం! ప్రధానదేవత! అతడు జగత్తును వెలుగుల
నిశితంగా పరిశీలించి దోషులను శిక్షిస్తాడని నమ్ముతారు. వైదిక ఆర్యులు సూర్యుని 'జగచ్చక్షువు
కర్మసాక్షి'గా చెప్పారు. సృష్టికర్త తన అధికారాలను సూర్యునికిచ్చినప్పటికీ, అతడే జగద్రక్షకుడు
హవిస్సులను స్వీకరించేవాడు. సృష్టికర్తకు ఒక దీపం వెలిగించి ఆరాధిస్తారు. కొత్తగా పుట్టిన
శిశువును తల్లిని అగ్ని ప్రక్కగా పరుండబెట్టి నిప్పు పొగసోకితే బిడ్డకు, తల్లికి ఎటువంటి రోగాలు
రావని నమ్ముతారు. ఇది కేవలం మూఢనమ్మకం కాదు. వైజ్ఞానిక సత్యం. ఈ జాతులన్నీ 1800
సంవత్సరాల క్రితం హిందూసంస్కృతి ప్రభావానికి లోనైనవే! హిందువుల సంపూర్ణ ప్రభావం
సోకినది బలి ద్వీపాలు. ప్రస్తుతం బౌద్ధ, ఇస్లాం, క్రైస్తవ మతాలవారు అక్కడ చేరారు.

**ఫిలిపినోమతం** : 1500 సంవత్సరాల క్రిందటి నుంచి ఫిలిపినులపై హిందూమత
ప్రభావం ఉన్నదని నిరూపించవచ్చు. వర్తకులుగా వెళ్లిన హిందువులు ఆ దేశవాసులకు ఎంతగా
ప్రభావితం చేశారంటే ఫిలిపినో మలయన్ భాషల్లో ఎన్నో సంస్కృత పదాలు చేరిపోయాయి.
ఆ తర్వాత హిందువులు క్రీ.శ. 3-4 శతాబ్దిలో ఫిలిపిన్స్ దీవులను జయించి పరిపాలించారు.

లుజన్, మైడనో వంటి గిరిజనుల తెగల్లో కూడ వైదిక దేవతలు ఆరాధింపబడుతున్నారు.
ఫిలిపినుల మౌలికమైన ఆరాధన చరిత్రపూర్వయుగాల నుంచి గమనిస్తే అగ్ని, సూర్యచంద్రులను
ఉపాసించడంగా ఉంది.

**పాలినేషియన్ మతం** : పాలినేషియన్ పురాగాథలు, నమ్మకాలు, ఆచారవ్యవహారాలను గమనిస్తే చీకటి నుండి వెలుగు పరిణామంచెందినతీరు, సృష్టి, శబ్దతత్త్వం, పునర్జన్మలపై నమ్మకం జీవుని పరిణామం యివన్నీ దృగ్గోచరమౌతాయి. సూర్యారాధన ఉన్నప్పటికీ, అనేక సూర్యుల ఆరాధన యిక్కడ విశేషించి కనబడుతుంది. ఇది ఒక విశిష్ట వైజ్ఞానిక సత్యం! మతపరమైన ఉత్సవాలలో ప్రధాన పురోహితుడు మాత్రమే గర్భగుడిలో ప్రవేశానికి అర్హుడు. సృష్టికర్తను, సూర్యుని, అగ్నిని వీరు సమానంగా అర్చించేవారు.

**ఆస్ట్రేలియన్ మతం** : ఇంటిఖిమా (Intichima) అనబడే పవిత్రహోమకార్యాలు చేయడం వలన అవ్యక్తశక్తులతో సంబంధం కల్గుతుందని ఆస్ట్రేలియన్‌లు నమ్ముతారు. చెడుశక్తుల సంహారణ, అప్రాకృత శక్తుల సమీకరణ దీని ధ్యేయం. అగ్ని కార్యం చేసేటప్పుడు కొన్ని గీతాలు పాడుతారు. ఆ పాటలో కంగారు యొక్క కొవ్వును సమర్పిస్తున్నట్లు చెబుతారు. దీనిచేత యాజ్ఞిక ప్రక్రియలోని శైథిల్యం తెలిసివస్తున్నది. ఆ గీతాలలోని కొన్ని పదాలు అర్థవిపరిణామం చెందడం వలన విపరీతార్థాలకు తావిచ్చినది. ఉదాహరణకు వప (Vapa) అనే పదానికి సంస్కృత భాషలో 'గింజల నుండి తీయబడిన నూనె' అని అర్థంకాగా, తర్వాతి కాలంలో 'ప్రేగులు' అనే అర్థం సంతరించుకుంది. దానితో నూనె సమర్పించడానికి బదులు జంతువుల్ని చంపివారు కొవ్వును యివ్వడం జరిగింది.

మధ్య ఆస్ట్రేలియాలోని ప్రజలు బలి యిచ్చిన జంతువు వెంట్రుకలను భద్రపరచడం, జొరాష్ట్రియన్ మతంలోని ఎద్దు వెంట్రుకలను భద్రపరచడాన్ని జ్ఞాపకానికి తెస్తున్నది. కాలక్రమేణ యజ్ఞ ప్రక్రియ విధానంలో కొత్త విధానాలు ప్రవేశపెట్టబడ్డాయి. సృష్టికర్త అందరికీ దేవుడు (All Father) అతని పేరు బైమ్ (Baime) అతని ఆజ్ఞను తెగలోని వారంతా శిరసావహిస్తారు.

బాలురకు, బాలికలను చిన్నతనంలోనే మతపరమైన దీక్ష (initiation) యిచ్చాక వయస్సును బట్టి ఆహారనియమాలు ఏర్పరచడం భారతీయ గురుకులవాసపద్ధతిని స్ఫురింపజేస్తుంది. హోమద్రవ్యాలలో తేనెను వాడడం కూడ వైదిక మత ప్రభావమే!

**బౌద్ధమతం** : చైనా దేశంలోని టావోయిజమ్, కన్‌ఫ్యూషియనిజాన్ని అత్యంత ప్రభావితం చేసిన బౌద్ధమతం భారతదేశంలో పుట్టింది. తేలికగా అందరూ చేయదగిన రీతిలోనున్న అగ్నిహోత్రం (Fire worship) వైదిక మతంలో సంవత్సరాల తరబడి చేసే బహువ్యయ ప్రయాసలతో కూడిన విస్తృత యాజ్ఞిక విధానాలతో ఏర్పడడం చేత సామాన్యమానవునికి అందుబాటులో లేకుండాపోయింది.

తొలినాళ్లలో హోమద్రవ్యాలు బియ్యపు పిండితో చేసినవి, పెరుగు, మూలికలు వీటి
సమర్పించేవారు.ఇవి సామాన్యుడు సంపాదించగలడు కాని, యివి పశుమేధ, నరమేధములక
దారితీయడం అవాంఛనీయనీయమైన పరిణామమే! ఉదాహరణకు, సంయుత్త నికాయంలో
ఈ విషయం చెప్పబడింది. కోసల దేశానికి రాజైన ప్రసేనజిత్తు ఒక పెద్దయజ్ఞం తలపెట్టి అందులో
**500** పశువుల్ని బలియివ్వడానికి సిద్ధపడ్డాడు. ఈ విషయం తెలుసుకున్న బుద్ధుడు అక్కడ
వెళ్లి ఈ ఘోరకృత్యాన్ని నిలిపివేశాడు. అప్పుడు బుద్ధుడిలా అన్నాడు. దేవతలు యజ్ఞాని
అంగీకరిస్తారు కాని నిష్కరుణతో కూడిన జంతుబలుల్ని కాదు. రక్తపాతం లేని పవిత్రయజ్ఞాల
ఉదాత్తులైన మహర్షులు వస్తారు'' అన్నాడు.

ఈ పరిస్థితుల్లో సామాన్య ప్రజానీకానికి కూడ అందుబాటులో ఉండేలా తక్కు
సమయంలో, అతి తక్కువ ఖర్చుతో చేసుకోదగిన ఆరాధన అవశ్యకమైంది. యాజ్ఞిక ప్రక్రియ
చేత నీలోని మాలిన్యాన్ని దోషాలను క్షాళనం చేసుకోవడం వంటిదే నిన్ను నీవే జయించే మార్గం
అది కోర్కెల మీద విజయం సాధించడం అన్నాడు బుద్ధుడు. అగ్నిహోత్రంలో హవిస్సుతో
బాటు **'న మమ న మమ'** అని చెప్పే మాటలు నిస్సంగత్వాన్ని త్యాగలక్షణాన్నీ చెబుతున్నాయి
కాబట్టి 'సంఘశ్రేయస్సు కోసం నీస్వసుఖాలను త్యాగం చేసి భిక్షువుగా మారు' అన్నాడు
బుద్ధుడు.

వైదిక మతాని కేమాత్రం విరోధం లేని రీతిలో పవిత్రమైన మౌలిక మత లక్షణాలన
ప్రవచించాడు బుద్ధుడు. **బుద్ధం శరణం గచ్ఛామి। ధర్మం శరణం గచ్ఛామి। సంఘం శరణ
గచ్ఛామి।** అనేది వైదిక గాయత్రీమంత్రంతోసమానమైంధి. గాయత్రీ మంత్రంలో పాదాని
ఎనిమిది అక్షరాలు, మూడు పాదాలు మొత్తం **24** అక్షరాలుంటాయి. సరిగ్గాపై బౌద్ధమ
మంత్రంలో కూడ ఆ లక్షణాలే వున్నాయి! కాబట్టి దీన్ని **బౌద్ధమత గాయత్రీమంత్రంగా**
చెప్పవచ్చు. గాయత్రీ మంత్రాన్ని బ్రహ్మోపదేశంగా స్వీకరించడానికి ముందు యజ్ఞోపవీతధారణ
చేస్తాడు వైదికవటువు. ఇక్కడ బుద్ధుని సమక్షంలో **'బుద్ధ గాయత్రీ'** దీక్ష స్వీకరించడాని
ముందు జందాన్ని తీసివేయాలి.అలాగని ఇది వైదికమత విశ్వాసాలపై తిరుగుబాటు కాదు
విప్లవమంతకంటే కాదు.బుద్ధుడు గొప్ప బౌద్ధ భిక్షువులైన అర్హతులను బ్రాహ్మణులని పిలిచాడు
పవిత్ర జీవితం గడిపేవాడే బ్రాహ్మణుడని ధమ్మపదంలోని బ్రాహ్మణవగ్గంలో చెప్పాడు.

బౌద్ధమతం వైదిక మతంలోని దోషాలను ఏరిపారవేసి పునర్నిర్మించబడినదని చెప్పవచ్చు
బుద్ధుడు అత్యంత సుఖలాలసత్వాన్ని, అత్యంత కఠిన తపశ్చర్యలను రెంటినీ నిరసించి
హితమితమైన మధ్యేమార్గాన్ని అనుసరించమన్నాడు. దీనినే మాధ్యమిక వాదంగా నాగార్జునుడ
వ్యాఖ్యానించాడు. యజ్ఞంలో జంతు, నరబలుల స్థానంలో, నిన్ను నీవే త్యాగం చేసుకొని సన్యాసి

సంఘశ్రేయస్సు కోసం పాటుపడమన్నాడు. అది ఒక విధంగా, ఆత్మ సమర్పణ, ఆత్మబలితో (Self sacrifice) సమానమే నన్నాడు. ఈ వాక్యంచే ప్రభావితుడైన అశోకుడు, బౌద్ధమతావలంబియై ఒక శాసనంలో మొదట యిలా వ్రాయించాడు. ''యజ్ఞాలలో ఏ ఒక్క జంతువును కూడా బలి యివ్వరాదు'' అని. దీనితో భారతీయ పురాణాలు దశావతారలలో బుద్ధుని ఒకడుగా స్వీకరించాయి. ''**అతిసర్వత్రవర్జయేత్**'' అనే మూలసూత్రం మీద అధారపడిందే బౌద్ధమతం. ఈ సూత్రం మీదనే సుదీర్ఘ యాజ్ఞిక ప్రక్రియలన్నీ వ్యర్థప్రలాపాలుగా బుద్ధుడు నిరసించాడు!.

జపానులో నరిత – ఫూడో తెగ (Narita - Fudo sect) నే నరితసన్ (Naritasan) అని కూడ పిలుస్తారు. వీరు స్వల్పకాలంలో చేసే అగ్నిహోత్రాన్ని చేస్తారు. అగ్ని ఆరాధనకు బుద్ధుడు వ్యతిరేకికాడు. క్రీ.శ. **940**లో సుజ్యకు (Sujyaku) అనే జపాను దేశ చక్రవర్తి కౌఛో (Kaucho) అనే ప్రధానరాజ పురోహితుని నుండి గోమ (Goma) అనే అగ్నిహోత్రా రాధన చేయడానికి అనుమతి పొందాడు. అగ్ని, జలము అగ్నిహోత్రారాధనలో ప్రధానస్థానం వహిస్తాయి. ఇవి రెండే మానసిక దోషక్షాళనకు ఉపకరిస్తాయి. వారు ఈ ప్రక్రియ భారతదేశంలో మూడు వేల సంవత్సరాలు క్రితమే ఏర్పడిందని కాని దీన్ని పవిత్ర మతకార్యంగా క్రీ.పూ. 5వ శతాబ్దిలో మలచిన మహాపురుషుడు శాక్యముని బుద్ధుడని చెబుతారు. పవిత్రాగ్నినే బుద్ధుని పవిత్రజ్ఞానంతో సమానంగా భావిస్తారు. ఆ అగ్నిధూమం (Fudo) వారి దోషాలను పటాపంచలు చేస్తుందని విశ్వసిస్తారు. ఫూడో-మయో (Fudo Mayowe) అనే దేవత '**అచలవిద్యారాజ**'(Acala Vidyaraja) గా చెబుతారు. అంటే అనశ్వరమైన విజ్ఞానానికది ప్రతీక! అగ్నిహోత్రారాధన చేసినవారు ఈ విజ్ఞానాన్ని సాధిస్తారని వారి నమ్మకం!

జపాన్ దేశం ఉదయిస్తున్న సూర్యునికి ప్రతీక! సూర్యదేవత వారి దృష్టితో స్త్రీమూర్తి. జపాను రాజ వంశీయులు ఆ దేవత నుండి పుట్టిన వారుగా చెబుతారు. బౌద్ధమతం జపాన్ దేశానికి చైనా దేశం గుండా ప్రసరించడానికి ముందే వీరు సూర్యుని జీవశక్తికి ప్రధాన దేవతగా గ్రహించివున్నారని వారి నాగరికతా సంస్కృతులు వెల్లడిస్తున్నాయి.

**జైనమతం :** బౌద్ధమతంతో బాటు మరొక మతోద్యమం క్రీ.పూ. 6వ శతాబ్దంలో బయలుదేరింది. దీనినే జైనమతమంటారు. జైనుల సంఖ్య తక్కువగా ఉన్నప్పటికీ దీని మతచరిత్ర చాలపెద్దది. జైనులు కర్మసిద్ధాంతాన్నీ, పునర్జన్మను నమ్ముతారు. మానవుడుచేసే ప్రతికర్మ జీవాత్మకు సోకి మంచికో, చెడుకో దారితీస్తుందంటారు. ఆత్మహత్య, హత్య ఇవి

రెండూ చాల చెడ్డపనులు. కాబట్టి ''అహింసాపరమోధర్మః' అనే సిద్ధాంతాన్ని పాటించాలని ప్రతిజ్ఞచేస్తారు జైనులు. వైదికులలో పవిత్రమైన అగ్ని ఉపాసన, చివరికి జంతుబలిగా పరిణామం చెందగా, దానిని పూర్తిగా వ్యతిరేకించిన వర్ధమాన మహావీరుడు, జైన మతాన్ని స్థాపించాడు. జైనుల ఆది పురాణాన్ని బట్టి శ్రావకులకు యజ్ఞోపవీతధారణం వైదిక ఆర్యులవలె ఉన్నది. త్రేతాగ్నులైన ఆహవనీయ, గార్హపత్య దక్షిణాగ్నులు జైనులకుకూడ నున్నది. ఇవి జైనమతం పుట్టడానికి ముందే వున్నవో లేక తర్వాతి వారు స్వీకరించారో తెలియడం లేదు. గౌతమ బుద్ధుని తల్లి మాయాదేవికి స్వప్నంలో నక్షత్రం కనబడి చివరికది ఐరావతమై ఆమె గర్భంలో ప్రవేశించినట్లు, మహావీరుని తల్లికి 14 స్వప్నాలు వచ్చాయంటారు. అందులో పొగ లేని నిప్పు, సూర్యుడు, చంద్రుడు ఉన్నారు.

బుద్ధుడు, మహావీరుడు యజ్ఞ ప్రక్రియనుప్రక్షాళనం చేయాలని సంకల్పించినప్పటికీ వారా ప్రయత్నంలో కొంత వరకే కృతకృత్యులయారు. మహావీరుడు శరీర పరిత్యాగం చేస్తూ శ్రావక, శ్రావికులకు దీర్ఘ సందేశమిచ్చాడు. అప్పుడు శక్రేంద్రుడనే శిష్యుడు ప్రభూ! మీరీ అశుభసమయంలో ఎందుకు శరీరత్యాగం చేస్తున్నారు. మీ అవతారలక్ష్యం కనీసం 2500 సంవత్సరాలు వెనకబడిపోతుంది అన్నాడు. దానికి మహావీరుడు మందస్మితం చేశాడు. అనుకొన్న విధంగానే జరిగింది. మహావీరుడు సిద్ధిపొందిన 2500 సంవత్సరాల తర్వాత సరిగ్గా 1963లో భారతదేశంలో యజ్ఞం యొక్క పవిత్రత పునరుజ్జీవింపజేయబడింది.

**పార్శీ లేక జొరాష్ట్రియన్ మతం :** చరిత్రకు పూర్వ యుగాలలోని హిట్టైటులు, ఫోనీషియన్లు, ప్రాచీన ఈజిప్షియన్స్ మరియు ఇతర తెగలవారు మానవజాతి సంస్కృతిని నాగరికతలను ప్రభావితం చేశారు. ఆ ప్రభావానికి లోనైన తెగలలో మాగి తెగ (Magi Tribe) ఒకటి. ఈ తెగలో పుట్టిన చారిత్రక వ్యక్తి ప్రధాన పురుషుడు జరథూష్ట్రా (Zarathustra) అని ప్రాచీన చరిత్రకారులందరూ అంగీకరించారు. ఈ ప్రాచీన ప్రవక్త మాగి తెగ వారికొక నూతనోత్తేజాన్ని కల్గించడమే కాదు, అనశ్వరమైన, శాశ్వత సత్యం వైపు దృష్టి మరల్చాడు.

జరథూష్ట్రా బోధనలు జెంద్ అవెస్థా (Zend Avestha)లోను, గాథల (Gathas)లోను అక్షరబద్ధమై ఉన్నాయి. మాగియన్ పురోహితుల పవిత్రరచనలుగా, జరథూష్ట్రియ మత గ్రంథాలుగా వీటిని పరిగణిస్తారు. సిరియక్, లేక అరబిక్ రచయితలు మత ప్రవక్త జరథూష్ట్రాను మాగియన్ ప్రవక్త, దైవికుడు అని పిలుస్తారు. ఆంగ్ల భాషలోని జొరాయాస్టర్ (Zoroaster) అనేమాట గ్రీక్- రోమన్ భాషల్లో మౌలిక పదమైన జరథూష్ట్రా (Zarathustra)కు అపభ్రంశరూపమే!

మాగియన్ల సంస్కృతి ఎందరో మేధావుల్ని ఆకర్షితుల్ని చేసింది. పైథాగొరస్ ప్రామాణిక మతాచార్యుల వద్ద ఈ మత గ్రంథాలను అభ్యసించాడు. ప్లేటో ఈ ప్రాంతాలకు వచ్చి ఉండాలని

తహ తహలాడాడు. సోఫిస్ట్ ప్రోడికస్ ను అనుసరించే సోక్రటీస్ సమకాలీనులు తమ వద్ద మాగియన్ రహస్య గ్రంథాలున్నాయని చెబుతుండేవారు. మతాచార్యుడు గోబ్రియాస్ తాను సోక్రటీస్‌కు బోధకుడనని గొప్పలు చెప్పుకొనే వాడు. నిడస్ వాసులైన అరిస్టోటిల్, డైనన్, యుడోక్సస్, థియోపాంపస్ మొదలైనవారు తాము జరథుష్ట్రా మాగియన్ మత బోధనలను తెలిసిన వారమని చెప్పేవారు. ప్లిని అనే చరిత్రకారుని వ్రాతలను బట్టి క్రీ.పూ. 200 ప్రాంతాలలో ఉండిన హెర్మిప్పస్ అనే ప్రసిద్ధతాత్త్వికుడు మాగియన్ల సంస్కృతిని, జరథుష్ట్రా మత గంథాలను సమగ్రంగా అధ్యయనం చేసినట్లు తెలుస్తున్నది.

ఏ మత ప్రవక్త కూడ ఈ ప్రపంచాన్ని నాశనం చేయడానికి రావడం లేదు. ప్రపంచ ప్రజల అసంపూర్ణమైన మనోరథాలను సంపూర్ణం చేయడానికే అవతరిస్తున్నాడు. ఈ విషయం జరథుష్ట్రా విషయంలో నూటికి నూరుపాళ్లు సత్యమైనది. అలాగే రక్షకుడుగా పిలువబడిన జీసస్ ఆకోవకుచెందినవాడు! వీరి మత గ్రంథాలలో జరథుష్ట్రా ఆవిర్భావానికి పూర్వమే ఆయన అవతరణను గూర్చిన సూచనలు లభ్యమౌతున్నాయి. అవెస్థా గాథలలోను, పహ్లావీ గ్రంథాలలోను ఒక దర్శన గాథ యిలా చెప్పబడింది. ఈ మతం పుట్టడానికి మూడు వేల సంవత్సరాలకు ముందే పౌరాణికమైన ప్రాగ్రూప వృషభానికి స్వర్గంలో ఒక దర్శనం ఏర్పడింది. ప్రవాసీయుల స్వర్గంలో జరథుష్ట్రా, మతప్రవక్త యొక్క ఆదర్శరూపం దర్శనమిచ్చిందట! ఇమ్‌రాజు (King Yim) యొక్క స్వర్ణయుగంలో అతడు దుష్టశక్తులకు ఒక హెచ్చరిక చేశాడు. ''త్వరలో ఒక మనుష్య శిశువు (Man Child) అవిర్భవించి మిమ్మల్ని నాశనం చేస్తాడని'' జీసస్ తనను ఒక మానవ కుమారునిగా (Son of Man) చెప్పికొన్నట్లు, జరథుష్ట్రా **'మనుష్యశిశువు'** గా చెప్పబడ్డాడు. ఇది వాల్మీకి రామాయణంలో శ్రీరాముడు తనను **''ఆత్మానం మానుషం మన్యేరామం దశరథాత్మజమ్''** అనే వాక్యంతో సంవదిస్తున్నది. ప్రాగ్రూప వృషభానికి వచ్చిన దర్శనం మధురకవి ఆళ్వారుకు నమ్మాళ్వారు శ్రీరామానుజుల భవిష్యదాచార్య విగ్రహం యివ్వడంతో పోలుతున్నది. శ్రీకృష్ణుడవతరింపక ముందే అతని అవతరణ సూచన ఆకాశవాణి చేయడం దాని కోసం కంసాదులు వేయి కళ్లతో ఎదురుచూడడాన్ని స్ఫురింపజేస్తున్నది. జరథుష్ట్రా అవతరించడానికి మూడు వందల సంవత్సరాలకు ముందే మాట్లాడే శక్తి గల ఒక ప్రాగూప వృషభం అవతరించి తన దర్శనం సత్యమని, త్వరలో జరథుష్ట్రా బోధనలు ప్రజలు వినగలరని చెప్పి అదృశ్యమైంది. ఇది వైదిక ఆర్యులచే ప్రశంసింపబడిన **''చత్వారి శృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తయో అస్య త్రిధాబద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యా ఆవివేశ** (ఋగ్వేదం 4-58-3) అనే మంత్రంలో చెప్పబడిన ప్రతీకాత్మక ప్రాగ్రూపవృషభమే!

విశ్వసృష్టి కర్తయైన ప్రభువు అహూరమజ్దా (Ahura - Mazda) చుట్టూ ఆవరించిన స్వర్గలోకవైభవకాంతులు ఒక వెలుగు రేఖగా బయలుదేరి భవిష్యత్తులో జరథుష్ట్రాను గర్భవాసాన ధరించి తల్లికాబోయే దుక్తాబ్ (దుగ్దోవ) అనే కన్య శరీరంలో ప్రవేశించింది. ఆ కాంతి వల్లికలు

ఇరాన్ దేశపు మతప్రవక్తకు జన్మనిచ్చేటంతవరకు ఆమె శరీరంలో వ్యాపించివున్నాయి. కొన్ని దుష్టశక్తుల ప్రేరేపణతో ఆ కన్య అడవుల పాలైంది. అక్కడ, పతిరగ్‌తరస్పో (Patiragtaraspo) అనే వ్యక్తి అమెను రక్షించి తన కుమారుడు పొరుషాస్పో (Porushaspo) లేక పౌరుషాస్ప (Pourushaspa) నిచ్చి పెళ్లి చేశాడు. ఇతడు అడవిలో పశువుల్ని మేపుతుండగా ఒక దేవ దూత ఆకాశం నుండి దిగివచ్చి ఒక త్రిశూలం (Hom Rod) వంటిదాన్ని యిచ్చి అదృశ్యమౌతుంది. దానినతడు భార్యకిచ్చి భద్రపరచమంటాడు. గర్భవతియైన దుగ్దోవ శరీరము, ఆత్మ, స్వర్గలోక వైభవంతో నిండింది. ఆమె ప్రసవ కాలంలో ఒక స్వప్నాన్ని సందర్శించింది. ఆకాశం నుండి కొన్ని మేఘాలు అమెను చుట్టుముట్టాయి. ఆ మేఘాలు క్రూరమృగాలు మారి ఆమె గర్భాన్ని చీల్చివేశాయి. వెంటనే జాజ్జ్వల్యమాన వెలుగు ప్రసరించి ఆ జంతువులు నశించగా ఒక చేతిలో మతగ్రంథం (scripture) తో మరో చేతిలోరాజదండం (sceptre) తో జరధూ్రష్టా జన్మించాడు. ఆ శిశువు ఏడ్వడానికి బదులుగా నవ్వాడు. సంఘంలోని దుష్టశక్తులు అతణ్ణి బాధించసాగాయి. చాల సంవత్సరాలు అతడు తపస్సుకై అడవులకు వెళ్లిపోయాడు. జరధూ్రష్టాకు ముప్పైయవ ఏట దర్శన శక్తితో జ్ఞానోదయం కల్గింది. అతనికి ఏడుసార్లు దర్శన సిద్ధికల్గినట్లు పహ్లావీ గ్రంథాలు తెలుపుతున్నాయి. విస్తస్ప ( Vistasp) అనే రాజుకు జరధూ్రష్టామత మిప్పించాడు. ఒక సంప్రదాయ పురోహితుని మతం మార్పిడి చేశాడు. అగ్నిహోత్రారాధనను పవిత్రంగా స్థాపించాడు.

వైదిక ఆర్యులు, పౌరాణికులు చెప్పే చతుర్విధ యుగాలను జరధూ్రష్టా చెప్పాడు. నాల్గు పాదాల ధర్మం ఒక్కొక్క పాదం తగ్గుతూరావడాన్ని కూడ వివరించాడు. నాల్గు పాదాలపై ధర్మాన్ని నిలపాలన్నదే ఆయనధ్యేయం. అగ్నిహోత్రరాధనలో సామూహిక ఆరాధన , వ్యక్తిగతారాధనకు వెసులుబాటు కల్పించాడు. అతడు 76 సంవత్సరాలు జీవించి అగ్ని దేవాలయంలో అహూరమజ్దా విగ్రహానికి ముందున్న అగ్ని వేదిక దగ్గర చివరి సందేశాన్ని శిష్యులకు అనుగ్రహించాడు. అత్రవన్ పురోహితులతో మత గ్రంథాల పవిత్రతను కాపాడమని కోరాడు.

ఇతని మరణాన్ని గురించి మరో రెండు ఐతిహ్యాలున్నాయి. వేద మంత్రాలలో చెప్పబడిన అంగిరసుని వీరు అంగ్ర (యాస్ట XL11-15) అని పిలుస్తారు. ఇతడు అగ్ని పరిశోధనలు చేసిన వైదిక ఋషి. ఈ అంగిరసులనే అత్రవన్స్ (అగ్నిపురోహితులు) గా పార్శీలు పిలుస్తారు. కాని, జెంద్ అవెస్తాలో 'అత్రవ' అనే పేరు కనబడుతుంది.

అవెస్తన్ భాష ఇరానియన్ శాఖకు చెందిన ఇండో - జర్మానిక్ కుటుంబ భాషలకు చెందినది. అవెస్తా అనే పేరు భాషకు, మతగ్రంథానికి కూడా రావడంలో యిది పహ్లావీ లేక మధ్య పర్షియన్ అవెస్తక్ భాషల పోలికను వహిస్తూవుంది. సంస్కృత, అవెస్తా భాషల మధ్య చాల దగ్గరితనముంది.

| సంస్కృతం | - | అవెస్తా | సంస్కృతం | - | అవెస్తా |
|---|---|---|---|---|---|
| 1) యజ్ఞ | - | యస్న | 7) అర్యమన్ | - | ఐర్యమన్ |
| 2) సర్వ | - | హౌర్వ | 8) దస్యు | - | దహ్యు |
| 3) సరస్వతి | - | హరహ్వతి | 9) ఋత | - | అశ |
| 4) సింధు | - | హిందు | 10) విప్ర | - | విఫ్ర |
| 5) సోమ | - | హవోమ | 11) హోతృ | - | జోతర్ |
| 6) స్వర | - | హ్వర | 12) కవి | - | కవి |

భాషలో పోలికలు చూస్తే 3500 సంవత్సరాలకు పూర్వమే వీరి పూర్వీకులు, వైదిక ఆర్యులు కలసిమెలసి ఒకే ప్రాంతంలో నివసించి వుంటారని చెప్పవచ్చు.

| | వైదిక మతం | జొరాష్ట్రియన్ మతం |
|---|---|---|
| 1. | గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులనే త్రేతాగ్నులు | అతేష్ – బెహరామ్<br>అతేష్ – అదరాన్<br>అతేష్ – దగ్గః<br>అనే మూడు విధాలైన అగ్నిదేవాలయాలు |
| 2. | జ్యోతిష్టోమయాగం | యజిస్న లేక లజస్నే యాగంలోని ప్రక్రియ జ్యోతిష్టోమంలో చెప్పబడినవే. |
| 3. | అగ్నిష్టోమయాగం | లజస్నే యాగంలో గొఱ్ఱెకు బదులుగా ఎద్దును బలి యిస్తారు. జరథూష్ట్ర కాలం నుండి ఎద్దు వెంట్రుకలను కోసి ఒక భరిణెలో పెట్టి అగ్నికి చూపిస్తారు. |
| 4. | అప్రియాగం (అప్రి = ఆహ్వానించుట) | అఫ్రింగన్ యాగం (అఫ్రి = ఆహ్వానించుట) |
| 5. | దర్శపూర్ణమాస ఇష్టిలో పురోడాశ సమర్పణ చేస్తారు | దరూన్ యాగంలో రొట్టెను సమర్పిస్తారు |
| 6. | చాతుర్మాస్య యజ్ఞం | గహంబర్ యస్న |

జొరాష్ట్రియన్లు లేక పార్శీలు అగ్నిహోత్రారాధకులుగా జగత్ప్రసిద్ధులు. అగ్నితో పాటు సూర్యుని కూడ వీరు ఆరాధిస్తారు. అగ్ని ఆరాధన త్రికరణ శుద్ధికి ప్రతీకగా వీరు భావిస్తారు. స్పితమా తెగకు చెందిన వారు సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాలలో తమ భక్తిని ప్రకటిస్తారు. మాగియన్లలో కూడ ఎజికల్ కాలంలో జరూసలేమ్‌లో సూర్యారాధన విశేషంగా ఉండేది. జరధూష్ట్ర తర్వాత జంతు బలి మరల యజ్ఞాలలో ప్రవేశించింది. 'అగ్నిచితి'(Fire-alter) కి సరైన పదం పర్షియన్ గ్రంథాలలో లభించడం లేదు.

**జూడాయిజమ్ లేక జ్యూమతం** : జూడా (Judah) అనే మాటకు, అపభ్రంశరూపమే జ్యూ (Jew) అనే పదం. అత్యంత ప్రాచీనమైన, శక్తిమంతమైన తెగ యిది. బైబిల్‌లోని జెనిసిస్ సంప్రదాయం, అబ్రహామ్ అనే పురుషుని ఛాల్డియన్స్‌తో ముడిబెట్టినప్పటికీ, పురాతత్త్వవేత్తల త్రవ్వకాలను బట్టి సిరియా, పాలస్తీనా, మెసొపొటేమియాల నేపథ్యంగలిగిన పితృస్వామ్యపద్ధతి గల యుగానికి సంబంధించిన అవశేషాలు నేడు మనకు లభించాయి. ఈ యుగం ఎప్పుడంతమైందో ఖచ్చితంగా తెలియడం లేదు గానీ బహుశా క్రీ.పూ. 2000 నాటికి ముగిసివుండవచ్చు భావిస్తున్నారు.

అప్పటి నుండి యావే (Yahweh) దేవతకు చెందిన ఇజ్రాయిల్ మతం ఆవిర్భవించింది. ఈ దేవతారాధనను మోసెస్ (Moses) సెనాయ్ (Senai) పర్వతం మీద తెలుసుకున్నాడు. బైబిల్ పాతనిబంధన (Old Testament) ప్రకారం 'యావే' దేవతకు చెందిన ఆరాధన విశేషాలు మోసెస్ దర్శించినాడని చెప్పబడినా, ఆయన ప్రత్యేకించి ఒక కొత్తమతాన్ని స్థాపించ లేదు. ఉన్న మతాన్నే కొత్తగా పునర్నిర్వచించి, అందులో భగవంతుని ఎదురుగా ప్రజల్ని నిలబెట్టాడు. అతడు భగవంతుని ఆరాధన పద్ధతిని, నియమాలను ఏర్పాటుచేశాడు. అప్పటికే అగ్నిదేవతాకమైన ఆరాధన పద్ధతులుకొన్ని ఉన్నప్పటికీ వీటన్నిటినీ ఒక సక్రమవిధానంలో అమర్చాడు. మోసెస్‌కు దివ్యజ్యోతి సందర్శనంచే (Divine light experience) కల్గిన దివ్యానుభూతి వీటన్నిటికీ కీలకం!

ఒక రోజు మోసెస్ గొఱ్ఱెలను మేపుతుండగా ప్రభువు దగ్గర నుండి వచ్చిన దేవత ఒక అగ్నికీలవలె పొదల మధ్య నుండి వెల్వడుతున్నట్లు తోచింది. మోసెస్ ఆ పొద తగులబడిందనుకున్నాడు. కాని, అది యథాప్రకారంగానే ఉంది. వెంటనే, ఆ మంటలేమిటో పరిశీలిద్దామని ఒక అడుగుముందుకేయగా, ఆ దేవత యిలా చెప్పింది. ''నీ పాదరక్షల్ని తీసి వేయ్! నీవు నిల్చుకున్న భూమి అత్యంతపవిత్రమైనది.'' అంటూ ''నేను నీ పూర్వీకులైన అబ్రహామ్, ఐజక్, జాకబ్‌ల దేవతను.'' ఒకప్పుడు ప్రజలు ఇజ్రాయిల్‌కు తిరిగి వచ్చి ప్రభువుకు ఆరాధనలు చేయాలని అనుకొంటుండగా, ప్రభువు వారి ముందు పగటి వేళ ఒక పెద్ద

ధూమస్తంభం వలె, రాత్రిపూట అగ్నిస్తంభం వలె కనబడ్డాడు. ప్రజలందరూ సినాయ్ పర్వతాన్ని సమీపించినప్పుడు ఆ పర్వతమంతా దట్టమైన పొగచే నిండి పోయివుంది. ఎందుకంటే, ప్రభువు అగ్ని రూపంగా ఆ పర్వతం మీదకు వచ్చివున్నాడు. ఎట్టకేలకు, పురోహితులు కూడ తమను పవిత్రం చేసుకొన్న తర్వాతనే ఆ ధూమావృతమైన పర్వతాన్ని అధిరోహించడానికి పూనుకొన్నారు. ఆ పొగ మధ్యభాగంలో ఎక్కడో అగ్ని శిఖలు దాగివున్నయనివారు ఊహించారు.'' ప్రభువు మోసెస్‌తో ఇజ్రాయిల్ ప్రజలకిలా చెప్పమని ఆదేశించాడు. ''మీరు చూచారు కదా! ప్రభువు మీతో స్వర్గలోకం నుండి ఎలా మాట్లాడాడో!'' బైబిల్, ఎక్సోడెస్‌లోని పై వాక్యాలలో అగ్నిరూపుడైన ప్రభువు, భూమిపై అగ్ని వేదికను నిర్మించుమని మోసెస్ కిచ్చిన ఆదేశం, ప్రజలు తనను ఏ విధంగా ఆరాధించాలో, వారి మంచి కోసం ఏ ప్రక్రియను పాటించాలో సూచింపబడ్డాయి. అగ్ని ఆరాధనలో మానవ ప్రాణ సమర్పణ తప్ప జంతుబలుల ప్రసక్తి కనబడుతూవుంది. అగ్ని ఆరాధనకు సరైన సమయాలు సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాలు.

బైబిల్ తత్సంబంధిత గ్రంథాలను పరిశీలిస్తే బైబిల్‌కు పూర్వ యుగాలలో వివిధాకృతులుగల్గిన అగ్నివేదికలుండేవని తెలుస్తుంది. మోసెస్ వీటిలో కొన్ని మార్పులు చేశాడు. **సామాన్య అగ్ని వేదిక** ఉండేది. అందులో అగ్ని ఆరాధనా నియమానుసారం ఏ సామాన్యుడైనా సరే, పురోహితుని నిమిత్తం లేకుండా తన శక్తి కొలది అగ్నిలో హవిస్సులను సమర్పించవచ్చు. సామాన్య అగ్ని వేదికా నిర్మాణంలో చక్కగా తొలచబడని రాళ్లను వినియోగించేవారు.

మరియొక అగ్నివేదిక పేరు **చతుశ్శృంగ అగ్నివేదిక.** చతురస్రాకృతి కల్గి, నాల్గువైపుల మెట్లు గలిగి, నాలుగు మూలల పై భాగంలో నాల్గు కొమ్ములుండడం దీని ప్రత్యేకత. తత్పూర్వం సామాన్యంగా అరబ్బులు ఏ రకమైన రాతినైనా సరే, ఆ సమయానికి దొరికింది అగ్ని వేదికా నిర్మాణానికి వినియోగించేవారు. సులభంగా లభించే రాళ్లతో అగ్నివేదికల్ని నిర్మించే పద్ధతికి స్వస్తిచెప్పమన్నాడు మోసెస్. దీనికాయన ఒక నియమం ఏర్పాటు చేశాడు. పురోహితులకు మాత్రమే ఈ అగ్ని వేదికా నిర్మాణంలోని రహస్యాలు తెలిస్తేచాలదు, సామాన్యమానవులకు కూడ తెలియడం అవసరమన్నాడు.

ఎక్సోడెస్ (Exodus) లోని ఒక ఆదేశానుసారం ఒక అగ్ని దేవాలయ (Tabernacle) నిర్మాణం యిలా చేయబడింది. ఇత్తడి రేకులతో కప్పబడిన షిట్టిమ్ కొయ్యను అగ్ని వేదికకు వినియోగించారు. ఈ వేదిక ఐదు క్యూబిట్లు పొడవు, ఐదు క్యూబిట్లు వెడల్పు, మూడు క్యూబిట్లు ఎత్తు కలిగి, నాల్గు మూలల నాల్గు కొమ్ములు అమర్చబడ్డాయి. ఈ విధమైన అగ్ని వేదికలు పురోహితులు మాత్రమే ఉపయోగించేవారు.

చతురస్రాకారపు అగ్ని వేదికల నాల్గు మూలల నాల్గు కొమ్ములు ఎలా ఎందుకు ఎప్పుడేర్పడ్డాయి అనే విషయం ఇజ్రాయిల్ ప్రజలకు తెలియలేదు. ఏవో ఊహాగానలు చేశారు. అవన్నీ సమన్వయరహితాలైనవే! భారతీయ వైదిక వాఙ్మయంలోని అగ్ని దేవతాస్వరూపాన్ని గనుక మనం పరిశీలిస్తే, అగ్ని దేవతకు నాలుగు కొమ్ములుంటాయి. ఈ నాల్గు కొమ్ములు నాల్గు వేదాలకు ప్రతీకలు. సీనాయ్ పర్వత పరిసర ప్రాంతాలలో జరిగిన పురాతత్త్వ శాస్త్రజ్ఞుల త్రవ్వకాలలో ఎన్నో అగ్ని వేదికలు బయటపడ్డాయి. గేజర్ (Gazer) అనే చోట దొరికిన అగ్ని వేదిక క్రీ.పూ. 600 సంవత్సరం నాటిదని నిర్ణయించారు. ఒక చతురస్రాకారపు దిమ్మకు నాల్గు మూలల పైకి పొడుచు కొనివచ్చిన నాల్గు కోణాలు అమర్చబడివున్నాయి. ఊర్ధ్వముఖమైన ఈ నాల్గు కోణాలు అగ్ని దేవతాకమైన నాల్గు కొమ్ములే! సందేహం లేదు.

అగ్ని వేదికలలో సుధూపాగ్ని వేదికలు, జంతుబలులిచ్చే వేదికకు వెనుకవైపు ఉంటుంది. ఒక తెర వెనుక ఈ వేదిక ఉండగా దానిముందు అర్ధచంద్రాకృతి గల తోరణముంటుంది. దానికి కూడ కొమ్ములుంటాయి. ఈ సుధూపాగ్ని వేదిక అతి పవిత్రమైన స్థాయికి చెందింది. దీనిలో ప్రతి రోజు సుమధుర పరిమళమిచ్చే సుగంధ ద్రవ్యాలు వేయబడుతాయి. ఈ సుగంధ ద్రవ్యాలు సమర్పించే సమయం సాయంత్రం దీపాలు వెలిగించేటప్పుడు ఉదయాన్నే దీపం వెలిగించేటప్పుడు చేస్తారు. ఈ ఉదయాస్త మానాల కాలనియమం వేద విధానంతో సరిపోలుతూ వుంది.

అగ్ని దేవాలయాలలో కొవ్వొత్తులు వెలిగించే పద్ధతికిఇజ్రాలీయులు ఏవో అర్థాలు చెప్పుకొన్నారు. అవి సరైనవి కావు. ఇండ్లలో కొవ్వొత్తులు వెలిగించడం అవసరమే! అగ్ని వేదికలకు నాలుగు మూలల కొమ్మున్నట్లే అగ్ని దేవాలయంలో ఏడు కొవ్వొత్తులు ఒకే సారి వెలిగించే దీపముసమ్మెకు వంపుగా గలఏడు కమ్ములు పైకి ఉండడం గమనింపదగింది. ఇది సప్తహస్తాలు గల సప్తజిహ్వుడైన వైదికాగ్ని దేవతను సూచించే ఆరాధన ప్రక్రియ. క్రీ.పూ. 40వ శతాబ్దికి చెందిన ఆంటిగోనస్ (Antigonus) వేయించిన నాణెం త్రవ్వకాలలో లభించింది. ఆ నాణెంపై గల బొమ్మలో ఒక దీపపు సమ్మెకు ఏడు శాఖలొకవైపు, మరోవైపు నాల్గు శాఖలు మాత్రమే ఉన్నాయి. ఏడు శాఖలు అగ్ని యొక్క ఏడు చేతులనే సప్తజిహ్వాత్వానికీ, నాల్గు శాఖలు అగ్ని యొక్క చతుర్వేదాత్మకమైన చతుశ్శృంగత్వానికి సూచకాలు! **చత్వారిశృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య । త్రిధా బద్ధోవృషభో రోరవీతి మహోదేవోమర్త్యా ఆ వివేశ** ( ఋగ్వేదం – 4–58–3 )

బైబిల్ పాత నిబంధన (Old Testament) లోని Book of Genesis లో ప్రపంచసృష్టి,

ఆడమ్ ఈవ్‌ల కథ చెప్పబడింది. ఆ తర్వాత భగవంతుని పట్ల గల విశ్వాసానికి, వినయానికి ప్రతీకయైన అబ్రహామ్ గురించి చెప్పబడింది. ఇజ్రాయీయుల పూర్వీకులలో తొలితరానికి చెందిన వారిలో అత్యంత ప్రసిద్ధుడు అబ్రహామ్!

'అబ్రహామ్' అనే పదానికి అసలు సరైన అర్థమేమిటి ? అని ప్రశ్నించుకొని వ్యుత్పత్తిపరంగా (etymological point of view) అర్థాన్ని సాధించడానికి ప్రయత్నించారు. కొందరు పండితులు ఈ పదంలో రెండవభాగమైన 'Ram' అనే దానికి అర్థనిర్ణయం చేయలేక పోయారు. హిబ్రూలకు ఒక విషయం మాత్రం నిశ్చయంగా తెలుసు. 'అబ్రహామ్' అనే పదం ఖచ్చితంగా హిబ్రూభాషకు సంబంధించింది కాదని. కాని, ఉచ్చారణననుసరించి పరిశీలిస్తే అభ్ – రామ్ (abh-ram) అనే దానికి 'ఉదాత్తుడైన తండ్రి' (exalted father) అని అర్థం. ఇటీవలి పురావస్తు పరిశోధన శాఖ వారి త్రవ్వకాలు, పరిశోధనలు అబ్రహామ్ కాలం నాటి సంస్కృతీపరమైన విశేషాలను వెలిసితీసి భావనలో గొప్ప విప్లవాత్మకమైన మార్పును తీసుకొచ్చింది. ఈజిప్టు, బాబిలోనియాలలో క్రీ.పూ 2000 నాటికే అత్యున్నతమైన సాహిత్యస్థితిని అందుకొన్న వైనం వారి భావనాప్రపంచాన్ని బట్టి చెప్పవచ్చు. **ఈ పరిశోధనల్లోనే పాలస్తీనాకు బయట దొరికిన శాసనాలలో అబ్బిరాము (Abbiramu) అనే పేరు వెలుగులోనికి వచ్చింది. ఈ 'అబ్బిరాము' అనే వ్యక్తియే పాతనిబంధనలో పరమపూజ్య స్థానంలో ఉన్నటువంటి 'అబ్రహామ్' అని పండితులందరూ గుర్తించి ఆమోదించడం జరిగింది.**

'అబ్బిరాము' తెలుగుపదంగా కనబడుతున్నది. ఇక్కడ తెలుగు సాహిత్యానికి సంబంధించిన ఒక అంశం స్ఫురణకు వస్తున్నది. వేమన యోగి ఆటవెలది పద్యాలమకుటం 'విశ్వదాభిరామ వినురవేమ' అనేది అందరికీ తెలుసు. తెలుగు పండితులెందరో ఈ మకుటానికి అర్థం చెప్పడానికి ప్రయత్నించారు. కాని, అది యింకా విస్పష్టంగా అర్థ నిర్ణయం చేయవలసిన అంశాలలో ఒకటిగా యిప్పటికీ నిలిచివుంది. ఎవరూ దానికింతవరకు చక్కని పరిష్కారాన్ని సూచించ లేదు. విశ్వద + అభిరామ = విశ్వదాభిరామ! ఒక భాగమైతే, వినురవేమ! అనేది వేమన ఆత్మ సంబోధన! నా దృష్టిలో ఈ 'అబ్బిరాము' డనే వ్యక్తి పేరు 'అభిరామ' అనే సంస్కృత పదానికి వ్యావహారిక రూపం! ఈ 'అభిరాము' డెవరో ఖచ్చితంగా తెలియడం లేదు. ఈ పేరు 'అబ్బిరాము' గా పాలస్తీనాకు బయట దొరకిన శాసనాల్లో ఎలా వచ్చిందో అంతుబట్టడం లేదు. కాని, ఒకటి మాత్రం చెప్పవచ్చు. ఈ 'అభిరాము' డెవరో విశ్వజనీనంగా, విశ్వవ్యాప్తంగా దిగిన వ్యక్తిగా కనబడుతున్నాడు. అతి సామాన్య ప్రజలైన గ్రామీణులు, పామరులు కూడ ఆయనను వారి భాషలో 'అబ్బిరాము' డని పిలిచే వారు కాబోలు! ఆయన వారికెంత చేరువైన వ్యక్తియో ఆ పేరును బట్టి చెప్పవచ్చు! 'విశ్వామిత్ర' అనే శబ్దంలో 'విశ్వ + అమిత్ర' అని

విడదీయరాదని, 'విశ్వ + మిత్ర' అని విడదీయాలని 'మిత్రేచర్షే' అనే ఒక ప్రత్యేక సూత్రం చేత పాణిని సూచించిట్లుగా, 'విశ్వద' అనే మాటకు రెండర్థాలు చెప్పవచ్చు.

1. విశ్వము చేత యివ్వబడిన వాడు  2. విశ్వమునకు యిచ్చిన వాడు

విశ్వము చేత యివ్వబడిన వాడెప్పుడూ విశ్వజనీనుడౌతాడు. అంటే, భగవంతుని చేత విశ్వానికి యివ్వబడిన గొప్ప పురుషుడని అర్థం. ఇక రెండవది, విశ్వమునకు యిచ్చిన వాడు! ఆయన విశ్వానికిచ్చిన దేమిటి? అనశ్వరమైన, శాశ్వతమైన ఆధ్యాత్మిక జ్ఞానము. భగవంతుని ప్రతి నిధిగా ఆయన ఈ పనిచేశాడు. ఇక్కడ అబ్రహామ్ విషయంలో ఈ రెండర్థాలు సార్థకమౌతున్నాయి.

దీనిచేత, సమన్వయార్థం యిలా వుంటుంది. సృష్టికర్తచేత విశ్వానికి యివ్వబడిన వాడవై, విశ్వజనీనమైన జ్ఞానాన్ని ప్రజలకుపదేశించిన ఓ అభిరామా! (అబ్బిరామా!) వేమన స్వానుభవంతో చెప్పే ఈ మాటలను కూడ వినుమా!'' అని విశ్వమానవుని (Universal Man) ఉద్దేశించి వేమన వ్రాసిన మకుటమే **'విశ్వదాభిరామ వినురవేమ'** అని నేను భావిస్తున్నాను. అభిరాముడంతటి విశ్వమానవుని సాధనంగా గ్రహించి విశ్వమానవాళికి వేమన అందించిన మహామకుటమది. అంటే గొప్పకిరీటమన్నమాట! ఏది ఏమైనా ఈ విషయం యింకా లోతుగా పరిశీలించి నిగ్గుతేల్చవలసివుంది. వేమన సంబోధించిన 'అభిరాము' డనే ఈ 'అబ్బిరాము'డే బైబిల్ పాతనిబంధనలోని విశ్వజనీన వ్యక్తి 'అబ్రహామ్' అని నేను భావిస్తున్నాను. ఎందుకంటే, 'అబ్బిరామ' అనకుండా 'అబ్బిరాము' అని ఉత్వసహితమై ప్రథమావిభక్తి ప్రత్యయం లోపించిన రూపంగా ఉండడం చేత, ఇది అచ్చంగా తెలుగుపదమని, దాని పూర్తి రూపం 'అబ్బిరాముడు' అని నేను సంభావిస్తున్నాను. కాబట్టి, ఈ అబ్బిరాముడెవడో తెలుగువాడేనని నా అనుమానం! ఈ చర్చచే తేలిందేమంటే - **అభిరామ** ⟶ **అబ్బిరాము** ⟶ **అబ్రహామ్** గా ఉచ్చారణలో మార్పు పొందిందని చెప్పవచ్చు. తమిళనాడులో ఆడపిల్లలకు 'అభిరామి' అని పేరు పెట్టడం వుంది.

బౌద్ధమతానికి మాధ్యమికవాద ప్రవర్తకులుగా గుంటూరు వాస్తవ్యులైన నాగార్జునాచార్యుల వారినీ, జైనమతానికి అనేకాంతవాద లేక స్యాద్వాదప్రవర్తకులుగా అనంతపురం, కొనకొండ్ల వాస్తవ్యులైన కుంద కుందాచార్యులను యిచ్చిన ఆంధ్రదేశం, ప్రాచీన జూడాయిజమ్, క్రైస్తవం, ఇస్లాం, మతాచార్యులలో తొట్టతొలి దార్శనికుడుగా అబ్బిరాముడనే ఆంధ్రుడు పీఠమెక్కగా ఆయన పేరు వారి ఉచ్చారణలో 'అబ్రహామ్' గా మారడంలో వింతలేదని నా నిశ్చితాభిప్రాయం. వేదమెప్పటిదో అయినప్పటికీ 'విస్సన్న చెప్పిందే వేదం' అనే సూక్తి ఒక వ్యక్తిఘనతమీదుగా స్థిరపడినట్లు క్రీస్తు పూర్వం ఏ బౌద్ధుల కాలంలోనో అభిరాముడెందుకు వలసపోయి వుండ

రాదు ? ఈ ఊహ ప్రస్తుతానికి దూరాన్వయ, క్లిష్టాన్వయంగా కనబడవచ్చును గాని చరిత్రకు, పురాతత్త్వానికి చెందిన రెండు మూడు కీలక అంశాలు లభిస్తే నిజం నిరూపించవచ్చు. ఏది ఏమైనా ప్రపంచ మతచరిత్ర పరిణామాల దృష్ట్యా, ప్రపంచ ప్రజల వలసల (Migrations) దృష్ట్యా దీన్నింకా లోతుగా అధ్యయనం చేయవలసివుంది.

అబ్రహామ్ ఆంతర జీవితాన్ని మతపరమైన, నైతికమైన, వైయక్తికమైన దృక్కోణాలలో చూస్తే కొన్ని ఆసక్తిరకమైన సత్యాలు తెలుస్తున్నాయి. అతని విశ్వాసం భగవంతుని యందు నిమగ్నమైనది. అతని ఉద్దేశ్యంతో Jeh కేవలం ఒక దేవుడే కాదు, తన ఆరాధ్య దేవత కూడ. **ఈ రెంటి యొక్క నిత్యసాన్నిహిత్యం చేత అతనిని జూడాయిజమ్, క్రైస్తవం, మరియు ఇస్లాం అనే మూడు మతాల వారు కూడ పవిత్ర వ్యక్తిగా అంగీకరించడమే కాదు, అతడు యాజ్ఞికమైన ఆరాధనలను ఎంతో నిశితంగా అమలుపెట్టే వాడుగా, అగ్ని వేదిక ముందు దేవునికి నివేదనలను సమర్పించే ప్రధాన అర్చకస్వామిగా గౌరవిస్తారు.** ఇన్ని అంశాల చేత అబ్రహామ్‌ను ప్రవక్త (Prophet) గా, దేవుని ప్రతినిధిగా (Spokesman for God) సంభావిస్తారు. అబ్రహామ్ విలక్షణమైన వ్యక్తిత్వం గలవాడు. ఆయన దయ,కరుణ, జాలి అనే మానవీయ గుణాలకు పెట్టింది పేరు. బైబిల్ పాత నిబంధన (Old Testament) లో అబ్రహామ్‌కు మహోన్నత స్థానం యివ్వబడింది. అతడు ఇజ్రాయిల్ ప్రజల మూలపురుషుడు (Proginitor). ఇదిలా వుండగా కొత్త నిబంధన (New Testment) లో ఆయనను గురించిన ఐతిహ్యాలు చదివితే మనం ఆశ్చర్యపడకమానము. ప్రాచీన క్రైస్తవ మతాచార్యపరంపర ( Eccleciasticus) కు చెందిన వారు, మత గ్రంథాల రచయితలు మాత్రం అబ్రహామ్ యొక్క వైభవాన్ని ఆయన, ఇజ్రాయిల్ దేశపు పూర్వీకుడు (Ancestor of Isreal) గా, ధార్మిక జీవనానికి ప్రతీకగా సంభావిస్తారు. అబ్రహామ్‌కు సంబంధించిన వివిధ ఐతిహ్యాలు కథనాలన్నీ ధారావాహిక జానపద కథలనీ, అవన్నీ అంతర్జాతీయ ప్రక్షిప్తాలనీ, ఆధార భూమిక లేని వ్రాతలనీ ఆధునిక పాశ్చాత్య పండితులు త్రోసిపుచ్చారు.

ఈ చర్చల వల్ల తెలిసిందేమంటే, చట్టాలు మతాచార్యుల యుగానికి చెందినవా? లేక వారి పూర్వమేయుండినవా? అనేది నిశ్చయంగా తెలియడం లేదు. బైబిల్ పాత నిబంధన (Old Testament) యొక్క సాధారణధోరణి యెటువంటిదంటే, మతం (Religion) ప్రాతిపదిక, ప్రధానాంశంకాగా, చరిత్ర (History) దానికి ఆనుషంగికం, రెండవ పక్షమౌతున్నది. ప్రవక్తలచే స్వచ్ఛంగా నిర్దేశింపబడిన మతం ఎప్పుడూ పూర్వప్రవక్తల భావనలను గణికిపుచ్చుకొనివుంటుంది. అవి మానవ వికాసంలోని ఆరంభదశను సూచిస్తుంది. ఇజ్రాయిల్ లో మతవికాసం మానవుని బహిశ్శక్తులచే అదుపులో ఉంచబడినవి కావు. అందువల్లనే అప్రాకృత

దర్శనశక్తుల ప్రవేయమెక్కువగా కనబడుతుంది. ఇజ్రాయీయులు ఈనాటికి కూడ మానవభవితవ్యాన్ని గూర్చిన భావాలు ప్రకటిస్తూనే ఉన్నారు. మత ప్రవక్తల యుగమైన తర్వాత మత భవిష్యద్దార్శనికులైన మోసెస్ యుగం ప్రారంభమైంది.

సత్యదర్శన ప్రకటన (revelation) మనేది ప్రాథమికంగా అడిగిన ప్రశ్నకు యిచ్చిన సమాధానంలో జీవితాన్ని సమగ్రంగా దర్శించి అర్థాన్ని చెప్పడంలో ఉంటుంది. అందు చేతనే సత్యదర్శన ప్రకటన మనేది ప్రతి ఒక్క మానవునికి సంబంధించి కొద్దో గొప్పో ఉండి తీరుతుంది. ఎవరా ఉన్నతమైన సత్యదర్శన లోకంలో స్థిరంగా ఉండిపోగలరో వారినే ప్రవక్తలంటారు. వారి పేర్లు కూడ ఒక్కొక్కసారి ధ్వనిగర్భితంగా ఉంటాయి. ఆ అర్థం ప్రతీకాత్మకంగా వారి జీవిత పరమార్థాన్ని, ధ్యేయాన్ని వ్యాఖ్యానిస్తుంటాయి. ఉదాహరణకు మోసెస్ పేరే తీసుకొందాం. మహాభారతంలో కుంతి ఒక మందసంలో కర్ణుని ఉంచి గంగానదిలో వదలి పెట్టినట్లుగా, మోసెస్ తల్లి శిశువును కన్న తర్వాత మూడు నెలలు దాచిపెట్టి, ఆ మీద దాచిపెట్టలేక, ఒక వెదురు బుట్టలో బిడ్డను పెట్టి నైలునదీ ప్రవాహంలో వదలిపెట్టింది. ఒక రాజకుమార్తె చెలికత్తెలతో స్నానానికి వచ్చి ఆ బుట్టను తెప్పించి చూడగా అందులో ఒక హిబ్రూదేశీయుడైన శిశువున్నాడు. ఆమె ఆ బిడ్డను తన తల్లికిచ్చి పెంచి పెద్దచేయమని కోరుతూ, తాను బిడ్డను జలం నుండి బయటకు లాగడం వలన మోసెస్ (Moses) అనే నామకరణం చేస్తున్నానని చెప్పింది. మోసెస్ పెరిగి పెద్దవాడై సత్యదర్శన సిద్ధిపొంది, అజ్ఞానమనే సంసార ప్రవాహంలో కొట్టుకుపోతున్న ప్రజల్ని బయటకు లాగి, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందివ్వడమే జీవితధ్యేయంగా జీవించాడు. ఈజిప్టు నుండి ఇజ్రాయిల్ వరకు ప్రజలందరూ ఆయనను దర్శించి ధన్యజీవులయ్యారు.

జెరూసలేమ్ లోని అతి ప్రాచీన దేవాలయ విధ్వంసకాండ జరిగిన తర్వాత జ్యూమతస్థుల జీవితంలో ఒక మహత్తరమైన మార్పు సంభవించింది. దేవతారాధన సర్వం హఠాత్తుగా నిలిచిపోయింది. అగ్ని ఉపాసనలు, ఆరాధనలు అడుగంటాయి. కాని, దివ్యాజ్ఞను ఎవరూ ఉల్లంఘించలేరు. అది తాత్కాలికమైన నిలుపుదల మాత్రమే! ''మరల ప్రాచీనమైన ఆరాధనలు పునరుద్ధరింపబడే కాలం తప్పక వస్తుంది.'' ఈ నమ్మకం, ఈ విశ్వాసం జ్యూమతస్థుల ప్రార్థనల్లో మరల మరల చెప్పబడుతుంది. ఒక గాఢమైన విశ్వాసం గల జ్యూమతస్థుడు ఈ వాక్యార్థం గల పాత బైబిల్ వాక్యాలను రోజుకుమూడుసార్లు చెప్పాలనే కట్టడి కూడ చేయబడింది. జెరూసలేమ్‌లో దేవాలయ విధ్వంసం జరిగాక ఏర్పడిన గొప్ప పరిణామమేమంటే, అగ్ని ఉపాసనా ఆరాధనల స్థానంలో ప్రార్థన (Prayer) ప్రముఖస్థాన మాక్రమించింది. ఈ విధంగా ప్రార్థన ఒక్కటే, ఇజ్రాలియుల నిత్య జీవితంలో ఒక ముఖ్యభాగమై పోయింది.

ఇది అగ్ని ఆరాధనకు ప్రత్యామ్నాయంగా స్థాపింపబడింది. ఆ ప్రార్థన వైయక్తికమైనది కావచ్చు లేక సామూహికమైనది కావచ్చు. జ్యూమతానికి కొంచెం భిన్నమైన సమరిటన్స్ (Samaritans) లలో కూడ ప్రాచీన ఆరాధన విధానం పునరుద్ధరింపబడాలనే కోర్కెతో చేసే దైవప్రార్థనలే చివరికి మిగిలాయి.

**క్రైస్తవ మతం :** ప్రాచీన జ్యూమతస్థుల సంప్రదాయంలో సర్వజనులచే అంగీకరింపబడిన విషయమేమంటే, మెస్సయ్య (Messiah) అనే ఆపదుద్ధారకుడు జ్యూమతస్థుల దేశంలో అవతరిస్తాడని ఎదురుచూచేవారు. మాతూ్యా మరియు లూక్ వంశావళులను నిర్మించి, జీసస్ (Jesus), మెస్సయ్య అవతరిస్తాడనే ఆశాభావాన్ని పరిపూర్తిచేశాడని వ్రాశారు. దుఃఖనివారకుడు, ఆపదుద్ధారకుడైన జీసస్ ఒక పశువుల కొట్టంలో జ్యూమతస్థులైన జోసెఫ్ మరియు మేరీలకు జన్మించాడు. అప్పుడు ఇజ్రాయిల్‌ను హెరోడ్ (Herod) అనే రాజు పరిపాలిస్తుండే వాడు. తూర్పుదిక్కులోని కొందరు ఖగోళంలోని నక్షత్రగమనాన్ని అధ్యయనం చేసి వెంటనే జరూసలేమ్‌కు వచ్చి యిలా ప్రశ్నించారు. ''జ్యూమతస్థులకు రాజు కాబోయే ఆ అద్భుత శిశువెక్కడ! మేము నక్షత్రగమనాన్ని బట్టి తెలుసుకున్నాము. ఆ శిశువును ఆరాధించడానికి వచ్చాము.'' అని

నిజంగానే జీసస్ జనన కాలం దివ్యత్వస్ఫోరకమైనదే నని తూర్పు దేశాల మతగ్రంథాలన్నీ చెబుతున్నాయి. మేరీతో జోసఫ్ వివాహం నిశ్చయమైంది. కాని, వారిద్దరికీ వివాహం జరగక ముందే ఆమె గర్భవతి అని తెలిసింది. జోసెఫ్ ఈ ఒప్పందాన్ని రద్దు చేసుకోవాలి అనుకుంటూవుండగా ప్రభువు దగ్గరనుండి ఒక దూత స్వప్నంలో ప్రత్యక్షమై యిలా చెప్పింది ''డేవిడ్ వంశీకుడా! జోసెఫ్! మేరీని వివాహమాడడంలో నీవెంత మాత్రం సంకోచింపవలసిన అవసరం లేదు. ఒక పవిత్రాత్మచే ఆమె గర్భవతియైనది. ఆమె ఒక పురుషశిశువుకు జన్మనిస్తుంది. ఆ బిడ్డకు నీవు జీసస్ అని నామకరణం చేయి. అతడు సార్థకనామధేయుడై తన ప్రజలను పాపాల నుండి విముక్తులను చేసే రక్షకుడౌతాడు.'' జోసఫ్ ఆ విధంగానే చేశాడు. మేరీ ఒక మగ బిడ్డను ప్రసవించింది. మానవజాతిని పాపవిముక్తులుగా చేసి మోక్షమునుగ్రహించడానికి జీసస్‌క్రైస్ట్ ప్రభువు జన్మించాడు. జీసస్ తన పన్నెండవయేట నుండే భగవంతుడు తన తండ్రియని, భగవంతుని గృహమే తన నిజమైన క్రియాశీల కార్యరంగమని గుర్తించాడు.

సంప్రదాయజ్ఞుల విశ్వాసానుసారం మతగ్రంథాలు సైతం ఒక విషయం చెబుతున్నాయి. జీసస్ తండ్రియైన జాన్, భగవద్దత్తమైన శిశువుకు జ్ఞానస్నానం ( Baptism) చేయించినాడు. అలా చేయవచ్చా? ఇది అర్థరహితం కదా? అని ప్రశ్నిస్తున్నారు కొందరు. భగవంతుని కుమారుడు

పాపరహితుడైనప్పుడు ఆ బాలుడెలా జ్ఞానస్నానానికి అంగీకరించాడు? అతడు ఏ పాపాలను పోగొట్టుకోగలడు? ఇక్కడ జ్ఞానస్నాన మనేది పాపప్రక్షాళనకే ఉద్దేశింపబడిందిగా గ్రహించక జోరాష్ట్రియన్ మతస్థులలో నవజోత్ సంస్కారం వలె, వైదిక ఆర్యులలో ఎనిమిది సంవత్సరాల బాలురకు చేసే ఉపనయన సంస్కారం వలె గ్రహించాలి. మానవుడుగా పుట్టిన ప్రతివాడు ఈ సంస్కారం చేసుకోవడం తప్పనిసరి. ఎందుకంటే, దీనిచేత అంతశ్శక్తులు పటిష్ఠంగా సమీకరింపబడి బాహ్యమైన ప్రలోభాలకు మనస్సు లొంగిపోకుండా మానసికస్థైర్యం బాలునికి ఏర్పడుతుంది. దీనిచే సన్మార్గంలో బాలుని జీవితంనడుస్తుంది. అవతార పురుషులు, మత ప్రవక్తలు సైతం ఈ సంస్కారాలకు ఎందుకు తలవొగ్గారంటే ఆ సంస్కారాలను ప్రజలందరు తప్పక అనుసరించాలని ''**మహాజనోయేన గతస్స పంథాః**'' అన్నట్లు శ్రీకృష్ణుడు కూడ సాందీపని వద్ద గురుకులవాసం చేశాడు. ఆ మహాపురుషులకు తొలగించుకోవలసిన పాపాలేవీ లేక పోయినా మానవజీవిత విధానాలను ఉల్లంఘించరాదని వాటిని తు.చ. తప్పక అనుసరించారు.

కొంతకాలం ఒంటరిగా జీవితాన్ని గడిపిన తర్వాత జీసస్ తన అవతార లక్ష్యాన్ని ప్రదర్శించడం ప్రారంభించాడు. ప్రజల దుఃఖాలను మాన్పిన ఆయన వెంట తండోపతండాలుగా జనసమూహం దేవాలయంలో ప్రవేశించసాగారు. దేవాలయంపై గుత్తాధికారం గల ఫరిసీలు (Pharisees) జీసస్ ఖ్యాతిని చూచి ఓర్వలేక పోయారు. ఏదో ఒక విధంగా అతణ్ణి దోషిగా నిలబెట్టాలని ప్రయత్నించారు. ఫరిసీలు ఒక రోజు జీసస్ నిలా ప్రశ్నించారు. ''రోమన్ చక్రవర్తికి మనం పన్నులు కట్టడం, మన మతం యొక్క చట్టానికి విరుద్ధమా కాదా?'' అని ఈ ప్రశ్నలోని అంతరార్థాన్ని గ్రహించిన జీసస్ – ''చక్రవర్తికి చెందవలసిన పన్నును ఆయనకు చెల్లించండి. దేవునికి చెందవలసిన దాన్ని దేవునికివ్వండి'' అన్నాడు. జీసస్ తెలివిగా తప్పించుకున్నాడని గ్రహించిన ఫరిసీలు మరో ప్రశ్న వేశారు – ''ఎప్పుడు భగవంతుని రాజ్యం వస్తుంది'' అని. ఇది కూడ చాల చిక్కు ప్రశ్న! ''ఈ రాజు భార్య పతివ్రత. కాదని నిరూపించు'' అన్నట్లుంది. దీనికి జీసస్ యిలా చెప్పాడు. ''మన అందరి కంటికి కనపడే విధంగా భగవంతుని రాజ్యం నేల మీదికి దిగిరాదు. ప్రతివాడూ ఇదిగో యిక్కడ భగవంతుని రాజ్యముంది, అన్నట్లుగా అది బయట ఏర్పడేది కాదు. ఎందుకంటే భగవంతుని రాజ్యం మనందరి హృదయాలలోనే ఉంది.'' అని రెండువైపుల పదునున్న కత్తిలాంటి ప్రశ్నకు చక్కని సమాధానం చెప్పాడు. ''నేనీ ప్రపంచానికి వెలుగు మార్గం చూపడానికి వచ్చాను. ఎవరు నన్ను అనుసరిస్తారో వారిని వెలుగు బాట వెంట తీసుకెళ్లుతాను. ఆ తర్వాత వారెప్పుడూ చీకటి దారిలో నడవరు.'' అన్నాడు.

కాని, ఫరిసీలు ఏదోసాకుపెట్టి జీసెస్ అనుయాయులను బందీ చేశారు. జీసస్‌ను జ్యూమతస్థుల ఉన్నత న్యాయస్థానం ముందు దోషిగా నిలబెట్టారు. ''ఇతడు దేవాలయం ధ్వంసం చేస్తానని బెదిరించాడని'' జీసస్‌పై అభియోగం మోపారు. న్యాయస్థానం రాజుకు అధీనమైనది కాబట్టి, పిలాలీ (Pilaali) అనే జుడాసా ప్రధానప్రాడ్వివాకుడు, తన న్యాయనిర్ణయాన్ని వినిపించాడు. ''జీసస్‌ను శిలువ (Crucification) వేయాలి ఎందుకంటే అతడు విచక్షణ జ్ఞానం లేని ప్రజలగుంపు కోరిన కోర్కెను తృప్తిపరచాలని నిర్ణయిం తీసుకున్నాడు గనుక.'' అని తీర్మానించాడు. శిలువపై కెక్కిన జీసెస్ చెప్పిన చివరిమాటలివి. ''తండ్రీ! వీరిని క్షమించు! వీరేమిచేస్తున్నారో వీరికి తెలియదు.''

శిలువ వేయడానికి రెండు రోజుల ముందు జీసెస్ తన చిట్టచివరి ప్రార్థన ముగించుకొని దేవాలయం వెలుపలికి వచ్చి పూజారులతో – ''ఇక మీ దేవాలయం పరిత్యజింప బడింది. శూన్య దేవాలయమే మీకు మిగిలింది'' అన్నాడు. దేవాలయంలోపలి పరదాను ఏవో అదృశ్యహస్తాలు తెంపిపారేసింది. అగ్నివేదిక నుండి పెద్ద మంట హఠాత్తుగా పైకి లేచింది. జీసెస్ '' ఇది పూర్తయింది'' అన్నాడు.

దీని వలన మోసెస్ చే నిర్మించబడిన దేవాలయం, అగ్ని ఉపాసన అంతటితో పరిసమాప్తమైంది. కేవలం ప్రార్థనామందిరాలైన 'చర్చి' మాత్రమే మిగిలింది. మోసెస్‌కు దేవుని ఆజ్ఞ ఏమంటే పర్వతంపై దర్శించిన ప్రణాళికానుసారం దేవాలయార్చనను పరిరక్షించమని చెప్పగా, అది జీసస్‌ను శిలువ వేయడంతో అంతమైంది. జాన్ కూడా దేవుని గుడిలో సింహాసనం ముందు ఏడు కాగడాలు వెలగడం దర్శించాడు. ఇవే కొవ్వువత్తుల దీపపు సమ్మెగా తర్వాతి కాలంలో ఏర్పడింది. సుధూపాగ్ని హోమం ఏర్పడింది. డెబ్బై సంవత్సరాలు భూలోక దేవాలయంగా ఉన్న సుందర నిర్మాణం రోమన్ల దండయాత్రచే పాడుపడింది. ఇప్పుడు జీసెస్‌ను శిలువ వేయడంతో దేవాలయమే శూన్యమై అగ్ని ఉపాసన అంతరించింది. ఈ విధంగా నిజమైన మత విశ్వాసాలు పూర్తిగా అడుగంటి పోయాయి.

ఇద్దరు దేవతలు ఆకాశంలో సంభాషిస్తున్నారు. ఒక దేవత అడిగింది – ''ఎంత కాలానికీ భయంకరమైన పాపం నశించి, తిరిగి నిత్యాగ్నిహోత్రం ప్రతిష్ఠితమౌతుంది'' అని దానికి మరో దేవత **1,150** రోజులిలాగే వుంటుంది. అంత వరకు ఉదయాస్తమాన అగ్నిహోత్రాలు వెలుగవు. ఆ తర్వాత దేవాలయం పునరుద్ధరింపబడుతుందని చెప్పింది.

మరోచోట, **2300** రోజులని చెప్పబడింది. బైబిల్ పాత, కొత్త నిబంధనలను జాగ్రత్తగా పరిశీలిస్తే, అగ్నిహోత్రారాధనకు మూలం చరిత్రకందని పూర్వకాల గర్భంలో నిక్షిప్తమై వుంది.

ఇది ఒక అతిసామాన్యమైన ప్రక్రియ. ఈ మార్గమొక్కటే, ప్రత్యామ్నాయం లేని ఈ ఒక్క మార్గంలోనే ఎటువంటి వాడైనా భగవంతుని సమీపించాలి! అగ్నిహోత్రారాధన భగవంతునికి చేసే ప్రక్రియాత్మకమైన ప్రార్థన! అది కేవలం మాటలతో విన్నవించుకోవడం కాదు. ఈనాడు ప్రాచీన మానవుని ఈ మత భావన ధ్వస్తమై పోవడమే కాదు, అతని యాజ్ఞికభావన సైతం పూర్తిగా విధ్వంసమై పోయింది.

క్రీ.పూ. 3000 సంవత్సర ప్రాంతాలలో బాబిలోనియాలో వందల కొలది యజ్ఞవాటికలుండేవి. ఎరిడు, నిప్పూర్, అగడే, ఇరేఖ్, ఉర్, నిల్సన్, లార్సా, సిప్పర్ వంటి యజ్ఞ వాటికల్లో సుదీర్ఘమైన విస్తృత విధానంలో యజ్ఞాలు జరిగేవి. ఇది వైదిక వాఙ్మయంలోని బ్రాహ్మణ గ్రంథాల ప్రక్రియను పోలివుండేవి. గుడియా (Gudea) అనే రాజు నిర్వహించిన వివిధ రకాల యజ్ఞాలపట్టికను బట్టి ఇతడు విశ్వామిత్రుని తండ్రియైన గాధిరాజుగా గుర్తింపబడినాడు. గుడియారాజు నిర్వహించిన యజ్ఞ వివరాలు రాతి శాసనాలలో తామ్ర ఫలకాలలో, సాహిత్యంలో లభ్యమౌతూవుంది. గ్రీకు దేశంలోని 'వాటికన్' కూడ ఒకప్పుడు 'యజ్ఞవాటిక' అయివుంటుంది. 'యజ్ఞవాటిక' అనే పేరుతో, యజ్ఞాలు నశించిపోయాక పూర్వభాగం లుప్తమై పోయి 'వాటిక' మాత్రమే మిగిలి 'వాటికన్' అనే పేరు స్థిరమైందని నేను భావిస్తున్నాను. త్రికరణశుద్ధితో కూడిన సంపూర్ణ విశ్వాసమే భగవంతునికి సమ్మతమైన యజ్ఞం చేయడానికి యోగ్యతను కల్పిస్తూవుంది. బైబిల్‌లో చెప్పబడిన 2300 రోజుల తర్వాత దేవాలయార్చన పునరుద్ధరింపబడుతుందన్న సంవత్సరం క్రీ.శ. 1844 అని డా॥ షూలర్ తన The Great Judgement Day, in the light of Sanctuary Service అనే గ్రంథంలో వ్రాశారు. అప్పటి నుండి దేవాలయం పరిశుద్ధి, సంప్రోక్షణ మొదలైంది. ''సెవన్త్‌డే అడ్వెంటిస్ట్‌లు'' కూడ ఈ సంవత్సరాన్నే అంగీకరిస్తున్నారు. ఈజిప్టులో పాపిరస్ (Papyrus) పై వ్రాయబడిన కొత్త నిబంధన వ్రాతప్రతులు లభించాయి. అవి యాజ్ఞిక ప్రక్రియా గ్రంథాలు కాక పోయినా, వాటిని ప్రామాణికంగా గ్రహించారు. అందులో, **''ఎవడు నాకు సమీపస్థుడో వాడు అగ్నికి సమీపంలో ఉన్నవాడు. ఎవడు నాకు దూరస్థుడో వాడు నా సామ్రాజ్యానికి దూరంగా ఉన్నవాడు.''** అనే వాక్యం క్రైస్తవ మతంలో యజ్ఞానికి ప్రాధాన్యాన్ని, అగ్నిహోత్రారాధనకు స్థాపిస్తోంది!

**ఇస్లాం లేక ముస్లిం మతం :** క్రైస్తవ మతం తర్వాత అరేబియా దేశంలో ఇస్లాం మతాన్ని స్థాపించిన వాడు పవిత్ర మహమ్మదు ప్రవక్త. మహమ్మదు ఖ్యురైష్ (Quraish) కుటుంబానికి చెందిన వాడు. అతడొక బోధకుడు (Preacher) గా తన జీవితాన్ని ప్రారంభించాడు.ఆయన సత్యదర్శనాలే (revelation) మత గ్రంథమైన కురాన్ (Quran) గా ప్రసిద్ధికెక్కింది.

ముస్లిం మతంలోని ప్రాథమిక సూత్రమేమంటే, ఈ మతంలోనివాడు ప్రవక్తలనందరినీ విశ్వసించాలి. మహమ్మదు ప్రవక్తకు ముందున్న వారిని సైతం విశ్వాసంతో స్వీకరించాలి. కురాన్ లోని ఈ వాక్యం ఈ భావాన్ని బలపరుస్తూవుంది. '' ఓ ముస్లిములారా! మనము అల్లాను నమ్ముతాము. సత్యాన్ని దర్శించిన అబ్రహామ్, ఇష్మాయిల్, ఐజక్, జాకబ్ మరి యితర తెగల వారు, మోసెస్, మరియు జీసెస్ దర్శించిన సత్యాలను, యితర ప్రవక్తలు ప్రభువు నుండి గ్రహించిన సత్యదర్శనాలను విశ్వసిస్తాము. మనము వీరిలో తారతమ్య పరిశీలన చేయము ఎందుకంటే మనం ఆ భగవంతుని శరణు పొందిన వారము.''

మదీనాలో ఒక కొత్తమతం ఆవిర్భవించింది. మహమ్మదు ప్రవక్త తన మతాన్ని ప్రచారం చేస్తుండగా మరో రెండు మతాలు కూడ ఆ కాలంలో బాగా ప్రచారంలో ఉండేవి. అవి జూడాయిజమ్, క్రైస్తవ మతాలు. మహమ్మదు ఈ రెండు మతాల మూలాల వరకు వెళ్లి పరిశీలించిన వాడు. ఇతడు అబ్రహామ్‌ను హనీఫ్ (Hanif) అని పిలిచాడు. హనీఫ్ అంటే గొప్ప నిజాయితీపరుడు, పవిత్రుడని అర్థం! అబ్రహామ్ ఏక దేవతావాదానికి తండ్రి వంటి వాడు (Father of Monotheism) అన్నాడు మహమ్మదు ప్రవక్త. కురాన్‌లో అబ్రహామ్ గురించిన గొప్ప ప్రశంసా వాక్యాలు ఎన్నో కనబడుతాయి.

''ఓ ముస్లిములారా! నా ప్రభువు నాకు మార్గదర్శకుడుగా నన్ను చక్కని ఋజువైన దారిలో నడిపించాడు. ఇదే నిజమైన మతం. ఈ విశ్వాసం (మిల్లత్) నిజాయితీపరుడైన (హనీఫ్) అబ్రహామ్‌ది''

ఈ వాక్యాలను బట్టి అబ్రహామ్ దేనినైతే సత్యంగా దర్శించాడో దానినే మహమ్మదు ప్రవక్త కూడా దర్శించాడు. దీని చేత మత ప్రవక్తల దర్శనాలు సంవదించి విశ్వజనీనమౌతాయని తెలుస్తున్నది. **''సంవాదోఽపి భవంత్యేవ బాహుల్యేన సుమేధసామ్''** అని ధ్వన్యాలోకంలో ఆనందవర్ధనుని వాక్యం! మహామేధావుల భావనా ప్రపంచంలో గొప్ప విషయాలు సంవదించడమనేది తప్పక ఉండి తీరుతుంది.

కురాన్ భగవంతుని యొక్క వాక్యం. అది శాశ్వతం, ఆద్యంతరహితం, విలక్షణం, దానికి ప్రత్యామ్నాయం మరొకటి లేదు. ఎవరు జ్ఞానము చేత, జీవశక్తి చేత, ఆత్మ విశ్వాసం చేత జీవిస్తున్నారో వారు దీన్ని అవగతం చేసుకొని ఉచ్చరించగలరు. దేవతలచేత ప్రవక్తలకు యివ్వబడిన సందేశమే ప్రపంచానికి మార్గదర్శకం. కాబట్టి, పవిత్ర కురాన్ లోకానికి వెల్లడి కాకముందే శాశ్వతంగా ముందే జీవించివున్నది.

దివ్యజ్ఞానమనే వెలుగునుండి పుట్టిన వారే దేవతలు. వీరు దేవుని ఆస్థానంలో విహరించేవారు. వారు పాపరహితులు. సత్యదర్శనానికి ప్రేరకుడైన వాడు గాబ్రియల్ (Gabriel). ఇతడే కురానును స్వర్గలోకం నుండి అవతరింపజేశాడు. అతడు మహమ్మదు ప్రవక్త యింటిలో ఆయన అనుమతి లేక ప్రవేశింపరాదని బయట అరుగు మీద ఒక సేవకుని వలె కూర్చున్నాడు. అబ్రహామ్ వద్దకు ప్రజలు తమకు భగవద్దర్శనం చేయించమని వచ్చారు. ఆయన వారిని మోసెస్ వద్దకు పంపాడు. మోసెస్ వారిని జీసెస్ వద్దకు పంపాడు. జీసెస్ వారికి మహమ్మద్ దగ్గరకు పంపాడు. మహమ్మదు వారికి ప్రార్థన యొక్క గొప్పతనాన్ని తెలియజేశాడు.

ముస్లిం మతంలోని ప్రాథమిక విధులు ఐదు. 1) ప్రార్థన (Prayer), 2) దానం (Charity), 3) ఉపవాసం (Fasting), 4) తీర్థయాత్ర (Pilgrimage), 5) మత విస్తరణకై యుద్ధం (Jihad). ముస్లిములు మెక్కా, మదీనాలకు తీర్థయాత్రలకు వెళుతారు. ముముక్షులైన వారి తీర్థయాత్రకే 'హజ్' అని పేరు. వైదిక యజ్ఞంలో త్యాగభావన (Sacrifice), నిర్లిప్తత(Non - attachment) ప్రముఖలక్షణాలైనట్లే మహమ్మదీయులలో కూడ మతపరమైన త్యాగానికి 'కుర్బానీ' అంటారు. **ముస్లిం మతంలోని 'నమాజ్' అనే పేరుతో ప్రార్థన చేసే భావన 'నమస్' శబ్దము నుండి పుట్టినదని చెప్పవచ్చు.** వైదిక భావనలో అంతఃకరణ చతుష్టయమున్నది. మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తము నాల్గు కలసినదే అంతఃకరణము. మనస్సు సంకల్ప వికల్పాలతో కూడుకొన్నది. లోకానికి నిత్యసన్నిహితమైనది. ఒక విధంగా చూస్తే లోక స్వరూపమే మనస్సు! మనోనాశనం చేస్తేనే ఏకాగ్రత కుదురుతుంది. ఎలా? భగవంతుడెక్కడో లేడు. మన మనస్సులోనే ఉన్నాడు. ఉన్నప్పటికీ కనబడడం లేదు. ఎందు వలన? మనస్సు పరిశుద్ధంగా లేదుకాబట్టి. అది నిర్మలంగా ఉంటే మన మనస్సు లోనే భగవంతుని దర్శించవచ్చు. నిర్మలంగా ఉండాలంటే మనస్సును భగవద్భావనకు అనుకూలంగా చేసుకోవాలి. మనస్సు బహిర్ముఖం కావడమే మనోమలం. అంతర్ముఖం కావడం నైర్మల్యం. బహిర్ముఖమైనప్పుడే దానికి **'మనస్సు'** అని పేరు. అంతర్ముఖమైనప్పుడు మనస్సు అనే శబ్దం తిరగవేసి 'నమస్సు' అవుతుంది. **'నమస్సు'** అంటే నమస్కారము! వినయపూర్వక ప్రార్థన! అందుకే **''సత్వేచయే భగవాన్వాసుదేవో హ్యధోక్షజో 'నమసా' విధీయతే అని వ్యాస భాగవతం చెప్పినది. అటువంటి ఈ 'నమస్' శబ్దమే ముస్లిం మతంలో ప్రార్థన అనే అర్థంలో 'నమాజ్' అయినదని నా అభిప్రాయం!**

శ్రీవైష్ణవంలోని పాంచరాత్రాగమాలలో పాద్మసంహిత (13వ అధ్యాయం) శ్రీ ప్రశ్నసంహిత (17వ అధ్యాయం) ల ననుసరించి 'పంచకాలవిధి' యిలా చెప్పబడింది. 1) అభిగమనము (మనోవాక్కాయ కర్మములచే జపధ్యానార్చనల ద్వారా భగవంతుని కభిముఖుడగుట), 2) ఉపాదానము (పూజానిమిత్తము ఫల పుష్పాదులను సంగ్రహించుట),

3) ఇజ్యాపూజ (విష్ణుమూర్తిని పూజించుట) 4) స్వాధ్యాయము (పూజానంతరం ఆగమగ్రంథ పఠనం), 5) యోగము (సాయంకాలంలో యోగానుష్ఠానము) ఈ విధంగా రోజుకైదు వేళల్లో శ్రీ విష్ణుదేవుని ఆరాధించే వైష్ణవునికి పంచకాలపరాయణుడు, పంచకాలజ్ఞుడు అని పేరు.

ముస్లిం మతంలో గాఢమైన శ్రద్ధగల వారు ఐదు వేళల్లో 'నమాజ్' చేయాలి! ఇది వైష్ణవుల పంచకాలపరాయణత్వంతో పోలికవహిస్తూవుంది. వైదికమైన హిందూమతం చాలా వరకు సగుణోపాసనకు దారితీయగా క్రైస్తవ, మహమ్మదీయ మతాలు నిర్గుణోపాసనకు ఎక్కువ ప్రాధాన్యం యివ్వడం గమనింపదగింది. ప్రపంచంలోని మతాలన్నీ అగ్నిని, సూర్యుని ఆరాధిస్తే, మహమ్మదీయులు అగ్నిని, చంద్రుని ఆరాధిస్తారు. ఇది వైదికమైన భావనకు విరుద్ధం కాదు. సూర్యుని గుండా జీవుడు పోయే మార్గం దేవయానం, అర్చిరాది మార్గం! చంద్రుని గుండా జీవుడు వెళ్లేమార్గం పితృయానం, ధూమ్రమార్గం!.

**హిందూమతం :** ప్రపంచంలో ప్రతి మతానికి ఒక మత ప్రవక్త ఉన్నాడు. కాని, హిందూ మతానికి స్థాపకుడని చెప్పే మత ప్రవక్త ఒక్కడు లేడు. తొలి ఇరానియన్లు సింధూ నదీ పరీవాహక ప్రాంతాలను జయించి, వారి భాషా ఉచ్చారణననుసరించి 'సింధు' శబ్దాన్ని 'హిందు'గా ఉచ్చరించారు. ఈ తప్పుడు ఉచ్చారణయే హిందువులు, హిందూయిజం, ఇండస్ నది పేరు మీదుగా ఇండస్, ఇండియా, ఇండియన్స్ అనే పేర్లకు దారి తీసినది. గౌతమ బుద్ధుని కాలంలో (క్రీ.పూ. 6వ శతాబ్దం) హిందూ శబ్దం వాడడం జరుగలేదు. ఆర్యులనే పిలువడం జరిగింది. పై సామ్యం చేతనే అమెరికాలోని ఆదివాసులను రెడ్ 'ఇండియన్స్' అని పిలువడం జరిగింది. సంస్కృత వాఙ్మయంలో ముస్లిం మతస్థుల రాజ్యపరిపాలన కాలం నుండే ఇక్కడి వారిని హిందువులని ప్రత్యేకత కోసం పిలువడం ప్రారంభమైంది.

అహింసావాద మతాలైన జైన, బౌద్ధ బాగా అభివృద్ధి చెందిన తర్వాత, వైదిక మతంలో కూడా అహింసా సిద్ధాంతం ఆది నుండి అమలులో ఉందని చెప్పడానికి, ఆంగ్లేయుల కాలంలో కొందరు పండితులు 'హిందూ' అనే కొత్త పేరుకు వ్యుత్పత్తిని కూడ కల్పించారు. ''**హింసయా దూయతే ఇతి హిందుః**'' ప్రాణి హింసకు పరితపించే వాడు హిందువని దీని కర్థం. పాశ్చాత్యుల మత విమర్శ, పరిపాలనా విధానానికి సమాధానంగ ఈ కొత్త వ్యుత్పత్తి ఏర్పడిందని చెప్పవచ్చు. ఈ నూతనార్థ కల్పనతో 'హిందూ' అనే పేరు ఆంగ్లేయుల పాలనకాలంలో, క్రైస్తవ, ముస్లిం మతాలకు వేరైనదనే అర్థంలో బాగా స్థిరపడిపోయింది. ''హిందూ, ముస్లిం భాయీ భాయీ'' అనే నినాదాలు ఏర్పడ్డాయి. హిందూయిజమ్ ఒక మతం కాదని ఒక జీవనమార్గమని (Hinduism is a way of Life) అన్నారు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్!

మరి కొందరి దృష్టిలో హిందూమతం ఏకైక మతం కాదు. బహుమతాల సమాహారస్వరూపం. వివిధ విశ్వాసాల సమాఖ్య! వివిధ తత్త్వాల కూడలి! వివిధ జాతుల వేదిక! వివిధ పుష్పాలతో నిర్మించిన పూలగుత్తి!

రామాయణ, భారత, భాగవతాలు ప్రజలందరి మనోభావనలను ప్రతిబింబిస్తున్నాయి. పురాణాలు, ఇతిహాసాలు వేదాలకు విస్తృత రూపమైన వ్యాఖ్యానం చేస్తున్నాయి. వీటినే **ఉపబృంహణం** అంటారు. నేటి హిందూమతం పౌరాణిక హిందూమతంగా చాలామంది చెబుతారు. పురాణాలలో చెప్పబడిన భావాలను ప్రతిబింబించే మతం నేటి హిందూమతమని అర్థం. ఆచార్య పురుషులు, సాధువులు, యోగులు, మహాపురుషులు, వాగ్గేయకారులు, కళాకారులు, కవులు, యావద్భారత దేశంలో సాంస్కృతిక ఏకత్వాన్ని సాధించారు.

ఎవరెంత చేసినా యాజ్ఞిక భావన తొలినాటి వైభవాన్ని సంతరించుకోలేక పోయింది. దేవాలయాలలో సగుణ, సమూర్తమైన అర్చ విగ్రహారాధనకు దారి తీసింది. ఉదయాస్తమాన కాలాల్లో అగ్నిహోత్రారాధన గృహాలలో లుప్తమై పోయి శ్రౌతమహాయజ్ఞాలు దేవాలయాలు నిర్వహించడం ప్రారంభించాయి. గృహస్థులలో పంచమహాయజ్ఞాలలో ఏ ఒకటో రెండో పాటింప బడుతున్నాయి. వైయక్తికమైన అర్చన కంటే దేవాలయసామూహికార్చనకు ప్రాధాన్యం వచ్చింది. యాజ్ఞిక ప్రక్రియ సమాజంలో క్రమంగా అంతరించి పోయింది. వాటికర్థాలు అందుబాటులో లేకుండా పోయాయి.

శ్రీకృష్ణుడు జీవించియుండిన ద్వాపరయుగంలోనే సోమయాజులు కొందరు యజ్ఞభావనావిహీనులై భౌతిక దృష్టితో యజ్ఞం చేయడం భాగవతం దశమస్కంధంలో చెప్పబడింది. సోమిదమ్మలు పత్నీశాలలో ఆకలిగొన్న గోపాలురకు అన్నం పెట్టి పునరావృత్తి లేని మోక్షాన్ని పొందితే సోమయాజులకు స్వర్గం కూడ లభించ లేదు. అందుకే భగవద్గీతలో కృష్ణుడు –

**ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే ।**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చయతయ స్సంశితవ్రతాః॥**

కొందరు ద్రవ్యమయ యజ్ఞాలను, కొందరు తపోయజ్ఞాలను, కొందరు యోగయజ్ఞాలను, కొందరు స్వాధ్యాయ యజ్ఞాలను మరికొందరు జ్ఞానయజ్ఞాలను చేస్తారు.

**ఏవం బహువిధాయజ్ఞా వితతా బ్రహ్మణోముఖే ।**
**కర్మజాన్విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వావిమోక్ష్యసే ॥**

ఇట్లు పలు రకముల యజ్ఞములు బ్రహ్మచే వేదములందే ప్రతిపాదింపబడియున్నవి. ఇవన్నియు కర్మమయములే. దీనిని తెలుసుకోవడం వలన కర్మవిముక్తుడౌతావు.

**శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే ।**

అర్జునా! ద్రవ్యమయ యజ్ఞముల కంటే జ్ఞానయజ్ఞం ప్రశస్తమైంది. ఎందుకంటే అన్ని కర్మలు చివరికి జ్ఞానమందే పరిసమాప్తి పొందుతున్నాయి. అని గీతలో జ్ఞానయోగమనే నాల్గవ అధ్యాయంలో **28,32,33** శ్లోకాలు చెబుతున్నాయి.

మానవస్వభావం సర్వేసర్వత్ర ఒకే విధంగా ఉండడం చేత ప్రపంచవ్యాప్తంగా కాలక్రమేణ ధార్మిక జీవనంలో శైథిల్యం, దిగజారిన నైతికవిలువలు, నిబద్ధత- సమగ్రతారాహిత్యాలు చోటుచేసికొంటున్నాయి. దీనిచే మనిషి తన కనీసపు మర్యాదను కూడ కోల్పోయి బోలుమనిషి (Shallow Man) గా తయారయ్యాడు. దీనికి భారతదేశం ఏ మాత్రం అపవాదం కాదు. ఆధ్యాత్మిక జీవన దృక్పథం క్రమంగా నశించి, భౌతిక సుఖమయజీవితానికి ప్రాధాన్యం ఏర్పడడం, ఈ నాటి భారతీయసమాజాన్ని పట్టిపీడిస్తున్న ప్రధానరుగ్మత! చతుర్విధ పురుషార్థాలలో కేవలం భౌతికమైన అర్థకామాలకే అంతులేని ఆధిక్యతనిచ్చి, ధర్మసహితమైన అర్థకామాలకు తిలోదకాలివ్వడమే సమకాలీన సామాజిక సమస్యలకు మూలకారణం! మోక్షం మాట దేవుడెరుగు!

**సిక్కుమతం :** సిక్కుమతం భారతదేశంలో **500** సంవత్సరాల క్రితం ఆవిర్భవించింది. మతపరంగా దీనికొక ప్రత్యేక గుర్తింపు ఏర్పడినప్పటికీ, ఆనాటి దేశకాలీన పరిస్థితుల దృష్ట్యా ఈ మతస్థులొక యుద్ధ సైనికుల సమాఖ్య వలె ఏర్పడ్డారు. ఔరంగజేబు సిక్కుల మత గురువైన తేజ్ బహదూర్‌ను ఉరితీయడమే దీనికి ప్రధానహేతువు.

గురునానక్ దేవ్ సిక్కుమత స్థాపకుడు. నానక్‌ను హిందూ, ముస్లిములు సమానంగా గౌరవించేవారు. ఆయన ఈ రెండు మతాల మధ్య ఘర్షణను నివారించి, ఒకే సమన్వయ వేదికపై వచ్చేటట్లు చేయడానికి కృషిచేశాడు. మొట్టమొదట భగవంతునిపై భక్తి ప్రేమలను గూర్చి ప్రబోధించిన మతం, వీరోచిత మతంగా మారడం ఒక చారిత్రక పరిణామమే!

ఇస్లాంమతస్థులు చేతిలో కత్తిపట్టుకోవడంలో తాముదురాక్రమణ చేయకుండా, తమపై దురాక్రమణ చేసే వారిపై అల్లా ఆజ్ఞానుసారం 'జిహాద్' అనే మతయుద్ధాన్ని ప్రకటించి మత విస్తరణమే ధ్యేయంగా పోరాడాలి. కాని, ఎప్పటినుండో ఇది వ్యతిరేకధోరణిలోనే నడుస్తున్నది.

సిక్కులు తమ మతవిశ్వాస పరిరక్షణ కోసం వీరోచితమైన జీవితాన్ని అవలంబించారు. గురునానక్‌ను అనుసరించే సిక్కుమతస్థులంతా ఐదు చిహ్నాలను తప్పనిసరిగా ధరిస్తారు. అవి - 1) సుదీర్ఘ కేశములు (కేశ్), 2) పొట్టినిక్కర్లు (కచ్ఛ్) 3) ఇనుపకంకణం (కంగన్), 4) ఖడ్గము (కృపాణ్) 5) దువ్వెన (కంఘా)

గురునానక్‌కు చిన్నవయస్సులో ఉపనయనం చేయగా, ఆయన పురోహితునితో యజ్ఞోపవీతాని కుండే అంతరార్థాన్ని తెలుపమని వేసిన ప్రశ్న అందరిని ఆశ్చర్య చకితులను చేసింది. చివరికి, నానక్ దానికి సమాధానం యిలా చెప్పారు. కరుణ అనే పత్తిన వడికి, ప్రేమ అనే దారాన్ని తీసి, సత్యము, అహింసలనే ముడులను వేసి, ఏకాగ్రమైన మనస్సును దానిపై ఉంచితే ఆ యజ్ఞోపవీతం తెగదు, చివికిపోదు, కాలదు, పోగొట్టబడదు. అటువంటి గుణాలు గల యజ్ఞోపవీతాన్ని ధరించిన వారిని నేను ప్రశంసిస్తాను'' అంటాడు.

సిక్కులు తమ మత గ్రంథాన్ని 'ఆదిగ్రంథ్' అని పిలుస్తారు. ఆధ్యాత్మిక గురువు ఒక్కడే ప్రజలను చీకటి అనే అజ్ఞానం నుండి జ్ఞానమనే వెలుగులోనికి తీసుకురాగలడు. సిక్కులు ఏకదేవతావాదులు. గ్రంథసాహెబ్ విగ్రహారాధనను వ్యతిరేకించినప్పటికీ సిక్కులు ఆ గ్రంథాన్ని పరమపవిత్రంగా పూజిస్తారు.

గురునానక్ బోధనలు మతసామరస్యానికి ప్రతీకలు. మానవులందరూ ఒక్కటే. హిందువులు, టర్కీలు వేర్వేరు ప్రాంతాల వారైనా వారిలో భిన్నత్వం చూడరాదు. అలాగే పురాణమైన, కురాను అయినా ఒక్కటే! మందిరమైనా, మసీదు అయినా ఒక్కటే! అన్నాడు నానక్.

గురుగోవిందసింగ్ సిక్కుమతంలో ధ్యానము, అగ్నిహోత్రారాధనలను ప్రవేశ పెట్టించినాడు. ఇది చెప్పుకోదగిన మంచి పరిణామం!

## దివ్యజ్ఞానం - సర్వమానవ సౌభ్రాతృత్వం

బైబిల్‌లోని యిద్దరు దేవతల సంభాషణలో దేవాలయంలో అగ్నిహోత్రరాధన, 2300 రోజుల తర్వాత పునరుద్ధబడుతుందని చెప్పబడింది. ఇది సరిగ్గా క్రీ.శ. 1844వ సంవత్సరంగా గుర్తింపబడింది. ఆ సంవత్సరాన్నే'సెవన్త్ డే అడ్వెన్టిస్టులు' విశేషంగా పరిగణించి, ఆరు రోజులు సృష్టి, ఏడవరోజు సబత్ అనే బైబిల్ వాక్యాన్ని గ్రహించారు. వీరి దృష్టిలో సబత్ శుక్రవారం సూర్యాస్తమయంతో ప్రారంభమై, శనివారం సూర్యాస్తమయంతో అంతమౌతుంది.

బహాయ్ మత విశ్వాసంలో ప్రముఖుడు మీర్జా అలీ మహమ్మద్, దక్షిణ ఇరాన్‌లోని షిరాజ్‌లో జన్మించారు. ఈయనకు 25వ యేడు సరిగ్గా క్రీ.శ. 1844వ సంవత్సరం వచ్చింది.

అప్పుడాయన ఒక ప్రకటన చేశాడు. దివ్యాజ్ఞానుసారం తాను భగవంతుని ప్రతినిధిగా అవతరించానని చెప్పారు. అనంతమైన శక్తులకు తాను పెన్నిధినని చెప్పాడు. అబ్దుల్ బహా క్రీ.శ. 1913లో థియోసోఫిస్టులతో ఒక మాట అన్నాడు. ఈ శతాబ్దం భగవంతుని రాజ్యం భూమిపై నెలకొల్పబడే శతాబ్దం!''

'థియోసోఫీ' అనే మాటకు దివ్యజ్ఞానమని అర్థం! రష్యాలోని ఉక్రైన్ మండలంలో ప్రారంభమై, అమెరికాలో రూపురేఖలు దిద్దుకొని, చివరికి ఇండియాలో స్థాపింపబడినదే దివ్యజ్ఞాన సమాజము. మేడమ్ హెలెనా పెట్రోవ్నా బ్లవట్స్కీ దివ్యజ్ఞానసమాజ సహస్థాపకురాలు! ఈమె క్రీ.శ. 1831లో జన్మించినది. 13వ యేట 1844లో ఒక విచిత్రమైన అనుభవం, అనుభూతి కల్గడంతో ఆమె జీవితమే పూర్తిగా మారిపోయింది. ప్రపంచ దేశాలన్నీ పర్యటించి చివరకు కల్నల్ ఆల్కాట్ (Colnel Olcatt) సహాయంతో Theosophical Society ని స్థాపించింది. ఈ థియోసోఫి అనే పదం తత్పూర్వమే ఈజిప్టు దేశ పురోహితుడొకడు టాలమిక్ వంశానికి చెందిన కాలానికి (క్రీ.శ. 3వ శతాబ్ది) పూర్వమే వాడియున్నాడు. 'థియోస్' అంటే భగవంతుడు (God), సోఫీ అంటే జ్ఞానం (Wisdom) అని అర్థం. దీనినే మనం భారతీయ పరిభాషలో 'బ్రహ్మవిద్య' లేక 'దివ్యజ్ఞానము' అని చెప్పవచ్చు.

క్రీ.శ. 1878లో దివ్యజ్ఞాన సమాజస్థాపకులు, ఆర్యసమాజవాదులు సంఘటితులై ఒక సమాఖ్యగా ఏర్పడ్డారు. వీరి దృక్పథంలో మానవనాగరికతా మూలాల వరకు పోవడమే ప్రధాన ఉద్దేశ్యం. ఆర్యసమాజం లాహోర్‌లో పుట్టినది. దివ్యజ్ఞాన సమాజం అమెరికా నుండి ఇండియాకు వచ్చి తమిళనాడులోని అడయార్‌లో స్థిరపడింది.

అడయార్‌లో ప్రప్రథమంగా 1925లో అగ్నిదేవాలయం నిర్మించబడింది. శ్రీజిడ్డు కృష్ణమూర్తి, నేతృత్వంలో ఈ దేవాలయం ప్రారంభింపబడింది. వేదబుుక్కులు అగ్నిహోత్రారాధనలో పఠించబడినాయి. శ్రీజిడ్డు కృష్ణమూర్తి ప్రధాన పురోహితుడుగా సామూహిక అగ్నిహోత్రారాధన 1925 డిసెంబరు 21వ తేది జరిగింది. ఈ దేవాలయంలోని మధ్యభాగంలో అగ్నివేదిక ఉన్నది. ఈ అగ్ని అఖండంగా వెలుగుతూ వుంటుంది. హోమద్రవ్యాలు అగ్నికి, సూర్యునికి, సృష్టికర్తకు సమర్పింపబడుతున్నాయి.

ఆర్యసమాజ స్థాపకుడు స్వామిదయానంద సరస్వతి (1824-1883). ఈ సమాజం క్రీ.శ. 1863లో స్థాపింపబడింది. ఇతడు సౌరాష్ట్రానికి చెందిన శైవుడు. స్వామి విరజానంద మహారాజ్ గారి ప్రభావంతో ఈయన యిల్లు విడిచి వెళ్లాడు. క్రీ.శ. 1845లో జ్ఞానోదయాన్ని

పొంది దేశాటనం చేసి 1863లో ఆర్యసమాజాన్ని స్థాపించారు. ఆర్యసమాజంలోని పది ప్రధాన సూత్రాలలో రెండు మిక్కిలి ముఖ్యమైనవి.

1. భగవంతుడే నిజమైన జ్ఞానానికి మూలకారణం. ప్రతి వస్తువు జ్ఞానముచేతనే తెలియబడుతుంది.

2. వేదాలు నిజమైన జ్ఞానగ్రంథాలు. ప్రతి ఒక్క ఆర్యుని ప్రాథమిక కర్తవ్యం వేదాలను అధ్యయనం చేయడం, బోధించడం, ప్రచారం చేయడంగా ఉండాలి.

స్వామిజీ అగ్నిహోత్రారాధనకు పునరుజ్జీవింపచేశారు. వేదానికి వినూత్న వ్యాఖ్యానం వ్రాశారు.

## III

## విశ్వజనీనయోగ సాధన - కుండలినీయోగం

మొహంజొదారో, హరప్పా త్రవ్వకాలలో దొరికిన ''ధ్యానమగ్నుడై పద్మాసనస్థితుడైన యోగి'' ని చిత్రించిన ఫలకం, క్రీ.పూ. మూడువేల సంవత్సరాల ప్రాచీన కాలంలోనే యోగవిధానం భారతదేశంలో ప్రచలితమై ఉందని తెలియజేస్తున్నది.

ప్రపంచవ్యాప్తంగా పరిశీలిస్తే, ఉత్తర, దక్షిణ అమెరికాలలో నివసించే ఆదివాసులైన హోపీయులు (Hopians) సప్తవిధనాడీ కేంద్రాలను గుర్తించినవారని, కీవాస్ ( Kivas) అనబడే భూగృహ అగ్నివేదిక కుండలినీయోగానికి బాహ్యంగా కల్పింపబడిన రూపమని చెప్పాను.

వైదికార్యులది యాజ్ఞికసంస్కృతి. భగవద్గీతలో అర్జునుని 'భారతా!' అని చాలాసార్లు సంబోధిస్తాడు కృష్ణుడు! 'భారత' శబ్దాని కర్థమేమి ?

**ఉత్తిష్ఠత మా స్వప్త అగ్నిమిచ్ఛధ్వం భారతాః**
**రాజ్ఞః సోమస్య తృప్తాసః సూర్యేణసయుజోషసః**

అరుణోపనిషత్తులోని ఈ మంత్రంలో అగ్ని - సోముడు - సూర్యుడు ముగ్గురు వచ్చారు. మహాభారతం కర్ణపర్వాంతంలో తిక్కన సోమయాజి - అనలుడు భాస్కరుండును సుధాంశుడు నధ్వరసంప్రవర్తకుల్ అన్నాడు. వారే వీరు! బాహ్యాభ్యంతర విజయాన్ని నరుడు సాధించాలి. ఆ నరుడే అర్జునుడు. అతనికి విజయుడనే పేరు కూడ వుంది.

దానికర్థమిక్కడ వుంది. ఓ భారతులారా! లేవండి! నిద్రపోకండి! అగ్నిని ఉపాసించండి. సోమరాజుచే తృప్తిపొందండి! సూర్యకాంతితో కలసి సుఖించండి.''

భారతులంటే ఎవరు? భారతీ - సరస్వతీ - విద్యా - తత్సంబంధినో భారతాః, హే శ్రీ విద్యోపాసకాః'' అని వ్యాఖ్యానం వ్రాయబడింది. విద్య అంటే శ్రీ విద్య - శ్రీ అంటే మోక్షం! మోక్షవిద్యోపాసకుడు భారతీయుడు! ఆ విద్య ఉపనిషత్తుల కాలంలో బ్రహ్మవిద్య! పతంజలి మహర్షి కాలంలో యోగవిద్య! అగ్నిస్వరూపుడైన నరుడు, సూర్యచంద్రుల కాలగతిలో దేవయాన పితృయానముల ద్వారా పైకి, క్రిందికి పోయిరాకుండా - **''నచ పునరావర్తతే''** - అని చెప్పబడిన మోక్షాన్ని సంపాదించి పెట్టే మోక్షవిద్య! అదే కుండలినీ యోగం! జీవునికి శాశ్వతమైన విడుదలను కల్గించే ఆధ్యాత్మిక సాధనమే కుండలినీ యోగం!.

రాబర్ట్ కె.జి. టెంపుల్ వ్రాసిన The Sirius Mystery అనే గ్రంథం 1976లో వెలువడింది. ఎనిమిది సంవత్సరాల సుదీర్ఘ పరిశోధన చేసి మిడిల్ ఈస్ట్, ముఖ్యంగా ఈజిప్టుపై కేంద్రీకరించి వారి ప్రాచీన పురాగాధలు, పురాణాలు పరిశీలించి వ్రాసిన గ్రంథమిది. ఆకాశంలో అత్యంత ప్రకాశవంతం గల నక్షత్రం సిరియస్ రహస్యాన్ని రచయిత ఛేదించాడు. ఈ గ్రంథానికి ప్రశ్నార్థక ఉపశీర్షికలో, ఖగోళంలోని సిరియస్ నక్షత్రం యొక్క వ్యవస్థ నుండి ఈ భూమిపై అత్యంత ప్రతిభాసంపన్నులైన జీవులు జన్మిస్తున్నారా? అనే ప్రశ్నవేసి సమాధానం గ్రంథంలో చెప్పాడు. సిరియస్ అనే నక్షత్రం గురించిన ఆధునిక నాగరికులైన పరిశోధకులకు తెలియని అనేక రహస్యాలు ఆఫ్రికలోని ఆదివాసులు, ఫ్రెంచ్, సుదాన్‌లో మలి ప్రాంతంలోని డాగన్ తెగవారు చాల సూక్ష్మమైన ప్రామాణిక రహస్యాలను తెలిసికొని వుండడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

క్రీ.శ. 1670లోను, మరల 1913లోను ప్రచురింపబడిన COMTE DE GABALIS అనే ఫ్రెంచి గ్రంథం క్రీ.శ. 15వ శతాబ్దంలో వ్రాయబడింది. ఇది కుండలినీ యోగానికి కథారూపంగా వ్రాసిన గ్రంథం. దానిలో సిరియస్ నక్షత్ర రహస్యం చెప్పబడింది. ఈ యోగ రహస్య చక్రం మరలఎప్పుడు పునరావృతమౌతుందో తెలియజేయబడింది. ఈ పుస్తకానికి గల ఉపశీర్షికలో, '' ఒక సంగతి గుప్తంగా అతి కష్టంమీద దాచి పెట్టబడి ఎదో ఒక నెపంతో బహిర్గతం చేయడమనేది ఆ గొప్ప సంగతిని నాశనం చేయడానికే అవుతుంది.'' అని వుంది. అంటే ప్రజలు దానిని వ్యాపారదృష్టితో ఎక్కడ దుర్వినియోగం చేస్తారోనన్న భయంతో రచయిత వ్రాసిన వాక్యాలివి. పై రెండు గ్రంథాలను ప్రస్తుత గ్రంథ రచయిత చూడలేదు గాని దీనిపై వచ్చిన పుస్తక సమీక్ష ( Book Review) - Spritual India and Kundalini Vol. II No.1 1978 పుటలు 13-23 Geme Kieffer వ్రాశారు. సిరియస్ నక్షత్రం మనకు కనబడే సూర్యుని

కంటే వందరెట్లు అధిక ప్రకాశవంతమైనది. గ్రీకు పదమైన సిరియస్ అనే మాటకు దహించివేయునది (Scorcher) జాజ్జ్వలమానమైనది (Sparkler) అని అర్థం. ఈజిప్షియన్ పురాగాథల్లో దీనికి ఐసిస్ (Isis) భార్య. ఈ దేవత కుమారుడే హోరస్. ఈ హోరస్‌ను వర్జిన్ యొక్క దివ్యపుత్రుడని పిలుస్తారు.

ఈ సిరియస్ నక్షత్రానికి పాటు మరియొక తెల్లని చిన్న నక్షత్రం తోడుగా ఉంటుంది. (Sirius and its white dwarf companion) సిరియస్ నక్షత్రం సూర్యగోళ సంబంధమైంది. పాములవలె మెలికలు తిరుగుతూ పైకి ఎగబ్రాకుతూ వుంటుంది. ఎందుకంటే, దానితో పాటేఉన్న చిన్న నక్షత్రాన్ని (White Dwarf) కూడ కలుపుకొని పోవలసివున్నందు వలన ఆ విధమైన మెలికలు తప్పనిసరి అవుతున్నది. ఆధ్యాత్మికంగా చూచినప్పుడు సిరియస్, శక్తి (Energy) గాను, దానిప్రక్కనే ఉన్న చిన్న నక్షత్రం శివుడు (బిందువు) గాను చెప్పవచ్చు.

డాగన్స్ అనబడే ఆదిమానవుల ననుసరించి డిజిటేరియా అనబడే నక్షత్రం ఈ సిరియస్ నక్షత్రాన్ని ప్రతి 50 సంవత్సరాలకొకసారి ప్రదక్షిణం చేస్తూ వుంటుంది. దీన్ని వైజ్ఞానిక పరిశోధనలు సైతం అంగీకరించాయి.

సిరియస్ వెనుకనున్న చిన్న తెల్ల నక్షత్రం (Companion of Sirius) లో పదార్థం ఎంత దట్టంగా ఘనీభవించి వుంటుదంటే ఒక క్యూబిక్ ఇంచ్ లో ఉండే పదార్థాన్ని భూమి మీద తూచితే ఒక టన్ను బరువుంటుంది అని ఖగోళ శాస్త్రజ్ఞులు లెక్కలు వేసి చెబుతున్నారు. సిరియస్‌ను సూర్యుని వెనుక గల సూర్యుడు (Sun behind the Sun) గా అభివర్ణిస్తారు. **" The existence of the Sun behind the Sun has been known in all ages as well as the fact that its influence is most potent upon earth during that period every 2000 years when it is in conjunction with the Sun in our Solar system."**

సూర్యుని వెనుక గల సూర్యుడినే ఈజిప్షియన్లు ఓసిరిస్ (Osiris) అనే పేరుతోనే గాక, దాగిన సూర్యుడు (Hidden Sun) అనే అర్థంలో అమెన్ - ర (Amen - Ra) అని కూడ పిలుస్తారు. ఈ దాగిన సూర్యుడైన సిరియస్, ఐసిస్ (Isis) అనే ప్రకృతి (Nature) యొక్క భర్తగా చెబుతారు. వీరికి పుట్టిన కుమారుడే హోరస్ (Horus). ఈ సిరియస్ నక్షత్రం డేగ (శ్యేనం) రూపంగల ప్రతీకాత్మకపక్షి గాచెప్పబడింది. (చూ॥ సుపర్ణతత్త్వం - ఇదే గ్రంథం - పుటలు 37-38) ఎందుకంటే, డేగ ఒక్కటే సూర్యునికి దగ్గరగా పోగలపక్షి. ప్రాచీన ప్రజలకు

తెలిసిన విషయమేమంటే, సంవత్సరానికొక్కసారి తండ్రియైన సూర్యుడు కుమారుడైన నక్షత్రం (Dog Star)గల పంక్తిలో వచ్చి సందర్శిస్తాడు అంటారు. అందువలన ఒక గొప్ప పిరమిడ్ ఈ పవిత్రవీక్షణాన్ని సూచిస్తూ నిర్మించబడింది. అప్పుడు సిరియస్ యొక్క కిరణాలు ఊర్ధ్వభాగంలోని చతురస్రాకారపు భగవంతుని ఫలకంపై పడుతాయి. ఆ కిరణాలు క్రిందికి దిగుతూ ప్రధాన పురోహితుని శిరస్సుపై పడగాఅతడు కుండలినీ శక్తిని (Super Solar Force) సమీకరించుకొంటాడు. ఈ విధంగా సౌరశక్తి సంపన్నమైన శరీరంతో తన వద్ద యోగదీక్ష (Initiation) పొందే వారి శిరస్సును స్పృశించినప్పుడు ఆ శక్తిని వారిలో ప్రసరింపజేసి, భగవత్స్వరూపం (God hood) మైన పరిణామానికి దోహదకారి యౌతున్నాడు.

Kundalini and Christian Mysticism అనే వ్యాసంలో Mineda J. Mccleve అనే రచయిత యిలా వ్రాస్తున్నారు. "St. John of the Cross thought of his soul as being feminine and he believed he was the bride of Christ, despite his masculanity." " The relationship with God was a decided by sexual one at times. They could have complimented such terms as rapture, bliss, ecstasy, and divine union with the words like sensual, sexual, erotic and orgasmic. There was no shame in the minds and hearts of the mystics. The mystic who was admitted to the divine marriage was undoubtedly by congnizant of the fact that it was in part of a sexual marriage." జీవాత్మలందరూ స్త్రీలు, పురుషుడొక్కడే భగవంతుడు. 'పుమాన్ విష్ణురితిఖ్యాతః స్త్రీప్రాయమితరంజగత్'' అనే మధురభక్తి సిద్ధాంతాన్నే క్రైస్తవ తాత్త్వికులు కూడ అంగీకరించారు. భగవంతునితో శృంగార క్రీడలందు ఆనంద నిమగ్నులై మోక్షాన్ని పొందారు. దీనికి తాళ్లపాక అన్నమాచార్యులు పదివేల శృంగార సంకీర్తనలన్నీ ఉదాహరణాలే!" Behold! the kingdom of God is with in you" అని చెప్పిన Jesus Christ వాక్యాలే జీవేశ్వరుల శృంగారతత్త్వానికి మూలసూత్రంగా చెప్పవచ్చు.

సూఫిజమ్‌లో కుండలినీ యోగమున్నదా? అనే ప్రశ్నకు 'ఉన్నది' అని సమాధానం చెబుతూ Sufi Kundalini అనే వ్యాసాన్ని Pir Vilayat Inayat Khan వ్రాశారు. (Spiritual India and Kundalini Vol. II No.1 1978, పుటలు **49-54**) ఆయన సూఫీ కుండలినీ యోగంలోని సాంకేతికపదాలను యిలా క్రోడీకరించారు.

ప్రపంచానికి దారిచూపిన భారతదేశం కోరుకొనే నేటి సమాజం! ఇదేనా బ్రహ్మవిద్యా సింహాసనమెక్కిన భారతదేశం ఈనాడు మనకిచ్చే సందేశం! ఇది అతి భయంకర ప్రమాదానికి దారితీసే మృత్యుగహ్వరమని మనవిచేస్తున్నాను. దీనికి తోడు ప్రాంతీయాభిమానాలు, భాషాద్వేషాలు, బంధుప్రీతి, పదవీవ్యామోహాలు, లంచగొండితనాలు అగ్నికీలలపై ఆజ్యం పోస్తున్నాయి! వీటికంటే బాహ్యమైన మతయుద్ధాలే మేలు (Religious Crusades). ఈ కులపిశాచం పైకి కనబడకుండా లోలోపలనే సెలవేసే పుండులాంటిది. ఈ కులాల ప్రచ్ఛన్న యుద్ధం సమాజానికి పట్టిన అతి ప్రమాదకరమైన రోగం! దీనికి రాజకీయరంగాలు లోలోపల ప్రోత్సహిస్తూ ఎగసనతోయడం మానవుని స్వార్థపరత్వానికి పరాకాష్ఠ! ఇటువంటి సంకుచిత స్వార్థపరత్వం తొలగిపోవాలనీ యువకులకు కనువిప్పు కలగాలనేదే ఈ గ్రంథ రచయిత ఆశయం!

మానవ హక్కులు (Human Rights) అనేది సృష్టిప్రారంభంతోనే ఏర్పడుతున్నది. కాని, నేటి మానవుడు తనకు ఏ హక్కులున్నాయో, ఎటువంటి బాధ్యతలున్నాయో తెలిసికోవడం లేదు. అలా తెలుసుకొనే స్థితిలో లేకుండా చేసింది నేటి సమాజస్థితిగతులే! దానికి కారణం ఎవరో కాదు. విద్యాధికులైన మన పెద్దలే! పరక (1/8) మనిషి పాతిక (1/4), అర్ధ (1/2) మనిషులే మనకీనాడు సంఘంలో కనబడుతున్నారు. కానీ, సమగ్రత (Integrity) నిబద్ధత (Commitment), నిజాయితీ (Morality), గల వ్యక్తులు కనబడడం చాల అరుదైపోయింది. అటువంటి సంపూర్ణమైన వ్యక్తిత్వం గల మనుష్యులు, నూటికి నూరుపాళ్లు మానవత్వం గల మనుష్యులు, సంఘంలో ఎదిగి రావాలనేదే ఈ గ్రంథ రచనకు ప్రేరణ కల్గించింది.

సర్వసమానత్వం, సమానావకాశాలు, మత ప్రమేయం లేని లౌకికరాజ్యం (Secular State)అని అందంగా రాజ్యాంగ నిబంధనల్లో (Constitution)వ్రాసి, కులాల కూకటి వేళ్ల వరకు వెళ్లి సమాజాన్ని సమజంగా, (పశువుల మందగా) దుర్గంధ భూయిష్టంగా, చీలికలు పేలికలుగా చేయడం ఎలావుందంటే - పురాణకాలంలో హిరణ్యాక్షుడు భూగోళాన్ని అట్టడుగున నున్న పాతాళానికి తీసుకుపోయి అక్కడ హేయమైన అమేధ్యంలో, చీము నెత్తురుల్లో నొక్కి తొక్కి వేయగా, ఈ నీచమైన దుర్గంధాన్ని భరించి, సహించే సృష్టిలోని నికృష్ట జంతువు పంది కాబట్టే, మహావిష్ణువంతటి మహానుభావుడు, మన్మథుని కన్న తండ్రి, అందగాడు, చివరికి వరాహరూపంలో ఆ రొచ్చులో దిగబడి, ఆ దుష్టరాక్షసునితో యుద్ధం చేసి హతమార్చిన ఘట్టం ఎవరికైనా జ్ఞాపకం రాకమానదు. అటువంటి దయనీయమైన దుస్థితి ఆ భగవంతునికి మరల రానియ్యవద్దని ''కులపురోహితు''లైన అధికారులను, విద్యాధికులైన మేధావులను మరీ

మరీ వేడుకుంటున్నాను. ఇది పురాణ గాథలకు ఈనాడున్న contemporary social relevance 'సమకాలీన సామాజికస్పృహ!' అని విన్నవిస్తున్నాను. హేతువాదులు చెబుతున్నట్లు మన పురాణాలు వట్టి పుక్కిటి పురాణాలు కావు! తప్పటడుగులు వేస్తున్న సమాజానికి సన్మార్గ ప్రదర్శకాలు!

ప్రాచీన భారతదేశంలో పురోహితుడంటే రెండర్థాలు 1. ముందుగా హితం చెప్పేవాడు, 2) పట్టణాని కంతటికీ హితం చేప్పేవాడు (పురమంటే పట్టణం) కాని, ఈనాటి 'కుల పురోహితులు' దీనికి పూర్తిగా వ్యతిరేక దిశలో నడుస్తూ సమాజానికి చీడపురుగుల్లా అహితాన్నే, అనర్థాన్నే కల్గిస్తున్నారనేది నగ్న సత్యం!

అధికారపీఠాన్ని అధిష్ఠించిన పెద్దలందరూ విచక్షణజ్ఞానంతో ఆలోచించి మంచినే పెంచుతారని ఆశిస్తున్నాను. ఆ రోజు కోసం ఎదురుచూస్తున్నారు నేటి మన విద్యావంతులైన యువతీ యువకులు! జాతి, మత, కుల,వర్గ వివక్షలేని సమాజాన్ని ఈ రచయిత కోరుకుంటున్నాడు. మనిషిని మనిషిగా గుర్తించి గౌరవించే రోజు కోసం ఎదురుచూస్తున్నాడు.

**ఫలశ్రుతి :** వ్యాసమహాభాగవతంలో భీష్మకృత కృష్ణ స్తోత్రంలో –

తమి మ మహమజం శరీర భాజాం
హృది హృది ధిష్ఠిత మాత్మకల్పితానామ్ ।
ప్రతిదృశ మివ నైకధార్క మేకం
సమధిగతోఽస్మి విధూతభేద మోహః (1-9-42)

దీనినే పోతన గారు ఆంధ్ర మహాభాగవతంలో –

**ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తోఁచు పో**
**లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ**
**న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ**
**పకుఁడై యొప్పుచునుండు నట్టిహరినే(బ్రార్థింతు శుద్ధుండనై** (1-225)

ఓం నమోభగవతే తస్మైయత ఏతచ్చిదాత్మకమ్
పురుషాయాది బీజాయ పరేశాయాభిధీమహి ।
యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం యఇదం స్వయమ్
యోఽస్మాత్ పరస్మాచ్చపరస్తం ప్రపద్యే స్వయంభువమ్ । (8-3-3)

ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
మెవ్వని యందు డిందు c బరమేశ్వరుcడెవ్వcడు మూలకారణం
బెవ్వcడనాది మధ్యలయుcడెవ్వ.డు సర్వముcదానయైనవాc
డెవ్వcడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్ (8-73)

మఖో హి విష్ణుర్భగవాన్ సనాతనో
వహంతి తం చాగ్న్యనిలేందు భానవః।
అతోऽనసూయుః శృణుతే పఠేచ్చయః
స సర్వలోకాంశ్చ జయేత్సుఖీభవేత్ ॥

– వ్యాసభారతం – కర్ణపర్వం (8-69-41)

అనలుcడు భాస్కరుండును సుధాంశుcడు నధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర! యీక్రతువు విష్ణుమయం, బిది నిర్వహించి ర
ర్జునుcడును గర్ణుcడున్ సమర రూపమునం దగ; నీ ప్రబంధమిం
పొనరcబఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్య సంపదల్

– తిక్కన భారతం – కర్ణపర్వం (3-397)

**" The Vision about the evening and morning sacrifices which have been explained to you will come true. But keep it secret now, because it will be a long time before it does come true."**

- DANIEL 8.26

Good News Bible

Today's English Version

# 1. సౌమనస్య సూక్తం
## (ఋగ్వేదమ్ 10 -191 -1 to 4)

**సం సమిద్యువసే వృష అగ్నే విశ్వస్యర్య ఆ ।**
**ఇళస్పదే సమిధ్యసే సన్నో వసూన్యా భర ॥** - 1 -

మా కోరికలన్నింటినీ తీర్చే ఓ అగ్నీ ! ఒక యజమానుని వలె నీవు అందరినీ నాలుగువైపులా కలుపుతున్నావు! నీవు వేదిపై ప్రజ్వలింపజేయబడుచున్నావు. నీవు మా అందరి కొరకు సంపత్తులను తీసికొని రమ్ము!

**సఙ్గచ్ఛధ్వం సం వదధ్వం**
**సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథాపూర్వే**
**సంజానానా ఉపాసతే ॥** - 2 -

అందరితో కలిసినడువు. అందరితో కలిసి మాట్లాడు. ఏ ప్రకారంగా పురాతన దేవతలందరూ ఏకాభిప్రాయులై వచ్చి తమ తమ యజ్ఞభాగాలను స్వీకరిస్తున్నారో, ఆ విధంగా మీ మనస్సెప్పుడూ ఏకాభిప్రాయం గల్గి వుండనీ!

**సమానో మంత్రః సమితిః సమానీ**
**సమానం మనః సహ చిత్తమేషామ్ ।**
**సమానం మంత్ర మభిమంత్రయే వః**
**సమానేన వో హవిషా జుహోమి ।** - 3 -

వారి యొక్క స్తుతి సమానంగా ఉండనీ! వారికి ప్రాప్తించే సంపదలు కూడా సమానంగా ఉండనీ! మనస్సు సమానంగా ఉండనీ! చిత్తము కలిసి వుండనీ ! మీ వంటి వారితో సమానమైన స్తుతిని ఉచ్చరిస్తూ హవిస్సులో నేను సమిధల్ని సమర్పిస్తున్నాను.

**సమానీ వ ఆకూతి :**
**సమానా హృదయాని వః**
**సమానమస్తు వో మనో**
**యథా వః సుసహాసతి ॥** - 4 -

నీ యొక్క సంకల్పం సమానంగా ఉండనీ! నీ యొక్క అంతః కరణం సమానంగా ఉండనీ! నీ యొక్క మనస్సు సమానంగా ఉండనీ! ఆ విధంగా నీకు అవి మంచి నేస్తములై ఉండుగాక!

# ౨. అఖండ భారతీయం ఏకాత్మతా స్తోత్రమ్

ఓం నమః సచ్చిదానంద రూపాయ పరమాత్మనే ।
జ్యోతిర్మయ స్వరూపాయ విశ్వమాంగల్యమూర్తయే ॥

ప్రకృతిః పంచభూతాని గ్రహోలోకాః స్వరాస్తథా ।
దిశః కాలశ్చ సర్వేషాం సదాకుర్వంతు మంగలమ్ ॥

రత్నాకరా ధౌతపరాం హిమాలయ కిరీటినీమ్ ।
బ్రహ్మారాజర్షి రత్నాఢ్యాం వందే భారతమాతరమ్ ॥

మహేంద్రోమలయః సహ్యోదేవతాత్మా హిమాలయః ।
ధ్యేయో రైవతకో వింధ్యో గిరిశ్చారావలిస్తథా ॥

గంగా సరస్వతీ సింధుర్బ్రహ్మాపుత్రశ్చ గండకీ ।
కావేరీ యమునా రేవా కృష్ణాగోదా మహానదీ ॥

అయోధ్యా మధురామాయా కాశీ కాంచీ అవంతికా ।
వైశాలీ ద్వారకా ధ్యేయా పురీతక్షశిలా గయా ॥

ప్రయాగః పాటలీపుత్రం విజయనగరం మహత్ ।
ఇంద్రప్రస్థం సోమనాథః తథాఽమృతసరః త్రయమ్ ॥

చతుర్వేదాః పురాణాని సర్వోపనిషదస్తథా ।
రామాయణం భారతం చ గీతా షడ్దర్శనానిచ ॥

జైనాగమా స్త్రిపిటకా గురుగ్రంథః సతాం గిరః ।
ఏషః జ్ఞాననిధిః శ్రేష్ఠః శ్రద్ధేయో హృదిసర్వదా ॥

అరుంధత్యనసూయాచ సావిత్రీ జానకీ సతీ ।
ద్రౌపదీ కణ్ణగీ గార్గీ మీరా దుర్గావతీ తథా ॥

లక్ష్మీరహల్యా చన్నమ్మా రుద్రమాంబా సువిక్రమా ।
నివేదితా శారదా చ ప్రణమ్యాః మాతృదేవతాః ॥

శ్రీరామో భరతః కృష్ణో భీష్మో ధర్మ స్తథార్జునః ।
మార్కండేయో హరిశ్చంద్రః ప్రహ్లాదో నారదో ధ్రువః ॥

హనుమాన్ జనకో వ్యాసో వశిష్ఠశ్చ శుకోబలిః ।
దధీచి విశ్వకర్మాణౌ పృథువాల్మీకి భార్గవాః ॥

భగీరథ శ్చైకలవ్యో మనుర్ధన్వంతరి స్తథా ।
శిబిశ్చ రంతిదేవశ్చ పురాణోద్గీత కీర్తయః ॥

బుద్ధా జినేంద్రా గోరక్షః పాణినిశ్చ పతంజలిః ।
శంకరో మధ్వ నింబార్కౌ శ్రీరామానుజ వల్లభౌ ॥

ఝూలే లాలోథచైతన్యః తిరువళ్లువరస్తథా ।
నాయన్మారాళువారశ్చ కంబశ్చ బసవేశ్వరః ॥

దేవలో రవిదాసశ్చ కబీరో గురునానకః ।
నరసిస్తులసీదాసో దశమేశో దృఢవ్రతః ॥

శ్రీమత్ శంకరదేవశ్చ బంధూ సాయణ మాధవౌ ।
జ్ఞానేశ్వరస్తుకారామో రామదాసః పురందరః ॥

బిరసాసహజానందో రామానందస్తథా మహాన్ ।
వితరస్తు స్తదైవేతే దైవీం సద్గుణసంపదామ్ ॥

భరతర్షిః కాళిదాసః శ్రీ భోజ జకణస్తథా ।
సూరదాసస్త్యాగరాజో రసఖానశ్చ సత్కవిః ॥

రవివర్మ భాతఖండే భాగ్యచంద్రః సభూపతిః ।
కలావన్తశ్చ విఖ్యాతాః స్మరణీయా నిరంతరమ్ ॥

అగస్త్యః కంబు కౌండిన్యౌ రాజేంద్రో శ్చోలవంశజః ।
అశోకః పుష్యమిత్రశ్చ ఖారవేలః సునీతిమాన్ ॥

చాణక్యచంద్రగుప్తౌచ విక్రమ శాలివాహనః ।
సముద్రగుప్తః శ్రీహర్షః శైలేంద్రో బప్పరావలః ॥

లాచిత్ భాస్కరవర్మా చ యశోధర్మా చ హూణజిత్ ।
శ్రీకృష్ణదేవరాయశ్చ లలితాదిత్య ఉద్బలః ॥

ముసునూరి నాయకౌ తే ప్రతాపః శివభూపతిః ।
రణజిత్ సింహ ఇత్యేతే వీరవిఖ్యాత విక్రమాః ॥

వైజ్ఞానికశ్చ కపిలః కణాదః సుశ్రుతస్తథా ।
చరకో భాస్కరాచార్యో వరాహమిహిరః సుధీః ॥

నాగార్జునో భరద్వాజః ఆర్యభట్టో బసుర్బుధః ।
ధ్యేయోవేంకట రామశ్చ విజ్ఞానీ రామానుజాదయః ॥

రామకృష్ణో దయానందో రవీంద్రో రామమోహనః ।
రామతీర్థో౽రవిందశ్చ వివేకానంద ఉద్యశాః ॥

దాదాభాయీ గోపబంధుః తిలకో గాంధిరాదృతాః ।
రమణో మాలవీయశ్చ శ్రీసుబ్రహ్మణ్య భారతీ ॥

సుభాషః ప్రణవానందః క్రాంతివీరో వినాయకః ।
ఠక్కరో భీమరావశ్చ ఫులే నారాయణో గురుః ॥

సంఘశక్తి ప్రణేతారౌ కేశవో మాధవస్తథా ।
స్మరణీయా సదైవేతే నవచైతన్యదాయకాః ॥

అనుక్తాయే భక్తాః ప్రభుచరణసంసక్త హృదయాః ।
అవిజ్ఞాతావీరా అధిసమర ముధ్వస్త విప్లవః ॥

సమాజోద్ధర్తారః సుహితకర విజ్ఞాన నిపుణాః ।
నమస్తేభ్యో భూయాత్ సకలసుజనేభ్యః ప్రతిదినమ్ ॥

ఇదమేకాత్మతాస్తోత్రం శ్రద్ధయా యః సదాపఠేత్ ।
స రాష్ట్రధర్మనిష్ఠావాన్ అఖండం భారతం స్మరేత్ ॥

బోలో భారతమాతాకీ జై ॥

జైహింద్

# 3. సంస్కృత వర్షగీతమ్

సంస్కృత వర్షం జనయతిహర్షమ్

చిరకాంక్షిత మభియాతమ్ .......2........

స్ఫూర్తి విధాయక మనిశమ్

నవాం ప్రేరణాం నవముత్సాహమ్

తనుతే శక్తి మజస్రమ్ ........2........

గ్రామే గ్రామే కోణే కోణే ప్రతిజన పదమపినూనమ్

సంస్కృతిసారా సంస్కృతధారా పూతా యాస్యతి నిభృతమ్ ।

మానసమఖిలం మనుకులజానం అఖిలావయతి ప్రసభమ్

కురుతే బలవద్భారత వర్షం శక్తం శ్రద్ధ సమృద్ధిమ్ ॥

వ్యక్తౌ వ్యక్తౌ నవజాగరణం శ్రద్ధాభక్తి సమేతమ్

అపరిమితస్థా రాష్ట్రహితార్థా భవితాం సర్వజనైక్యమ్ ।

విలయం యాస్యతి కలుషిత భావః స్థాస్యతి కలిరసదాయః

శుభమాశాస్తే భారతమాతా స్మితవదనామృదుహాసా ॥

ఉత్తిష్ఠత భో జాగృత! సుహృదః ప్రజ్ఞాం ప్రాప్యనిబోధయత

తంద్రం హిత్వా శక్తిమవాప్య జనహితకార్యం శ్రయత ।

విశ్వవిజేత్రీం సంస్కృత యాత్రాం సఫలాం కుర్తుంయామ

భారతదేశం సర్వసమర్థం జగద్గురుం కరవామ ॥

# 4. జాతీయగీతం

జనగణ మన అధినాయక జయహే
భారతభాగ్యవిధాతా ।
పంజాబ సింధు గుజరాత మరాఠా !
ద్రావిడ ఉత్కళ వంగా !!
వింధ్య హిమాచల యమునా గంగా !
ఉచ్ఛల జలధితరంగా !!
తవ శుభనామే జాగే !
తవ శుభఆశిష మాంగే !
గాహే తవ జయగాథా
జనగణ మంగళ దాయక జయహే !
భారత భాగ్యవిధాతా !!
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !!

అహరహ తవ ఆహ్వాన ప్రచారిత
సునుతవ ఉదారవాణీ !
హిందు, బౌద్ధ, సిఖ, జైన, పారశిక,
ముసల్మాన, క్రీస్తానీ !!
పూరబ పశ్చిమ ఆశే !
తవ సింహాసన పాసే !!
ప్రేమహార హౌయ గాథా !

జనగణ ఐక్యవిధాయక జయహే !
భారతభాగ్యవిధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

– రవీంద్రనాథ ఠాకుర్

## 5. ఆంధ్ర రాష్ట్రగీతం

మా తెలుగుతల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు ॥ పల్లవి॥

కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి ॥ అనుపల్లవి॥

గలా గలా గోదావరి కదలిపోతుంటేను
బిర బిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి ॥ మా తెలుగు॥

అమరావతీ గుహల అపురూప శిల్పాలు
త్యాగయ్యగొంతులో తారాడునాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండే దాక

రుద్రమ్మ భుజశక్తి! మల్లమ్మ పతిభక్తి!
తిమ్మరుసుధీయుక్తి! కృష్ణరాయని కీర్తి!
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ ఆటలే ఆడుతాం
నీ పాటలే పాడుతాం
జై తెలుగుతల్లి !
జై తెలుగుతల్లి !!

- కీ॥ శే॥ శంకరంబాడి సుందరాచారి

# ఉపయుక్త గ్రంథ సూచిక

# BIBLIOGRAPHY

## సంస్కృత గ్రంథాలు


1. అభిజ్ఞాన శాకుంతలమ్ - వర్క్స్ ఆఫ్ కాళిదాస, సంపుటం - 1 (నాటకాలు) (సంపా.) సి.ఆర్. దేవధర్, మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, 1966.

2. అష్టోత్తర శతోపనిషత్తులు - (సంపా.) వాసుదేవ లక్ష్మణ శాస్త్రి పణసీకర్, నిర్ణయసాగర్ ప్రెస్, ముంబాయి, 1932.

3. ఆపస్తంబీయ శుల్బసూత్రమ్ - కపర్దిస్వామి, కరవింద, సుందరరాజ భాష్యసహితమ్ (సంపా.) డి. శ్రీనివాసాచార్, ఎస్. నరసింహాచార్, యూనివర్సిటీ ఆఫ్ మైసూర్ సంస్కృత సీరీస్ సంఖ్య - 73, మైసూరు, 1931.

4. ఆపస్తంబీయ శ్రౌతసూత్రమ్ - ధూర్తస్వామి భాష్యమ్, రామాగ్నిచిత్, రుద్రదత్త విరచిత వృత్తి సహితమ్ -మూడు సంపుటాలు (సంపా.) ఎస్. నరసింహాచారియర్, ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ సంస్కృత సీరీస్ సంఖ్యలు 87, 93, 104, యూనివర్సిటీ ఆఫ్ మైసూర్, మైసూర్ ,1944.

5. ఋగ్వేదము - స్కందస్వామి భాష్యం, వేంకటమాధవుని ఉద్గీథవ్యాఖ్య, సాయణభాష్యానుసారి ముద్గలుని వృత్తి, పదపాఠసహితం (సంపా.) విశ్వబంధు ప్రభృతులు, ఎనిమిది సంపుటాలు, విశ్వేశ్వరానంద్ వేదిక్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్, హోషియార్ పూర్, పంజాబ్, 1965.

6. ఋగ్వేదభాష్య భూమికా సంగ్రహః - వేదభాష్యముల కన్నింటికీ సాయణాచార్యుని ఉపోద్ఘాతాలు - సంపా. బలదేవ ఉపాధ్యాయ, వారణాశి, 1934.

7. ఐతరేయ బ్రాహ్మణమ్ - సాయణభాష్యసహితమ్ (సంపా.) కాశీనాథ శాస్త్రి ఆగాషే ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావలీ - 32, ఆనందాశ్రమ ప్రెస్, పుణే, 1977.

8. కాత్యాయన శ్రౌత సూత్రమ్ - కర్క, యాజ్ఞికదేవభాష్యమ్, రెండు సంపుటాలు, (సంపా.) డోగ్రా అనంతరామశాస్త్రి, చౌఖంబాసంస్కృత గ్రంథావలీ, వారణాశి, 1939.

9. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితా - సాయణభాష్యసహితమ్, ఎనిమిది సంపుటాలు, (సంపా.) కాశీనాథ శాస్త్రి ఆగాషే, ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావలీ - 42, ఆనందాశ్రమ ప్రెస్, పుణే, 1940.

10. గణితసారసంగ్రహః -మహావీరాచార్యవిరచితమ్, సంస్కృత గ్రంథ పరిష్కరణ, ఆంగ్లానువాదం, వివరణ -ఎం. రంగాచార్య, గవర్నమెంటు ఆఫ మద్రాస్, మద్రాసు, 1912.

11. నీతిద్విషష్టికా - సుందరపాండ్యవిరచితమ్, (సంపా.) వేటూరి ప్రభాకర శాస్త్రి, మణిమంజరీ ప్రచురణలు, హైదరాబాదు, 1928/1986.

12. పాతంజల యోగదర్శనమ్ - వాచస్పతి మిశ్రవిరచిత తత్త్వ వైశారదీ వ్యాఖ్య, విజ్ఞానభిక్షుకృత యోగవార్త్తికమ్, వ్యాసభాష్యసహితమ్ (సంపా.) నారాయణమిశ్రా, భారతీయ విద్యాప్రకాశన్, వారణాసి, 1971.

13. భగవద్గీత - టీకాతాత్పర్య శ్రీధరీయటీకాసార విశేషాంశసహితము, (సంపా.) పూర్ణానంద, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి, 1944.

14. మాళవికాగ్ని మిత్రమ్ - కాళిదాసు, ఆంధ్రకరదీపికా వ్యాఖ్యాసహితమ్, డా॥ పాటిబండ మాధవశర్మ, శ్రీ పరమేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాద్, 1973.

15. మేఘదూతమ్ - కాళిదాసు, మల్లినాథవ్యాఖ్య (సంపా.) జి.ఆర్. నందర్గీకర్, భారతీయబుక్ కార్పొరేషన్, ఢిల్లీ, 1979.

16. యజుర్వేద కాఠకసంహితా - (సంపా.) శ్రీపాదదామోదర సాతవలేకర్, స్వాధ్యాయమండల్, పారడీనగరమ్, బలసాడ్ ప్రదేశ్, గుజరాత్, 1942 నాల్గవ ముద్రణ 1978.

17. రఘువంశమ్ - కాళిదాసు, మల్లినాథవ్యాఖ్య, (సంపా.) జి.ఆర్. నందర్గీకర్, మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ, ఐదవముద్రణ 1982.

18. వాజసనేయీ మాధ్యందిన శతపథబ్రాహ్మణమ్ - సాయణుల వేదార్థప్రకాశ భాష్యము, శ్రీహరిస్వామి వివరణ, ఐదుసంపుటాలు, లక్ష్మీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్, కల్యాణ్, ముంబై, 1940.

19. వాల్మీకిరామాయణమ్ - రామపండితుని తిలకవ్యాఖ్య, శివసహాయపండితుని శిరోమణి వ్యాఖ్య, గోవిందరాజపండితుని భూషణవ్యాఖ్య, (సంపా.) శాస్త్రి శ్రీనివాసకట్టిముధోలకర, ఉపోద్ఘాత శ్లోకసూచీ - సత్కారీముఖోపాధ్యాయ (ఎనిమిది సంపుటాలు), పరిమళ సంస్కృత గ్రంథమాలా - 11, పరిమళ పబ్లికేషన్స్, ఢిల్లీ, 1983.

20. వ్యాసభాగవతమ్ - వీరరాఘవ విరచిత శ్రీమద్భాగవత చంద్రికావ్యాఖ్య, ఐదుసంపుటాలు, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యాలయం, నడిగడ్డపాలెం, తెనాలి, గుంటూరు జిల్లా 1976.

21. వ్యాసభారతమ్ - సంశోధితముద్రణ, 19 సంపుటాలు, ఆరుసంపుటాల పాదసూచికలు (సంపా.) విష్ణు ఎస్. సుక్తాంకర్ ప్రభృతులు, భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్, పుణే, 1933-1959.

22. శతపథ బ్రాహ్మణమ్ - కాణ్వీయశాఖ, (సంపా.) డబ్ల్యు. క్యాలండ్, పునఃపరిష్కరణ, డా॥ రఘువీర, ప్రథమముద్రణ, లాహోర్ 1926, పునర్ముద్రణ 1983/1998.

23. సౌందర్యలహరి - శ్రీ ఆది శంకరాచార్య విరచితమ్, లోల్ల లక్ష్మీధరవ్యాఖ్య (సంపా.) ఎన్.ఎస్. వెంకటనాథాచార్య, ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్, మైసూరు, 1969.

## తెలుగు పుస్తకాలు - వ్యాసాలు

1. అక్కమహాదేవి వచనములు - కన్నడం నుండి తెలుగు అనువాదం - రేకళిగె మఠం వీరయ్య, ఇసామియా బజారు, హైదరాబాదు, 1982.

2. అధ్యాత్మసంకీర్తనలు - సంపుటాలు I - IV- తాళ్లపాక అన్నమాచార్యులు, (సంపా.) గౌరిపెద్ది రామసుబ్బ శర్మ, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, ద్వితీయ ముద్రణ 1998.

3. అనిత్యనిత్య వ్యత్యాసము (క్రైస్తవ పద్యకావ్యము) (హైందవుల జ్ఞానమార్గంలోని సాధన చతుష్టయంలోగల నిత్యానిత్యవస్తువివేకాన్ని పోలినది) - సామంతపూడి మల్లయకవి.

4. అమరావతీస్తూపము - ఇతరవ్యాసములు - మల్లంపల్లి సోమశేఖరశర్మ, మద్రాసు, 1932.

5. అవతారిక - ప్రాకృతాంధ్రసాహిత్యాలు - డా॥ రవ్వాశ్రీహరి, అభినందన, ఆచార్యతూమాటి దోణప్ప షష్టిపూర్తి సంచిక 1987.

6. అష్టభాషలు - నిడుదవోలు వేంకటరావు, భారతి, జూలై 1966.

7. ఆంధ్రకవుల అవతారికలు - కోరాడరామకృష్ణయ్య, భారతి, డిసెంబరు, 1944.

8. ఆంధ్రకవితా సంప్రదాయములు - కృత్యాది - కోరాడరామకృష్ణయ్య, భారతి, ఫిబ్రవరి 1935.

9. ఆంధ్రదేశమున జైనమతవ్యాప్తి - భావరాజు వేంకటకృష్ణారావు, భారతి, జూన్, 1943.

10. ఆంధ్రులపై జైనమత ప్రభావం - జైన మతానికి ఆంధ్రుల సేవ - ఆరుద్ర, ఆంధ్రపత్రిక సిద్ధార్థి సంవత్సరాది సంచిక 1979-80.

11. ఆంధ్రదేశంలో బుద్ధధాతు పేటికలు - బండారు సుబ్రహ్మణ్యం, ఆనందబుద్ధ విహారట్రస్ట్, సికిందరాబాదు.

12. ఆంధ్రమహాభారతము - పరిష్కృతముద్రణము (సంపా.) ఖండవల్లి లక్ష్మీరంజనం ప్రభృతులు, ఉస్మానియావిశ్వవిద్యాలయం, హైదరాబాదు.

13. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి, ది ఓరియంట్ లాఙ్మన్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, హైదరాబాదు.

14. ఆచార్యనాగార్జున సుహృల్లేఖ - అనువాదం - గజ్జెలమల్లారెడ్డి, ఆనందబుద్ధ విహారట్రస్టు, సికిందరాబాద్, 1977.

15. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము - ప్రయోగాలు - డా॥ సి. నారాయణ రెడ్డి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1990.

16. ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు, సంజీవనీ వ్యాఖ్య - శ్రీవేదం వేంకటరాయశాస్త్రి, మద్రాసు, 1971.

17. ఇక్ష్వాకులు - క్రొత్తపరిశోధనము - వేటూరి ప్రభాకరశాస్త్రి, భారతి ప్రభవ 1927. ప్రభాకరస్మారిక Vol. II, హైదరాబాదు 1989.

18. ఓనమాలు - శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి, ఆంధ్రపత్రిక ధాత సంవత్సరాది సంచిక, 1936.

19. కన్నడ సాహిత్యచరిత్ర - రం.శ్రీ. ముగళి, అనువాదం - ఎం.ఎస్. మహాంతయ్య, సాహిత్య అకాడెమి, న్యూఢిల్లీ, 1978.

20. కన్నడ సాహిత్య చరిత్ర - డా॥ ఆర్వీయస్ సుందరం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1977.

21. కల్పవృక్ష రహస్యములు – విశ్వనాథసత్యనారాయణ, పి.యస్.అండ్.కో. గుంటూరు, 1976.

22. కురాను షరీఫ్ – అనువాదకులు – డా॥ చిలుకూరి నారాయణరావు, ప్రపంచ మత గ్రంథమాల – 1, శ్రీసుజనరంజనీ ముద్రాశాల, రాజమహేంద్రవరం, 1925.

23. కేదారగౌళ (ఖండకావ్య సంపుటి) – విశ్వనాథసత్యనారాయణ.

24. కోశవిజ్ఞానం – నిఘంటువులు – లకంసాని చక్రధరరావు, 'విభవ' ఆచార్య జి.యన్. రెడ్డి అభినందన సంచిక, తిరుపతి, 1988.

25. క్రైస్తవ గూఢార్థ ప్రదీపిక – రాజా మంత్రిపెగ్గడ భుజంగరావు. (హిందూ, క్రైస్తవ మతాలలోని సాదృశ్యాలు) ఏలూరు, కృష్ణాజిల్లా, 1910.

26. క్రైస్తవనీతి ప్రకాశము (పద్యకావ్యం) దేశీయ క్రైస్తవులకు హిందువులకు ఉపయుక్తం – చౌదరి పురుషోత్తము, Religious Tract and Book Society, SPEK Press, Vepery, 1893.

27. గాయత్రీ రామాయణము – చదలువాడ జయరామ శాస్త్రి, నెల్లూరు 1968.

28. గిరికుమారుని ప్రేమ గీతాలు – విశ్వనాథ సత్యనారాయణ, వి.యస్.ఎన్. అండ్ కో, విజయవాడ, 1971.

29. చాళుక్యరాజరాజు నందంపూడి శాసనము – జయంతిరామయ్యపంతులు, ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రిక, Vol. I, No.1, 1913.

30. జాతీయ ఇతిహాస కావ్యం – వందేమాతరమ్, వస్తు శిల్పాల విమర్శ, డా॥ ముదిగొండ వీరభద్రయ్య, జాతీయ సాహిత్య పరిషత్, భాగ్యనగరం, 1966.

31. జినవల్లభుని కుర్క్యాల శిలాశాసనము – డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి, తెలుగుశాసనాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్, 1975.

32. జైనధర్మము – ఎమ్. రాజగోపాలరావు, తత్త్వశాఖాధ్యక్షులు, ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు.

33. జైనసంస్కృత వాఙ్మయము – ఎస్. శ్రీకంఠశాస్త్రి, భారతి, మార్చి, 1933.

34. జ్ఞానోపదేశ సంక్షేపము – (కథోలికుల సభలో ఉచ్చరించే మంత్రాలు, వేద సత్యాలు) వి.యన్. జూబిలీ ప్రెస్, 4th ed., 1902.

35. జైనుల మత కథలు – పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, భారతి, 1925 నుండి 1929 వరకు మరియు 1936 జయంతి.

36. తమిళవేదకర్త – తిరువళ్లువనాయనార్ – చల్లారాధాకృష్ణశర్మ, భారతి, మార్చి, 1954.

37. తమిళ సాహిత్యచరిత్ర - ము. వరదరాజన్, అనువాదం- తిమ్మావజ్ఝల కోదండ రామయ్య, కేంద్ర సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ, 1975.

38. తమిళ సాహిత్యచరిత్ర - చల్లారాధాకృష్ణశర్మ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1975.

39. తిక్కన భారతము – అనుశాసనిక పర్వపీఠిక – తుమ్మపూడి కోటీశ్వరరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1974.

40. తెలుగులో దేశికవిత్వోద్యమము – పాల్కురికి సోమనాథుని పాత్ర (అముద్రిత సిద్ధాంత వ్యాసం) తిమ్మావజ్ఝల కోదండ రామయ్య, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి, 1968.

41. తెలుగుభాషా సాహిత్యపరిశోధనలు – పుట్టు పూర్వోత్తరాలు (ప్రాథమికదశ) - హెచ్. ఎస్. బ్రహ్మానంద, తెలుగుపరిశోధన, రజతోత్సవ సంచిక (సంపా.) దేవులపల్లి రామానుజ రావు ప్రభృతులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1983.

42. తెలుగులో పాళీపదాలు మరియు తెలుగు మఱుగులు - చీమకుర్తి శేషగిరి రావు, తెలుగుగోష్ఠి, హైదరాబాదు, ద్వితీయముద్రణ, 1992.

43. త్యాగరాజ కీర్తనలు – వ్యాఖ్యాత – కల్లూరి వీరభద్ర శాస్త్రి

44. ఎ) త్రిపిటకములు (నలభై సంపుటాలు) చైనీయుల లిపి- చైనీయ భాషానువాదం, షాంఘై లేక హోర్డాన్ ముద్రణ, చైనా, 1941. వివరాలకు చూ॥ Presentations to the Library of Sri Venkateswara Oriental Institute, Tirupati - Pt. N. Aiyaswami Sastri, Annals of Sri Venkateswara Oriental Institute, Vol. II, Pt.1, 1941, pp. 173-176.

బి) త్రిపిటకములు - (ఎనభై సంపుటాలు) రోమన్ లిపిలో లిప్యంతరీకరణ, పాలీటెక్స్ట్ సొసైటీ, లండన్.

సి) త్రిపిటకములు - (37 సంపుటాలు) దేవనాగరి లిపి- పాలీభాష, నలందా దేవనాగరీ పాలీ గ్రంథమాల ప్రచురణ (సంపా.) భిక్షు జె. కాశ్యప్, పాలీ పబ్లికేషన్ బోర్డ్, బీహార్, 1960.

45. దోనూరి కోనేరునాథ కవి విరచిత ద్విపద బాల భాగవతము - పరిష్కరణ, పరిశీలన - డా॥ బూదూరు కుసుమాంబ, పర్యవేక్షణ - డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి, 1988.

46. ధమ్మపదం - వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ బహద్దర్, ముక్త్యాల, 1923.

47. ధమ్మపదం - పాలీ సంస్కృతచ్ఛాయా ఆంధ్రానువాదం డా॥ రత్నాకరంబాలరాజు, అధ్యాత్మ విద్యా గ్రంథమాల, సాకేత నిలయం, అనంతపురం, 1994.

48. ధమ్మపదం -పాలీమూలం - గేయాను వాదం -గజ్జెల మల్లారెడ్డి, ఆనంద బుద్ధ విహారట్రస్ట్, సికిందరాబాద్, 1996

49. ధర్మమేఘము - డా॥ వి.వి.యల్. నరసింహారావు మణిమంజరి, వాఙ్మయయోగ పరిశోధన పత్రిక, హైదరాబాద్, 1982.

.50. ధర్మామృతకర్తనయసేనాచార్యుడు చెప్పిన కథ - డా॥ నేలటూరు వేంకటరమణయ్య, ప్రభాకరస్మారిక, Vol. II (సంపా.) వేటూరి ఆనందమూర్తి ప్రభృతులు, హైదరాబాదు, 1989, పుటలు 634-641.

51. నత్కీరుని కథ - కొన్ని విశేషములు - తిమ్మావజ్ఝల కోదండ రామయ్య, భారతి, నవంబరు, 1960.

52. నన్నయ అవతారిక - దివాకర్ల వేంకటావధాని, ఆంధ్రప్రతిక దుర్ముఖి సంవత్సరాది సంచిక 1956-57.

53. నన్నయకుఁబూర్వము ఛందస్సు - వేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, (సంపా.) భావరాజు వేంకటకృష్ణారావు, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధక మండలి, రాజమహేంద్రవరం, 1922.

54. నన్నయయుగము నాటి ఆంధ్రవాఙ్మయము (క్రీ.శ. 1000-1100) - నిడుదవోలు వేంకటరావు, ఆంధ్రపత్రిక విక్రుతి సంవత్సరాది సంచిక, 1950-51.

55. నవ్యసాహిత్య పరిషత్ సప్తమ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము - విశ్వనాథ సత్యనారాయణ, భారతి, ఏప్రిల్, 1940 పుటలు 500-506 మరియు చూ॥ విశ్వనాథ అసంకలిత సాహిత్యం, సంపుటి - 2, విశ్వనాథ భారతి, వరంగల్, 1995, పుటలు 3-15.

56. నాగార్జునుని గూర్చి - వేటూరి ప్రభాకర శాస్త్రి, భారతి, తారణ, పుష్యమాసం, ప్రభాకరస్మారిక, Vol. II, 1989, పుటలు - 621-623

57. నేను – నా సాహిత్య రచనలు – విశ్వనాథ సత్యనారాయణ 'మహతి', యువభారతి, హైదరాబాద్, 1972.

58. పద్యవిద్య – నన్నయ ఆదిపర్వ పీఠిక – విశ్వనాథ సత్యనారాయణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్ 1970 మరియు చూ॥ విశ్వనాథ పీఠికలు, సంపుటి -2 (సంపా.) డా॥ ముదివేడు ప్రభాకరరావు, విశ్వనాధ భారతి, వరంగల్, 1996, పుటలు 37–38.

59. పరిశుద్ధ గ్రంథం – బైబిల్ తెలుగు అనువాదం.

60. ప్రాకృత గ్రంథకర్తలూ – ప్రజాసేవానూ –పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి ప్రాచీపబ్లికేషన్స్, హైదరాబాద్, 1994.

61. ప్రాకృత భాషోత్పత్తి – మేడేపల్లి వేంకటరమణాచార్యులు, ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ, 1921. స్వీయపీఠికతో పునర్ముద్రణ : చీమకుర్తి శేషగిరి రావు, తెలుగుగోష్ఠి రామనగర్, హైదరాబాదు, 1991.

62. ప్లేటో ఆదర్శరాజ్యం – జి.వి.కృష్ణారావు

63. బద్దెన నీతిశాస్త్రముక్తావళి – (సంపా.) మానవల్లి రామకృష్ణకవి, విస్మృతకవులు, 1910.

64. బుద్ధఘోషోత్పత్తి – వేటూరి ప్రభాకర శాస్త్రి, ప్రభాకరస్మారిక, Vol. II, మణిమంజరి ప్రచురణలు, హైదరాబాదు, 1989, పుటలు 675–676.

65. బుద్ధదర్శనము –(The Vision of Buddha and His Dhamma) డా॥ రత్నాకరంబాలరాజు, అధ్యాత్మవిద్య గ్రంథమాల, అనంతపురం, 1995.

66. బెర్ట్రండ్ రసెల్ భావప్రపంచం – బుచ్చిబాబు సాహిత్యవ్యాసాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1977, పుటలు 262–382.

67. బౌద్ధకళారంభములు – భర్హుత్ స్తూపము, మల్లంపల్లి సోమశేఖర శర్మ, ఆంధ్రపత్రిక ఖర ఉగాది సంచిక, 1951–1952.

68. బౌద్ధ దర్శనము – అంగ్లమూలం – డా॥ ఎన్. రామేశన్, తెలుగుసేత – కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు, 1970.

69. బౌద్ధయుగము (రెండవ సంపుటి) – రత్నాకరంబాలరాజు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి 1960.

